# బాలవ్యాకరణ ఘంటాపథము

(గణ పాఠానుబంధ సహితము)

వ్యా క ర్త
పరవస్తు చిన్నయసూరి
(1806 - 1862)

వ్యా ఖ్యా త
వంతరాం రామకృష్ణారావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

# BAALA VYAKARANA GHANTAPATHAMU
(Gana Paatanubandha Sahitamu)

ప్రచురణ నెం 1944
ప్రతులు 1000
ప్రథమ, ద్వితీయ, తృతీయ ముద్రణలు 1970, 1976, 1987
పరిష్కృత, రజతోత్సవ ముద్రణ
విపి హెచ్ ప్రథమ ముద్రణ జులై, 1996





టైటిల్ డిజైన్ రమ



వెల – రూ. 100-00

Citation No 394 CT VH/7 in the Compulsory List

ప్రతులకు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
హైదరాబాద్, విజయవాడ, గుంటూరు, అనంతపురం,
తిరుపతి, విశాఖపట్నం, హన్మకొండ, కాకినాడ

---

ముద్రణ : లక్ష్మీగణపతి ప్రింటింగ్ ప్రెస్,
SRT-199, 1-1-379/50/1,
హైదరాబాద్-500 020

# ఉపోద్ఘాతము

ఇది బాలవ్యాకరణ ఘంటాపథమునకు రజతోత్సవ ముద్రణ

బాలవ్యాకరణ ఘంటాపథమును 'రాయశ్రీ' పద్ధతిపైఁ బునర్ముద్రించుటకు దముకుఁదాముగా ముందుకు వచ్చిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి గృతజ్ఞతాపూర్వక నమస్కారములర్పించుచున్నాను ఈ ఘంటాపథమును బునర్ముద్రించి యందుబాటులోనికిఁ దెచ్చి వ్యాఖ్యాతకు న్యాయము చేకూర్చు దొడ్డ సంస్థయండ లభించుట యొక వరముగా భావించుచున్నాను

జిజ్ఞాసువులు, గుణ గ్రహణ పారీణులు, నగు విద్యార్థులకు నధ్యాపకులకు మాత్రమేకాక యాంధ్ర వ్యాకరణమునఁ గృతభూరి పరిశ్రమలగు విద్వాంసులకును నుపాదేయములయిన పరమ ప్రామాణిక వ్యాఖ్యానములు, బాల ప్రౌఢ ఘంటాపథములేయనుట నిర్వివాదము (కీ శే వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారి లేఖ 14-10 1980)

రాష్ట్ర రాష్ట్రాంతరములలోని ఘంటాపథానుయాయులగు నధ్యాపకులు, విద్యార్థులకు శాస్త్రీయ దృక్పథము నలవఱచుట కితోధిక కృషిచేయ వేఁడికోలు ఇంతవఱకు నిర్వ్యాజముగా వారు చేసిన సాహాయ్యమునకుఁ గృతజ్ఞతాపూర్వక వందనములు, నభినందనములు

విశాలాంధ్ర ప్రచురణాలయం వారి విశాల దృష్టికి ధన్యవాదములు

ఇట్లు

—వంతరాం రామకృష్ణారావు

ప్రిన్స్‌పాల్ (రిటైర్డ్)

యం ఐ జి 83

సమతానగర్

విశాఖపట్టణము - 44

# రజతోత్సవ ముద్రణ విశిష్టత

1 పుటల పరిమితికి లోఁబడి కొన్ని విశేషాంశములు చేర్పఁబడినవి

2 ప్రయోగములు లేవన్న చోట్ల నుపలబ్ధ ప్రయోగములు సూచింపఁబడినవి

3 కొన్ని గ్రంథ గ్రంథులను బునః పరిశీలనచేసి, యావశ్యకములయిన సవరణలు చేయబడినవి

4 శాస్త్రార్థము మఱింత సులువుగా నర్థము చేసికొనుటకుఁగాను, విషయ ప్రతిపాదనలో నక్కడక్కడఁ గొన్ని మార్పులు చేయఁబడినవి

5 గణపాఠ నిర్మాణము ఇంతవఱకుఁ బాణినీయమునకువలె, బాల వ్యాకరణమునకుఁ బ్రామాణికమయిన గణపాఠము లేదు ఈ లోపమున్ను దీర్చుట కిందు గణపాఠ మనుబంధమునఁ జేర్పఁబడినది ఇంతతో బాలవ్యాకరణ, ఘంటాపథమునకు సర్వథా సమగ్రత సమకూరినది విజ్ఞు లరయఁగలరు

"అహంచ భాష్యకారశ్చ, కుశాగ్రీయ ధియావుభౌ
నైవ శబ్దాంబుధేః పారం, కిమన్యే జడబుద్ధయః"

# శారదా స్తుతి

తే. పూజనీయత నాసఁగు స్త్రీపుం స వర్గ
కులమత వయో విభేద సంకుచిత దృష్టి
సోఁకనీయక నీ కృపాలోకమట్టి
శక్తిరూపిణి నిన్నెంతు శారదాంబ!

సీ. ప్రామాణికములైన వ్యాఖ్యానములు వ్రాయఁ
గలుగు శాస్త్ర ప్రౌఢ కావ్యములకు
శబ్ద శాస్త్రమొనర్ప సద్విమర్శలు సేయ
నేర్పుఁ బ్రాచీనాధునిక కృతులకు
లక్షణ గ్రంథ సమీక్షల నాటక
శతకాది రచనఁ జలుపఁ జాలు
సాధు పాఠంబుల శోధింపఁగ నిఘంటు
పరిశీలనంబుల జరుపనోపు

గీ. ననుట నిక్కువ మట్టియొక్కని కితండు
శాస్త్ర సాహిత్యోభయరంగ సవ్యసాచి
యన నానర్చితి శ్వశ్రూసమన్వితవయి
సాకు సర్వవాగాలంబ! శారదాంబ!

# అంకితము

క॥ మాతా పితౄణ మీఁగెదు
చేతల శాస్త్రానుగతిని జేయుదు నైనం
జేతము తనియదు మీయ
త్యాతత వాత్సల్య గరిమ యది స్మృతిఁదవులిన్.

క॥ కన్నులు తెఱవకమునుపే
చన్నారలు దివికి, మీదు సంసేవాభా
గ్యోన్నతికి నోఁచకిచ్చట
నున్నాఁడను, బ్రతుకు నీడ్చుచున్నాఁడ నెటో!

క॥ పుట్టుకృతార్థతఁ బొరయఁగఁ
బట్టితిని గలమ్ము మీకు వలె సేవింపన్
గట్టితిని గంకణము నజు
వట్టపు దేవికిని, దత్కృపారస దృష్టిన్

క॥ అతి సులభగమ్య, మపరి
ష్కృత విషయ సమన్వయోప బృంహితము, ప్రతి
ష్ఠిత శాస్త్రార్థ ముపజ్ఞా
గత శాస్త్ర కృదాశయ మొక ఘంటాపథమే

ఆ అని ప్రసిద్ధిఁగన్న యనితరసాధ్యమీ
వ్యాఖ్యఁజేసినాఁడ నంకితంబు
నధిక భక్తి లక్ష్మణాంబా చిరంజీవు
లార! తల్లిదండ్రులార! మీకు

# సంకేతాక్షర వివరణము

| | |
|---|---|
| అథ | అథర్వణశ్రుతి |
| అథ భా | అథర్వణభారతము (కుమారి జి లలితగారి వ్యాసము నుండి) |
| అను | అనుశాసనిక పర్వము |
| అరణ్య | అరణ్యపర్వము |
| అప్పక | అప్పకవీయము |
| అమర | అమరకోశము |
| అశ్వ | అశ్వమేధపర్వము |
| అహో | అహోబల పండితీయము |
| ఆం చిం | ఆంధ్రశబ్ద చింతామణి |
| ఆది | ఆదిపర్వము |
| ఆం భూ | ఆంధ్రభాషా భూషణము |
| ఆముక్త | ఆముక్తమాల్యద |
| ఆ శ | ఆంధ్రశబ్దాను శాసనము (సూరి) |
| ఉద్యో | ఉద్యోగపర్వము |
| ఉ రా | ఉత్తర రామాయణము |
| ఉ హ | ఉత్తర హరి వంశము |
| ఋ ప్రా (పార్షద) | ఋగ్వేద ప్రాతిశాఖ్యము (పార్షదవ్యాఖ్య) |
| కర్ణ | కర్ణపర్వము |
| కవిక | కవికర్ణ రసాయనము |
| క వ్యా సా. | కలాప టీకావ్యాఖ్యాసారము |
| కళా | కళాపూర్ణోదయము |
| కాళహ | శ్రీ కాళహస్తి మాహాత్మ్యము |
| కాళిందీ | కాళిందీ కన్యా పరిణయము |
| కావ్యాలం | కావ్యాలంకార చూడామణి |
| కాశిక | కాశికావృత్తి |

| | |
|---|---|
| కాశీ | కాశీఖండము |
| క్రీడా | క్రీడాభిరామము |
| చండ ప్రా | చండ ప్రాకృత వ్యాకరణము |
| చ సం | చరక సంహిత |
| చి ని | చిన్నయసూరి నిఘంటువు |
| జై భా | జైమిని భారతము |
| తత్త్వ | తత్త్వబోధిని (సి కౌ టీక) |
| తర్క | తర్క సంగ్రహము |
| తె వ్యా | తెలుఁగువ్యాకరణము (రావిపాటి గురుమూర్తిశాస్త్రి) |
| తైత్తి (వైదికా) | తైత్తిరీయప్రాతిశాఖ్యము (వైదికాభరణవ్యాఖ్య) |
| త్రి ప్రా | త్రివిక్రమ ప్రాకృత శబ్దాను శాసనము |
| త్రి శ | త్రిలింగ శబ్దానుశాసనము (మండ లక్ష్మీ నరసింహ కవి - జీ లలితగారి వ్యాసము నుండి) |
| దశ | దశకుమార చరిత్ర |
| ద్రోణ | ద్రోణపర్వము |
| ద్వా | సింహాసన ద్వాత్రింశిక |
| ద్వి హరిశ్చ | ద్విపద హరిశ్చంద్ర |
| నిరం | నిరంకుశోపాఖ్యానము |
| నిరు | నిరుక్తము |
| నిర్వ | నిర్వచనోత్తర రామాయణము |
| పండితా | పండితారాధ్య చరిత్ర |
| పద్మ | పద్మపురాణము |
| పరిభా | పరిభాషేందు శేఖరము |
| పాంచా | పాంచాలీ పరిణయము |
| పాండు | పాండురంగ మాహాత్మ్యము |
| పాణి | పాణినీయము |
| పా శి | పాణినీయ శిక్ష |
| పారిజా | పారిజాతాపహరణము |
| పే సూ | శ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు |
| ప్రభావ | ప్రభావతీ ప్రద్యుమ్నము |
| ప్రా ప్ర | ప్రాకృత ప్రకాశము |

| | |
|---|---|
| బసవ | బసవ పురాణము |
| బా ర | బాలవ్యాకరణ రమణీయము |
| బాలమ | బాలమనోరమ (సి కౌ టీక) |
| బాలస | బాలసరస్వతీయము |
| భ గీ | భగవద్గీత |
| భాగ | భాగవతము |
| భా రా | భాస్కర రామాయణము |
| భా శ | భాస్కర శతకము |
| భాషాప్ర | భాషాప్రదీపము |
| భీమ | భీమఖండము |
| భీష్మ | భీష్మపర్వము |
| భోజరా | భోజరాజీయము (సంగ్రహము) |
| మ త | మలమాసతత్త్వము |
| మను | మనుచరిత్ర |
| మ భా | మహాభాష్యము |
| మ భా ప్ర | మహాభాష్య ప్రదీపము |
| ము కౌ | ముక్తలక్షణ కౌముది |
| ముగ్ధ | ముగ్ధబోధవ్యాకరణము |
| -,,-శ్రీరామ | శ్రీరామతర్కవాగీశుని టీక |
| -,,-దుర్గా | దుర్గాదాసటీక |
| -,,-గిరీశ | గిరిశచంద్ర టీక |
| రస | రసమంజరి |
| రసగం | రసగంగాధరము |
| రాఘవ | రాఘవ పాండవీయము |
| రామా | రామాభ్యుదయము |
| లం నా | లంకా నరసింహశాస్త్రిగారు |
| ల కౌ మా | లఘు కౌముది మార్గదర్శని |
| ల మ | లఘు మంజూష |
| ల శ శే | లఘు శబ్దేందుశేఖరము |
| వఝల | వఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు |
| వరాహ | వరాహ పురాణము |

| | |
|---|---|
| వసు | వసు చరిత్ర |
| వా | వార్తికము |
| వాక్యప | వాక్య పదీయము |
| వాల్మీకి | వాల్మీకి ప్రాకృత వ్యాకరణము |
| వికృ | వికృతి వివేకము |
| విక్రమా | విక్రమార్క చరిత్ర |
| విజయ | విజయ విలాసము |
| వి పు | విష్ణు పురాణము |
| విరాట | విరాట పర్వము |
| వృత్తి వి | వృత్తి విచారము |
| వై ని | వైజయంతీ కోశము |
| వై పా | వైయాకరణ పారిజాతము |
| వై భూ | వైయాకరణ భూషణము |
| వై భూ సా | వైయాకరణ భూషణ సారము |
| వై భూ సా ద | వైయాకరణ భూషణ సారదర్పణము |
| వ్యా సం స | వ్యాకరణ సంహితా సర్వస్వము |
| శబ్దక | శబ్దకల్పద్రుమము |
| శబ్దల | శబ్దలక్షణ సంగ్రహము (సూరి) |
| శబ్దస్తో | శబ్దస్తోమ మహానిధి |
| శబ్దా చిం | శబ్దార్థ చింతామణి |
| శ ర | శబ్దరత్నాకరము |
| శ ర శ | డా॥ శలాక రఘునాథ శర్మగారి లేఖ |
| శాంతి | శాంతి పర్వము |
| శృ నై | శృంగార నైషధము |
| శృ శా | శృంగార శాకుంతలము |
| శ్లో వా | శ్లోకవార్తికము |
| షడ్భా | షడ్భాషా చంద్రిక |
| సభా | సభా పర్వము |
| సర్వల | సర్వలక్షణ సారసంగ్రహము |
| సా ద | సాహిత్య దర్పణము |
| సారస్వ | సారస్వత వ్యాకరణము |

| | |
|---|---|
| సి కౌ | సిద్ధాంత కౌముది |
| సి ము | సిద్ధాంత ముక్తావళి |
| సూ చి | సూరి చిత్తు కాగితముపై వ్రాసికొన్న వ్యాఖ్య (కీ శే వెంపరాల వారి వ్యాసము నుండి) |
| సూత్రాం | సూత్రాంధ్ర వ్యాకరణము (సూరి) |
| సూ ని | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| సౌ ప్తిక | సౌప్తిక పర్వము |
| హ న | హరిశ్చంద్ర నలోపాఖ్యానము |
| హేమ. ప్రా. | హేమచంద్రుని ప్రాకృత శబ్దానుశాసనము |
| హేలా | హేలారాజీయము (వాక్య ప టీక) |

ఇవి గాక యువయుక్త గ్రంథములు వ్యాసములు గలవు

# పీ ఠి క
## (తొలి కూర్పు 1858)

ఆంధ్రభాషకు లక్షణగ్రంథములు ప్రాచీనులు చేసినవి పెక్కులు కానఁబడుచున్నవి కొన్ని లక్షణగ్రంథముల పేళ్ళు మాత్ర మిప్పుడు వినఁబడు చున్నవి కానఁబడు గ్రంథములందు సంస్కృత సమములకు లక్షణములు బహుతరముగా రచింపఁబడినవి గాని తక్కిన భాషకు విశేషాకారముగా రచింపఁబడినవి కావు కాఁబట్టి యీ లక్షణగ్రంథములు చదువు వారికి నిస్సందేహముగా వచనరచన సేయు కౌశలము చిరకాలము బహులక్ష్యములందుఁ బరిశ్రమము[1] చేయక రానేరదు భాషాసమష్టికి లక్షణగ్రంథము కుదిరిన పక్షమందంత శ్రమ పడఁబనిలేదు తుదకు లక్ష్యపరిజ్ఞానము చాలని లక్షణపరిజ్ఞానమంత శ్లాఘ్యము కాదుగాని తుదముట్ట సర్వలక్షణ పరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానము చేతనే సాధించుట మిక్కిలి దుష్కరము కాఁబట్టి యిట్టికొఱఁత వారింపఁబూని పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగాఁ బరిశీలించి రచనా ప్రణాళిక నిర్ణయించుకొని నా నేర్పుకొలఁదిని సంస్కృతభాషతో[2] సూత్రగ్రంథ మొకటి కావించితిని ఆ గ్రంథము బాలురకు సుసాధము గాకుండుటవలన దానియందలి సూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృత గ్రంథరూపముగా రచించినాఁడ

క. మానితపునడక పేరిమి
మానసమున కింపుఁబెంప మనునంచలకున్
బోనిడి నీరస నీరము
జానుగ క్షీరంబు గొనుట సహజముకాదే

—గ్రంథకర్త.

---

1 పరిశ్రమము - ప్రథమ ముద్రణము పరిశ్రమ కొన్ని ముద్రణములు

2 భాషతో - ప్రథమ ముద్రణము భాషలో - నేటి ముద్రణములు

# విషయసూచిక



## అనుబంధము

శ్రీ హయగ్రీవాయ నమః

క. శ్రీలతకుం బ్రాఁకయి వృష
శైలంబున వెలసి తనదు చాయ కెలయు ధ
న్యాళి దగ మాన్చి కోర్కులు
దాలంగా నొసఁగు కల్ప సాలముఁ గొలుతున్

క. అనయము లలితోక్తులతో
నొనరు పదం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్

గీ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల
క్షణము గానఁ బూర్వ కవుల లక్ష్య
ములను లాఁతి లక్ష్మములఁగాంచి తక్కు ల
క్షణ మెఱింగి కొనుఁడు చతుర మతులు

# బాలవ్యాకరణ ఘంటాపథము

## సంజ్ఞా పరిచ్ఛేదము



### సంస్కృతమునకు వర్ణములేఁబది. 1

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ శ ష స హ ళ

ఇందకారాదులచ్చులు కకారాదులు హల్లులు అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది

వ్యా॥ సంస్కృతభాషకు వర్ణములు = 50 ఇందకారాదులచ్చులు అనఁగా వీనిలో, అకారము మొదలుకొని 'అః' వఱకుఁ గల 16 వర్ణములచ్చులు కకారాదులు హల్లులు అనఁగా కకారము మొదలుకొని, ళకారము వఱకుఁగల 34 వర్ణములు నిందు హల్లులు అచ్ + హల్ = అజ్ఝల్ అజ్ఝల్విభాగము = అచ్చుల యొక్కయు, హల్లుల యొక్కయు విభజనము, ఈలాగుననే = ఈ విధముగానే మీఁదన్ = చెప్పఁబోవు సూత్రములలో, ఎఱుంగునది = తెలిసికొనునది - అని యర్థము అకారాదులచ్చులు, కకారాదులు హల్లులు - అని 2, 3 సూత్రములలోఁ దెలిసికొనవలెనని తాత్పర్యము॥ సంస్కృతము = పాణినీయము మొదలగు వ్యాకరణములచే సంస్కరింపబడిన భాష (కౌమారపాణినీయాది సంస్కృతాభివేత్—భాషా(ప) వర్ణము = స్థానాది భేదములచే వ్యక్తముగా ధ్వనించునది (వర్ణ్యంతేవ్యక్తంధ్వన్యంత ఇతి వర్ణాః—తైత్తి) ఉదా॥ చ - తాలవ్యము ట - మూర్ధన్యము ॥ ఇత్యాది

విశే - 1) అచ్, హల్, అను సంజ్ఞలు సంస్కృతమున మాహేశ్వర సూత్రముల ప్రత్యాహారము వలన నేర్పడెను తెనుఁగున నివి కేవలసంజ్ఞలుగా గ్రహింపఁబడినవి మాహేశ్వరసూత్రములు = మహేశ్వరుఁడు పాణినిమహర్షి కిఁ బ్రసాదించిన పదునాలుగు సూత్రములు 1) అ ఇ ఉ ణ్ 2) ఋ ఌ క్ 3) ఏ ఓ ఙ్ 4) ఐ ఔ చ్ ఈ సూత్రముల యందలి తుదిహల్లుల నిద్వర్ణములని యందురు సూత్రములోని యే వర్ణమునైన ఇద్వర్ణముతో జోడించి వర్ణములను బ్రత్యాహరించుట (సంగ్రహించుట) ప్రత్యాహారమనఁబడును (ప్రత్యాహ్రియంతే సంక్షిప్యంతేవర్ణాః అత్ర ఇతి ప్రత్యాహారః - అనివ్యుత్పత్తి) మొదటి సూత్రము నందలి, అకారమును, దుది చకారముతో జోడింపఁగా "అచ్" అనుసంజ్ఞ యేర్పడెను కావున, అకారము, అకారము నుండి చకారము వఱకు మధ్యలోఁ గల వర్ణములు నచ్చులనఁబడును 5) హయవరట్ 6) లణ్ 7) ఞ మ ఙ ణ నమ్ 8) ఝ భ ఞ్ 9) ఘ ఢ ధ ష్ 10) జ బ గ డ ద శ్ 11) ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ 12) కపయ్ 13) శ ష స ర్ 14) హ ల్ ఈ యెదవ సూత్రమందలి, హకారమును దుది యిద్వర్ణమగు లకారముతోఁజేర్పఁగా, "హల్" అను సంజ్ఞ యేర్పడెను కావున, హకారము హకారము మొదలుకొని లకారము వఱకు మధ్యలోఁగల వర్ణములు, హల్లులనఁబడును ఈ సంస్కృత ప్రత్యాహార పద్ధతి తెనుఁగున సరిపడదు (11) సంస్కృతమునకు వర్ణములేఁబది యనఁగా, లౌకిక సంస్కృతమునకు వర్ణములేఁబదియని గ్రహింపనగును ఏలయన సంస్కృతమునకు వర్ణములు ఌకారప్లుతముతో నఱువదినాలుగని పాణినీయ శిక్షలోఁ జెప్పఁబడెను (111) హల్లుల మీఁది అకారముచ్చారణార్థకము హకారాది ష్వకార ఉచ్చారణార్థ (సి కౌ) అకారవ్యవేత్ వ్యంజనానామ్ - త్రి త్రి (1v) ఇందలి ళకారము దుస్ స్పృష్టముతో నభిన్నమగు మూర్ధన్య ళకారము ఉదా హేళనమ్ (వై పా 187 పు)

## ప్రాకృతమునకు వర్ణములు నలువది. 2

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః క ఖ గ ఘ, చ ఛ జ ఝ, ట ఠ డ ఢ ణ; త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ స హ ళ.

కొందఱ మతంబున హ్రస్వవక్రంబులును బ్రాకృతమునందుఁ గలవు. కొందఱ మతంబున వక్రతమంబులుం గలవు ఎ ఏ ఒ ఓ లు వక్రములని, ఐ ఔ లు వక్రతమంబులని, ప్రాచీనులు వ్యవహరింతురు.

వ్యా ప్రాకృతభాషకు వర్ణములు = 40 ప్రాకృతము = ప్రకృతి సంస్కృతము దాని నుండి కలిగినది (ప్రకృతి స్సంస్కృతమ్ తత్రభవంతత్త ఆగతంవా ప్రాకృతమ్ - హేమ ప్రా) ఇందు అకారాదులచ్చులు అనఁగా, అకారము మొదలుకొని, అః - వఱకుఁగల 10 వర్ణము లచ్చులు కకారాదుల్హు హల్లులు అనఁగా కకారము మొదలుకొని, శకారము వఱకుఁగల 30 వర్ణములు హల్లులు ప్రాకృతమున హ్రస్వవక్రములు, అనఁగా ఎఒలు కలవని కొంతమంది యభిప్రాయము ఈ పక్షమునఁ బ్రాకృతమునకు - 42 వర్ణములగును హ్రస్వ వక్రములే కాక, వక్రతమములు - అనగా - ఐ ఔ లు గూడఁ బ్రాకృతమునఁ గలవని కొంతమంది యభిప్రాయము ఈ పక్షమునఁ బ్రాకృతమునకు - 44 వర్ణములగును వక్రములు=ఎ ఏ ఒ ఓ లు హ్రస్వవక్రములు=ఎ ఒ లు వక్రతమములు = ఐ ఔ లు ఈ పేరులను వ్యవహరించిన ప్రాచీనులు నన్నయాదులు

విశే (I) వక్రములు, వక్రతమములు, ననుసంజ్ఞ లాంధ్రశబ్దచింతామణి యందుఁ గల్పింపఁబడెను లిపిలోనివక్రత్వ వక్రతమత్వములనుబట్టి యీ పేర్లు కల్పింపఁబడినవి "ఏజధోవక్రః, వక్రతమఐచ్" అం చిం చూ వై పా (II) ప్రాకృతము లాఱు విధములు షడ్విధేయం ప్రాకృతీచ, శౌరసేనీచ మాగధీ, పైశాచీ చూళికాపై శాచ్యపభ్రంశ ఇతిక్రమాత్-భాషాప్ర (అహో) (III) హ్రస్వవక్రములు ప్రాకృతమున నరుదుగాఁగల వనుటకు-సంయోగే ఏదోతోః క్వచిత్ స్వరూపేణైవ హ్రస్వః ఏకః = ఎక్కో త్రి ప్రా షడ్భా (IV) వక్రతమములు కలవనుటకు - ఐదౌచ కేషాః చిన్మతే భవత ఏవ, కైతవమ్ - కైఅవం చండప్రా, షడ్భా

## తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు. 3

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ=ఒ ఓ ఔ=అం అఁ క గ చ ౘ

జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ

వ్యా అచ్చ తెనుఁగునకు వర్ణములు = 36 ఇందకారాదులచ్చులు అనఁగా, అకారము మొదలుకొని యరసున్నవఱకుగల 14 వర్ణములచ్చులు కకారాదులు హల్లులు అనఁగా, కకారము మొదలుకొని ళ కారమువఱకుఁగల 22 వర్ణములు హల్లులు

విశే - (1) ఈయచ్చ తెనుఁగువర్ణములలో శకటరేఫము చేర్చఁబడలేదు ఫలయున, శకటరేఫము ప్రత్యేకవర్ణముకాదు రేఫము నూఁధివఱ్యుకుటచే శకటరేఫ

మేర్పడును కావున నిది యప్రధానమైన యుచ్చారణ భేదమగునుగాని వేఱు వర్ణము కాదు (చూ 18 సూ) (11) ఎ ఒ అరసున్న చ జ అను వర్ణములు సంస్కృత వర్ణసమామ్నాయమునలేవు ఇవి తెనుఁగున నదనముగాఁ గలవు రేఫము నలఘుపుగాఁ బలుకుటయు నచ్చ తెనుఁగుననే కలదు కావున, ఏ ఒ అరసున్న చ జ ఱ - అనువానితోఁ గూడుకొనిన మాటలచ్చ తెనుఁగు మాటలని గుర్తింపవచ్చును ఉదా॥ ఎక్కువ, ఒకటి, అరఁటి, చలి, జన్నము, మెఱుఁగు (111) ఈ తెనుఁగు వర్ణములలోని శకారము తటుకు, బెటుకు, మున్నగువానిలోని శబ్దసిద్ధ శకారము ఇది యలఘులకారముకాదు (చూ 18 సూ)

**ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులను గూడి తెలుఁగున వ్యవహరింపంబడు. 4**

ఋతువు, పితౄణము, కౢప్తము, ౡకారము, దుఃఖము, ఖడ్గము ఘటము, ఛత్రము, ఝరము, కంఠము, ఢక్క, రథము, ధరణి, ఫణము, భయము, పఙ్క్తి, ఆజ్ఞ, శరము షండము.

వ్యా ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ ఙ ఞ శ ష అను పందొమ్మిది వర్ణములు సంస్కృత సమములఁగూడుకొని తెనుఁగున వ్యవహరింపఁబడును సంస్కృతసమము = సంస్కృత తుల్యమగుభాష (చూ 19) ఋ - ఋతువు, (2) ౠ పితౄణము త్ + ౠ = తౄ వర్ణసుడి హల్లుమీఁది ఋకారమునకుఁ బిహ్నము పితృ + ఋణ = పితౄణ సవర్ణదీర్ఘ సంధి దీని సంస్కృత సమము పితౄణము (3) ఌ - కౢప్తము, (4) ౡ - ౡకారము ౡ - అను నేకాక్షరశబ్దమునకుఁ దెనుఁగునఁ బ్రవేశము లేదు దీనికి సంధిస్థలమును లేదు కావున ౡ - అనుదానికి ౡ - అను నక్షరమే యుదాహరణముగఁ జూపఁబడెను కార - ప్రత్యయము వర్ణనిర్దేశమున నగును అకారము ఇకారము ఇట్లే ౡ కారము (5) విసర్గ - దుఃఖము (6) ఖ - ఖడ్గము (7) ఘ - ఘటము (8) ఛ - ఛత్రము (9) ఝ - ఝరము (10) ఠ - కంఠము (11) ఢ - ఢక్క (12) థ రథము (13) ధ - ధరణి, (14) ఫ - ఫణము (15) భ - భయము (16) ఙ - పఙ్క్తి ఎక్కడనైనఁ

దప్పనిసరియయినచో వర్గపంచమముతో వ్రాయవచ్చుననుటకు. పఙ్క్తి అని యుదాహరింపఁబడెను ఇట, పంక్తి - అనునది సర్వసమ్మతమగు రూపము (17) ఞ - అజ్ఞ (18) శ - శరము (19) ష - షండము

విశే - ఈ 19 వర్ణములతోఁ గూడినమాటలు సాధారణముగా సంస్కృత సమములగును రేవ - మొదలగునచ్చ తెనుఁగు శబ్దములలో 'శ' కారాదులు క్వాచిత్కముగఁ గలవు - చూ ము కౌ - సంజ్ఞా జ 2

పారపరిశీలన పిత్రూణము క్ష్త్రమము అను కొన్ని ప్రతులలో ముద్రింపఁబడెను పితౄణము, క్ష్త్రమము - అనియే యుండవలెను (వ్యా సం స)

## క చ ట త ప లు పరుషంబులని, గ జ డ ద బ లు సరళంబులని చెప్పంబడు. 5

వ్యా హల్లులలో - క చ ట త ప లు - పరుషములనబడును గ జ డ ద బ లు - సరళములనబడును (కచటతపాః పరుషాఖ్యా గజడదబాస్తు సరళాః - అం చిం) కచటతపల యుచ్చారణము, గజడదబల, యుచ్చారణము కంటెఁ బరుషము కావున, కచటతపలకుఁ బరుషములను పేరు సార్థకము గజడదబల యుచ్చారణము, కచటతపల యుచ్చారణము కంటె సరళము గనుక, గజడదబలకు సరళములను పేరు సార్థకము దంత్యచకారము పరుషమును, దంత్య జకారము సరళమును, నగునని 7 వ సూత్రమును బట్టి తెలియుచున్నది కాన, క చ చ̄ ట త ప లు - పరుషములు గ జ జ̄ డ ద బ లు - సరళములు నని సారాంశము (చూ 7 సూ)

## ఇతరములగు హల్లులు స్థిరములు. 6

ఖఘఙ, ఛఝఞ, ఠఢణ, థధన, ఫభమ, యరలవశషసహళ.

వ్యా పరుషములు సరళములు కాక తక్కిన హల్లులు స్థిరములు (స్థిరా ఇతరే - అం చిం) ఇతరములు = పరుషసరళేతరములు కచచ̄టతపలు పరుషములు, గజజ̄డదబలు - సరళములు గనుక నివికాక తక్కిన హల్లులు స్థిరములు ఉదా ఖఘఙ, ఛఝఞ, ఠఢణ, థధన, ఫభమ, యరలవశషసహళ - అను 24 వర్ణములు స్థిరములు

విశే - ఇతరములగు హల్లులనుటచేఁ బరుషములు, సరళములు, స్థిరములు,

నను విభజనము హల్లులకు సంబంధించినదని తెలియుచున్నది సంధికార్యములలో నెట్టి మార్పులను బొందక స్థిరముగా నుండును గనుక వీనికి స్థిరములను పేరు కొందఱు సార్థకమందురు ఇది సంజ్ఞామాత్రమని కొందఱందురు

పదసార్థక్యము - హల్లులనుదళము సార్థకము ఏలయన హల్లులననిచో, అచ్చులును స్థిరములు కావలసివచ్చును

## దంత్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు. 7

"తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, దాలవ్య జకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములని తాత్పర్యము

వ్యా దంత్యచజలును దాలవ్యచజలును సవర్ణములు సవర్ణములు = స్థాన ప్రయత్నములు సమానముగా గల వర్ణములు సవర్ణములనుటచేఁ దాలవ్య చకారమునకు విధించిన వ్యాకరణకార్యములు దంత్యచకారమునకుఁ జెల్లును తాలవ్యజకారమునకు విధించిన వ్యాకరణకార్యములు దంత్యజకారమునకుఁ జెల్లును ఉదా॥ కచటతపలు పరుషంబులని గజడదబలు సరళంబులని చెప్పంబడు (5 సూ) అను సూత్రమునఁదాలవ్యచకారము పరుషముగను దాలవ్య జకారము సరళముగను బేర్కొనఁబడెను కావున నీ 7 సూత్రములచేఁ దాలవ్య చకారముతో పాటు దంత్య చకారమును బరుషమగును, దాలవ్య జకారముతోపాటు దంత్యజకారమును సరళమగును ఇట్లే తక్కినచోట్ల గ్రహింప వలెను

విశే - (1) వర్ణోత్పత్తిస్థానము, నాభ్యంతరప్రయత్నము, వేనికిఁ దుల్యముగ నుండునో, యవి సవర్ణము లనబడును "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్" (పాణి) దంత్య తాలవ్యచజలు సవర్ణములు తాలవ్యచజల కుత్పత్తి స్థానము తాలువు దంత్య చజలకుఁ దాలువు, దంతములు నుత్పత్తిస్థానములు కావునఁ దాలుస్పర్శ - తాలవ్య చజలకు, దంత్యచజలకుఁ గల సమానధర్మము కనుక నుత్పత్తి స్థానము తుల్యమయినది రెండువర్ణములకు నాభ్యంతర ప్రయత్నము స్పృష్టమే స్పృష్టమనఁగా, నాలుక తాలువు మొదలగు స్థానము లను బాగుగా స్పృశించు ప్రయత్నము ఇట్లు వర్ణోత్పత్తి స్థానము, నాభ్యంతర ప్రయత్నము తుల్యమగుటచే దంత్య తాలవ్య చజలు సవర్ణములు ఇట్టివి పరస్పర గ్రాహకములగుట వ్యాకరణ పద్ధతి కావునఁ దాలవ్య చజలకు విధించిన కార్యము దంత్య చజలకుఁ జెల్లునని వివరింపబడెను (11) దంత్య చజలు కేవల దంత్యములు కావు (9 సూ) కావున నీ సూత్రము ఋ ౡ వర్ణముల సావర్ణ్యము వంటిది కాదు (సి కౌ 12)

## ఇఈఎఏలం గూడిన చజలు తాలవ్యంబులు. 8

**చిలుక, చీమ, చెలి, చేమ, జిల, జీడి, జెట్టి, జేజె.**

వ్యా అచ్చతెనుఁగు శబ్దములలో, ఇ ఈ ఎ ఏ లతోఁ గూడుకొనిన చజలు తాలవ్యములు నాలుక మధ్యభాగము తాలువును దాఁకగా జనించు చజలు తాలవ్యములు తాలువు = నాలుకకు మీఁదనుండు శిరోభాగము (తాలువనఁగా దౌడకాదు) చిలుక, చీమ, చెలి, చేమ - అనునవి, ఇఈఎఏలతోఁ గూడిన చకారముల కుదాహరణములు, జిల, జీడి, జెట్టి, జేజె - అనునవి, ఇఈఎఏలతోఁ గూడిన, జకారముల కుదాహరణములు

## అఆఉఊఒఓఔలం గూడిన చజలు దంత్యంబులు. 9

**ౘలి, ౘాప, ౘుక్క, ౘూపు, ౘొక్కు, ౘోటు, ౘౌక; ౙముఁడు, ౙాతర, ౙున్ను, ౙూలు, ౙొన్న, ౙోలి, ౙౌకు ఐదంతము లయిన చజలు సమేతర శబ్దములందు లేవు**

వ్యా అచ్చతెనుఁగు శబ్దములలో, అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ - అను నక్షరములతోఁగూడుకొనిన చజలు దంత్యములు నాలుక ప్రక్క భాగము దంతములను స్పృశించుట యను ధర్మ మదనముగాఁగలవి దంత్య చజలు ౘలి, ౘాప, ౘుక్క, ౘూపు, ౘొక్కు, ౘోటు, ౘౌక - అను వానిలోని చ కారములు, అఆ ఉఊ ఒఓఔలతోఁగూడుకొని యున్నవి కనుక నివి దంత్య చకారములు ౙముఁడు, ౙాతర, ౙున్ను, ౙూలు, ౙొన్న, ౙోలి, ౙౌకు - అనువానిలోని జకారములు, ఆఅ ఉఊ ఒఓఔల తోఁగూడుకొని యుండుటచే నివి దంత్య జకారములు

ఐదంతములయిన చజ లచ్చ తెనుఁగున లేవు ఐత్ + అంత = ఐదంత ఇందలి తకార (త్) ముచ్చారణమునకుఁ జేర్పఁబడినది కావున, ఐ - అంతమందుఁ గల చజలనియే యర్థము చ్ + ఐ = జై కావున, చై జైలతోఁగూడుకొనిన పదములచ్చ తెనుఁగున లేవని తాత్పర్యము

విశే - 1) చై జైలతోఁగూడుకొనిన పదము లచ్చ తెనుఁగున లేవనుటచే, వీనితోఁగూడుకొనిన పదములు సాధారణముగా సంస్కృత సమములని గుర్తింపవచ్చును ఉదా - చైత్రము జైనము చైవు, చైది, జైన - అనునాచ్ఛిక పదములు పరిగ్రాహ్యములు కావు (11) నాలుక మధ్యభాగము తాలువును

స్పృశించుట తాలవ్య చజలకు దంత్యచజలకుఁగల సామాన్య ధర్మము కావుననే యివి సవర్ణములయినవి (చూ - 7 సూ) నాలుక ప్రక్కభాగము దంతములను స్పృశించుట దంత్య చజల విశిష్టత కనుక నివి దంతతాలవ్య చజలనక, దంత్యచజలని కురుపాండవ న్యాయమున వ్యవహరింపబడును (III) తకారము దంత్యము కనుక, దంత్యచజలపై నిల్పు చిహ్నము తావడి కానోపును చజలపై బిందువును నిల్పి దంత్యతను సూచింపవలెనని యాంధ్రశబ్ద చింతామణి "దంత్యచజౌ గురురలౌచ బిందుయుతౌ" తావడితో దంత్యతను సూచించు పద్ధతి వాడుక కెక్కినది ఇది తెలుఁగులిపిలోని రెండంకెకాదు (IV) తకార ముచ్చారణార్థకమనుటకు - 'అన్మహతః' (సి కౌ 807) తకార యుచ్చారణార్థః - తత్వ అరత్ - అం చిం అంత్యహలు చ్చారణార్థః - అహో 299 దంత్య చజల యుచ్చారణమును గూర్చి, చూ - వై పా 191 - 193 పు

**సంస్కృత సమంబులం దికారాంతములయిన శబ్దముల యుపధా చజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును. 10**

దప్ప సంస్కృత సమంబులందు దంత్యచజలు లేవని తాత్పర్యము ఉపధయనగాఁ దుది వర్ణమునకు ముందు వర్ణము అర్చి అర్చులు, రోచి రోచులు, వీచి వీచులు, రాజి రాజులు, వాజి వాజులు మఱియు రాజు శబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి ఇతరములయిన చజల కుదాహరణములు చంద్రుఁడు, చామరము, చక్రిక, చూర్ణము, చోరుఁడు, చౌర్యము, జయము, జాతి, జుగుప్స, జూటము ఇత్యాదులు

వ్యా సంస్కృత సమములలో చజ లుపధలుగా నుండు ఇకారాంత శబ్దములకు, బహువచనము పరమగునపుడాయుపధా చజలు దంత్యములగును ఉపధ = తుది వర్ణమునకు ముందు వర్ణము (అలోంత్యాత్పూర్వ ఉపధా - పాణినీయము) అర్చి = అ + ర్ + చ్ + ఇ ఇట తుది వర్ణము 'ఇ' కారము దీని ముందు వర్ణము చకారము (చ్) కావున, చకారముపధ, ఉపధా చజలు = ఉపధలయిన చజలు అనఁగాఁ దుదివర్ణములకు ముందు వర్ణములుగ నుండు చజలు అర్చి + లు - అర్చి - ఇకారాంత శబ్దము చకార ముపధగాఁ

గలదు కాన, నిది చకార ముపధగాఁగల ఇకారాంత శబ్దమయినది. దీనికి బహువచనము పరమైనప్పుడు, దీనిలోని చకారము దంత్యమగును అర్చి + లు = అర్ + చ్ + ఇ + లు తత్సమ 45 చే – ఇత్వమునకు, ఉత్వమయి అర్ + చ్ + ఉ + లు = అర్చులు - అగును ఇట్లే రోచి + లు = రోచులు, పీచి + లు = పీచులు, రాజి + లు = రాజులు, వాజి + లు= వాజులు ఇవి తప్ప సంస్కృత సమములతో దంత్యచజలు లేవు ఇతరము లయిన చజల కుదాహరణములు చంద్రుఁడు, చామరము, చక్రిక, చూర్ణము, చోరుడు, చౌర్యము , జయము, జాతి, జుగుప్స, జూటము - ఇత్యాదులు వీని లోని చజలు దంత్యములు కావు - తాలవ్యములేయగును రాజుశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి రాజు శబ్దములో జకార ముపధగాఁగలదు కాని యది ఇకారాంతముకాదు బహువచనము పరమగుటయు లేదు ఐనను రాజు - అను శబ్దమునందలి జకార మొక్కటి మాత్రము దంత్యముగాఁ గనఁబడు నని సూరి యభిప్రాయము

విశే - (1) అచ్చతెనుఁగుపదములందైనను, సంస్కృత సమములందైనను ఇ ఈ ఎ ఏ లంగూడిన చ జ లు తాలవ్యములే యగును అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు మాత్ర మచ్చతెనుఁగున దంత్యములగును ఇవి సంస్కృత సమములయందుఁ దాలవ్యములేయగును ఈ భేదము స్పష్టపడుటకే అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లంగూడిన చ జ లకు - చంద్రుడు, చామరము, చక్రిక, చూర్ణము, చోరుఁడు, చౌర్యము, జయము, జాతి, జుగుప్స జూటము - అనునవి చూపఁబడెను కాని, ఓ ఔలతోఁగూడిన ఇకారమునకు మాత్రము లక్ష్యములు చూపఁబడలేదు ఏలయన, జో , జౌలతోఁగూడికొనిన సుప్రసిద్ధ సంస్కృత శబ్దములు లేవు జోంగక (శబ్దక) జౌలాయన (వాచస్ప) మున్నగు సుప్రసిద్ధ సంస్కృత శబ్దములకు సంస్కృత సమరూపమునఁ బ్రయోగము చింతామణి సమ్మతముకాదు (ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్) కావున సూరి వీనికి లక్ష్యములు చూపలేదు

పదపార్థక్యము - (1) ఇకారాంతములయిన - అనుటచే, ఇకారాంతములు కాని శబ్దముల యుపధా చ జ లు దంత్యములుకావు ఉదా॥ చంచు + లు, రజ్జు + లు - వీనిలోని చ జ లు దంత్యములుకావు (11) ఉపధా చజలు - అనుటచే చ జ లు ప ధ లు కానిచో దంత్యత లేదు ఉదా॥ పంచమి+లు అంజలి + లు వీనిలో చ జ లుపధలుగా లేవు కాన దంత్య చ జ లు కావు.

(111) బహువచనము పరంబగునపుడు - అనుటచే నేకవచనమునందలి చ జ లు దంత్యములు కావు ఉదా॥ అర్చి, రోచి, రాజి, వాజి (1V) సంస్కృతసమంబు లందు, అనుటచే - తత్సమ 80 చే - ఏర్పడిన, అర్చి, రోచి - అను వానినే యిట గ్రహింపవలెను అప్పుడే ఇకారాంతములనుట సరిపడును (V) రాజు శబ్దంబొక్కటి- అని యనుటచే, రాజు- అని ఉత్వవిశిష్టముగ నున్నప్పుడే దంత్యజకారమగునని సూరి యాశయము కావుననే రాజ శబ్దమనలేదు ఉదా॥ రాజు, రాజులు ఓరాజ, నీవు రాజవు - అను చోటులందు జకారము దంత్యము కాదు, తాలవ్యమే

## నకారంబు ద్రుతంబు. 11

వ్యా నకారంబు = 'ను' వర్ణము అనఁగా ప్రత్యయాత్మకము (నన్నును), నాగమాత్మకము (నాచేతను) నవ్యయాత్మకము (ఎంతయును) నగు నువర్ణము ద్రుతము॥ విభక్త్యాగమచార్థోనుర్ద్రుతః - సూత్రాం ) ద్రుతము = ద్రుతినందునది లోపించునది యన్నమాట ఇది లోపించినను నర్థము చెడదు ఉదా॥ నన్ను, నా చేత, ఎంతయు అవయవికమగు, నువర్ణము ద్రుతము కాదు ఉదా॥ చేను, పేను ఇందలి నువర్ణము, ప్రత్యయాగమావ్యయాత్మకము కాకుండుటచే ద్రుతము కాదు.- చే, పే - అన్నచో నర్థమునుజెడును

విశే - సంధి పరిచ్ఛేదమున 'ను' వర్ణమే ద్రుతమూల రూపకముగ వ్యవహరింపఁబడి యున్నది (సంధి 17, 20 మొ ) కొందఱు వ్యంజన నకారము గూడ (న్) ద్రుతమూల రూపమని సెలవిచ్చుట సరికాదు ద్రుతస్వర లోపముచే వ్యంజన నకారము సిద్ధించును "ఏకదేశ వికృత మనన్యవత్" అను పరిభాషచేఁ బొల్లునకారము ద్రుతమగును ఇది ద్రుతమూల రూపము మాత్రము కాదు

## ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు. 12

ప్రథమా కయి పట్టి యొక్కేతరములయిన విభక్తులు-ఉత్తమ పురుషైక వచనంబులు – భూతతద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనంబులు—ఆశీరాద్యర్థకంబులయిన యెడు, తవర్ణకంబులు – శత్రు తుమానంతర్య చేదాద్యర్థకంబులు – నేను తాను పదంబులును – వలె ప్రకృతులును ద్రుత ప్రకృతికంబులు.

నన్నున్; నాచేతన్, నాతోడన్; నాకొఱకున్, నావలనన్,

నాకంటెన్, నాకున్, మాలోపలన్, మాయందున్, వత్తున్, వచ్చెదన్; వచ్చెన్, వచ్చున్, వచ్చెడున్, ప్రసన్నులయ్యెడున్ కావుతన్, కొట్టుచున్, కొట్టన్, కొట్టఁగన్, కొట్టుడున్, కొట్టినన్, వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్, ఇత్యాదు లూహ్యంబులు

వ్యా ద్రుత మంతమందుఁగల పదములు ద్రుతప్రకృతికములు అవేవఁగా—

1 ప్రథమాకయి వట్టి యొక్కఁ-తరములయిన విభక్తులు అనఁగా డు, ము, వు, లు, కయి, వట్టి, యొక్క - అనునవి కాక తక్కిన విభక్తులు చివరఁగల పదములు ద్రుతప్రకృతికములు ఉదా॥ నన్నున్ - ద్వి, (పత్యయాత్మక ద్రుతము) నావేతన్, నాతోడన్ - తృ, నా కొఱకున్ - చ, నావలనన్, నాకంటెన్ - పం, నాకున్, మా లోపలన్ - ష, మాయందున్ - స (ఇవి యాగమాత్మక ద్రుతములు)

2 ఉత్తమ పురుషైక వచనంబులు ను - ఉత్తమ పురుషైక వచనము (క్రియా 9, 10) కాన, ను - అను నుత్తమ పురుష క్రియా ప్రత్యయమంతమందుఁగల పదములు ద్రుతప్రకృతికములు ఉదా॥ వత్తున్ - వచ్చెదన్ (ఇట నుండి నేను తానుల వఱకుఁ ప్రత్యయాత్మక ద్రుతములు)

3 భూత ప్రథమ పురుషైక వచనము అనఁగా ఎను - అను క్రియా ప్రత్యయమంతమందుఁగల పదములు ద్రుత ప్రకృతికములు ఉదా॥ వచ్చెన్ (క్రియా 16)

4 తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచనంబులు అనఁగాఁ దద్ధర్మాద్యర్థము లను (క్రియా 22) దెలుపు, ను - అను క్రియా ప్రత్యయమంతమందుఁగల పదములు, ద్రుతప్రకృతికములు వచ్చున్, వచ్చెడున్ (క్రియా 16, 22)

5 ఆశీరాద్యర్థకంబులయిన, ఎడు - త వర్ణకంబులు ఆశీస్సు మొదలగు నర్థముగల ఎడు త - ప్రత్యయములు చివరఁగల పదములు ద్రుత ప్రకృతికములు- ఉదా॥ ప్రసన్నులయ్యెడున్, ప్రసన్నులు కావుతన్ (క్రియా 26) వర్ణకము = ప్రత్యయము

6 శత్రర్థకము = ధాతువునకుఁ గ్రియాన్వయమున వర్తమానార్థమునఁ జేరు ద్రుతాంతమగు 'చు' వర్ణకము ఈ ద్రుతాంతమగు చువర్ణకముతోఁ ["చును"] గూడుకొనిన పదములు ద్రుత ప్రకృతికములు ఉదా॥ కొట్టుచున్ (క్రియా 43)

7. తుమర్థకము = ఏ క్రియ నిమిత్తము వేఱొక క్రియ జరుగునో

ర్థాక్రియ తుమర్థకము (క్రియా 40) తుమర్థమున నగు "నుజి" వర్ణకముతోఁ గూడుకొనిన పదములు ద్రుతప్రకృతికములు ఉదా॥ కొట్టన్ కొట్టగన్ కొట్టు-ధాతువు కొట్టు + నుజి, ధాతువుయొక్క ఉత్వమత్వమగునని 'జి" అనునది తెలిపి లోపించును కాన, కొట్టు + నుజి = కొట్ట + ను కొట్టను = కొట్టన్, కొట్టను + కను కొట్టఁగను (క్రియా 115, 116)

8 అనంతర్యార్థకము అనంతరము యొక్క భావమానంతర్యము ఆనంతర్యార్థకము = అనంతరమున్న అను నర్థమున ధాతువునకుఁ జేరు ద్రుతాంతమగు "డు" వర్ణకము, ఈ ద్రుతాంత డువర్ణకముతోఁ గూడుకొనిన పదములు ద్రుతప్రకృతికములు ఉదా॥ కొట్టుడున్ = కొట్టిన యనంతరమున నని యర్థము (క్రియా 42)

9 చేదాద్యర్థకములు = చేదర్థకము మొదలగునవి చేదర్థకము = చేత్ శబ్దము యొక్క యర్థమున ధాతువునకుఁజేరు ద్రుతాంతమగు నవర్ణకము చేత్ = పక్షాంతరమును దెలుపును ఈ ద్రుతాంత నవర్ణకముతోఁ గూడుకొనిన పదములు ద్రుతప్రకృతికములు ఉదా॥ కొట్టినన్ = కొట్టిన పక్షమున కొట్టిన యెడల - అని యర్థము కొట్టు + నను ధాతువునకు ఇకారమాగమమయి కొట్టు+ఇ+నను = కొట్టినను, కొట్టినన్ - అగును (క్రియా 41)

10 నేను - తాను, పదంబులు ద్రుత ప్రకృతికములు ఇవి సర్వనామములు

11 వలె ప్రకృతులు = వలె మొదలగునవి ఉదా॥ వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ ఇవి యవ్యయాత్మక ద్రుతములు ఇత్యాదులూహ్యంబులు చూ॥ సంధి 25, 33,39; కారక 33, క్రియా 21, 27, 40, 122 సూ

విశే - (1) సప్తమీ న-వర్ణకమున కిట నుదాహరణము చూపలేదు ఉదా॥ వనమునన్, లోపలన్ - అనునది బహువచనముపైఁ జేరును కావుననే, మాలోపలన్ - అని యుదాహృతము దీని తరువాతిది కనుక, మాయందున్ - అని చూపిరి నా యందున్ అనియు నుండవచ్చును (11) ఈ యుదాహరణము లన్నియు ద్రుతమునందలి యచ్చు సంధి 20 చే లోపింపఁగా నేర్పడిన రూపములు (111) ప్రసన్నులయ్యెడున్ (అది 1 106) అనుటచే నిది యాశీరాద్యర్థకమే యని సూచన. తద్ధర్మాద్యర్థకమన్నచో, ప్రసన్నులగుదురు - కావలెను

## ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళలనంబడు. 13

రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ,

అయ్య, అమ్మ, రామునికయి, జ్ఞానముఁబట్టి, నాయొక్క, వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి, రాఁడు, రారు, రాదు, రావు, రాము, కొట్టక, తిట్టక, ఎత్తిలి, ఒత్తిలి, ఊరక, మిన్నక, బళి, అక్కట, ఏల ఇత్యాదు లూహించునది

వ్యా ద్రుతప్రకృతులు కాని శబ్దములను, కళలందురు ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికములు అవి కాని శబ్దములు కళలు

1 ప్రథమాకయి పట్టి యొక్క విభక్తులు చేరిన శబ్దములు ప్రథమకు ఉదా॥ రాముఁడు, రాములు, హయము, విష్ణువు, గోడ, మేడ, అయ్య, అమ్మ వీనిలో గోడ, మేడ, అయ్య, అమ్మ అనునవి ప్రథమైక వచనము లోపించిన యచ్చ తెనుఁగు పదములు వీనిని త్రిసమములని యందురు కయి - రాముని కయి, పట్టి - జ్ఞానముఁబట్టి, యొక్క - నా యొక్క

2 క్రియలు - వచ్చిరి వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి (వచ్చిరి, భూత-ప్రథమ పురుష బహువచనము వచ్చితివి వచ్చితిరి - భూత - మధ్యమ పురుష-ఏకవచనము, బహువచనము వచ్చితిమి - భూత - ఉత్తమ పురుష - బహువచనము)

3 వ్యతిరేక క్రియలు - రాఁడు, రారు, రాదు, రావు, రాము

4 వ్యతిరేక క్త్వార్థకములు - కొట్టక, తిట్టక

5 క్త్వార్థకములు - ఎత్తిలి, ఒత్తిలి (ఎత్తిలు+ఇ, ఒత్తిలు+ఇ)

6 అవ్యయములు (ప్రతిపదోక్తములు) ఊరక, మిన్నక (తూష్ణీమర్థకములు) బళి (ప్రశంసార్థకము) అక్కట (సంతాపార్థకము) ఏల (కిమర్థకము) ఇత్యాదులూహింపవలెను

విశే - ఎత్తిలి, ఒత్తిలి - అవ్యయములని కొన్ని వ్యాఖ్యలు కాని, యివి క్త్వార్థకములు కానోపును రాఁడు - మొదలగు వ్యతిరేక క్రియలను జూపు క్రమములో, కొట్టక, తిట్టక, యను వ్యతిరేక క్త్వార్థకములు చూపఁబడి యుండును కావున క్త్వార్థకములకు ముందు వీనిని జూపుటలోఁ గ్రమభంగశంక లేదు (వ్యా సం స)

పాఠ పరిశీలన - ద్రుత ప్రకృతులు గాని - అని ప్రథమ ముద్రణము కావున ద్రుతప్రకృతికంబులు కాని అను ముద్రణములు, సరికావు "అన్యేద్రుత ప్రకృతయః" అను చింతామణిని బట్టి ద్రుతప్రకృతులు - అని వ్యవహృతము

## హ్రస్వము మీఁది ఖండ బిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును. 14

అడఁకువ, అడంకువ, అరఁటి, అరంటి, ఎఱుఁగుట, ఎఱుంగుట, బలఁగము, బలంగము, మగఁటిమి, మగంటిమి,

వ్యా హ్రస్వముమీఁది యరసున్నకు నిండుసున్న వైకల్పికముగా నగును హ్రస్వము = ఏకమాత్రా కాలమునఁ బలుకఁబడు నచ్చు (ఏకమాత్రా భవేద్ హ్రస్వః) వైకల్పికము = విధించిన వ్యాకరణ కార్య మొక పక్షమున జరుగుట, యొక పక్షమున జరుగక పోవుట ఉదా॥ అడఁకువ, ఇట నరసున్న హ్రస్వము మీదఁగలదు ఏలయన డ-లోని అకారము హ్రస్వము ఈ సూత్రముచే నర సున్నకు నిండుసున్న యయినచో, అడంకువ అను రూపము సిద్ధించును వైకల్పికము కాన నిండుసున్న కానిచో అడఁకువ - అనియు నుండును ఇట్లే, తక్కినచోట్లను రెండేసి రూపము లుండును

విశే - ఈ సూత్రమున ఖండబిందువునుండి పూర్ణ బిందువు సాధింపఁ బడినది ఖండమునుండి పూర్ణమును చింతామణి సాధించినట్లు పూర్వ వ్యాఖ్యాతలు చెప్పి యుండుటచే సూరి ఖండమునుండి పూర్ణమును సాధించెను సత్య మిట్లుండగాఁ బూర్ణమునుండి ఖండమును సాధించినచో నతివ్యాప్తి కలుగునని భయపడి సూరి, ఖండము నుండి పూర్ణమును సాధించెనని కొందరు సెలవిచ్చిరి ఈ పక్షమునఁ బూర్ణమునుండి ఖండమును సాధింపజాలని యసమర్థత సూరి కాపాదించినట్లయినది కాన నీ యాశయము సరికాదు, సత్యమును గాదు. ఖండమునుండి పూర్ణమును సాధించుట వర్ణనాత్మక వ్యాకరణమగుటచే బాల వ్యాకరణ విషయమున లోపము కానక్కఱలేదు

పదసార్థక్యము - హ్రస్వముమీఁది - అనుటచే దీర్ఘముమీఁది ఖండ బిందువునకుఁ బూర్ణబింద వీ సూత్రముచేఁగాదు ఉదా తేఁటి, బోఁటి ఇట తేంటి, బోంటి యని నిండుసున్న కాదు

## దీర్ఘము మీఁద సాధ్య పూర్ణము లేదు. 15

వాఁడు, వీడు, రాఁడు, లేదు, కాబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు.

వ్యా దీర్ఘము మీద సాధ్యమగు పూర్ణ బిందువు లేదు దీర్ఘము = రెండు మాత్రల కాలమునఁ బలుకఁబడిన యచ్చు [ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే] సాధ్య పూర్ణము = వ్యాకరణ కార్యములచే సాధింపఁదగిన నిండుసున్న దీర్ఘము మీఁద సాధ్యమగు నిండుసున్న యుండదు. ఉదా॥ వాఁడు ఇట 'వా' లోని 'ఆ' -

దీర్ఘము కాన దీని మీఁద సాధ్యమగు నిండుసున్న యుండదు అరసున్న మాత్రమే యుండును ఉదా॥ వాఁడు, వీడు, రాఁడు, లేఁడు, కాఁబోలు, కాఁబట్టి, గోఁగులు, రేఁగులు

విశే - బిందువు సిద్ధము, సాధ్యము నని రెండు విధములు [1] సిద్ధ బిందువు = శబ్ద సిద్ధమగు బిందువు అడఁకువ, అరఁటి వీనిలోనిది సిద్ధమగు ఖండ బిందువు అర్ధంకి, నారింజ మొదలగు వానిలోనిది సిద్ధమగు పూర్ణ బిందువు [2] సాధ్య బిందువు = వ్యాకరణ కార్యములచే సాధ్యమగు బిందువు పూచెను+కలువలు = పూచెఁగలువలు ఇది సాధ్యమగు ఖండబిందువు పూచెం గలువలు - ఇది సాధ్యమగు పూర్ణబిందువు దీర్ఘముమీఁద సాధ్యమగు ఖండ బిందువుండును ఉదా॥ వా+డుఙ్ = వాఁడు, వీ+డుఙ్ = వీఁడు [అచ్ఛిక 24] రా+డుఙ్ = రాఁడు [క్రియా 91] లే+డుఙ్ = లేఁడు [క్రియా 106] కాను+పోలు=కాఁబోలు కాను+పట్టి=కాబట్టి [సంధి 16, 17] గోను+లు= గో+గుఙ్+లు = గోఁగులు రేను+లు = రే+గుఙ్+లు = రేఁగులు [అచ్ఛిక 19] ఇట్టివి సాధ్యములగు ఖండబిందువులు వా+డుఙ్ - ఇత్యాదు లలో తత్సమ 19 చే పూర్ణబిందువు, ఖండబిందువు రెండును ప్రాప్తించుచుండగా దీర్ఘము మీఁద సాధ్య పూర్ణము లేదు - అని యీ సూత్రము సాధ్యపూర్ణమును నిషేధించుచున్నది కావున ఖండ బిందువు మాత్రమే వచ్చి, వాఁడు - మొదలగు రూపము లేర్పడును తాఁజదివె - మున్నగుచోట్ల (సంధి 23, 37 మొ॥) సాధ్య పూర్ణ మీ సూత్రము చేతనే నిషేధింపఁబడు చున్నది

పదసార్థక్యము - (i) దీర్ఘము మీఁద - అనుటచే హ్రస్వము మీఁద సాధ్యపూర్ణముండును ఉదా॥ పూచెను+కలువలు = పూచెంగలువలు (సంధి 16, 17) (ii) పూర్ణము లేదు - అనుటచే దీర్ఘముమీఁద సాధ్యమగు ఖండ బిందువుండును ఉదా॥ వాఁడు, వీఁడు మొ॥ (iii) సాధ్య పూర్ణము లేదు అనుటచే దీర్ఘముమీఁద సిద్ధపూర్ణ ముండును ఉదా॥ ఏకాంఢము, కాళాంజి, మాందాళి - మొ॥

## సంస్కృత సమేతరములయిన తెలుఁగు శబ్దములయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కానంబడుచున్నది. 16

వంకర, కలఁకువ, మంచు, త్రాఁచు, దంట, దాఁటు, కొంత, కోఁత. ఇత్యాదులూహ్యంబులు

వ్యా అచ్చతెనుఁగు శబ్దములలోఁ, బరుషసరళములకుముందు మాత్రమే బిందువు కనఁబడును బిందువు = పూర్ణబిందువు, ఖండబిందువు సంస్కృత

సమేతరము = సంస్కృతసమము కాక తక్కినది అనఁగా నచ్చతెనుఁగు
పరుషములు = కచటతపలు, సరళములు = గజడదబలు ఉదా॥ వంకర, కల్లఁక్షువ, మంచు, త్రాఁచు, దంట, దాఁట, కొంత కోఁత - మొదలయినవి వీనిలో, బిందువు, కచటత - అను పరుషములకు ముందే కలదు తక్కిన య్యుదాహరణముల నిట్లే యూహించుకొనవలెను మచ్చునకీయుదాహరణములు చూపఁబడెను

పదసార్థక్యము - (1) సంస్కృతసమేతరములయిన - అనుటచే సంస్కృత సమములలోఁ బరుష సర శేతరములగు హల్లులకు (స్థిరములకు) ముందు బిందువు కనఁబడును ఉదా॥ శంఖము సంఘము మొ॥ (11) పరుష సరళములకు ముందే - అనుటచే నచ్చతెనుఁగునఁ బరుషసర శేతరములగు హల్లులకు ముందు బిందువుండదు స్థిరమునకుముందు బిందువు కనఁబడినచో నది సంస్కృతసమమని గుర్తింపవచ్చును ఉదా॥ హంస, సింహము మొ॥

## యకారంబును వువూవొవోలును దెలుఁగు మాటలకు మొదట లేవు. 17

ఎవ్వఁడు, ఎక్కడ, ఏమి, ఏల, ఉంద, ఊరు, ఒకఁడు, ఓద, హరి యతఁడు, నిద్రవోయె నిట్టిచోట్ల, సంధివశంబున వచ్చిన యకార వకారంబులు గాని, పూర్వసిద్ధంబులు గావు వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృత సమంబులందు సహితము వువూవో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది ఉదకము, ఊర్మిక, ఓదనము

వ్యా అచ్చ తెనుఁగు పదములకు మొదట యకారమును, వువూవొవో లును లేవు యకారమనుటచే నేయచ్చుతోఁ గూడిన యకారమును లేదు కావున నచ్చులనే వ్రాయవలెను ఉదా॥ ఎవఁడు, ఎక్కడ, ఏమి, ఏల వువూవొవోలును దెనుఁగు మాటలకు మొదటలేవు కాన ఉఊఒఓలనే వ్రాయవలెను ఉదా॥ ఉంద, ఊరు, ఒకఁడు, ఓద హరియతడు - దీనిలోని యకారము శబ్దసిద్ధము కాదు అసలు శబ్దము "అతడు" అనునది హరి+య్+అతడు-అనుచో యకార మాగమముగ వచ్చినది హరి-య్ + అతఁడు = హరియతఁడు - అయినది (సంధి 3) నిద్రవోయె - దీనిలోని వకారమును శబ్ద సిద్ధము కాదు నిద్ర + పోయె - అనుచో - పకారమునకు వకారమయినది నిద్ర + పోయె = నిద్ర వోయె - సంధి 13 వోవర్ణము మొదటఁగల సంస్కృత సమములు రెండు

మాత్రమే కలవు అవివోఢృ వోఢవ్యశబ్దములు వోఢృ = వోఢ (తత్సమ 52) వోఢవ్య = వోఢవ్యము (తత్సమ 39) ఈరెండుతప్ప వుపూవో వర్ణము లాదియందుఁ గల సంస్కృతసమములు మఱిలేవు కావున ఉఊలదే (ఒ-సంస్కృతమునలేదు) వ్రాయవలెను ఉదా॥ ఉదకము, ఊర్మిక, ఓదనము

విశే - సంస్కృతసమములందు, వోఢ, వోఢవ్యమునను రెండుపదములే కలవనుటచేఁ దక్కిన సంస్కృతశబ్దములకు సంస్కృత సమరూపమునఁ దెనుఁగులోఁ బ్రవేశము లేదని గ్రహింపవలయును సంస్కృతమున, వుకః, వోశికా, వోఢా, వోరటః మొదలగు శబ్దములు కలవు కావుననే సూరిగారు వుపూవో వర్ణాదులగు శబ్దములు సంస్కృత సమంబులందు లేవనిరి గాని సంస్కృతమునందు లేవని యనలేదు

పదసార్థక్యము - (I) యకారంబును - అనుటచే, నేయచ్చుతోఁగూడిన యకారము నచ్చతెనుఁగున మొదటనుండదు (II) వుపూవొవోలు - అనుటచేఁ దక్కిన వకారములు తెలుఁగు మాటలకు మొదట నుండవచ్చును ఉదా॥ వడి, వాఁడి, విసము, వీసము వెండి, వేఁడి, వైశము - మొ॥ (III) తెలుఁగుమాట లకు - అనుటచే సంస్కృత సమములలో యకారాది పదములుండవచ్చును. ఉదా॥ యతి, యాగము, యుగము, యోగము - మొ॥ సంస్కృతసమములలో 'వో' వర్ణమాదియందుఁ గల పదములు రెండు కలవు అవి - వోఢ వోఢవ్యము ననునవి (IV) మాటలకు - అనుటచే, నపదములలో, యకారమును వుపూవొ వోలు మొదటనుండిన నుండవచ్చును ఉదా॥ యొక్క - ఇదిషష్ఠీ విభక్తి ప్రత్యయము కాన నిది పదము (మాట) కాదు కనుక నాదిని దీనిలో యకార ముండుట బాధకము కాదు ఇట్లే, డుమువులు - అనువాని లోని 'వు' ప్రత్యయము, కృత్తులలోని 'వు' ప్రత్యయము (కృదంత 17) మొదట నుండుటలో వైరుధ్యము లేదు (V) మొదటలేవు - అనుటచే నివి తరువాతి వర్ణములుగా నుండవచ్చును ఉదా॥ కాయ, అవు - మొ॥

పాఠపరిశీలన - వుపూవొవో వర్ణాదులగు - అని కొన్ని ప్రతులలో "వొ" ప్రక్షిప్తమయినది వుపూవో వర్ణాదులగు - అను ప్రథమ ముద్రణమే యొప్పు ఏలయన ఒకారమే సంస్కృతమున లేదు కాన 'వొ' వర్ణ ప్రసక్తి యసంగతము

**యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబులగు. 18**

హరి యతఁడు — ఇత్యాదులందాగమ యకారములఘువు.

తక్కిన యకారమలఘువు విఱుగు, మెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు ఇదే శకటరేఫమని చెప్పఁబడును శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు పెరుగు కరుగిత్యాదులందు రేఫంబు లఘువు ఏఁళులు, పాఁళులు, ౹త్రాఁళులని బహుత్వమందు రలడల కాదేశమయిన ళకారమలఘువు తల, నెల యిత్యాదులందలి లకారము లఘువు. అతఁడుపలికె నిత్యాదులందున్న పాదేశ వకారము లఘువు తక్కిన వకారమలఘువు వర్ణ సమామ్నాయమందలి శకారము, వర్ణాంతరము గాని, యలఘు శకారము గాదని యెఱుంగునది

వ్యా యరలవలు లఘువులని, యలఘువులని రెండు విధములు లఘువులు = నాలుక, వర్ణోత్పత్తి స్థానములను శిథిలముగా స్పృశింపఁగాఁబుట్టు వర్ణములు, లఘువులు (లఘూచ్చారణే స్థానకరణ శైథిల్యం జాయతే - కాశికా) అలఘువులు = నాలుకయవే వర్ణోత్పత్తి స్థానముల నశిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టు వర్ణములు అలఘువులు అనఁగా లఘువులకు నలఘువులకు వర్ణోత్పత్తి స్థానమొకటే యన్న మాట

1 యకారము - (1) లఘుయకారము = ఆగమయకారము లఘువు హరి + అతఁడు = హరి-య్ + అతఁడు హరియతఁడు (సంధి 3) నాలుక తాలువును శిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును కావున నీయాగమయకారము లఘువు (11) ఆగమ యకారముకాక తక్కిన యకారమనఁగా శబ్దసిద్ధ యకార మలఘువు ఉదా॥ కాయ, నాలుక తాలువు నశిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున నిందలి యకారమలఘువు

2 రేఫము - (1) సాధురేఫము లఘువు- ఉదా॥ పెరుగు, కరుగు నాలుక మూర్ధమును శిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున వీనిలోని సాధు రేఫము లఘువు (11) శకటరేఫమలఘువు ఉదా॥ విఱుగు, మెఱుఁగు నాలుక మూర్ధమున నశిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున నిందలి శకరేఫ మలఘువు

3 లకారము - (1) లకారము లఘువు ఉదా॥ తల, నెల, నాలుక దంతములను శిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున నిందలి లకారము లఘువు (11) అలఘు లకారము = బహుత్వమున రలడల కాదేశమయిన ళకారమలఘువు ఉదా॥ ఏఁరు + లు = ఏఁళులు, పాలు + లు = పాఁళులు, ౹త్రాడు + లు = ౹త్రాఁళులు (ఆచ్ఛిక 13) నాలుక దంతముల నశిథిలముగా స్పృశింపఁగాఁబుట్టును గావున నీ ళలడల కాదేశమయిన ళకార మలఘువు

4 (i) వకారము - లఘువకారము = పకారమున కాదేశమయిన వకారము లఘువు ఉదా॥ అతఁడు + పలికె = అతఁడు వలికె (సంధి 13) నాలుక దంతోష్ఠముల మొత్తమును శిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున నిందలి పాదేశవకారము లఘువు (ii) అలఘువకారము పాదేశ వకారముకాక తక్కినదనఁగా శబ్దసిద్ధ వకార మలఘువు ఉదా॥ తావి, మోవి నాలుక దంతోష్ఠముల మొత్తము నశిథిలముగా స్పృశింపఁగాఁ బుట్టును గావున నిందలి శబ్దసిద్ధ వకార మలఘువు

శకటరేఫము తత్సమ తద్భవములందు లేదు అనఁగా దేశ్యములందు మాత్రమే యుండునని తాత్పర్యము వర్ణ సమామ్నాయమునందలి ళకారము వర్ణాంతరము గాని, యలఘు ళకారము గాదని యెరుంగునది దీని భావమిది యరలవలు, లఘువులని, యలఘువులని రెండు విధములు లఘువులగు యరలవలు మాత్రమే వర్ణ సమామ్నాయమునఁ జేర్పఁబడినవి. (3 సూ) అలఘువులగు యరలవలు వర్ణసమామ్నాయమునఁ జేర్పఁబడలేదు ఏలయన, నివి ప్రత్యేకవర్ణము లనిపించుకొనవు వర్ణ సమామ్నాయమున (3) ళకార మొకటి చూపఁబడినది దీని నలఘు ళకారమని భ్రమపడరాదు అలఘుళకారమనఁగా, బహుళత్వమున రలడలకాదేశమయిన ళకారము త్రాళులు, పాళులు, ఏళులు - అనువానిలోని ళకార మలఘువు వర్ణసమామ్నాయమునఁ జూపినది వర్ణాంతము= వేఱువర్ణము అనఁగా, తళుకు, బెళుకు, మున్నగువానిలోని శబ్దసిద్ధమగు ళకారము ఇది యలఘు లకారము కాదు కాఁగా, రడల కాదేశమయిన ళకార మలఘువు ఇది ప్రత్యేక వర్ణముకాదు శబ్దసిద్ధ ళకారము ప్రత్యేక వర్ణము ఇదే వర్ణ సమామ్నాయమందలి ళకారము అని సారాంశము

విశే - (i) శకట రేఫము తత్సమ తద్భవములందు లేదని సూరియిటఁ జెప్పెను, కాని తద్భవములలో నలఘురేఫమరుదుగాఁ గలదనియే యాయన యభిప్రాయము నిఘంటువులో కాటియ శబ్దము తద్భవమనియు, నరుదుగా శకట రేఫము తద్భవములలోఁ గలదనియు సూరి వ్రాసెను 'క్వచిత్తద్భవేపి శకటోదృశ్యతే' కానఁ దద్భవములలో శకటరేఫముండనే యుండదని కొందఱు సెలవిచ్చుట సూరి హృదయమునకే విరుద్ధము తద్భవములలో శకటరేఫమరుదు గావునఁ బ్రాయోవాదముగాఁ దద్భవములలో శకటరేఫము లేదను లాక్షణిక మతము నిట సూరి సూచించెనని గ్రహింపనగును ఇట్లే తత్పురుషాదుల లక్షణములు ప్రాయోవాదములే చూ సమాస 3 (ii) అలఘు లకారమునకు వర్ణ సమామ్నాయమందలి ళకారమునకు భేదమేమి? యని కొందఱు శంకింతురు,

అలఘు ళకారము దంత్యమని వైయాకరణ సిద్ధాంతము ఇది ళకారము నలఘువుగాఁ బలుకుటచే నేర్పడును రడలకును దంత్యతా పరిణామముగలదు రేఫమునకు - (I) లరయోరభేదః రోలంబః = లోలంబః (II) గరుడః = గలులో, (షడ్భా) (III) రామ = లేమ డకారమునకు - (I) లడయోరభేదః తాడీ = తాలీ (II) డోల (హేమప్రా) దస్యవ - దాడిమమ్ = దాలిమం (ప్రా ప్ర) గరుడః = గలులో, గుడః = గుళో (షడ్భా) శబ్దసిద్ధ ళకారము మూర్ధన్యము, కాన నీరెండును విభిన్నములు అలఘులకారము ప్రత్యేక వర్ణము కాదు లకారముపై బొట్టునిల్పిన నలఘులకార మగునని యాంధ్రశబ్ద చింతామణి (దంత్యచజౌగురురలౌ చ బిందుయుతౌ) అలఘులకారమును వర్ణ సమామ్నాయము నందలి ళకారపు లిపితోనే వ్రాయుచుండుట తబ్బిబ్బులకు మూలమయినది ఇది నేటి యుపభ్రష్టోచ్చారణముతో నిర్ణయింపవలసినదికాదు (III) శకటరేఫమును వర్ణాంతరమే యనరాదా? అని కొందఱందురు కాని యనరాదన్నదే సమాధానము స్వరకాల స్థానకరణ యత్నభేదములచే వ్యక్తముగా, ననఁగా నితర వర్ణముల కంటె వేఱుగా ధ్వనించునది వర్ణమనబడును "స్వరతః కాలతః స్థానాత్ప్రయత్నానుప్రదానతః, ఇతి వర్ణవిదః ప్రాహుః" (పా శి) ఈ పార్థక్య సామగ్రి, యలఘువులగు యరలవలకు లేదు అప్రధానోచ్చారణములను బరిగణించినచో, వర్ణసంఖ్యలు కొన్ని వందలగును అలఘువులగు య-వ-ల లను గూడ వర్ణ సమామ్నాయమున జేర్పవలసియుండును కాన నలఘు రేఫము వర్ణాంతరము కానేరదు

పాఠ పరిశీలన - పెరుగు - ప్రథమ ముద్రణల పాఠము పెరుఁగు కొన్ని ముద్రణములు

## సంస్కృత ప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు 19.

| సంస్కృతము | సంస్కృతసమము | సంస్కృతము | సంస్కృతసమము |
|---|---|---|---|
| రామః | రాముఁడు | గౌః | గోవు |
| విద్యా | విద్య | నౌః | నావ |
| హరిః | హరి | ద్యౌః | దివి |
| ధేనుః | ధేనువు | హృద్ | హృది |
| భూః | భువి | జగత్ | జగత్తు, జగము |
| పితా | పిత | | |

ఇత్యాదులూహ్యంబులు

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృత సమము |
|---|---|---|
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| ఆటిః | ఆడీ | ఆడి |
| ఆలిః (పజ్క్తి) | ఓలీ | ఓలి |
| కటుః | కారో | కారము |
| గౌరవమ్ | గారవం | గారవము |
| జటా | జడా | జడ |
| మిరా | మేరా | మేర |
| యమః | జమో | జముఁడు |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| శృఙ్గారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |

ఇత్యాదు లెఱుంగునది.

వ్యా సంస్కృతతుల్యము, ప్రాకృతతుల్యము నగు భాష తత్సమము. తద్ = ఆసంస్కృత ప్రాకృతములతో, తుల్యము = సమానము ఉదా॥ రామః సంస్కృతము రాముఁడు - సంస్కృతసమము ఇట 'రామ' శబ్దమునకు ప్రత్యయము చేరఁగా, రామః - అను ప్రథమైకవచనమేర్పడెను రామశబ్దమున కుత్వమును, బిందుపూర్వక డువర్ణకమును జేరఁగా రాముఁడు - అయ్యెను ఇట్లు తెలుఁగు విభక్తులు చేరుట, విభక్తి నిమిత్తకములగు చిన్న చిన్న మార్పులు మాత్రమే కలుగుట, తత్సమముల స్వభావము అగ్నిః - అగ్గీ - అగ్గి - ఇట అగ్గి - అనునది ప్రాకృతరూపముతో సమానముగ నుండుటచే నిది ప్రాకృత సమమగును ఇట్లే తక్కిన రూపములు

విశే - ఆలిః - పజ్క్తి - అని వ్రాయఁబడెను ఆలి శబ్దమునకు 1) వంక్తి 2) చెలికత్తె, యని యర్థములు గలవు ఆలిః పజ్క్తి అను[illegible]లి - అను దానికిఁ బంక్తి యని మాత్రమే యర్థ[illegible] గ్రహింపవలెను.

## సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు. 20

| సంస్కృతము | సంస్కృతభవము | సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|---|---|
| ఆకాశ | ఆకసము | మృగం | మెకము, మెగము |
| కుడ్యమ్ | గోడ | | |
| చన్ద్రః | చందురుఁడు | వక్రం | వంకర |
| తమస్సః | తమగము | వేసరః | వేసడము |
| తామరసమ్ | తామర | సముద్రం | సంద్రము |
| నారాచః | నారసము | సూచీ | సూది |
| నిభం | నెపము, నెవము | స్మరః | మరుఁడు |
| | | హరణమ్ | అరణము |
| ముఖమ్ | మొకము, మొగము | హరితాళమ్ | హరిదళము |

ఇత్యాదులు గ్రహించునది

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము, పగడము |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| | | లచ్చి |

| | | |
|---|---|---|
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| వైద్యః | వేజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది

వ్యా సంస్కృతభవము, ప్రాకృతభవము నగు భాష తద్భవము తద్=ఆ సంస్కృత ప్రాకృతముల నుండి, భవంబు = పుట్టినది వర్ణలోపము మొదలగు మార్పులు కలిగి యేర్పడిన భాష తద్భవము సంస్కృతభవమునకు॥ ఆకాశః – సంస్కృతము ఆకసము – సంస్కృతభవము కాశ – అను దానిలో శాకు సకారమయినది కా – లోని దీర్ఘము హ్రస్వమయినది చన్ద్రః= చందురుఁడు ఇట, తాలవ్య చకారము దంత్యచకార మయినది సంయుక్తాక్షరము విడిపోయి'దురు' అని మాఱినది తామరసమ్ - తామర ఇట వర్ణలోపము వక్రః = వంకర ఇట, క్ర = కర - అని వర్ణ వికర్ష కలిగినది బిందు వాగమమయినది ప్రాకృతభవములకు, ఇంగాలో – ఇంగలము గాలో – గల అయినది అచ్ఛరా – అచ్చర, చ్ఛ – చ్చ – అయినది దీర్ఘము హ్రస్వ మయినది ఇట్లే తక్కిన శబ్దముల విషయము నూహించుకొన వలెను

విశే - (1) ప్రాకృత పద్ధతికి భిన్నమగు మార్పులతో నేర్పడినవి సంస్కృతభవములు ఆకాశః – సంస్కృతము ఆకసము సంస్కృతభవము ఏలయన, ఆకాశః అను దానికిఁ బ్రాకృత రూపము, ఆయాసో అనునది (ప్రా ) ఇది అకసము – అయ్యెననుట కవకాశము లేదు కాన అకసము – సంస్కృతభవమే యగును ఇట్లే తక్కిన సంస్కృత భవముల విషయమ్మున గ్రహింపవలెను ప్రాకృత రూపముల నుండి యేర్పడునవి ప్రాకృతభవములు ఇంగాలో – ప్రా ఇంగలము – ప్రాకృతభవము (11) పవడము, పగడము అను క్రమమును బట్టి కొన్నియెడల వకారమునూ గకారమగునని సూచన

## త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు. 21

ఊరు, పేరు, ఇల్లు, ముల్లు, కోట, పేట, దూడ, మేడ, కోఁత లేఁత, తావి, మోవి ఇత్యాదు లరయునది

వ్యా తెలుఁగు దేశపు వాడుకలో సిద్ధించిన భాష దేశ్యము తత్సమ తద్భవములను నిర్దేశించిన పిమ్మట దేశ్యమును నిర్దేశించుటచేఁ ద్రిలింగదేశ

వ్యవహార సిద్ధమగు తత్సమ తద్భవేతర భాష దేశ్యమని గ్రహింపవలెను. త్రిలింగదేశము = తెలుఁగు దేశము ప్రాచీనకాలమునఁ దెలుఁగు దేశము - శ్రీశైలము, ద్రాక్షారామము, కాళేశ్వరము నను శివక్షేత్రముల యందలి మూడు శివలింగములకు మధ్య నుండెడిది కావునఁ ద్రిలింగదేశమను పేరు కలిగెను త్రిలింగశబ్ద భవము తెలుగు - ఊరు, పేరు - ఇత్యాదులు దేశ్యములు

విశే - సూరి యిట నిర్బిందుకమగు పేట శబ్దము నుదాహరించెను పేట=హారములో నొక సరము సబిందుకమగు పేట శబ్దమును సూరి యీ సూత్రము నొద్ద నుదాహరింపలేదు శ రలో నీ రెండు శబ్దములు వేర్వేఱుగనే చూపఁబడి యున్నవి

పాఠ పరిశీలన - వేఁజో - ప్రథమ ముద్రణ పాఠము వెఁజో - అను ముద్రణములు సరికావు

## లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు. 22

వస్తాఁడు, తెస్తాఁడు, వచ్చేని, తెచ్చేని, వచ్చేవాఁడు, తెచ్చే వాఁడు, వచ్చేటివాఁడు, తెచ్చేటివాఁడు ఈ భాష ప్రయోగంబున కనర్హంబు

వ్యా॥ వ్యాకరణ శాస్త్రమునకు విరుద్ధమయిన భాష గ్రామ్యము లక్షణము=వ్యాకరణాది శాస్త్రము ఉదా॥ వస్తాఁడు, తెస్తాఁడు ఇత్యాదులు ఈ భాష కావ్యములలో వాడఁదగినది కాదు

విశే - వస్తాఁడు, తెస్తాఁడు - అనువానిలో నరసున్నలు ప్రథమ ముద్రణము నుండి కలవు కావున నరసున్నలు చేర్చినంత మాత్రమున గ్రామ్య పదములు సలక్షణములు కానేరవని తెలుపుట కరసున్నలు నిల్పినట్లు గ్రహింప నగును "వస్తాఁడు నీలభూపతి ఇస్తాఁడు" (చంద్ర వి) అప్పక 1.125

## ఆచార వ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు. 23

పెద్దలు వ్యవహరించిన మాట గ్రామ్యంబయిన గ్రహింపఁ దగునని తాత్పర్యము. కలకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిల కన్నులు, కపిల గడ్డము, కపిల జడలు

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము

వ్యా॥ శిష్టకవుల ప్రయోగములందుఁ గన్పట్టు మాట గ్రామ్యమయినను

గ్రహింపఁదగునని యర్థము ఆర్యులు = పెద్దలు అనగా శిష్టకవులు గ్రామ్యము = లక్షణ విరుద్ధమగు భాష దృష్టంబు = చూడఁబడినది గ్రాహ్యంబు = గ్రహింపఁదగినది (1) కలకంఠుఁడు ఇది బహువ్రీహి సమాసము "స్త్రీ సమ ఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు" (సమాస 6) అను లక్షణమునకు విరుద్ధముగ నుండుటచే నిది గ్రామ్యమయినది బహువ్రీహి సమాసమును స్త్రీ సమములలోనే కూర్చవలెనని యీ లక్షణము చెప్పుచున్నది స్త్రీసమము = ప్రథమైక వచన ప్రత్యయము లోపించిన యచ్చ తెనుఁగు శబ్దము కలకంఠుఁడు అనుచో కల – స్త్రీ సమమేకాని కంఠ శబ్దము స్త్రీ సమము కాదు ఇది యచ్చ తెనుఁగు శబ్దమే కాదు కావున నీసమాసము గ్రామ్యమయినది అయినను శిష్టకవులు ప్రయోగించినది గనుక గ్రాహ్యమే యగును (2) ప్రాణగొడ్డము - ము - "కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతో సమసింపదు" (సమాస 3 సూ॥ వివరణము) అను లక్షణమునకు విరుద్ధమగుటచే, ప్రాణగొడ్డము - మున్నగునవి గ్రామ్యము లయినవని సూరి యభిప్రాయము ప్రాణగొడ్డము ఇందు ప్రాణ - అనునది కేవల సంస్కృత శబ్దము (సంస్కృత ప్రాతిపదికము) గొడ్డము - అచ్చ తెనుఁగు శబ్దము కేవల సంస్కృత శబ్దమచ్చ తెనుఁగు శబ్దముతో సమాసము కాదను లక్షణమునకు విరుద్ధమగుటచే నిది గ్రామ్యమయినది అయినను శిష్టకవులు ప్రయోగించినది గావున గ్రాహ్యమయినది ఇట్టివే జీవగఱ్ఱ, కపిల కన్నులు, కపిలగడ్డము, కపిల జడలు – అనునవి వీనిలో జీవ, కపిల–అనునవి కేవల సంస్కృత శబ్దములు కఱ్ఱ, కన్నులు, గడ్డము, జడలు – అనునవి యచ్చతెనుఁగు శబ్దములు కావున నివి గ్రామ్యములయినవి ఐనను శిష్టకవులు ప్రయోగించినవి కనుక గ్రాహ్యములయినవి

విశే - (1) కలకంఠుఁడు - నన్నయాదులు ప్రయోగించినది కల స్త్రీ తెలుఁగు కంఠము – సంస్కృతసమము కావున నిది మిశ్ర బహువ్రీహి ప్రాణ గొడ్డము - తిక్కనాదులు ప్రయోగించినది జీవగఱ్ఱ - భారతేతర కవులు వాడినది కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు – నన్నయ ప్రయుక్తము లని సూరి యభిప్రాయము ప్రాణగొడ్డము - మున్నగునవి వైరి పదములనియు శిష్టకవులు వాడుటచె గ్రాహ్యములనియు సూరి యాశయము (11) కలకంఠుడు "కల+ము"+"కంఠ+ము'–అలౌకిక విగ్రహము సమాస 25చే - కలకంఠ– ప్రాతిపదికము తత్సమ 21 చే - కలకంఠు తత్సమ 22 చే కలకంఠు+డుఙ్ తత్సమ 19 చే - కలకంఠుడు కలకంఠుడు = కలయైన కంఠము వేనికిఁ గలదో వాఁడు - నీలకంఠుడు, శివుడు (111) ఈ రూపములోని పాత న్యాయ మున ననింద్య గ్రామ్యములుగా గ్రాహ్యములన్న మాట

ఇది ఘంటాపథము

# సంధి పరిచ్ఛేదము



## ఉత్తున కచ్చుపరంబగునపుడు సంధియగు. 1

పూర్వ పర స్వరంబులకుం బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు

| | | |
|---|---|---|
| రాముఁడు | అతఁడు | రాముఁడతఁడు |
| సోముఁడు | ఇతఁడు | సోముఁడితఁడు |
| మనము | ఉంటిమి | మనముంటిమి |
| అతఁడు | ఎక్కడ | అతఁడెక్కడ |
| ఇతఁడు | ఒకఁడు | ఇతఁడొకఁడు. |

వ్యా॥ హ్రస్వమయిన, ఉకారమున కచ్చుపరమగునపుడు సంధియగును ఉత్తు = హ్రస్వమయిన ఉకారము- ఇట హ్రస్వమయిన ఉకారమునకు, తకారము చేర్పఁగా, ఉత్ - అని యేర్పడెను తకారము, హ్రస్వమయిన ఉకారమునకుఁ జేర్పఁబడుటచే, ఉత్తు - అనఁగా హ్రస్వమయిన ఉకారమగును ఇట్లే, ఇత్తు = హ్రస్వమయిన ఇకారము అత్తు = హ్రస్వమయిన అకారము (తత్సమ 45) స్వరము = అచ్చు స్వయముగాఁ బ్రకాశించునది యని వ్యుత్పత్తి (స్వయం రాజంతే ఇతిస్వరాః - తైత్తి) వర్ణాంతరాపేక్షలేకుండ స్వయముగా నుచ్చరింపఁ బడునవి గావున నచ్చులను స్వరములందురు ఏకాదేశము = రెండక్షరముల స్థానమున నొక యక్షర మాదేశమగుట ఆదేశము = ఒకదాని స్థానమున శత్రువువలె వచ్చునది యాదేశమనఁబడును (శత్రువదాదేశః) కాఁగా, రెండక్షరముల స్థానమున నొక యక్షరము శత్రువువలె నగుట యేకాదేశమని తాత్పర్యము రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు ఇట, రాముఁడు, లోని ఉకారము పూర్వస్వరము అతఁడు - లోని, అకారము - పరస్వరము. ఉ + అ - అను రెండక్షరములకు, అకారమొక్కటే యాదేశమగుటచే నిది

యేకాదేశమైనది సంధి = పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధియనంబడు పూర్వస్వరము, పరస్వరము నను రెండింటిస్థానమునఁ బరస్వరమొక్కఁడే శత్రువువలెనగుట సంధి యని తాత్పర్యము హ్రస్వమయిన ఉకారమునకు సంధినిత్యముగ నగును రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు ఇట "ఉ + అ" అను రెంటికిఁ బరస్వరమగు 'అ' అనునది యయినది సోముఁడు + ఇతఁడు = సోముఁడితఁడు "ఉ + ఇ" అను రెండింటికి బదులుగాఁ బరస్వరమగు "ఇ" అనునది యయినది ఇట్లే తక్కినవి

విశే - (1) "పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు" అని నిర్వచింపఁబడెను సంధి శబ్దము మొదటి 11 సూత్రముల లోనే ప్రయోగింపఁబడెను 12వ సూత్రమున ఉత్త్వసంధి ప్రసక్తికలదు పూర్వపరస్వరములకుఁ బరస్వరం బేకాదేశంబగుట యను లక్షణము తక్కిన వానియెడ సరిపడదు కావునఁ దక్కిన వానిని సంధిపరిచ్ఛేదమున నిల్పుట సమంజసమా? యను ప్రశ్న కలుగును సంధి శబ్దమునకుఁ గల యర్థములలో వర్ణద్వయ మేళనమనునది యొకటి వర్ణద్వయమేళనము (రెండువర్ణముల కలయిక) స్వరసంధియందును, దక్కిన వ్యాకరణ కార్యములయందును గల సామాన్య ధర్మము కావున వర్ణద్వయమేళనమున నగు వ్యాకరణకార్యములను స్వర సంధులతోఁజేర్చి సూరి సంధిపరిచ్ఛేదమని వ్యవహరించెను కావున సంధిపరిచ్ఛేదమనఁగా వర్ణద్వయమేళనమున నగు వ్యాకరణ కార్యములను దెలుపు గ్రంథభాగమని గ్రహింపనగును వర్ణద్వయ మేళనమున నగు నితర వ్యాకరణ కార్యములను సంధులనుట యౌపచారికము "హరియతఁడు, నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకారవకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావని యెఱుంగునది" (సంజ్ఞా 17) అని సూరిగారు యడాగమమును, గసడదవాదేశమును సంధి శబ్దముతో వ్యవహరించుట యౌపచారికము (11) ఋకారము పరమగునపుడు సంధిలేదు (ప్రకీర్ణక॥)

పదసార్థక్యము - ఉత్తునకు - అనుటచే, హ్రస్వమయిన ఉ కారమునకే సంధి నిత్యము, దీర్ఘమగు ఊకారమునకుఁ బ్లుతమగు ఊ౩ కారమునకు సంధిరాదు "ఉత ఇతి తపరకరణం కిమ్ ఎట్టూయంటివి" అని సూరిచిత్తు కాగితముపై వ్రాసికొన్న వివరణము శంభూ౩ + ఇమ్ము = శంభూ౩ యిమ్ము ఇట్లు తపరకరణము సార్థకము

## ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును. 2

| | | |
|---|---|---|
| నన్నున్ | అడిగె | నన్నడిగె, నన్నునడిగె |
| నాకొఱకున్ | ఇచ్చె | నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె |
| నాకున్ | ఆదరువు | నాకాదరువు, నాకునాదరువు |
| నాయందున్ | ఆశ | నాయందాశ, నాయందునాశ |
| ఇందున్ | ఉన్నాఁడు | ఇందున్నాఁడు, ఇందునున్నాఁడు |
| ఎందున్ | ఉంటివి | ఎందుంటివి, ఎందునుంటివి |
| వచ్చుచున్ | ఉండెను | వచ్చుచుండెను, వచ్చుచునుండెను. |
| చూచుచున్ | ఏగెను | చూచుచేగెను. చూచుచునేగెను |

వ్యా ప్రథమేతర విభక్తులందున్న ఉకారమునకు, శత్రర్థ చువర్ణము నందున్న ఉకారమునకు సంధి వైకల్పికముగా నగును ప్రథమేతర విభక్తు లందున్న ఉకారమునకు - అనఁగా ద్వితీయాదులందున్న ఉకారమునకని యర్థము నన్నున్ + అడిగె, నన్నున్ - ఇందలి 'న్ను' లోని ఉకారము ద్వితీయా విభక్తి ఉకారము కావున సంధి జరుగునపుడు విధాన సామర్థ్యముచే ద్రుతములోపించి, నన్ను + అడిగె = నన్నడిగె - అగును సంధి జరుగనిచో, నన్నున్ + అడిగె = నన్నునడిగె - అగును సంధి జరుగనిచో, ద్రుతము పరస్వరముతోఁ గలసిపోవునని గ్రహింపవలెను ఇట్లే కొఱకున్ (చతుర్థి), కున్ (షష్ఠి), అందున్ (సప్తమి) అను విభక్తులయందలి ఉకారమునకు సంధి వైకల్పికముగా నగును

అందు వర్ణకము అందు - అనుదేశ్యపదమునకుపలక్షణము అందు అనునది ఇందు, ఎందులను గ్రహించును కావున అందు ప్రత్యయమునకు విధించిన కార్యములు వీని కగును (చూ 44 సూ) ఇందున్ + ఉన్నాఁడు = ఇందున్నాఁడు - సంధియయిన రూపము ఇందునున్నాఁడు - సంధి కానిరూపము ఇట్లే, ఎందున్ + ఉంటివి = ఎందుంటివి, ఎందునుంటివి శత్రర్థ చువర్ణకము నందలి ఉకారమునకు - వచ్చుచున్ + ఉండెను = వచ్చుచు + ఉండెను వచ్చుచుండెను - సంధి యయిన రూపము వచ్చుచున్ + ఉండెను = వచ్చుచు నుండెను - సంధి కానిరూపము ఇట్లే చూచుచున్ + ఏగెను = చూచుచేగెను - సంధియయిన రూపము చూచుచునేగెను - సంధికాని రూపము

విశే - (1) "విధానసామర్థ్యాద్ ద్రుతస్యలోపః, నన్నడిగె, నన్నునడిగె" అని సూరి చిత్తు కాగితముపై వ్రాసికొన్న వివరణము (11) అచ్చువరమగుచో ద్రుతస్వరము లోపించునని, నన్నున్ + అడిగె - ఇత్యాదిగా లక్ష్యములను జూపుటచే గ్రహింపవలెను నన్నును + అడిగె = నన్నున్ + అడిగె (111) నన్నున్ - అనుచో "న్ను" లోని, ఉకారము విభక్తి ఉకారమెట్లగును? అన్నది ప్రశ్న కొందఱు న్ను - మ్ములు విభక్తి కాదేశములయ్యెననుట సూరి యభిప్రాయమని సెలవిచ్చినారు ఈపక్షమున నన్ను, మమ్ము - అన్నంత వఱకే రూపసిద్ధి జరుగును బాలవ్యాకరణమున, "తృతీయాదులకు నుగాగమంబగు" (తత్సమ-8) నని సూత్రింపబడెను ద్వితీయకు నుగాగమము రాదు కావున, న్ను — మ్ములు, విభక్తికి ముందాగమములయినట్లు ప్రక్రియ నూహించుకొనవలెను (అచ్చిక 24 వ్యాఖ్య) కొందఱిటఁ జింతామణిమతమున, న్ను - మ్ములాదేశములే యని చర్చించినారు ఆ చర్చ యిట నవావశ్యకమగుటచేఁ ద్యాజ్యము (1V) ఇందున్, ఎందున్ — అనునవి విడిగా నుండుట విశేషమని కొందరు సెలవిచ్చిరి కాని యివి పదములగుటచే విడిగానే యుండును విశేషమేమనఁగా, నాయందున్ - అనుచోటి 'అందు' విభక్తి, అందు శబ్దమునకుపలక్షణము, అందున్ + ఉన్నాఁడు = అందున్నాఁడు, అందునున్నాఁడు

పదసార్థక్యము - (1) ప్రథమేతర - అనుటచేఁ బ్రథమావిభక్తి, ఉకారము దీనికి లక్ష్యముకాదు 1వ సూత్రమునకే లక్ష్యమగును "అప్రథమాయాః కిమ్-రాముఁడతఁడు" అని సూరి చిత్తుకాగితముపై వ్రాసికొన్న వివరణము (11) విభక్తి - అనుటచే, విభక్తికాని ఉకారమునకీవిధి వర్తింపదు రామున్ + అడిగె = రామునడిగె ఇట, ము - లోని ఉకారము విభక్తి ఉకారముకాదు, గాన నీసూత్రమునకుఁ బ్రసక్తిలేదు సూ॥ 9చే రాము నడిగె (రామడిగె-కాదు)

## సంధి లేనిచోటఁ స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. 3

ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు

| | | |
|---|---|---|
| మా | అమ్మ | మాయమ్మ |
| మీ | ఇల్లు | మీయిల్లు |
| మా | ఊరు | మాయూరు |

వ్యా సంధి లేనిచోట, నచ్చుకంటెఁ బరమయిన యచ్చునకు ముందు, యకారమాగమమగునని సూత్రార్థము స్వరము = అచ్చు, యట్ + ఆగమ=

యడాగమము 'య' యని అకారముచ్చారణమునకుఁ జేర్పఁబడినది 'య్' అనునదే యాగమమగును ఆగమము = వర్ణాధిక్యము అనఁగా నొక వర్ణ మదనముగా వచ్చిచేరుట "మిత్రవదాగమః" అని లక్షణము ఆగమము మిత్రుని వంటిది కావున నొకవర్ణము, మిత్రునివలెఁ బ్రక్కకు వచ్చి చేరుట యాగమమని తాత్పర్యము టకారమును జేర్చి నిర్దేశించిన యాగమ ముద్దిష్టమునకు, అనఁగా, దేనికి కాగమముగ విధింపఁబడినదో దానికి, ముందుచేరును, కకారమును జేర్చి నిర్దేశించిన యాగమ ముద్దిష్టమునకుఁ జివరఁ జేరును — అని పాణినీయము "ఆద్యంతౌటకితౌ" మా + అమ్మ మా - లోని, 'ఆ' పూర్వస్వరము అమ్మ- లోని 'అ' కారము, స్వరముకంటెఁ బరమయిన స్వరము కావున దీనికి ముందు "య్" అనునది, యాగమమగును మా-య్ + అమ్మ = మాయమ్మ - ఇట్లే, మీ + ఇల్లు-మీ-య్ + ఇల్లు మీయిల్లు, మా + ఊరు = మా-య్ + ఊరు మాయూరు

విశే - (1) సూరి, "యట్' కిమ్? అయ్యమరులు - అని వివరణము వ్రాసికొని యున్నారు టిత్త్వఫలమునకు - చూ సమాస 14 సూ - విశే (11) "మా + యొక్క + అమ్మ + ము-' -ఇత్యాదు లలౌకిక విగ్రహములు

## అత్తునకు సంధి బహుళముగా నగు. 4

| | | |
|---|---|---|
| మేన | అల్లుఁడు | మేనల్లుఁడు, మేనయల్లుఁడు. |
| పుట్టిన | ఇల్లు | పుట్టినిల్లు, పుట్టినయిల్లు |
| చూడక | ఉండెను | చూడకుండెను, చూడకయుండెను |

బహుళగ్రహణముచేత స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు

| | | |
|---|---|---|
| అమ్మ | ఇచ్చెను | అమ్మయిచ్చెను |
| దూత | ఇతఁడు | దూతయితఁడు |
| చెలువుఁడ | ఇందము | చెలువుఁడయిందము |

సంస్కృతీయంబునకు సంధియగునని యథర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు ఆధునిక కృతులందొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడి గంగనుకాసె, నెలఁతిచ్చెను,

వెలయాల్యాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది.

వ్యా॥ హ్రస్వమయిన అకారమునకు, సంధి బహుళముగా నగును అత్తు= హ్రస్వమయిన అకారము సంధి = పూర్వపరస్వరములకుఁ బరస్వర మేకాదేశ మగుట బహుళము = బహ్వర్థములను గ్రహించునది (బహూన్ అర్థాన్ లాతి) ఈ యర్థములు నాలుగు విధములు "క్వచిత్ ప్రవృత్తిః, క్వచిదప్రవృత్తిః, క్వచిద్విభాషాక్వచిదన్యదేవ, విధేర్విధానం బహుధాసమీక్ష్య, చతుర్విధం బాహుళకం వదంతి" -కాశిక

(2) ప్రవృత్తి = విధించిన వ్యాకరణకార్యము నిత్యముగాఁ బ్రవర్తించుట దీని కుదాహరణమిటఁ జూపఁబడలేదు, ఉదా॥ వండుచున్న + వాఁడు క్రియా 117చే-వకారము లోపించినచో వండుచున్న + ఆఁడు-అగును ఈ సూత్రమున బహుళముగానగు ననుటచే నిట సంధి నిత్యముగా జరుగును వండుచున్న + ఆఁడు = వండుచున్నాఁడు

(2) అప్రవృత్తి = విధించిన వ్యాకరణకార్యము ప్రవర్తింపకపోవుట. బహుళ గ్రహణముచే స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధిలేదు (1) స్త్రీ వాచకమునకు అమ్మ + ఇచ్చెను ఇట అమ్మ శబ్దము స్త్రీ వాచకము= స్త్రీని బోధించు శబ్దము కాన నిందలి, అత్తునకు సంధిలేదు 3-చే యడాగమ మగును అమ్మ-య్ + ఇచ్చెను = అమ్మయిచ్చెను (11) తత్సమమునకు - దూత + ఇతఁడు దూత-తత్సమము కావున సంధిలేదు, 3చే యడాగమమ్ము దూత-య్ + ఇతఁడు = దూతయితఁడు (111) సంబోధనాంతమునకు - చెలువుఁడ + ఇందము చెలువుఁడ - సంబోధనాంతము (ఓ చెలువుఁడ!) కాన సంధిలేదు 3చే - యడాగమము చెలువుఁడ - య్ + ఇందము = చెలువుఁడయిందము వెలయాల్యాదుల సంధిలేమి బాహుళకముచేతనే యని యూహించునది వెల + ఆలు - మొదలగు వానియందు బహుళముగ నగు ననుటచే సంధిలేదు వెల + ఆలు సంధిలేదుగాన 3చే-యడాగమము వెల-య్ + ఆలు = వెలయాలు

(3) విభాష - విధించిన వ్యాకరణకార్య మొకపక్షమున జరుగుట, యొక పక్షమున జరుగక పోవుట ఉదా మేన + అల్లుడు = మేనల్లుఁడు - సంధి జరిగిన రూపము, సంధిలేనప్పుడు, 3చే-యడాగమము మేన-య్ + అల్లుఁడు= మేనయల్లుఁడు ఇట్లే పుట్టిన + ఇల్లు = పుట్టినిల్లు, చూడక + ఉండెను = చూడకుండెను, చూడకయుండెను,

4. అన్యకార్య ప్రవృత్తి = వేఱొక వ్యాకరణ కార్యము జరుగుట ఈ అత్త్వ సంధి సూత్రమున నీ ప్రయోజనమునకుఁ బ్రసక్తిలేదు

సంస్కృతీయము = సంస్కృతమునకు సంబంధించినది అనఁగా సంస్కృతసమమని తాత్పర్యము సంస్కృతసమములయందలి యత్తునకు సంధి యరుదుగా నగునని యథర్వణాచార్యులు చెప్పినారు కాని భారతాది ప్రాచీనకావ్యములలోఁ బ్రయోగము మృగ్యము మృగ్యము = వెదకఁదగినది కనఁబడలేదన్న మాట ఆముక్తమాల్యదాదులగు నర్వాచీన కావ్యములలో స్త్రీవాచకములకుఁ దత్సమములకుఁ నరుదుగా సంధికనఁబడును తత్సమమునకు - (=సంస్కృతీయము) గంగ — అను, కానె = (గంగయనెడి కానె) గంగను కానె గంగ = సంస్కృతసమము (తత్సమము) కానీ నిది సంస్కృతీయమున కుదాహరణము స్త్రీ వాచకమునకు - నెలఁత + ఇచ్చెను = నెలఁతిచ్చెను నెలఁత = స్త్రీవాచకము

విశే - (1) పూర్వకావ్యంబులు = భారతాది ప్రాచీన కావ్యములు ఆధునిక కృతులు = ఆముక్తమాల్యదాదులగు, నర్వాచీన కావ్యములు కొంద ఱథర్వణునకుఁ బూర్వకావ్యంబులయందనియు, అథర్వణున కనంతర కాలిక కృతులందనియు నర్థమని సెలవిచ్చినారు కాని యీయర్థ నిర్ణయము కృత్రిమము (II) "క్వచిత్ చిత్సంస్కృతీయోపి ప్రాజ్ఞో వ్యత్యయ పేచ్ఛ్యతి' అని యథర్వణ కారిక సంస్కృతీయములందును, నొకానొకచో, నచ్చు చ్యుతమగునని దీని యర్థము సంస్కృతీయమున కొక్కానొకచో సంధియగునని తాత్పర్యము (III) వెలయాలు + అది = వెలయాల్వది వ్యాకరణమునఁ దెనుఁగు శబ్దములను సంస్కృతముగ ననుకరించుట పరిపాటి కావున నిట యణాదేశ సంధి జరిగినది ఇట్టే, తక్కినచోట్ల, గ్రాహ్యము (IV) గంగను కానె ఆముక్త 2-9

పదసార్థక్యము - అత్తునకు - అనుటచే, దీర్ఘమగు అకారమునకు సంధి లేదు మా + అమ్మ = మాయమ్మ అహా + అనె = అహాయనె మొ॥

పారపరిశీలన - అథర్వణ - ముద్రణస్ఖాలిత్యము కావచ్చును చూ తత్సమ 75

## ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు. 5

ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి

ఇది యాకృతి గణంబు

| | | |
|---|---|---|
| ఏమి | అంటివి | ఏమంటివి, ఏమియంటివి |
| మఱి | ఏమి | మఱేమి, మఱియేమి. |
| హరికిన్ | ఇచ్చె | హరికిచ్చె, హరికినిచ్చె. |

వ్యా ఏమి మొదలగువాని యిత్తునకు సంధి వైకల్పికముగ నగును ఇత్తు=హ్రస్వమగు, ఇకారము (చూ 1) వైకల్పికము = విధించిన కార్య మొక పక్షమున నగుట, యొకపక్షమునఁ గాకుండుట ఏమి + అంటివి = ఏమంటివి= సంధి యయిన రూపము సంధికానిచో, 3చే-ఏమి-య్ + అంటివి = ఏమి యంటివి మఱి + ఏమి = మఱేమి 3చే-మఱి + య్ + ఏమి = మఱి యేమి కళయయినచో సంధిలేనియెడల యడాగమమగును ఏమి, మఱి-కళలు గనుక యడాగమ మయినది హరికిన్ + ఇచ్చె సంధి యగునపుడు ద్రుతము లోపించి హరికి + ఇచ్చె = హరికిచ్చె - అగును సంధి లేనప్పుడు హరికిన్+ ఇచ్చె – ద్రుతము పరాచ్చుతోఁ గలిసి – హరికినిచ్చె – అగును ద్రుతప్రకృతి కమునకు సంధిలేనప్పుడు పొల్లునకారము పరాచ్చుతోఁ గలియును, హరికిన్ = ద్రుత ప్రకృతికముగానఁ బొల్లు నకారము పరాచ్చుతోఁ గలిసినది

ఏమ్యాదులు - ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇది యాకృతిగణంబు కిషష్ఠి-షష్ఠీ విభక్తి ప్రత్యయమగు 'కి' ఆకృతి గణము= సమానాకృతిగల శబ్దములను బ్రయోగాను సారముగఁ జేర్చుకొనఁదగిన గణ మాకృతి గ. ము

ఏమ్యాదులలో 'కి' షష్ఠిని బఠించిన సామర్థ్యమున (వ్యా సం స 213 పు) నింకాది విధి (9సూ) ప్రవర్తిల్లదు సంధి వైకల్పికముగా నగును హరికిచ్చె, హరికినిచ్చె

పదసార్థక్యము - ఇత్తునకు అనుటచే దీర్ఘ మయిన ఇకారమున కీవిధి వర్తింపదు ఏమి + అనియె = ఏమియనియె మీ + ఇల్లు = మీయిల్లు మొ॥

## క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు. 6

వచ్చిరి - . అప్పుడు వచ్చిరప్పుడు, వచ్చిరి యప్పుడు,
వచ్చితిమి ఇప్పుడు వచ్చితిమిప్పుడు, వచ్చితిమి యిప్పుడు

వ్యా క్రియాపదములలో హ్రస్వమయిన ఇకారమునకు సంధి వైకల్పి కముగా నగును వైకల్పికము = విధించిన వ్యాకరణకార్య మొకపక్షమున జరుగుట, యొక పక్షమున జరుగకపోవుట ఉదా॥ వచ్చిరి + అప్పుడు = వచ్చిరప్పుడు - సంధియైన రూపము సంధిలేనిచో, 3చే-వచ్చిరి-య్+అప్పుడు= వచ్చిరియప్పుడు – అగును వచ్చితిమి + ఇప్పుడు = వచ్చితిమిప్పుడు=సంధి యైన రూపము సంధిలేనిచో, 3చే వచ్చితిమి-య్ + ఇప్పుడు = వచ్చితిమి

యిప్పుడు వచ్చిరి - ప్రథమ పురుషబహువచనము వచ్చితిమి - ఉత్తమపురుష బహువచనము వీని యిత్తునకే సంధివైకల్పికము క్రియాపదములు = ధాతువులకుఁ ప్రథమపురుష క్రియా ప్రత్యయములుచేరి యేర్పడు పదములు ప్రథమ పురుషక్రియలు ధాతువులకు మధ్యమ పురుషక్రియా ప్రత్యయములు చేరి యేర్పడు పదములు మధ్యమ పురుషక్రియలు ధాతువుల కుత్తమపురుషక్రియా ప్రత్యయములు చేరియేర్పడు పదము లుత్తమ పురుషక్రియలు (క్రియా 11)

విశే - వచ్చితిని - అను క్రియలోఁ జివర ఇకారముగలదు కాని, వచ్చితిని + ఇపుడు — అనుచో నచ్చుపరమగునపుడు ద్రుతమునందలి యచ్చు లోపించుట బాలవ్యాకరణ పద్ధతి కావున వచ్చితిని + ఇపుడు = వచ్చితిన్ + ఇపుడు-అగును 9చే - సంధిలేదు గనుక ద్రుతము పరాచ్చుతోఁ గలిసి-వచ్చితి నిపుడు - అను రూపమేర్పడును

## మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును. 7

| | | |
|---|---|---|
| ఏలితివి | అపుడు | ఏలితివపుడు |
| ఏలితి | ఇపుడు | ఏలితిపుడు |
| ఏలితిరి | ఇపుడు | - ఏలితిరిపుడు |

వ్యా మధ్యమపురుష క్రియలందు హ్రస్వమయిన, ఇకారమునకు సంధి నిత్యము మధ్యమపురుషక్రియలు = చూ—సంధి 6, క్రియా 11 ఏలితివి + అపుడు = ఏలితివపుడు ఏలితి + ఇపుడు = ఏలితిపుడు ఏలితివి—దీనిలో, క్రియా 24చే వకారము లోపించిన, ఏలితి + ఇ 11చే—సంధిజరిగి, ఏలితి-అగును ఏలితివి, ఏలితి - మధ్యమ పురుషైకవచనములు ఏలితిరి + ఇపుడు = ఏలితిరిపుడు

## క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు. 8

వచ్చి.. ఇచ్చెను : వచ్చియిచ్చెను

వ్యా క్త్వార్థమగు ఇత్తునకు సంధిలేదు ఇత్తు=హ్రస్వమయిన, ఇకారము క్త్వార్థము = ఏకాశ్రయంబులగు క్రియల లోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగు ధాతువున కివర్ణకంబగు ఇదియె క్త్వార్థంబు నాఁబడు (క్రియా 38) ఏకవ్యక్తికిఁ జెందిన క్రియలలోఁ బూర్వకాలమున నగు క్రియను దెలుపు ధాతువునకుఁ జేరు ఇ ప్రత్యయమును క్త్వార్థకమని యందురు ఉదా॥ వచ్చి యిచ్చెను ఇట, వచ్చుట, యిచ్చుట యని రెండుక్రియలు (=పనులు) కలవు ఈరెంటిలో వచ్చుట పూర్వకాలమున నయిన క్రియ ఈరెండు క్రియలు నేకవ్యక్తి

నాశ్రయించినవే ఏలయన వచ్చినవాఁడు, నిచ్చినవాఁడు నొక్కఁడే కాన, వచ్చు + ఇ = వచ్చి - అయినది వచ్చి - లోనిది క్త్వార్థమగు ఇకారము దీనికి సంధిలేదు కనుక 3చే — యడాగమము వచ్చి - య్ + ఇచ్చెను = వచ్చియిచ్చెను

విశే - క్త్వార్థమ గు ఇత్తునకు సంధిలేదని యథర్వణాచార్యులు చెప్పినారు "క్త్వార్థేతో నభవేత్సదా" - విశ్ర భారతమున క్త్వార్థకసంధి లేదు కాన సూరి క్త్వార్థమగు ఇత్తునకిందు సంధి నంగీకరింపలేదు (క్వాపి సవర్ణే దృశ్యతే- సూత్రాం )

**ఇఁకాదులకుఁ దప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు. 9**

**ప్రథమేతర విభక్తి విధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.**

| | | |
|---|---|---|
| వచ్చున్ | ఇపుడు | వచ్చునిపుడు. |
| చూడన్ | అయితి | చూడనయితి |
| ఉండెడిన్ | అతఁడు | ఉండెడినతఁడు |

ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని ఈయవి యిఁకాదులని యెఱుంగునది పీనికి సంధి వైకల్పికము

వ్యా ఇఁక — మొదలగు వానికిఁ దప్ప తక్కిన ద్రుత ప్రకృతికములకు సంధిలేదు ఇఁకాదులు = ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని ఈ నాలుగు నిఁకాదులు పీనికి సంధి వైకల్పికము ఉదా॥ ఇఁకన్ + ఏల = ఇఁకేల, ఇఁకనేల ఇత్యాది తక్కిన ద్రుత ప్రకృతికములకు సందిలేదు ఉదా॥ వచ్చున్ + ఇపుడు = వచ్చునిపుడు వచ్చున్ - అనునది ఇఁకాదులలోనిది కాదు గనుక దీనికి సంధిలేదు కావునఁబొల్లు నకారము పరాచ్చుతోఁగలిసి వచ్చునిపుడు - అయినది ఇట్లే, చూడన్ + అయితి = చూడనయితి ఉండెడిన్ + అతఁడు = ఉండెడినతఁడు - అను రూపములగును

ప్రథమేతర విభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని దీనికి వివరణము - ప్రథమేతర విభక్తి విధి యనఁగా — ప్రథమేతరవిభక్తి శత్రర్థ చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును - సూత్రము (2సూ ) ఇది నిరవకాశము = అవకాశములేనిది ఈ యిఁకాదివిధి (9 సూ ) ప్రవర్తించినచో నుండుట కవకాశము లేనిదన్నమాట నిరవకాశ మెట్లనగా - నన్నున్, కొఱకున్, కున్, అందున్, ఇందున్, ఎందున్, శత్రర్థకమగు, చున్ — అనువానికి ప్రథమేతర విభక్తి సంధివైకల్పికముగ నగును ఇవన్నియు ద్రుత ప్రకృతికములు నన్నున్ - మొదలగునవి, ఇఁకాదులలోనివి కావు (ఇఁక ఇఁగ,

ఎట్టకేలకు ఎట్టకేని - అను నాలుగు మాత్రమే యి(కాదులు) కావున వీనికి, ఇ(కాది విధిచే సంధిని నిషేధించినచోఁ బ్రథమేతర విభక్తి విధి కుదాహర ణములే యుండవు కానఁ బ్రథమేతర విభక్తివిధి నిరవకాశము ఇ(కాది విధి (ఈ_9సూ) సావకాశము = అవకాశముతోఁ గూడుకొనినది అనఁగాఁ బ్రథ మేతర విభక్తి విధికిఁగల యుదాహరణముల యెడఁ బ్రవర్తింపక పోయినను వేఱుదాహరణములు దీనికిఁ గలవని తాత్పర్యము ఇది సావకాశమెట్లనఁగా - ప్రథమేతర విభక్తి విధికి, నన్నున్ + అడిగె - మొదలగునవి యుదాహర ణములు వీనిపైఁ బ్రవర్తింపకపోయినను నీ ఇ(కాది సూత్రము వ్యర్థము కాదు ఇది యుండవలసిన సూత్రమే ఏలయన, వచ్చున్ + ఇపుడు, చూడన్ + అయితి, ఉండెడిన్ + అత(డు – మున్నగుచోట్ల సంధిలేదని చెప్పుటకు, ఇ(కాది విధి యుండక తప్పదు ఇట్లు ప్రథమేతర విభక్తి విధి కిచ్చిన యుదా హరణముల యెడ దీనికిఁ బ్రవృత్తి లేకపోయినను, నిది యుండుట కవకాశము కలదు కాన నీ యి(కాది విధి సావకాశము నిరవకాశములగు విధులు సావకాశ ములగు విధులను బాధించును – అని పరిభాష ("నిరవకాశాహి విధయః సావకాశాన్ విధీన్ బాధంతే) కావున నిరవకాశమగు ప్రథమేతరవిభక్తి విధి, సావకాశమగు ఇ(కాది విధిని బాధించును అప్పుడు, నన్నున్ + అడిగె = నన్నడిగె, నన్నునడిగె - ఇత్యాదిగా వైకల్పిక సంధులు జరుగును

విశే - (1) పై పరిభాష యహోబల పండితీయమునఁగలదు యేన నాప్రాప్తేయో విధి రారభ్యతే స తస్య బాధకోఽభవతి" (పరిభా) అను పరిభాష కిది సరిపడును సూరి యహోబలుననుసరించెను (11) ఇ(క ఇ(గ, ఎట్టకేలకు, ఎట్టకేని – అనువానికిని, (9) నన్నున్, మమ్మున్, నిన్నున్, మిమ్మున్, తన్నున్, తమ్మున్ - అనువానిలోని న్ను, మ్ములకు, కొఱకున్, కున్, అందున్, ఇందున్, ఎందున్, శత్రర్థకమగు - చున్ - అను వానికిని, (2) కిషష్ఠికిని (5) సంధివైకల్పికము తక్కిన ద్రుతప్రకృతికములకు సంధిలేదు (111) ఎట్టకున్ + ఏని = ఎట్టకేని, ఎట్టకునేని ఎట్టకేలకున్ + అనియె ఎట్టకేలకనియె, ఎట్టకేలకు ననియె ఎట్టకున్ + ఏలకున్ = ఎట్టకేలకున్, ఎట్టకునేలకున్ – అనియుఁ గావచ్చును, ఎట్టకున్ - అనుదానికిని, ఏలకున్- అనుదానికిని విడిగాఁ బ్రయోగములులేవు (1V) వచ్చును + ఇపుడు - అచ్చు పరమగుచో ద్రుతస్వరము లోపించునని వ్యాఖ్యానింపవలెను లేనిచో, వచ్చున్ + ఇపుడు - అను పదచ్ఛేద మేర్పడదు వచ్చును + ఇపుడు - ఉత్త్వసంధికి లక్ష్యమును గానేరదు (1V) కిషష్ఠి (5) నిరవకాశమనుట పొరపాటు నిరవ కాశత, సూత్రములకే కాని లక్ష్యములకుఁగాదు

## అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు 10.

ద్విరుక్తము యొక్క పరరూప మామ్రేడితమనంబడు. తఱుచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పిక సంధియుం గలదని తాత్పర్యము

| | | |
|---|---|---|
| ఔర | ఔర | ఔరౌర |
| అహో | అహో | అహోహో |
| ఎట్టూ | ఎట్టూ | ఎట్టెట్టూ |
| ఓహో | ఓహో | ఓహోహో |
| ఏమి | ఏమి | ఏమేమి, ఏమియేమి |

ఏగియేగి యనుచో క్త్వార్థంబగుట సంధి లేదు

వ్యా అచ్చునకామ్రేడితము పరమయినపుడు సంధి తఱుచుగానగును ఆమ్రేడితము = ద్విరుక్తముయొక్క పరరూపము ద్విస్ + ఉక్త=ద్విరుక్తము= రెండుసార్లు పలుకఁబడునది ఒకటే శబ్దము రెండుసార్లు పలుకఁబడునప్పుడందలి పరరూప మామ్రేడితమనఁబడును (ద్విరుక్తస్య పరరూప మామ్రేడిత సంజ్ఞం స్యాత్ - సి కౌ) ఉదా॥ ఔర + ఔర ఇట 'ఔర' శబ్దము రెండుసార్లు పలుకఁబడినది దీనిలోఁ బరరూపము, రెండవ "ఔర" అనునది కాన రెండవ 'ఔర' ఆమ్రేడితము ఔర + ఔర ఇట నామ్రేడితము పరమ్మయి యున్నది కాన సంధి తఱుచుగనగును ఔరౌర ఇట్లె తక్కినవి తఱుచుగ నగు - అనుటచే నామ్రేడితము పరమగుచో నరుదుగ వైకల్పికసంధియు నగును ఉదా॥ ఏమి + ఏమి = ఏమేమి — సంధియయిన రూపము సంధిలేనిచో, 3చే - ఏమి — య్ + ఏమి = ఏమియేమి - అగును (కళా 4-93, ప్రబావ 4.45)

"తఱుచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పిక సంధియుం గలదని తాత్పర్యము" తఱుచుగన్ - అనుటచే, నరుదుగా వైకల్పిక సంధియున్ = వైకల్పిక సంధిగూడ - అనఁగా నరుదుగా సంధి కాకపోవుటయేకాక, వైకల్పిక సంధిగూడ నగునని తాత్పర్యము అరుదుగా సంధి కాకపోవుటకు — ఏగియేగి యనుచో క్త్వార్థంబగుట సంధిలేదు ఏగి + ఏగి 3చే - ఏగియేగి ఇట్లే, ఎట్టు + ఎదురు = ఎట్టయెదురు (40) అరుదుగా వైకల్పిక సంధి యగుటకు — ఏమి + ఏమి = ఏమేమి 3చే - ఏమియేమి

విశే - ఔర+ఔర—అనుచో 4 వ సూత్రము, ఏమి+ఏమి - అనుచో 5 వ, సూత్రము వర్తింపదు

పదసార్థక్యము - అచ్చునకు అని సామాన్యముగ ననుటచే నేయచ్చున కయిన న్రామ్రేడితము పరమగునో సంధి తఱుచుగ నగును దీర్ఘమునకు సంధియగుట యిట విశేషము

పారపరిశీలన - ఏగియేగి యనుచో గ్ర్యార్థంబగుట—అను ముద్రణములు సరికావు ఏగియేగియనుచో క్త్వార్థంబగుట— అను ముద్రణమే యొప్పు

## అంద్వవగాగమంబులందప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు. 11

| | | |
|---|---|---|
| మూఁర | ఎఁడు | మూఁరెఁడు |
| వీసె | ఎఁడు | వీసెఁడు |
| అర్థ | ఇంచు | అర్థించు |
| నిర్జి | ఇంచు | నిర్జించు |

అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథా సంభవముగా గ్రహించునది రాములందు, రాములయందు, హరియందు, ఎనిమిదవది, ఎనిమిదియవది

వ్యా అచ్చునకు, అందు ప్రత్యయము, అవగాగమము - అనునవి పరమయినప్పుడు తప్ప - తక్కిన యపదముల తొలిస్వరము పరమయినప్పుడు, సంధి నిత్యముగా నగును అపదము = పదముకానిది పదము=విభక్తి చేరినది ఉదా॥ రామ - శబ్దము రాముఁడు-పదము స్వతంత్రముగ వాడుటకు యోగ్యత గలది పదము అట్లు స్వతంత్రముగ వాడుటకు యోగ్యతలేనిది, యపదము ప్రత్యయములు, నాగమములు మొదలగునవి యపదములు మూఁర+ఎఁడు, వీసె+ఎఁడు — ఇట, ఎఁడు— అనునది పరిమాణమును దెలుపు ప్రత్యయము కాన, నపదను అర్థ+ఇంచు, నిర్జి+ఇంచు - వీనిలో ఇంచు అనునది, యాగమ మగుటచే నపదము

అందు+అవక్+అగమ = అంద్వవగాగమము, అందు ప్రత్యయము పరమగునపుడును అవగాగమము పరమగునప్పుడును ప్రయోగానుసారముగ గ్రహింపవలెను రాము ల + అందు = రాములంద— సంధి జరిగిన రూపము సంధికానిచో యడాగమము రాము-ల + య్ + అందు = రాములయందు.

ఇట సంధి వైకల్పికముగ నయినది హరి + అందు సంధిలేదు గనుక, 3చే యడాగమము హరి-య్ + అందు = హరియందు ఎనిమిది+అవది=ఎనిమిదవది సంధి కానిచో 3చే - ఎనిమిది-య్ + అవది = ఎనిమిదియవది ఇట సంధి వైకల్పికము ఎఁడు తద్ధిత ప్రత్యయము - తద్ధిత 25 ఇంచు-ఆగమము క్రియా 63 అవ-అగమము - అచ్చిక 25

విశే - (1) ఈ అవదాది స్వరసంధిలోఁ బూర్వశబ్దము, పదముగాని యపదముగాని కావచ్చును పరశబ్ద మపదమే కావలెను, ఉదా॥ మూర+ఎఁడు= మూరెఁడు మూర-పదము ఎఁడు-అపదము నిర్ + జి + ఇంచు = నిర్జించు ఇట జి - ధాతువుగనుక, నపదము ఇంచు అగమము గనుక, నపదము రాములందు, రాములయందు - రామ ప్రాతిపదికము తత్సమ 21చే-రాము తత్సమ 7చే - రాము+అందు తత్సమ 31చే - రాము-ల+అందు ల - ఆగమముగనుక, నపదము అందు - ప్రత్యయము గనుక, నపదము సంధి జరిగినచో - రాములందు, జరుగనిచో, 3 చే - రాము-ల+య్+అందు = రాములయందు (ii) సుప్తిజంతంపదమ్ - పాణి "అపదం న్రవయుంజీత"

**కుఱు చిఱు కడు నడు నిడు శబ్దముల అడల కచ్చుపరం బగునపుడు ద్విరుక్త టకారంబగు. 12**

| | | |
|---|---|---|
| కుఱు | ఉసురు | కుట్టుసురు |
| చిఱు | ఎలుక | చిట్టెలుక |
| కడు | ఎదురు | కట్టెదురు |
| నడు | ఇల్లు | నట్టిల్లు |
| నిడు | ఊరుపు | నిట్టూరుపు |

వ్యా కుఱు-చిఱు-కడు-నడు-నిడు శబ్దముల అడల కచ్చు పరమగు నపుడు ద్విరుక్తటకారమగును ద్విరుక్తటకారము = ట్ట్ - అనునది ద్విస్ = రెండుసార్లు, ఉక్త = పలుకఁబడిన, టకారము, ద్విరుక్తటకార మగును. ఉదా॥ కుఱు + ఉసురు = కుఱ్+ఉ+ఉసురు ఈ 12 చే - అకారమునకు (ట్) ద్విరుక్తటకారమాదేశమగును కుట్ట్ + ఉ + ఉసురు = కుట్టు + ఉసురు 1 చే - ఉత్త్వసంధి జరిగి, కుట్టుసుదు - అని యేర్పడును ఇట్లే చిఱు + ఎలుక = చిట్టు + ఎలుక చిట్టెలుక కడు + ఎదురు = కట్టు + ఎదురు, కట్టెదురు నడు + ఇల్లు = నట్టు + ఇల్లు నట్టిల్లు నిడు + ఊరుపు = నిట్టు + ఊరుపు నిట్టూరుపు

విశే - (I) "కుఋచ+ము" + "ఉసురు+వు" ఇత్యాదు లలౌకిక విగ్రహములు సమాస 25 చే - కుఋచ + ఉసురు, చిఋత + ఎలుక, నడుము + ఇల్లు, నిడుద + ఊరుపు. సమాస 20 చె - తుది యక్షరములు లోపించి కుఋ+ఉసురు, చిఋ+ఎలుక, నడు+ఇల్లు, నిడు+ఊరుపు - అని నిల్చును తుది యక్షర లోపము నిర్దేశానుసారమయ్యె ననరాదు (II) కుఋ+ ఉసురు ఇట ఉత్త్వ సంధిని, 28చే గావలసిన టుగాగమమును, నీ ద్విరుక్త టకారము విశేష విహిత మగుటచే బాధించును కావున, కుట్టు+ఉసురు - అగును ఇప్పుడు టుగాగమమేల రాదు? అను ప్రశ్న కలుగును ఈ 12 వ సూత్రము స్వరసంధి సందర్భమున నుండుటచే, ఉత్త్వసంధి శీఘ్రముగ నుపస్థిత మగును కావున ఉత్త్వసంధి 'అంతరంగ'మని సూరి యభిప్రాయము కావలెను టుగాగమమును విధించు 28 సూత్రము పర సూత్రము "పూర్వ పరనిత్యాంత రంగాపవాదానా ముత్తరోత్తరం బలీయః" అని పరిభాష పూర్వశాస్త్రము కంటెఁ బరశాస్త్రము, పరశాస్త్రము కంటె నిత్యము, నిత్యము కంటే నంతరంగము, అంతరంగము కంటె నపవాదము, బలీయములని తాత్పర్యము కావునఁ బర శాస్త్రమగు టుగాగమము కంటె 'అంతరంగ'మగు ఉత్త్వసంధి బలీయము కాన కుట్టు+ఉసురు = కుట్టుసురు - అనియే అగును ఇట్లే తక్కినవి (III) కఋకు+అమ్మ' - అనుచో' ఉత్త్వసంధి టుగాగమము కంటె నేల బలీయము కాదు? అను ప్రశ్న పుట్టును టుగాగమము ద్విరుక్త టకారమువలె స్వరసంధి సందర్భమునలేదు కావున శీఘ్రముగ నుపస్థితమగుట తటస్థింపదు ఇంతేకాక టుగాగమము విశేషవిహితము కావున, కఋకు+అమ్మ - అనుచో, ఉత్త్వసంధి ప్రవర్తింపదు- టుగాగమము వచ్చి, కఋకుటమ్మ - యనియే యగును (IV) ఈ సూత్రమునఁ గొందఱు జ్ఞాపక పద్ధతి కలదని చెప్పుదురు కాని సూత్రము నందలి 'అచ్చు పరంబగునపుడు' - అనుదళము వ్యర్థము కాకుండుటచే జ్ఞాపక పద్ధతి యిట సరిపడదు (V) అడలకుఁ బరస్వరమునకు మధ్య అడలమీఁది, ఉకారముచే వ్యవధానము కలుగుచున్నది దేనితో వ్యవధాన మపరి హార్యమో దానితో వ్యవధానమున్నను గార్యము ప్రవర్తించును "యేననా వ్యవధానంతేన వ్యవహితేపి" (పరిభాష) నహి స్వాంగం స్వవ్యవధాయకమ్- అను నియమమును గలదు కాన ద్విరుక్తటకారము ప్రవర్తించుట నిర్బాధము (VI) ఈ సూత్రము తద్ధితములయెడ వర్తింపదు ఏలయన, ద్విరుక్తటకారము సమాసాశ్రయ విధి కడు + ఇమి = కడిమి

పదసార్థక్యము అచ్చు పరంబగునపుడు - అనుటచే హల్లు పరమగు

నపుడు ద్విరుక్తటకారము కాదు ఉ॥ కుఱుచ + మాపు = కుఱు + మాపు కుఱుమాపు మొ॥

## ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగానగు. 13

| | | |
|---|---|---|
| వాఁడు | కొట్టె | వాఁడు గొట్టె, వాఁడుకొట్టె |
| అపుడు | చనియె | అపుడు సనియె, అపుడుచనియె |
| నీవు | టక్కరివి | నీవు డక్కరివి, నీవు టక్కరివి |
| మీరు | తలఁడు | మీరుదలఁడు, మీరుతల్లఁడు. |
| వారు | పోరు | వారువోరు, వారుపోరు |

అప్పుడిప్పుడెప్పుడను శబ్దములు నిత్యైక వచనాంతములు వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది ఈ కార్యము కళలగు క్రియాపదముల మీఁద సహితము కానంబడియెడి

| | | |
|---|---|---|
| రారు | కదా | రారుగదా, రారుకదా |
| వత్తురు | పోదురు | వత్తురువోదురు, వత్తురుపోదురు |

వ్యా ప్రథమాంతము మీఁది కచటతపల స్థానమున వరుసగా గసడదవలు బహుళముగ నగును వాఁడు + కొట్టె = వాఁడు గొట్టె, వాఁడుకొట్టె – ఇత్యాదులు ఇవి బహుళ ప్రయోజనములలో విభాష కుదాహరణములు ప్రవృత్తికి - లెస్స+కాను=లెస్సగాను క్రియా 116 ప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగఁ బ్రవర్తించుట

అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు– అను శబ్దములు నిత్యైక వచనాంతములు అనగాఁ నెల్లప్పుడు నేకవచనాంతములుగానే యుండునని యర్థము కావుని వీనికి బహువచన రూపములుండవు

వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది దీనికి వివరణము - నన్నయ (వాగనుశాసనులు) "ఆంధ్రశబ్ద చింతామణి" లో కళలను గూర్చి చెప్పుచుఁ బ్రథమా విభక్తి కళయని చెప్పినారు ఎప్పుడు, అప్పుడు ననునవి కళలని మరల వేఱుగాఁ జెప్పినారు యదా = ఎప్పుడు, తదా = అప్పుడు ఇవి ప్రథమలే యయినచో మరల వేఱుగా నేల చెప్పినారు? అను సందేహము కలుగును దీనికి సమాధాన మేమనఁగా– నన్నయ

ఎప్పుడు, అప్పుడు నను వానిని వేఱుగాఁ జెప్పుటకు గారణ మివి ప్రథమలు కావన్న యుద్దేశముచేతఁ గాదు ఇవి ప్రథమలనియే నన్నయ యుద్దేశము ఐనను వీనిని వేఱుగాఁ జెప్పుట స్పష్టత కొఱకని గ్రహింపవలెను ప్రపంచార్థము = స్పష్టత నిమిత్తమని యర్థము కాఁగా, అపుడు + చనియె — అని, అపుడు శబ్దమును ప్రథమ యనుట నన్నయకు విరుద్ధము కాదని తాత్పర్యము (సుస్ యదాతదా అభిదధతి కళా - అం చిం సుస్ = ప్రథమా విభక్తి)

ఈ గసడదవాదేశము కళలగు క్రియా పదముల మీఁదను బహుళముగఁ గనఁబడును రారు + కదా = రారుగదా రారుకదా వత్తురు + పోదురు = వత్తురువోదురు, వత్తురుపోదురు రారు, వత్తురు — అనునవి కళలగు క్రియా పదములు

విశే - (1) పరుషములను సంజ్ఞ హల్లులలో కచటతపలకుఁ జేయఁ బడినది హల్లులు పొల్లు వర్ణములే యగుటచేఁ బొల్లులగు, కచటతపలకు వరుసగాఁ బొల్లులగు గసడదవలగును (11) సంజ్ఞా 7 చే — తాలవ్య చజలకు విధించు కార్యములు దంత్యచజల కగును గావున దంత్య చకారమునకును సకారమగును ఉదా అపుడు + చనియె = అపుడుసనియె చనియె - లోని, చకారము దంత్యమగును సంజ్ఞా 9 సూ (111) పరుషముల స్థానమున గసడదవలు క్రమముగా నగును యథా సంఖ్య మనుదేశః సమానామ్ — పాణి ఇష్టే 15 వ సూత్రమున

## తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు. 14

| | | |
|---|---|---|
| వాఁడు | కంసారి | వాఁడుకంసారి. |
| వీఁడు | చక్రపాణి | వీఁడు చక్రపాణి. |
| ఆయది | టంకృతి | ఆయదిటంకృతి. |
| అది | తథ్యము | అదితథ్యము |
| ఇది | పథ్యము | ఇది పథ్యము |

వ్యా అచ్చతెనుఁగు శబ్దములమీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావు సాంస్కృతికము=సంస్కృతమునకు సంబంధించినది సంస్కృత సమముల యందలి పరుషములు సాంస్కృతిక పరుషము లనఁబడును వాఁడు+ కంసారి ఇట, వాఁడు - అచ్చతెనుఁగు కంసారి - సంస్కృత సమము కావున

నిందలి కకారము సాంస్కృతిక పరుషము 13చే గసడదవాదేశము ప్రాప్తించు చుండఁగా, నీ 14వ సూత్ర మా గసడదవాదేశమును నిషేధించును కావున, వాఁడు కంసారి అనియే యగును ఇట్లే తక్కినవి

విశే - (1) తెనుఁగుల మీఁది - అనుటచే సంస్కృతసమముల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలగు నను విరుద్ధార్థము సూరి సూత్రమునఁ గలదని కొందఱు సెలవిచ్చియున్నారు కాని యిది విరుద్ధార్థము కాదు సూరి గారు తమ శబ్దాను శాసనమున "సంస్కృతంబు మీఁదనే సాంస్కృతికంబులకు-గసడదవలగు" నని సూత్రించి యున్నారు అహోబలపండితుఁడు సైత మిట్లే వక్కాణించి యున్నాఁడు కావున నిది యుద్దిష్టార్థమే (ii) సూరి, చింతామణి సూత్రము ననుసరించి (నవికృతి శబ్దాత్పరతః సాంస్కృతికానాంభవంతి గసడదవాః - ఆం చిం) తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు నిషేధించెను నన్నయ భారతమునఁ దెనుఁగులమీఁది సాంస్కృతిక పరుషమునకు గసడదవాదేశమును నిర్వహించు ప్రాసాదిగతప్రయోగము మృగ్యము కాన సూరి తిక్కనాదుల ప్రయోగములను, నథర్వణ కారికను, నుపేక్షించి నన్నయ మతానుసారమునిట్లు సూత్రించెను తెనుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవలు విధించినచో వ్యవహార జ్ఞానము నశించునని సూరి నిషేధించినట్లు కొందఱూహింతురు కాని యది సరికాఁదు కృష్ణుఁడుగంసారి యనుచో నశింపని వ్యవహారజ్ఞానము - వాఁడుగంసారి యనుచోఁ నశించు ననుట పాడికాదు ఇంతకు "నాచ్ఛికా ద ప్రాసే సాంస్కృతికానామ్" అని సూరిగారే సూత్రాంధ్రవ్యాకరణమునఁ బ్రాసలలోఁ దెనుఁగులమీఁద నీ గసడదవాదేశము నంగీకరించియున్నారు (iii) ఇది తథ్యము (ఆది 5.73) ఇది పథ్యము (ఆది 6.132)

పదసార్థక్యము - (i) తెనుఁగులమీది – అనుటచే సంస్కృతసమముల మీఁది సాంస్కృతిక పరుషములకు, గసడదవలగును రాముఁడు + కరుణించెన్ = రాముఁడు గరుణించెన్ - అహో స్త్రీసమంబులు గ్లీబసమంబులు అచ్చిక - 2 కావలియై సురరాజ్య శ్రీపాలింపంగ - ఉద్యో 1.142 (ii) సంస్కృతసమములమీఁది యాచ్ఛికపరుషములకును గసడదవలగును కేతనంబు దునిమి – భీష్మ 1.252 (iii) తెనుఁగుల మీఁది తెనుఁగు పరుషములకును గసడదవలగును వాఁడు + కొట్టె = వాడుగొట్టె (13సూ) చే + చమరి కొంచు = చే సమరికొంచు. (ఆది 6 - 206)

## ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు 15.

| | | |
|---|---|---|
| కూర | కాయ | కూరగాయలు |
| కాలు | చేయి | కాలుసేతులు |
| టక్కు | టెక్కు | టక్కుఁడెక్కులు |
| తల్లి | తండ్రి | తల్లిదండ్రులు |
| ఊరు | పల్లె | ఊరువల్లెలు |

వ్యా ద్వంద్వసమాసమునఁదొలి పదము మీఁది పరుషములకు వరుసగా గసడదవలు నిత్యముగా నగును ద్వంద్వము = ఉభయ పదార్థ ప్రధానము ప్రాయికముగా ద్వంద్వమగును (సమాస 3) ఉదా॥ కూర + కాయ ఇట మొదటిపదము 'కూర' శబ్దము, దీని పయి పరుషము 'కాయ' లోని కకారము ఈ సూత్రముచే, గసడదవాదేశము నిత్యముగఁగలిగి కూరగాయ - అగును లువర్ణంబు బహువచనంబు (తత్సమ 12) అను సూత్రముచే - కూరగాయ + లు = కూరగాయలు ఇట్లే, కాలు + చేయి = కాలు సేయి, టక్కు + టెక్కు, టక్కు డెక్కు, తల్లి + తండ్రి = తల్లిదండ్రి, ఊరు + పల్లె = ఊరువల్లె, తత్సమ 12చే లువర్ణకము చేరును కాలుసేయి + లు = కాలుసేతులు టక్కు డెక్కు + లు = టక్కుడెక్కులు తల్లిదండ్రి + లు = తల్లి దండ్రులు ఊరుపల్లె + లు = ఊరువల్లెలు కాలుసేయి + లు అచ్చిక 35చే కాలుసేతి + లు తత్సమ 45చే - కాలుసేతులు తల్లిదండ్రి + లు, తత్సమ 45చే-తల్లిదండ్రులు - అగునని గమనింపఁదగును చూ - సమాస 7

విశే - "కూర + ము" + కాయ + ము" - ఇత్యాదులలౌకిక విగ్రహములు

పదసార్థక్యము - పదంబుపయి – అనుటచే మొదటి పదమునందలి పరుషములకు గసడదవలు కావు కూర + కాయ కూర శబ్దమునందలి కకారమునకి విధి కలుగదన్నమాట

## ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు. 16

| | | |
|---|---|---|
| పూచెను | కలువలు | పూచెనుగలువలు |
| తోఁచెను | చుక్కలు | తోచెను జుక్కలు |
| చేసెను | టక్కులు | చేసెను డక్కులు. |

నెగడెను తమములు నెగడెను దమములు

మొగిడెను పద్మము మొగిడెను బద్మము

వ్యా ద్రుతప్రకృతికముల కంటెఁ బరమయిన పరుషములస్థానమున సరళములగును పరుషములు=కచటతపలు సరళములు=గ జ డ ద బ లు దీనిని గజడదబాదేశము లేదా సరళాదేశమని యందురు ద్రుతప్రకృతికము = ద్రుతాంతములయిన పదములు ద్రుతప్రకృతికములు ద్రుతము = ప్రత్యయాగమావ్యయాత్మకమగు "ను" వర్ణము (సంజ్ఞా 11, 12 సూ)

ఉదా॥ పూచెను + కలువలు పూచెను - ద్రుతప్రకృతికము. కాని దీని మీఁది పరుషమునకు సరళముపచ్చి - పూచెను గలువలు - అయ్యెను ఇట్లే తక్కినచోట్ల సరళాదేశమగును

విశే - (1) తోఁచెను + చుక్కలు = తోఁచెను జుక్కలు ఇట దంతః చకారమునకు దంత్యజకారమయినది చూ సంజ్ఞా - 7 (11) స్థాన సాదృశ్యమును బట్టి కకారమునకు గకారము, చకారమునకు జకారము, టకారమునకు డకారము, తకారమునకు దకారము, పకారమునకు బకారము నగును "స్థానేంతరతమః" (పాణి)

## ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగు. 17

సంశ్లేషంబనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట

| | |
|---|---|
| పూచెను గలువలు | పూచెంగలువలు |
| | పూచెఁగలువలు. |
| | పూచెన్గలువలు |
| తోఁచెను జుక్కలు | తోఁచెంజుక్కలు |
| | తోఁచెఁజుక్కలు |
| | తోఁచెన్జుక్కలు |
| చేసెను డక్కులు | చేసెండక్కులు |
| | చేసెఁడక్కులు. |
| | చేసెన్డక్కులు |

నెగడెను దమములు నెగడెందమములు
నెగడెఁదమములు
నెగడెన్దమములు
మొగిడెను బద్మము . మొగిడెంబద్మము
మొగిడెఁబద్మము
మొగిడెన్బద్మము

పక్షంబున స్వత్వంబగు స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము

వ్యా అదేశసరళములకుఁ బూర్వమందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషగ నగును, ఆదేశసరళములు = పరుషముల స్థానమున నగు సరళములు ఉదా పూచెను + కలువలు 16 చే కకారమునకు (క్) గకారమాదేశమయి (గ్) పూచెను గలువలు - అగును గలువలు - అనుదానిలోని గకారము, కకారమున కాదేశమయిన గకారము కావున నాదేశ సరళమయినది కాబట్టి దీనికి ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాషనగును బిందు - అని సామాన్యముగ ననుటచేఁ బూర్ణబిందువు ఖండబిందువు రెండును నగును పూచెంగలువలు -పూర్ణబిందు రూపము పూచెఁగలువలు - ఖండబిందు రూపము - పూచెన్గలువలు - సంశ్లేషము సంశ్లేషము = ద్రుతముమీఁది హల్లుతోఁ గూడికొనుట అనఁగా ద్రుతమునందలి యచ్చు లోపించి (ను = న్ ) పైహల్లుతోఁ గూడుకొనుట పూచెను + గలువలు = పూచెన్గలువలు గ్న సంశ్లేషము (చూ ప్రకీర్ణక 1) ఇట్లే తక్కినవి విభాష కనుక బిందుసంశ్లేషములు కాని పక్షమున' ద్రుతమునకు స్వత్వమగును స్వత్వము = ద్రుతమునకుఁ బ్రకృతిభావము ప్రకృతియొక్క భావము = ప్రకృతిభావము (ప్రకృతేర్భావః - సారస్వ) ప్రకృతి = స్వస్వరూపము భావము = ఉనికి కాఁగా ద్రుతము మార్పుచెందక స్వస్వరూపముతో నుండుట స్వత్వమని యర్థము (నిర్వికారస్వరూపేణావ స్థానమిత్యర్థః - బాల మ) బాలవ్యాకరణ మతమున నువర్ణము ద్రుతము గావున ద్రుతము 'ను' స్వరూపముతో నుండుట స్వత్వమని తాత్పర్యము, ఉదా పూచెను గలువలు ఇది స్వత్వమున కుదాహరణము 'ని' అనునదియు, స్వత్వము కావచ్చును చూ 27

విశే - ఇందలి విభాషను వ్యవస్థిత విభాషయందురు ప్రాఁతాదులలోని ద్రుతమునకు సంశ్లేషము లేదనియు నుఙ్మంతములకు "కాన్క" పరమగుచో

స్వత్వము లేదనియు దీనికిఁ గల వ్యవస్థలు ప్రా+ను + గెంపు - ఇట సంశ్లేషము లేదు (సంధి 38) చూడను + గాను - ఇట స్వత్వము లేదు (క్రియా 116) "వ్యవస్థిత విభాషాయాం కార్యాణి క్రియంతే, (పరిభా) లక్ష్యాను సారాద్వ్యవస్థాబోధ్యా"

పదసార్థక్యము - ఆదేశ సరళములకు ముందున్న — అనుటచే శబ్దసిద్ధ మగు సరళమునకు ముందున్న ద్రుతమునకి విధి వర్తింపదు (18 సూ)

**ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషంబులు విభాష నగు. 18**

| | | |
|---|---|---|
| వచ్చెను | గోవులు | వచ్చె గోవులు, |
| | | వచ్చె న్గోవులు |
| | | వచ్చెను గోవులు, |
| మెఱసెను | ఖడ్గము | మెఱసె ఖడ్గము, |
| | | మెఱసె న్ఖడ్గము, |
| | | మెఱసెను ఖడ్గము. |

వ్యా సరళస్థిరములు, పరములగునపుడు ద్రుతమునకు లోప సంశ్లేషములు విభాషగ నగును విభాష = విధించిన వ్యాకరణ కార్యము వికల్పముగ నగుట సరళములు = గజడదబలు స్థిరములు = పరుషసరళములుకాక తక్కిన హల్లులు, సంశ్లేషము = ద్రుతముమీఁది హల్లుతోఁ గూడికొనుట ద్రుతము = ప్రత్యయాగమావ్యయాత్మకమగు నువర్ణము ఉదా॥ సరళమునకు - వచ్చెను + గోవులు గకారము సరళము గనుక ద్రుతమునకు లోపమయినచో - వచ్చె గోవులు - అగును సంశ్లేషమయినచో, వచ్చెన్గోవులు - అగును లోప సంశ్లేష ములు రానిపక్షమున స్వత్వరూపముండును, వచ్చెను గోవులు స్వత్వము = ద్రుతమునకుఁ బ్రకృతి భావము స్థిరమునకు - మెఱసెను+ఖడ్గము = మెఱసె ఖడ్గము - ద్రుత లోపరూపము మెఱసెన్ఖడ్గము మెఱసెను ఖడ్గము - స్వత్వము

విశే - ఇదియప్రాప్త విభాష అప్రాప్త విభాష = ఏ సూత్రముచేతను బ్రాప్తింపని కార్యమును వికల్పముగ విధించునది

**వర్గయుక్సరళములు పరములగునప డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. 19**

వచ్చెను , ధాత్రీపతి , వచ్చెంధాత్రీపతి,

పాడెను గంధర్వుఁడు పాడెం గంధర్వుఁడు
కన్ దోయి కందోయి

వ్యా॥ వర్గయుక్కులును, సరళములును, బరములగునప్పుడు ద్రుతమున కరుదుగాఁ బూర్ణబిందువు కూడఁ గనఁబడును వర్గయుక్కులు = వర్గములలోని సరి సంఖ్యగల వర్ణములు వర్గములైదు (1) కవర్గము (2) చవర్గము (3) టవర్గము (4) తవర్గము (5) పవర్గము యుక్కు = సరిసంఖ్య కావున వర్గయుక్కులనఁగా వర్గములలోని వర్ణములలో సరిసంఖ్యగల వర్ణములు ప్రతి వర్గమున నైదు వర్ణములుండును, ఉదా॥ క ఖ గ ఘ ఙ - మొ॥ కాన, వర్గములలోని రెండు, నాలుగు వర్ణములు వర్గయుక్కులగును 2, 4 సరిసంఖ్యలు 1, 3, 5 బేసి సంఖ్యలు కాఁగా, ఖ - ఘ, ఛ - ఝ, ఠ - ఢ, థ - ధ ఫ, - భ - అను పది వర్ణములు వర్గయుక్కులగును గ జ డ దబలు సరళములు, వర్గయుక్కులకు వచ్చెను + ధాత్రీపతి = వచ్చెంధాత్రీపతి సరళములకు పాడెను + గంధర్వుఁడు = పాడెంగంధర్వుఁడు కన్ + దోయి = కందోయి

విశే - కన్ను + దోయి ప్రకీర్ణక 7చే - కను + దోయి ప్రకీర్ణక 16చే - కన్ + దోయి - అను, వర్ణచ్ఛేద మేర్పడును కన్ - లోని నకార మువర్ణవికృతము కాన సూరి మతమున నిది ద్రుతముకాదు. కానిచో ద్రుతకార్యము లెట్లు కలుగును? అను ప్రశ్న యెదురగును కనుక వేర్వేఱు ప్రక్రియ లూహించిరి కాని యవేవియు సరిపడుటలేదు (1) కన్ను + దోయి సంధి 25చే - కన్ను + ను + దోయి సమాస 20చే - కన్ను - లోని 'న్ను' వర్ణము లోపించి యాగమ నువర్ణముతోఁ గూడుకొని, కన్ను + దోయి - అగును, సంధి 19చే - కందోయి - అగును ఇందలి లోపము సూరి, కన్ + దోయి - అని చూపుచుండఁగా, కను + దోయి 19చే - కందోయి - అని నువర్ణద్రుతమునకుఁ బూర్ణబిందువు విధించుట సరిపడదు (2) కను + దోయి సంధి 25చే - కను + న్ + దోయి సమాస 20 చే - కన్ + దోయి = కందోయి-అని కొందఱు చూపుదురు ఇందలి లోపము సంధి 25చే నుగాగమము విధింపఁబడినది సూరి మతమున నువర్ణమే ద్రుతము నుగాగమ మగుచో 'న్' అగమ మనుట సరికాదు అన్నచో- చేగురున్ గయిదువు వంటివి స్వత్వములయి పోవును (3) కొందఱు చింతామణి ప్రక్రియను దెచ్చి ముడిపెట్ట యత్నించిరి కాని బాలవ్యాకరణ ప్రక్రియలో దానిని జొప్పించుట యసంగతము (4) మఱి కొందఱు, సంధి 39 సూత్రమున, కన్ను + దోయి చేర్చి, లోప నుగాగమములగు నన్నిరి. ఇందలి లోపము (1, 37 సూత్రమునఁ జెప్పినట్లు పరుషములు

పరమగునప్పుడే 39, చే-నుగాగమమగును కావుననే సూరి "తొంటియట్లు" అని వ్రాసెను ఇట సరళము పరమగుచుండుటచే, నుగాగమము రాదు (11) నుగాగమ మనుచోఁ బొల్లు నకారమును జేర్పరాదు కనుక సరళము పరమగుచో నుగాగమ మగునన్నను, కన్ + దోయి - అను పదచ్ఛేద మేర్పడదు (5) అవయవిక నకార ద్రుతత్వ విషయమున సూరికొక నిశ్చితాభిప్రాయము లేదనియుఁ గందోయి శబ్దమును జూపుటచే నిందలి నకారము ద్రుతమే యనియుఁ గొందఱు సెలవిత్తురు ఈ పక్షమున 'కన్' లోని నకారమునకు ద్రుతత్వము సాధ్యముకాదని చెప్పినట్లయినది కాని దీని ప్రక్రియ నిట్లు చెప్పనగును

కందోయి - ప్రక్రియ కన్ను+దోయి 25 చే - కన్ను+ను+దోయి, సమాస 20 చే - 'న్ను' అనునదియు, నుగాగమము నందలి ఉత్వమును లోపించి, కన్+దోయి - నిల్చును ఇందలి నకారము ద్రుతమగును కాన 19 చే - కందోయి - అగును

ఈ ప్రక్రియపై నాక్షేపణ లిట్లు చెప్పవచ్చును 1) ఆక్షే - షష్ఠిలో నుగాగమము 25 చే - అగునా? సమా - అగును సింగపుఁగొదమ అని - సూ:యే యుదాహరించెను కన్ను+కవ = కన్ను+ను+కవ కన్నుంగవ - ప్రయోగదృష్టము (ఉ హ 2-50, మను 2-32) కాన నుగాగమము కావచ్చును (2) ఆక్షే - సమాస 20 తెచ్చునప్పుడు, కన్+దోయి - అని యేల? కందోయి అనియే సాధింపవచ్చునే! సమా - సమాస 20 తెచ్చినంత మాత్రమున నితర సూత్రములు తేరాదని లేదు చిఱుత+ఎలుక సమాస 20 చే - చిఱు+ఎలుక, అని నిల్చును 12, 1 సూత్రముల ప్రసక్తి యిటఁ గలదు ఇట్లే, నాలుగు+ కడలు = నలుగడలు, (25) తలను+పోయు+ప్రాలు = తలఁబ్రాలు (27) నాలుగు+వాయి+లు = నలువ (సమాస 22) అనుచోట్ల సమాస 20 చేతనే రూపసిద్ధి కాలేదు ఇతర సూత్రముల ప్రసక్తి కలదు ఇట్లే, కన్ను+ను+దోయి అనుచో సమాస 20 తెచ్చినను, 19 సూత్రమునకుఁ బ్రసక్తి-విరుద్ధము కాదు (11) కన్+చెదరె - ఇందలి నకారమావయవికమే యగుటచే ద్రుతకార్యము నకుఁ బ్రసక్తియే లేదు

(11) విశే - "కన్ను + యొక్క" + "దోయి+సు" - అలౌకిక విగ్రహము అనుక్త న్యాయమున (తత్సమ 44) కందోయి+సు తత్సమ 57 చే - కందోయి

పదసార్థక్యము - (1) ఒకానొకచో - అనుటచేఁ బూర్ణబిందువరుదుగా

నగును (11) పూర్ణ బిందువును అను సముచ్చయముచే - లోప సంశ్లేష స్వత్వములెట్లును గలుగును వచ్చెను + ధాత్రీపతి = 18 చే - వచ్చె ధాత్రీపతి, వచ్చెన్ధాత్రీపతి, వచ్చెను ధాత్రీపతి పాడెను + గంధర్వుఁడు = పాడె గంధర్వుఁడు పాడెన్గంధర్వుఁడు పాడెను గంధర్వుఁడు కన్ + దోయి = కన్దోయి (చూ 22)

## అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు. 20

వాఁడువచ్చెన్, వాఁడువచ్చె వాఁడువచ్చెను ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయి యుండు గుర్వవసాయియగు పద్యంబు తుదను స్వత్వంబులేదు అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్

వ్యా అవసానమునకుఁ బూర్వమవ్యవహితముగనుండు ద్రుతమునందలి యచ్చునకుఁగాని ద్రుతమునకుఁగాని లోపము బహుళముగా నగును లోపము = ప్రసక్తమయినది యగోచరమగుట (అదర్శనం లోపః ప్రసక్తస్య అదర్శనం లోపసంజ్ఞంస్యాత్ (సి కౌ) ~~ఉదా॥ వాఁడు~~ వచ్చెను ఇట ద్రుతస్వరము లోపించిన ~~వాఁడు~~వచ్చెన్ (న్ + ఉ = ను ఉ పోఁగా న్-మిగిలెను) ద్రుతము లోపించిన వాఁడువచ్చె పక్షమున స్వత్వము-వాఁడు వచ్చెను అవసానము = విరామము కొన్నివర్ణముల నుచ్చరించిన పిమ్మట నర్ధమాత్రాకాలముకంటె, నెక్కువకాలము, వేఱు వర్ణముల యుచ్చారణము లేమి యవసానమనఁబడును (చూ 47) ఉదా॥ వాఁడు వచ్చెను-అని వర్ణములు పలుకఁబడెను పిమ్మట వేఱు వర్ణముల యుచ్చారణము లేదు కావున వేఱు వర్ణముల యుచ్చారణా = భావమే (అభావము = లేకపోవుట) యిట నవసానము వాక్యాంతమునను బద్యాంతమునను నవసానము పరమగుట తటస్థించును వాఁడువచ్చెను-అనునది వాక్యాంతమున కుదాహరణము

ఈ ద్రుతస్వర లోపము, ద్రుతలోపము, పద్యముల చివర, గణముల ననుసరించి, నియమింప బడి యుండును ఎట్లనఁగా గురువుతో ముగియవలసిన పద్యముల చివర స్వత్వములేదు స్వత్వము = ద్రుతమునకుఁ బ్రకృతి భావము ఉదా॥ అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్ ఇది కందపద్య పాదము లక్షణమును బట్టి దీని చివర గురువుండవలెను కావున స్వత్వము లేదు అనఁగా, బుధసేవను-అని కాదు,

విశే - (I) అవసానంబునందున్=అవసానమునకుఁ బూర్వ మవ్యవహిత ముగ నుండు - అని యర్థము సప్తమీ నిర్దేశముతో విధింపఁబడు కార్య మవ్య వహితముగ నుండు ముందఱి దానిని దెలుపును 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య" (పాణి) (II) అవసానమునందు మాత్రమే యిట ద్రుతస్వర లోపమును విధిం చుటచే నచ్చువరమగుచో ద్రుతస్వరము లోపించునని స్వరపరక లక్ష్యనిర్దేశాను సారము వ్యాఖ్యానించు కొనవలెను లేనిచో, 2,5,9,41 క్రియా 28 సూత్రముల యందలి యుదాహరణములు మొదల ఁనవి విరోధించును (III) "గుర్వవసాయి యగు పద్యంబు తుదనుస్వత్వంబు లేదు" అనుట తాటాకు వ్రతులలోని స్వత్వ రూపములను సవరించుటకని కొందఱనుట సరికాదు ఇట్లన్నచోఁ దాటాకు వ్రతు లలోని తక్కిన దోషములు సవరింపకపోవుట యను లోపము దుర్వారమగును తాటాకు వ్రతులలోని తప్పుడు వ్రాతలు సవరించుట బాలవ్యాకరణ కృత్యమును గాదు అహోబలపతి, పద్యము తుదను స్వత్వముండరాదని పొరపాటుగా వ్యాఖ్యానించెను కాన గుర్వవసాయి యగు పద్యము చివర మాత్రమే స్వత్వము లేదని సూరి యహోబల వచనమును సవరించెనని గ్రహింపవలెను (IV) బుధ సేవ - అన్నచో గణభంగమగును గావున నవసానమున లఘువుమీఁద ద్రుత లోపమును లేదని తెలియవలెను (V) అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధ సేవన్ - ఆరణ్య 7-428

## కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. అదియునున్గాక, దివంబునుంబోలె. 21

వా కొన్నిచోట్ల ద్రుతముమీద మరల ద్రుతము కనఁబడును అది యును + కాక ఇట 'ను' వర్ణము ద్రుతము దీనిపై మరల ద్రుతము చేరిన - అదియునును + కాక 16 చే - అదియునును + గాక 17 చే అదియును న్గాక - సంశ్లేష రూపము, దివంబును + పోలె ఈ 21 చే - దివంబునును + పోలె 16 చే - దివంబునును + బోలె 17 చే - దివంబునుం బోలె - పూర్ణ బిందు రూపము

విశే - 'నకారంబు ద్రుతంబు" అనుటచే నిట ద్రుతము మీఁద ద్రుతమగు ననుకొనవలెను సూరి మతమున 'ను' వర్ణమే ద్రుతము కావున [illegible] బొల్లి నకారమునకుఁ జేర్పరాదు చేర్చినచో [illegible] వచ్చును

**అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వము మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. 22**

ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి

వ్యా అఁట, ఇఁక, చుఁడు, అను మూఁడు శబ్దములలోఁదప్ప మాట యొక్క మొదటి హ్రస్వముమీఁద ఖండబిందువు లేదు ద్రుతమునకు లోపమును లేదు నుడి = మాట (i) ఖండ బిందువు లేకుండుటకు - ఉదా॥ ముంగొంగు - ముందు + కొంగు 36 చే - ము + కొంగు 37 చే - మును + కొంగు 16 చే ము + ను + గొంగు, 17 చే - బిందు సంశ్లేషములు ప్రాప్తించు చుండఁగా, ఖండ బిందువు లేదని ఈ సూత్రము నిషేధించుచున్నది ఏలయన 'ము' లోని ఉకారము, నుడి తొలి హ్రస్వము కాన దీనిమీఁద ఖండబిందు వుండదు పూర్ణబిందువు కాఁగా, ముంగొంగు - అగును ముందు శబ్దము ప్రాఁ తాదులలోనిది గనుక సంశ్లేషము లేదు 26 చే - మునుగొంగు- అను స్వత్వము లేదు కనుక, ముంగొంగు-అను రూపము మాత్రమే యుండును క్రొంబసిఁడి - క్రొత్త + పసిఁడి 36 చే - క్రొ + పసిఁడి 38 చే - క్రొను + పసిడి 16 చే - క్రొను + బసిఁడి, 17 చే - పూర్ణ బిందువు, ఖండబిందువు, సంశ్లేషము ప్రాప్తించుచుండఁగా నుడి తొలి హ్రస్వముమీఁద ఖండబిందువు లేదని యీ సూత్రము నిషేధించుచున్నది కానఁ బూర్ణబిందువుకాఁగా - క్రొంబసిఁడి - అగును ప్రాఁతాదులలో ద్రుతమునకు సంశ్లేషము లేదు కాన క్రొన్బసిఁడి - కాదు 26 చే - క్రొనుబసిఁడి - అనుస్వత్వమును లేదు కనుక క్రొంబసిఁడి - అను రూపము మాత్రమే యుండును (ii) ద్రుతమునకు లోపము లేకుండుటకు ఉదా॥ కన్+దోయి - 18 చే - లోప సంశ్లేషములు ప్రాప్తించుచుండఁగా నుడి తొలి హ్రస్వముమీఁదిది గనుక లోపము లేదని యిట నిషేధింపఁబడెను కావున 18 చే ద్రుత లోపము లేదు (కదోయి - కాదన్నమాట) సంశ్లేషము కలిగి కన్దోయి - అగును

విశే - (i) ఇఁక శబ్దము, ఇఁగ శబ్దమున కుపలక్షణము (ii) కన్ - లోని నకారము ద్రుతమగుటను గూర్చి చూ 19 వ్యాఖ్య (iii) కన్+దోయి- అనుచో సంశ్లేషముతోపాటు ద్రుత లోపమును 18 చేతనే ప్రసక్తమగును 26 సూత్రమునకుఁ దత్పూర్వ సూత్రములయెడఁ బ్రవృత్తిలేదు (iv) "ముందు + వు" + "కొంగు + వు" - ఇత్యాదులలౌకిక విగ్రహములు ముంగొంగు తత్సమ 48 చే - ముంగ్గొంగు + వు, క్రొంబసిఁడి + సు, కన్దోయి + సు తత్సమ 57 చే - ముంగొంగు, క్రొంబసిఁడి, కన్దోయి

పదసార్థక్యము - (1) సూత్రమున, నుడి - అనుటచేఁ బదములలోనే తొలి హ్రస్వము మీఁద ఖండబిందు వుండదు అపదములలో నుండవచ్చును ఉదా॥ ఇఁడి, ఎఁడు - తద్ధిత 24, 25 (11) తొలి హ్రస్వమనుటచేఁ దొలి దీర్ఘముపై ఖండముండును క్రీఁగాలు - మొ॥

పాఠ పరిశీలన - శబ్దంబులందవ్వ - ప్రథమ ముద్రణము కాన, శబ్దములందవ్వ - అను ముద్రణములు సరికావు

## తాను నేను పదంబునకు సంశ్లేషంబు లేదు, 23

తాను చదివె తాఁజదివె, తాను జదివె

తాను వినె తావినె, తానువినె

దీర్ఘంబు మీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు

-వ్యా తాను - నేను, అను పదముల యొక్క ద్రుతమునకు సంశ్లేషము లేదు సంశ్లేషము = ద్రుతము మీఁది హల్లుతోఁ గూడుకొనుట ఉదా॥ తాను + చదివె - 16 చే తాను + జదివె 17 చే - బిందు సంశ్లేషములు రావలసి యున్నవి 17 చేఁ బ్రాప్తించు సంశ్లేషమిట నిషేధింపబడినది కాన సంశ్లేషము లేదు ఖండబిందువు రాఁగా, తాఁజదివె - అయినది సంజ్ఞా 15 చే -దీర్ఘము మీఁదిది గనుక ద్రుతమునకుఁ బూర్ణబిందువు లేదు (నెఱసున్న=పూర్ణబిందువు) తాఁజదివె - అను ఖండబిందు రూపమును, తానుఁజదివె అను స్వత్వమును నుండునని సూరి యభిప్రాయము తాను + వినె - 18 చే ద్రుతమునకు లోప సంశ్లేషములు విభాషగఁ బ్రాప్తించును సంశ్లేషమిట నిషేధింపబడినది గనుక లోప రూపము, స్వత్వ రూపము నుండును తావినె - ద్రుతలోప రూపముః తాను వినె స్వత్వము

విశే - నేను శబ్దమునకు నిట్లే రూపసిద్ధి యగును నేను + చదివితిని= నేఁజదివితిని, నేను జదివితిని నేను + వింటిని = నేవింటిని - అను రూపములు సూరిమతమున నేర్పడును తాఞ్జదివె, తాన్వినె - వంటివి సూరిమతమునఁ గలుగవు

## సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు. 24

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు

సర్వపర్యాయంబయిన యెల్ల శబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు

వ్యా సమాసమున ద్రుతమునకు లోపమగును ఉదా॥ ఎల్లను+అర్థములు ఇది కర్మధారయ సమాసము (ఎల్లయైన యర్థములు) కావున ద్రుతము లోపింపగా - ఎల్ల + అర్థములు-అగును 3చే యడాగమము ఎల్ల – య్+ అర్థములు = ఎల్ల యర్థములు ఎల్లను+కలుషములు ఈ 24చే ద్రుతలోపము ఎల్లకలుషములు

సర్వశబ్దమునకుఁ బర్యాయమగు ఎల్ల శబ్దము ద్రుతాంతమైన యవ్యయ మని సూరి యభిప్రాయము ఎల్లను = సర్వము - అని యర్థము దీనికి సమాసములోనే విశేష్యమునకు ముందు ప్రయోగముండును అసమాసమున అనఁగా సమాసము కానప్పుడు విశేష్యమునకు ముందు ప్రయోగములేదు అనగా విశేష్యమునకుఁ దరువాతనే ప్రయోగముండునని యర్థము ఉదా॥ అర్థములు+ ఎల్లను = అర్థములెల్లను కలుషములు + ఎల్లను = కలుషములెల్లను - అని యసమాసమున నగును ఎల్లయర్థములు, ఎల్లకలుషములు - సమాసములు అర్థములెల్లను, కలుషములెల్లను - అసమాసములు =వ్యస్తములు అవ్యయము= లింగ విభక్తి వచన భేదములను బట్టి మార్పునందక యేక ప్రకారముగ నుండు నది యవ్యయమనఁబడును (సదృశంత్రిషులింగేషు సర్వాసుచ విభక్తిషు, వచనేషుచ సర్వేషు యన్నవ్యేతి తదవ్యయమ్ - అథ) ఎల్ల పురుషులు, ఎల్ల కాంతలు, ఎల్లగ్రంథములు = అనురీతిని, ఎల్లశబ్దము మార్పునందకయుండును గాన నవ్యయమని సూరి యభిప్రాయము

విశే - (1) సమాసంబున యందు – సూరి సాధింపలేదు, కాని వాడెను ఇట్లే దానం జేసి, నా చెప్పిన పని అనువానిని, సముచ్చయార్థకమును, నవధార ణార్థకములను వాడెను (11) అలౌకిక విగ్రహములు "ఎల్లను + సు" + "అర్థ + లు" - ఇత్యాది ఎల్లయర్థ+లు తత్సమ 40చే - ఎల్లయర్థ+ము+ లు=ఎల్లయర్థములు (111) ఎల్ల = సరిహద్దుకాదు, సర్వము

**సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. 25**

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందు సంశ్లేషంబులచే మూఁడు రూపంబులు సరళంబులు పరంబులగు నపుడు లోపసంశ్లేష పూర్ణబిందువులచేత మూఁడురూపములు. విధాన సామర్థ్యము వలన దీనికి లోపములేదు వక్ష్యమాణ విధిచే స్వత్వము లేదు.

| | | |
|---|---|---|
| చిగురు | కయిదువు | చిగురుంగయిదువు |
| | | చిగురుఁగయిదువు |
| | | చిగురున్గయిదువు |
| తళుకు . | గజ్జెలు | తళుకు గజ్జెలు |
| | | తళుకున్గజ్జెలు |
| | | తళుకుంగజ్జెలు |
| సింగపు | కొదమ | సింగపుంగొదమ |
| | | సింగపుఁగొదమ |
| | | సింగపున్గొదమ. |
| ఉన్నతంపు | గొడుగు | ఉన్నతంపుగొడుగు |
| | | ఉన్నతంపున్గొడుగు |
| | | ఉన్నతంపుంగొడుగు |

నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు ఈ యాగమంబొకానొక చోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి గఱువపున్మరువు

వ్యా సమాసములలోఁబరుష సరళములు పరములగునపుడు, "ఉదంతము" లగు స్త్రీసమములకును, పుంపులకును జివర 'ను' వర్ణ మాగమ మగును నుక్+ ఆగమ = నుగాగమము కకారముతో నిర్దేశింపఁబడిన యాగమ ముద్దిష్టమునకుఁ జివరఁ జేరునని పాణినీయము (ఆద్యంతౌటకితౌ) కావున నువర్ణముదంత స్త్రీ సమములకుఁ బుంపులకుఁ జివరఁజేరును ఆగమము = వర్ణాధిక్యము (3 సూ) స్త్రీసమము = ప్రథమైకవచన ప్రత్యయము లోపించిన, యచ్చతెనుఁగు శబ్దము ఉదంత స్త్రీ సమములకు - (1) చిగురు + కయిదువు ఈ 25చే-చిగురును+ కయిదువు 24చే-ద్రుతమునకు లోపము ప్రాప్తించుచుండఁగా "విధానసామర్థ్యము వలన దీనికి లోపము లేదు" అని చెప్పఁబడెను విధాన సామర్థ్యము = వ్యాకరణ కార్యమును బ్రత్యేకముగా విధించిన సామర్థ్యమని యర్థము 24చే - నుగాగమము లోపించినచో నీ 25చే - నుగాగమమును బ్రత్యేకించి విధించుటయే వ్యర్థమగును కనుక నీ 25చే నగు "ను" గాగమమునకు 24చే లోపము లేదని తాత్పర్యము ద్రుతములోపింపదు గావున, 16చే- చిగురును+గయిదువు 17చే-చిగురుంగయి దువు చిగురుఁగయిదువు, చిగురున్గయిదువు, "వక్ష్యమాణ విధిచే స్వత్వములేదు" వక్ష్యమాణ విధి=వచింపఁబోవుసూత్రము అనఁగా 26వ సూత్రము చిగురును

గయిదువు - అను రూపము, 26చేఁ గలుగదన్నమాట కాఁగా 'పరుషములు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచె మూఁడు రూపంబులు సిద్ధించును (ii) తళుకు + గజ్జెలు సమాస 25చే-తళుక + గజ్జె ఈ సంధి 25చే - తళుకును + గజ్జె 24చే - నుగాగమమునకు లోపము ప్రాప్తించు చుండఁగా, విధానసామర్థ్యముచే ద్రుతము లోపింపదు 18చె తళుకు గజ్జె, తళుకున్గజ్జె - అగును 19 చే - తళుకుంగజ్జె - అగును తత్సమ 12చే 'లు' చేరి తళుకుగజ్జెలు, తళుకు న్గజ్జెలు, తళుకుం గజ్జెలు - అనియేర్పడును 26చే - తళుకును గజ్జెలు - అను స్వత్వరూపము కలుగదు కాఁగా సరళము పరమగుటచే ద్రుతమునకు లోప సంశ్లేష పూర్ణబిందువులచె మూఁడు రూపములయ్యెను పుంపులకు (1) సింగముయొక్క + కొదమ సమాస 25చే - సింగము + కొదమ 32చే - మువర్ణకమునకు, పుంపులగును ఇట సింగము - లోనిది ముగాగమము ఐనను తత్సమ 41చే - మువర్ణకమునకు విధించిన కార్యములు ముగాగమమునకగును కావున సింగము + కొదమ - అనుచో 32చే, ముగా గమమునకును "పుంపు"లు కలిగి, సింగపు + కొదమ - అగును ఈ 25చే- సింగపును + కొదమ 24చే - ద్రుతము లోపింపవలసియున్నను, నుగాగమము విధాన సామర్థ్యముచే లోపింపదు - కావున 16 చే - సింగపును + గొదమ, 17చే = సింగపుంగొదమ, సింగపుఁగొదమ, సింగపున్గొదమ - అను రూపము లేర్పడును, 26 చే - సింగపునుగొదమ - అను స్వత్వములేదు ఇట్లు బిందు సంశ్లేషములచే మూఁడు రూపములు (iii) ఉన్నతము + గొడుగు, 32చే - ఉన్నతపు+గొడుగు ఈ 25చే - ఉన్నతంపును+గొడుగు 24చే, ద్రుతము లోపింపవలెనుగాని, విధాన సామర్థ్యముచే, ద్రుతలోపము లేదు 18చే - ఉన్న తంపుగొడుగు, ఉన్నతంపున్గొడుగు 19 చే - ఉన్నతంపుంగొడుగు ఇట్లు, లోపసంశ్లేష పూర్ణబిందువులచే మూఁడురూపములు

నలుగడలు - నాలుగు + లు + కడ + లు - అలౌకిక విగ్రహము సమాస, 25చే - నాలుగు+కడ సమాస 20చే- నలు+గడ నలు - ఉదంత స్త్రీసమము గనుక నీ 25చే నుగాగమము కావలెను కాని "నలుగడాదుల నీయాగ మంబు లేదండ్రు" అనుటచే, నుగాగమము లేదు తత్సమ 12చే - నలుగడ+ లు = నలుగడలు-అగును గఱువపున్మురువు - గఱువము+మురువు 32చే - గఱువపు + మురువు "ఈ యాగమంబొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి" అను వృత్తి వాక్యముచే, నుగామము గఱువపును + మురువు 18 చే - గఱువపున్మురువు

విశే - (1) గఱువము + మురువు సమాస 25 చే-మువర్ణకము లోపింప వలెను గాని 3 చే, పుంపులు విధించిన సామర్థ్యము వలన - మువర్ణక లోపము లేదు (11) "చిగురు + వు" "కయిదువు + వు" - ఇత్యాదు లలౌకిక విగ్రహములు (111) తఱుకు + లు + గజ్జియ + లు = తఱుకుం గజ్జియ+లు ఆచ్ఛిక 23 చే - తఱుకుం గజ్జెలు - ఇత్యాది

పదసార్థక్యము (1) సమాసంబులన్ - అనుటచే నసమాసము న నుగాగమమురాదు చిగురు + కోసెను = చిగురుకోసెను (11) నమాసంబులన్ - అను బహువచన స్వారస్యముచె నెల్ల సమాసములందు నీవిధి వర్తిల్లును చిగురుంగయిదువు = చిగురనెడు కయిదువు - రూపకము తఱుకుగజ్జెలు - కర్మధారయము, ఆచ్ఛికము, ఉన్న=తంపుగొడుగు-కర్మధారయము, మిశ్రము సింగపుఁగొదమ - షష్ఠీతత్పురుషము (111) ఉదంతంబులగు - అనుటచే ఉదంతేతరములకు నుగాగమము రాదు ఉదా॥ వాఁడి + కయిదువు = వాఁడి కయిదువు

పార పరిశీలన - నలుఁగడాదుల - అని ప్రథమ ముద్రణముననే యరసున్న తప్పు పడినది దీనిని బట్టి నుగాగమము కలుగుటయే సూరికి సమ్మతమని కొందఱు సెలవిచ్చిరి కాని యది సరిపడదు ఎట్లన - (1) నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు-అను వాక్య మహోబలపతి వచనమును సూచించునదే కాని ఖండించునది కాదు అహోబల వచనము (సరసాదిత్యనేన నలుగడలు - ఇత్యాది వ్యావృత్తిః - అహో) సమ్మతము కానిచో సూరి 54 సూత్రమునందువలె నిరసించి యుండును లేదా 44 సూత్రమున నందువలె, నలు కడలు నలుంగడలు, నలుఁగడలు, నలున్గడలు - అని యుదాహరించి పిమ్మటఁ బై వాక్యమును వ్రాసి యుండును అట్లు చేయకపోవుటచే సూరి యహోబల వచనము నంగీకరింపలేదనుట సరికాదు (11) నుగాగమమును నిర్వహించు సాధు కవి ప్రయోగములు కనఁబడవు ప్రయోగ ప్రామాణ్యము లేని వ్రాఁత సూరికి సమ్మతమనఁదగదు (111) నలు శబ్దముతోడి సమాసమున నితరత్ర నుగాగమములు కనఁబడవు నలుతుము, నలువది, నలుగాలివాన, నలు సదరము-మొ॥ల కావున నిచ్చట సైతము నుగాగము లేకుండుటయే ధర్మము కాఁగా, నలుగడాదుల అన్నదే సాధు పారము

## సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు. 26

వా సమాసములయందు ద్రుతమునకు స్వత్వరూపము లేదు స్వత్వము= ద్రుతమునకుఁ బ్రకృతి భావము (17 సూ) ఉదా చిగురును గయిదువు (25)

తలను ప్రాలు (27) సొగసును దనము (35) ప్రాను గెంపు (37) క్రొనుజాయ (38) తొనుబది (39) ఇత్యాదులలో 17 చేఁ బాక్షికముగ స్వత్వమగును. తళుకు+ను+గజ్జెలు (25) ఇత్యాదులలో 18 చేఁ బాక్షికముగ స్వత్వమగును ఈ స్వత్వ రూపముల నీ 26 వ సూత్రము నిషేధించుచున్నది కనుక, చిగురును గయిదువు, తళుకును గజ్జెలు వంటి స్వత్వ రూపములుండవు

విశే - (1) 'ని' స్వరూప ద్రుతము సైతము స్వత్వమనిపించుకొనును చూ 27 కావున, 'ఒడిని + ప్రాలు = ఒడిన్బ్రాలు కాదు (11) నుగాగమ మనుచోఁ బొల్లు నకారము నాగమముగఁ జెప్పరాదు అట్లు చెప్పినచో — చిగురున్గయిదువు వంటివి స్వత్వములు కావలసి వచ్చును (111) సమాసంబు లందు — అను బహువచన స్వారస్యముచే, వివిధ సమాసములలో ద్రుతమునకు స్వత్వములేదు ఇందలి సమాస శబ్దము వృత్తి సామాన్యమున కుపలక్షణము కాన సొగసునుదనము ఇత్యాదులుండవన్న మాట (35) సమాసమున స్వత్వము లేదనుటచే, వ్యస్తమున స్వత్వముండును పూచెను గలువలు మొ॥ (16)

## తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు. 27

తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, నేసఁబ్రాలు, ఊరఁబంది, ఊరఁ బిచ్చిక, తోడఁబుట్టువు, తోఁబుట్టువు, ఒల్లఁబాటు, ఒడఁబాటు— ఇత్యాదులు

వ్యా తలఁబ్రాలు మున్నగు సమాసములలో ద్రుతమునకు లోపములేదు 24 చే సమాసమున ద్రుతలోపము ప్రాప్తించుచుండగా, నీ నిషేధము చెప్పఁ బడెను తలఁబ్రాలు - తలను + ప్రాలు 24 చే ద్రుతము లోపింప వలసి యుండఁగా నిట లోపము నిషేధింపఁబడెను కాన ద్రుతము లోపింపదు 16 చే తలను+బ్రాలు 17 చే తలఁబ్రాలు ఇట్లే, ఒడిని+ప్రాలు = ఒడిఁబ్రాలు నేసను+ప్రాలు = నేసఁబ్రాలు ఊరను+పంది = ఊరఁబంది ఊరను + పిచ్చిక = ఊరఁబిచ్చిక తోడను+పుట్టువు=తోడఁబుట్టువు తోను+పుట్టువు= తోఁబుట్టువు ఒల్లను + పాటు = ఒల్లఁబాటు ఒడను+పాటు = ఒడఁబాటు (తోడఁబుట్టువు, తోఁబుట్టువు = సహజన్మ)

విశే - (1) "తల + అందు" + పోయు + "ప్రాయి + లు", "ఒడి + అందు" + "పోయు" + ప్రాయి + లు", "నేస + వలన"+

కొనివచ్చిన + "ప్రాయి + లు", "ఊరు + అందు" + పుట్టు + "వంది+ సు", ఊరు + అందు" + పుట్టు + "పిచ్చిక + ము" - అలౌకిక విగ్రహములు సమాస 25 చే - తల + అందు + "పోయు + ప్రాయి-ఇత్యాది సమాస 20 చే - మధ్యమ పద లోపము తల + అందు + ప్రాయి-ఇత్యాది కారక 22 చే - తలను + ప్రాయి = తలఁబ్రాయి, ఒడి + ను + ప్రాయి తత్సమ 26 చే - ఒడిని + ప్రాయి = ఒడిఁబ్రాయి, కారక 21 చే సేసను + ప్రాయి = సేసఁబ్రాయి బహువచనము తలఁబ్రాయి+లు - ఇత్యాది అచ్చిక 21 చే, తలఁబ్రాలు - ఇత్యాది ఊరు + అందు = ఊరను (అచ్చిక 30, 38) ఊరను + వంది = ఊరఁబంది ఊరబంది+సు, ఊరఁబిచ్చిక + ము తత్సమ 57చే - ఊరఁబంది, ఊరఁబిచ్చిక ఇవి మధ్యమపద లోప సమాసములు (11) తలన్బ్రాలు వంటి రూపములు మృగ్యములందురు ఈ పక్షమున లక్ష్యములను బట్టి బిందురూపములే యుండుననగును 26 చే స్వత్వము లేదు గనుక, తలన్బ్రాలు - వంటి రూపములుండవు (111) ఒడి+ను + ప్రాలు= ఒడిని + బ్రాలు ఇట 'ను' వర్ణము యొక్క ఉత్వమున కిత్వమాదేశమయినది ఆదేశముస్థాని వంటిది కనుక 'ని' వర్ణమును స్వత్వమగును (స్థానివదాదేశః - పాణి) కావున, ఒడిన్బ్రాలు - అను రూపముండదు (1v) ఒల్లన్, ఒదన్ - అనునవి భావార్థక నిపాతములు "ఒల్లనితి వ్యతిరేకార్థ కోదేశ్యశబ్దః" అహో వీనికి వ్యస్త ప్రయోగము లేదు ఒల్లఁబాటు, ఒదఁబాటు - నిత్య సమాసములు "అవిగ్రహో నిత్యసమాస, అస్వపద విగ్రహోవా" సి కౌ తోడఁబుట్టువు = తోడనయిన పుట్టువు దేనికిఁగలదోయది, బహువ్రీహి

## కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు. 28

| | | |
|---|---|---|
| కఱకు | అమ్మ | కఱకుటమ్మ |
| నిగ్గు | అద్దము | నిగ్గుటద్దము |
| సరసపు | అలుక | సరసపుటలుక |

వ్యా కర్మధారయములందు హ్రస్వమయిన ఉకారమున కచ్చుపరమగునపుడు, టుగాగమమగును టుక్ + అగమ = టుగాగమము కకారముతో నిర్దేశింపఁబడిన యాగమ ముద్దిష్టమునకుఁ జివరఁ జేరునని పాణినీయము (అద్యంతౌటకితౌ) ఇట 'టుక్' అని కకారముతో టువర్ణము నిర్దేశింపఁబడినది? 'టు' లోని ఉకారముచ్చారణమునకుఁ జేర్పఁబడినది కావున ఉత్తునకుఁజివరఁ,

బొల్లు టకార మాగమమగును ఆగమము = వర్ణాధిక్యము కలుకు + అమ్మ ఈ 28చే - కలుకుట్ + అమ్మ = కలుకుటమ్మ నిగ్గు + అద్ద + ము సమాస 25చే నిగ్గు+అద్ద ఈ సంధి 28చే నిగ్గుట్ + అద్ద = నిగ్గుటద్ద తత్సమ 39చే - నిగ్గుటద్దము సరసము + అలుక - 32చే-సరసపు+అలుక ఈ 28 చే - సరసపుట్ + అలుక = సరసపుటలుక కర్మధారయము = విశేషణమునకు విశేష్యముతోడ సమాసము (సమాస 3)

విశే - (1) టుగాగమమనుచో, టువర్ణము నాగమము చేయరాదు టువర్ణ మాగమమన్నచో, ఉత్వసంధి చెప్పవలసియుండును అది ప్రక్రియా గౌరవ మగును 'టు' వర్ణ మాగమము చేయుట సమ్మతముకాదు గావుననే యిది స్వర సంధి సందర్భమునఁ జూపఁబడలేదు కాన, టుగాగమములోని ఉకారముచ్చార ణార్థకమే ఉకారముచ్చారణార్థకమనుటకు - "అనేముక్" (పాణి) ఉకార ఉచ్చారణార్థః (బాలమ) (11) సరసపు + అలుక 32చే - పుంపులు విధించిన సామర్థ్యమున సమాస 25 చే - మువర్ణక లోపమురాదు (111) "కలుకు + వు" " + అమ్మ+వు " నిగ్గు+ వు+అద్ద+ము, సరస + ము + అలుక + ము సమాస 25చే - కలుకు + అమ్మ - ఇత్యాది తత్సమ 48 చే - కలుకు టమ్మ + వు తత్సమ 39 చే - సరసపుటలుక + ము 57 చే - కలుకు టమ్మ, సరసపుటలుక

పదసార్థక్యము - (1) కర్మధారయంబులందు - అను బహువచన స్వారస్యముచే షష్ఠీతత్పురుషాదులందును టు గాగమ మరుదుగా నగును ఉదా॥ వేల్పు + ఆవు = వేల్పుటావు కప్పురపు + అరఁటి = కప్పురపుటరఁటి ఇవి షష్ఠీతత్పురుషములు చెక్క + అద్దము = చెక్కటద్దము - రూపకము.

**కర్మధారయంబునందుః బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. 29**

| | | |
|---|---|---|
| పేరు | ఉరము | పేరుటురము, పేరురము |
| చిగురు | ఆకు | చిగురుటాకు, చిగురాకు |
| పొదరు | ఇల్లు | పొదరుటిల్లు, పొదరిల్లు |

వ్యా కర్మధారయసమాసమున, పేరు - మొదలగు శబ్దముల కచ్చుపర మగునపుడు వాని చివర 'ట్' అను నాగమము విభాషనగును టుక్+ఆగమ= టుగాగమము 'క్' అనునది నిర్దిష్టమునకుఁ జివరఁజేరునని తెలుపును 'టు' లోని ఉకార ముచ్చారణమునకుఁ జేర్పబడినది 'ట్' అనునదే యాగమమగును

అగమము=వర్ణాధిక్యము (కర్మధారయము=చూ 28) పేరుటురము పేరురము పేరు + ఉర + ము సమాస 25 చే - పేరు + ఉర ఈ 29చే పేరుట్+ ఉర = పేరుటుర తత్సమ 39చే - పేరుటురము టుగాగమము రానిచో - 1చే- పేరు + ఉర = పేరుర, తత్సమ 39చే - పేరురము చిగురుటాకు, చిగురాకు - చిగురు + ఆకు = చిగురుట్ + ఆకు = చిగురుటాకు టుగామము రానిచో - చిగురు + ఆకు=చిగురాకు (1సూ) ఇట్లే పొదరుటిల్లు, పొదరిల్లు

విశే - ఇందలి విభాష ప్రాప్తవిభాష ప్రాప్తవిభాష = ఒక సూత్రముచే నిత్యముగఁ బ్రాప్తించు కార్యమును వికల్పముగ విధించునది ప్రాప్తవిభాష 28చే- నిత్యముగఁ బ్రాప్తించు కార్యమిట వికల్పముగ విధింపఁబడినది గాన నిది ప్రాప్త విభాష. పేరు + వు + ఉర + ము - ఇత్యాదు, అలౌకిక విగ్రహములు పేరుటూమని - శృ నై 7.41 చిగురాకు - అను 1.181, అరణ్య 6.148' నిర్వ 8.38

## పేదాది శబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు. 30

| | | |
|---|---|---|
| పేద | ఆలు | పేదరాలు. |
| బీద | ఆలు | బీదరాలు. |

పేద-బీద-ముద్ద-బాలెంత-కొమ - జవ - అయిదువ - మనుమ, గొడ్డు, ఇట్టివి పేదాదులు ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది ఏకాంతమునందునున్న జవరాంద్రనని ప్రయోగము

వ్యా కర్మధారయ సమాసమున 'ఆలు' శబ్దము పరమయినప్పుడు, పేద మొదలగు శబ్దముల చివర 'ర్' అగమమగును అగమము = వర్ణాధిక్యము రుక్ + అగమ = రుగాగమము 'క్' అనునది నిర్దిష్టమునకుఁ జివరఁ జేరునని చెప్పును రు-లోని ఉకార ముచ్చారణమునకుఁ జేర్పఁబడినది కాన 'ర్' అనునదే యాగమ మగును (కర్మధారయము = చూ 28) ఉదా॥ పేద + ఆలు = పేదర్ + ఆలు = పేదరాలు బీద+ఆలు=బీదర్+ఆలు=బీదరాలు ఇట్లే తక్కినవి జవ్వని + ఆలు - "ఇందు జవ్వని శబ్దంబునకు జవాదేశంబని యెఱుంగునది" అను వాక్యముచే జవ్వని + ఆలు = జవ + ఆలు - అగును రుగాగమము కలిగి, జవర్ + ఆలు = జవరాలు - అని యేర్పడును ఇట్టివి పేదాదులు,

విశే - (1) "ఏకాంతమునందునున్న జవరాండ్రనని ప్రయోగము" (మను 2.41) అని సూరి వ్రాయుటలో విశేషము కలదు అహోబలపతి "జవ్వను రాలు" అనియు నుండవచ్చుననెను "లోపాభావేనవర్త్తే జవ్వనురాలు అహో 264 పు కాని జవ్వనురాలు - అను దానికిఁ బ్రయోగము కనఁబడదు జవరాలు- అనునది మాత్రమే ప్రయోగములందుఁ గలదని తెలుపుటకే సూరి పై మనుచరిత్ర ప్రయోగమును సూచించెను (11) ఆదేశము స్థానివంటిది గనుక జవరాలు—లోని జవ శబ్దమునకు జవ్వని యను నర్థము లభించును "స్థానివదాదేశః" పాణి (111) "పేద + ము" + "అలు + వు" ఇత్యాదు లలౌకిక విగ్రహములు, తత్సమ 48 చే - పేదరాలు + వు తత్సమ 57 చే - పేదరాలు - ఇత్యాది

## కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. 31

ధీర ఆలు ధీరురాలు

గుణవంత ఆలు గుణవంతురాలు

ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము

వ్యా. కర్మధారయ సమాసమునఁ దత్సమములకు 'ఆలు' శబ్దము పరమయినప్పుడు, అత్వమున కుత్వమును, రుగాగమమును, నగును రుక్ + ఆగమ = రుగాగమము 'రు' లోని ఉకార ముచ్చారణమునకుఁ జేర్పఁబడినది 'ర్' అనునదే చేరవలసిన యాగమము 'రుక్' అని కకారముతో నిర్దేశించుటచే 'ర్' అనునది తత్సమ పదమునకుఁ జివరఁ జేరును (చూ 28) ధీర + ఆలు ఈ 31 చే - ధీరుర్ + ఆలు = ధీరురాలు ఇట్లే, గుణవంత + ఆలు = గుణవంతుర్ + ఆలు=గుణవంతురాలు దీని సంపూర్ణ ప్రక్రియ గుణవంతమ్- తత్సమ 70 చేఁ బ్రాతిపదికము తత్సమ 71 చే - గుణవంత + ఆలు, ఈ 31 చే, గుణవంతుర్ + ఆలు = గుణవంతురాలు ఇచట వృత్తి యందనఁగా సమాస వృత్తిలో, ఆలు శబ్దమునకు స్త్రీ యని యర్థము విడిగా 'ఆలు'=భార్య

విశే - (1) కర్మధారయ పూర్వ పదము, డు వర్ణకాంతము కారాదు (సమాస 5) కాని, విధాన సామర్థ్యముచే భాషిత పుంస్క వద్భతిని బుంలింగము కావచ్చును తత్సమ 21 చే - ఉత్వమగుచుండఁగా మరల నిట ఉత్వము విధించుటచే, ఉత్వ ప్రాప్తి గలవానికే, ఆలు శబ్దముతో సమాసము ఉత్వ ప్రాప్తి లేని హర్త, దాత లోనగునవి 'ఆలు' శబ్దముతో సమసింపవు (11) వృత్తు లయిద్దు

విధములు (1) కృదంత వృత్తి ఉదా॥ ఏలిక (కృదంత 1 సూ) (2) తద్ధిత వృత్తి, ఉదా॥ రాముని తనము (తద్ధిత 1 సూ।) (3) సమాస వృత్తి ఉదా॥ రాజపురుషుఁడు (సమాస 1 సూ॥) (4) ఏక శేష వృత్తి, ఉదా॥ పితరౌ=మాతా పితలు ఇట మాతృ శబ్దము లోపించి, పితృ శబ్దము శేషించినది (5) సనాద్యం తధాతు వృత్తి ఉదా॥ రిరంసా = (తాను) రమింపఁ గోరుట (iii) రుగాగమ మనుచో, 'ర్' అనునదే యాగమమగును (చూ 28 సూ) (iv) వృత్తి = సమాస 1 (v) ధీర + డు జ్ + అలు + వు, గుణవంత + డుజ్ + అలు + వు - అలౌకిక విగ్రహములు

పద సార్థక్యము ఇచట - అనుటచే నితరత్ర, అలు = భార్య - కావచ్చును తనయాలు (పాండు 3 97)

**కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. 32**

| | | |
|---|---|---|
| సరసము . | మాట | సరసపుమాట |
| | | సరసంపుమాట |
| విరసము | వచనము | విరసపు వచనము |
| | | విరసంపు వచనము. |

వ్యా కర్మధారయములందు 'ము' ప్రత్యయమునకు, పుంపులగును వర్ణకము=ప్రత్యయము పుంపులు = పువర్ణము, పూర్ణబిందుపూర్వకపు వర్ణము-అని యర్థము (అరసున్న రానేరదు) సరసము + మాట = సరసపుమాట పూర్ణబిందు పూర్వక 'పు' వర్ణము -అనఁగా, "ంపు" ఆదేశమయినచో- సరసంపు మాట విరస + ము + వచన + ము సమాస 25 చే - విరసము + వచన సంధి 32 చే - విరసపువచన, విరసంపువచన తత్సమ 39 చే-విరసపు వచనము, విరసంపు వచనము

విశే - (i) సరసము + మాట - ఇత్యాదులలో మొదటి శబ్దమునందలి ము వర్ణకము సమాస 25 చే - లోపింపవలసియుండును కాని పుంపుల నాదేశముగ విధించిన సామర్థ్యముచే మువర్ణకమునకు లోపము రాలేదు (ii) సరస+ము మాట + ము - ఇత్యాదు లలౌకిక విగ్రహములు తత్సమ 39చే- సరసపు మాట + ము తత్సమ 57 చే - సరసపుమాట

పదసార్థక్యము - కర్మధారయంబులందు - బహువచన స్వారస్యముచే షష్ఠీతత్పురుషమున నరుదుగా, పుంపులగును ఉదా॥ సింగము + కొదమ =

సింగపు + కొదమ, సింగపుఁగొదమ (చూ 25) తద్ధిత వృత్తియందును, పుంపులగును సరసము + తనము = సరసపుఁదనము - చూ 35 సూ॥

## ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరమగు నపుడు నుగాగమంబగు. 33

| | | |
|---|---|---|
| చేయు | అతఁడు | చేయునతఁడు |
| చేసెడు | అతఁడు | చేసెడు నతఁడు |

వ్యా హ్రస్వమగు ఉకార మంతమందుఁగల తద్ధర్మార్థ విశేషణమునకు నచ్చుపరమగుచో, దాని చివర నువర్ణమాగమమగును తద్ధర్మార్థ విశేషణము= ఆ క్రియ ధర్మముగాఁగల కర్తను దెలుపునది తద్ధర్మార్థ విశేషణము ఉదా॥ నతఁడు చేయుటయను క్రియను జేయువాఁడని యర్థము - చేసెడు, చేయు - వంటివి ఉదంత తద్ధర్మార్థ విశేషణములగును నుక్+ఆగమ=నుగాగమము 'క్' అనునది యాగమము నిర్దిష్టమునకుఁ జివరఁ జేరునని తెలుపును నువర్ణమే సూరిమతమున ద్రుతముగాన 'ను' అనునదే యాగమమగును ఉదా॥ చేయు + అతఁడు = చేయును + అతఁడు ద్రుతమున కచ్చువరమగునపుడు ద్రుతస్వర మునకు లోపమగుట బాలవ్యాకరణ ప్రక్రియా పద్ధతి (2, 5, 9, 41 సూ) కావున చేయున్ + అతఁడు - అగును 9 చే సంధి నిషిద్ధముగాన, చేయునతఁడు -అను రూపమేర్పడును ఇట్లే, చేసెడును + అతఁడు=చేసెడున్ + అతఁడు, చేసెడునతఁడు - అగును

పదసార్థక్యము - అచ్చుపరమగునపుడు - అనుటచే హల్లుపరమగునపుడు నుగాగమము రాదు ఉదా॥ చేయు + వాఁడు = చేయువాఁడు

## షష్ఠీసమాసమునం దుకార ఋకారములకచ్చు పరమగునపుడు నుగాగమంబగు. 34

| | | |
|---|---|---|
| రాజుయొక్క | ఆజ్ఞ | రాజునాజ్ఞ. |
| విధాతృయొక్క | ఆనతి | విధాతృనానతి. |

వ్యా షష్ఠీ తత్పురుష సమాసమున, ఉకార ఋకారములకు, అచ్చుపర మగునపుడు, నుగాగమ మగును ఉదా॥ (1) రాజుయొక్క + ఆజ్ఞ సమాస 25 చే - యొక్క లోపించును రాజు + ఆజ్ఞ ఈ 34 చే - రాజును+ఆజ్ఞ - అగును అచ్చుపరమగుచో ద్రుతస్వరమునకు లోపమగుట బాలవ్యాకరణ పద్ధతి - (2, 5, 9, 41 సూ) కాన, రాజును + ఆజ్ఞ = రాజున్ + ఆజ్ఞ - అగును,

9 చే - సంధి లేదు గాన, రాజునాజ్ఞ - అగును ఇది ఉకారమున కుదాహరణము
(11) ఋకారమునకు విధాతృయొక్క + అనతి సమాస 25 చే - విధాతృ +అనతి ఈ 34 చే విధాతృను + అనతి = విధాతృన్ + అనతి విధాతృనానతి

విశే - రాజు+యొక్క + "ఆజ్ఞ + ము", "విధాతృ+యొక్క"+ "అనతి + సు" అలౌకిక విగ్రహములు రాజునాజ్ఞ - చూ సమాస 2 అనుకృన్యాయమున (తత్సమ 44) విధాతృనానతి + సు తత్సమ 57 చే - విధాతృనానతి

పదసార్థక్యము - అచ్చు పరమగునపుడు - అనుటచే హల్లు పరమగుచో నుగాగమము లేదు రాజుయొక్క కొడుకు = రాజుకొడుకు

## ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణ వాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు. 35

| | | |
|---|---|---|
| సొగసు | తనము | సొగసుందనము |
| | | సొగసుఁదనము |
| | | సొగసున్దనము. |
| సరసపు | తనము | సరసపుందనము |
| | | సరసపుఁదనము |
| | | సరసపున్దనము |
| తెల్ల | తనము | తెల్లందనము |
| | | తెల్లఁదనము |
| | | తెల్లన్దనము |

వా హ్రస్వమయిన ఉకారమంతమందుఁగల స్త్రీసమములకు, పుంపులకు, హ్రస్వమయిన అకార మంత మందుఁగల గుణవాచకములకు, తన ప్రత్యయము పరమయినప్పుడు నుగాగమమగును స్త్రీసమము = ప్రథమైక వచన ప్రత్యయము లోపించిన యచ్చతెనుఁగు శబ్దము సొగసు - ఉదంత స్త్రీసమము గుణవాచకములు = గుణమును దెలుపునవి, ఇవి నల్ల మొదలగునవి (చూ తద్ధిత 6)

(1) ఉదంత స్త్రీసమములకు - సొగసు + తన - ఈ 35చే సొగసును + తన 16చే - సొగసును + దన 17చే - సొగసుందన, సొగసుఁదన, సొగసు న్దన తత్సమ 39చే - సొగసుందనము, సొగసుఁదనము, సొగసున్దనము (2) పుంపులకు - సరసము + తన 32చే - సరసపు + తన ఈ 35 చే - సరసపును + తన 16చే - సరసపును + దన 17చే - సరసపుందన, సరసపుఁదన, సరసపున్దన తత్సమ 39చే - సరసపుందనము, సరసపుఁదనము, సరసపున్దనము (3) అదంత గుణవాచకములకు - తెల్ల + తన ఈ 35చే - తెల్లను + తన 16చే - తెల్లను+దన 17చే - తెల్లందన, తెల్లఁదన, తెల్లన్దన తత్సమ 39చే - తెల్లందనము తెల్లఁదనము తెల్లన్దనము తన - అనునది తద్ధిత ప్రత్యయము (తద్ధిత 1) కాన నిది తద్ధితవృత్తి 26చే - తద్ధిత వృత్తి యందును ద్రుతమునకు స్వత్వముండదు కావున సొగసునుదనము, సరసపును దనము, తెల్లనుదనము - అను రూపములుండవు

విశే - (1) తద్ధిత 1చే - సొగసుయొక్క + తన సమాస 25 సూత్రము వృత్తి సామాన్యమున కుపలక్షణము కావునఁ దద్ధిత వృత్తిలో 'యొక్క' లోపించి, సొగసు+తన - అని నిల్చును ఇట్లే సరసముయొక్క + తన = సరసము + తన (11) తెల్లదానియొక్క + తన సమాస 25చే- తెల్లదాని + తన సమాస 20చే - 'దాని" లోపించి, తెల్ల + తన - అని నిల్చును (111) వృత్తి-చూ 31 (1v) కక్షసపుందనంబు (ఉ రా 7.331)

పదసార్థక్యము - ఉదంత స్త్రీసమంబులకు - అనుటచే, ఉదంతేతరము లకు "ను" గాగమము లేదు ఉదా॥ గోడతనము, మంచితనము మొ॥

**సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. 36**

| | | |
|---|---|---|
| ప్రాఁత | ఇల్లు | ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు |
| లేఁత | దూడ | లేదూడ, లేఁతదూడ. |
| పూవు | రెమ్మ | పూ రెమ్మ, పూవురెమ్మ |

వా సమాసమున, ప్రాఁత మొదలగు శబ్దముల తొలియచ్చు మీఁది వర్ణముల కన్నింటికి, లోపము బహుళముగానగును ప్రాఁత + ఇల్లు, ఇందుఁ దొలియచ్చు 'ప్రా'లోని 'ఆ' తొలియచ్చుమీఁది వర్ణములు - అరసున్న, త (ఁత) వీనికి లోపము వచ్చినచో, ప్రా+ఇల్లు-అగును 3 చే - ప్రా - య్ + ఇల్లు = ప్రాయిల్లు తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము రానిచో - ప్రాఁత+ఇల్లు 3 చే - ప్రాఁత-య్+ఇల్లు = ప్రాఁత యిల్లు లేఁత+దూడ

తొలియచ్చు మీఁది వర్ణములు లోపించిన లే+దూడ=లేదూడ లోపింపనిచో - లేఁతదూడ ఇట్లే పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ ఇవి బహుళ ప్రయోజనములలో విభాషకు లక్ష్యములగును

విశే - (1) పూవుయొక్క+రెమ్మ = పూవురెమ్మ షష్ఠీయాధారాధేయ సంబంధమున నయినది (కారక 15) (11) ప్రాఁత + ము + ఇల్లు + వు - ఇత్యాదు లలౌకిక విగ్రహములు

పదసార్థక్యము - వర్ణంబుల కెల్లన్ - అనుటచేఁ దొలియచ్చు మీఁది వర్ణములన్నియు లోపించును వర్ణంబులు - అన్నచో, ప్రాఁత శబ్దమున, "అర సున్న+త్+అ" అను మూఁడు వర్ణములలో నరసున్న, తగారము లోపించి అత్వము మిగులవచ్చును కాన, ఎల్లన్ - అను పదము సార్థకము

## లుప్తశేషంబునకుం బరుషంబులు పరములగునపుడు నుగాగమంబగు. 37

| | | |
|---|---|---|
| ప్రాఁత | కెంపు | ప్రాఁగెంపు |
| లేఁత | కొమ్మ | లేఁగొమ్మ |
| పూవు | తోఁట | పూఁదోట |
| మీఁదు | కడ | మీఁగడ |
| కెంపు | తామర | కెందామర |
| చెన్ను | తొవ | చెందొవ |

చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు బహుళ గ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు వ్యవస్థిత విభాషచే నీ ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు

వ్యా ప్రాఁతాది సూత్రముచేఁ దొలి యచ్చుమీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన శబ్దమునకుఁ బరుషములు పరమయినప్పుడు నుగాగ మగును లుప్త శేషము = లోపింపఁగా మిగిలినది ఉదా॥ ప్రాఁత 36చే - ప్రా + కెంపు, ప్రా - లుప్తశేషము దీనికిఁ బరుషము (కకారము) పరమయినది గాన నుగాగమము ప్రాను+కెంపు 16చే - ప్రాను + గెంపు 17చే - ప్రాఁగెంపు సంజ్ఞా 15 చే - నిండుసున్న లేదు ప్రాఁతాదులలో సంశ్లేషము లేదు 26 చే - ప్రానుగెంపు - అను స్వత్వము లేదు 36 చే - తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము గానిచో, ప్రాఁతకెంపు - అని యుండును ఇట్లే, లేఁత + కొమ్మ =

లే + ను + కొమ్మ లేఁగొమ్మ తొలియచ్చుమీఁది వర్ణములకు లోపమురాని పక్షమున - లేఁతకొమ్మ - అను రూపముండును పూఁదోఁట - పూవు + తోట పూ + తోట ఈ 37 చే - పూను + తోఁట + 16 చే పూను + దోఁట 17 చే - పూఁదోఁట సంజ్ఞా 15 చే - నిండుసున్న లేదు ప్రాఁతాదులలోనిది గాన సంశ్లేషము లేదు 26 చే - స్వత్వములేదు 36 చే - తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము రానప్పుడు - పూవు+తోఁట 25 చే - పూవును+తోఁట ద్రుతకార్యము జరిగి - పూవుందోఁట, పూవుఁదోఁట, పూవున్దోఁట - అగును మీఁగడ - మీఁదు + కడ 36 చే - మీ + కడ ఈ 37 చే - మీను+కడ 16 చే - మీను+గడ 17 చే - మీఁగడ సంజ్ఞా 15 చే - సాధ్య పూర్ణము లేదు ప్రాఁతాదులలోనిది గాన సంశ్లేషములేదు 26 చే - స్వత్వములేదు కెందామర - కెంపు+తామర 36 చే - కె+తామర ఈ 37 చే - కెను + తామర 16 చే - కెను+దామర 17 చే - కెందామర 22 చే - అరసున్న లేదు ప్రాఁతాదులలోనిది గాన సంశ్లేషము లేదు 26 చే - స్వత్వము లేదు ఇట్లే, చెన్ను+తొవ = చె+ను+తొవ చెందొవ - అగును చెన్ను శబ్దమునకు వృత్తియందు - అనఁగా సమాసమునందు, శోణమని యర్థము శోణము = ఎఱ్ఱనిది చెందొవ = ఎఱ్ఱ కలువ చెన్ను శబ్దమునకు వ్యస్తమున నందమని యర్థము వృత్తులయిదు విధములు వానిలో సమాసమొకటి (31 సూ) ఇట వృత్తి యనునది సమాస వృత్తిని దెలుపును 36 వ సూత్రమునఁ దొలియచ్చు మీఁది వర్ణములకు లోపము బహుళముగా విధింపబడినది కావున, మీఁదు, కెంపు చెన్ను, (మీఁదు ప్రభృతులు) శబ్దముల తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము నిత్యముగా నగును, మీఁదు+కడ = మీ+కడ, కెంపు+తామర = కె+తామర చెన్ను + కలువ = చె+కలువ - అని నిత్యముగ నీ లోపము జరుగును కాన మీఁదుకడవంటి రూపములుండవు ఇది బహుళ ప్రయోజనములో ప్రవృత్తికి లక్ష్యము ప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగా నగుట వ్యవస్థిత విభాషచేనీ ద్రుతంబునకు సంశ్లేషంబులేదు దీనికి వివరణము - వ్యవస్థిత విభాష = విధించిన వ్యాకరణ కార్యమిట నిత్యముగ వర్తించుననియు, నిటఁ బ్రవర్తింపదనియు, నిట వైకల్పికముగఁ బ్రవర్తించుననియు, నిట్లు లక్ష్యానుసారముగ నైన వ్యవస్థతోఁ గూడుకొనిన విభాష, వ్యవస్థిత విభాష యనఁబడును లక్ష్యానుసారేణ వ్యవస్థయా ప్రవృత్తా విభాషా - బాలమ 17 వ సూత్రము నందలి విభాషవ్యవస్థిత విభాష వ్యవస్థ = ఏర్పాటు ఈ వ్యవస్థ యేమనగాఁ బ్రాఁతాదులలో ద్రుతమునకు సంశ్లేషము లేదనునది ఇట్టి వ్యవస్థతో గూడుకొనినది కనుక 17 వ సూత్రమునందలి విభాష వ్యవస్థిత విభాష

యయినది కాన ప్రాను + గెంపు - మొదలగుచోట్ల 17 చే బిందు సంశ్లేషములు ప్రాప్తింపవలసి యున్నను సంశ్లేషమీ ప్రాఁతాదులలోఁ గలుగదు

విశే - మీఁగడ = మీఁదయినకడ ఈ విగ్రహ వాక్యముచే మండమను నర్థము గమ్యము కాదు చెందొవ = చెన్నయిన తొవ ఈ విగ్రహ వాక్యముచే నెత్తి కలువను నర్థము గమ్యము కాదు లౌకిక విగ్రహము లుండుటచే నివి నిత్య సమాసములు కావు కాని వీనికి సమాసము నిత్యము విశేషణం విశేష్యేణ బహుళమ్ (2-1-52) బహుళ గ్రహణాత్ క్వచిన్నిత్యమ్ - కృష్ణ సర్పః (సి కౌ) = త్రాఁచుపాము

## క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్నియెడల మీది హల్లునకు ద్విత్వంబునగు. 38

| | | |
|---|---|---|
| క్రొత్త | చాయ | క్రొంజాయ |
| క్రొత్త | చెమట | క్రొంజెమట |
| క్రొత్త | పసిఁడి | క్రొంబసిఁడి |
| క్రొత్త | కారు | క్రొక్కారు |
| క్రొత్త | తావి | క్రొత్తావి |

పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమ ప్రాప్తి లేమిం జేసి వానికి ద్విత్వంబగు

| | | |
|---|---|---|
| క్రొత్త | గండి | క్రొగ్గండి |
| క్రొత్త | నన | క్రొన్నన |
| క్రొత్త | మావి | క్రొమ్మావి |

కెందూళి, కెఁజడలని ప్రయోగంబులు గానంబడియెడి బహుళ గ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు

క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ - ఇత్యాదులం గ్రింద శబ్దమునకు లుప్త శేషంబునకు దీర్ఘంబు బహుళ గ్రహణము చేత నని యెఱుఁగునది.

వ్యా తొలియచ్చు మీది వర్ణములు లోపింపఁగా మిగిలిన, క్రొత్త శబ్దపు మొదటి యక్షరమునకుఁ గొన్ని చోట్ల నుగాగమమును, మరికొన్ని చోట్ల,

మీఁది హల్లునకు ద్విత్వమును నగును (1) నుగాగమమునకు - క్రౌంజాయ క్రౌత్త + చాయ 36 చే - క్రౌ+చాయ ఈ 38 చే - క్రౌ+ను+చాయ 16 చే - క్రౌను+జాయ 17 చే - క్రౌంజాయ 22 చే - ఖండ బిందువు లేదు 26 చే - స్వత్వములేదు వ్యవస్థిత విభాషచే (37) సంశ్లేషము లేదు ఇట్లే, క్రొత్త+చెమట=క్రొ+ను+చెమట క్రొంజెమట క్రొత్త+పసిఁడి= క్రొ+ను+పసిఁడి, క్రొంబసిడి (2) మీది హల్లునకు ద్విత్వము కలుగుటకు క్రొక్కారు - క్రొత్త+కారు 36 చే - క్రొ+కారు ఈ 38 చే - క్రొక్కారు ఇట్లే, క్రొత్త+తావి = క్రొ+తావి క్రొత్తావి ఇట్లు పరుషములు పరమగుచోఁ గొన్నిచోట్ల నుగాగమము, కొన్నిచోట్ల ద్విత్వము నగును పరుషేతరములు పరమగునపుడు నుగాగమము రాదు ద్విత్వమే యగును క్రొగ్గండి– క్రొత్త+గండి 36 చే - క్రొ+గండి 37 చే - పరుషములు పరమగునపుడె నుగాగమ మగును ఇట సరళము పరమగుటచే నుగాగమము లేదు కాన నీ 38 చే - ద్విత్వము మాత్రమే యగును క్రొ+గండి = క్రొగ్గండి ఇట్లే స్థిరము పరమగుచో ద్విత్వమే యగును క్రొత్త + నన = క్రొ + నన క్రొన్నన క్రొత్త+మావి = క్రొ+మావి క్రొమ్మావి

కెందూళి, కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి కెంపు+దూళి 36 చే - కె+దూళి 37 చే - పరుషములు పరమగునపుడే నుగాగమమగును ఇట వర్గయుక్కు పరమగుటచే నుగాగమము కలుగుటకు వీలులేదు ఇట్లే కెంపు + జడలు 36 చే - కె + జడలు 37 చే - సరళము పరమగుచో నుగాగమము కలుగ నవకాశము లేదు కాని 'కెందూళి - కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి' అనుటచే, నీ రెండుచోట్ల నుగాగమములగును కెను+దూళి, కెను+జడలు 19 చే - పూర్ణ బిందువు కలిగి - కెందూళి, కెంజడలు - అనునవి సిద్ధించును బహుళ గ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు 36 వ సూత్రమునఁ దొలియచ్చుమీఁది వర్ణములకు లోపము బహుళముగా విధింపఁబడినది క్రొత్త+కుండలు - అనుచోఁ దొలియచ్చుమీఁది వర్ణములకు లోపములేదు ఇది బహుళ ప్రయోజనములలో, న ప్రవృత్తికి లక్ష్యము అప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపక పోవుట క్రిందు+కడుపు 36 చే - క్రి+కడుపు 37 చే - క్రిను+కడుపు బహుళగ్రహణముచే "క్రి" అను లుప్త శేషమునకు దీర్ఘమగును క్రీను+కడుపు 16 చే - క్రీను+గడుపు 17 చే - క్రీఁగడుపు సంజ్ఞా 15 చే - నిండు సున్న లేదు 26 చే - స్వత్వములేదు వ్యవస్థిత విభాషచే (37) సంశ్లేషములేదు "క్రి" అను లుప్త

శేషమునకు దీర్ఘము కలుగుట బహుళ ప్రయోజనములలో నన్యకార్య ప్రవృత్తి యగును ఇట్లే క్రిందు+కాలు = క్రీ + ను + కాలు క్రీఁగాలు, క్రిందు + తొడ = క్రీ+ను+తొడ, క్రీఁదొడ బహుళ ప్రయోజనములు

(1) ప్రవృత్తి - విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగఁ బ్రవర్తించుట ఉదా॥ మీఁదు+కడ = మీ+కడ, కెంపు+తామర = కె+తామర, చెన్ను+తొవ = చె+తొవ ఇట్లు తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము మూడింట నిత్యముగ నగుట ప్రవృత్తి యగును ఇట్లే ముందు + కొంగు = ముంగొంగు (22 సూ )

(2) అప్రవృత్తి - విధించిన వ్యాకరణకార్యము ప్రవర్తింపక పోవుట ఉదా॥ క్రొత్త + కుండలు = క్రొత్తకుండలు ఇటఁ దొలియచ్చుమీఁది వర్ణములకు లోపమురాలేదు ఇది యప్రవృత్తి

(3) విభాష - విధించిన వ్యాకరణకార్య మొకపక్షముననగుట, యొకపక్షమునఁ గాకపోవుట ప్రాఁత, లేఁత, పూవు శబ్దముల తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము విభాషగ నగును ప్రాఁత+ఇల్లు, తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము వచ్చిన, ప్రా + ఇల్లు - అగును లోపమురానిచో, ప్రాఁత+ఇల్లు-అని నిల్చును పిమ్మట యడాగమములు కలిగి ప్రాయిల్లు ప్రాఁతయిల్లు - ఇత్యాదిగా నేర్పడును లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ, పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ క్రొత్త + చాయి తొలియచ్చు మీఁదివర్ణములు లోపించిన, క్రొ + చాయ - అగును పిమ్మట, క్రొంజాయ - అగును లోపింపనిచో క్రొత్తచాయ - అనియుండును ఇవి తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము విభాషనగుట కుదాహరణములు

(4) అన్యకార్య ప్రవృత్తి = వేఱు కార్యము జరుగుట క్రిందుశబ్ద లుప్త శేషమగు 'క్రి' శబ్దమునకు దీర్ఘము కలుగుట యన్యకార్య ప్రవృత్తి ఉదా॥ క్రి + ను + కడుపు = క్రీ+ను+కడుపు క్రి+ను+కాలు=క్రీ + ను+ కాలు క్రి+ను+తొడ=క్రీ+ను+దొడ వీనిలో, క్రి - లోని ఇకారమునకు దీర్ఘమగుట యన్యకార్య ప్రవృత్తి ఇట్లు బహుళ ప్రయోజనములు నాలుగును బాలవ్యాకరణమున నీ ప్రాఁతాది కార్యములయందు మాత్రమే కన్పట్టును

విశే - (1) "క్రొత్త + ము" + "చాయ+ము" - ఇత్యాదు లలౌకిక విగ్రహములు (11) పరుషములు పరమగునపుడు ద్విత్వము సహితమగుట క్రొత్త శబ్ద విశిష్టత

## అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. 39

ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోప నుగాగమంబులును, గొండొక శబ్దమున కొకానొక శబ్దము పరంబగునపుడు లోప ద్విత్వంబులును ప్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము

| | | |
|---|---|---|
| పది | తొమ్మిది | పందొమ్మిది |
| తొమ్మిది | పది | తొంబది |
| వంక | చెఱఁగు | వంజెఱఁగు. |
| సగము | కోరు | సంగోరు. |
| నిండు | వెఱ | నివ్వెఱ |
| నిండు | వెఱఁగు | నివ్వెఱఁగు. |
| నెఱ | తఱి | నెత్తఱి. |
| నెఱి | నడుము | నెన్నడుము. |
| నెఱ | మది | నెమ్మది, |
| నెఱ | వడి | నెవ్వడి |

ఇత్యాదులు ప్రయోగంబుల వలనం దెలియునది

వ్యా ప్రాంతాదులలోఁ జేరని యితర శబ్దములకుఁ గూడ, లోప నుగాగమములు, లోపద్విత్వములు కొన్నిచోట్లఁ గనఁబడును "ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు తొంటి యట్లు లోప నుగాగమంబులు" తొంటియట్లు = 36, 37 సూత్రములలో విధించినట్లు పరుషములు పరములగునపుడు లోపనుగాగమములు ద్రుతకార్యములు నగునని తాత్పర్యము పందొమ్మిది - పది + తొమ్మిది ఈ 39చే - తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము, నుగాగమము కలుగఁగా, ప+ను+తొమ్మిది-అగును 16చే - పను+దొమ్మిది 17చే - పందొమ్మిది 22చే - ఖండబిందువులేదు 26చే స్వత్వము లేదు వ్యవస్థిత విభాషచే సంశ్లేషములేదు ఇట్లే, తొమ్మిది+పది=తొ+ను+పది, తొంబది వంక + చెఱఁగు=వ+ను+చెఱఁగు వంజెఱఁగు సగము+కోరు సమాస 25చే - సగ+కోరు ఈ 39చే - స+ను+కోరు. సంగోరు

"కొండొక శబ్దమున కొకా నొక శబ్దము పరమగునపుడు లోవ ద్విత్వంబులు' నిండు + వెలి ని + వెలి = నివ్వెలి, నిండు + వెలుఁగు = ని + వెలుఁగు నివ్వెలుఁగు నెలి + తలి = నె + తలి నెత్తలి నెలి+నడుము= నె + నడుము నెన్నడుము నెలి + మది = నె + మది నెమ్మది నెలి+ వడి = నె + వడి నెవ్వడి ఇత్యాదుల ప్రయోగములనుబట్టి తెలిసికొనవలెను

విశే (1) ఈరూపముల కలౌకిక విగ్రహములూహ్యములు (11) పది శబ్దమునకు, తొమ్మిది శబ్దము, 'తొమ్మిది'కి 'పది', 'వంక'కు చెలుఁగు 'సగము' నకు 'కోరు' శబ్దములు పరమగునప్పుడే యీలోవ నుగాగమములగును ఇతర శబ్దములు పరమగుచో లోవ నుగాగమములుకావు (111) నిండు, నెలి శబ్దముల కేదోయొకటే శబ్దము పరమయినప్పుడు కాక యేవో రెండుమూఁడు శబ్దములు పరమయినప్పుడు లోవల ద్విత్వములు కలుగుచున్నవి కావున నొకశబ్దమున కొకటికంటె నెక్కువ శబ్దములు పరమగునప్పుడు లోవద్విత్వము లగునని గ్రహింపవలెను (1v) కెంపు, పూవుశబ్దముల కన్యముల ధర్మములు లేవు ఇవి ప్రాఁతాదులలోనివి గాన వీని నన్యములలోఁ గొందఱు చేర్పనగునని సెలవిచ్చుట సరికాదు (కెంపు + మోవి 36చే - కె+మోవి ము కా సంధి 29చే - కెమ్మోవి) పువ్వు+పొడి ఈ 39చే - పుప్పొడి (v) అన్యంబులనఁగాఁ గ్రొత్త శబ్దముఁకంటె నన్యములనుటయు సరికాదు క్రొత్త శబ్ద ధర్మములన్యములకు లేవు ఎట్లన-క్రొత్త శబ్దమునకగు ద్విత్వము పూవు శబ్దమునకు లేదు క్రొత్త+ మావి = క్రొమ్మావి పూవు + మొగ్గ = పూమొగ్గ క్రొత్త శబ్దమునకుఁ బరుషము పరమగుచోనగు ద్విత్వము కెంపు శబ్దమునకు లేదు క్రొత్త + కారు= క్రొక్కారు కెంపు + తామర = కెందామర

## ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు. 40

ఈ సూత్రంబునకు భూశార్థంబునందు ద్విరుక్తంబు విషయం బని యెఱుంగునది.

| | | |
|---|---|---|
| కడ | కడ | కట్టకడ |
| ఎదురు | ఎదురు | ఎట్టయెదురు |

కడ, ఎదురు, కొన, చివర, తుద, తెన్ను, తెరువు, నడుమ,' పగలు, పిడుగు, బయలు, మొదలు—ఇత్యాదులు కడాదులు.

వ్యా ఆమ్రేడితము పరమయినప్పుడు, కద - మొదలగు వాని తొలి యచ్చు మీఁది వర్ణముల కన్నింటికి "ట్ట" అనునది యగును ఆమ్రేడితము = ద్విరుక్తము యొక్క పరరూపము (10) ద్విరుక్తటకారము = రెండు సారులు పలుకఁబడిన టకారము అనఁగా - ట్ట్ - అనునది అదంతంబగు - అనుటచే హ్రస్వమగు అకారమునంతమునఁ జేర్పఁగా ట్ట్ + అ = ట్ట - అగును కాన అదంతంబగు ద్విరుక్త టకారమనఁగా - 'ట్ట' అనునది ఉదా॥ కద+కద తొలియచ్చు 'క' లోని, అకారము తొలియచ్చుమీఁది వర్ణములు - ద్+అ - అనునవి ఈ తొలి యచ్చుమీఁది వర్ణములకెల్ల 'ట్ట' అనునది యాదేశమయి, కట్టకద - అగును ఎదురు + ఎదురు ఎ - తొలియచ్చు దురు = ద్+ఉ+ ర్+ఉ - తొలియచ్చు మీఁది వర్ణములు వీనికి 'ట్ట' ఆదేశమయి ఎట్ట+ ఎదురు - అగును 10చే - సంధియరుదుగాఁ గాకపోవచ్చును గనుక నిట సంధి 3చే - ఎట్ట-య్+ఎదురు = ఎట్టయెదురు - అగును కొన + కొన = కొట్ట కొన - ఇత్యాదిగాఁ దక్కినరూపముల ప్రక్రియను గ్రహింపవలెను ఇత్యాదులు కదాదులు భృశము = మిక్కిలి మిక్కిలి యను నర్థమున రెండుసార్లు పలుకఁబడునవి యీ సూత్రమునకు లక్ష్యములగును కద+కద ఇట కద శబ్దము ద్విరుక్తమగుట భృశార్థమునఁ జరిగెను ఇట్లే తక్కినవి

ప్రదసార్థక్యము - వర్ణంబుల కెల్లన్ - అననిచో, ఎదురు శబ్దమున, ద్+ఉ - అను రెండు వర్ణములకే "ట్ట" వర్ణము కావచ్చును కాన, ఎల్లన్ - అను పదము సార్థకము

## ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగానగు 41.

| | | |
|---|---|---|
| అప్పటికిన్ | అప్పటికిన్ | అప్పటప్పటికిన్ |
| | | అప్పటి కప్పటికిన్ |
| అక్కడన్ | అక్కడన్ | అక్కడక్కడన్ |
| | | అక్కడనక్కడన్ |
| ఇంటన్ | ఇంటన్ | ఇంటింటన్ |
| | | ఇంటనింటన్ |
| ఊరన్ | ఊరన్ | ఊరూరన్ |
| | | ఊర్నూరన్ |

ఇంచుకనాఁడిత్యాదులందు బహుళ గ్రహణముచే నంతిమాక్షర లోపంబునగు

| | | |
|---|---|---|
| ఇంచుక | ఇంచుక | ఇంచించుక, ఇంచుకించుక |
| నాఁడు | నాఁడు | నానాఁడు, నాఁడు నాఁడు |

వ్యా ఆమ్రేడితము పరమయినప్పుడు విభక్తిలోపము బహుళముగా నగును ఆమ్రేడితము = ద్విరుక్తముయొక్క పరరూపము (10సూ) (1) అప్పటికిన్ + అప్పటికిన్ ఇట రెండవ "అప్పటికిన్" - ఆమ్రేడితము ఈ 41చే - విభక్తిలోపించినచో - అప్పటి + అప్పటికిన్ - అగును 10చే - అప్పటప్పటికిన్ - అగును విభక్తి లోపింపనిచో - అప్పటికిన్+అప్పటికిన్ నిర్దేశానుసారము 10చే - అప్పటప్పటికిన్ (2) అక్కడన్ + అక్కడన్ ఇట 'అన్' అనునది సప్తమీ విభక్తిగా నున్నది (ఆచ్ఛిక 38) కాన 'అన్' లోపించినచో - అక్కడ్ + అక్కడన్ = అక్కడక్కడన్ - అగును అన్- లోపింపనిచో - అక్కడన్ + అక్కడన్, 9చే - సంధిరాదు గనుక, అక్కడ నక్కడన్ – అగును (3) ఇంటన్ + ఇంటన్ - 'అన్' అను విభక్తి లోపించిన, ఇంట్ + ఇంటన్ = ఇంటింటన్ - అగును లోపింపనిచో - ఇంటన్ + ఇంటన్ = ఇంటనింటన్ - అగును ఊరన్ + ఊరన్ - 'అన్' లోపించిన - ఊర్ + ఊరన్=ఊరూరన్ అన్ - లోపమురానిచో - ఊరన్+ ఊరన్ = ఊరనూరన్ - అగును ఇంచుక, నాఁడు – మొదలగువానిలో బహుళ గ్రహణముచేఁ దుది యక్షరములకు లోపము నగును ఇంచుక+ఇంచుక= ఇంచు + ఇంచుక-10చే ఇంచించుక 'క' వర్ణము లోపింపనిచో - ఇంచుక+ ఇంచుక 10చే - ఇంచుకించుక అరుదుగా 10చే - వైకల్పిక సంధికావచ్చును గనుక, ఇంచుక యించుక యనియు (శ్రౌ నై 2-58) నగును నాఁడు+నాఁడు తుదియక్షరమగు 'డు' వర్ణములోపించినచో - నాఁ+నాఁడు - అగును సంజ్ఞా 16చే - బిందువు స్థిరమునకు ముందుండరాదు గనుక లోపించి, నానాఁడు - అను రూపము సిద్ధించును 'డు' లోపింపని పక్షమున - నాఁడు నాఁడు - అనియు నుండును

విశే - (1) అప్పటికిని + అప్పటికిని, అక్కడను + అక్కడను, ఇంటను + ఇంటను, ఊరను + ఊరను - అనియే మొదటి పదచ్ఛేదములు అచ్చుపరమగుచో ద్రుతస్వరము నిర్దేశానుసారము లోపించుట బాలవ్యాకరణ ప్రక్రియ గనుక - అప్పటికిన్ + అప్పటికిన్ - ఇత్యాది పదచ్ఛేదములు సిద్ధించెను (11) అక్కడను, ఇంటను, ఊరను అనువాని ప్రక్రియ యాచ్ఛిక

38 వ సూత్రమును బట్టి గ్రహింపవలెను (111) ఈ సూత్రము చేత గ్రియా విభక్తిలోపమును బ్రసక్తమగును (49 సూ) (1v) అప్పటికిన్ + అప్పటికిన్ ఇట, అప్పటికప్పటికిన్-అను నిర్దేశ సామర్థ్యమున నింకాది విధి (9) వర్తిల్లదు 10చే - సంధి తఱచుగ నగును ఆమ్రేడిత సంధియగుటచే నేమ్యాది విధికి (5) బ్రసక్తిలేదు

## అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. 42

అందదుకు, ఇఱ్ఱింకులు, ఇల్లిగ్గులు, చెల్లచెదరు, చెల్లాచెదరు, తుత్తుమురు, తుత్తునియలు, మిఱుమిట్లు ఇత్యాదులెఱుంగునది

వ్యా అందదుకు మొదలైనవి ప్రయోగానుసారముగ గ్రహింపఁదగినవి ఉదా॥ అదుకు + అదుకు = అందు + అదుకు 10చే - అందదుకు ఇట్లే, ఇంకులు + ఇంకులు = ఇఱ్ఱు+ఇంకులు ఇఱ్ఱింకులు, ఇగ్గులు + ఇగ్గులు= ఇల్లు + ఇగ్గులు ఇల్లిగ్గులు చెదరు + చెదరు = చెల్ల + చెదరు, చెల్లచెదరు, చెల్లా + చెదరు = చెల్లాచెదరు తుమురు + తుమురు = తుత్ + తుమురు తుత్తుమురు తునియలు + తునియలు=తుత్ + తునియలు తుత్తునియలు మిట్లు + మిట్లు = మిఱు + మిట్లు మిఱుమిట్లు ఇత్యాదులు తెలియవలెను తొలియచ్చు మీఁది వర్ణములకగు నాదేశములు భిన్నరీతుల నుండుటచేఁ బ్రయోగముల ననుసరించి గ్రహింపఁదగునని చెప్పఁబడెను

## చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులందగు. 43

| | | |
|---|---|---|
| నీ చేతన్ | ప్రోపు | నీ చేతిప్రోపు |
| నాతోడన్ | చెలిమి | నాతోడిచెలిమి, |
| నీవలనన్ | భయము | నీవలని భయము. |

వ్యా సమాసములలో, చేత తోడ వలన, ప్రత్యయముల తుది నున్న హ్రస్వమయిన అకారమునకు, హ్రస్వమయిన ఇకారమాదేశమగును ఉదా॥ నీచేతన్+ప్రోపు 24చే - నీచేత + ప్రోపు ఈ 43చే - నీచేత్+ఇ+ప్రోపు= నీచేతిప్రోపు నాతోడన్ + చెలిమి 24చే - నాతోడ+చెలిమి ఈ 43చే - నాతోడ్+ఇ+చెలిమి=నాతోడిచెలిమి "నీవలనన్" + "భయము" సమాస 25చే - నీవలనన్ + భయము 24చే - నీవలన + భయము ఈ 43చే - నీవలన్+ఇ+భయము=నీవలని భయము తత్సమ 39చే - నీవలని భయము.

విశే - (I) అనేక వర్ణములుగల స్థాని కేకవర్ణము నాదేశముగఁజెప్పినచో, నది స్థానియందలి తుది వర్ణమునకే యగునని పాణినీయము (అలోంత్యస్య) కావున, చేత, తోడ, వలన - అనువాని తుది అత్వమునకే, ఇత్వమాదేశమగును (II) ఇవి యలుక్సమాసములు పూర్వపద విభక్తులు లోపింపని సమాసముల నలుక్సమాసములందురు (III) నీచేతన్ = నీచేతనయిన - అని వృత్తిని లక్షణార్థము ఇట్లే, నాయందున్ = నాయందయిన (44)

**అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునందగు. 44**

| | | |
|---|---|---|
| నాయందున్ | కరుణ | నాయందలి కరుణ |
| ఇందున్ | జనులు | ఇందలి జనులు |
| ఎందున్ | వారు | ఎందలివారు |

ఎందు శబ్దమున కలిగాగమము కొందఱు లేదండ్రు

వ్యా అందు మొదలగు వానికిఁ జివర 'అలి' అనునాగమము సమాసమున నగును అలిక్ + ఆగమ = అలిగాగమము 'క్' అనునది నిర్దిష్టమునకుఁ జివరఁ జేరునని తెలుపును కాన అందు - మున్నగు వానికిఁ జివరనే 'అలి' అనునది చేరును ఉదా॥ నాయందున్ + కరుణ, 24చే - నాయందు+కరుణ ఈ 44చే - నాయందు+అలి+కరుణ సంధి 11చే - నాయందలి కరుణ ఇట్లే ఇందున్ + జనులు=ఇందు+అలి+జనులు ఇందలిజనులు ఎందున్+వారు = ఎందు+అలి+వారు ఎందలివారు ఎందు శబ్దమునకు, అలిగాగమము లేదని కొందఱందురు

విశే - (I) అందు - ఇందు శబ్దములకు, అలిగాగమ మగునని యథర్వణాచార్యులు చెప్పినారు (అల్యాగమస్స్యాదంద్వింద్వోః) ఇందు శబ్దమునకు 'అందు' తో పాటు అలిగాగమ మగుట నన్నయ యాశయమని యహోబల పండితుఁడు వ్యాఖ్యానించెను కావున సూరి వాక్యము వీరినే సూచించుచున్నది సూరి మతమున అలిగాగమము 'ఎందు' శబ్దమునకు గలదు కావుననే ఎందున్+వారు = ఎందలివారు - అని యుదాహరించి, పిమ్మట ఎందున కలిగాగమము లేదను మతమును సూచించినారు (II) నాయందున్ - అనుచోటి 'అందు' శబ్దమున కుపలక్షణము కాన, అందున్+జనులు=అందలి జనులు-కావచ్చును (III) నాయందలి కరుణ - అలుక్సమాసము (IV) ఇట 11 చేతనే ద్రుత లోపమనుట యవిచార మూలకము ద్రుతలోపమునకుఁ బ్రత్యేక సూత్రముండఁగా (24) విధాన సామర్థ్యము నాశ్రయించుట సరికాదు,

## అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు. 45

నా అది నాది, నాయది
నా అవి నావి, నాయవి

ఉదంతములగు తద్ధర్మ విశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు, నిదంతంబులగు తద్ధర్మ విశేషణంబుల మీఁద నిత్యంబనియు, బహుళ గ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది, వచ్చునవి , వచ్చెడిది, వచ్చెడివి

వ్యా అది - అవి, శబ్దముల హ్రస్వమయిన అకారమునకు సమాసమున లోపము బహుళముగా నగును వృత్తిన్=సమాస వృత్తియందని యిటనర్థము వృత్తులైదు విధములు వానిలో సమాస మొకటి (31) నాది, నాయది -సమాస 8 చే నా యొక్క + అది సమాస 25 చే- యొక్క లోపించి నా + అది- అగును ఈ 45 చే అత్తునకు లోపము కలిగిన నా + అది = నాది అని సిద్ధించును అత్తు లోపింపనిచో, నా + అది 3 చే - నా- య్ +అది= నాయది - అగును ఇట్లే నా + అవి = నావి, నాయవి బహుళమనుట చే, అది అవి శబ్దముల, అత్తున కుదంత తద్ధర్మ విశేషణముల మీఁద లోపములేదు, ఇదంత తద్ధర్మ విశేషణముల మీఁద లోపము నిత్యము తద్ధర్మ విశేషణ ములు = ఆ క్రియ ధర్మముగాఁ గల కర్తను దెలుపునవి వచ్చెడు, వచ్చు - వంటివి ఉదంత తద్ధర్మ విశేషణములు వచ్చెడి - వంటివి ఇదంత తద్ధర్మ విశేషణములు-(క్రియా 44, 45) ఉదంత తద్ధర్మ విశేషణములకు, వచ్చునది, వచ్చునవి - సమాస 9 చే - వచ్చు+అది, వచ్చు+అవి ఈ 45 చే అత్తునకు లోపములేదుగాన 33 చే - నుగాగమము నిత్యము వచ్చు+ను+అది, వచ్చు+ ను+అవి ద్రుతస్వర లోపము జరిగి, వచ్చున్+అది = వచ్చునది వచ్చున్+ అవి = వచ్చునవి - అగును ఇవి బహుళ ప్రయోజనములలో, నప్రవృత్తి కుదాహరణములు అప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపక పోవుట వచ్చెడిది, వచ్చెడివి - సమాస 9చే - వచ్చెడి + అది, వచ్చెడి + అవి, 45చే- అత్తు నిత్యముగ లోపించి వచ్చెడిది, వచ్చెడివి - అని సిద్ధించును బహుళ ప్రయోజనములలోఁ బ్రవృత్తికివి యుదాహరణములు, ప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగఁ బ్రవర్తించుట

విశే - (1) ఉదంతంబులగు తద్ధర్మ విశేషణంబులకు-అనుచో, ఉదంత ఘ్నుల సాహచర్యము గల, ఎడి వర్ణకమునకే గ్రహణము (క్రియా 44)

వచ్చెడి + అది = వచ్చెడిది నిజీ వర్ణకము (క్రియా 47) గ్రహింపబడును రాని + అది = రానిది, రానియది (సమాస 9) "సహచరితా సహిచరితయో సహచరిత స్త్యైవగ్రహణమ్" (పరిభా) (11) నా + యొక్క + అ+ది (అ+వి) - అలౌకిక విగ్రహములు

## పడ్వాదులు పరంబులగునపుడు ము వర్ణకంబునకు లోప పూర్ణబిందులు విభాషనగు. 46

| | | |
|---|---|---|
| భయము | పడె | భయపడె |
| | | భయంపడె |
| | | భయముపడె |
| సూత్రము | పట్టె | సూత్రపట్టె |
| | | సూత్రంపట్టె |
| | | సూత్రముపట్టె |

ఈ కార్యము కర్తృవాచి ము వర్ణకమునకుఁ గలుగదు గజము పడియె అశ్వము పడియె

వ్యా వడు - మున్నగునవి పరములగునపుడు 'ము' ప్రత్యయమునకు, లోప పూర్ణబిందువులు విభాషనగును వర్ణకము = ప్రత్యయము విభాష=చూ 18 ఉదా॥ భయము+పడె 'ము' ప్రత్యయము లోపించిన-భయపడె, ము ప్రత్యయమునకు నిండుసున్న యాదేశ-మయినచో - భయంపడె లోప పూర్ణ బిందువులు రానిచో - భయముపడె - ఇట్లు మూఁడు రూపము లేర్పడును ఇట్లే, సూత్రము + పట్టె = సూత్రపట్టె - ము వర్ణక లోపము - సూత్రం పట్టె - నిండు సున్న యాదేశ మయిన రూపము సూత్రముపట్టె-లోపపూర్ణబిందువులు రానప్పటి రూపము ఈ లోప పూర్ణబిందువులు కర్తృవాచకమునందలి ము వర్ణకము నకు రావు ఉదా॥ గజము + పడియె, అశ్వము - పడియె వీనిలో గజము, అశ్వము అను పదములు కర్తలుగా నున్నవి కాన వీనిలోని ము వర్ణకమునకు లోప పూర్ణబిందువులు రావు గజముపడియె అశ్వముపడియె - అనునవే సిద్ధించును

విశే - భయము + పడె, సూత్రము + పట్టె - అను వానిలోని, భయము, సూత్రము , అనునవి కర్మవాచకములు కారక 2 చే, భయమును,

సూత్రమును - అని వీనికి ద్వితీయ కలుగును కారక 24 చేఁ ప్రథమ కలిగి, భయము, సూత్రము - అని యయినవి ఈ కర్మవాచకములలోని మువర్ణక మునకే లోపపూర్ణబిందువులగును కర్తృవాచకముల మువర్ణకమునకు లోపపూర్ణ బిందువులు కావు

పాఠపరిశీలన - బిందులు ప్రథమ ముద్రణపాఠము కాన, 'బిందువులు' అను ముద్రణములు సరికావు

## మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగును. 47

| | | |
|---|---|---|
| చూడుము | నన్ను | చూడునన్ను |
| | | చూడుమునన్ను |
| ఇటు | చూడుము | ఇటుచూడు |
| | | ఇటుచూడుము |

చూడుమనియె, వినుమనియె ఇచ్చట నచ్చుపరంబయినది కాఁబట్టి లోపము లేదు

వ్యా మధ్యమపురుష "ము" ప్రత్యయమునకు హల్లు నవసానము పరమయి నప్పుడు లోపము విభాషనగును మధ్యమపురుషము=యుష్మదర్థమును గర్తగాఁ గాని కర్మముగాఁ గాని వాచ్యము చేయుక్రియా ప్రత్యయములు మధ్యమ పురుష మనఁబడును (క్రియా 11) అవసానము = విరామము (చూ 20సూ ) అవసానము పరంబగునపుడనఁగా వేఱువర్ణముల యుచ్చారణాభావము పరమగు నప్పుడని యర్థము (కించిద్వర్ణోచ్చారణా నంతరం వర్ణాంతరాణా ముచ్చారణా భావః అవసానమ్ బాలమ (1) హల్లునకు - చూడుము+నన్ను ఇట నకారము హల్లు కావున మధ్యమపురుష "ము" వర్ణకమునకు (క్రియా 29) లోపమయి నచో, చూడునన్ను అగును. లోపము కానిచో - చూడుమునన్ను - అగును. (2) అవసానమునకు - ఇటు + చూడుము అని కొన్ని వర్ణములుచ్చరింపఁ బడెను పిమ్మట వేఱు వర్ణముల యుచ్చారణము లేదు కావున వేఱు వర్ణముల యుచ్చారణము యొక్క యభావము (లేకపోవుట) పరమగుచున్నది ఇదే యవ సానము పరమగుట కాన మధ్యమ మువర్ణకము లోపించినచో, ఇటు చూడు - అగును లోపింపనిచో, ఇటుచూడుము - అనియగును

అచ్చుపరమగునపుడు మధ్యమ పురుష మువర్ణకమునకు లోపము లేదు ఉదా॥ చూడుము+అనియె వినుము+అనియె వీనిలో మధ్యమ మువర్ణకమున

కచ్చు పరమగుచున్నది కాన ముపర్ణకము లోపింపదు ఉత్వసంధి (1 సూ ( జరిగి-చూడు మనియె, విను మనియె - అను రూపములు సిద్ధించును

## వ్యతిరేక మధ్యమ ముపర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు. 48

నమ్మకుము ఇట నమ్మకిట, నమ్మకుమిట.

వ్యా వ్యతిరేక మధ్యమపురుష 'ము' ప్రత్యయమునకు హలవసానములు పరమగునప్పుడు, నచ్చుపరమగునప్పుడు లోపము విభాషనగును ఎల్లయెడలన్= (1) హల్లు (2) అవసానము (3) అచ్చు ఈ మూఁడును బరమగునపుడని యర్థము హలవసానములు పరమగునప్పటి లోపము 47 లో వలె గ్రాహ్యము అచ్చు పరమగునప్పటి లోపమునకు నమ్మకుము + ఇట నమ్మకుము_ అను దానిలోని ముపర్ణకము వ్యతిరేక మధ్యమపురుషము ఏలయన నమ్ముము - అనుదానికి వ్యతిరేకము, నమ్మకుము - అనునది కాన మువర్ణకమునకు నీ 48 చే - లోపము కలిగినచో నమ్మకుము + ఇట-నమ్మకు + ఇట అగును 1 చే - నమ్మకిట -అగును మువర్ణకము లోపింపని పక్షమున-నమ్మకుము + ఇట 1 చే - నమ్మకుమిట - అగును

విశే - (1) ఇందలి విభాష యుభయత్ర ఒక సూత్రముచేఁ బ్రాప్తించు కార్యమును నిషేధించి, ప్రాప్తా ప్రాప్త కార్యములు రెండింటికిఁగలిపి విధించిన విభాష యుభయత్ర విభాష యనఁబడును ఇట వ్యతిరేక మధ్యమ మువర్ణక మునకు 47 చే హలవసానములు పరమగుచో లోపము ప్రాప్తించుచున్నది అచ్చు పరమగుచో లోప ప్రాప్తి లేదు ప్రాప్తించుదానిని నిషేధించి యీ ప్రాప్తా ప్రాప్తములు రెండింటికిఁ గలిపి మువర్ణక లోపమీ 48 సూత్రమున విధింపఁ బడెను ఎల్లయెడల -అనుట దీనికి సూచన ఈ యొక్క-చోట విభాష, నిషేధ వికల్పములను దెల్పును "నవేతి విభాషా" - పాణి (11) నమ్మకిట - ఉ హ 5-92

## ఆమ్రేడితంబు పరంబగునప్పుడు మధ్యమ ముడుజ్ఞులకు లోపంబు విభాషనగు. 49

ఉండుము ఉండుము ఉండుండుము

ఉండుముండుము.

కొట్టుఁడు కొట్టుఁడు కొట్టుకొట్టుఁడు
కొట్టుఁడుకొట్టుఁడు

వ్యా ఆమ్రేడితము పరమైనప్పుడు మధ్యమ పురుష మువర్ణకమునకు, బిందు పూర్వక డువర్ణకమునకు, లోపము విభాషనగును డుక్ = బిందు పూర్వక డువర్ణకము (తత్సమ 19) 'క్' అనునది ముందు బిందువగునని తెలుపును ఆమ్రేడితము = ద్విరుక్తము యొక్క పరరూపము ఉదా॥ ఉందుము+ఉందుము ఉందుము - అనునది మధ్యమ పురుషము = 47 సూ మధ్యమ పురుషము ఆమ్రేడితము పరమయినది గాన మువర్ణకమునకు లోపము కలిగినచో — ఉందు + ఉందుము - అగును 10 చే - ఉందుందుము-అగును మువర్ణకము లోపింపని పక్షమున - ఉందుము + ఉందుము 10 చే - ఉందుముందుము - అగును కొట్టుఁడు + కొట్టుఁడు ఆమ్రేడితము పరమయి నదిగాన, డుక్ వర్ణకమునకు, అనఁగా బిందుపూర్వక డువర్ణకమునకు లోపము కలిగిన - కొట్టుఁడు + కొట్టుఁడు=కొట్టుకొట్టుఁడు - అగును లోపము రానిచో- కొట్టుఁడుకొట్టుఁడు - అగును

విశే (1) కొట్టు కొట్టుఁడు - అనుచో బిందువుతోఁగూడ డువర్ణకము లోపించుటకు డుక్ — అనఁబడెను 'డు' వర్ణక లోపమును మాత్రమే చెప్పినచోఁ బహుత్వమునకు ముందు బిందువుండవచ్చును గనుక బిందువు లోపింపదు (11) 41చేఁ క్రియావిభక్తుల కెల్లలోపము బహుళముగఁ బ్రాప్తించుచుండఁగా, మధ్యమ ముడుబ్బులకు మాత్రమే లోపము విభాషనగునని యీసూత్రము నియమించు చున్నది గాన, నిది నియమసూత్రము "సిద్ధే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి" పరిభాష కాన నితర క్రియా విభక్తులకు లోపమురాదు వచ్చిరి + వచ్చిరి = వచ్చిరివచ్చిరి, రాఁగలడు + రాఁగలఁడు = రాఁగలఁడు రాఁగలఁడు - మొ॥

## విసర్గంబున కనుకరణంబున లోపంబగు. 50

వర్ధతాంశ్రీః అనియె వర్ధతాంశ్రీయనియె

వ్యా అనుకరణమున విసర్గమునకు లోపమగును అనుకరణము = సంస్కృత వాక్యాదులను యథాతథముగాఁ జేర్కొనుట ఇట్టిచోట్ల 'అను' ధాతువు సామాన్యముగా వాడఁబడుచుండును ఉదా॥ వర్ధతాంశ్రీః + అనియె ఈ 50 చే-విసర్గ లోపించును వర్ధతాంశ్రీః+అనియె 3చే - వర్ధతాంశ్రీ య్+ అనియె = వర్ధతాంశ్రీయనియె — అగును వర్ధతాంశ్రీః- సంస్కృతవాక్యము శ్రీః = సంపద, వర్ధతామ్ = వృద్ధి పొందుఁగాక - అని యర్థము

## అనుకృతిని సమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాషనగు. 51

**తుభ్యంనమః** అనె **తుభ్యంనమోయనె**
**తుభ్యంనమయనె**

**ఈ కార్యము లాఁతిచో సహితము గనంబడియెడి గతానుగతికో లోకో యటంచున్**

వ్యా అనుకరణమున నమశ్శబ్దముయొక్క చివరనుండు హ్రస్వమయిన అకారమునకు, ఓత్వము విభాషనగును ఉదా॥ తుభ్యంనమః + అనె 50చే- విసర్గలోపము తుభ్యంనమ+అనె ఈ 51చే - తుభ్యంనమ్+ఓ+అనె = తుభ్యంనమో + అనె - 3చే తుభ్యంనమో-య్ + అనె = తుభ్యంనమోయనె ఓత్వమాదేశము కానప్పుడు – తుభ్యంనమ + అనె - 3చే - తుభ్యంనమ-య్+ అనె = తుభ్యంనమయనె తుభ్యమ్ = నీకొఱకు, నమః = నమస్కారము- అనియర్థము తుదియత్తున కోత్వమగుట యను నీ వ్యాకరణ కార్యము నమశ్శబ్దేతరములందును గనఁబడును లాఁతి = ఇతరము నమశ్శబ్దముకాక యితరమని, యర్థము ఉదా॥ గతానుగతికోలోకః + అటంచున్ 50 చే- గతానుగతికోలోక + అటంచున్ "ఈ కార్యము లాఁతిచో సహితము గనంబడియెడి" అనుటచే - 'లోక' అను దానిలోని తుదియత్తున కోత్వమగును గతానుగతికోలోక్ + ఓ + అటంచున్ = గతానుగతికోలోకో+అటంచున్, 3చే – గతానుగతికోలోకో – య్ + అటంచున్ = 'గతానుగతికోలోకో యటంచున్'

విశే - గతానుగతికోలోకోయటంచున్ - (కళా 7 - 110)

పదసార్థక్యము - అత్తునకు - అనుటచే నితరాచ్చుల కోత్వమురాదు ఉదా॥ వర్ణనానిపుణః కవి + అనియె = వర్ణనానిపుణః కవియనియె ఇట ఇత్వమున కోత్వము రాదు

## అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు. 52

**కింతత్** అనియె **కింతత్తనియె**
**కస్త్వమ్** అనియె **కస్త్వమ్మనియె**

వ్యా అనుకరణమునఁ జివరి హల్లునకు ద్విత్వమగును ఉదా॥ కింతత్ + అనియె ఈ 52చే, కింతత్ త్ + అనియె = కింతత్తనియె కస్త్వమ్ +

అనియె = కస్త్వమ్మనియె ద్విర్వచనము = ద్విత్వము, కింతత్ తత్ = అది, కిమ్ = ఏమి? కస్త్వమ్ - త్వమ్ = నీవు కః=ఎవఁడవు – అని యర్థములు

## అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు. 53

దాసోహమ్ అనె దాసోహమ్మనె,
దాసోహమనె
తత్కర్తవ్యమ్ అనె తత్కర్తవ్యమ్మనె,
తత్కర్తవ్యమనె

వ్యా అనుకరణమున, అహమ్-మున్నగు వాని మకారమునకు ద్విత్వము విభాషనగును ఉదా॥ దాసోహమ్ + అనె = దాసోహమ్మనె ద్విత్వమురానిచో- దాసోహమ్ + అనె = దాసోహమనె తత్కర్తవ్యమ్+అనె = తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె అనుకరణము = చూ 50 దాసస్ + అహమ్ = దాసోహమ్ అహమ్ = నేను దాసః = దాసుఁడను - అని యీవాక్యమున కర్థము తత్కర్తవ్యమ్ తత్ = అది, కర్తవ్యమ్ = చేయఁదగినది అని యర్థము

విశే - (i) ఇందలి విభాష ప్రాప్తవిభాష (ii) బ్రహ్మోహమన (ఉ రా 1.15) బ్రహ్మోహమ్ + అన ద్విరుక్తి కాకుండుటకు బ్రయోగము

పదసార్థక్యము - మకారంబునకు - అనుటచే నితర హల్లులు తుదఁగల శబ్దములిందుఁజేరవు 52 లోనే చేరును

## ఉదంత నామంబున కనుకరణంబునందు వుగాగమంబగు 54

ఇయందేనుః + అనె ఇయందేనువనె

అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండుపలికె నది నిరాకరంబు దుర్బలస్య బలం రాజా యనవినవే

వ్యా అనుకరణమున, హ్రస్వమయిన ఉకారమంతమందుఁగల నామపదమునకు వుగాగమమగును వుక్ + ఆగమ = వుగాగమము వుక్-లోని ఉకారముచ్చారణార్థకము కకారముతో నిర్దేశించుటచే, వ్ - అనునది నిర్దిష్టమునకుఁ జివర జేరును ఉదా॥ ఇయందేనుః + అనె 50చే ఇయందేను + అనె ఈ 54చే వుగాగమము ఇయందేనువ్ + అనె ఇయందేనువనె - అగును,

అనుకరణమున దీర్ఘమునకు హ్రస్వమగునని యొకఁడు పలికెను కాని యది నిరాధారము నిడుద = దీర్ఘము కుఱుచ = హ్రస్వము నిర్+ఆకర= నిరాకరము ఆకరములేనిది = ఆధారములేనిది అనఁగా మహాకవిప్రయోగ ప్రామాణ్యములేనిదన్నమాట అనుకరణమున నిడుదకుఁ గుఱుచకాదనుటకు దుర్బలస్యబలం రాజా + అనవినవే ఇట 'రాజా' అనుచోట దీర్ఘమునకు హ్రస్వము కాలేదు 3చే - యడాగమము కలిగి - దుర్బలస్య బలం రాజా యనవినవే - అయ్యెను

విశే - (1) అనుకరణమున నిడుదకుఁ గుఱుచ యగునన్న వాఁడప్పకవి (అప్పక 5-98) అతని వాక్యము నిరాధారమని సూరి విమర్శించెను తన యాశయమునకుఁ బ్రమాణముగా దుర్బలస్యబలం రాజా యనవినవే - అను ప్రయోగము జూపెను (మను 4-74) (11) నామమనఁగా నిట నామపదము "చత్వారి పదజాతాని నామాఖ్యాతోప సర్గనిపాతాశ్చ" (నిరు)

పదసార్థక్యము - నామంబునకనుటచేఁదిఙంతములకు (= క్రియాపదములకు) వుగాగమము కాదు ధర్మోజయతు + అనుచు = ధర్మోజయతనుచు (భీష్మ 1-8)

## వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యులండ్రు. 55

సత్యము సర్వశ్రేయము అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంత మంద చూపట్టెడు

ఇది సంధిపరిచ్ఛేదము

వ్యా వాక్యముయొక్క యవసానమునందు సంధికలేకపోవుట దోషము కాదని పెద్దలందురు అనఁగా వాక్యము ముగిసిన పిమ్మట సంధి మానినను దోషముకాదు సత్యము సర్వశ్రేయము అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు ఇట, సత్యము సర్వశ్రేయము, అనుటతో వాక్యము పూర్తియయినది కావున, అది లేనిచో సర్వ ధర్మములు వ్యర్థములు — అను, రెండవ వాక్యమునందలి 'అది'లోని అకారముతో సంధి చేయకపోయినను దోషముకాదు ఇట్లు సంధి లేకపోవుట పద్యకావ్యములలోఁబాదాంతమందే కనఁబడును అనఁగా వాక్యాంతము పాదాంతము నైనప్పుడే పద్యములలో సంధి లేకపోవుట కనఁబడు నని తాత్పర్యము

విశే - (1) వాక్యాంతము పాదాంతము నగు నపుడు సంధి మాన వచ్చు ననుటకు

ఆ॥ పడగనున్న హనుమదయ విహ్వలుఁడుగాఁడు
అరదమునకు సూతుఁ డచ్యుతుండు (అహో)

ఇట, కాఁడు - అనుటతో వాక్యము పూర్తియయినది పద్యపాదమును బూర్తియయినది కాన సంధి మానుట దోషము కాలేదు (11) పాదాంతమంద - అనుటచేఁ బాదాంతము కానిచో ననఁగాఁ బాదమధ్యమున వాక్యము పూర్తి యయినను సంధి మానరాదు (111) "దోషంబు గాదని" అనుటచే-సంధి చేయుట హితమే యన్నమాట సత్యము సర్వ శ్రేయ మది లేనిచో - అనియు ననవచ్చును (1V) సూరి నిర్దేశించిన యార్య లథర్వణాచార్యులు 'నస్యాద్వాక్య విరామేతు సంధ్య భావోపి దోషకృత్" వికృ వాక్యవిరామేతు = వాక్యము ముగిసిన స్థలమునందు, సంధి + అభావోపి = సంధి కాకుండుటయు, దోష కృత్ = దోషము చేయునది, నస్యాత్ = కాదు - అని యర్థము

ఇది ఘంటాపథము

# తత్సమ పరిచ్ఛేదము



## డు-ము-వు-లు ప్రథమ. 1

వ్యా డు- ము-వు-లు అనునవి ప్రథమా విభక్తి ప్రత్యయములు ఇవి ప్రథమా విభక్తి వివక్షయందగును

విశే - ప్రథమా - మున్నగునవి విభక్తులపేరులు గాన౯ుంవద్భావము ప్రసక్తము కాదు (ప్రథమ విభక్తి కాదనుట) (11) ఈ సూత్రముచేత నొక్క-లువర్ణమే యగు ననరాదు ప్రథమకు డు-ము-వుల ప్రాప్తి సర్వ సమ్మతము

## నువర్ణంబు · ద్వితీయ. 2

వ్యా "ను" వర్ణము ద్వితీయా విభక్తి ప్రత్యయము ఇది ప్రత్యయాత్మక ద్రుతము ద్వితీయా విభక్తి వివక్షయందీ సూత్రముచేతనే నువర్ణకము ప్రాతిపదికములపై నిలుచును (చూ 25 సూ)

## చేత - తోడ తృతీయ. 3

వ్యా చేత-తోడ-అనునవి తృతీయా విభక్తి ప్రత్యయములు 10చే, చే-తో-అను రూపములు వీనికి౯గలుగును తృతీయా విభక్తి వివక్షయందీ సూత్రము చేతనే, చేత-తోడ ప్రత్యయములు ప్రాతిపదికములకు౯ జేరును

## కొఱకు - కయి చతుర్థి. 4

వ్యా కొఱకు, కయి - అనునవి చతుర్థీ విభక్తి ప్రత్యయములు కయి అనుదాని రూపాంతరము 'కై' అనునది (క్రియా 103) చతుర్థీ విభక్తి వివక్షయందీ సూత్రము చేతనే, కొఱకు - కయి ప్రత్యయములగును •

పాఠ పరిశీలన - కొఱకు - కై - అని కొన్ని ప్రతులు ఇది తప్పు కొఱకు — కయి - అను ప్రథమ ముద్రణమే, సరియైనది కయి = కై క్రియా 103

## వలన - కంటె-పట్టి పంచమి. 5

వ్యా వలన, కంటె, పట్టి - అనునవి పంచమీ విభక్తి ప్రత్యయములు పంచమీ విభక్తి వివక్షయందీసూత్రముచేతనే, వలన-కంటె-పట్టి ప్రత్యయము లగును

## కు - యొక్క - లోపల . షష్ఠి. 6

వ్యా కు - యొక్క - లోపల - అనునవి షష్ఠీ విభక్తి ప్రత్యయములు 10చే - లోపల - అనుదానికి, లో - అను రూపాంతరము సిద్ధించును షష్ఠీ విభక్తి వివక్షయందీసూత్రముచేతనే, కు-యొక్క-లోపల ప్రత్యయములగును

## అందు - న సప్తమి. 7

వ్యా అందు, న - అనునవి సప్తమీ విభక్తి ప్రత్యయములు సప్తమీ విభక్తి వివక్షయందీసూత్రము చేతనే, అందు-న- ప్రత్యయములగును

## తృతీయాదులకు నుగాగమంబగు. 8

రామునిచేతను, రామునితోడను, రామునికొఱకును, రాముని వలనను, రామునికంటెను, రామునకును, రామునియందును

వ్యా తృతీయాది విభక్తులకుఁ జివర "ను" వర్ణ మాగమమగును నుక్ + ఆగమ = నుగాగమము 'నుక్' అని కకారముతో నిర్దేశించుటచే "ను" వర్ణము తృతీయాదులకుఁ జివరఁజేరును తృతీయాదులు = తృతీయ మొదలు సప్తమి వఱకుఁగల విభక్తులు ప్రథమకు, ద్వితీయకు, నుగాగమము లేదనుట స్పష్టము ఉదా॥ రామునిచేత ఈ 8చే- రామునిచేత + ను = రామునిచేతను ఇత్యాది

విశే - లోపల, ను ప్రత్యయములు కొన్ని ప్రత్యేక స్థలములలోనే యగును కావున నిట నుదాహరింపఁబడలేదు ఉదా॥ గోవులలోపల + ను = గోవులలోపలను, (కారక 16) ఘటంబున+ను=ఘటంబునను (కారక 18)

## కయి - పట్టి - యొక్కలకు నుగాగమంబులేదు. 9

రామునికయి, జ్ఞానముఁబట్టి, రామునియొక్క.

వ్యా. కయి, పట్టి, యొక్క - అను ప్రత్యయములకుఁ జివర 'ను' వర్ణాగమము లేదు 8చే – తృతీయాది విభక్తులకు నుగాగమమగును కయి, పట్టి, యొక్కలు తృతీయాది విభక్తులలోనివే యగుటచే వీనికి 8చే- నుగాగమ మగుచుండగా, నుగాగమము లేదని నిషేధింపఁబడెను కాన, కయి - పట్టి - యొక్కలు కాక, తక్కిన తృతీయాది విభక్తులకు నుగాగమమగునని సారాంశము

## చేత-తోడ-లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు. 10

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు రాము నిచే, రామునితో, వనములలో

వ్యా చేత-తోడ-లోపల, అను ప్రత్యయముల మొదటియక్షరములు వైక ల్పికముగా మిగులును అనఁగాఁ దొలియచ్చులమీఁది వర్ణములు వికల్పముగా లోపించునని యర్థము, ఉదా॥ రామునిచేత = రామునిచే రామునితోడ = రామునితో, వనములలోపల = వనములలో వైకల్పికము గనుక రామునిచేత, రామునితోడ, వనములలోపల-అనియు నుండును వర్ణకము=ప్రత్యయము ప్రత్యయమును వర్ణకమని వ్యవహరించిన ప్రాచీనులు నన్నయాదులు (ప్రత్యయ ఇహావర్ణకః - అం చిం) చే-తో-లో- అనువానికి 8చే - నుగాగమమగును రామునిచే - ఇత్యాదులు ద్రుతలోపరూపములు (సంధి 20) డు-ము-వు-లు లోనగునవి నామ విభక్తి ప్రత్యయిములు

విశే (1) ప్రత్యయము = ప్రకృతియవధిగా విధింపఁబడి తన యర్థమునుగాని ప్రకృత్యర్థమును గాని బోధించుశబ్దము స్వస్వప్రకృత్యన్యత రార్థ ప్రత్యాయక స్యైవ తత్సంజ్ఞికత్వాత్ - (ల శ శె) అగ్గలిక ఇక - భావార్థకము ఇది ప్రత్యయార్థము (తద్ధిత 8) అరమరిక = అరమర ఇక - స్వార్థము అనఁగాఁ బ్రకృత్యర్థాను వాదకము (తద్ధిత 9) విభక్త్యర్థమునకు- కారక 1 (11) చే, తో, లో - అన్నవియుఁ బ్రత్యయములగును ఏకదేశ వికృత మనన్యవత్ - పరిభా (111) బహుపటుః ఇట బహు-చ్ - ప్రత్యయము ప్రకృతికి ముందు విధింపబడెను (సి కౌ 2023)

## డు-ము-వు-న లేకవచనంబులు. 11

ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు

రాముఁడు, సోముఁడు, వనము, ధనము, ధేనువు, భానువు

వ్యా విభక్తి ప్రత్యయములలో డు-ము-వు-న, అనునవి యేకవచనములు ఏకవచనము=ఏకత్వ సంఖ్యను బోధించు ప్రత్యయము అనఁగా నేకపదార్థమును బోధించు ప్రత్యయమేకవచనము రాముఁడు, వనము, ధేనువు - అనుచోట్ల డు, ము, వు ప్రత్యయము లేకవస్తు బోధకములు గాన నివి యేకవచనములు

విశే - (1) డు-ము-వు, అన్నవి 1చే- ప్రథమా విభక్తి వివక్షయందగును ఈ 11చే- ఇవి యేకత్వవివక్షయందగును వానిలో డు-22చే, ము-39చే, వు-48,

50 సూత్రములచే నాయా ప్రాతిపదికములకుఁ జేరును న-ఏకత్వ వివక్షయందు 7చే- అగును (11) సంఖ్య = వస్తువులకు సంబంధించిన యేకాది భేదములను బోధించునది భేద హేతుత్వమాశ్రిత్య సంఖ్యేతి వ్యవదిశ్యతే (వాక్యప)

విశే - నవర్ణకము ప్రత్యేక స్థలమునందగును గావున నిటనుదాహరింప లేదు (చూ - కారక 18-23)

## లు వర్ణంబు బహువచనంబు. 12

బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు రాములు, సోములు, వనములు, ధనములు, ధేనువులు, భానువులు

వ్యా లు-వర్ణము బహువచనము బహువచనము = బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయము అనఁగా నొకటికంటె నెక్కువ పదార్థములను బోధించు ప్రత్యయము బహువచనమని తాత్పర్యము రాములు-ఇట లు ప్రత్యయ మొక రామునికంటె నెక్కువమంది రాములను బోధించుచుండుటచె బహువచన మయినది ఇట్లే తక్కినవి

విశే - ప్రథమావిభక్తి వివక్షయందు 1 చే — డు, ము, వు, లు, అను ప్రత్యయము లగును లు వర్ణము సర్వశబ్ద సామాన్యమగుటచే బహుత్వ వివక్ష యందు, ఈ 12 చే — ఎల్ల ప్రాతిపదికములకుఁ జేరును "బహుషు బహు వచనమ్" (పాణి)

## తక్కినవి యుభయంబులు. 13

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము వనమును, వనములను, వనముచేతను వనముల చేతను, వనముతోడను, వనములతోడను

వ్యా డు, ము, వు, న - లు అను నైదు ప్రత్యయములు కాక తక్కి నవి యుభయములు ఉభయములు = ఏకత్వ బహుత్వములకు బోధకములు అనఁగా నొక పదార్థమును, నొకటికంటె నెక్కువ పదార్థములను బోధించునవి యని తాత్పర్యము ఉదా॥ వనమును ఇట, ను ఏక వచనము వనములను ఇట ను - బహువచనము

విశే - ఇవి యేకత్వ వివక్షయందును బహుత్వ వివక్షయందును నగును వనమును - అనుచో 'ను' వర్ణమేకత్వ వివక్షయందైనది (2సూ) - బహుత్వ వివక్షయందు 31 చే లట్టు వనము + లను = వనములను ను — బహుత్వ బోధకము లట్టు - ద్యోతకము

## ఓ యామంత్రణంబునందగు. 14

ఓ యను శబ్దము సంబోధనంబునందగునని యర్థము ఇది సంబోధ్య వాచకంబునకు ముందే ప్రయోగింపబడును ఓ శబ్దంబు తొలంగియు సంబోధ్య వాచకంబు ప్రయోగింప వచ్చును ఓ రాముఁడ, ఓ రాములార, రాముఁడ, రాములార

వ్యా ఓ శబ్దము సంబోధనమున నగును ఆమంత్రణము = సంబోధనము సంబోధ్య వాచకము = సంబోధింపఁదగిన వ్యక్తిని బోధించు శబ్దము అనఁగా నే వ్యక్తిని సంబోధింతుమో యా వ్యక్తిని దెలుపు శబ్దము ఓ, శబ్దము సంబోధ్య వాచకమునకు ముందే వాడఁబడును ఉదా॥ ఓ రాముఁడ, ఓ రాములార ఇట రాముఁడు, రాములు సంబోధ్య వాచకములు కాన వీనికి ముందే ఓ శబ్దము ప్రయోగింపఁబడినది ఓ శబ్దమును విడిచియు సంబోధ్య వాచకమును వాడవచ్చును ఉదా॥ రాముఁడ, రాములార

విశే - (1) ముందే - అనుటచేఁబరమందు రో, కాన, లగునని సూచన "మీఁదట రో కానయునగు" శబ్దల 3 - 82 (11) ఆమంత్రణ వ్యవహారము సంస్కృత విలక్షణము

## ఓ శబ్దంబునకుం బురుష, నీచ స్త్రీపురుషామంత్రణంబులందు యి, సి, రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు. 15

ఓయి రాముఁడ, ఓ రాముఁడ, ఓసి దుష్టురాల, ఓ దుష్టురాల, ఓరి దుష్టుఁడ, ఓ దుష్టుఁడ

వ్యా ఓ శబ్దమునకుఁ జివరఁ బురుష సంబోధనమున 'యి' వర్ణమును, నీచ స్త్రీ సంబోధనమున 'సి' వర్ణమును, నీచపురుష సంబోధనమున 'రి' వర్ణమును విభాషగ నాగమములగును అనఁగాఁ బురుష సంబోధనమున, ఓయి - యనునది, నీచ స్త్రీ సంబోధనమున, ఓసి-యనునది, నీచపురుష సంబోధనమున, ఓరి - యనునది సంబోధ్య వాచకమునకు ముందు విభాషగఁ బ్రయోగింపఁబడునని తాత్పర్యము పురుష సంబోధనమునకు - ఓయి రాముఁడ ఓ రాముఁడ నీచస్త్రీ సంబోధనమునకు - ఓసి దుష్టురాల, ఓ దుష్టురాల నీచ పురుష సంబోధనమునకు - ఓరి దుష్టుఁడ, ఓ దుష్టుఁడ

విశే నీచస్త్రీ పురుషులనఁగా శీలము, జాతి, విద్య, వయస్సు మొదలగు

వానిచేఁ దనకంటెఁ దక్కువవారు శత్రువు విషయమున నైనచో నుత్తమ వ్యక్తుల యెడలనూ ఓరి, ఓసి శబ్దములు ప్రయోగింపఁబడును

## ఓరి యోసి మైత్రియందుంగలవు. 16

ఓరి చిన్నికృష్ణ, ఓసి ముద్దు బాల, ఓయి మొదలగువానికి స్వతంత్ర ప్రయోగముం గలదు సంగతియెయోయి, ఏసిపోవే, ఓరోరి యింకెందుఁ బోవ వచ్చు పీనికి దీర్ఘంబుం గలదు ఓయీ విప్రకులావతంస, ఓరీ దుష్ట నిశాటులార, ఓసీ ననుఁజెనక రాకు

వ్యా ఓరి, ఓసి-యనునవి మైత్రియందు సైతము కలవు నీచపురుష సంబోధనమున ఓరి శబ్దము నీచ స్త్రీ సంబోధనమున ఓసి శబ్దము నగునని, 15 సూత్రమునఁ జెప్పఁబడెను ఇట మైత్రియందును ఓరి ఓసి శబ్దము లగునని చెప్పఁబడెను మైత్రి యనునది వాత్సల్యాదుల కుపలక్షణము ఓరి చిన్నికృష్ణ, ఓసి ముద్దు బాల ఇట ఓరి, ఓసి వాత్సల్యమునఁ బ్రయోగింపఁబడెను ఓయి, ఓసి, ఓరి, అనువానికి స్వతంత్ర ప్రయోగమును గలదు అనఁగా నివి సంబోధ్యవాచకము లేకుండ విడిగా సైతము ప్రయోగింపఁబడును ఉదా॥ సంగతియెయోయి ఇట సంబోధ్య వాచకము లేకుండ స్వతంత్రముగ, ఓయి – ప్రయుక్తము ఇట్లే ఓసి పోవే - అనుచో, ఓసి - స్వతంత్రముగ వాడఁబడినది ఓరోరి యింకెందుఁ బోవ వచ్చు - అనుచో ఓరి - స్వతంత్రముగ వాడఁబడినది• అనఁగా ఓయి బాలుఁడా, ఓసి దుష్టురాల, ఓరి దుష్టుఁడ అను రీతిని సంబోధ్య వాచకములకు ముందు ప్రయోగింపక ఓయి, ఓసి, ఓరి - అని స్వతంత్రముగఁ బ్రయోగింపఁబడెనని తాత్పర్యము ఓయి, ఓరి, ఓసి - అను వానికి దీర్ఘమును గలదు ఓయీ, ఓరీ, ఓసీ - అను రూపములును గలవన్న మాట ఉదా॥ఓయీ విప్రకులావతంస, ఓరీ దుష్ట నిశాటులార, ఓసీ ననుఁ జెనకరాకు

విశే - (1) ఓరీ దుష్ట నిశాటులార - అను ఉదాహరణమునుబట్టి ఓరి శబ్దము పలువుర సంబోధనమునందును నగునని గ్రహింపవలెను (సర్వాల 1-18) (ii) సంగతియెయోయి యిసు మంత రింగణావు - (అముక్త 4-60) ఓసి పోవే యన్న నోసి పోవేయంచు - (కళా 3-196) ఓరోరియిం, కెందుఃబోవ వచ్చుఁ బందనిలువు - (అరణ్య 6-245)

పాఠ పరిశీలన - పోవచ్చు - అని ప్రథమ ముద్రణమునఁగలదు 'వ'– ముద్రణమున లోపించియుండును

## స్త్రీతిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు. 17

తిర్యక్కులనఁగాఁ బశుపక్ష్యాదులు జడములనఁగా నచేతనములు.

వ్యా స్త్రీలు తిర్యక్కులు, జడములు ననువానిని గాక తక్కినవానిని దెలుపు శబ్దములును, వాని విశేషణములును, మహద్వాచకము లనఁబడును తిర్యక్కులు = పశువులు, పక్షులు మొదలగునవి జడములు = అచేతనములు అనఁగా జ్ఞానాత్మకమగు బుద్ధీంద్రియములేనివి "సేంద్రియం చేతనంద్రవ్యం, నిరింద్రియ మచేతనమ్" (చ సం)

మహత్తుల కుదాహరణములు - రాముఁడు, రావణుఁడు, ఇంద్రుఁడు మొ॥ మహత్తుల విశేషణములును మహత్తులే యగును మనోహరుఁడు రాముడు- రాముఁడు - మహద్వాచకము ఏలయన నిది స్త్రీతిర్యగ్జడములను బోధించు శబ్దము కాదు దీని విశేషణము మనోహరుఁడు-అనునది కాన, మనోహరుఁడు- అనునదియు మహద్వాచకమే

స్త్రీలు, తిరశ్కులు, జడములు ననువానిని బోధించు శబ్దములును, వాని విశేషణములు నమహద్వాచకము లనఁబడును ఉదా॥ మనోహరరమణి రమణి - యనఁగా స్త్రీ కనుక నిధి యమహద్వాచకము మనోహర - అను విశేషణమును నమహద్వాచకమే మనోహరము గృహము ఇది జడవాచకము గనుక నమహత్తు మనోహరము - అను విశేషణము గూడ నమహత్తు మనో హరము మృగము మృగము తిర్యక్కు గనుక నమహత్తు దీని విశేషణమగు మనోహరము - అనునదియు నమహత్తు స్త్రీలను దెలుపు శబ్దములను మహతీ వాచకములనియు (86) స్త్రీవాచకము లనియు (సంధి 3) నందురు

## క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు. 18

మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు

వ్యా మహద్వాచకములు నపుంసక లింగములు, నగు మిత్రాది శబ్దములు పుంలింగ తుల్యములు, విభాషనగును క్లీబము = నపుంసకము పుంలింగములు, మహద్వాచకములు నగు శబ్దములకే, ఉత్వడుజ్జులగును (21, 22) మిత్ర - మున్నగునవి మహద్వాచకములే కాని పుంలింగములు కావు ఇవి నపుంసక లింగములు కాన వీనికి ఉత్వడుజ్జులు కలుగుటకుఁ బుంలింగ తుల్యత విభాషగ విధింపఁబడెను మిత్రుఁడు, మిత్రము - మిత్ర- ప్రాతిపదికము ఇది మహద్వా

చకము ఈ 18 చే - పుంలింగతుల్యమగు పక్షమున, 21 చే - మిత్రు అగును 22 చే - మిత్రు + డుఙ్ 19 చే మిత్రుఁడు పుంలింగ తుల్యము కాని పక్షమున, మిత్ర — ప్రాతిపదికము ఇది అదంతమగు నపుంసక లింగము గనుక, 39 చే - మిత్రము - అగును ఇట్లే శరణ = శరణుఁడు, శరణము, ప్రధాన = ప్రధానుఁడు, ప్రధానము, పాత్ర = పాత్రుఁడు, పాత్రము - అను రూపములను సాధించుకొనవలయును మిత్రాదులు = మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు

విశే - (1) మిత్ర, ప్రధాన శబ్దములు పుంలింగములును గలవు కాని పుంలింగము లప్రసిద్ధములు క్లీబంబులు - అనుటచే సుప్రసిద్ధ నపుంసకలింగ శబ్దముల నుండియే, మిత్రుఁడు, ప్రధానుఁడు — అను రూపములను సాధించు కొనవలెను (11) మహద్వాచకంబులు - అను దళము సూత్రమున లేకున్నను ప్రక్రియలోఁ జిక్కు లేదు అమహత్తులగు శరణ ప్రధాన పాత్ర శబ్దములకుఁ బుంలింగ తుల్యత సిద్ధించినను నవి మహద్వాచకములు కావు గనుక, ఉత్వ డుజ్లులు ప్రాప్తింపవు (21, 22) 39 చే — ముువర్ణకమే కలుగును కాన నీ దళము వ్యర్థమని కొందఱు సెలవిచ్చిరి కాని నిష్ప్రయోజనముగా నొక శబ్ద మునకు వేఱొక శబ్దము యొక్క లింగము నతిదేశింపరాదని తెలుపుటకు మహ ద్వాచకంబులు — అను దళము వాడఁబడి యుండును ఈ పక్షమున దీనిని వ్యర్థమన నక్కఱలేదు

పాఠ పరిశీలన - ఈ సూత్రమున 'మిత్ర' అను పాఠములే ప్రథమ ముద్రణమునఁ గలవు కొందఱు, మిత్ర - అని సవరించుట సరికాదు

## జిత్తు బిందుపూర్వంబగు. 19

జకార మిత్తుగాఁ గలదానికి ముందు, బిందువు వచ్చునని యర్థము కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించు నపుడు మానంబడు వర్ణమిత్తునాఁబడు ఉదాహరణము మీఁద స్పష్టంబగు

వ్యా జకార మిద్వర్ణముగాఁ గల ప్రత్యయాదులకు ముందు బిందు వగును జ్ + ఇత్ = జిత్ దీని సంస్కృత సమరూపము — జిత్తు ఇత్తు= కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తునాఁబడు అనఁగా నొక కార్యము నిమిత్తము ప్రత్యయములు మున్నగు వాని యందుఁ గూర్పఁబడి, ప్రయోగించునపుడు విడువఁబడు వర్ణ

మిద్వర్ణమనఁబడును ఉదా॥ రాము + డుఙ్, ఇట ఙ కారము (ఙ్) డు ప్రత్యయమునకుఁ గూర్పఁబడినది డు ప్రత్యయమునకు ముందు బిందువగును - అను వ్యాకరణ కార్యమును సూచించు నిమిత్తము డు ప్రత్యయమునకు ఙ కారము చేర్పఁబడెను, కాన నీ 19 చే "డు" ప్రత్యయమునకు ముందు బిందువగును పద ప్రయోగ సమయమున ఙకారము విడువఁబడును అనఁగా రాము + డుఙ్ = రాముడు, రాముండు - అగును ఙకారము విడువఁబడును ఉదాహరణము, మీఁదన్ = రాఁబోవు 22 వ సూత్రమున స్పష్టమగునని యర్థము

విశే - (I) బిందుపూర్వమనుటచేఁ బూర్ణబిందువు ఖండబిందువు నీసూత్రముచేఁ బ్రాప్తించును (II) ఏదేని వర్ణము బిందువుతోఁ గూడ లోపింపవలసి వచ్చునపుడును ఙకారము చేర్పబడును చూ సంధి 49 (III) ప్రత్యయాదులనుటచేఁ బ్రత్యయములేకాక వర్ణములును ఙకారముతో నిర్దిష్టములు కావచ్చును కుఙ్ - ఆచ్ఛిక 18 - గుఙ్ - ఆచ్ఛిక 19, డుఙ్వర్ణము - సమాస 17 (IV) ఇద్వర్ణలక్షణము ప్రాకృతానుసారి య కార్యార్థం సూత్రేను ఙధ్యతేనతు ప్రయోగే దృశ్యతే సఙత్ - త్రి ప్రా - ఇట్లే ముగ్ధబోధాదులు (V) వర్ణమిత్తునాఁబడు - అనుచో వర్ణమను నేక వచన మతంత్రము ఉదా॥ కఙి, వడుఙి మొ॥

## డుఙ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు. 20

### స్పష్టము

వ్యా ఏ ప్రాతిపదికము ప్రథమైక వచనమున, డుఙ్ - విభక్తితోఁ గూడుకొని యుండునో, యా ప్రాతిపదికము డుమంతమనఁబడును ఉదా॥ రామ-ఇది డుమంతము, ఏలయన నిది ప్రథమైక వచనమున రాముఁడు అని 'డు' ప్రత్యయముతోఁ గూడుకొని యుండును ప్రకృతి = ప్రత్యయోత్పత్తి నిమిత్తకమగు శబ్దభేదము ఇది రెండు విధములు (1) ధాతువు (2) ప్రాతిపదికము

విశే - ప్రథమైక వచనమున డుఙ్ ప్రత్యయము లోపించు వానికిఁ బ్రకృతులయినవి డుమంతములుగావు ఉదా॥ హరి ఇది డుమంతముకాదు ఏలయన, హరి+డుఙ్ = హరి - అనియగును ప్రథమైకవచనమున నిది డుఙ్వర్ణకముతోఁ గూడుకొనియుండదు కాన దీనికిఁ బ్రకృతియగు హరిశబ్దము డుమంతమ్ముకాదు,

## పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకుత్వం బగు. 21

నామంబనఁగా ప్రాతిపదికము డిత్థ, రామ, భార్గవ, రాజ పురుష ఇట్టివి ప్రాతిపదికములు డిత్థు రాము, భార్గవు, రాజపురుషు.

వ్యా పుంలింగమయి, మహద్వాచకమయిన ప్రాతిపదికముయొక్క చివర నున్న హ్రస్వమగు అకారమునకు హ్రస్వమగు ఉకార మాదేశమగునని యర్థము నామము = ప్రాతిపదికము (ప్రాతిపదికంహినామ-అం చిం) ధాతువు కానిది, ప్రత్యయము కానిది, ప్రత్యయము చేరనిది యగునర్థవంతమగు శబ్దరూపము ప్రాతిపదికము కృత్తద్ధిత సమాసములును ప్రాతిపదికములగును (ధాతుం ప్రత్యయం ప్రత్యయాంతంచ వర్జయిత్వార్థ వచ్ఛబ్దరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్ కృత్తద్ధిత సమాసాశ్చ-సి కౌ) (1) సంజ్ఞ-డిత్థ (11) కృదంతము-రామ రమ్ + ఘఞ్ = రామ ఘఞ్-కృత్తు కావున రామ-కృదంత ప్రాతిపదికము (111) తద్ధితాంతము-భార్గవ భృగు+జస్+అణ్ = భార్గవ అణ్ తద్ధితము కాన నిది తద్ధిత ప్రాతిపదికము కృత్తు = కృదంత 1 తద్ధితము=తద్ధిత 1 (1v) రాజపురుష-సమాస ప్రాతిపదికము, డిత్థ, రామ, భార్గవ, రాజపురుష-అనునవి పుంలింగములు, మహద్వాచకములు నగు నామములు కనుక వీని తుది 'అ' త్వమున కుత్వమగును డిత్థు, రాము, భార్గవు, రాజపురుషు

విశే - నామమనఁగా ప్రాతిపదికమనుట యీ సూత్రమునందు గ్రాహ్యము తక్కినచోట్ల నామమనఁగా సుబంతమునుగావచ్చును కావుననే నామనిర్వచనము సంజ్ఞాపరిచ్ఛేదమునఁ జేర్పఁబడలేదు (చూ సంధి 54)

పదసార్థక్యము - (1) పుంలింగంబయి - అనుటచేఁ బుంలింగములు కాని మహత్తుల, అత్వమున కుత్వమురాదు ఉదా॥ దేవత, దైవము, బ్రహ్మ (=పరమాత్మ) దేవత-స్త్రీలింగము దైవము, బ్రహ్మ నపుంసకలింగములు, కాన నివి మహత్తులయ్యు వీనికుత్వమురాదు మిత్రాదులకుఁ గ్లీబములగుచో, ఉత్వము రాదు ఉదా॥ మిత్రము (18) భ్రాత మొదలగు స్త్రీత్వ మతిదేశింపఁబడినవానికి ఉత్వము ప్రసక్తముకాదు (52) (11) మహద్వాచకంబయిన - అనుటచే నమ హత్పుంలింగములకుత్వమురాదు ఉదా॥ వృక్షము ఇది పుంలింగమేకాని మహత్తు కాదుగనుక ఉత్వము రాలేదు

ఫారపరిశీలన - డిద్ధ-ముద్రణస్ఖాలిత్యము కావచ్చును చూ 75 సూ

## పుంలింగమగు మహద్వాచకమునకు డుఙ్గు. 22

ఇచ్చట డుఙ్ఙనుదానియందు ఙకార మిత్తు గావున ఙిత్తుబిందు పూర్వంబగు నను సూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును, బిమ్మట ఙకారము లోపించును ఉ॥ డిత్థుఁడు, డిత్థుండు, రాముఁడు, రాముండు, భార్గవుఁడు, భార్గవుండు

వ్యా॥ పుంలిగమగు మహద్వాచకమునకుఁబరముగ (నేకత్వవివక్షయందు) డుఙ్వర్థకమగును డిత్థ - ప్రాతిపదికము 21చే-డిత్థు ఈ 22చే-డిత్థు+డుఙ్ ఇందలి ఙకార మిద్వర్ణముగనుక 19చే డువర్ణకమునకు ముందు బిందువు వచ్చును డిత్థుఁడు-డిత్థుండు-అనురూపము లేర్పడును ఙకారము ప్రయోగించు నపుడు మానఁబడును అనఁగా లోపించి పోవును ఇట్లే, రామ-21చే- రాము ఈ 22చే- రాము+డుఙ్ 19చే- రాముఁడు, రాముండు భార్గవ = భార్గవు+డుఙ్ భార్గవుఁడు, భార్గవుండు

విశే - (i) రాజపురుషుఁడు, రాజపురుషుండు - అను రూపము లుదాహృతములు కాలేదు 21 సూత్రమున, రాజపురుష-అని యుదాహృతము చూ సమాస 3 (ii) కారక 12చే-పరముగ, అనునది సూత్రమున నధ్యాహార మగును (iii) 19వ సూత్రమున, ఉదాహరణము మీఁదస్పష్టంబగు - అని తెలుపఁబడెను కాన దానికివి యుదాహరణములని సూచించుటకు "ఉ" అను నక్షరము చేర్పఁబడెను ఉ = ఉదాహరణము (iv) ఇట సూరి రాముఁడు మున్నగు వాని ప్రక్రియను సాధించి చూపుటలో నొక విశేషము కలదు ప్రాతిపదికముల కంటె సుప్రత్యయాదులను నిల్పి వానికి డుఙ్వర్ణకాదుల నాదేశించుట చింతామణి పద్ధతి ఈ పద్ధతి బాలవ్యాకరణమునఁ బాటింపలేదని స్పష్టపడుట కి ప్రక్రియ చెప్పఁబడెను

పదసార్థక్యము - (i) పుంలింగమగు - అనుటచేఁ బుంలింగములు కాని మహద్వాచకములకు డుఙ్ఙురాదు ఉదా॥ దేవత, దైవము, బ్రహ్మము, (= పరమాత్మ) దేవత స్త్రీలింగము దైవము, బ్రహ్మము - నపుంసక లింగములు, కాన, మహత్తులయ్యు, వీనికి డుఙ్ఙు కాదు (ii) మహద్వాచకమునకు - అనుటచేఁ బుంలింగములగు, అమహద్వాచకములకు డుఙ్ఙు కాదు ఉదా॥ వృషము. ఇది పుంలింగమేకాని మహద్వాచకముకాదు గాన డుఙ్ఙు కాదు (iii) ప్రాత మున్నగు స్త్రీత్వమాదేశించిన వానికిని డుఙ్ఙు కాదు.

## డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాషనగు 23

రామునిని, రాముని, రామునిచేతను, రాముచేతను, రామునికిని, రామునకును సర్వత్ర యనుట నగాగమ బాధనార్థము

వ్యా డుమంతమునకుఁ జివర "ని" అను నాగమము ద్వితీయాద్యేక వచనము పరమగునప్పుడు, సర్వత్ర విభాషనగును డుమంతము=డుజ్వర్ణకంబు నకుం బ్రకృతి యయినది డుమంతంబనంబడు (20) రామునిని, రాముని -రామ- ప్రాతిపదికము 21 చే - రాము 2చే - రాము + ను ఈ 23 చే - నేకత్వ వివక్షయందు, నిగాగమము రాముని + ను 26 చే - రామునిని - అగును నిగాగమము రానిచో - రాము + ను 25 చే - రాముని - అగును రాముని చేతను - రామ - ప్రాతిపదికము 21చే - రాము 3చే - రాము+చేత 8చే- రాము + చేతను ఈ 23చే - రాముని + చేతను = రామునిచేతను. నిగాగమము రానిపక్షమున - రాము + చేతను = రాముచేతను, రామునికిని, రామునకును - రామ - ప్రాతిపదికము 21చే - రాము 6చే - రాము + కు, 8చే - రాము+కును ఈ 23చే - నిగాగమము రావలసియుండఁగా 28 చే - నగాగమము ప్రసక్తమగుచున్నది కాన, సర్వత్ర యనుట నగాగమబాధనార్థమని చెప్పఁబడినది 28చే - నగాగమము ముందు ప్రవర్తించినచో, నది నిత్యవిధికనుక ఈ 23చే - నిగాగమము వచ్చుట కవకాశమే యుండదు కావున, నగాగమము నడ్డి తొలుత నీ నిగాగమము ప్రవర్తించుటకు సూత్రమున సర్వత్ర యను దళముపయోగింపఁబడినది కాఁగా నిగాగమము సర్వత్ర విభాషనగును గనుక మొదట నిగాగమము ప్రవర్తించి - రాము + కు+ను = రాముని+కు+ను - అగును 26చే- రామునికిని - అగును నిగాగమము విభాష కావున నిది కాని పక్షమున- రాము + కును, 28-చేరామునకును, అగును

విశే - సర్వత్ర యనుట నగాగమబాధనార్థము - అను వాక్యము, నుగాగమమున కుపలక్షణము ఎట్లనఁగా, రామ-ప్రాతిపదికము 21చే- రాము 7చే - రాము+అందు 29చే-నుగాగమమగుచుండఁగా, నుగాగమమును గూడ బాధించి తొలుత నిగాగమమే ప్రవర్తించును రాము+అందు = రాముని+ అందు సంధి 3చే రాముని - య్ + అందు = రామునియందు (8సూ) నిగాగమము కాని పక్షమున, రాము + అందు 29చే - రామును + అందు ద్రుతస్వరములోపించి, రామున్ + అందు = రామునందు - అగును,

పదసార్థక్యము - (1) డుమంతంబునకు అనుటచే, డుమంతములు కాని వానికి నిగాగమమురాదు ఉదా॥ హరి + ను 26చే హరిని - అగును హరి — డుమంతము కాదు గాన, నిగాగమములేదు (111) ద్వితీయాద్యేక వచనంబనుటచే ద్వితీయాది బహువచనము పరమగుచో నిగాగమము రాదు రాము + లను = రాములను

## అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును. 24

మగనిని, మగనిచేతను, మగనికిని, అనుదంతంబను పర్యు దాసముచేత, తమ్మునిని తమ్ముని, తమ్మునిచేతను, తమ్ముచేతను, అల్లునిని, అల్లుని, అల్లునిచేతను, అల్లుచేతను, బల్లిదునిని, బల్లిదుని, బల్లిదునిచేతను, బల్లిదుచేతను - ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికం బని యెఱుఁగునది

వ్యా అనుదంతమగు నచ్చతెనుఁగు డుమంతమునకు ద్వితీయాద్యేక వచనము పరమగునపుడు నిగాగమము నిత్యముగా నగును అనుదంతము = ఉదంతము కానిది అనఁగా 21చే - ఉదంతముగా మాఱనిదని తాత్పర్యము మగ - ఇది యను దంతము ఏలయన 22చే - దీని తుది అత్వమున కుత్వము ప్రాప్తించుచుండఁగా, అత్వమున కుత్వము లేదని అచ్చిక 4చే - నిషేధింప బడెను కాన మగ-అనుదాని తుది అత్వమున కుత్వమురాదు కనుక, ననుదంత మయినది ఇది తెనుఁగు డుమంతము (20) దీనికి ద్వితీయాద్యేకవచనము పర మగుచో నిగాగమము నిత్యముగానగును మగనిని - మగ-ప్రాతిపదికము 2చే- మగ + ను ఈ 24 చే నేకత్వవివక్షయందు, నిగాగమము మగని+ను 26 చే - మగనిని మగని చేతను - మగ-ప్రాతిపదికము 3 చే — మగ + చేత 8చే - మగ + చేత + ను ఈ 24చే - మగనిచేతను మగనికిని మగ-ప్రాతి పదికము 6చే - మగ+కు 8చే - మగ+కు+ను ఈ 24చే - మగని+ కు+ను 26 చే - మగనికిని

అనుదంతమనునది పర్యుదాసము పర్యుదాసమనఁగా నిషేధార్థకమగు నఞ్ శబ్దముత్తరపదముతో నన్వయించుట ("పర్యుదాస స్సవిజ్ఞేయో యత్రోత్తర పదేన నఞ్" మ త) ఉత్తరపదము = సమాసమునందలి తుది యవయవము ఉదా॥ అనుదంతము = ఉదంతముకానిది నఞ్ + ఉదంత ఇది నఞ్ తత్పురుష సమాసము ఇట నఞ్ శబ్దముత్తరపదమగు, ఉదంతశబ్దముతో

నన్వయించుచున్నది కావున నిది పర్యుదాసమనఁబడును అనుదంతమునకు నిగాగమము నిత్యమనుటచే 21చే - ఉదంతమగు దానికి 23 చే - నిగాగమము సర్వత్ర విభాషనగును తమ్మునిని, తమ్ముని తమ్మ - ప్రాతిపదికము అచ్ఛిక 2 చే - నిది పుంలింగతుల్యమగును కాన 21 చె - తమ్ము - అని ఉదంత మగును 2చే - తమ్ము + ను 23చే - తమ్ముని + ను 26చే - తమ్మునిని నిగాగమమురానిచో - తమ్ము + ను, 25 చే - తమ్ముని-అగును తమ్ముని చేతను, తమ్ముచేతను - తమ్మ - ప్రాతిపదికము అచ్ఛిక 2 చే - నిది పుంలింగ తుల్యమగును గనుక, 21 చే - తమ్ము 3చే తమ్ము + చేత 8చే - తమ్ము + చేతను 23చే-తమ్ముని చేతను, తమ్ముచేతను ఇట్లే 'అల్ల' అను ప్రాతిపదికము నుండి రూపసిద్ధి నరయనగును బల్లిద శబ్దము అచ్ఛిక 3 చే - సంస్కృత తుల్యమగును కావున మహద్విశేషణమగుచో నిది మహద్వాచకమగును అచ్ఛిక 2 చేఁ బుంలింగతుల్యమగును కనుక బల్లిద అను ప్రాతిపదికమునుండి, బల్లిదునిని, బల్లిదుని - ఇత్యాది రూపములిట్లే సిద్ధించును

విశే - (I) నఞ్ శబ్దము క్రియతో నన్వయించుట ప్రసజ్యప్రతినిషేధ మనఁబడును 'ప్రసజ్యప్రతిషేధోయం క్రియయా సహయత్రనఞ్' (మత) 'అనచిచ' (పాణి) = అచి పరే నభవతి ఇట నఞ్ శబ్దము భవతి-అను క్రియా పదమ్ముతో నన్వయించుచుండుటచే నిది ప్రసజ్యప్రతిషేధమనఁబడును (II) పర్యుదాసమ్మున విధి ప్రధానమగును ప్రతిషేధమున నిషేధము ప్రధానమగును (ప్రాధాన్యంతు విధేర్యత్ర ప్రతిషేధే ప్రధానతా, అప్రధాన్యం విధేర్యత్ర ప్రతిషేదే ప్రధానతా - (మత) (III) నఞ్ శబ్దమున కిట సాదృశ్య మర్థము (సాదృశ్యము = తద్భిన్నత్వేసతి తద్గత భూయోధర్మవత్త్వమ్ - (సిము) కాఁగా, మగాదులు నిగాగమమగు విషయమున ఉదంతభిన్నములయ్యు, డుమ్వర్ణకమగు విషయమున, ఉదంత సదృశములగును తమ్మ = తమ్ము తమ్ముఁడు మగ= మగఁడు - ఇత్యాది (IV) ద్వితీయాద్యేక వచనంబు పరంబగునపుడు - అన్నది 23 సూత్రము నుండి యనువృత్తమగును

## డుమంతంబు మీఁది నువర్ణకంబు నుత్వంబున కిత్వంబగు.25

నువర్ణంబు ద్వితీయ యను సూత్రముచేత 'రామును' అని ప్రాప్తింపఁగా నీ సూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె రామునిని, భార్గవుని.

వ్యా డుమంతము మీఁది ను ప్రత్యయము యొక్క ఉత్వమున కిత్వ మాదేశ మగును డుమంతము = డుమ్వర్ణకమునకుఁ బ్రకృతియయినది,

చూ 20 సూ ఉదా॥ రాముని - రామ - ప్రాతిపదికము 21 చే రాము 2 చే- రాము + ను 23 చే - నిగాగమము రాని పక్షమున, ఈ 25 చే 'ను' వర్ణము లోని ఉత్వమున కిత్వమాదేశమయి, రాము + న్ + ఇ = రాముని -అగును ఇట్లే భార్గవ = భార్గవు + ను భార్గవుని

పదసార్థక్యము - డుమంతంబు మీఁది - అనుటచే డుమంతములు కాని వాని మీఁది, ను వర్ణకము యొక్క ఉత్వమున కిత్వము కాదు ఉదా॥ విధాత+ ను = విధాతను చెట్టు + ను = చెట్టును

విశే - ఈ నువర్ణకము ద్వితీయైక వచనముగ వివక్షితము (23 సూ) కావున బహుత్వ వివక్షయందీ 25 సూత్రమునకుఁ బ్రాప్తియే లేదు ఉదా॥ రాము + లను = రాములను కాన ఇత్వనిషేధ మార్గములను గొందఱు సెల విచ్చుట, ప్రసక్తము కాదు లోప భూయిష్ఠములగు నా నిషేధ మార్గము లుపేక్ష్యములు

## ఇకారంబు మీఁదికునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు 26

హరిని, హరికిని, శ్రీని, శ్రీకిని, వారిని, వారికిని

వా ఇకారముమీఁది, ఋ-ను-వు, అను వాని యొక్కయు, గ్రియావిభక్తుల యొక్కయు, ఉత్వమున కిత్వమగును హరిని -హరి-ప్రాతిపదికము, 2చే-హరి+ ను ఈ 26చే 'ను' వర్ణము యొక్క ఉత్వమున కిత్వమాదేశమయి, హరి+ న్+ఇ=హరిని-అయ్యెను హరికిని - హరి-ప్రాతిపదికము 6చే-హరి+కు 8చే-హరి+కు+ను ఈ 26చే-హరికిని ఇకారంబు మీఁది-అనుటచే, హ్రస్వ దీర్ఘములగు ఇకారములు రెంటిమీదను ఉత్వమున కిత్వమగును దీర్ఘమునకు శ్రీని,-శ్రీ ప్రాతిపదికము 2చే - శ్రీ + ను ఈ 26చే - శ్రీ+న్+ఇ=శ్రీని శ్రీకిని - శ్రీ-ప్రాతిపదికము 6చే - శ్రీ+కు 8చే శ్రీ+కు+ను ఈ 26చే- శ్రీకిని వారిని - వారి+ను ఈ 26చే - వారిని వారికిని - 6చే - వారి+కు 8చే - వారి + కు + ను ఈ 26చే - వారికిని

వు - అనుదానికిఁ గ్రియావిభక్తులకు నిట నుదాహరణములు చూపఁబడ లేదు వు - అనుదానికి - సుకృతి+వు ఈ 26 చే - సుకృతివి ఇట్లే సుకృతి+ను=సుకృతిని (కారక 33, 34) క్రియావిభక్తులకు - వండితి+రు ఈ 26చే - వండితిరి ఇత్యాది క్రియావిభక్తులు ... - ర్థ ... వు ను-ము-అనునవి (క్రియా 8 సూ) ఇకారము ... దీర్ఘ ... "అణుదిత్స వర్ణ స్యచా ప్రత్యయ (పాణి ...

విశే - (1) 65చే-ఐకారము దీర్ఘమగు ఇకారముతోఁ దుల్యమగును కనుక నీ 26చే-ఐకారముమీఁద నైత మీకార్యమగును రై + ను = రైని పై + ను = పైని-మొ॥ (11) వారిని, వారికిని, సర్వనామోదాహృతులుగా నుద్దిష్టములు (చూ ఆచ్ఛిక 24 వ్యాఖ్య) కొందఱు, 'వారి' శబ్దము నపుంసకమగు సంస్కృత వారి (జలము) శబ్దమనియు సర్వనామముల ప్రక్రియ సూరి చెప్పనే చెప్పఁడనియు సెలవిచ్చియున్నారు అది భ్రాంతిమూలకము చూ 27 సూత్ర వ్యాఖ్య (111) కు - ప్రత్యయము, ను-వు-లు ప్రత్యయాగమోభయములు కనుకనే,- కు-ను-వు లనఁబడెను కొందఱు కు-ప్రత్యయము, వు-ఆగమము, ను - ఉభయము - అనుట యుక్తి యుక్తముకాదు ఈ పక్షమున కు-వు-నులని వ్యవహరించుట యుక్తమనవచ్చును కు ప్రత్యయము చెప్పి వు ప్రత్యయము చెప్పకుండుట సరికాదు ను - ఉభయమైనట్లే వు - ఉభయము కావలసి యుండును (చూ 27)

## ఈధాతు యుష్మదర్థంబుల మీఁది వాని యుత్వం బున కిత్వంబు రాదు. 27

ఈరు—ఈవు—ఈను—ఈము—ఈకు—నీకు—మీకు

వ్యా 'ఈ' ధాతువుమీఁదను, యుష్మదర్థము మీఁదనుగల, కు-ను-వు-క్రియా విభక్తుల ఉత్వమున కిత్వము రాదు ఈధాతువు = ఇచ్చు ధాతువున కంతటికాదేశమగు ధాతువు యుష్మదర్థము = నీ-అను సర్వనామము "ఈ" ధాతువునకు ఇచ్చు + రు = ఈ + రు 26 చే - ఉత్వమునకు, ఇత్వము ప్రాప్తించుచుండగా, ఈ 27, ఉత్వమునకు ఇత్వమును నిషేధించుచున్నది కాన, ఈ + రు=ఈరు అగును ఇట్లే, ఇచ్చు + వు=ఈ +వు ఈవు ఇచ్చు+ ను = ఈ + ను ఈను, ఇచ్చు + ము = ఈ + ము, ఈము ఇచ్చు+ కు = ఈ + కు, ఈకు యుష్మదర్థమునకు నీ + కు 26చే - ఉత్వమున కిత్వము ప్రాప్తించుచుండఁగా నీ 27 నిషేధించును కనుక, నీ + కు = నీకు-అగును ఇట్లే మీ + కు = మీకు

విశే — (1) పీనిపూర్తి ప్రక్రియ ఈ ధాతువునకు ఈరు , ఇచ్చు ధాతువు క్రియా 7చే - ఇచ్చు + లట్ 8చే - ఇచ్చు + రు 92చే-ఈ+రు ఉత్వమున 26చేఁ బ్రాప్తింపవలసియున్న ఇత్వము, నీ 27 నిషేధించును కనుక ఈ + రు = ఈరు-అగును ఇట్లే ఈవు, ఈను, ఈము - అనునవి ఈకు ఇచ్చు - దాతువు క్రియా 6 చే ఇచ్చు + లోట్టు 8చే - ఇచ్చు + వు 29చే-

ఇచ్చు + ము 92చే - ఈ+ము 32చే - ఈ + కుఱి + ము = ఈకుము సంధి 48 చే _ ఈకు యుష్మదర్థములకు చూ అచ్చిక 24 వ్యాఖ్య (ii) 26వ, సూత్రమునకు సర్వనామముల విషయమునఁ బ్రవృత్తి యుండుటచేతనే యీ 27 చే - నిషేధము చెప్పఁబడెననుట స్పష్టము లేనిచోఁ బ్రాప్తిలేనిదే నిషేధమునకుఁ బ్రసక్తిలేదు గనుక 'యుష్మదర్థంబుల మీఁది' అను దళము వ్యర్థము కావలసి వచ్చును కావున 26వ సూత్రమునందలి, వారిని వారికిని - అనువానిని, సూరిగారు సర్వనామోదాహరణములు గానే యుద్దేశించిరనుటలో విప్రతిపత్తి యుండుటకే వీలులేదు (iii) ఈఁడు - అను వ్యతిరేకక్రియ యిటఁ జూపఁబడలేదు ఏలయన, 'ఈ' ధాతువునకుఁ గ్రియా విభక్తికి నరసున్న చే వ్యవధాన మేర్పడుచున్నది కాన 26 చే - ఉత్వమున కిత్వమే ప్రాప్తింపదు (iv) నీ + వు, ఈ + వు 26చే - ఉత్వమున కిత్వము ప్రాప్తించుచుండఁగా, నీ 27 నిషేధింపను హరికిని, శ్రీకిని (26) అనువానిని జూపిన క్రమమున, నీకు, మీకు - అనుషష్ఠ్యంతములిటం జూపఁబడెను వు - అనునాగమమునకు లక్ష్యము 26 లోఁ జూపలేదు అట్లే 'వు' విభక్తికిని లక్ష్యము చూపలేదు (v) ఈకు - అనునది యుష్మదర్థమని కొందఱు వ్యాఖ్యానించినారు క్రియయు, యుష్మదర్థమును, నగునని కొందఱు సెలవిచ్చినారు కాని యీ రెండు పక్షములును సరికావు ఏలయన, అచ్చిక 24 సూత్రోదాహరణములను బట్టి, నీకు - అను యుష్మదర్థ మొక్కటి మాత్రమే సూరి మతమునఁ గలదు ఈకు - అనునది లేనేలేదు కావున ఈకు - అనునది క్రియారూపము మాత్రమే యన్నది సూరి హృదయమనుట స్పష్టము ఈకు-రూపసాధనకు చూ అచ్చిక 24వ్యా

పదసార్థక్యము - 'ఈ' ధాతువనుటచే- 'ఇచ్చు' ధాతువున కీవిధి ప్రవర్తింపదు ఇచ్చితి + ను = ఇచ్చితిని మొ॥

## కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు. 28

రామునకును, విష్ణునకును, సవితృనకును, విధాతృనకును

వ్యా కు ప్రత్యయము పరమగుచో, ఉకార ఋకారములకుఁ జివర 'న' వర్ణ మాగమమగును నక్ + ఆగమ = నగాగమము కకారముతో నిర్దేశించుటచే నిర్దిష్టమునకుఁ జివర నవర్ణము చేరును ఉదా॥ రామునకును - రామ-ప్రాతిపదికము 21చే-రాము 6చే - రాము + కు 8చే-రాము+కును 23చే - నగాగమముకానిచో నీ 28చే - రామున + కును=రామునకును, విష్ణునకును -

విష్ణు-ప్రాతిపదికము 6చే - విష్ణు+కు 8చే-విష్ణు+కును 23చే - నిగాగమము కానిచో నీ 28చే - విష్ణున + కును = విష్ణునకును సవితృనకును - సవితృ - ప్రాతిపదికము 6చే - సవితృ + కు, 8 చే - సవితృ+కును 23 చే - నిగాగమముకానిచో, నీ 28చే-సవితృన+కును=సవితృనకును ఇట్లే విధాతృ+కును=విధాతృనకును (53 సూ)

విశే - రాము-కృతోత్కమున కుదాహరణము కృతోత్కము=చేయఁబడిన ఉత్తుగలది 21చే - రామ=రాము-అయినది - విష్ణులోనిది, సహజమైన ఉకారము

## ఉకార ఋకారంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు. 29

రామునందును, విష్ణునందును, విధాతృ నందును

వ్యా అందు ప్రత్యయము పరమగుచో ఉకార ఋకారములకుఁ జివర నువర్ణమాగమమగును నుక్ + ఆగమ = నుగాగమము నుక్ - అని కకారముతో నిర్దేశించుటచే నిర్దిష్టమునకుఁ జివర నువర్ణమాగమమగును సూరి మతమున నువర్ణమే ద్రుతమగుటచే 'ను' అన్నదే యాగమమనవలెను.

ఉదా॥ రామునందును - రామ - ప్రాతిపదికము 21చే-రాము 7చే- రాము+అందు 8చే - రాము+అందును ఈ 29చే - రామును+అందును అచ్చుపరమగుటచే ద్రుతస్వరములోపించి, రామున్ + అందును = రామునందును- అగును (చూ సంధి 2, 5, 9, 41) విష్ణునందును - విష్ణు-ప్రాతిపదికము 7చే-విష్ణు+అందు 8చే విష్ణు + అందును ఈ 29చే- విష్ణును+అందును=విష్ణున్ + అందును = విష్ణునందును విధాతృనందును - విధాతృ-ప్రాతిపదికము 7చే-విధాతృ+అందు 8చే- విధాతృ+అందును ఈ 29చే- విధాతృను + అందును= విధాతృన్ + అందును, విధాతృనందును

విశే - (1) రాము-లోని ఉకారము 21చే నయినది కాన, కృతోత్కము విష్ణు-లోని ఉకారము శబ్దసహజము కాన నీ రెండువిధములగు ఉకారములకు నీవిధి వర్తించునని తెలియుచున్నది (11) "23 సూత్ర వివృతిలోని నగాగమ శబ్దము నుగాగమమున కుపలక్షణమన వచ్చును" (వజ్ఝలవారిలేఖ 12.11.59) ఉదా॥ రామునియందును, రామునందును-23సూ

**ఆగమ ము వు వర్ణంబుల కందు వర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. 30**

వనమునందును, వనమందును, ధేనువునందును, ధేనువందును

వ్యా అందు ప్రత్యయము పరమగునపు డాగమ ము - వు వర్ణములకుఁ జివర ను అను నాగమము విభాషనగును వనమందును, వనమునందును - వన ప్రాతిపదికము 7 చే - వన + అందు 8 చే - వన + అందును 40 చే- ముగాగమము వన + ము + అందును ఈ 30 చే - వనమును+అందును అచ్చు పరమగుచో ద్రుత స్వరలోపమగును (సంధి 2, 5, 9, 41) వనమున్ + అందును = వనమునందును నుగాగమము రానిచో - వనము + అందును, సంధి 11 చే - వనమందును ధేనువు నందును, ధేనువందును - ధేను - ప్రాతి పదికము 7 చే - ధేను + అందు 8 చే - ధేను + అందును 49 చే - వుగా గమము ధేను + వు + అందును ఈ 30 చే - ధేనువును + అందును = ధేనువున్ + అందును ధేనువునందును నుగాగమము రానిచో - ధేనువు + అందును సంధి 11 చే - ధేనువందును - అగును

**బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు. 31**

రాములను, రాములచేతను, విధాతృలను, విధాతృలచేతను

వ్యా బహువచనమున ద్వితీయాది విభక్తులకు ముందు 'ల' వర్ణమాగమ మగును - లట్ + ఆగమ = లడాగమము లట్ - అని, టకారముతో నిర్దే శించుటచే, ల వర్ణము, నిర్దిష్టమునకు ముందుఁ జేరును ఇట నిర్దిష్టము ద్వితీ యాది విభక్తి కనుక ద్వితీయాది విభక్తులకు ముందు ల వర్ణము చేరును రాము లను - రామ - ప్రాతిపదికము 21 చే - రాము 2 చే - రాము+ను బహుత్వ వివక్షయందు, ఈ 31 చే - 'ను' ప్రత్యయమునకు ముందు ల వర్ణమాగమ మగును రాము - ల + ను = రాములను, రాములచేతను - రామ - ప్రాతి పదికము 21 చే - రాము 3 చే - రాము + చేత, 8 చే - రాము+చేతను ఈ 31 చే - రాము - ల + చేతను = రాములచేతను విధాతృలను -విధాతృ-; ప్రాతిపదికము 2 చే - విధాతృ + ను ఈ 31 చే - విధాతృ - ల+ను= విధాతృలను విధాతృల చేతను - విధాతృ - ప్రాతిపదికము 3 చే-విధాతృ+ చేత 8 చే - విధాతృ + చేతను ఈ 31 చే - విధాతృ - ల + చేతను = విధాతృల చేతను

విశే - (1) దేనికేది యాగమమగునో దానికది యవయవమగునని పరిభాష (యదాగమా స్తద్గుణీ భూతా స్తద్గ్రహణేన గృహ్యంతే - పరిభా) లడాగమమనుటచే నిట లవర్ణమునకు విభక్తిత్వము సిద్ధించెను ఏలయన 'ల' వర్ణము విభక్తికి ముందాగమ మయినది దీని మూలమున, బాలురను మున్నగు రూపములను సాధించుకొనుటలో సౌలభ్య మేర్పడెను చూ తత్సమ 38, అచ్ఛిక 5, 6, 7, 10, 11 సూ॥) లడాగమము విభక్తి కనుకనే, సమాస 25 సూత్రమున 'లట్టునకుఁగాదు' అను నిషేధమావశ్యకమయ్యెను (11) ను, = చేత - 13 చే - నుభయములు ఇవి యిట బహుత్వ బోధకములుగా వివక్షితములయ్యెను లట్టు బహుత్వమునకు ద్యోతకము

## సంబోధనంబునం దేకార్థంబయిన పదంబు తుది యుకారంబున కకారంబగు. 32

ఓ రాముఁడ, ఓ వృక్షమ, ఓ శంభువ, ఓ కొడుక.

వ్యా సంబోధనమున నేక పదార్థమును బోధించు పదము యొక్క తుది 'ఉ' కారమునకు 'అ' కారమగును ఉదా॥ ఓ రాముఁడ - రాముఁడు - అనునది యొక రామ వ్యక్తిని బోధించు పదము (11 సూ) కాన సంబోధనమున దీని తుది ఉకారమున కకార మాదేశమయి - రాముఁడ్ + ఉ = రాముడ్ + అ రాముఁడ - అగును 14 చే - ఓ రాముఁడ - అగును ఓ వృక్షమ - వృక్షము- ఏకార్థ బోధకమగు పదము కాన నీ 32 చే - వృక్షమ్ + ఉ = వృక్షమ్ + అ వృక్షమ - అగును 14 చే - ఓ వృక్షమ - అగును ఓ శంభువ శంభువు- ఈ 32 చే - శంభువ్ + ఉ = శంభువ్ + అ శంభువ - అగును 14 చే - ఓ శంభువ - అగును సంబోధనము = సిద్ధ వస్తువును దనకభిముఖునిగాఁ జేసికొను వ్యాపారము ("సిద్ధస్యాభిముఖీభావమాత్రం సంబోధనం విదుః-"వాక్యప) ఓ రాముఁడ - ఇట రామ రూపమున సిద్ధమయియున్న వ్యక్తి నభిముఖునిగాఁ జేసికొనుట కలదు కాన నిది సంబోధనము సిద్ధ వస్తువు కానిచో సంబోధన విభక్తి ప్రయుక్తము కాదు రాజు కానివానిని, ఓ రాజా! అనుట కుదరదు

ఈ సూత్ర మచ్చతెనుఁగు విషయమునను వర్తించును ఉదా॥ఓకొడుక - కొడుకు ఈ 32 చే - కొడుక్ + ఉ = కొడుక్ + అ కొడుక - అగును 14 చే - ఓ కొడుక - అగును

## సంబోధనంబునందుఁ బదంబు తుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు. 33

ఓ రాముఁడా, ఓ రాముఁడ, ఓ చెలియా, ఓ చెలియ, ఓ హరీ ఓ హరి, ఓ తండ్రీ, ఓ తండ్రి

వ్యా సంబోధనమునఁబదము తుది అకారమునకు, ఇకారమునకు దీర్ఘము విభాషనగును ఓ రాముఁడా, ఓ రాముఁడ - రాముఁడు - అనునది 32 చే - రాముఁడ - అగును ఈ 33చే - రాముఁడా అగును 14 చే - ఓ రాముఁడా - అగును అకారమునకు దీర్ఘము కానిచో - ఓ రాముఁడ - అని యుండును రాముఁడు ప్రక్రియకు - చూ 22 సూ ఓ చెలియా, ఓ చెలియ - చెలియ - ఈ 33 చే అకారమునకు దీర్ఘమయినచో, చెలియా - అగును 14 చే - ఓ చెలియా - అగును దీర్ఘము కానిచో - ఓచెలియ - అను రూపముండును ఇది సహజమయిన అకారమునకు, విశేషించి యచ్చ తెనుఁగున కుదాహరణము ఓ హరీ, ఓ హరి - హరి - ఈ 33చే - దీని తుది ఇకారమునకు దీర్ఘమయినచో, హరీ - అగును 14 చే ఓ హరీ-అగును దీర్ఘము కాని పక్షమున - ఓ హరి - అని యుండును ఇట్లే ఓ తండ్రీ, ఓ తండ్రి - అనువాని ప్రక్రియను గ్రహింప వలెను ఇది యాచ్ఛికమున కుదాహరణము

## కృతోత్కంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు. 34

ఓ రామ, ఓ కృష్ణ పూర్వ సూత్రముచేత దీర్ఘంబు ఓ రామా, ఓ కృష్ణా సంస్కృత నామంబనుటఁజేసి ఓ తమ్ముఁడ, ఓ బల్లిదుఁడ- ఇత్యాదులందు లోపంబు లేదు

వ్యా వ్యాకరణ సూత్రముచే, ఉదంతముగా మాఱిన సంస్కృత ప్రాతి పదికము యొక్క సంబుద్ధికిఁ జెందిన డుజ్ ప్రత్యయమునకు, లోపము విభాష నగును సంబుద్ధి = సంబోధన ప్రథమావిభక్త్యేక వచనము (సంబోధనే ప్రథ మాయా ఏకవచనం సంబుద్ధి సంజ్ఞం స్యాత్ - సి కౌ) కృతోత్కము కృత= చేయఁబడిన, ఉత్ + క = హ్రస్వమగు ఉకారము గలది అదంతమయి యుండి 21 చే - ఉదంతముగ మాఱినదని తాత్పర్యము ఓ రామ, ఓ రామా - రామ - సంస్కృత ప్రాతిపదికము 21 చే - రాము ఇప్పుడిది కృతోత్కమగు సంస్కృత ప్రాతిపదిక యయినది 22 చే - రాము + డుజ్ ఇట సంబుద్ధి డుజ్జునకు, సి 34 చే - లోపము కలిగినచో, రాము - అని మిగులును 32 చే,

రామ - అగును 33 చే - రామా, రామ - అను రెండు రూపములు నుండును 14 చే - ఓ రామా, ఓ రామ - అని యగును ఇట్లే ఓ కృష్ణా, ఓ కృష్ణ - అను వాని ప్రక్రియ గ్రహింపవలెను డుజ్జు లోపింపని పక్షమున - రాము + డుజ్, కృష్ణు + డుజ్ 19 చే - రాముఁడు, కృష్ణుఁడు - అగును 32 చే రాముఁడ, కృష్ణుఁడ - అగును 33 చే - రాముఁడా, రాముడ, కృష్ణుఁడా, కృష్ణుడ - అను రూపములగునని గ్రహింపనగును, సంస్కృత నామంబు - అనుటచేఁ దెనుఁగు నామము మీఁది సంబుద్ధి డుజ్జునకు లోపము లేదు ఓ తమ్ముఁడ - తమ్మ-ప్రాతిపదికము అచ్చిక 2 చేఁ బుంలింగ తుల్యము గనుక, 21 చే తమ్ము - అగును 22చే తమ్ము + డుజ్ తమ్మ - తెనుఁగు ప్రాతిపదికము గనుక దీని సంబుద్ధి డుజ్జున కీ 34 చే - లోపము రాదు కావున 19 చే తమ్ముఁడు - అగును 32చే తమ్ముఁడ 33 చే తమ్ముఁడా, తమ్ముఁడ - అను రూపము లగును 14 చే - ఓ తమ్ముఁడా, ఓ తమ్ముఁడ ఓ బల్లిదుఁడ - బల్లిద - ప్రాతిపదికము అచ్చిక 2 చే - పుంలింగ తుల్యము గాన 21 చే, బల్లిదు 22చే - బల్లిదు + డుజ్ అచ్చిక 3 చే - సంస్కృత తుల్యమయినను, నిది సంస్కృత నామము కాదు గనుక నీ 34 చే - డుజ్జు లోపింపదు 19 చే - బల్లిదుఁడు - అగును 32 చే - బల్లిదుఁడ 33 చే- బల్లిదుఁడా, బల్లిదుఁడ - అను రూపము లగును 14 చే - ఓ బల్లిదుఁడా ఓ బల్లిదుఁడ - అను రూపము లేర్పడును

పదసార్థక్యము - (I) సంస్కృత నామంబు - అనుటచేఁ దెనుగు నామములయెడ నీ విధి వర్తింపదని సూరిగారే వివరించిరి ఉదా॥ ఓ తమ్ముఁడ, ఓ బల్లిదుఁడ మొ॥ (II) కృతోత్కంబగు అనుటచే సహజముగ, ఉకారాంతము లయిన శబ్దముల సంబుద్ధి డుజ్జునకు లోపము రాదు ఉదా॥ ఓ విష్ణుఁడ (III) సంబుద్ధి డుజ్జునకు - అనుటచే ప్రథమా విభక్తి డుజ్జునకు లోపము లేదు ఉదా॥ రాముఁడు, కృష్ణుఁడు మొ॥

## ఉదంత సంస్కృత నామంబు మీఁది సంబుద్ధి డుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు. 35

ఓ విష్ణూ౩, ఓ శంభూ౩, పక్షంబునందు విష్ణుఁడ, శంభుఁడ ఇత్యాది

వ్యా హ్రస్వమయిన, ఉకారమంతమందుఁగలసంస్కృత ప్రాతిపదికము మీఁది సంబుద్ధి డుజ్జునకుఁ బ్లుతమగు ఊకారము విభాషగ నాదేశమగును ప్లుతము = మూఁడు మాత్రల కాలములోఁ బలుకు నచ్చు (త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయః) ఓ విష్ణూ౩ విష్ణు - ప్రాతిపదికము 50 చే - వు వర్ణకము కానిచో - 22చే

విష్ణు + డుఙ్ ఈ 35 చే - డుఙ్ఞనకు ఊ$_3$ - ఆదేశమయినచో - విష్ణు + ఊ$_3$ - అగును సంధి 11 చే విష్ణూ$_3$ - అగును తత్సమ 14 చే - ఓ విష్ణూ$_3$- అగును ఊ$_3$ - ఆదేశము కానిచో, విష్ణు + డుఙ్ 19 చే - విష్ణుఁడు, 32 చే - విష్ణుఁడ, 33 చే - విష్ణుఁడా, విష్ణుఁడ - అను రూపములు కలుగును 14చే - ఓ విష్ణుఁడా, ఓ విష్ణుఁడ - అనునవి యేర్పడును ఇట్లే ఓ శంభూ$_3$ ఓ శంభుఁడ- మున్నగువానిని సాధించుకొనవలెను

విశే - (I) ఇందలి ఉదంతము సహజములయిన ఉదంతములనే తెలుపును కృతోత్కృములకు 34 సూత్రము వర్తించును కావున రాము + డుఙ్ - అనుచో ఈ 35 సూత్రమునకుఁ బ్రసక్తిలేదు (II) ప్లుత స్వరాంగీకారమే సరికాదని కొందఱు సెలవిచ్చిన యభిప్రాయము లాక్షణిక సమ్మతము కాదు వర్ణములలోఁ జేర్పక పోవుటచే నిది కేచిన్మతము (III) విధాన సామర్థ్యముచేఁ బ్లు తో కారమునకు 32 చే - అత్వముకాదు

పదసార్థక్యము - (I) 'ఆదేశంబు' అని యనుటచే డుఙ్ఞన కంతటికి ఊ$_3$- ఆ దేశమగును లేనిచో ననేక వర్ణములుగల స్థాని కేకవర్ణము నాదేశము చేసినచో నది స్థానియొక్క తుదివర్ణమునకే యాదేశమగునుగాన, (అలోంత్యస్య - పాణి) "ఊ$_3$" అనునది డుఙ్ఞలోని తుదివర్ణమునకే యాదేశము కావలసి వచ్చును కాన ఆదేశశబ్దము సార్థకము (II) ఉకారంబు ప్లుతంబు - అనుటచేఁ దెనుఁగున దీర్ఘము ప్రక్క మూఁడంకెవేసి ప్లుతమును గుర్తింపవలెను కావుననే ఓ విష్ణూ$_3$, ఓ శంభూ$_3$ అనియే లక్ష్యములు చూపఁబడెను

పారపరిశీలన - మీఁద - అని ప్రథమ ముద్రణము సంధి - *14, 16,* తత్సమ 38, క్రియా 59, 62 సూత్రముల రచనా క్రమమునుబట్టి మీఁది అను ముద్రణములు గ్రాహ్యమనఁదగును

## సంబోధనంబునందు బహువచనంబున
## కారగాగమంబగు. 36

ఓ రాములార, ఓ కృష్ణులార దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు ఓ రాములారా, ఓ కృష్ణులారా

వ్యా సంబోధనమున బహువచనమునకుఁ జివర 'అర' అనునది యాగమమగును అరక్ + అగమ = అరగాగమము అరక్ అని కకారమును జేర్చుటచే నిర్దిష్టమునకుఁ జివర 'అర' యనునది యాగమమగును రాములు+ అర సంధి 11 చే, రాములార ఇట్లే కృష్ణులు + అర = కృష్ణులార, 33 చే,

దీర్ఘము వైకల్పికముగనగును రాములారా, రాములార, కృష్ణులారా, కృష్ణులార
14 చే - ఓ రాములారా, ఓ రాములార, ఓ కృష్ణులారా, ఓ కృష్ణులార

## మధ్యమపురుష యోగంబునం దారగాగమంబు విభాషనగు. 37

వినుఁడు బాలకులు , వినుఁడు బాలకులార,
వచ్చితిరికాంతలు , వచ్చితిరి కాంతలార

అన్నలార మిమ్ము నడిగెద నొకమాట ఇచ్చట మధ్యమ పురుష యోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు

వ్యా సంబోధనమునందు, మధ్యమ పురుష యోగమున, బహువచనమునకుఁ జివర 'ఆర' అను నాగమము విభాషనగును మధ్యమ పురుష యోగము= సంబోధ్య వాచకముచే బోధింపఁబడిన యుష్మదర్థకము (=నీవు, మీరు) మధ్యమ పురుషముతో నన్వయించుట, మధ్యమపురుష యోగమనఁబడును సంబోధ్య వాచకము=14 సూ మధ్యమపురుషము=యుష్మదర్థముననగు క్రియాప్రత్యయములు మధ్యమపురుష మనఁబడును (క్రియా 11) ఉదా॥ 'వినుఁడు బాలకులు వినుఁడు - అనుదానిలోని డుఙ్యుష్మదర్థమున నైనది, కనుక మధ్యమ పురుషము (క్రియా 29) ఈ వాక్యమున బాలకులార - అను సంబోధ్యవాచకము, మీరు అను దానిని బోధించుచున్నది ఈ 'మీరు' అనునది, వినుఁడు - అను మధ్యమపురుష క్రియతో నన్వయించుచున్నది (మీరు వినుఁడు) కాన నిట మధ్యమపురుషయోగము కలదు కావున ఆరగాగమము విభాషనగును ఆరగాగమ మయినచో - వినుఁడు బాలకులు+ఆర సంధి 11 చే - వినుఁడు బాలకులార - అగును ఆరగాగమము కానిచో వినుఁడుబాలకులు - అని యగును ఇట్లే వచ్చితిరి కాంతలార, వచ్చితిరికాంతలు - అనువానిని సాధింపనగును అన్నలార- యను సంబోధ్య వాచకముచే బోధింపఁబడిన మిమ్ముశబ్దమునకు అడిగెదన్ - అను క్రియతో నన్వయములేదు నేను - అను నస్మదర్థకమునకే క్రియతో నన్వయము గలదు (నేను - అడిగెదన్) కావున నిట మధ్యమపురుషయోగము లేదు మధ్యమ పురుషయోగము లేకుండుటచే, ఆరగాగమము నిత్యమే (అన్నలు మిమ్ము నడిగెద నొకమాట - అనరాదు )

విశే. ఇందలి విభాష, ప్రాప్తవిభాష

**అదంతంబయి దీర్ఘపూర్వ లోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు. 38**

బాలురు, బాలురను, బాలురచేతను, నృపాలురు, నృపాలురను, నృపాలురచేతను దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి దయాళురు, దయాళురను, దయాళురచేతను

వ్యా హ్రస్వమయిన అకారమంతమందుఁ గలిగి, దీర్ఘపూర్వకమయిన లకార ముపధగాఁ గలిగిన మహద్వాచకము మీఁది విభక్తి లకారమునకు రేఫ మగును అనఁగా (1) హ్రస్వమయిన అకారమంతమందుండవలెను (2) లకార ముపధగా నుండవలెను ఉపధ=తుదివర్ణమునకు ముందువర్ణము (3) ఉపధకు ముందు దీర్ఘముండవలెను (4) మహద్వాచకము కావలెను ఈ నాలుగు ధర్మములున్నప్పుడు విభక్తి లకారమునకు రేఫమగును బాలురు - బాల-ప్రాతి పదికము 12చే - బాల+లు బాల శబ్దమదంతము లకార ముపధగాఁగలదు ఉపధకు ముందు దీర్ఘము గలదు ('బా' లోని 'ఆ' దీర్ఘము ) ఇది మహద్వాచ కము కనుక నీ 38 చే- విభక్తి లకారమునకు (ల్) రేఫమగును బాల+లు= బాల + ల్ + ఉ 'ల్' అనుదానికి 'ర్' ఆదేశము కాఁగా, బాల+ర్+ఉ= బాల+రు-అగును 21చే - బాలు+రు=బాలురు-అగును బాలురను - బాల- ప్రాతిపదికము 2చే బాల+ను 31చే-బాల+లను (=బాల+ల్+అ+ను ) ఈ 38చే- బాల-ర్+అ+ను=బాల+రను 21చే- బాలు+రను=బాలురను- అగును బాలురచేతను - బాల-ప్రాతిపదికము 3చే-బాల+చేత 8చే-బాల+ చేతను 31చే బాల+లచేతను ఈ 38చే - బాల - ర్+అ+చేతను=బాల+ రచేతను 21చే - బాలు + రచేతను = బాలురచేతను ఇట్లే నృపాల+లు= నృపాలురు, నృపాల+లను = నృపాలురను, నృపాల+లచేతను=నృపాలుర చేతను దయాళురు - దయాళు - ప్రాతిపదికము 12చే - దయాళు+లు, ఇది అదంతముకాదు గనుక 38చే - బహువచన లకారమునకు రేఫముకాదు కాన "దయాళు శబ్దంబునకిట్లు రేఫంబు గానంబడియెడి" అను వాక్యముచే నిట రేఫ మగును దయాళు+లు=దయాళు+ర్+ఉ దయాళురు - అగును దయాళు రను - దయాళు — ప్రాతిపదికము 2చే దయాళు+ను 31చే దయాళు+లను పైవాక్యముచే - దయాళు+రను=దయాళురను, దయాళుర చేతను -- దయాళు - ప్రాతిపదికము, 3చే-దయాళు+చేత 8చే- దయాళు+చేతను 31చే - దయాళు+ లచేతను పైవాక్యముచే దయాళు+రచేతను, దయాళురచేతను

పదసార్థక్యము - (1) అదంతంబయి-అనుటచే - అదంతములు కానివానికి విధి వర్తింపదు ఉదా॥ దీళాలి + లు = దీళాలులు (2) లో పధంబయిన-అనుటచే లకారముపధలుకాని వానికిది వర్తింపదు రామ + లు=రాములు ఇట మకార ముపధగనుక లకారమునకు రేఫమురాదు (3) దీర్ఘపూర్వక – అనుటచే హ్రస్వపూర్వక మగుచో లకారమునకు రేఫము కలుగదు ఉదా॥ ఖల + లు = ఖలులు నల + లు = నలులు (4) మహత్తుమీఁది - అనుటచే నమహత్తుమీఁది బహువచన లకారమునకు రేఫముకాదు బాల+లు= బాలలు బాలా=బాల, బాలిక యని యర్థము

విశే - (1) దయాళు శబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి – అను వాక్యము కేతన యాంధ్రభాషాభూషణవచనమును సూచించును లలిత దయాళు రనంగా అం భూ (II) బాల+లను ఇత్యాదులలో లడాగమ లకారమునకు రేఫాదేశమయినది 31చే లడాగమ లకారము విభక్తిలకారమగును చూ 31 వ్యాఖ్య (III) బాలు+లు=బాలురు–అని ప్రక్రియ చెప్పుటతప్పు ఇది అవ్యది స్థానివదాదేశోనవిధౌ (పాణి) కాన స్థాని వద్భావములేదు (IV) కృతోత్కంబయి అన్నచో దీళాలు+లు - అనుచో రేఫము ప్రసక్తమగును

**అమహన్నపుంసకములకదంతంబులకు మువర్ణకంబగు. 39**

వృక్షము, ఋషము, దైవము, కళత్రము, అపత్యము. క్లీబంబులు మిత్రాదులను సూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాది శబ్దంబులకు ద్వైరూప్యంబెఱుంగునది ఉ॥ మిత్రుఁడు, మిత్రము శరణుఁడు, శరణము

వ్యా అదంతములగు నమహత్తులకును, అదంతములగు నపుంసకములకును 'ము' ప్రత్యయమగును 11చే - ఇది యేకత్వవివక్షయందగును అత్ = హ్రస్వమయిన అకారము - వర్ణకము = ప్రత్యయము-అదంతమగు నమహత్తునకు - వృక్ష - ప్రాతిపదికము ఇది, అదంతము, నమహద్వాచకము కనుక, నీ 39 చే వృక్షము - అగును అదంతమగు నపుంసకమునకు - ఋష-ప్రాతిపదికము ఇది, అదంతము, నపుంసకలింగము కాన నీ 39చే ఋషము - అగును ఇట్లే, దైవ, కళత్ర, అపత్య శబ్దము లదంత నపుంసకములు గావున వీని కి 38 చే - మువర్ణకము కలిగి దైవము, కళత్రము, అపత్యము, నను రూపము లేర్పడును అతిదేశము = ఒక వస్తువుయొక్క ధర్మమును వేఱొక వస్తువుపై నారోపించుట అన్యధర్మస్యాన్యత్ర ఆరోపణమ్ - శబ్దక మిత్రాదులక్షు

18 చేఁ బుంలింగత్వము విభాషగ నతిదేశింపఁబడినది పుంలింగత్వ మగు పక్షమున 21 చే - మిత్రు 22 చే - మిత్రు + డుఙ్ 19 చే - మిత్రుఁడు మిత్రుండు పుంలింగత్వము కానిచో, మిత్రాదులదంత నపుంసకములు గనుక నీ 39 చే - మువర్ణకము కలిగి, మిత్రము - అగును ఇట్లే, శరణ=శరణుఁడు, శరణము - ఇత్యాది (18)

విశే - (i) వృక్షశబ్దము పుంలింగమే కాని మహద్వాచకము కాదు కనుక ఉత్వడుఙ్లు రావు (ii) ఋక్షశబ్దమదంత నపుంసకమున కుదాహృతము, ఋక్షము = నక్షత్రము కొందఱు, ఋక్షము = ఎలుఁగుబంటి, నక్షత్రము - అని సెలవిచ్చుట సరికాదు ఎలుఁగుబంటి - అను నర్థమున ఋక్షశబ్దము వృక్ష శబ్దము చేతనే గతార్థమగును (iii) ఏ వాచకమయిన సరే అదంత నపుంసక మయినచో, మువర్ణక మగును ఋక్షము - అమహద్వాచకమయిన నపుంసకము. దైవము = దేవుఁడు ఇది మహద్వాచకమగు నపుంసకము కళత్రము=భార్య ఇది మహతీవాచకమగు నపుంసకము అపత్యము = సంతానము ఇది మహత్తు నమహత్తునగు నపుంసకము (iv) ఉ = ఉదాహరణము 18 వ సూత్రమున కివి యుదాహరణములని సూచన (v) అమహ న్నపుంసకము లనునది ద్వంద్వ మనుట నిర్వివాదము ఇది కర్మధారయము కాదనుటకుఁ బుంలింగ వృక్ష శబ్ద మును, మహన్నపుంసకములగు దైవమిత్రాది శబ్దములును ప్రబల నిదర్శనములు ద్వంద్వ పక్షము నిర్వివాదమగుటచే ద్వంద్వయుద్ధ ప్రదర్శనమిట నుపేక్షితము

పాఠ పరిశీలన - ఈ సూత్రమున, మిత్ర - అనునవే ప్రథమ ముద్రణ పాఠములు కొందఱు మిత్త్ర - అని యెల్లచోట్ల ద్వితకారకముగ దిద్ది ముద్రిం చుట సరికాదు 'ఏకతకార మిత్యేకే - ఇతి తట్టీకాయాం (అమరటీకాయాం) భరతః" శబ్దక

## వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు 40

వృక్షములు, వృక్షమును, ఋక్షములు, ఋక్షమును

వ్యా వానికిన్ = ప్రథమైక వచనమున మువర్ణకముతోఁ గూడుకొని యుండు అదంతములగు నమహన్నపుంసకములకు, మువర్ణ కేతరంబయిన విభక్తి = మువర్ణకము కాక తక్కిన విభక్తి, పరమయినపుడు ముగాగమ మగు నని సూత్రమునకుఁ దాత్పర్యము ముక్ + ఆగమ = ముగాగమము మువర్ణ ముద్దిష్టమునకుఁ జివర నాగమ మగునని 'ముక్' అనుచోటి కకారము తెలుపును.

వృక్షములు - వృక్ష - ప్రాతిపదికము, 12 చే - వృక్ష + లు ఇది ప్రథమైక వచనమున, వృక్షము - అని మువర్ణకముతోఁ గూడుకొని యుండు ప్రాతిపదికము ఇది, అదంతము, అమహద్వాచకము దీనికి లువర్ణము పరమయినది లువర్ణము, మువర్ణకేతర విభక్తి కావున నీ 40 చే - వృక్ష శబ్దమునకుఁ జివర మువర్ణ మాగిమ మగును వృక్ష + ము + లు = వృక్షములు వృక్షమును - వృక్ష ప్రాతిపదికము 2 చే - వృక్ష + ను ఈ 40 చే - వృక్ష + ము + ను = వృక్షమును ఇట్లే, ఋక్ష + లు = ఋక్ష+ము+లు = ఋక్షములు ఋక్ష + ను = ఋక్ష + ము + ను ఋక్షమును - అని సాధించుకొనవలెను వృక్షము, ఋక్షము - అను నేకవచనములయందలిది మువర్ణకము. వృక్షమును, ఋక్షమును - ఇత్యాదులలోనిది ముగాగమము విభక్తిపై విభక్తి చేరరాదు కనుక మువర్ణకముపై నితర విభక్తులను జేర్పరాదు కావున ముగాగమము విధింపఁబడినది

విశే - (1) వానికిన్ - అను దానిచేఁ బూర్వ సూత్రమునందలి అమహన్నపుంసకముల కదంతములకు-అనునదే యుపాత్తమగుట సహజము కొందఱు, వానికిన్ - అను దానిచేఁ బ్రథమైక వచనమున మువర్ణకము వినఁబడువానికి - అను సొంత వాక్య ముపాత్తమగుననుట కృతకము ఈ పక్షమున వుగాగమ నివారణకు దారి లేదు. కావున, మువర్ణకేతరంబయిన - అనుటచేఁ బ్రథమైక వచనమున మువర్ణకముతోఁ గూడుకొనియుండు అదంతములగు నమహన్నపుంసకములకే ముగాగమమని వ్యాఖ్యానింపఁదగును లత + లు - అనుచో, లత - అని ప్రథమైక వచనమున మువర్ణకము లేకుండనే యుండును గావున ముగాగమము లేదు లత + లు = లతలు, రమ + లు = రమలు-ఇత్యాది ఇట్లే 49 సూత్రమున వుగాగమ విషయమునందును గ్రహింపవలెను (11) వృక్షము - పుంలింగమగు నమహత్తు - ఋక్షము నపుంసకమగు నమహత్తు - ఋక్షము = నక్షత్రము ఎలుఁగుబంటి యను నర్థమున నమహత్తగుటచే ఋక్షము, ఋక్షములనను రూపము లేర్పడును ఇది వృక్ష శబ్దము వంటి దగును

## మువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమంబునకునగు. 41

మువర్ణకంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము

వ్యా ము ప్రత్యయమునకు విధించు, లోపము, నాదేశము మొదలగు కార్యములు, ముగాగమమునకును, నగును ఉదా॥ (1) మువర్ణకమునకు విధించు,

మాముడి పూర్ణబిందు పూర్వక బువర్ణము ముగాగమమునకగును వృక్షములు= వృక్షమ్ములు, వృక్షంబులు (42) (11) మువర్ణకమునకు విధించు లోపము ముగాగమమున కగును చరిత్ర + లు = చరిత్రములు, చరిత్రలు (58) (111) మువర్ణకమునకు విధించు పుంపులు ముగాగమమునకు నగును ఉదా॥ సరసపు వచనములు చూ సమాస - 25

## మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వక బువర్ణంబేని విభాషనగు. 42

వృక్షమ్ము, వృక్షంబు, ఋక్షమ్ము, ఋక్షంబు పూర్వ సూత్ర ముచేత ముగాగమమున కీకార్యంబగు వృక్షమ్ములు - వృక్షంబులు, ఋక్షమ్ములు, ఋక్షంబులు

వ్యా ము ప్రత్యయమునకు, మాముడి కాని, పూర్ణబిందు పూర్వక బువ ర్ణము గాని ("ంబు") విభాష నగును వృక్షమ్ము, వృక్షంబు - వృక్ష - ప్రాతి పదికము 39 చే - వృక్షము ఈ 42 చే - మాముడివచ్చిన, వృక్షమ్ము - మాముడి = మకారము క్రింద వ్రాయు మకార చిహ్నము పూర్ణబిందు పూర్వక బువర్ణ మాదేశమయినచో - వృక్షంబు పక్షమున, వృక్షము-అనియు నుండును ఇట్లే ఋక్షమ్ము, ఋక్షంబు - అనువానిని సాధించుకొనవలెను, వృక్షమ్ములు - వృక్ష - ప్రాతిపదికము 12 చే వృక్ష + లు, 40 చే - వృక్ష + ము + లు 41చే - మువర్ణకమునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమున్నకగును కావున, ముగాగమునకు మాముడియుఁ బూర్ణబిందుపూర్వక బువర్ణమును విభాష నగును వృక్షములు = వృక్షమ్ములు, వృక్షంబులు ఇట్లే ఋక్షమ్ములు, ఋక్షంబులు - సాధించుకొనవలెను విభాష కావున వృక్షములు, ఋక్షములు = అను నవియు నుండును

విశే - (1) 39 చే అదంతములకే మువర్ణకమగును గాన, ఏతాము (ప్రకీర్ణక 15) మున్నగు చోట్ల మువర్ణకమున కీ వ్యాకరణ కార్యములు కావు, (11) ఇటమాముడి యాగమమగును, పూర్ణబిందు పూర్వక బువర్ణ మాదేశమగును లేఖన చిహ్నము నాగమము చేయుట యిందలి విశేషము, క్రియా 61 సూత్రమున నిట్లే మాముడి యాగమముగ విధింపఁబడినది ప్రకీర్ణక 7 సూత్రమున లేఖన చిహ్నమునకు లోపము విధించుట గమనింపఁదగును వర్ణములకు వాని లేఖన చిహ్నములకు నభేదోపచారము చెల్లులు తలకట్టులాచాపులు-(అప్పక 3.46)

**లులనలు పరంబులగునపు డొకానొకచో ముగాగమంబు నకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగును. 43**

వజ్రాలు, వజ్రాలను, వజ్రాన
పగడాలు, పగడాలను, పగడాన

ఒకానొకచో ననుటచే నీ కార్యంబునకుఁ బ్రయోగ వైరళ్యంబు సూచింపంబడియె

వ్యా లు - ల - న అనునవి పరమగునపుడు ముగాగమమున కరుదుగా లోపమును, దాని ముందఱి యచ్చునకు దీర్ఘమును విభాషనగును వజ్రాలు - వజ్ర - ప్రాతిపదికము 2 చే వజ్ర + లు 40 చే - వజ్ర + ము + లు "లు" "పరమగుటచే నీ 43 చే - ముగాగమమునకు లోపము దాని ముందఱి యచ్చునకు దీర్ఘము గలిగిన, వజ్ర + ము + లు = వజ్రాలు - అగును వజ్రాలను -- వజ్ర – ప్రాతిపదికము 2 చే - వజ్ర + ను 40 చే - వజ్ర + ము + ను 31 చే - వజ్ర + ము + లను, 'ల' పరమగుటచే నీ 43 చే - ముగాగమమునకు లోపము పూర్వ స్వరమునకు దీర్ఘము కలిగిన - వజ్రాలను - అగును వజ్రాన -- వజ్ర ప్రాతిపదికము 7 చే - వజ్ర + న 40 చే-వజ్ర + ము + న 'న' - పరమగుటచే నీ 43 చే - ముగాగమ లోపము పూర్వ స్వర దీర్ఘము కలిగిన - వజ్రాన - అగును ఇట్లే, పగడములు = పగడాలు, పగడములను = పగడాలను, పగడమున = పగడాన ఇవి యచ్చ తెనుఁగున కుదాహరింపఁబడినవి ఒకానొకచో-అనుటచే, నీ కార్యమునకుఁ తత్సమములలోఁ బ్రయోగము లరుదని సూచింపఁబడెను

విశే - (1) సూరి ప్రయోగ వైరళ్యమనరాదనియుఁ బ్రయోగఁ బాహుళ్యమే కలదనియుఁ గొందఱందురు సూరి స్థూలదృష్టితోఁ బ్రతిపాదించె ననియు, నాక్షేపకులకును స్థూలదృష్టియే తప్ప మఱియొక యాధారములేదనియుఁ గొందఱు సెలవిత్తురు ఈయాక్షేప సమాధానములు రెండును సరికావు ఇది తత్సమ పరిచ్ఛేద విషయము గనుక నీకార్యము తత్సమములయెడ విరళమని సూరి యభిప్రాయము భారతమునఁ దత్సమములయెడ, ప్రాణాన (ద్రోణ 1.262 3.345 కర్ణ 1.194) నిటలాన (ఉద్యోగ 1.27) విధాన (విరాట 3.141) అను మూఁడు మాత్రమే కనఁబడును అచ్చికములు పదమూఁడు కనఁబడును అలుపాల – ఉద్యో 3.117 కయ్యానకున్ – ఉద్యో 4.266, కయ్యాన – ఉద్యో 4 184 కళ్యాలతో డ – కర్ణ 1.140, కళ్యాల - విరాట

1.95, చుట్టాలకున్ - విరాట 5.366, ఉద్యో 1.12, చుట్టాల - అను 4.382, డెందాన - ఉద్యో 3.19, భీష్మ 1.142 బవరాన - భీష్మ 3.177 బోనాలు- ఉద్యో 3.229 సారసానకు - భీష్మ 1.142 సీసాన - విరాట 2.15 సోవనాలు - శాంతి 5.587 "ప్రాయశో వైకృత పదే లోపో దీర్ఘశ్చ మోరతః - అని యథర్వణాచార్యులు వికృతిలో నీకార్యము తఱచుగఁ గలదనుటచేఁ దత్సమములలో నీకార్యము విరళమేయనవలెనని యహోబలపండితుఁడు, కవిసంజీవనిని విమర్శించుచు వ్రాసెను బాలసరస్వతి శుభాలు-గ్రామ్యమనెను కావున నూరిది పట్టి స్థూలదృష్టికాదు అథర్వణకారికను, భారతప్రయోగములను, నహోబలుని విమర్శను బరిశీలించి సూరి ప్రయోగ వైరళ్యమును వక్కాణించెనని గ్రహింపవలెను (లక్ష్య సంఖ్యకు - చూ అచ్చిక 2) (11) వజ్రాలు, వగడాలు-అను లక్ష్యములనుబట్టి పూర్వ స్వరము హ్రస్వమగు అకారమే కావలెనని తెలియుచుండుటచే ముత్తెములు - ఇత్యాదులలో నీకార్యము వర్తింపదు (111) ముగాగమలోపము, తత్పూర్వస్వరదీర్ఘము రెండును జంటగా విధింపఁబడినవి జంటగా విధింపఁబడిన కార్యములు కలిసియే ప్రవర్తించును, మానినచోఁ గలిసియే మానును ఇట్టివాని నేకయోగ (సూత్ర) నిర్దిష్టములందురు (ఏకయోగ నిర్దిష్టానాం సహవా ప్రవృత్తిః సహవా నివృత్తిః) కావున ముగాగమలోపము తత్పూర్వస్వర దీర్ఘము కలిగినచో, వజ్రాలు - మొదలగునవి యగును కానిచో - వజ్రములు మున్నగునవి యుండును

పారపరిశీలన — సూత్రమున - ఒకానొకచో, అనియు, వివరణమున - ఒకానొకచోట, అనియుఁ బ్రథమ ముద్రణము ఒకానొకచో - అనియే వివరణమునను నుండఁదగును

## ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు. 44

ఇకారాంతములకు, గ్లౌరైశబ్దములకు, మఱి యుగాగమాంతంబులకుం బ్రథమైకవచన లోపంబగు హరి, గిరి, శ్రీ, ధీ

వ్యా ఇకారాంతముల యొక్కయు, గ్లౌరైశబ్దముల యొక్కయు ఉగంతములయొక్కయుఁ బ్రథమైకవచనమునకు లోపమగును రై + ఉగ ... ఉగంత రాయుగంతము ఉగంతము = ఉగాగమాంతము 68చే నగు ఉగాగమముతోఁ గూడుకొనినవి ఉగంతములు ఇకారాంతములకు ఉదా॥ హరి - హరి- ప్రాతిపదికము 22చే - హరి + డుజ్ ఈ 44 చే - డుజ్జులోపించి, హరి - అను ప్రథమైక వచనము సిద్ధించును గిరి -గిరి ప్రాతిపదికము దీనిపై, నేవిభక్తియు

బాలవ్యాకరణమున విధింపఁబడలేదు కాన ననుక్తన్యాయమున సంస్కృత సుప్రత్యయమును నిల్పవలెను గిరి+సు ఈ 44చే - 'సు' ప్రత్యయము లోపించి గిరి - అను ప్రథమైక వచనమేర్పడును తెనుఁగు వ్యాకరణమునఁ జెప్పఁబడని విషయము సంస్కృత ప్రాకృత వ్యాకరణానుసారముగ నగును ఇదే యనుక్తన్యాయము 'అనుక్తమన్య శబ్దాను శాసనవత్' (వాల్మీకి) అనుక్త మన్యతో గ్రాహ్యమ్-బాలస శ్రీ - శ్రీ - ప్రాతిపదికము అనుక్తన్యాయమున ప్రత్యయముచేరి, శ్రీ+సు అగును ఈ 44చే - సులోపించి, శ్రీ-అను ప్రథమైక వచనము సిద్ధించును ఇట్లే, ధీ+సు = ధీ గ్లౌ - గ్లౌ - ప్రాతిపదికము 22చే - గ్లౌ+డుజ్ ఈ 44 చే - డుజ్జులోపింప గ్లౌ - అను ప్రథమైక వచనము సిద్ధించును గ్లౌ=చంద్రుడు రై రై - ప్రాతిపదికము అనుక్తన్యాయమున, సు-చేరును రై+సు ఈ 44చే - సులోపించి, రై - అను ప్రథమైకవచన మేర్పడును రై = ధనము ఉగంతములకు = రుక్కు, రుక్ - ప్రాతి పదికము 68చే - రుక్క్+ఉ = రుక్కు - అగును ఇది ఉగంతము 48చే- రుక్కు+వు=అగును ఈ 44చే - వువర్ణకము లోపించి, రుక్కు - అను ప్రథమైక వచనము సిద్ధించును (చూ 68)

విశే - (I) ప్రత్యయముచేరనిదే పదత్వము సిద్ధింపదు పదమయినఁగాని ప్రయోగ యోగ్యత లేదు కావునఁ బ్రత్యయములు చేర్చి యీ 44 చే - లోపము చెప్పఁబడెను- ప్రత్యయములోపించినను బదత్వమునకు భంగముకలుగదు "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్" (పాణి) (II) శ్రీ ధీ - అనునవి స్త్రీ లింగములు. కావున వీని ప్రథమైకవచనములు 57చే - లోపింపవచ్చును కాని, ఇకారాంతము లన్నియు నీ 44 సూత్రమునకే లక్ష్యములని తెలియుటకు శ్రీ, ధీ, అనునవి యిటఁ జూపఁబడినవి (III) గ్లౌ రై శబ్దములకు మఱి యుగాగ మాంతంబులకు - అని మఱి శబ్దము చేర్పఁబడెను లేనిచో నుగాగమాంతంబు లకు - అనవలసివచ్చును అప్పుడిది నుగాగమమేమోయను భ్రాంతి కవకాశ మేర్పడును (IV) విభక్తి లోప స్థలములలో లక్షణార్థములు కల్పింపరాదు "సంభవేవాభిధాన్య లక్షణంతు న కల్ప్యతే" (వాక్య వాక్య 168) హరి+డుజ్= హరి హరి - పదమే ప్రాతిపదికార్థములను విభక్త్యర్థములను దెలుపును

## ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు. 45

హరులు, గిరులు, కవులు, రవులు, యామినులు, కామినులు

తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబులేదు శ్రీలు, స్త్రీలు, లకోరీలు

వ్యా హ్రస్వమయిన ఇకారమునకు, బహువచనము పరమగునపు డుత్వ

మగును హరులు - హరి - ప్రాతిపదికము 12చే-హరి + లు ఈ 45చే-హరులు (హర్ + ఇ + లు = హర్ + ఉ + లు = హరులు ) ఇట్లే గిరి + లు = గిరులు, కవి + లు = కవులు, రవి + లు = రవులు - సాధించుకొననగును కృతహ్రస్వము లకు నీవిధివర్తించును యామినులు - యామినీ - ప్రాతిపదికము 54చే దీర్ఘము హ్రస్వమగును యామిని ఇదికృత హ్రస్వము (= చేయఁబడిన హ్రస్వము గలది) 12చే - యామిని + లు ఈ 45చే - యామినులు ఇట్లే, భామినీ = భామిని + లు భామినులు-అనియగును తపరకరణము = తకారము పరముగాఁ గలిగిన (తఃపరోయస్మాత్) లేదా, తకారముకంటెఁ బరమయిన, యచ్చు, తనతో సమానకాలముగల యచ్చునే గ్రహించుట తపరకరణ మనఁబడును ఇ + త్ = ఇత్ ఇట, తకారము పరముగాఁ గలిగిన హ్రస్వేకారము తనతో సమానకాలముగల హ్రస్వేకారమునే గ్రహించును (తపరస్తత్కాలస్య-పాణి) ఇత్తు = హ్రస్వమయిన ఇకారము తపరకరణము చేయుటచే – దీర్ఘమయిన, ఇకారమున కీవిధి కలుగదు శ్రీలు శ్రీ - ప్రాతిపదికము 12చే - శ్రీ + లు = శ్రీలు, ఇట్లే, స్త్రీ + లు = స్త్రీలు లకోరీ + లు = లకోరీలు ఈ సూత్ర మాచ్ఛికములయెడలను వర్తించును పందిరి + లు = పందిరులు (47) సిరి + లు = సిరులు (54) కావుననే లకోరీ + లు – అనుచోటను దీర్ఘమగు ఇకారమునకు 'ఉ' కారము కాదని వివరింపఁబడెను

విశే - అదే జ్గుణః (పాణి) అత్ + ఏఙ్ ఇట తకారముకంటెఁ బరమయిన ఏఙ్ (ఏ - ఓలు) దీర్ఘమయిన ఏఓలనే గ్రహించును ప్లుతములను గ్రహింపదు (ల కౌ మా)

## వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు. 46

ఇచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింప వలయు కలికి కలుకులు, ములికి ములుకులు, చెలిమి చేలు ములు, బలిమి బలుములు ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి, నిసి ఇత్యాదులం దుత్వంబులేదు జిగులు, నిసులు

వ్యా అచ్చతెనుఁగున, ఇకారాంత శబ్దములయొక్క యుపోత్తమమయిన ఇత్వమునకు, బహువచనము పరమగునపు డుత్వమగును వికృతి = సంస్కృత సమేతరము అనఁగా నచ్చతెనుఁగని యీ బాలవ్యాకరణమున గ్రహింపవలెను

ఉపోత్తమము = "త్ర్యాదీనా మంత్య ముత్తమం తస్య సమీప ముపోత్తమమ్" (సి కౌ ) ఉప + ఉత్తమ = ఉపోత్తమము ఉప శబ్దమునకు సమీపమని యర్థము. ఉత్తమమనఁగా మూఁడక్షరములు గల శబ్దములోఁ దుదియచ్చు దాని సమీపమందలి యచ్చుపోత్తమము ఉదా॥ కలికి దీనిలోఁ దుదియచ్చు 'కి' లోని ఇకారము, ఇది యుత్తమము దీని సమీపమందలియచ్చు 'లి' లోని ఇకారము కావున 'లి' లోని ఇకారము ముపోత్తమము కి-ఉత్తమము లి-ఉపోత్తమము నని వ్యవహరించుట యౌపచారికము (ప్రకీర్ణక, 2) మూఁడక్షరములకుఁ దక్కువ యక్షరములు గల శబ్దములో, నుపోత్తమ వ్యవహారము సరిపడదు జిగి, నిసి- అనునవి రెండక్షరముల శబ్దములు కాన వీనిలో నుపోత్తమ వ్యవహారములేదు మూడక్షరములన్నది కనిష్ఠ సంఖ్యగాన మూఁటికంటె నెక్కువ యక్షరములుగల శబ్దములో నుపోత్తమ వ్యవహారముండును కావుననే 47 సూత్రమున, పిడికిలి శబ్ద ముదాహరింపఁబడినది కాఁగా మూఁడింటికిఁ దక్కువ కాని యక్షరములు గల శబ్దములోఁ దుదియచ్చుత్తమము దాని సమీపమందలి యచ్చుపోత్తమము కలుకులు - 12చే - కలికి + లు ఈ 46 చే - కలుకి + లు 45 చే - కలుకులు ఇట్లే ములికి + లు = ములుకులు చెలిమి + లు = చెలుములు బలిమి + లు = బలుములు - అను రూపము లను సాధించుకొనవలెను జిగులు - జిగి ప్రాతిపదికము 12చే - జిగి+లు ఇది రెండక్షరములుగల శబ్దము గాన, నిందలి ఇకార ముపోత్తమముకాదు కావున ఈ 46 వర్తింపదు 45 చే - జిగి + లు = జిగులు-అగును ఇట్లే నిసి + లు = నిసులు

విశే - ఇచ్చటన్ = ఈ బాలవ్యాకరణమునందు - అని యర్థము వికృతిశబ్దమున కచ్చతెనుఁగనియు (వికృతౌక్వచిచ్చటోప్యోమోః - ఆం చిం) నాంధ్రభాషయనియు (తయోర్భవేద్వికృతిః వైకృతకావ్యానిచ - ఆం చిం) వ్యవహారములుగలవు బాలవ్యాకరణమున, వికృతి = అచ్చతెనుఁగనియే యర్థము (సమాస 3)

పదసార్థక్యము - (1) వికృతియందు - అనుటచే సంస్కృతసమము లం దీవిధి చెల్లదు యామిని + లు = యామినులు, (11) ఇకారాంతముల- అనుటచే, ఇకారాంతములు కాని వానియెడ నీసూత్రము వర్తింపదు తలిరు+ లు = తలిరులు.

## రలడోపధ నవార్థాదుల యుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు. 47

పందిరి పందిరులు, పిడికిలి పిడికిళులు, రాపిడి రాపిడులు తొమ్మిది తొమ్మిదులు

వ్యా రలడ లుపధలుగాఁ గల, ఇకారాంతశబ్దముల యొక్కయుఁ దొమ్మిది మొదలగు శబ్దముల యొక్కయు, ఉపోత్తమమయిన, ఇత్వమునకు బహువచనము పరమగునపు డుత్వము కలగదు ఉపధ = తుదివర్ణమునకు ముందువర్ణము సంజ్ఞా (10) నవార్థము = తొమ్మిది శబ్దము ఉపోత్తమము = చూ 45 పందిరులు - పందిరి ఇట, తుదివర్ణము "ఇ" కారము ముందువర్ణము రేఫము (ర్) కాన రేఫ ముపధ - 12 చే - పందిరి + లు 46 చే - ఉపోత్తమేత్వమున కుత్వము ప్రాప్తించుచుండఁగా, నీ 47 నిషేధించుచున్నది కాన ఇత్వమున కుత్వము రాదు పందిరి + లు 45 చే - పందిరులు - అనియే యగును పిడికిళులు - పిడికిలి ప్రాతిపదికము 12 చే - పిడికిలి + లు 46 చే - ఉపోత్తమేత్వమున కుత్వము ప్రాప్తించుచున్నది కాని యిట లకార ముపధగా నుండుటచే నీ 47 చే - ఉపోత్తమేత్వమున కుత్వము రాదు 45 చే- పిడికిలు + లు = పిడికిలులు అగును అచ్ఛిక 13 చే - పిడికిళ్+ఉ+లు= పిడికిళులు - అని యేర్పడును రాపిడులు - రాపిడి - ప్రాతిపదికము 12 చే - రాపిడి + లు 46 చే - ఉపోత్తమమగు ఇత్వమున కుత్వము ప్రాప్తించుచున్నది కాని యిట దకార ముపధగా నుండుటచే నీ 47 సూత్రముత్వమును నిషేధించును కాన, రాపిడి + లు 45 చే - రాపిడులు - అగును తొమ్మిదులు - తొమ్మిది - ప్రాతిపదికము 12 చే - తొమ్మిది + లు 46 చే - ఉపోత్తమేత్వమున కుత్వము ప్రాప్తించుచుండఁగా నీ 47 దానిని నిషేధించుచున్నది కనుక, తొమ్మిది + లు - 45 చే - తొమ్మిదులు - అగును

## ఉకారాంత గోశబ్దంబుల కంతటు వువర్ణకంబగు. 48

తరువు, దేనువు, మధువు, గోవు

అంతట ననుట స్త్రీలింగ ప్రధమైక వచన లోపబాధ నార్థము

వ్యా ఉకారాంత శబ్దములకును, గో శబ్దమునకును 'అంతట' వు ప్రత్యయమగును (11 చే - ఇది యేకత్వ వివక్షయందగును) తరువు - తరు - ప్రాతిపదికము ఇది ఉకారాంతము, కాన నీ 48 చే - తరువు - అగును ఇట్లే మధు= మధువు దేనువు దేను - ప్రాతిపదికము ఈ 48 చే - దేనువు - అగును ఇది

స్త్రీలింగము గనుక 57 చేఁ బ్రథమైకవచన లోపము ప్రాప్తించుచున్నది కావున, అంతట వువర్ణకంబగు నని సూత్రమునఁ జెప్పఁబడెను అంతట ననుట స్త్రీలింగ ప్రథమైకవచన లోప బాధనార్థమని వివరింపఁబడెను కాన 57చేఁ బ్రాప్తించు ప్రథమైకవచన లోపము 'అంతట' అనుటచే నిట వర్తింపదు ధేనువు - అను రూపమే సిద్ధించును ఇట్లే, గో - అను స్త్రీలింగశబ్దము నుండి 'గోవు' అను రూపమును సాధించుకొన నగును కాఁగా, 57 చేఁ బ్రాప్తించు ప్రథమైకవచన లోపమును నిషేధించుటకు సూత్రమున 'అంతట' అనుదళము వాడఁబడినది

విశే - (1) గోశబ్దంబునకు — అనుటచే స్త్రీలింగమగునపుడు, పుంలింగమగునపుడు గోశబ్దమునకు 'వు' వర్ణకమగును గోవు స్త్రీ = ఆవు మొ॥ పుం కిరణము మొ॥ (11) అంతట - అనుదళము స్త్రీ సమములయెడ వర్తింపదు చిగురు + వు = చిగురు

పదసార్థక్యము - ఉకారాంత - అనుటచే, దీర్ఘమయిన ఉకారమంతము నందుఁ గలవానికిని, వువర్ణక మగును ఉదా॥ భ్రూ + వు = భ్రూవు (55సూ ) అణు దిత్సవర్ణస్యచా ప్రత్యయః (పాణి)

**వువర్ణకేతర విభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా, వుగాగమంబగు. 49**

తరువులు, తరులు, ధేనువులు, ధేనులు, గోవులు

వ్యా. వు ప్రత్యయము కాక తక్కిన విభక్తి పరమయినచోఁ బ్రథమైక వచనమున, వు వర్ణకముతోఁ గూడుకొనియుండు, ఉకారాంతములకు, బహుళముగాను గోశబ్దమునకు నిత్యముగా వుగాగమ మగును - అని తాత్పర్యము తరువుల -రు - ప్రాతిపదికము 12 చే - తరు + లు ఈ 49 చే తరు + వు + లు = తరువులు వుగాగమము కానిచో, తరు+ లు = తరులు ఇట్లే, ధేను + లు = ధేనువులు, ధేనులు సాధించుకొనవలెను గోవులు - గో — ప్రాతిపదికము 12చే - గో + లు ఈ 49 చే - గో + వు + లు = గోవులు తరువు, ధేనువు, గోవు - అను నేకవచనములయందలిది, వు ప్రత్యయము (48) తరువులు, ధేనువులు, గోవులు — అను వానిలోనిది వుగాగమము విభక్తిపై విభక్తి చేరరాదు గనుక వుగాగమములు విధింపఁబడెను

విశే - వు వర్ణకేతర విభక్తి - అనుటచేఁ బ్రథమైక వచనమున, వువర్ణకముతోఁ గూడుకొని యుండు ఉకారాంతములకు వుగాగమ మగునని గ్రహింపవలెను చిగురు + లు, అనుచో, చిగురువు - అను రూపము ప్రథమైక వచన

మున నుండదు గావున వుగాగమమము కలుగదు చిగురు + లు = చిగురులు. అనియే యగును

## ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకము బహుళముగానగు. 50

విష్ణువు, విష్ణుఁడు, శంభువు, శంభుఁడు, వసువు, వసుఁడు.

వ్యా ఉకారాంతమగు మహద్వాచకమునకు, వు - ప్రత్యయము బహుళముగా నగును ఇది 11 చే - ఏకత్వ వివక్షయందగును. విష్ణువు, విష్ణుఁడు - విష్ణు – ప్రాతిపదికము ఈ 50 చే - విష్ణు + వు = విష్ణువు వువర్ణకము కానిచో విష్ణు - 22 చే విష్ణు + డుజ్ 19 చే విష్ణుఁడు, విష్ణుండు ఇట్లే తక్కినవి

విశే - (1) వువర్ణకము వుగాగమమున కుపలక్షణము (11) బహుళ మనుటచే మను - లోనగువానికి 'వు' నిత్యము మనువు మొ॥

## కద్రువ నాగమాత. 51

కద్రువ, కద్రువలు, కద్రువను, కద్రువలను

వ్యా నాగమాత యను యర్థము గల కద్రూ శబ్దమునకు. 'కద్రువ' అనునది ప్రాతిపదికమగును ఇది నిపాత సూత్రము నిపాతము = కొలఁది శబ్దములలో, సామాన్య ప్రక్రియకు భిన్నముగా సూత్రకారుఁడు నిర్దేశించిన రూపము నిపాతమనఁబడును "అన్యథా ప్రాప్తస్యాన్యథోచ్చారణం నిపాతనమ్" కద్రూ శబ్దమునకు, 54 చే - కద్రువు - అని సామాన్య ప్రక్రియా రూపము ప్రాప్తించు చుండఁగా, దానికి భిన్నమగు రీతిని కద్రువ - అను రూపమును సూత్రకారుఁ డుచ్చరించుటచె నిది నిపాతమయినది ఈ నిర్దేశింపఁబడిన రూపము ప్రాతిపదికమని యిట గ్రహింపఁదగును కద్రువ - ప్రాతిపదికము 39 చే - కద్రువ + ము కద్రూ శబ్దము స్త్రీ లింగమగుటచే, 57 చే - మువర్ణకము లోపించి, కద్రువ - అని యేర్పడును కద్రువలు - కద్రువ - ప్రాతిపదికము 12 చే - కద్రువ + లు = కద్రువలు కద్రువను - కద్రువ - ప్రాతిపదికము 2 చే - కద్రువ + ను = కద్రువను కద్రువలను -కద్రువ - ప్రాతిపదికము 2 చే - కద్రువ + ను 31 చే - కద్రువ + లను = కద్రువలను

విశే - (1) ప్రథమాంత నిపాతములు = ప్రథమాంత రూపనిర్దేశముతో నితర విభక్త్యంతములు సామాన్య ప్రక్రియా సాధ్యములగునవి రాజు, వేధ,

పురోధ (11) ప్రాతిపదిక నిపాతములు = ప్రాతిపదిక స్వరూపము న న్యథా నిర్దేశింపవలసినవి (కద్రువ లోనగునవి

వద సార్థక్యము నాగమాత - అనుటచే బింగళ వర్ణమను నర్థము గల కద్రు - శబ్దము 48 చే - కద్రువు - అనియే యగును

## ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు. 52

భ్రాత, జామాత, కర్త, భర్త, హర్త, గంత, హంత

వ్యా: ఋకార మంతమందుఁగల శబ్దము యొక్క తుది ఋకారమునకు హ్రస్వమయిన అకారము స్త్రీలింగ తుల్యత్వము నగును భ్రాత - భ్రాతృ=త్+ ఋ ఇందలి ఋకారమున కత్వమయి - భ్రాత్ + అ = భ్రాత - అగును స్త్రీలింగ తుల్యత్వముచే దీనికి 21, 22 సూత్రములచే - ఉత్వడుజ్ఞులు కలుగవు అనుక్త న్యాయమున దీనిపై 'సు' ప్రత్యయము చేరును భ్రాత + సు స్త్రీ తుల్యము గనుక 57 చే - ప్రథమైక = వచనము లోపించును భ్రాత - అను రూప మేర్పడును ఇట్లే జామాతృ = జామాత, కర్తృ = కర్త, భర్తృ = భర్త, హర్తృ = హర్త, గంతృ = గంత, హంతృ = హంత - అను వాని ప్రక్రియ నరయవలెను

విశే - (1) ఋకారాంత శబ్దమునకు అత్వము విధింపఁబడినది అత్వ మేక వర్ణము గనుక ఋకారాంత శబ్దము యొక్క తుది ఋకారమునకేయగును చూ 53 (11) మాతృ - మున్నగు స్త్రీ లింగములకు స్త్రీ వద్భావమగును పర్జన్యవ ల్లక్షణ ప్రవృత్తిః (పరిభా)

## విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తులో కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు. 53

విధాత, విధాతృఁడు, ధాత, ధాతృఁడు, దాత, దాతృఁడు, సవిత, సవితృఁడు, నేత, నేతృఁడు

వ్యా మహద్వాచకములగు, విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ శబ్దముల తుది ఋకారమునకు అత్వము, స్త్రీలింగ తుల్యత్వము విభాషనగును విధాత, విధాతృఁడు - విధాతృ - ప్రాతిపదికము 52 చే - దీని ఋకారమున కత్వ స్త్రీవద్భావములు నిత్యముగఁ బ్రాప్తించుచుండఁగా నిట విభాష నగునని చెప్పఁబడెను విధాతృ-త్+ఋ ఈ 53 చే - విధాత్+అ = విధాత - అగును స్త్రీలింగ తుల్యత కలుగుటచే 21, 22 లచే - ఉత్వడుజ్ఞులు రావు అనుక్త న్యాయమున సుప్రత్యయము చేరును విధాత+సు - 57 చే - సు లోపించి

విధాత - అను ప్రథమైక వచనము సిద్ధించును అత్వ స్త్రీవద్భావములు కలుగని పక్షమున, విధాతృ 22 చే - విధాతృ+డుఙ్ 19 చే విధాతృఁడు, విధాతృండు అగును ఇట్లే ధాతృ = ధాత, ధాతృఁడు, దాతృ=దాత, దాతృఁడు, సవితృ= సవిత, సవితృఁడు, నేతృ = నేత, నేతృఁడు - అను వానిని సాధించుకొన వలెను

విశే - (i) విధాతృ మున్నగు శబ్దములకు - అత్వము విధింపఁబడెను అనేక వర్ణములు గల స్థానికేక వర్ణము నాదేశముగ విధించినచో నది స్థానియందలి తుది వర్ణమునకే యాదేశమగును (అలోంత్యస్య-పాణి) కావున విధాతృ- మున్నగువాని తుది ఋకారమునకే అత్వమాదేశమగును (ii) అత్వ స్త్రీవద్భావములు రెండు నేకయోగ నిర్దిష్టములు అనఁగా వచ్చినచోఁ గలిసియే వచ్చును మానినచోఁ గలిసియే మానును (ఏకయోగ నిర్దిష్టానాం సహవా ప్రవృత్తిః సహవా నివృత్తిః - పరిభా) (iii) ఇందలి విభాష ప్రాప్త విభాష

పద సార్థక్యము - మహత్తులకు - అనుటచే నమహత్త్వమున, అత్వస్త్రీవద్భావములు నిత్యముగానే యగును ఉదా॥ ప్రాక్తనకర్మమే సుఖదుఃఖములకు విధాత ఇట విధాత - అమహత్తు గనుక, అత్వ స్త్రీవద్భావములు నిత్యముగనే యగును

## నామంబుల తుది దీర్ఘంబునకు హ్రస్వంబగు. 54

రమా రమ, వనితా వనిత, విద్యా విద్య, లక్ష్మీ లక్ష్మి, సేనానీ సేనాని

ఇట్లు కృత హ్రస్వములకు హ్రస్వాంతములకుఁ బోలెఁ గార్యంబగు లక్ష్ములు, సేనానులు, సిరులు

వ్యా ప్రాతిపదికముల యొక్క తుది దీర్ఘమునకు హ్రస్వమగును నామము = ప్రాతిపదికము చూ 21 వ్యాఖ్య రమ - రమా - ప్రాతిపదికము ఈ 54 చే - హ్రస్వము కలిగి రమ - అగును 39 చే - రమ+ము 57 చే - ము వర్ణకము లోపించి, రమ - అను ప్రథమైకవచన మేర్పడును ఇట్లే వనితా = వనిత, విద్యా = విద్య - అగును లక్ష్మి - లక్ష్మీ - ప్రాతిపదికము ఈ 54 చే - లక్ష్మి అనుక్త న్యాయమున దీనిపై సు ప్రత్యయము చేరును లక్ష్మి+సు 44 చే - సు లోపించి, లక్ష్మి అను ప్రథమైక వచన మేర్పడును సేనాని - సేనానీ - ప్రాతిపదికము ఈ 54 చే - సేనాని - అగును ఇది పుంలింగము, మహద్వాచకము కనుక, 22 చే - సేనాని + డుఙ్, 41 చే - డుఙ్ఞు లోపించి, సేనాని అను ప్రథమైక వచనము సిద్ధించును.

కృతహ్రస్వము = చేయఁబడిన హ్రస్వము గలది దీర్ఘాంతమయియుండి వ్యాకరణముచే హ్రస్వముగనైనది కృత హ్రస్వమనఁబడును ఉదా॥ రమా - ఈ 54 చే, రమ - అగును ఇది కృత హ్రస్వము ఇట్లే వనిత, విద్య, లక్ష్మి, సేనాని - అనునవి కృతహ్రస్వములు హ్రస్వాంతములకువలె, నీ కృత హ్రస్వములకును వ్యాకరణ కార్యము లగును ఉదా॥ లక్ష్మి + లు 45 చే - లక్ష్ములు - అగును సేనాని + లు = సేనానులు - అగును సిరీ - ప్రాతిపదికము ఈ 54 చే - సిరి 12 చే - సిరి+లు, 45 చే - సిరులు ఇట్లు 45 చే ఇత్వమున కుత్వమీకృత హ్రస్వములకును నగును

విశే - (1) సిరులు - నుదాహరణమును బట్టి ప్రాకృత ప్రాతిపదికముల తుది దీర్ఘములకు హ్రస్వమగును దేశ్య ప్రాతిపదికములకుఁగాదు అచ్చిక 4 (11) ప్రత్యయము చేరనిదే పదత్వము సిద్ధింపదు గనుకఁ బ్రత్యయము చేరి లోపించినట్లు ప్రక్రియ చెప్పఁబడినది ప్రత్యయము లోపించినను బదత్వమునకు భంగము కలుగదు "ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్" (పాణి)

## ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు. 55

క్ష్మా, మా, భా, శ్రీ, స్త్రీ, హ్రీ, ధీ, భీ, భ్రూవు

వ్యా ఏకాచ్చుగల ప్రాతిపదికముల యొక్క తుది దీర్ఘమునకు హ్రస్వము లేదు క్ష్మా - 54 చే - హ్రస్వము ప్రాప్తించుచుండఁగా, నీ 55, హ్రస్వమును నిషేధించును ఏలయన నిది యేకాచ్చు గల ప్రాతిపదికము అనుక్త న్యాయమున సుప్రత్యయము చేరును క్ష్మా+సు, 57 చే - సు లోపించి, క్ష్మా - అను రూపమేర్పడును ఇట్లే, మా+సు, భా + సు 57 చే - సు లోపము జరిగి, మా- భా- అను ప్రథమైక వచనములు సిద్ధించును శ్రీ - శ్రీ - ప్రాతిపదికము 54 చే బ్రాప్తించు హ్రస్వ మీ 55 చే - నిషేధింపఁబడెను అనుక్తన్యాయమున శ్రీ+సు - అగును 44 చే - సు లోపించి, శ్రీ - అను ప్రథమైక వచనము సిద్ధించును ఇట్లే, స్త్రీ, హ్రీ, ధీ, భీ అను ప్రథమైక వచనము లేర్పడును భ్రూవు - భ్రూ - ప్రాతిపదికము 54 చే - ప్రాప్తించు హ్రస్వమీ 55 చే - నిషేధింపఁబడెను కావున 48 చే - భ్రూ + వు - అగును 57 చే - వు వర్ణకము లోపింపవలసి యున్నను, 48 లోని అంతట - అను దళము 57 చే - రావలసిన ప్రథమైక వచన లోపమును బాధించును కావున, భ్రూవు - అనురూప మేర్పడును భ్రూ - ఏకాక్షర శబ్దము, వు - ప్రత్యయము అచ్చు నక్షరమనియు హల్లు నక్షరాంగమనియు నందురు హ్రస్వము, దీర్ఘము నను వ్యవహార మచ్చునకే చెల్లును

## వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు. 56

వృద్ధు, వృద్ధుడు, మూర్ఖు, మూర్ఖుడు, నీచు, నీచుఁడు, గృహస్థు, గృహస్థుఁడు చార్వాకు, చార్వాకుఁడు

వ్యా వృద్ధాదుల డుజ్ ప్రత్యయమునకు లోపము విభాష నగును వృద్ధు - వృద్ధ - ప్రాతిపదికము 21 చే - వృద్ధు 22 చే - వృద్ధు + డుజ్ ఈ 56 చే - డుజ్జు లోపించినచో, వృద్ధు - అను ప్రథమైక వచన మేర్పడును డుజ్జు లోపింపని పక్షమున - వృద్ధు + డుజ్ - 19 చే - వృద్ధుఁడు, వృద్ధుండు అగును ఇట్లే, మూర్ఖ, నీచ, చార్వాక - అను వాని నుండి రూపసాధనము చేసికొనవలెను

విశే - (1) ఉత్వము, 21 చేతను, డుజ్జు 22 చేతను విడిగా విధింపఁ బడెను కాన డుజ్జు లోపించినను, ఉత్వముండును వృద్ధుడు = వృద్ధు (11) స్త్రీత్వమును విధించినచో దూత, విశ్వకర్మ మొదలగు వానికివలె ఉత్వము రాకుండఁ బోవును కనుక వృద్ధాదులకు డుజ్జు లోపించునని చెప్పఁబడెను- (111) "ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్" పాణి కనుక, వృద్ధు - మొదలగు నవి పదములే యగును

## స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు. 57

రమ, క్షమ, వనిత, ఘనత, విద్య, దేవత, మీననేత్ర

వ్యా స్త్రీలింగ శబ్దముల ప్రథమైక వచనమునకు లోపమగును రమ - మొ॥ రమా - ప్రాతిపదికము 54 చే - రమ 39 చే - రమ+ము, ఈ 57చే- ము వర్ణకము లోపించి, రమ - అను ప్రథమైక వచన మేర్పడును ఇట్లే, క్షమా, వనితా, ఘనతా, విద్యా, మీననేత్రా - అను వాని నుండి క్షమ, వనిత, ఘనత, విద్య, మీననేత్ర - అను రూపములను సాధించుకొనవలెను మీననేత్రా అనునది సమాసమున కుదాహరణము దేవత దేవతా - ప్రాతిపదికము 54 చే - దేవత ఇది పుంలింగము కాకుండుటచే ఉత్వడుజ్జులు 21, 22 సూత్రములచేఁ గలుగవు అనుక్త న్యాయమున సు ప్రత్యయముచేరి దేవత+సు అని నిల్చును ఇది స్త్రీలింగము గాన ఈ 57 చే, సు లోపించి దేవత - అను ప్రథమైక వచనము సిద్ధించును

## చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు. 58

చరిత్ర, చరిత్రము, చరిత, చరితము అలక, అభిలాష అక్షత, ఘోష, తరంగ, భ్రమ, విజృంభణ. వధ, వేగ, స్ఫురణ, హంస — ఇత్యాదులు చరిత్రాదులు బాహుళకము వలన దర్భాదులకు "ము"లోపంబు నిత్యంబు దర్భ, పనస — ఇత్యాదులు

వ్యా చరిత్రాదుల "ము" ప్రత్యయమునకు లోపము బహుళముగా నగును చరిత్ర - చరిత్ర - ప్రాతిపదికము 39 చే - చరిత్రము ఈ 58 - ముప్రత్యయము లోపించిన, చరిత్ర - అని యగును లోపింపనిచో, చరిత్రము ఇట్లే, చరిత, చరితము - ఇత్యాది ఇవి బహుళ ప్రయోజనములలో విభాష కుదాహరణములు బహుళమనుటచే దర్భాదులకు 'ము' లోపము నిత్యము దర్భ - దర్భ-ప్రాతిపదికము 39 చే దర్భ - + ము "బాహుళకము వలన దర్భాదులకు ము లోపంబు నిత్యంబు' అనుటచే మువర్ణకము నిత్యముగ లోపించి దర్భ - దర్భ-అని యగును ఇట్లే పనస + ము = పనస - అగును పనస = వృక్ష విశేషము ఇవి బహుళ ప్రయోజనములలోఁ బ్రవృత్తి కుదాహరణములు ప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగఁ బ్రవర్తించుట ఇట ము లోపము నిత్యముగఁ బ్రవర్తించుట ప్రవృత్తి

విశే - 41 చే - మువర్ణకమునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమున కగును కావున, చరిత్ర + ము + లు - అనుచో ముగాగమ లోపము విభాషనగునని గ్రహించుట సరళ మార్గము చరిత్రలు, చరిత్రములు- ఇత్యాది

## స్వర్గివాచి దేవ సుర శబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు. 59

దేవుడు, సకల సురులు

స్వర్గి వాచి యనుటచే భూదేవులు, భూసురుఁడను బ్రయోగంబుల బాధితంబులయ్యె

వ్యా దేవతా వాచకమగు దేవ శబ్ద మేకవచనమునను సుర శబ్దము బహువచనమునను ప్రయోగింపంబడును స్వర్గి = దేవత దేవుడు - దేవ - ప్రాతిపదికము 21 చే - దేవు 22 చే - దేవు + డుఙ్ 19 చే దేవుఁడు, దేవుండు,

అను ప్రథమైక వచనము లేర్పడును దీనికి బహువచన రూపము కలుగదని యీ సూత్రము నియోగించుచున్నది కాన, దేవులు - అను రూపము కలుగదు సకల సురులు - సకల సుర - ప్రాతిపదికము 21 చే - సకల సురు 12 చే- సకల సురు + లు = సకల సురులు స్వర్గి వాచి - అనుటచే దేవతావాచకము కాని దేవ శబ్దమునకు బహువచనము, సుర శబ్దమున కేకవచనము నుండును భూదేవులు - భూదేవ - ప్రాతిపదికము ఇది సమాసము గావున, భూశబ్దసాన్నిధ్యమున దేవ శబ్దము దేవతా వాచకము కాదు బ్రాహ్మణ వాచకము కాన బహువచనము గూడ నుండవచ్చును 21 చే - భూదేవు 12 చే - భూదేవులు భూదేవుఁడు - అను నేకవచన మెట్లును నుండును భూసురుఁడు - భూసుర - ప్రాతిపదికము భూ శబ్ద సాన్నిధ్యమున సుర శబ్దము దేవతా వాచకము కాదు గనుక నేకవచనము గూడ నుండవచ్చును భూసురుఁడు, భూసురుండు (21 22, 19) భూసురులు - అను బహువచన మెట్లును గలుగును

విశే - భూదేవ, భూసుర శబ్దములతో దేవ, సుర శబ్దములు బ్రాహ్మణ వాచకములగునని జహత్స్వార్థావృత్తి ననుసరించి నిర్దేశింపఁబడెను జహత్స్వార్థా జహత్స్వార్థా ద్వేవృత్తీ - వై భూ, సమాస

పార పరిశీలన - (1) సకల సురలు - అని ప్రథమ ముద్రణముననే తప్పు పడినది సకల సురులు అనియే యుండవలెను (11) భూదేవుఁడు, భూసురులను-అని ప్రథమ ముద్రణమున వ్యత్యస్తముగఁ గనఁబడును భూదేవులు, భూసురుఁడును - అనియే యుండవలెను

**సుర శబ్దంబు నిత్యంబుగా నసుర శబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు సంస్కృత సమాసంబునఁగావు. 60**

సురలు, అసుర, అసురుఁడు నిఖిలసురులు, రావణాసురుఁడు, ఎల్లసురలు, ఎల్లయసురలు, ఎల్లయసురులు

వ్యా సుర శబ్దము నిత్యముగా స్త్రీలింగ తుల్యమగును అసుర శబ్దము వైకల్పికముగా స్త్రీలింగ తుల్యమగును, సంస్కృత సమాసమున స్త్రీలింగ తుల్యములు కావు సురలు సుర - ప్రాతిపదికము స్త్రీలింగ తుల్యత యీ 60చే - దీనికి నిత్యము గనుక 21 చే - ఉత్వము కలుగదు 59 చే - సుర శబ్దమున కేకవచన ముండదు 12 చే - సుర + లు = సురలు అగును అసుర, అసురుఁడు - అసుర - ప్రాతిపదికము ఈ 60 చే - స్త్రీలింగ తుల్యమగు పక్షమున,

21 చే - ఉత్వము రాదు 22 చే - డుజ్జు రాదు కాన ననుక్త న్యాయమున సుప్రత్యయము చేరును అసుర + సు 57 చే - సు, లోపించి, అసుర - అను ప్రథమైక వచన మేర్పడును అసుర శబ్దమునకు స్త్రీతుల్యత వైకల్పిక ముగనగును కాన స్త్రీ తుల్యత కాని పక్షమున, 21 ని - అసుర = అసురు - అగును 22 - చే - అసురు + డుజ్ 19 చే - అసురుఁడు, అసురుండు - అను రూపము లేర్పడును ఈ స్త్రీ తుల్యత సంస్కృత సమాసమునఁ గలుగదు నిఖిల సురులు - నిఖిల సుర - ప్రాతిపదికము సంస్కృత సమాసమున స్త్రీలింగ తుల్యత లేదు గనుక 21 చే - నిఖిలసురు - 12 చే - నిఖిలసురు+లు= నిఖిల సురులు రావణాసురుఁడు రావణాసుర - ప్రాతిపదికము సంస్కృత సమాసమున స్త్రీ తుల్యత లేదు గనుక 21 చే రావణాసురు 22 చే - రావణా సురు + డుజ్ 19 చే - రావణాసురుఁడు సంస్కృత సమాసంబునఁ గావు - అనుటచే సంస్కృత సమాసము కానప్పు డనఁగా మిశ్ర సమాసమున, సుర శబ్దము నిత్యముగా, నసుర శబ్దము వైకల్పికముగా స్త్రీ తుల్యములగును ఎల్ల సురలు - ఎల్లను + సుర + లు సమాస 25 చే - ఎల్లను + సుర సంధి 24 చే - ద్రుత లోపము జరిగి ఎల్ల సుర + లు = ఎల్ల సురలు - అగును ఎల్ల యసురలు, ఎల్ల యసురులు ఎల్లను + అసుర + లు సమాస 25 చే - ఎల్లను + అసుర సంధి 24 చే - ఎల్ల + అసుర సంధి 3 చే - ఎల్ల-య్+ అసుర = ఎల్ల యసుర ఈ 60 చే - స్త్రీతుల్యమయినచో - 21 చే - ఉత్వము రాదు 12 చే - ఎల్లయసుర + లు = ఎల్లయసురలు - అగును స్త్రీతుల్యము కాని పక్షమున ఎల్లయసుర, 21 చే - ఎల్లయసురు 12 చే - ఎల్లయసురులు - అగును

కాఁగా, సుర శబ్దము వ్యస్తత యందును, మిశ్ర సమాసమునందును స్త్రీ తుల్యము నిత్యముగ నగును అసుర శబ్దము వ్యస్తత యందును, మిశ్రసమాసము నందును వైకల్పికముగ స్త్రీ తుల్యమగును ఈ రెండు శబ్దములును సంస్కృత సమాసమున స్త్రీతుల్యములు కావు

## దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగ నగు. 61

దూత, దూతుఁడు, యోధ, యోధుఁడు, శుంఠ, శుంఠుఁడు

బహుళ గ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు· సింగంబు దూతయగు జంబుకంబు

వ్యా దూతాదులకు స్త్రీలింగత్వము బహుళముగా నగును దూత, దూతుఁడు - దూత - ప్రాతిపదికము స్త్రీత్వమయినచో 21 చే - ఉత్వమురాదు,

22 చే - డుజ్జు రాదు అనుక్త న్యాయమున సు ప్రత్యయము చేరును దూత+సు 57 చే - సు లోపించి, దూత - అను ప్రథమైక వచనము సిద్ధించును స్త్రీత్వము కానిచో, దూత, 21 చే - 22 చే - దూతు + డుజ్ 19 చే - దూతుఁడు దూతుండు - అను రూపములగును ఇట్లే, యోధ, యోధుఁడు, శుంర, శుంరుఁడు ఇవి బహుళములో విభాష కుదాహరణములు బహుళమగుటచే - అమహద్వాచకత్వమున స్త్రీలింగత్వము నిత్యము, సింగంబు దూతయగు జంబుకంబు ఇట జంబుకంబు - అను విశేష్య మమహత్తు కావున దీని విశేషణమగు దూత శబ్దమును, నమహత్తు 39 చే - మువర్ణకము చేరి - దూత + ము - అగును బహుళ గ్రహణముచే నమహత్త్వమున స్త్రీత్వము నిత్యమనుటచే - మువర్ణకము నిత్యముగ లోపించును దూత - అను రూపమే యమహత్త్వమున నేర్పడును (దూతమగు జంబుకము - కాదనుట)

## పృథ్వీ వాచి భూశబ్దంబునకు భువియగు. 62

భువి, భువులు, భువిని, భువులను

వ్యా పృథ్వీ (భూమి) యను నర్థము గల 'భూ' శబ్దమునకు భువి- అను నది యాదేశమగునని, యీ నిపాత సూత్రమున కర్థము సామాన్య ప్రక్రియచే, భూవు - అగుచుండఁగా, భువి అని నిపతింపఁబడెను నిపాతము = చూ 51 భువి - ప్రాతిపదికము దీనిపై ననుక్తన్యాయమున 'సు' ప్రత్యయము చేరును 44 చే - 'సు' లోపించి, భువి - అను ప్రథమైక వచనము సిద్ధించును భువులు - భువి - ప్రాతిపదికము 12 చే - భువి + లు 45 చే - భువులు భువిని:- భువి - ప్రాతిపదికము 2 చె - భువి + ను 26 చే - భువిని- భువులను - భువి - ప్రాతిపదికము, 2 చే - భువి + ను 31 చే - భువి + లను, 45 చే- భువులను

పద సార్థక్యము - పృథ్వీవాచి యనుటచేఁ బృథ్వీ వాచకముకాని భూశబ్దమునకు భువి - కాదు ఆత్మభూ, స్వయంభూ-వీనిలోనిది పృథ్వీవాచి భూశబ్దము కాదు - ఇది యేకాక్షర శబ్దమును గాదు కాన 54 చే - ఆత్మభు, స్వయంభు 50 చే - ఆత్మభువు, స్వయంభువు- అను రూపములగును (ఆత్మభువి, స్వయంభువి కావనుట)

## నౌ శబ్దంబునకు నావయగు. 63

నావ, నావలు, మహానావ కొందఱు నావి యనియు నాదేశంబగు నండ్రు

వ్యా నౌశబ్దమునకు నావ - అనునది యాదేశమగునని యీ నిపాతమున

కర్తము నిపాతము = 51 సూ సామాన్య ప్రక్రియచే 'నౌ' అను రూపమేర్పడు చుండఁగా 'నావ' నిర్దిష్టము నావ - నావ - ప్రాతిపదికము 39 చే - నావ+ ము నౌశబ్దము స్త్రీలింగము గాన, 57 చే - ము లోపించి నావ - అను రూప మేర్పడును నావలు - నావ - ప్రాతిపదికము 12 చే - నావ + లు = నావలు మహానావ - మహానౌ - ప్రాతిపదికము ఈ 63 చే - మహానావ - అగును 39 చే - మహానావ + ము 57 చే, ము - లోపించి, మహానావ - అను రూపమేర్పడును "కొందఱు నావి యనియు నాదేశంబగునండ్రు" అనఁగాఁ గొందఱు నావ, నావి - అనురెండు రూపములు పర్యాయమున, నగునందు రన్నమాట

విశే - (1) నావి - అనియు నాదేశమగునని విధించిన వారెవరో కంటఁ బడలేదని కొందఱు సెలవిచ్చినారు నావి పుష్పదంతస్య - త్రి శ నావ, నావి- తె వ్యా నా, వియేషి వడిదాంటె జాహ్నపిశై వలినిన్ - అథ ఖా (11) మహా నావ - నావా - అను ప్రాకృత రూపమునుండి యేర్పడిన నావ-అను ప్రాకృత సమ మొకటి కన్పట్టును కాన, నీ 63 చే - సాధించినది సంస్కృత సమమని తెలియుటకు, మహానావ అని యుదాహృతము

## రై, గ్లౌ శబ్దంబుల కోత్వంబు విభాషనగు. 64

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు రో— రై, గ్లో — గ్లౌ

వ్యా రై, గ్లౌ శబ్దముల తుది యచ్చులకు, ఓత్వము విభాష నగును రో - రై - ప్రాతిపదికము ఈ సూత్రముచే, రై - లోని తుది ఐకారమునకు, ఓకారమాదేశమయిన, రై - (ర్ + ఐ) అనునది, రో — (ర్ + ఓ) అగును అనుక్త న్యాయమున, సుప్రత్యయము చేరును రో + సు 44 చే - సు లోపించి, రో - అనురూపమేర్పడును ఓత్వము కానిచో - రై + సు 44చే - రై - అనియగును గ్లో - గ్లౌ ప్రాతిపదికము 'ఔ'కు 'ఓ' ఆదేశమయినచో-గ్లౌ అనునది, గ్లో అగును 22 చే - గ్లో + డుఙ్ 44చే డుజ్ఞు లోపించి, గ్లో - అగును ఓత్వమురానిచో - గ్లౌ+డుఙ్ 44 చే - గ్లౌ అగును రై = ధనము- గ్లౌ = చంద్రుఁడు

విశే - (1) ఓత్వ మేకవర్ణము గాన, రై, గ్లౌ - శబ్దముల తుదియచ్చు లకే యాదేశమగును అలోంత్యస్య - (పాణి) (11) రో, గ్లో శబ్దము లేకదేశ వికృతములు గాన 41 చే, స్వలోపము "ఏకదేశ వికృతమనన్యవత్" పరిభా,

## ఐకారం బీ తుల్యంబు. 65

రైని, రైకి, క్రైని, క్రైకి, పైని, పైకి

వ్యా ఐకారము "ఈ" కారముతోఁదుల్యము ఈ = దీర్ఘమగు ఇకారమని గ్రహింపవలెను దీర్ఘమగు ఇకారమునకు వర్తించు వ్యాకరణ కార్యములు ఐకారమునకు వర్తించునని తాత్పర్యము రైని - రై - ప్రాతిపదికము 2 చే - రై + ను ఈ 65 చే — ఐకారము 'ఈ' తుల్యముగాన 26 చే - నువర్ణము లోని ఉత్వమున కిత్వమగును రై + ను = రైని - అగును రైకి - రై - ప్రాతిపదికము 6 చే - రై + కు తత్సమ 8చే - రై + కు + ను ఈ 65 ఐకార, మీ తుల్యముగాన 26 చే - రై + కు + ను = రైకిని సంధి 20 చే - రైకి ఇట్లే, క్రై + ను = క్రైని క్రై + కు + ను = క్రైకి పై + ను = పైని పై + కు + ను = పైకి కయి = క్రై పయి = పై - క్రియా 103

విశే - (1) క్రై పై అనునవి యచ్చ తెనుఁగున కుదాహరింపఁబడినవి (11) దీర్ఘమగు ఇకారముతోఁదుల్యమనుటచే హ్రస్వేకారమునకు విధించు కార్యములు, ఐకారమునకుఁ గలుగవు రై + లు = రైలు, మొ॥ ఇట 45చే- ఉత్వమురాదు (111) ఈ తుల్యత ఐకారమునకే గాని రై శబ్దమునకుఁగాదు కాన రో + ను = రోను అనియే యగును ఇట 26 సూత్రము ప్రసక్తము కాదు (1v) ఈ తుల్యంబు - అనుచో హ్రస్వేకార తుల్యమా? దీర్ఘేకార తుల్యమా? యన్న సందేహమును వ్యాఖ్యానముచే నివృత్తి చేసికొనవలెను వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్నహి సందేహాద లక్షణమ్ (పరిభా)

## కంధరాదులు క్లీబ తుల్యంబులు బహుళంబుగా నగు. 66

కంధరము, కంధర విధా శబ్దమునకు గ్లీబ తుల్యత్వంబు నిత్యంబు విధము కంధరా, నాసికా, భిక్షా, దంష్ట్రా, గ్రీవా, పాదుకోల్కా-ప్రభృతులు, కంధరాదులు

వ్యా కంధరా - మొదలగు స్త్రీలింగ శబ్దములుబహుళముగఁ గ్లీబతుల్యము లగును కంధరము, కంధర - కంధరా - ప్రాతిపదికము 54 చే - కంధర క్లీబతుల్యమగు పక్షమున 39 చే - కంధర + ము = కంధరము క్లీబతుల్యము కానిచో, 'కంధరా' శబ్దము మహద్వాచకమగుటచే - 39 చే - కంధర + ము ఇది స్త్రీలింగముగాన 57 చే - ము-లోపించి కంధర - అగును ఇట్లే, నసికా=

నాసికము, నాసిక భిక్షా = భిక్షము, భిక్ష, దంష్ట్రా = దంష్ట్రము, దంష్ట్ర' గ్రీవా=గ్రీవము, గ్రీవ, పాదుకా = పాదుకము, పాదుక, ఉల్కా = ఉల్కము, ఉల్క విధము - విధా - ప్రాతిపదికము 54 చే - విధ క్లీబతుల్యత నిత్యము గాన 39చే - విధము

## ఇంక హలంత ప్రకరణము

## హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామంబగు. 67

రుక్, రాట్, మరుత్, వీరుత్, కర్మ, వర్మ, శ్వ శబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచన తుల్యంబులె యగునని యెఱుంగునది

వ్యా ఈ హలంత ప్రకరణమున, సంస్కృత హలంత శబ్దముయొక్క ప్రథమైక వచనాంతముతోఁ దుల్యమగు రూపము ప్రాతిపదికమగును విభక్త్యంతము ప్రాతిపదికము కారాదు గనుక 'తుల్యంబు' అనుట తుల్యమనుటచే స్వల్ప భేదముండిన నుండవచ్చును రుచ్ - సంస్కృతశబ్దము రుక్ - ప్రథమైక వచనము- రుక్ - ప్రథమైకవచనాంతతుల్యము రాజ్ - శబ్దముయొక్క ప్రథమైకవచనాంత తుల్యము రాట్ మరుత్ - శబ్దముయొక్క ప్రథమైకవచనాంత తుల్య రూపము - మరుత్ వీరుధ్-దీని ప్రథమైకవచనాంత తుల్యము-వీరుత్ కర్మన్, వర్మన్ - అను నకారాంత శబ్దములయొక్క ప్రథమైకవచనాంత తుల్యములు కర్మ, వర్మ కాఁగా-రుక్, రాట్, మరుత్, వీరుత్, కర్మ, వర్మ - అను సంస్కృత ప్రథమైక వచనాంతతుల్యము లీసూత్రముచేఁ బ్రాతిపదికము లగును శ్వన్-అను శబ్దమొకటితప్పఁ దక్కిన నకారాంతశబ్దములన్నియుఁ బ్రథమైకవచనాంత తుల్యములే యగును (చూ 70 సూ)

విశే - (1) అజంతముల రూపసాధనమున సంస్కృత ప్రాతిపదికమే తెలుఁగునఁ బ్రాతిపదికమగును రామ, మున్నగునవి - సంస్కృత ప్రాతిపదికములు వీనిపైఁదెనుగుఁ విభక్తులుచేరి రాముఁడుమున్నగు సంస్కృతసమము లేర్పడును హలంతముల రూప సాధనమున నీ 67 చేఁ బ్రథమైకవచనాంత తుల్యము ప్రాతిపదికమగును తక్కిన ప్రాతిపదికములనుగూర్చి - చూ 70, 73, 74, 80 సూ (11) ప్రథమైకవచన = ప్రథమైక వచనాంతము "ప్రత్యయ గ్రహణే తదంతస్యాపి గ్రహణమ్" (పరిభా)

## ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు. 68

ఉగాగమాంతంబుల కిగ్లౌసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు రుక్కు, రాట్టు, మరుత్తు, వీరుత్తు, ఉగాగమంబు లేమింజేసి యిచట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు కర్మము, వర్మము, చర్మము, సుధన్వుఁడు, సుత్రాముఁడు

వ్యా తుది హల్లునకు ద్విత్వము, ఉగాగమము నగును ఉదా॥ రుక్కు-- 67 చే రుక్ - అను ప్రథమైక వచనాంత తుల్యము ప్రాతిపదికమగును ఈ 68 చే - ద్విత్వము, ఉగాగమమువచ్చి-రుక్ క్ + ఉ = రుక్కు - అగును 48చే - రుక్కు + వు రుక్కు - ఉగంతము కనుక, 44చే - వువర్ణకము లోపించి రుక్కు - అను ప్రథమైకవచనమేర్పడును ఇట్లే, మరుత్=మరుత్+వు మరుత్తు వీరుత్ = వీరుత్తు + వు వీరుత్తు సాధించుకొనవలెను రాట్టు - రాట్-అను ప్రథమైకవచన తుల్యము 67చేఁ బ్రాతిపదికమగును ఈ 68చే- రాట్ ట్ + ఉ = రాట్టు 22చే - రాట్టు + డుఙ్ 44చే - డుఙ్ణు లోపించి రాట్టు - అను రూపము సిద్ధించును

నాంతములకు ( = నకారాంతములు) నీ 68 చే - ఉగాగమముకలుగుట కవకాశము లేదు ఏలయన వీని ప్రాతిపదికముల చివర హల్లులుండవు కర్మ, వర్మ, చర్మ అను ప్రథమైకవచనాంత తుల్య రూపములు, 67 చేఁ బ్రాతిపదికము లయినవి వీనిచివర హల్లులులేకుండుటచే నీ 68చే - ఉగాగమములేదు 39చే- కర్మము, వర్మము, చర్మము-అను రూపము లేర్పడును ఇవి యస్త్రీలింగములు- అనఁగా స్త్రీలింగములు కావు, నపుంసకలింగములు కాన విభక్తిలోపమునకుఁ బ్రసక్తిలేదు స్త్రీలింగములయినచో 57 చే- విభక్తిలోపము సుధన్వుఁడు - సుధన్వన్ - అను నకారాంత శబ్దము యొక్క ప్రథమైకవచనాంత తుల్యమగు, సుధన్వా - అనునది 67 చేఁ బ్రాతిపదికమగును 54 చే - సుధన్వ - అగును 21 చే - సుధన్వు 22 చే - సుధన్వు + డుఙ్ 19 చే - సుధన్వుఁడు, సుధన్వుండు - అను రూపము లేర్పడును ఇవి యస్త్రీలింగములు అనఁగా స్త్రీలింగములు కావు, పుంలింగములు కాన వీని ప్రథమైక వచన లోపమునకుఁ బ్రసక్తియే లేదు ఇట్లే, సుత్రామా అను ప్రాతిపదికము నుండి, సుత్రాముఁడు- అను దానిని సాధించుకొనవలెను

## దీర్ఘంబు మీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు. 69

వాక్కు, వాకు, స్వరాట్టు, స్వరాటు

వ్యా దీర్ఘము మీఁది హల్లునకు ద్విత్వము బహుళముగ నగును వాక్కు, వాకు - 67 చే - వాక్ - అనునది ప్రాతిపదికమగును ఇది 'వాచ్' అను శబ్దము యొక్క ప్రథమైక వచనాంత తుల్యము 68 చే - ఉగాగమమును ద్విత్వమును బ్రాప్తించుచుండఁగా ద్విత్వము దీర్ఘముపై బహుళముగ నగునని యీ సూత్రమునఁ జెప్పఁబడెను అనఁగా ఉగాగమము నిత్యముగను, ద్విత్వము బహుళముగనునగు నన్నమాట 68 చే - వాక్క్ + ఉ = వాక్కు అగును 48 చే - వాక్కు + వు 44 చే వు, లోపించి వాక్కు - అగును 69 చే - ద్విత్వము రాని పక్షమున - 68 చే - వాక్ + ఉ = వాకు 48 చే - వాకు + వు 44 చే - వు - లోపించి, వాకు — అను ప్రథమైక వచన మేర్పడును స్వరాట్టు, స్వరాటు - 67 చే - స్వరాట్ — ప్రాతిపదికమగును 'ఇది స్వరాజ్' అను శబ్దము యొక్క ప్రథమైక వచనాంత తుల్య రూపము 68 చే - ఉగాగమము ద్విత్వము నైన పక్షమున - స్వరాట్, ట్ + ఉ = స్వరాట్టు - అగును 22 చే- స్వరాట్టు + డుఁ 44 చే డుఙు లోపించి, స్వరాట్టు- అను ప్రథమైక వచనము సిద్ధించును ఈ 69 చే - ద్విత్వము రాని పక్షమున, 68 చే - స్వరాట్ + ఉ = స్వరాటు 22 చే - స్వరాటు + డుఁ 44 చే - స్వరాటు - అని యేర్పడును స్వరాట్ అనుచో 'రా లోని' 'అ' దీర్ఘమగుటచే హల్లునకు ముందు దీర్ఘము గలదని గ్రహింపవలెను

విశే - (i) స్వరాట్టు = సవితరి, పరమేశ్వరే — శబ్దా చిం బ్రహ్మ - శబ్దక కొందఱు, దీని కింద్రుఁడని యర్థము సెలవిచ్చుట పొరపాటు స్వారాట్టు= ఇంద్రుడు (ii) స్వరాట్టు - అనుదానిపై 50 చే - పువర్ణకము నిల్పి లోపము చేయరాదా యని తోఁచును కాని పువర్ణకము తప్పక రావలెనని లేదు అది రానిచో మరల డుఁ వర్ణకము ఛేర్చవలసి యుండును కావునఁ బ్రథమైక వచనమున పువర్ణకముతోఁ గూడుకొని యుండని మహత్తులగు నీ ఉగాగమాంత ములపై డుజ్వర్ణకమునే చేర్చి లోపము చెప్పుట ప్రక్రియా లాఘవము ఇట్లే ఇంద్రజిత్తు మున్నగు వాని ప్రక్రియ నరయఁదగును

పద సార్థక్యము - దీర్ఘము మీఁది - అనుటచే హ్రస్వము మీఁది హల్లునకు ద్విత్వము నిత్యమే మరుత్ = మరుత్తు

## మతుబాదికంబు ద్వితీయైకవచనాంత తుల్యంబు నామంబగు 70

శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్, ఇత్యాదులు

వ్యా మతుప్ - ప్రత్యయాంతములు మొదలగు వానియొక్క ద్వితీయైక వచనాంత తుల్యములు ప్రాతిపదికము లగును (మతుప్ - అది వీనికిఁ గలదు, అది వీనియందుఁ గలదు అను నర్థమున నగును మత్ - అనునది శబ్దమునకుఁ జేరును ) శ్రీ + మత్ = శ్రీమత్ - అదంతములపై మత్ - లోని మకారము వకారమగును గుణ + మత్ = గుణవత్ శ్రీమత్, గుణవత్ అనునవి మతుబంతములు (మతుప్ + అంత = మతుబంత) అనఁగా మతుప్ - ప్రత్యయ మందు గలవి శ్రీమత్ - అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంతము శ్రీమన్తమ్ గుణవత్ అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంతము గుణవన్తమ్ వీని తుల్య రూపములు శ్రీమంతమ్, గుణవంతమ్ - అనునవి విద్వస్ అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంత తుల్యము - విద్వాంసమ్ అనడుహ్ అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంత తుల్యము - అనడ్వాహమ్ శ్వన్- అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంత తుల్యము - శ్వానమ్ ఉపానహ్ అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంత తుల్యము - ఉపానహమ్ అప్సరస్ –అను శబ్దము యొక్క ద్వితీయైక వచనాంత తుల్యము - అప్సరసమ్ కాఁగా శ్రీమంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్ - అను ద్వితీయైక వచనాంత తుల్యము లీ సూత్రముచేఁ బ్రాతిపదికములగును

విశే - వర్గపంచమ స్థానమున బిందువులు నిల్చును శ్రీమన్తమ్ = శ్రీమంతమ్

## దానియంతిమ మకారంబునకు లోపంబగు. 71

శ్రీమంత, గుణవంత, విద్వాంస, అనడ్వాహ, ఇత్యాది వీని కజంతములకుంబోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు అతఁడు శ్రీమంతుఁడు ఇతఁడు గుణవంతుఁడు వానివంశము శ్రీమంతము వీని వంశము గుణవంతము విద్వాంసుఁడు, విద్వాంసము, అనడ్వాహము, శ్వానము, అప్సరస వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతంబులై యిందు గ్రహింపబడు శ్రీమతి, గుణవతి, విదుషి, శుని.

మహతి వాచ్యంబగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు

వ్యా ద్వితీయైకవచనాంత తుల్యమగు ప్రాతిపదికముయొక్క తుది మకారమునకు లోపమగును తరువాత నజంత శబ్దములకు వలెనే, డుజ్వర్థకము చేరుట మున్నగు కార్యములు యథోచితముగా నగును శ్రీమంతుడు - శ్రీమంతమ్ - 79చేఁ బ్రాతిపదికమగును ఈ 71 చే - మకారము లోపించి, శ్రీమంత - అగును మహత్తగుచో - 21 చే - శ్రీమంతు 22చే- శ్రీమంతు+ డుజ్ 19 చే - శ్రీమంతుఁడు, శ్రీమంతుండు శ్రీమంతము - శ్రీమంతమ్ - 70 చేఁ బ్రాతిపదికము ఈ 71 చే - శ్రీమంత అమహత్తగుచో, 39చే, శ్రీమంతము - అని యగును మతుప్ - ప్రత్యయాంతములు మున్నగునవి స్త్రీత్వమున ఙీ - అను స్త్రీ ప్రత్యయముతోఁగూడుకొనియే ప్రాతిపదికములగును వక్ష్యమాణ లక్షణంబు = చెప్పబోవు లక్షణము అనఁగా - 85 సూత్రము ఙీ + అంత = ఙ్యంత దీనిలో, ఈ - అనునదే చేరును శ్రీమతీ, గుణవతీ, విదుషీ, శునీ అనునవి ఙ్యంతములు ఇవి ఙీ ( = ఈ) అను స్త్రీ ప్రత్యయ - మంతమందుఁ గలవి శ్రీమతి - 85 చే - శ్రీమతీ ప్రాతివదికము 54 చే - శ్రీమతి అనుక్త న్యాయమున - శ్రీమతి + సు - అగును 44 చే - సు లోపించి, శ్రీమతి - అగును శ్రీమంతురాలు 70 చే - శ్రీమంతమ్ - ప్రాతిపదికము ఈ 71 చే - శ్రీమంత మహతీ వాచకమగుచో ఆలు శబ్దముతో సమాసమగును శ్రీమంత + ఆలు సంధి 31 చే - శ్రీమంతుర్ + ఆలు = శ్రీమంతురాలు - అని యేర్పడును ఇట్లే, గుణవంతమ్ - అను ప్రాతిపదికము నుండి, గుణవంతుఁడు, గుణవంతము, గుణవంతురాలు - అనియు, విద్వాంసమ్ అను ప్రాతిపదికము నుండి విద్వాంసుఁడు, విద్వాంసము, విద్వాంసురాలు - అనియు రూపము లేర్పడును శ్రీమతీ = శ్రీమతి, అయినట్లే గుణవతీ, విదుషీ, శునీ అను వాని నుండి గుణవతి, విదుషి, శుని - అను సంస్కృత సమములు సిద్ధించును అనడ్వాహము - 70 చే - అనడ్వాహమ్ అను ద్వితీయైక వచనాంత తుల్యము ప్రాతిపదికమగును ఈ 71 చే - అనడ్వాహ 39 చే - అనడ్వాహ+ ము = అనడ్వాహము (అనడ్వాహము = ఎద్దు కాన నమహత్తు) శ్వానము - 70 చె - శ్వానమ్ - అను ద్వితీయైక వచనాంత తుల్యము ప్రాతిపదికమగును ఈ 71 చే - శ్వాన 39 చే - శ్వానము అప్సరస - 70 చే - అప్సరసమ్ - అను ద్వితీయైక వచనాంత తుల్యము ప్రాతిపదికమగును ఈ 71 చే- అప్సరస 39 చే - అప్సరస + ము 57 చే - 'ము' లోపించి, అప్సరస - అగును

## ముదాదులకుఁ బ్రథమైక వచన లోపంబు లేదు. 72

ముదము, ఉపానహము, స్రజము

వ్యా ముదాది శబ్దములకుఁ బ్రథమైకవచన లోపము లేదు ముద్, ఉపానహ్, స్రజ్ - అను, శబ్దముల ద్వితీయైక వచనాంత తుల్యములగు ముదమ్, ఉపానహమ్, స్రజమ్ - అనునవి 70 చే - ప్రాతిపదికము లగును 71 చే - ముద, ఉపానహ, స్రజ 39 చే - ముద + ము, ఉపానహ + ము, స్రజ+ ము ఇవి స్త్రీ లింగములు గనుక, 57 చె, 'ము' - లోపింపవలసి యుండఁగా, నీ 72 సూత్రము ప్రథమైక వచన లోపమును నిషేధించును కావున, ముదము, ఉపానహము, స్రజము - అను రూపము లేర్పడును

## ఋత్విగాదులు ద్వితీయైక వచనాంత తుల్యంబులు విభాషనగు. 73

ఋత్విజుఁడు, ఋత్విక్కు, నీవృతము, నీవృత్తు ఋత్విగాదికం బాకృతి = గణంబు

వ్యా ఋత్విగాదులు ద్వితీయైక వచనాంత తుల్యములు విభాష నగును ఋత్విజుఁడు ఋత్విక్కు - ఋత్విజమ్-ప్రాతిపదికము ఇది 'ఋత్విజ్ అనుశబ్దము యొక్క, ద్వితీయైకవచనాంత తుల్యము 71 చె-ఋత్విజ, 21 చే- ఋత్విజు 22చే- ఋత్విజు + డుఙ్ 19చే - ఋత్విజుఁడు, ఋత్విజుండు ద్వితీయైకవచనాంత తుల్యము కానిచోఁ బ్రథమైకవచంనాతతుల్యము ప్రాతిపదికమగును ఋత్విక్ – ప్రాతిపదికము ఇది ఋత్విజ్ - అనుదానిప్రథమైకవచనాంతముతోఁ దుల్యము 68 చే ఋత్విక్కు, 22 చే – ఋత్విక్కు + డుఙ్ 44చే - డుఙ్ఞు లోపించి, ఋత్విక్కు-అను ప్రథమైకవచన మేర్పడును నీవృతము, నీవృత్తు - నీవృతమ్- ప్రాతిపదికము ఇది 'నీవృత్' అను శబ్దముయొక్క ద్వితీయైకవచనాంత తుల్య రూపము 71 చే - నీవృత 39 చే - నీవృతము- అని సిద్ధించును ద్వితీయైక వచనాంత తుల్యము కానిచో 67 చేఁ బ్రథమైక వచనాంతతుల్యము ప్రాతిపదిక మగును నీవృత్ - ప్రాతిపదికము ఇది 'నీవృత్' అను శబ్దముయొక్క ప్రథమైక వచనాంత తుల్యము 68 చె - నీవృత్తు 48 చే - నీవృత్తు + వు 44చే- వువర్ణకము లోపించి, నీవృత్తు- అను రూపము సిద్ధించును ఋత్విగాదు లాకృతి గణము ఆకృతిగణము = సమానాకృతిగల శబ్దములను బ్రయోగానుసారముగఁ జేర్చుకొనఁదగిన గణ మాకృతిగణమనఁబడును ఋత్విగాదులవలె ద్వితీయైక వచనాంత తుల్యమును, బ్రథమైకవచనాంత తుల్యమును బ్రాతిపదికములగు

శబ్దములు ప్రయోగములతోఁ గనఁబడినచో నట్టివాని నీగణమునఁజేర్చి సాధించు కొన నగునని తాత్పర్యము

విశే - ఋత్విక్కు - వరాహ 5-11, ఋత్విజుఁడు - సభా 1-11, 2-4 శాంతి 3-106

## ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు 74

హనుమానుఁడు, హనుమంతుఁడు, భగవానుఁడు, భగవంతుఁడు ఇత్యాది

వ్యా మహత్త్వమున 'మతుప్' ప్రత్యయముయొక్క తకారమున కరుదుగా 'ఆన' అను నాదేశము విభాషనగును మతుప్ - ప్రత్యయమున 'మత్' అనునదే చేరును హను + మత్ = హనుమత్ అదంతములపై మకారము వకార మగును ఉదా॥ భగవత్ మతుప్ - ప్రత్యయ తకారమనఁగా, మత్ - అను దానిలోని తకారము మతుప్తకారమున కనుటచే అనాదేశ పక్షమున సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపవలెనని సూచన హనుమానుఁడు - హనుమత్ - ప్రాతిపదికము ఈ 74చే - 'ఆన' అనునది తకారమునకు (త్) నాదేశమయిన్న, హనుమ + ఆన - అగును సంధి 11 చే- హనుమాన తత్సమ 21చే- హను మాను 22చే - హనుమాను + డుఙ్ 19 చే - హనుమానుఁడు, హనుమానుండు హనుమంతుడు - 70చే- హనుమంతమ్ - ప్రాతిపదికము ఇది 'హనుమత్' — అను శబ్దముయొక్క ద్వితీయైకవచనాంతముతోఁ (=హనుమన్తమ్) దుల్యరూపము 71చే- మకారము లోపించి, హనుమంత - అగును ఉత్వడుఙ్లు చేరి, హనుమంతుఁడు, హనుమంతుండు - అను రూపము లేర్పడును- (21, 22, 19) ఇట్లే, భగవత్ - అను ప్రాతిపదికమునుండి, భగవానుఁడు - అనియు భగవంతమ్ - అను ప్రాతిపదికమునుండి భగవంతుడు - అనియు, రూపము లేర్పడును

విశే - హనుమానుఁడు, భగవానుఁడు - అను రూపములను, హనుమంతమ్, భగవంతమ్ - అను ద్వితీయైకవచనాంత తుల్య ప్రాదిపదికముల నుండియే సాధింపవలెనని కొందఱు నెలవిచ్చి యిట్లు ప్రక్రియ చెప్పినారు హనుమంతమ్ - ప్రాతిపదికము 71 చే - హనుమంత దీని తకారమునకు, ఆనాదేశము వచ్చినచో - హనుమం ఆన మన భాషలో నెచ్చట నయినను స్వరమునకుఁ బూర్వ మనుస్వారముండుట యసంభవము, కావున నిట బిందువు

స్వయముగా లోపించును హనుమ + అన = హనుమాన హనుమానుఁడు ఈ ప్రక్రియ సరికాదు ఏలయన - (1) మతు ప్తకారంబునకు, అనుటచే - హనుమం అన-అని నిల్చుననుట పొరపాటు హనుమం + అన + అ-అని నిల్చుననవలెను అత్వమును సూరి నిష్ప్రయోజనముగ మిగుల్చుననుట విశ్వసనీయముకాదు చూ క్రియా 24 (11) మతు ప్తవర్ణంబునకు, మతుప్తాక్షరంబునకు- అని సూత్రించి యున్నచో, హనుమంతమ్ - ప్రాతిపదికమనుటకు వీలుండును (సమాస 16, 24) (111) తకారము - అనుట సంస్కృత ప్రాతివదికము గ్రహింపవలెననుటకు సూచన, (వర్ణాత్కారః - వా) క్వచిన్నామగ్రహేణైవ - అను నథర్వణ వచనమిట నను, సందేయము, కాఁగా ద్వితీయైకవచనాంతతుల్య ప్రాతివదికములను గ్రహించుట సూరిహృదయము కాదు "మతు ప్తకారమను కార ప్రత్యయముచేత సూరి హనుమత్ తకారమునకు అన విధించెనని తోఁచెడిని" (వజ్ఝల 7.11.59 లేఖ)

## విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు 75

స్త్రీలింగ త్వాతిదేశంబుచేత నుత్వడుజ్ఝులు లేవని యెఱుంగునది విశ్వకర్మ, కృష్ణవర్త్మ అశ్వత్థామ, యువ, యజ్వ ఇత్యాదులు

వ్యా విశ్వకర్మాదులగు పుంలింగ శబ్దములకు స్త్రీలింగత్వమగును స్త్రీలింగత్వము నతిదేశించుటచే - ఉత్వడుజ్ఝులు లేవు అతిదేశము = ఒక వస్తువు యొక్క ధర్మమును వేఱొక వస్తువునం దారోపించుట విశ్వకర్మాదులు పుంలింగములు వీనికి సూత్రముచే స్త్రీలింగ ధర్మ మారోపింపఁబడినది

విశ్వకర్మ - విశ్వకర్మా - ప్రాతిపదికము, ఇది 'విశ్వకర్మన్' అనుదాని ప్రథమైక వచనాంత తుల్య రూపము 54 చే - స్త్రీత్వమగును గనుక 21, 22 సూత్రములచే ఉత్వడుజ్ఝులు రావు ఏలయన ఉత్వడుజ్ఝులు పుంలింగములగు మహత్తులకే యగును ఇట స్త్రీలింగత్వమతిదేశించుటచేతఁ బుంలింగ మహద్వాచకములకు వచ్చు ఉత్వడుజ్ఝులిట రావు పదత్వసిద్ధికై యనుక్త న్యాయమున సుప్రత్యయము చేరును విశ్వకర్మ + సు 57 చే - సు లోపించి, విశ్వకర్మ అను రూప మేర్పడును ఇట్లే కృష్ణ వర్త్మా, అశ్వత్థామా, యువా, యజ్వా - అను ప్రథమైక వచనాంత తుల్య ప్రాతిపదికముల నుండి కృష్ణవర్త్మ అశ్వత్థామ, యువ, యజ్వ - అను వానిని సాధించుకొనవలెను విశ్వకర్మాదులు నకరాంతములు (విశ్వకర్మన్, కృష్ణవర్త్మన్, అశ్వత్థామన్, యువన్, యజ్వన్) కాన 67 సూత్రము వద్ద వివరించినట్లుగా నివి ప్రథమైక వచనాంత తుల్య ప్రాతిపదికములయినవి

విశే - యువ (కాశీ 3-243)

పార పరిశీలన - బాల వ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములలో అశ్వద్ధామ - అని తప్పు బడినది 21 సూ లోనిడిద్ధ - ఇట్టి స్ఖాలిత్యమే కావచ్చును "శ్యామరూపోయువావిద్వాన్ సుందరః ప్రియ దర్శనః సర్వశాస్త్రార్థ వేత్తాచ, డిత్థ ఇత్యభిధీయతే" క వ్యా సా "డిత్థడవిత్థాదయః - సా ద, రసగం, కాశిక-"

## మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వంబగు. 76

బ్రహ్మ ఈ శబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు తత్వ తపో వేదయోగ వాచకంబగునేని బ్రహ్మము నాఁబడు

వ్యా మహద్వాచకమయి, పుంలింగమయిన బ్రహ్మ శబ్దమునకు స్త్రీలింగ శబ్ద ధర్మమగును బ్రహ్మ - బ్రహ్మన్ - సంస్కృత శబ్దము బ్రహ్మ అను ప్రథమైక వచనాంత తుల్యము 67 చేఁ ప్రాతిపదికమగును 54 చే - బ్రహ్మ ఈ సూత్రముచే స్త్రీత్వము కలుగుటవలన 21, 22 సూత్రములచే ఉత్వ డుజ్ఞులు రావు అనుక్త న్యాయమున సు ప్రత్యయము చేరును బ్రహ్మ + సు 57 చే- సు లోపించి, బ్రహ్మ అను ప్రథమైక వచన మేర్పడును బ్రహ్మ = చతుర్ముఖుఁడు ఋత్విజుఁడు, విప్రుఁడునని యర్థములు తత్వము ( = పరమాత్మ) తపస్సు, వేదము, నను నర్థములలో బ్రహ్మ శబ్దము నపుంసకమగుటచే స్త్రీత్వము లేదు బ్రహ్మము అనియే రూప మేర్పడును బ్రహ్మ - ప్రాతిపదికము 39చే- బ్రహ్మము యోగమను నర్థమున బ్రహ్మ శబ్దము పుంలింగ మయినను నమహద్వాచకమగుటచే స్త్రీత్వము లేదు బ్రహ్మ 54 చే - బ్రహ్మ 39 చే - బ్రహ్మము

విశే - తత్వమను నర్థమున (పరమాత్మ) బ్రహ్మ శబ్దము మహద్వాచకమేకాని నపుంసక లింగమగుటచే ఉత్వడుజ్ఞులకు ప్రాప్తి లేదు (21, 22) 39 చే - మువర్ణకమే ప్రాప్తించును యోగమను నర్థమున బ్రహ్మ శబ్దము నపుంసకలింగమే కాని యమహద్వాచకమగుటచే, ఉత్వడుజ్ఞులు ప్రాప్తింపవు అమహద్వాచకమగుటచేత 39 చే - మువర్ణకమగును

పద సార్థక్యము - మహద్వాచకంబయి - అనుటచే, మహద్వాచకమయి పుంలింగమయిన బ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వము రాదు ఉదా॥ బ్రహ్మము = యోగము ఈ యర్థమున బ్రహ్మ శబ్దము పుంలింగము కాని యిది యమహద్వాచక మగుటచే స్త్రీత్వము కలుగదు కాన ము వర్ణకము లోపింపదు.

బ్రహ్మము - అను రూపమే యుండును (11) పుంలింగంబగు - అనుటచే - మహద్వాచకమయి పుంలింగము కాని బ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వము రాదు ఉదా॥ బ్రహ్మ = తత్వము అనఁగాఁ బరమాత్మ ఈ యర్థమున నిది మహద్వాచకమేకాని పుంలింగము కాదు ఇది నపుంసక లింగము కావున స్త్రీత్వమురాదు బ్రహ్మము - అనియే రూపముండును

పాఠ పరిశీలన - తత్వ - అని ప్రథమ ముద్రణ పాఠము దీనిని తత్త్వ- అని ద్విత్వతకారకముగఁ గొందఱు సవరించుట సరికాదు "తత్త్వ (త్వ)న తన- క్విప్ తతో భావః, తస్య భావోవా, త్వ, వా - తలోపః" (శబ్దస్తో)

**ఆత్మేమనిజంతంబులకు నాంతములగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు. 77**

ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు, మహిమ, మహిమము, అణిమ, అణిమము, గరిమ, గరిమము, లఘిమ, లఘిమము దేవశర్మ, దేవశర్ముఁడు

వ్యా ఆత్మన్ - అను శబ్దమునకు ఇమనిచ్ - అను ప్రత్యయ మంత మందుఁ గల శబ్దములకు, నకారాంతములగు మనుష్య నామములకు స్త్రీత్వము బహుళముగా నగును (1) ఆత్మన్ - అను శబ్దమునకు - ఆత్మ, ఆత్మము - ఆత్మా - అను ప్రథమైక వచనాంతతుల్యము 67 చే - ప్రాతిపదికమగును 54 చే - హ్రస్వము ఆత్మ అమహద్వాచకమగుచో, 19 చే మువర్ణకము ఆత్మ+ము స్త్రీత్వమగుచో, 57 చె ములోపమగును ఆత్మ - అని యేర్పడును స్త్రీత్వము కలుగనిచో - ఆత్మము ఇవి యమహద్వాచక రూపములు ఆత్మ, ఆత్ముఁడు - ఆత్మా - ప్రాతిపదికము 54చే - ఆత్మ ఇది మహద్వాచకమయి నను స్త్రీత్వ పక్షమున 21, 22 సూత్రములచే, ఉత్వ డుజ్జులు కలుగవు అనుక్తన్యాయమున, సుప్రత్యయము ఆత్మ + సు 57చే - సుణోపించి ఆత్మ- అగును స్త్రీత్వమురానిచో ఆత్మ, 21చే ఆత్ము 22చే - ఆత్ము + డుణ్ 19 చే - ఆత్ముఁడు, ఆత్ముండు ఇవి మహద్వాచక రూపములు, (2) ఇమనిజంతములకు ఇమనిచ్ + అంత = ఇమనిజంత ఇమనిచ్ - అను దానిలో ఇమన్ - అనునదే చేరును మహత్ + ఇమన్ = మహిమన్, అణు+ఇమన్= అణిమన్, గురు + ఇమన్ = గరిమన్ లఘు + ఇమన్ = లఘిమన్ ఇవి ఇమనిజంతములు, మహిమా, అణిమా, గరిమా - ప్రథమైకవచనాంతములు మహిమము, మహిమ - మహిమా - అను ప్రథమైకవచనాంతతుల్యము ప్రాతి

పదికమగును 54 చే - మహిమ 39 చే - మహిమ + ము ఈ 77చే - స్త్రీత్వము కలిగిన పక్షమున, 57 చే - ములోపించి మహిమ అగును స్త్రీత్వము కలుగనిచో, మహిమము - అని యుండును ఇట్లే, అణిమా, గరిమా, లఘిమా, యను ప్రథమైక వచనాంతతుల్య ప్రాతిపదికముల నుండి, అణిమము, అణిమ, గరిమము, గరిమ, లఘిమము, లఘిమ — అను రూపములను సాధించుకొన వలెను (3) నాంతములగు మనుజ సంజ్ఞలకు - దేవశర్మ, దేవశర్ముఁడు దేవ శర్మా-అను ప్రథమైక వచనాంతతుల్యము ప్రాతిపదికమగును ఇదే దేవశర్మన్— అనుదాని ప్రథమైకవచనాంతముతోఁ దుల్యము 54 చే — దేవశర్మ, స్త్రీత్వము కలిగిన 21, 22 సూత్రములచే, ఉత్వడుజ్లు కలుగవు అను క్తన్యాయమున సుప్రత్యయము చేరి దేవశర్మ + సు 57 చే - సు లోపించి దేవశర్మ స్త్రీత్వము కలుగని పక్షమున 21చే - దేవశర్ము - 22 చే - దేవశర్ము+డుజ్ 19 చే - దేవశర్ముఁడు, దేవశర్ముండు

## మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము

## రాజు నాఁబడు 78

రాజు ఖగరాజు అమహత్త్వంబు నందు రాజము, వృక్ష రాజము ఉపసర్జనత్త్వమునందు - హతరాజుఁడు పరశురాముఁడు

వ్యా మహత్త్వమున స్వార్థము ప్రధానమయినప్పుడు రాజశబ్దము ప్రథమైక వచనమున, రాజు - అగునని సూత్రార్థము ఇది - నిపాతసూత్రము నిపాతము = చూ 51 సూ రాజశబ్దము సామాన్య ప్రక్రియచే, రాజుఁడు — అని కావలసియున్నది రాజా - ప్రాతిపదికము 54చే- రాజ 21చే- రాజు 22చే- రాజు + డుజ్ 19చే—రాజుఁడు ఇట్లు సామాన్య ప్రక్రియచే రాజుఁడు- అగుచుండగా 'రాజు' అను ప్రథమైకవచనమీసూత్రమున నిర్దేశింపఁబడినది కాన, రాజు - అనునది ప్రథమైక వచనరూపమని గ్రహింపవలెను ఖగరాజ ప్రాతిపదికము ఇది తత్పురుషము- తత్పురుషాంతమున రాజన్ — అను శబ్దము, రాజ — అని నిల్చును (రాజాహస్సఖిభ్యష్టచ్- సి కౌ) కాన, ఖగరాజ ప్రాతి పదికము ఇట మహత్త్వము వివక్షింపఁబడినది రాజశబ్దము స్వార్థమునే బోధించు చున్నది కాన, ఖగరాజు - అను రూపమేర్పడును తత్పురుష ముత్తర పదార్థ ప్రధానము కావున, ఖగరాజు - అనుచో రాజశబ్దము స్వార్థమును దెలుపును స్వార్థము = తన యొక్క యర్థము అనఁగాఁ బ్రకృత్యర్థమన్న మాట మహత్త్వంబున—అనుటచే అమహత్త్వమున నీ నిపాతము చెల్లదు అమహత్త్వమున, రాజము, వృక్షరాజము - అను రూపము లేర్పడును రాజ్యము - రాజా-ప్రాతి

పదికము 54 చే - రాజ 39 చే - రాజము- వృష రాజము - వృషరాజ-ప్రాతి పదికము 39 చే - వృషరాజము ఉపసర్జనత్వము = అప్రధానత్వము రాజ శబ్దముయొక్క యర్థమే ప్రధానముకానప్పుడు, రాజా-అను నిపాతము చెల్లదు ఏలయన స్వార్థపరంబగు రాజశబ్దమేరాజా-అని నిపతింపఁబడెను బహువ్రీహిలో రాజశబ్ద మప్రధానమగును ఏలయన, బహువ్రీహి యన్యపదార్థ ప్రధానము- ఉదా॥ హతరాజుఁడు పరశురాముఁడు హతరాజుఁడు = చంపబడిన రాజులు గలవాఁడు ఇట రాజశబ్దముయొక్క యర్థ మప్రధానమయినది కాన రాజా-అని- కాదు రాజుఁడు-అనియే యగును హతరాజుఁడు - హతరాజా-ప్రాతిపదికము 54 చే - హతరాజ 21 చే - హతరాజు 22 చే - హతరాజు + డుఙ్ 19 చే - హతరాజుఁడు

విశే - (i) రాజా ప్రాతిపదిక నిపాతమని కొందఱు సెలవిచ్చుట సరి కాదు ఏలయన- (i) సామాన్య ప్రక్రియచేతనే సిద్ధించు రూపమును నిర్దేశించుట నిపాత లక్షణమునకే విరుద్ధము (ii) రాజు + డుఙ్ - అనుచోఁ బ్రథమైక వచన లోపమునకు దారి లేదు కాన నిది ప్రాతిపదిక నిపాతముగ నుద్దిష్టము కాదు (iii) నిపాత విధానము వ్యర్థమై ప్రథమైక వచన లోపమున కుపలక్షణ మగునని కొందఱనుట గ్రాహ్యము కాదు ఏలయన, (1) సూత్రములో నేదే నొక పదము వ్యర్థమగుట యుండును గాని సూత్రమే వ్యర్థమగుట శాస్త్ర సంప్రదాయ విరుద్ధము (2) ప్రథమాంత నిపాత పక్షమున సూత్రము వ్యర్థము కాదు నిపాతములెల్లఁ బ్రాతిపదికములనుట భ్రమ గాని ప్రమ కాదు ఉభయములు నగుట పాణినీయ ప్రసిద్ధము ఇతర విభక్త్యంతముల ప్రక్రియ రాజా - ప్రాతి పదికము 54 చే - రాజ 21 చే - రాజు 2 చే - రాజు + ను రాజశబ్దము డుమంతము కాదు ఏలయన నిది ప్రథమలో రాజు-అగునని నిపతింపఁబడినది కాన, 23 చే - నిగాగమము రాదు రాజు + ను = రాజును ఇట్లే రాజుచేత- ఇత్యాదులు ఇట్లు ప్రథమాంత నిపాతముతోనే యితర విభక్త్యంతములు సామాన్య ప్రక్రియచే, సిద్ధించుచుండుటచే నిది ప్రథమాంత నిపాతనునియే సూరి యాశయమనుట స్పష్టము చూ 82

**జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు. 79**

జగము, జగత్తు, ఇంద్రజి, ఇంద్రజిత్తు, ఋత్విగాది యగుటం జేసి యింద్రజితుండనియు వాడంబడు

వ్యా జగత్ - అను శబ్దము యొక్కయు, ఇంద్రజిత్ - అను శబ్దము

యొక్కయు, తకారమునకు లోపము విభాష నగును జగము, జగత్తు - జగత్ అను ప్రథమైక వచనాంత తుల్యము 67 చేఁ బ్రాతిపదికమగును ఈ 79 చే- తకారము (త్) లోపించినచో, జగ - అగును 39 చే - జగము - అని యేర్పడును తకారము లోపింపనిచో జగత్ - 68 చే - జగత్తు అగును 48చే జగత్తు + వు 44 చే - వు లోపించి జగత్తు - అని యేర్పడును ఇంద్రజి, ఇంద్రజిత్తు ఇంద్రజిత్-అను ప్రథమైకవచనాంత తుల్యము 67 చే - ప్రాతిపదిక మగును ఈ 79 చే-తకారము లోపించిన ఇంద్రజి-అగును 22 చే-ఇంద్రజి+ డుఙ్ 44 చే - డుఙ్లు లోపించి, ఇంద్రజి యనునది సిద్ధించును తకారము లోపింపనిచో - ఇంద్రజిత్ 68 చే - ఇంద్రజిత్తు 22 చే - ఇంద్రజిత్తు+డుఙ్ 44 చే- డుఙ్లు లోపించి, ఇంద్రజిత్తు - అగును ఇంద్రజితుఁడు - ఇంద్రజిత్ - అను శబ్దము ఋత్విగాదులలోనిది (73) కావున ఇంద్రజితమ్ - అను ద్వితీయైక వచనాంత తుల్యమొక పక్షమునఁ బ్రాతిపదిక మగును 71 చే - మకారము లోపించును ఇంద్రజిత 21 చే - ఇంద్రజితు 22 చే - ఇంద్రజితు+డుఙ్ 19 చే - ఇంద్రజితుఁడు, ఇంద్రజితుండు

విశే - జగత్తు (రామా 8-128)

## సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు. 80

ఉరము, ఉరస్సు, వక్షము, వక్షస్సు, అర్చి, అర్చిస్సు, ధనువు, ధనుస్సు, ఆయువు, ఆయుస్సు బహుళ గ్రహణంబునం జేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబు లేదు పయస్సు, వయస్సు, సరస్సు

వ్యా సకారాంత శబ్దముల తుది సకారమునకు లోపము బహుళముగా నగును "తుది సకారంబునకు" అనుటచే ప్రథమైక వచనాంతతుల్యము నందలి తుది విసర్గమును సకారముగ మార్చి ప్రాతిపదికము చేయవలెనని గ్రహింప వలెను ఉరః = ఉరస్, వక్షః = వక్షస్, అర్చి = అర్చిస్, ధనుః = ధనుస్, ఆయుః = ఆయుస్ మొ॥ ఉరము, ఉరస్సు, - ఉరశ్శబ్దము యొక్క ప్రథమైక వచనాంత తుల్యము ఉరః - అని యుండును విసర్గను, సకారముగా మార్పఁగా ఉరస్ - అను ప్రథమైక వచనాంతతుల్యము ప్రాతిపదిక మగును ఈ 80 చే - సకారము లోపించినచో, ఉర - అగును 39 చే - ఉరము - అను రూపము సిద్ధించును సకారము లోపింపని పక్షమున, ఉరస్ 68 చే - ఉరస్సు -

అగును 48 చే - ఉరస్సు+వు 44 చే - వు - లోపించి, ఉరస్సు - అను ప్రథమైక వచనము సిద్ధించును ఇట్లే వక్షము, వక్షస్సు, అర్చి, అర్చిస్సు - అర్చిస్ అను ప్రథమైక వచనాంతతుల్యము ప్రాతిపదికము ఈ 80 చే - అర్చి. అనుక్త న్యాయమున, సు ప్రత్యయము చేరి - అర్చి+సు - అగును 44 చే - సు లోపించి అర్చి - అను రూపమేర్పడును ధనువు, ధనుస్సు - ధనుస్ - అను ప్రథమైక వచనాంత తుల్యము ప్రాతిపదికము ఈ 80 చే - స లోపమయినచో, ధను 48 చే - ధనువు స లోపము కానిచో - ధనుస్ - 68 చే - ధనుస్సు 48 చే - ధనుస్సు+వు 44 చే - ధనుస్సు - అను రూపము సిద్ధించును ఇట్లే ఆయుస్ - అను ప్రథమైక వచనాం త తుల్య ప్రాతిపదికమునుండి ఆయువు ఆయుస్సు - అను వానిని సాధించుకొనవలెను

బహుళమనుటచేఁ బయః ప్రభృతుల సకారమునకు లోపము లేదు పయః = పయస్, వయః = వయస్, సరః = సరస్, వయస్సు - వయస్ - అను ప్రథమైక వచనాంతతుల్యము ప్రాతిపదికము బహుళ గ్రహణముచే' స' లోపములేదు కాన 68 చే – పయస్సు, 48 చే - వయస్సు + వు 44 చే వయస్సు - ఏర్పడును ఇట్లే, వయస్సు, సరస్సు - అనునవి యేర్పడును

విశే - తుదిసకారంబునకు - అన్నది సంస్కృత ప్రాతిపదికమును గ్రహింపవలెననుటకు సూచన యనికొందఱు సెలవిచ్చుట యనాలోచితము ఎట్లన (I) సకారాంతముల ప్రక్రియ చింతా మణ్యను సారిగావున దీనితో సంస్కృత ప్రాతిపదిక గ్రహణము గ్రంథప్రణాళికకే విరుద్ధము (II) విసర్గమును సకారముగా మార్పవలెనన్నదే మూలానుగుణమగునర్థము 'అత్రప్రథమైక వచన తుల్యత్వేపి విసర్గస్యద్విత్వా భావా త్తత్ స్థానినఃసకారస్యైవ గ్రహణమ్" (అహో) మూలవిరుద్ధార్థ ముద్దిష్టమేని సూరిసందేహమున కెడములేకుండ వివరింపియే యుండును (III) 68చే - ఉగాగమ ద్విత్వములు ప్రథమైకవచనాంతతుల్యము లకే కలుగును, సంస్కృత ప్రాతిపదికములకుఁ గలుగవు ఇది సూత్రముల పౌర్వాపర్యముచే స్పష్టము (IV) అనాదేశ విధానము (74సూ) సూరి సొంతము అదియథర్వణానుసారి దానితో సాంతముల ప్రక్రియకు సామ్యములేదు.

## మహద్వాచకంబులగు సాంతంబుల కంత లోపంబేని ద్వితీయైక వచనాంత తుల్యత్వంబేనగు. 81

అంగిరుఁడు, అంగిరసుఁడు, ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు, ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు, ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వరేతసుఁడు

వ్యా మహద్వాచకములయిన, సకారాంత శబ్దములకు నంత్యవర్ణ లోపము

గాని యదిరానివక్షమున ద్వితీయైక వచనాంతతుల్యతగాని యగును అంగిరుఁడు - అఙ్గిరస్-అనుదాని ప్రథమైకవచనాంతము, అఙ్గిరాః - అనునది 80 సూత్రమున, తుది సకారంబునకు - అనుటచే విసర్గను సకారముగ మార్ప వలెను వర్గపంచమమునకు నిర్దేశానుసారముగ బిందువగును కాన, అంగిరాస్- అను ప్రథమైకవచనాంతతుల్యము 67 చేఁ బ్రాతిపదికమగును ఈ 81 చే - తుది వర్ణము లోపించి, అంగిరా - అగును 54చే- అంగిర 21 చే - అంగిరు 22 చే - అంగిరు+డుఙ్ 19 చే-అంగిరుఁడు, అంగిరుండు అంగిరసుఁడు - అఙ్గిరసమ్ - ద్వితీయైకవచనాంతము ఈ 81 చే - అంగిరసమ్ - అను ద్వితీయైక వచనాంతతుల్యము ప్రాతిపదికమగును 71 చే - అంగిరస, 21 చే అంగిరసు 22 చే - అంగిరసు+డుఙ్ 19 చే-అంగిరసుఁడు, అంగిరసుండు ఇట్లే, ఉగ్రశ్రవాస్, ప్రచేతాస్, ఊర్ధ్వరేతాస్ - అను ప్రథమైకవచనాంతతుల్యముల నుండి ఉగ్రశ్రవుఁడు, ప్రచేతుఁడు, ఊర్ధ్వరేతుఁడు - అనురూపములను సాధించుకొనవలెను ఉగ్రశ్రవసమ్, ప్రచేతసమ్, ఊర్ధ్వరేతసమ్ - అను ద్వితీయైక వచనాంతతుల్య ప్రాతిపదికములనుండి ఉగ్రశ్రవసుఁడు, ప్రచేతసుఁడు, ఊర్ధ్వరేతసుఁడు - అను రూపములను సాధించుకొనవలయును

విశే - కొందఱు, అంగిరస్, ఉగ్రశ్రవస్, ప్రచేతస్, ఊర్ధ్వరేతస్ - అను సంస్కృత ప్రాతిపదికములను గ్రహింపవలెనందురు కాని యది సూరి హృదయము కాదు చూ 80 వ్యాఖ్య

## వేధ పురోధ పురోధసుఁడు. 82

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధ శ్శబ్దమునకు వైకల్పికముగా సలోప త్రివద్భావంబులు దీనిచే నిపతింపంబడియె

వ్యా వేద శ్శబ్దమునకు నిత్యముగా సలోప త్రి వద్భావములగుననియుఁ బురోధ శ్శబ్దమునకు వైకల్పికముగా సలోప త్రివద్భావములగుననియు నీ నిపాత సూత్రమున కర్థము వేధ - వేధాస్ - ప్రాతిపదికము 81 చే - వేధా 54 చే- వేధ దీనికి 21 చే - ఉత్వము 22 చే - డుజ్ఞు కలిగి, వేదుఁడు, వేదుండు అను రూపములు సామాన్య ప్రక్రియచే సిద్ధించుచుండఁగా, సలోప త్రివద్భావములు నిత్యముగ నిపతింపఁబడెను త్రివద్భావము కలుగుటచే దీనికి, ఉత్వడుజ్ఞులు లేవు పదత్వసిద్ధికై యనుక్తన్యాయమున 'సు' ప్రత్యయము నిల్చును వేధ + సు 57 చే - సు, లోపించి వేధ - అను ప్రథమైక వచన మేర్పడును పురోధ - పురోధాస్ - ప్రాతిపదికము 81 చే - సకార లోపము పురోధా 54 చే -పురోధ ఈ 82చే - త్రివద్భావము కలుగుటచే, ఉత్వ డుజ్ఞులు రావు (21, 22) పదత్వ

సిద్ధికై యనుక్త న్యాయమున 'సు' ప్రత్యయము నిల్చును పురోధ + సు 57 చే - సు లోపించి, పురోధ - అను ప్రథమైక వచనము సిద్ధించును సలోప స్త్రీవద్భావములు, పురోధ శబ్దమునకు వైకల్పికముగ నిపతింపఁబడెను కావున, పురోధసుఁడు - అనియు నుండును పురోధసుఁడు - 70 చే పురోధసమ్ ప్రాతిపదికము 71 చే పురోధస 21 చే - పురోధసు 22 చే - పురోధసు + డుజ్, 19 చే - పురోధసుఁడు, పురోధసుండు

విశే - (1) 81 చే - మహద్వాచకములగు సాంతముల కంతలోపము గాని, యది రానిపక్షమున, ద్వితీయైక వచనాంత తుల్యతగాని యగును అనఁగా నంత లోపము వైకల్పికముగ నగుననియు, నది రానిపక్షమున ద్వితీయైక వచనాంత తుల్యత యగుననియుఁ దాత్పర్యము వేధ శబ్దమునకు 81 చే - అనఁగా సామాన్య ప్రక్రియచే, సలోపము వైకల్పికము అది రాని పక్షమున ద్వితీయైక వచనాంత తుల్యత యగును ఇట, సలోపము, స్త్రీవద్భావము నిత్యముగ నిపతింపఁబడెను సలోపము నిత్యమని నిపతించుట - ద్వితీయైకవచనాంత తుల్యత దీనికిఁ గలుగనేరదు కావున, వేధ - అను రూపమొకటి మాత్రమే యేర్పడును పురోధ శబ్దమునకు, సలోపమును స్త్రీవద్భావమును వైకల్పికముగ నిపతింపఁబడెను సలోప స్త్రీవద్భావములు కలిగిన పక్షమున, పురోధ - అను రూపమేర్పడును సలోపము కాని పక్షమున ద్వితీయైక వచనాంత తుల్యత సిద్ధించును గావున పురోధసుఁడు - అను రూప మేర్పడును కాఁగా వేధ, పురోధ, పురోధసుఁడు - అని ప్రథమాంతములు నిర్దిష్టము లయ్యెను సూత్రములలో లింగ వచన వివక్ష లేకుండుట శాస్త్రసంప్రదాయము ("సూత్రే లింగ వచన మతంత్రమ్" పరిభా) కావునఁ దక్కిన విభక్త్యంతములు నైత మేర్పడును ఉదా॥ వేధాస్ 81 చే - వేధా, 54 చే - వేధ స్త్రీవద్భావము నిపతించుటచే - 21 చే ఉత్వము రాదు 2 చే - వేధ + ను = వేధను ఇత్యాది ఇట్లే, పురోధాస్ 81 చే - పురోధా 54 చే - పురోధ 2 చే - పురోధను పురోధసమ్ 71 చే - పురోధస 21 చే - పురోధసు 2 చే - పురోధసు + ను 23 చే - పురోధసుని + ను 26 చే-పురోధసునిని పురోధస్సు+ను 25 చే-పురోధసుని మొ॥ (11) కొందఱు వేధస్, పురోధస్-అను సంస్కృత ప్రాతిపదికములే ప్రాతిపదికములగుననుట సరికాదు (80 సూ) (111) వేధపురోధలు ప్రాతిపదిక నిపాతములను మత మగ్రాహ్యము సామాన్య ప్రక్రియచేతనే సిద్ధించు రూపములను నిపాతములనుట పొరపాటు పురోధసుండు - అను ప్రథమాంత సాహచర్యము చేతను, పురోధ - ప్రథమాంతమనుట స్పష్టము

## మనః ప్రభృతుల సకారంబునకు ద్విత్వంబు విభాషనగు. 83

మనసు, మనస్సు, శిరసు, శిరస్సు, సదసు, సదస్సు సలోపం బయ్యేనేని, మనము, శిరము, సదము

వ్యా మనశ్శబ్దము మున్నగు వాని సకారమునకు ద్విత్వము విభాషన గును సకారంబునకు - అనుటచే విసర్గమును సకారముగ మార్చవలెను మనః- మనశ్శబ్దము యొక్క ప్రథమైక వచనాంతము విసర్గమును సకారముగ మార్చఁగా, మనస్ - అగును ఇట్లే - శిరః = శిరస్, సదః = సదస్ - అని మార్చవలెను మనసు - మనస్ - అను ప్రథమైక వచనాంత తుల్యము 67 చేఁ బ్రాతిపదిక మగును 68 చే ఉగాగమమును ద్విత్వమును దుది హల్లున కగుచుండఁగా నిత్యముగఁ బ్రాప్తించు ద్విత్వము విభాషఁగునని యీ సూత్ర మునఁ జెప్పఁబడెను కాన ఉగాగమ ద్విత్వములలో, నొక్క ఉగాగమము మాత్రమేయయి, ద్విత్వము కాని పక్షమున - మనస్ + ఉ = మనసు అగును 48 చే - మనసు + వు 44 చే - వు వర్ణకము లోపించి, మనసు - అను ప్రథమైక వచన మేర్పడును మనస్సు - ద్విత్వము విభాషననగుటచే, ఉగాగమ ద్విత్వములు రెండును గలుగఁగా, మనస్స్ + ఉ = మనస్సు - అగును 48 చే - మనస్సు + వు 44 చే మనస్సు - అను రూపము సిద్ధించును పక్షమున - మనసు ఇట్లే శిరస్, సదస్, అను ప్రథమైక వచనాంత తుల్య ప్రాతి పదికముల నుండి, శిరసు, శిరస్సు, సదసు, సదస్సు-అను రూపము లేర్పడును 80 చే - తుది సకారములు లోపించినచో మనస్ = మన, శిరస్ = శిర, సదస్ = సద - అని నిల్చును 39 చే - మనము, శిరము, సదము - అను రూపములు సిద్ధించును

విశే - (1) కొందఱు, మనస్, శిరస్, సదస్ అను సంస్కృత ప్రాతి పదికములనే గ్రహింపవలె నందురు కాని యది సరికాదు చూ 80 (11)ఇందలి విభాష ప్రాప్త భాష

## ద్యు హృచ్ఛబ్దంబులకు దివి హృది యగు. 84

దివి, దివులు, హృది, హృదులు.

వ్యా దివ్ - అను శబ్దమునకు, దివి యనియు, హృద్ - అను శబ్దము నకు, హృది యనియు నాదేశములగునని యీనిపాతమున కర్థము ద్యౌ, హృత్తు - అను రూపము లేర్పడుచుండఁగా నివి నిపతింపఁబడెను దివ్ - అను శబ్దము సమాసమున ద్యు శబ్దముగ మాఱును దివ్ హృద్ + శబ్ది = ద్యుహృ

వృద్ధము నిపాతము = చూ 51 వ్యాఖ్య దివి - ప్రాతి పదికము దివి - అనుక్త న్యాయమున సు ప్రత్యయము చేరి, దివి + సు - అగును 44 చే - సు లోపించి దివి అను ప్రథమైక వచన మేర్పడును దివులు - దివి - ప్రాతి పదికము 12చే - దివి+లు 45 చే - దివులు అగును ఇట్లే, హృది+సు= హృది, హృది + లు = హృదులు - అని ప్రక్రియ నరయవలెను

విశే - హృది (ఉ హ 3.81)

## స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు. 85

| నామము | స్త్రీ ప్రత్యయాంతము | తత్సమము |
|---|---|---|
| కర్తృ | కర్త్రీ | కర్త్రి |
| జనయితృ | జనయిత్రీ | జనయిత్రి |
| భాగ్యశాలిన్ | భాగ్యశాలినీ | భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | బుద్ధిశాలినీ | బుద్ధిశాలిని |
| మతిమత్ | మతిమతీ | మతిమతి |
| గుణవత్ | గుణవతీ | గుణవతి |
| విద్వస్ | విదుషీ | విదుషి |
| వనజముఖ | వనజముఖీ | వనజముఖి |
| | వనజముఖా | వనజముఖ |
| మీన నేత్ర | మీన నేత్రా | మీన నేత్ర |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీ ప్రత్యయంబులేమింజేసి, మీననేత్రి, పద్మనేత్రి - ఇత్యాదు లసాధువులు

వ్యా స్త్రీ లింగ శబ్దము లన్నియుఁ దమకు నియతమములైన యా యా స్త్రీ ప్రత్యయములను గూడి తెనుఁగున వ్యవహరింపఁబడును కర్త్రీ - కర్తృ ప్రాతివదికము - కర్తృ శబ్దముపై జీప్ అను స్త్రీ ప్రత్యయము చేరి, కర్త్రీ - అను స్త్రీ ప్రత్యయాంత మేర్పడును (స్త్రీ ప్రత్యయాంతస్యతు నామత్వమ్-ల మ) 54 చే - కర్త్రీ - అనుక్త న్యాయమున సు ప్రత్యయము నిల్చును కర్త్రీ+సు 44 చే సు లోపించి కర్త్రి - అను ప్రథమైక వచన మేర్పడును ఇట్లే, జనయిత్రీ, భాగ్యశాలినీ, బుద్ధిశాలినీ, మతిమతీ, గుణవతీ, [illegible] (విద్వస్+జీప్ [illegible] విదుష్+జీప్ విదుషి) వనజముఖీ (వనజముఖ + [illegible]) అను ప్రాతిపదికము[illegible] నుండి, జనయిత్రి, భాగ్యశాలిని, బుద్ధిశాలిని, మతిమతి, గుణవతి, విదుషి, వనజ[illegible]

ముఖి అను రూపము లేర్పడును వనజముఖా - అను స్త్రీ ప్రత్యయాంతమును గలదు (వనజముఖ + టాప్) వనజముఖా - ప్రాతిపదికము 54 చే - వనజ ముఖ 39 చే - వనజ ముఖ + ము 57 చే - మువర్ణకము లోపించి వనజ ముఖ - అను రూప మేర్పడును ఇట్లే మీన నేత్రా - అను స్త్రీ ప్రత్యయాంతము నుండి మీన నేత్ర అను రూపమును సాధించుకొనవలయును మీననేత్ర అను నది సంయోగ ముపధగా గల శబ్దము ఉపధ = తుది వర్ణమునకు ముందు వర్ణము సంయోగమ్ము = అచ్చులతో వ్యవధానము (ఎడము) లేని హల్లుల (= పొల్లు హల్లుల) కూడిక (అజ్భిరవ్యవహితాహలః సంయోగ సంజ్ఞాః స్యుః - సి కౌ ) త్ర - అనుచో (త్ + ర్ + అ) తకారరేఫద్వయము (= త్ర్) - ఉపధ (ద్వయోరపి సంయోగ సంజ్ఞా లభ్యతే - బాలమ) కాన, మీన నేత్ర శబ్దము సంయోగ ముపధగాఁగల శబ్దమయినది అంగాదులకుఁదప్ప సంయోగ ముపధగాఁ గల వానికి జీ ప్రత్యయము లేదు జీ = ఈ, అంగ శబ్దము సంస్కృతమున అఙ్గ అని వర్గ పంచమముతో వ్రాయఁబడును కాన నది సంయోగోపధమగును (అఙ్ గ్ + అ) అంగాదులలో నేత్ర శబ్దము లేదుగనుక ఈ నేత్ర శబ్దమునకు జీష్(=జీ) అను స్త్రీ ప్రత్యయము రాదు టాప్-అను స్త్రీ ప్రత్యయము మాత్రమే యగును కాన, మీన నేత్రా, పద్మ నేత్రా అను స్త్రీ ప్రత్యయాంతములు మాత్రమే సంస్కృతమున నేర్పడును వీని నుండి మీన నేత్ర, పద్మ నేత్ర - అను తత్సమములు సిద్దించును సంస్కృత లక్షణముచే - మీన నేత్రీ, పద్మనేత్రీ యను స్త్రీ ప్రత్యయాంతము లుండవు గనుక, మీన నేత్రి పద్మ నేత్రి మొదలగు తత్సమము లసాధువులు

విశే - (I) నాసికోదర రోష్ఠ జఙ్ఘా దన్త కర్ణ శృఙ్గాచ్చ - అను పాణినీయముచే సంయోగోపధలతో - ఓష్ఠాదులకు జీష్ ప్రత్యయమగును అంగాదులకును జీష్ ప్రత్యయమగునని వృత్తివాక్యము కానియందు నేత్ర శబ్దములేదు కాన మీననేత్రి, పద్మనేత్రి - అపాణినీయములగును (II) వృత్తివాక్యమే సమ్మతముకాదని భట్టోజీ దీక్షితులు "అత్రవృత్తిః - అంగగాత్ర కంఠేభ్యో వక్తవ్యమ్ చకారేణ సంగ్రాహ్యమితికేచిత్ భాష్యా ద్యనుక్తత్వా ద ప్రమాణమ్ - ఇతి ప్రామాణికాః" (సి కౌ ) వృత్తి వాక్యము సూరికి సమ్మతమే కావుననే, ఓష్ఠాదుల కనక, అంగాదుల కనుట

పాఠపరిశీలన - కొన్ని ప్రతులలో జీ ప్రత్యయమనియుఁ గొన్నింట జీప్రత్యయమనియు ప్రవరణలు కనఁబడును. ఇవి సరికావు జీ ప్రత్యయము - అను ప్రథమ ముద్రణ పాఠమే గ్రాహ్యము. (వ్యా సం స) జీప్ - అను ప్రవరణ తప్పు

## మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాషనగు. 86

పద్మలత మనోహారి, పద్మలత మనోహారిణి హృద్యంబగు విద్య, హృద్యయగు విద్య మొదవులలోఁ గపిల వరిష్ఠంబు, కపిల వరిష్ఠ

వ్యా స్త్రీవాచకములుకాని, స్త్రీలింగ శబ్దముల విశేషణములకుఁ గ్లీబత్వము విభాషనగును మహతీవాచకములు = స్త్రీవాచకములు స్త్రీలను బోధించు శబ్దములు క్లీబత్వము = నపుంసకత్వము, నపుంసకలింగ ధర్మము ఉదా॥ (1) పద్మలత మనోహారి ఇట లతాశబ్దము స్త్రీలింగమే కాని స్త్రీవాచకము కాదు కావున దీని విశేషణమునకుఁ గ్లీబత్వము కలిగినచో, పద్మలతమనోహారి - అగును లత - స్త్రీలింగము మనోహారి - అను విశేషణము క్లీబము క్లీబత్వము రాని పక్షమున, పద్మలత మనోహారిణి - అగును లత - స్త్రీలింగము మనోహారిణి - స్త్రీలింగ విశేషణము (మనోహారిన్ + ఙీప్ = మనోహారిణీ మనోహారిణి - 85 సూ) (2) హృద్యంబగు విద్య విద్య - స్త్రీలింగము, స్త్రీవాచకము కాదు కాన దీని విశేషణమునకుఁ గ్లీబత్వము కలిగినచో హృద్యంబగు విద్య - అగును హృద్యంబు-క్లీబవిశేషణము క్లీబత్వము కాని పక్షమున, హృద్యయగు విద్య - అగును విద్య-స్త్రీలింగము, హృద్య-స్త్రీలింగ విశేషణము (3) మొదవులలోఁ గపిల వరిష్ఠంబు కపిల-స్త్రీలింగము స్త్రీవాచకముకాదు కాన, వరిష్ఠంబు-అని క్లీబ విశేషణమయినది క్లీబత్వము కానిచో-కపిల వరిష్ఠ - అని యగును కపిల - స్త్రీలింగము వరిష్ఠ - స్త్రీలింగ విశేషణము

విశే - (1) కారక 19 చే - విశేష్యమున కగు లింగవిభక్తి వచనములు విశేషణమున కగును కనుక స్త్రీవాచకములు కాని స్త్రీలింగముల విశేషణములకుఁ గ్లీబతుల్యత విభాషనగునని యిట సూత్రింపబడెను మనోహారీ, మనోహారిణీ హృద్యా, వరిష్ఠా, అనునవి 54 చే - మనోహారి, మనోహారిణి, హృద్య వరిష్ఠ - అని యగును మనోహారి, మనోహారిణి - అను వానిపై 'సు' ప్రత్యయము చేరి 44 చే - లోపించును హృద్య, వరిష్ఠ - అను వానిపై 39 చే - మువర్ణకము చేరి 57 చే - లోపించును హృద్య, వరిష్ఠ, అనువానికి, 39 చే - మువర్ణకము చేరి, హృద్యము, వరిష్ఠము-అను రూపములేర్పడును (11) మొదవులలో నెల్లఁ గపిల మొదవు వరిష్ఠంబు - (అ మ 3 - 19) అను ప్రయోగము లక్ష్యానుకూలముగ మార్చి యుదాహరింపఁబడినది

పదసార్థక్యము - మహతీతరంబులగు - అనుటచే మహతీవాచకములగు స్త్రీలింగముల విశేషణములకుఁ గ్లీబత్వ మీ సూత్రముచే సిద్ధింపదు ఉదా॥ కాంతమనోహారిణి కాంతాశబ్దము స్త్రీలింగము, మహతీ (స్త్రీ) వాచకము కాన దీని విశేషణమునకుఁ గ్లీబత్వము కాదు

## భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు. 87

భవదాదులగు హలంత సర్వనామంబులకును, శతృరేఫాంతాదులకును దెనుఁగు భాషయందు వ్యవహారంబు లేదని యర్థము. సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు భవద్గుణంబులు, త్వదాశ్రయము, మత్పుణ్యము, లసద్రూపము, భవిష్యత్కాలము, ధూర్వహము ఇత్యాదులెఱుంగునది

ఇది తత్సమ పరిచ్ఛేదము

వ్యా భవత్-మొదలగు హలంత సర్వనామములకు, శతృ ప్రత్యయాంతములు మొదలగువానికిఁ దత్సమరూపమునఁ బ్రయోగములేదని యర్థము భవత్ + శతృ + ఆది = భవచ్ఛత్రాది ఆదిపదముచే రేఫాంతములు మొదలగు వానికిఁ దత్సమ రూపమునఁ బ్రవేశములేదని సూరి వివరణమును బట్టి స్పష్టము భవత్, త్వత్, మత్ - అనునవి హలంత సర్వనామములు లసత్, భవిష్యత్ - అనునవి శత్రంతములు ధూర్ - రేఫాంతము వీనికి 68 చే ఉగాగమ ద్విత్వములు ప్రాప్తించుచుండఁగాఁ దత్సమ రూపమున వీనికిఁ బ్రవేశము లేదని యిట నిషేధింపఁబడెను ఇవి సమాస పూర్వావయవములై యుండి తెనుఁగునఁ బ్రయోగింపఁబడును ఉదా॥ భవద్గుణంబులు, త్వదాశ్రయము, మత్పుణ్యము, లసద్రూపము, (ఒప్పుచున్న రూపము) భవిష్యత్కాలము, (రానున్నకాలము) ధూర్వహము ఇట్టివి సమాసములతోఁ బూర్వావయవములయి యుండి తెనుఁగున వాడఁబడును

విశే - భవద్గుణ, త్వదాశ్రయ, మత్పుణ్య, లసద్రూప, భవిష్యత్కాల, ధూర్వహ - అను సిద్ధసమాసములనుండి, భవద్గుణంబులు, త్వదాశ్రయము, మత్పుణ్యము, లసద్రూపము, భవిష్యత్కాలము, ధూర్వహము నను రూపములను సాధించుకొనవలెను

ఇది ఘంటాపథము

# ఆచ్ఛిక పరిచ్ఛేదము



## సంస్కృత సమేతరంబయిన యీ భాష యచ్ఛ యనంబడు. 1

స్పష్టము

వ్యా సంస్కృతసమము కంటె భిన్నమయిన యీ చెప్పంబోవు భాష యచ్ఛ యనంబడును ఆచ్ఛికమనియు, నచ్చతెనుఁగనియు నీ భాషను వ్యవహరింతురు సంస్కృత సమము మున్నగు భేదములు సంజ్ఞాపరిచ్ఛేదమున సోదాహరణముగఁ దెలుపఁబడినవి కాన స్పష్టమని సూరి తెలిపెను సంస్కృత సమేతరమయిన భాష (1) ప్రాకృతసమము — అగ్నిః-అగ్గి-అగ్గి మొ॥ (సంజ్ఞా 19) (2) సంస్కృత భవము — ఆకాశః- ఆకసము మొ॥ (సంజ్ఞా 20) (3) ప్రాకృతభవము — అఙ్గారః - ఇంగాలో-ఇంగలము మొ॥ (సంజ్ఞా 20) (4) దేశ్యము — ఊరు, పేరు, మొ॥ (సంజ్ఞా 21)

## ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుఁ, గ్లీబ సమంబులయి యుండు. 2

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును, గ్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది అన్న, మిన్న, అద్ద, గద్ద, జాణ, గాణ, ఓడ, గోడ ఇత్యాదులు స్త్రీసమంబులు. బియ్యము, నెయ్యము, అల్లము, మొల్లము, సున్నము, నన్నము, ఇత్యాదులు క్లీబసమంబులు. తఱుచుగ ననుటచేఁ బుంలింగ తుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము కొమరుఁడు, చందురుఁడు, జముఁడు, కందుఁడు— ఇత్యాదులు

వ్యా అచ్చతెనుఁగు శబ్దములన్నియుఁ దఱుచుగా స్త్రీసమములు, క్లీబసమములు నగును (1) స్త్రీసమత్వము నతిదేశించుటచేఁ బ్రథమైకవచన లోపము

మొదలగునవి యగును అతిదేశము=ఒక వస్తువుయొక్క ధర్మమును వేఱొక వస్తువుపై నారోపించుట స్త్రీసమత్వము=స్త్రీలింగసమత్వము స్త్రీలింగ శబ్దములు సంస్కృత సమము లగునప్పుడు ప్రథమైకవచనము లోపించును ఉదా॥ రమ, లక్ష్మి - మొ॥ ఈ స్త్రీలింగ శబ్దధర్మము కొన్ని యచ్చతెనుఁగు శబ్దములపై నారోపింపఁబడినది అట్టి శబ్దములకుఁ బ్రథమైకవచనము లోపించును ఉదా॥ అన్న, మిన్న అద్ద, గద్ద, జాణ, గాణ, ఓడ, గోద మొ॥ వీనిని స్త్రీసమము లందురు స్త్రీలింగ శబ్దములకుఁ బ్రథమైకవచనము లోపించునట్లు, వీనికిని బ్రథమైకవచనము లోపించుటచే నివి స్త్రీసమములయినవి కాఁగాఁ బ్రథమైక వచనములు లోపించిన యచ్చ తెనుఁగు శబ్దములు స్త్రీసమములని తాత్పర్యము (2) క్లీబసమత్వము నతిదేశించుటచే మువర్ణక మగును క్లీబము=నపుంసకము నపుంసకలింగములగు శబ్దములు సంస్కృత సమములగునప్పుడవి ప్రథమైక వచనమున "ము" ప్రత్యయముతోఁ గూడుకొని యుండును ఉదా॥ కళత్రము, అపత్యము మొ॥ ఈ నపుంసకలింగ ధర్మము కొన్ని యచ్చతెనుఁగు శబ్దములపై నారోపింపఁ బడినది అట్టి శబ్దములు ప్రథమైకవచనమున మువర్ణకముతోఁ గూడుకొని యుండును ఉదా॥ బియ్యము, నెయ్యము అల్లము, మొల్లము, సున్నము, సన్నము మొ॥ వీనిని గ్లీబసమము లందురు క్లీబములు, (=నపుంసక లింగములు) ప్రథమైకవచనమున మువర్ణకముతోఁ గూడుకొని యుండును కావునఁ బ్రథమైకవచనమున మువర్ణకముతోఁ గూడికొనియుండు నచ్చతెనుఁగుఁ శబ్దములు క్లీబసమములని తాత్పర్యము (3) తలుచుగ ననుటచేఁ బుంలింగ తుల్యములు నరుదుగాఁగలవు పుంలింగ శబ్దములు సంస్కృత సమములగు నపుడు వానికిఁ బ్రథమైక వచనమున డుజ్వర్ణకమగును ఉదా॥ రాముఁడు మొ॥ కావున బ్రథమైకవచనమున డుజ్వర్ణకముతోఁ గూడుకొనిన యచ్చతెనుఁగు శబ్దములు పుంలింగ తుల్యము లనఁబడును ఉదా॥ కొమరుఁడు, చందురుఁడు, జముఁడు, కందుఁడు - మొ॥

వీని ప్రక్రియ – అమహత్తులగు, జాణ, గాణ, మిన్న, అద్ద, గద్ద, ఓడ, గోద, శబ్దములకు, తత్సమ 39 చే - మువర్ణకము చేరును ఈ సూత్రమున స్త్రీసమత్వము నతిదేశించుటచే, తత్సమ 57 చే - మువర్ణకము లోపించును మహత్తులగు అన్న, జాణ, గాణ శబ్దముల కనుక్తన్యాయమున 'సు' ప్రత్యయము చేరును తత్సమ 57చే - 'సు' లోపించును బియ్య, నెయ్య, అల్ల, మొల్ల, సున్న - సన్న-అనువానికిఁ గ్లీబసమత్వాతిదేశముచేఁ దత్సమ 39చే-మువర్ణముక చేరును. బియ్యము - ఇత్యాది స్త్రీసమములకెల్ల, తత్సమ 57 చేతనే ప్రథమైక వచన లోపము

విశే - స్త్రీ సమములకంటెఁ గ్లీబసమములు, వానికంటెఁ బుంలింగ తుల్యములు తక్కువ సంఖ్యలో నుండును కావుననే 8-6-4 చొప్పున నుదాహరణములు చూపఁబడెను ఇట్లు భావించుటకు "అచ్ఛికా బహవః స్త్రీసమాః కేచన క్లీబసమాః" (సూత్రాం) అను సూత్రమాధారము ఈ పద్ధతి తక్కిన చోట్ల ననుసరింపఁబడలేదు చూ సంధి 2, తత్సమ 43, సమాస 5 అన్న-మిన్న మున్నగు వానికిఁ బదత్వ సిద్ధికై ప్రత్యయములు చేర్చి లోపము చెప్పుట యావశ్యకము ప్రత్యయము లోపించినను బదత్వమునకు భంగమురాదు "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్ " (పాణి)

పాఠపరిశీలన - స్త్రీ సమంబులుం గ్లీబసమంబు లయియుండు - అని ప్రథమ ముద్రణము ఇది కారక 30 సూత్రమునకు విరుద్ధముగ నుండుటచే స్త్రీసమంబులుం గ్లీబసమంబులు నయియుండు-అను పాఠము కల్పింపఁబడెను ఈ సవరణము సరికాదు స్త్రీసమంబులు గ్లీబసమంబు లయియుండు - సూరి పాఠమనఁదగును సున్న ప్రథమ ముద్రణమునఁ దప్పుపడినది ఇట గసడదవాదేశము సూరికి సమ్మతమే చూ సంధి 14 విశే

## బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు. 3

మహత్త్వంబున వీని కుత్వడుఙ్జాదులు నమహత్త్వంబున మువర్ణకాదులును, స్త్రీత్వంబునం దాలు శబ్దము తోడ సమాసంబు నుం గలుగునని యెఱుంగునది బల్లిదుఁడు, బల్లిదము, బల్లిదురాలు బల్లిద, అక్కజ, కావల, బెట్టిద, బడిద మిసిమింత, మొక్కల ఇత్యాదులు బల్లిదాదులు

వ్యా బల్లిద - మొదలగు శబ్దములు సంస్కృత తుల్యములు అనఁగా నివి మహత్తులగునపుడు వీని కుత్వడుఙ్జులు మొదలగునవి కలుగును అమహత్తులగునపుడు మువర్ణకము మొదలగునవి కలుగును స్త్రీవాచకము లగునపు డాలు శబ్దముతో సమాసమగును మహత్త్వమున - బల్లిద-ప్రాతిపదికము 2చే - పుంలింగ తుల్యమగును గనుక తత్సమ 21చే- బల్లిదు తత్సమ 22 చే-బల్లిదు + డుఙ్, తత్సమ 19 చే - బల్లిదుఁడు బల్లిదుండు అమహత్త్వమున - బల్లిద ప్రాతిపదికము తత్సమ 39 చే - బల్లిదము స్త్రీత్వమున బల్లిద + అలు సంస్కృత తుల్యము గనుక సంధి 31 చే - బల్లిదుర్ + అలు=బల్లిదురాలు ఇట్లే, అక్కజుఁడు, అక్కజము అక్కజురాలు మొ॥

విశే - (1) సంస్కృతమునఁ గొన్ని శబ్దముల లింగము, విశేష్యాధీన

మయియుండును అట్టి వానిని విశేష్యనిఘ్నము లందురు (నిఘ్న = అధీనే" శబ్దస్తో) బల్లి దాదు లట్టివి సుందరః- పురుషః, సుందరమ్ - ముఖమ్ సుందరీ- రమణి ఇట సుందర శబ్దము విశేష్య నిఘ్నము బల్లిదుఁడు మల్లుఁడు, బల్లిదము వృషభము, బల్లిదురాలు తాటక-అనుచో, బల్లి శబ్దము సంస్కృత తుల్యమయినది. అనఁగా విశేష్య నిఘ్నముల వంటిదైనదని తాత్పర్యము (11) తత్సమ 56, 58 సూత్రము లందలి విశేష విధులు బల్లిదాదులకు వర్తింపవు సామాన్యాతిదేశే విశేషా నతిదేశః - పరిభా

## మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుజ్జగు నుత్వంబు గాదు. 4

మగఁడు, మనుమఁడు, కయిరఁడు, కత్తళఁడు మగ, మనుమ, రాయ, పాప, ద్రే, జే, ఈ, కాప్రత్యయాంతంబులు ఇత్యాదులు మగాదులు కయిర, కత్తళ, జన్న, నీల ఇత్యాదులు కయిరాదులు

వ్యా మహద్వాచకము లయిన మగ - మొదలగు శబ్దములకు, కయిర మొదలగు నమహద్వాచకములకు, డుజ్వర్ణకమగను, ఉత్వము కాదు 1) మగాదులు మగఁడు - మగ - ప్రాతిపదికము 2 చేఁ బుంలింగ తుల్యమగుటచే దీనికిఁ దత్సమ 21 చే, ఉత్వము తత్సమ 22 చే - డుజ్జు ప్రాప్తించుచుండగా ఉత్వము కాదనియు, డుజ్జు మాత్రమే యగుననియు నీ సూత్రము నియమించు చున్నది కాన డుజ్జు వచ్చి మగ+డుజ్ తత్సమ 19 చే - మగఁడు, మగండు అనునవి యేర్పడును ఇట్లే, మనుమ+డుజ్ = మనుమఁడు, మనుమండు, రాయ+డుజ్=రాయఁడు, రాయండు పాప+డుజ్ = పాపఁడు పాపండు- అను రూపము లేర్పడును ద్రే - జే, శబ్దములకు తత్సమ 22 చే - డుజ్జగును ద్రే+డుజ్ = ద్రేఁడు, జే+డుజ్ = జేఁడు సంజ్ఞా 15 చే - నిట సాధ్య పూర్ణము లేదు ఈ కా ప్రత్యయాంతములు - అనుచో ఈ+కా+అ - అని సంధిలో 'అ' కారము గలదని గుర్తింపవలెను "ఈ" ప్రత్యయాంతమునకు తద్ధిత *15* చే- అటమటీ - ప్రాతిపదికమగును (అటమటము+ఈ=అటమట+ఈ అటమటీ) అచ్చిక 2 చే - ఇది పుంలింగ తుల్యమగును గావున, తత్సమ 22 చే - డుజ్జు అటమటీ+డుజ్జు తత్సమ 19 చే - అటమటీఁడు సంజ్ఞా 15 చే - నిందుసున్న రాదు కా ప్రత్యయాంతమునకు - తద్ధిత 11 చే - ఆటకా - ప్రాతిపదికము అచ్చిక 2 చే - నిది పుంలింగ తుల్యముగాన, తత్సమ 22 చే డుజ్ ఆటకా+డుజ్ తత్సమ 19 చే ఆటకాఁడు సంజ్ఞా 15 చే -

నిందుసున్న కాదు ఆ ప్రత్యయాంతమునకు వగలా - తద్ధిత 23 చేఁ బ్రాతి వదికమగును (వగలు+ఆ = వగలా) అచ్ఛిక 2 చే నిది పుంలింగతుల్యము గనుక, తత్సమ 22 చే - వగలా+డుఙ్ తత్సమ 19 చే వగలాఁడు, సంజ్ఞా 15 చే - సాధ్య పూర్ణము లేదు (2) కయిరాదులు కయిరఁడు - కయిర - ప్రాతివదికము ఈ 4 చే - కయిర+డుఙ్ తత్సమ 19 చే-కయిరఁడు, కయిరండు ఇట్లే, కత్తళ+డుఙ్ = కత్తళఁడు, కత్తళండు, జన్న+డుఙ్= జన్నఁడు, జన్నండు నీల + డుఙ్ = నీలఁడు, నీలండు కయిరఁడు - మున్నగునవి యశ్వ విశేషములు ఇవి యమ హత్తులుగాన వీనికిఁ దత్సమ 22 చే - డుజ్జు రాదు కనుక నీ సూత్రము చేతనే డుజ్జగును

విశే - ప్రే - జే - ఈ - కా - ఆ ప్రత్యయాంతములకుఁ బుంలింగ తుల్య త్వాతిదేశముచేఁ దత్సమ 22 వలననే - డుజ్జగును ప్రేఁడు మున్నగు రూపములు సిద్ధించును ఇవి అదంతములు కావు గావునఁ దత్సమ 21 చే - ఉత్వప్రాప్తియే లేదు కనుక వీనిని మగాదులలోఁ జేర్చి ఉత్వనిషేధము చెప్పుట యనావశ్యకమని కొందఱు సెలవిత్తురు ఈ పక్షమునఁ గయిరాదుల కుత్వ నిషేధము చెప్పుటయు ననావశ్యకమే యగును కయిరాదు లమహత్తులుగాన వీనికిఁ దత్సమ 21 చే - ఉత్వము రాదు కాని యిట విశేషము లేకపోలేదు తత్సమ 21 చే - ఉత్వము ప్రాప్తించుచు నీ 4 చే - ఉత్వము నిషేధింపఁబడిన శబ్దము లనుదంతములనియు, ననుదంతములకు నిగాగమము నిత్యమనియు సూరి తత్సమ 24 సూత్రమున నిర్దేశించెను ప్రే - మొదలగు వానికిని, గయిరాదులకు, ఉత్వప్రాప్తియే లేదు కనుక నిది ఉత్వ ప్రాప్తిలేని వానికిని దత్సమ 24 చే, నిగాగమ మగుననుటలోఁ బర్యవసించును "అత్రామహత్సు ఉత్వనిషేధో నిన్యాగమ ప్రాప్తౌ పర్యవస్యతి తేన, పనమొక్కనిన్ కైరనిచేత- నితిరూపం సిధ్యతి - అని యహోబల పండితుఁడు వివరించి యున్నాఁడు ఏకాదులలో జేఁడు శబ్దము నుదాహరించుట యిట్టి యాశయముతోనే కావలెను చింతామణిలోని యేకాది గణమే బాల వ్యాకరణమున మగాది గణముగ గ్రహింపఁ బడెను కావున సూరి యహోబల పండితీయానుసారముగ నిచ్చటఁ బ్రక్రియ నడపెనని తెలియవలెను మగాదుల కుత్వనిషేధము, ప్రే - మొదలగు వానికి నిగామ మనిత్యత, కయిరాదులకు నిగాగమనిత్యత, డుజ్జుచేరుట, యీ సూత్రమునకు ఫలితములు

## పగతాదుల బహువచన లకారంబునకు రేఫంబగు. 5

పగతురు, అల్లురు, నెయ్యురు, బలియురు; మార్తురు.

వ్యా పగత - మున్నగు శబ్దముల బహువచన లకారమునకు రేఫమగును

వగతురు - వగత - ప్రాతిపదికము 2 చేఁ ఋంలింగ తుల్యత తత్సమ 21చే-వగతు, తత్సమ 12 చే - వగతు+లు=ల్+ఉ ఈ 5 చే - వగతుర్+ఉ= వగతురు ఇట్లే, అల్లి+లు=అల్లురు, నెయ్య+లు=నెయ్యురు బలియ+రు= బలియురు మార్త+లు=మార్తురు (నిత్యబహువచనాంతము)

విశే - వగత+ఆది = వగతాది వగత - అనుదానిని బట్టి తక్కిన వియు అదంతము లనుట స్పష్టము వగతు+లను=వగతురను తత్సమ 31చే-లడాగమ 'ల' వర్ణము విభక్తి యగును గావున నిట లడాగమ లకారమునకు రేఫము కలిగెను

## కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందు పూర్వక డకారంబు నగు. 6

గండండ్రు, మిండండ్రు — ఇత్యాదులు

వ్యా కొన్ని డుమంతముల బహువచన లకారమునకు రేఫమును, నారేఫమునకు ముందు నిండుసున్నతోఁ గూడిన డకారమును (ండ్) నగును డుమంతము=డుజ్వర్ణకమునకుఁ బ్రకృతి యయినది డుమంతం బనంబడు, (తత్సమ 20) పూర్ణబిందు పూర్వక డకారము=ండ్ - అనునది గండండ్రు - గండ - ప్రాతిపదికము తత్సమ 12 చే - గండ+లు (=ల్+ఉ ) లకారము నకు రేఫము కలిగి - గండ+ర్+ఉ రేఫమునకు ముందు 'ండ్' వచ్చి - గండండ్+ర్+ఉ = గండండ్రు - అగును ఇట్లే, మిండ+లు=మిండండ్రు

విశే - (1) ఇట ఖండము నిల్పినను 15 చే - ఎట్లును బూర్ణమగును గాన బూర్ణశబ్దము వ్యర్థమై 6, 7, 11 సూత్రములలోఁ బూర్ణములు నిల్పి ప్రక్రియ చెప్పవలె ననుటలోఁ బర్యవసించును (11) గండ+లను=గండండ్రను (తత్సమ 31 )

## కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వ లఘు రేఫంబులును, లఘు రేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు. 7

విలుకాండ్రు, విలుకాఱు, వేఁటకాండ్రు. వేఁటకాఱు, వేడుక కాండ్రు, వేడుకకాఱు.

వ్యా కా ప్రత్యయము మీఁది బహువచన లకారమునకు రేఫము, నలఘు రేఫమునగును లఘు రేఫమునకు ముందు పూర్ణబిందు పూర్వక డకారము (ండ్) నగును అనగా (1) లఘు రేఫము, దానికి ముందు పూర్ణబిందు పూర్వక

దకారము (2) అలఘు రేఫము నగునన్న మాట విలుకాండ్రు, విలుకా - తద్ధిత 11 చేఁ బ్రాతిపదిక మగును తత్సమ 12 చే - విలుకా+లు (=ల్+ఉ) లకారమునకు రేఫము కలిగి - విలుకా+ర్+ఉ - అగును రేఫమునకు ముందు 'ండ్' వచ్చి - విలుకాండ్+ర్+ఉ=విలుకాండ్రు - అని యేర్పడును - విలుకాఱు - విలుకా - ప్రాతిపదికము తత్సమ 12 చే - విలుకా+లు (=ల్+ఉ) ఈ 7 చే - లకారమునకు నలఘు రేఫము కలిగిన, విలుకా + ఱ్ + ఉ = విలుకాఱు - అని యేర్పడును ఇట్లే, వేఁటకా+లు = వేటకాండ్రు, వేటకాఁఱు, వేడుక కా+లు = వేడుకకాండ్రు వేడుకకాఱు - అను వానిని సాధించుకొనవలెను

విశే - (1) బిందుపూర్వక - అని యీ సూత్రమునఁ గలదు అయినను బూర్ణము నిల్పియే ప్రక్రియ చెప్పుట యుద్దిష్టము చూ 6 (11) లడాగమ లకారము తత్సమ 31 చే - విభక్తి లకారమగును కావున, విలుకా + లను = విలుకా+ండ్ + ర్ + అ + ను = విలుకాండ్రను - ఇత్యాదులు సాధ్యము లగును

## ఊే ప్రభృతుల బహువచనమునకు ముందు డుఙ్ఙగు. 8
## ఊేఁడులు. ఊేండ్లు.

వ్యా ఊే, మొదలగు వాని బహువచనమునకు ముందు, బిందుపూర్వక డువర్ణమగును ఊేఁడులు, ఊేండ్లు - ఊే - ప్రాతిపదికము తత్సమ, 12 చే - ఊే + లు ఈ 8 చే - ఊే - డుఙ్ + లు తత్సమ 19 చే - ఊేఁడులు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు అచ్చిక 12 చే - ఉత్వము లోపించిన పక్షమున, ఊేఁడ్ + లు 15 చే - ఊే + ండ్ + లు = ఊేండ్లు అచ్చిక 12 చే - ఉత్వము లోపింపనిచో, ఊేఁడు + లు = ఊేఁడులు

విశే - ప్రభృతి శబ్దము వ్యర్థమను విమర్శ సరికాదు గిడెగాఁడ్లు (మను 1 - 36)

## కూఁతు శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు. 9
## కూఁతురు, కూఁతులు.

కూఁతురులు, కూఁతుళ్ళు, కూఁతురి నిత్యాది రూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది

వ్యా కూఁతు శబ్దము యొక్క ప్రథమైక వచనమునకు, రువర్ణ మాదేశ

మగును కూతుఁరు - కూఁతు ప్రాతిపదికము తత్సమ 48 చే - కూఁతు+వు ఈ 9 చే - వు వర్ణకమునకు రు వర్ణ మాదేశమై కూఁతురు - అను ప్రథమైక వచన మేర్పడును కూఁతులు - కూఁతు - ప్రాతిపదికము తత్సమ 12 చే - కూఁతు + లు = కూఁతులు కూఁతురులు, కూతుళ్ళు, కూఁతురిని - మున్న గునవి గ్రామ్యములు అనఁగా లక్షణ విరుద్ధములని యర్థము

విశే - (1) కూఁతురు - ప్రథమైక వచనము గనుక దీనిపై మరల విభక్తులు చేరవు (11) కూఁతు + వు - అనుచోఁ దత్సమ 57 సూత్రమును బాధించి యీ 9 చే - రువర్ణ మగును (షష్ఠీస్థానేయోగా-పాణి) కాన కూఁతు+ రు అనుచోఁ దత్సమ 57 చే - రు లోపము లేదు విప్రతి షేదేన యద్బాధితం తద్బాధితమేవ - పరిభా

## చెయువు బహువచన లకారంబున కలఘురేఫంబు విభాషనగు. 10

చెయువుఱు, చెయువులు, చెయువుఱను, చెయువులను

వ్యా చెయువు శబ్దము యొక్క బహువచన లకారమున కలఘురేఫము విభాషనగును ఛెయువుఱు - చెయువు - ప్రాతిపదికము, తత్సమ 12 చే - చెయువు + లు (= ల్ + ఉ) లకారమున కలఘు రేఫమయినచో - చెయువు + ఱ్ + ఉ = చెయువుఱు అలఘు రేఫము రానిచో - చెయువు+ లు = చెయువులు చెయువుఱను - చెయువు - ప్రాతిపదికము తత్సమ 2 చే- చెయువు+ను తత్సమ 31 చే - చెయువు + లను (= ల్ + అ + ను) బహువచన లకారమున కలఘు రేఫము వచ్చిన చెయువు + ఱ్ + అ+ను = చెయువుఱను - అగును అలఘు రేఫము కానిచో, చెయువు + లను = చెయువులను - అగును

విశే - తత్సమ 31 చే-లడాగమము విభక్తి యగును గావున చెయువు+ లను = చెయువుఱను - అని లకారమునకు ఱకారమగును

## ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబునగు. 11

ఆండ్రు, ఆండ్రను, ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱఁదలు. ఇవి యాల్వాదులు.

వ్యా ఆలు - మున్నగు శబ్దముల బహువచన లకారమునకు రేఫమును, రేఫమునకు, ముందున్న లువర్ణమునకు బిందుసున్న పూర్వమందుగల డకార

మును (ండ్) నగును ఆంధ్రు - అలు - ప్రాతిపదికము తత్సమ 12 చే అలు + లు ( = ల్ + ఉ ) బహువచన లకారమునకు రేఫము కాఁగా అలు + ర్ + ఉ రేఫమునకు ముందున్న లు వర్ణమునకుఁ బూర్ణబిందు పూర్వక డకారము (ండ్) కాఁగా, అండ్ + ర్ + ఉ = అంధ్రు - అని యేర్పడును ఆంధ్రను - అలు - ప్రాతిపదికము తత్సమ 2 చే - అలు+ను తత్సమ 31 చే - అలు + లను ( = ల్ + అ + ను ) ఈ 11 చే- అండ్ + ర్ + అ + ను = అంధ్రను - అను రూపము సిద్ధించును ఇట్లే, చెలియలు + లను = చెలియండ్ + ర్ + అను చెలియంధ్రను - ఇత్యాదులు

విశే - (1) బిందు పూర్వక - అనుటచే, ఖండమును నిల్పినచో 15 చే- ఖండము పూర్ణమగును ఈ ప్రక్రియా గౌరవముతోఁ బనిలేకుండఁ బూర్ణబిందువులతోనే ప్రక్రియ చెప్పుట యుద్దిష్టము చూ 6 (11) లడాగమ లకారము తత్సమ 31 చే విభక్తి యగును గావున, అలు + లను = అండ్ + ర్+ అ + ను = అంధ్రను - అగును

## బహువచనము పరంబగునపుడు డలటురల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. 12

గుండ్లు, గుండులు, గిండ్లు, గిండులు, కాళ్ళు, కాలులు, మొనళ్ళు, మొసలులు, గొంట్లు, గొంటులు, తుంట్లు, తుంటులు, గోర్లు, గోరులు, సీవిర్లు, సీవిరులు

బహుళ గ్రహణముచే విల్లులు, పిల్లులు, పులు లిత్యాదులందు లోపంబు లేదు

తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కి కార్యంబు చూపబడెడు కోట్లు, కోటులు, పిప్పళ్ళు, పిప్పలులు

వ్యా డలటరల యొక్క ఉత్వమునకు, బహువచనము పరమగునపుడు లోపము బహుళముగా నగును డలటరల యొక్క ఉత్వమున కనఁగా డు - లు - టు - రు-అను వానిలోని ఉత్వమున కని యర్థము గుండ్లు, గుండులు:- గుండు - ప్రాతిపదికము తత్సమ 12 చే - గుండు + లు ఈ 12 చే, డు-లోని ఉత్వము లోపించిన - గుండ్ + లు = గుండ్లు - అగును లోపింపనిచో, గుండులు - అని యుండును గిండ్లు, గిండులు - గిండి - ప్రాతిపదికము తత్సమ 12 చే , గిండి + లు, తత్సమ 45 చే , గిండు + లు ఈ 12 ,

గింద్ + లు = గిండ్లు ఉత్వము లోపింపనిచో - గిండులు కాళ్ళు, కాలులు - కాలు - ప్రాతిపదికము తత్సమ 12 చే - కాలు + లు ఈ 12 చే - కాల్ + లు 14 చే - కాళ్ + లు = కాళ్ళు ఉత్వ లోపము రానిచో - కాలు+లు= కాలులు మొసళ్ళు, మొసలులు - మొసలి - ప్రాతిపదికము తత్సమ 12 చే - మొసలి + లు తత్సమ 45 చే - మొసలు + లు ఈ 12 చే - మొసల్ + లు 14 చే - మొసళ్ + లు = మొసళ్ళు ఉత్వము లోపింపని యెడల మొసలులు - అని యుండును గొంట్లు, గొంటులు - గొంటు - ప్రాతిపదికము తత్సమ 12 చే - గొంటు + లు ఈ 12 చే - గొంట్ + లు = గొంట్లు ఉత్వ లోపము రానిచో - గొంటులు తుంట్లు తుంటులు - తుంటి - ప్రాతిపదికము తత్సమ 12 చే - తుంటి + లు తత్సమ 45 చే - తుంటు + లు ఈ 12 చే - తుంట్ + లు = తుంట్లు ఉత్వము లోపింపనిచో - తుంటులు గోర్లు, గోరులు - గోరు - ప్రాతిపదికము తత్సమ 12 చే - గోరు + లు ఈ 12 చే - గోర్ + లు = గోర్లు ఉత్వ లోపము రానిచో - గోరు+లు= గోరులు సీవిర్లు, సీవిరులు - సీవిరి - ప్రాతిపదికము తత్సమ 12 చే - సీవిరి + లు తత్సమ 45 చే - సీవిరు + లు ఈ 12 చే - సీవిర్ + లు = సీవిర్లు ఉత్వ లోపము రానిచో - సీవిరులు బహుళమనుటచే - విల్లులు, పిల్లులు, పులులు మొదలయినచోట్ల ఉత్వమునకు లోపము రాదు ఇది బహుళ ప్రయోజనములలో నప్రవృత్తి యగును అప్రవృత్తి = విధించిన కార్యము ప్రవర్తింపకపోవుట విల్లు - ప్రాతిపదికము తత్సమ 12 చే - విల్లు + లు=విల్లులు పిల్లి - ప్రాతిపదికము తత్సమ 12 చే - పిల్లి + లు తత్సమ 45 చే - పిల్లు +లు = పిల్లులు పులి - ప్రాతిపదికము తత్సమ 12 చే - పులి + లు తత్సమ 45 చే - పులు + లు = పులులు కోటి, పిప్పలి యను తత్సమముల కుత్వ లోపము కనఁబడును కోట్లు - కోటి - ప్రాతిపదికము తత్సమ 12 చే - కోటి + లు తత్సమ 45 చే - కోటు + లు "తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీ కార్యంబు చూపట్టెడు" అను వివరణ వాక్యముచే, ఉత్వము లోపించిన - కోట్ + లు = కోట్లు ఉత్వ లోపము కానిచో, కోటులు - అగును- పిప్పళ్ళు - పిప్పలి - ప్రాతిపదికము తత్సమ 12 చే - పిప్పలి + లు తత్సమ 45 చే - పిప్పలు + లు "తత్సమంబులం గోటి పిప్పలి శబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు" పిప్పల్ + లు 14 చే - పిప్పళ్ + లు=పిప్పళ్ళు ఉత్వ లోపము కాని పక్షమున, పిప్పలులు - అని యగును

ఖిలే - (1) డలటరల ఉత్వము సహజముగాని కృతోత్వముగాని

కావచ్చును గుండు - లోనగువానిలోనిది సహజోకారము గిండులు - లోనగువాని లోనిది కృతోత్కము గిండి + లు = గిండులు - తత్సమ 45 (II) ఇందలి లరలలఘు ళలల కుపలక్షణములు పేళులు = పేళ్లు (పీరిక) ఏఱు + లు = ఏర్లు (III) అద్విరుక్తములనకుండుటచే ద్విరుక్తముల ఉత్వమునకును లోపము బహుళముగ నగును గ్రుడ్డు + లు = గ్రుడ్లు, చెట్టు + లు = చెట్లు ఇత్యాది (IV) కోట్లు (వి పు 3 - 153, వరాహ 10 - 153), అరణ్య 2 - 246; శాంతి 2 - 25 (సంశోధిత ముద్రణ)

## బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి యుదంతంబులయిన డలరల కలఘు లకారంబు బహుళంబుగానగు. 13

త్రాళులు, త్రాడులు, గ్రుమ్మళులు, గుమ్మడులు మొగిళులు, మొగిలులు, పిడికిళులు, పిడికిలులు, ఊళులు, ఊరులు, పందిళులు, పందిరులు

వ్యా అసంయుక్తములయి, ఉదంతములయిన, డలరలకు, బహువచనము పరమగునపు డలఘు లకారము బహుళముగానగును అసంయుక్తములు = వేఱొక హల్లుయొక్క కూడిక లేనివి ఉదంతములయిన డ ల ర లనఁగా డు- లు - రు - అన్నవి త్రాళులు, త్రాడులు - త్రాడు - ప్రాతిపదికము తత్సమ 12 చే - త్రాడు+లు ఈ 13 చే - డకారమున కలఘు లకారమయినచో త్రాళ్+ఉ+లు=త్రాళులు అలఘులకారము కానిచో - త్రాడులు గుమ్మళులు, గుమ్మడులు - గుమ్మడి - ప్రాతిపదికము తత్సమ 12 చే - గుమ్మడి+లు తత్సమ 45 చే - గుమ్మడు+లు ఈ 13 చే - గుమ్మళ్ +ఉ+లు=గుమ్మళులు. డకారమునకు (డ్) ళకారము (ళ్) కానిచో - గుమ్మడులు మొగిళులు, మొగిలులు - మొగిలు - ప్రాతిపదికము తత్సమ 12 చె - మొగిలు+లు ఈ 13 చే- మొగిళ్ +ఉ + లు = మొగిళులు అలఘులకారము కానిచో - మొగిలులు. పిడికిళులు, పిడికిలులు - పిడికిలి - ప్రాతిపదికము తత్సమ 12 చే- పిడికిలి+లు తత్సమ 45 చే - పిడికిలు+లు ఈ 13 చే - పిడికిళ్+ఉ+లు = పిడికిళులు అలఘు లకారము కానిచో - పిడికిలులు ఇటఁ దత్సమ 46 చే - ఉపోత్తమేత్వమున కుత్వము రావలసియుండఁగాఁ దత్సమ 47 చే - ఉపోత్తమేత్వమున కుత్వము రాదు ఊళులు, ఊరులు - ఊరు - ప్రాతిపదికము తత్సమ 12 చే- ఊరు+లు ఈ 13 చే - ఊళ్+ఉ+లు = ఊళులు అలఘులకారము కానిచో ఊరులు పందిళులు, పందిరులు - పందిరి ప్రాతిపదికము తత్సమ 12 చే -

పందిరి+లు తత్సమ 45 చే-పందిరు+లు, ఈ 13 చే - పందిళ్+ఉ+లు= పందిళులు అలఘు లకారము కానిచో - పందిరులు తత్సమ 46 చే - ఉపోత్త మేత్వమున కుత్వము ప్రాప్తించుచుండఁగా, తత్సమ 47 నిషేధించును

విశే - (1) త్రాడు - మొగిలు - ఊరు-సహజముగ ఉదంతములు గుమ్మడులు, పిడికిలులు, పందిరులు - వీనిలోనిది కృతోత్కమము తత్సమ 45 చే - ఇత్వమున కుత్వ మయ్యెను (II) నాళులు (శా శ 108)

పదసార్థక్యము - (1) అసంయుక్తంబులయి - అనుటచే గ్రుడ్లులు, తల్లులు--(తల్లి + లు) మున్నగు ద్విత్వములయెడ నలఘు లకారములేదు (II) ఉదంతంబుల్లయిన - అనుటచే ఉదంత భిన్నములగు డ ల ర ల కలఘు లకారము లేదు ఉదా॥ గోడ + లు = గోడలు బేల + లు = బేలలు బార + లు = బారలు

## బహువచన శ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు. 14

త్రాళ్ళు, గుమ్మళ్ళు, మొగిళ్ళు, మొసళ్ళు, విళ్ళు, సిళ్ళు

వ్యా॥ బహువచనముతోఁ గూడుకొనినవై, యద్విరుక్తములయిన, డకార లకారముల్ల కలఘు లకారము నిత్యముగా నగును త్రాళ్ళు - త్రాడు ప్రాతి పదికము తత్సమ 12 చే - త్రాడు + లు అచ్ఛిక 12 చే - త్రాడ్ + లు= త్రాడ్లు త్రాడు-శబ్ద మద్విరుక్తము డకారము (డ్) లకారముతో, గూడుకొని యున్నది కావున నీ 14 చే-డకారమున కలఘులకారము నిత్యముగా నగును త్రాళ్ + లు = త్రాళ్ళు, గుమ్మళ్ళు - గుమ్మడి-ప్రాతిపదికము తత్సమ 12చే- గుమ్మడి + లు తత్సమ 45 చే గుమ్మడు + లు అచ్ఛిక 12 చే - గుమ్మడ్ + లు = గుమ్మడ్లు ఈ 14చే-డకారమున కలఘు లకారము గుమ్మళ్ + లు = గుమ్మళ్ళు ఇట్లే విడి + లు = విడ్లు· విళ్ళు సిడి+లు= సిడ్లు. సిళ్ళు - అనువానిని సాధించుకొనవలెను మొగిళ్ళు - మొగిలు - ప్రాతి పదికము తత్సమ 21 చే - మొగి + లు అచ్ఛిక 12 చే - మొగిల్+లు= మొగిల్లు ఈ 14 చే - మొగిళ్ + లు = మొగిళ్ళు, మొసళ్ళు - మొసలి-ప్రాతి పదికము తత్సమ 45 చే - మొసలి + లు తత్సమ 45 చే - మొసలు+లు అచ్ఛిక 12 చే - మొసల్ + లు - మొసల్లు ఈ 14 చే - మొసళ్ + లు= మొసళ్ళు

విశే - ఈ సూత్రమున రేఫమేల చేర్పలేదో! యని కొందఱు శంకింతురు ఇది 12 చే నగు త్రాడ్లు, మొగిల్లు-అను నసాధు రూపములను నివారించుటకుద్దేశించిన సూత్రము ఇందు రేఫము చేర్పరాదు చేర్చినచో గోరు+లు=గోళ్ళు- అగును గోర్లు (12) - అను రూపము లేకుండఁబోవును

పదసార్థక్యము - (1) బహువచన శ్లిష్టంబులయి-అనుటచే 12చే-ఉత్వము లోపించినప్పుడే యలఘులకారము నిత్యముగ నగును త్రాడ్లు = త్రాళ్ళు మొ॥ బహువచన శ్లిష్టము కానప్పుడు బహుళముగ నగును త్రాడు+లు = త్రాటలు, త్రాడులు - 13 సూ॥ (11) అద్విరుక్తంబులయిన - అనుటచే - ద్విత్వముల యెడ నలఘులకారము కాదు గ్రుడ్డు + లు = తత్సమ 12 చే - గ్రుడ్లు ఇట నలఘులకారము కాదు ఏలయన గ్రుడ్డులోనిది ద్విరుక్త దకారము (111) నిత్యంబుగ - అనుటచే 13 వ సూత్రమునందలి బహుళపద మిట ననువర్తింపదు

**సమానపదంబునందు సంయోగంబు పరంబగు నపుడెల్లచో ఖండబిందువునకుం బూర్ణంబగు. 15**

అనఁటులు, అనంట్లు, పనఁటులు, పనంట్లు, గోఁటులు, గోంట్లు, తేఁటులు తేంట్లు, ఏఁడులు, ఏండ్లు, కాఁడులు, కాండ్లు ఏండ్లు కాండ్లిత్యాదులందు డాకుళాదేశంబు కొందఱు వక్కాణించిరి తెనుఁగున బిందుపూర్వక స్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు.

వ్యా ఏకపదమునందు సంయోగము పరమయినప్పుడెల్లచో ఖండ బిందువునకుఁ బూర్ణబిందువగును సమానపదంబు=ఏకపదము సంయోగము = రెండు పొల్లు హల్లుల యొక్క కూడిక (చూ తత్సమ 85) అనఁటులు, అనంట్లు అనఁటి - ప్రాతిపదికము తత్సమ 12 చే - అనఁటి + లు తత్సమ 45 చే - అనఁటులు ఇటనాచ్ఛిక 12 చే - ఉత్వలోపము కలిగినచో అనఁట్ + లు = అనఁట్లు ఇట సంయోగము పరమయినది కనుక, ఖండమునకుఁ బూర్ణమగును, అనంట్లు, 12 చే ఉత్వము లోపింపనిచో - అనఁటులు ఇట్లే, పనఁటి + లు = పనఁటు + లు పనంట్లు, పనఁటులు - అగును గోఁటులు, గోంట్లు: గోఁటు- ప్రాతిపదికము, తత్సమ 12 చే - గోఁటు + లు = గోఁటులు అచ్చిక 12చే- గోఁట్ + లు = గోఁట్లు సంజ్ఞా 15 చే దీర్ఘము మీఁద సాధ్యపూర్ణములేదు కాని యిట సూత్రమున "ఎల్లచో" అనుటచే దీర్ఘము మీఁదను సాధ్యపూర్ణమగును కాన, గోఁట్లు = గోంట్లు — అగును తేఁటులు, తేంట్లు తేఁటి - తత్సమ 12 చే - తేఁటి + లు తత్సమ 45 చే - తేఁటులు అచ్చిక 12చే-తేఁట్+లు=తేఁట్లు

ఈ 15 చే - తేంట్లు ఎల్లచో - అనుటచే దీర్ఘముమీఁదను సాధ్యపూర్ణమయినది
ఏఁడులు, ఏండ్లు - ఏఁడు - తత్సమ 12 చే - ఏఁడు + లు = ఏఁడులు,
అచ్చికి 12 చే - ఏఁడ్ + లు = ఏఁడ్లు - ఈ 15 చే - ఏండ్లు ఎల్లచో -
అనుటచే సాధ్యపూర్ణము ఇట్లే కాఁడు + లు = కాండ్ + లు కాండ్లు -
కాఁడు + లు = కాఁడులు

ఏండ్లు, కాండ్లు మున్నగు వానియందు దకారమునకు శకార మాదేశమగు నని కొందఱు చెప్పిరి అనఁగా ఏంశ్లు, కాంశ్లు - అను రూపములగునని కొందఱు చెప్పిరన్నమాట కాని యిట్టి రూపములు గ్రహింపఁదగినవి కావు ఏలయనఁ దెనుగున స్థిరమునకు ముందు బిందువు లేదు శకారము స్థిరముగాన దీనికి ముందు బిందు వుండదు కనుక, ఏంశ్లు కాంశ్లు - మున్నగునవి గ్రాహ్యములు కావు, ఏండ్లు కాండ్లు - అనునవే సాధువులు

విశే - (1) రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు తమ వ్యాకరణములో—గుంట్లు, కాంట్ళు, పెండింట్ళు, పెండ్లింట్ళు మున్నగు రూపములను సాధించిరి ఇట్టి రూపములు సాధువులు కావని చెప్పుటయే సూరి యాశయము (11) అనఁటులు= అనట్లు - కాకుండుటకే యీ సూత్రము రచింపఁబడెను అనంటులు=అనంట్లు-కావచ్చును

పదసార్థక్యము -- (1) సంయోగంబు పరంబగునపుడు - అనుటచే సంయోగము పరము కానప్పుడు ఖండము నిత్యముగఁ బూర్ణము కాదు ఉదా॥ అనఁటులు, అనంటులు (ii) ఎల్లచో - అనుటచే సంజ్ఞా 15 సూత్రమును బాధించి సాధ్యపూర్ణము దీర్ఘము మీఁదను నగును గోంట్లు, ఏండ్లు మొ॥ (iii) సమానపదంబునందు - అనుటచే - అడవిలోఁ ద్రోవ - ఇత్యాదులందు ఖండము పూర్ణము కాదు

పాఠపరిశీలన - సమానపదంబు - అని ప్రథమ ముద్రణము కొన్ని ప్రతులలో సమాసపదంబు అని ముద్రించుట సరికాదు సమానపదే (పాణి)= సమాన శబ్ద ఏకపర్యాయః (బాలమ)

## ఔపవిభక్తికంబుల లివర్ణ సలలు వర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక డువర్ణంబు బహుళంబుగానగు. 16

క్రొడవలి. కొడవండులు ఉత్వలోపంబు కొడవండ్లు పక్షంబునం దలఘులకారంబు కొడవళులు, కొడవళ్ళు, కొడవలులు రోఁకలి ప్రభృతులకిట్లు రూపంబు లెఱుంగునది

ఇల్లు ఇందులు, ఇండ్లు, ఇల్లులు ఇట్లు- కల్లు, పల్లు, ముల్లు, విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది

మద్య నిమ్నార్థకంబులయిన కల్లు, పల్లు శబ్దంబులును, తెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబులగుటం జేసి వాని కీకార్యంబు లేదు

వ్యా ఔప విభక్తికముల యొక్క లి - ల్లు వర్ణములకు బహువచనము పరమగునపుడు పూర్ణబిందు పూర్వక డు వర్ణము (ండు) బహుళముగా నగును సలలు వర్ణము = లకారముతోఁ గూడిన లువర్ణము లకారము = ల్ దీనితోఁ గూడిన 'లు" వర్ణము అనఁగా, 'ల్లు' వర్ణము ( ల్ + లు ) పూర్ణబిందు పూర్వక డు వర్ణము = పూర్ణబిందువు ముందు గలిగిన డు వర్ణము = "ండు", ఔప విభక్తికములు = విభక్తి నిమిత్తకములగు ఇటిటి వర్ణములు చేరు శబ్దము లని యిట నర్థము విభక్తి నిమిత్తకములగు ఇటిటి వర్ణములే కాక యవి చేరు శబ్దములు గూడ నౌప విభక్తికములనియే వ్యవహరింపఁబడును. (28 సూ॥) కొడవండులు, కొడవండ్లు - కొడవలి - ప్రాతిపదికము తత్సమ 12 చే - కొడవలి + లు ఈ 16 చే - లి వర్ణమునకు 'ండు' ఆదేశమయినచో - కొడవలి + లు = కొడవండు + లు కొడవండులు - అగును 12చే - ఉత్వము లోపించిన, కొడవండ్ + లు = కొడవండ్లు లోపింపనిచో కొడవండులు కొడవళులు - కొడవలి తత్సమ 12 చే - కొడవలి + లు ఈ అచ్చిక 16 చే - 'ండు' ఆదేశము కాని పక్షమున, తత్సమ 45 చే - కొడవలు + లు ఆచ్చిక 13 చే - కొడవళులు కొడవళ్ళు - కొడవలి తత్సమ 12 చే - కొడవలి +లు తత్సమ 45 చే - కొడవలు + లు అచ్చిక 12 చే - కొడవల్+లు 14 చే - కొడవళ్ + లు = కొడవళ్ళు కొడవలులు - కొడవలి - తత్సమ 12 చే - కొడవలి + లు ఈ 16 చే - 'ండు' ఆదేశము కానిచో, తత్సమ 45 చే - కొడవలు + లు = కొడవలులు 12 చే - ఉత్వ లోపము, 13 చే సలఘు లకారము కలుగని పక్షమున నీ రూపముండును రోఁకలి మున్నగువాని కిట్టే రూపములు తెలియవలెను

ఇందులు, ఇండ్లు - ఇల్లు - ప్రాతిపదికము ఇది సల లువర్ణమున కుదాహరణము తత్సమ 12 చే - ఇల్లు + లు ఈ 16 చే - 'ల్లు' అను దానికి 'ండు' ఆదేశమయినచో ఇండు + లు = ఇండులు-అగును 12 చే - ఉత్వము లోపించిన ఇండ్ + లు = ఇండ్లు లోపింపనిచో - ఇందులు ఇల్లులు - ఇల్లు - తత్సమ 12 చే - ఇల్లు + లు = ఇల్లులు ఈ 16 చే - "ండు" ఆదే

శము కాని పక్షమున నీ రూపముండును ఇట్లే - తక్కినవి మద్యమను నర్థము గల కల్లు శబ్దము, నిమ్నమను నర్థము గల, పల్లు శబ్దము, తెల్లు మున్నగు శబ్దములు ననావ విభక్తికములగుటచే వీని 'ల్లు' వర్ణమునకు 'ండు" వర్ణమాదేశము కాదు కల్లు + లు = కల్లులు అనఁగా మద్యములు వల్లు + లు=వల్లులు= నిమ్నములు తెల్లు + లు = తెల్లులు ఛాయి - అను నర్థముగల కల్లుశబ్దము దంతమను నర్థము గల పల్లు శబ్దము, నావ విభక్తికములు

## ఒకానొకచో నామంబు సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు. 17

కొడవండ్లులు, కొడవండ్లులను, కొడవళ్లులు, కొడవళ్ళులను ఇట్లు ప్రయోగ దృష్టంబులు గ్రహించునది

వ్యా ఒకానొకచోఁ బ్రాతిపదికము, సంశ్లిష్ట బహువచనాంతముతో సమానమ్మయిన రూపము గలదై, బహువచన ప్రత్యయమును బొందును నామంబు = ప్రాతిపదికము (తత్సమ 21) సంశ్లిష్ట బహువచనాంత తుల్యము =కూడుకొనఁబడిన బహువచనాంత రూపముతో సమానము అనఁగా బహువచ నాంతముతో సంయుక్తమయిన రూపముతో సమానమని యర్థము కొడవండ్లు, కొడవళ్ళు - వంటివి సంశ్లిష్ట బహువచనాంతములు వీనితోఁ దుల్యములు, కొడవండ్లు, కొడవళ్ళు ఈ సూత్రముచే నిట్టివి ప్రాతిపదికము లగును కొడవండ్లులు - కొడవండ్లు - సంశ్లిష్ట బహువచనాంత తుల్యమగు ప్రాతిపదికము ఈ 17 చే - ఇది బహువచనమును బొందనగును గాన, తత్సమ 12 చే - కొడవండ్లు + లు = కొడవండ్లులు - అగును కొడవండ్లులను - కొడవండ్లు - అను సంశ్లిష్ట బహువచనాంత తుల్య మీ సూత్రముచేఁ బ్రాతిపదిక మగును తత్సమ 2 చే - కొడవండ్లు + ను తత్సమ 31 చే - కొడవండ్లు + లను= కొడవండ్లులను ఇట్లే, కొడవళ్ళు - అనుసంశ్లిష్ట బహువాచనాంత తుల్య ప్రాతిపదికము నుండి, కొడవళ్ళులు, కొడవళ్ళులను-అను వానిని సాధించుకొనవలెను ఇట్టివి ప్రయోగములలోఁ గనఁబడినవే గ్రాహ్యములు కొడవండ్లు, కొడవళ్ళు - వీని ప్రక్రియకు చూ 16 సూ

పదసార్థక్యము - (1) సంశ్లిష్ట బహువచనాంత తుల్యంబులు - అనుటచే సంశ్లిష్ట బహువచనాంత తుల్యము కానిది ప్రాతిపదికము కాదు ఉదా॥ కొడవలులు ఇది బహువచనాంతమేగాని సంశ్లిష్ట బహువచనాంతము కాదు కాన దీనితోఁ దుల్యరూపము ప్రాతిపదికముకాదు (11) తుల్యము - అనుట శాస్త్ర

వైరుధ్యమును దప్పించుటకు కొడవండ్లు, కొడవళ్ళు – సంశ్లిష్ట బహువచ నాంతములు విభక్త్యంతముపై మరల విభక్తిచేరుట శాస్త్రవిరుద్ధము కాన, తుల్యముపై ననఁబడెను

## కల్వనాదుల నువర్ణంబు కుజ్ఝగు బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు. 18

కలఁకు, కలను, కలఁకులు

కలను, కెలను, కొఱను, కొలను, గవను, నెఱను, ప్రమాను, వరను, వలను ఇవి కల్వనాదులు

వ్యా "కలను" మొదలగు శబ్దముల నువర్ణ మేకవచనమున వైకల్పికముగ, కుజ్ఝగును, బహువచనము పరమగునపుడు నిత్యముగ కుజ్ఝగును కలఁకు, కలను - కలను- ఈ 18 చే, నువర్ణము కుజ్ఝయినచో - కలకుజ్ తత్సమ 19 చే - కలఁకు, కలంకు కుజ్ఝు కానిచో - కలను కలఁకులు - కలను, తత్సమ 12చే- కలను + లు ఈ 18 చే - కలకుజ్ + లు తత్సమ 19చే- కలఁకులు ఇట్లె తక్కినవి

ప్రమాను=ప్రమాఁకు, ప్రమాను, ప్రమాను + లు = ప్రమాఁకులు ప్రమాఁకు, ప్రమాఁకులు-అనుచోట్ల సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణములేదు

విశే - (1) ఇవి కల్వనాదులు – అనుటచె తక్కిన నువర్ణాంతముల కివిధి వర్తింపదు కొను+లు=కొనులు, మేను+లు=మేనులు- మొ॥ (11) ఏకవచనమున కుజ్ఝునకు - కొలంకు – కాశీ 6-188, పారిజా 2-33, రామా 5-19 కెలంకు - రామా పీఠిక 104 వలంకు - రామా 7-196-

## అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబుగుజ్ఝగు. 19

రేఁగు, రేను, రేఁగులు, గోఁగు, గోను, గోఁగులు.

వ్యా కలన్వాదుల నువర్ణము కుజ్ఝగునట్లు, రేను, గోను శబ్దముల, నువర్ణము గుజ్ఝగును అనఁగా రేను, గోను శబ్దముల నువర్ణమేకవచనమున వైకల్పికముగ గుజ్ఝగును, బహువచనము పరమగునపుడు నిత్యముగ గుజ్ఝగును రేఁగు, రేను - రేను - ప్రాతిపదికము ఈ 19చే- రేగుజ్ తత్సమ 19చే- రేఁగు సంజ్ఞా 15చే- సాధ్యపూర్ణములేదు గుజ్ఝు కాని పక్షమున, రేను-అని యుండును రేఁగులు - రేను - ప్రాతిపదికము తత్సమ 12 చే, రేను+లు ఈ 19చే- గుజ్ఝు నిత్యముగ నగును రేగుజ్ + లు తత్సమ 19చే, రేఁగులు. సంజ్ఞా

15చే- సాధ్యపూర్ణము లేదు ఇట్లే గోఁగు, గోను, గోఁగులు అనువాని ప్రక్రియ గ్రహింపవలెను

## బహువచనంబు పరంబగునపుడు చేను, పేను, మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు. 20

చేను చేలు, పేను పేలు, మీను మీలు

వ్యా బహువచనము పరమయినప్పుడు చేను, పేను, మీను శబ్దముల నువర్ణము లోపించును చేలు - చేను- ప్రాతిపదికము తత్సమ 12-చే చేను+లు ఈ అచ్చిక 20 చే - చేలు ఇట్లే పేను+లు=పేలు, మీను+లు=మీలు

## బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు 21

రేయి రేలు, బాయి బాలు, వేయి వేలు, వ్రాయి వ్రాలు ఇత్యాదులు

ఈ లోపంబు సమాసంబులందుం జూపట్టెడు రేరాజు, మగబా పతకము, వేవెలుగు

వ్యా బహువచనము పరమయినప్పుడు రేయి మున్నగు శబ్దముల తుది యక్షరము లోపించును రేలు - రేయి- ప్రాతిపదికము తత్సమ 12చే- రేయి+లు ఈ 21 చే రేలు ఇట్లే, బాయి+లు=బాలు, వేయి+లు=వేలు, వ్రాయి+లు=వ్రాలు- సాధించుకొనవలెను ఈ తుదివర్ణలోపము సమాసము లందును గనఁబడును ఎట్లన- రేరాజు - "రేయి+యొక్క" + "రాజా+ డుజ్" సమాస 25చే - రేయి + రాజా ఈ సూత్రవృత్తిచే - రే+రాజా, తత్సమ 54చే- రే+రాజ 78 చే-రేరాజు మగబాపతకము "మగబాయి+ యొక్క" + "పతక+ము" సమాస 25చే- మగబాయి+పతక పైవృత్తిచే- 'యి' లోపించి, మగబాపతక - అగును తత్సమ 39చే- మగబాపతకము వేవెలుఁగు వేయి+లు+వెలుఁగు+లు సమాస 25 చే - వేయి+వెలుఁగు పైవాక్యముచే- 'యి' లోపము వేవెలుఁగు పదత్వసిద్ధికై యనుక్తన్యాయమున 'సు' చేరును వేవెలుఁగు + సు తత్సమ 57 చే - వేవెలుఁగు (సమాస 6, 25)

విశే - (1) రే, బా, వే అను నేకాక్షర శబ్దములు గలవు వానినుండి రేలు, బాలు, వేలు - అనురూపము లేర్పడ వచ్చును కాని, రేయి - బాయి - వేయి - అనువాని తుది యివర్ణమునకు లోపము చెప్పనిచో - రేయులు వంటి

యపశబ్దము లేర్పడవలసి వచ్చును కాన యివర్ణలోపము చెప్పుటావశ్యకమే (ii) ఱాయి శబ్దము బాలవ్యాకరణమతమున నౌపవిభక్తికముకాదు కావుననే గోయి ప్రకృతులలోఁ జేర్పఁబడలేదు (అచ్చిక 35) ఇట రేయి ప్రకృతులలోఁ జేర్పఁబడినది కనుక, 'మగఱాయియొక్క" అగును (ఱాతియొక్క-కాదు) (iii) వేయి+వెలుఁగు-అనుచో 'యి' వర్ణము సమాస 20చే- లోపించునని కొందఱు, వే+వెలుఁగు, అని వే-శబ్దము నిల్పి కొందఱు, వ్యాఖ్యానించుట సరికాదు

## బహువచనంబు పరంబగు నపు డావు ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు. 22

ఆవు ఆలు, ఆవులు, ఱాము ఱాలు, ఱాములు, చుట్టము చుట్టలు, చుట్టములు, మీసము మీసలు, మీసములు

వ్యా బహువచనము పరమయినపుడు, 'ఆవు' మొదలగు శబ్దముల తుది యక్షరమునకు లోపము విభాషనగును ఆలు, ఆవులు - ఆవు ప్రాతిపదికము తత్సమ 12 చే - ఆవు + లు ఈ 22 చే, 'వు' లోపించిన - ఆలు లోపింపనిచో - ఆవులు ఇట్లే, ఱాము + లు = ఱాలు, ఱాములు చుట్టలు, చుట్టములు - చుట్ట - ప్రాతిపదికము తత్సమ 12 చే - చుట్ట + లు తత్సమ 40 చే - చుట్ట + ము + లు ఈ అచ్చిక 22 చే, ముగాగమ మువర్ణము లోపించిన, చుట్టలు, లోపింపనిచో - చుట్టములు ఇట్లే మీసములు = మీసలు, మీసములు - సాధించుకొనవలెను

విశే - (i) తుది యక్షరమనుటచే హల్లుతోఁ గూడిన యచ్చు మొత్తము లోపించును కాన, ఆవు - లోని వువర్ణము, ఱాములోని మువర్ణము లోపించును (ii) చుట్టములు, మీసములు - అనుచో ముగాగమములు లోపించును దేనికేది యాగమమగునో యది దాని కవయవమగునను యదాగమ పరిభాషచే ముగాగమము ప్రాతిపదికముల కవయవములగును, గాన చుట్టములు మీసములు - అనుచో ముగాగమములు తుది యక్షరములనిపించుకొనును (iii) చుట్టములు, మీసములు - అనుచో తత్సమ 43 చే, చుట్టాలు, మీసాలు - అనురూపములు నేర్పడును

## ఇయకు మూఁడుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు. 23

కన్నియ—కన్నె, జన్నియ—జన్నె, వన్నియ—వన్నె, కొంచియము—కొంచెము, కొండియము — కొండెము,

బహుళగ్రహణముచే సందియము, కాతియ మొదలగు శబ్దంబు లం దెత్వము లేదు

ఇయ శబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు ముత్తియ శబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి, ముత్తియము ముత్తెము, ముత్యము

వ్యా ప్రాతిపదికాంతమగు 'ఇయ' అనుదానికి మాఱుగా, ఎత్వము బహుళముగనగును కన్నె కన్నియ తత్సమ 39 చే- కన్నియ + ము ఇట కన్నియ - ప్రాతిపదికము ము - విభక్తి ఈ 23 చే - ప్రాతిపదికాంతమగు ఇయకు మాఱుగా, ఎత్వమయినచో - కన్న్ + ఇయ + ము = కన్న్+ఎ+ ము కన్నె + ము ఇది 2 చే - స్త్రీసమమగును గాన, తత్సమ 57 చే – మువర్ణకము లోపించి, కన్నె - అను రూపము సిద్ధించును ఎత్వముకానిచో - కన్నియ + ము తత్సమ 57 చే - మువర్ణకము లోపించి - కన్నియ, యని యేర్పడును ఇట్లే జన్నియ = జన్నె, జన్నియ, వన్నియ=వన్నె, వన్నియ – అనునవి యేర్పడును కొంచెము - కొంచియ-ప్రాతిపదికము ఇది 2చే - క్లీబ సమముగనుక తత్సమ 39 చే - కొంచియ+ము ఈ 23 చే - కొంచ్+ఎ+ ము = కొంచెము - అగును ఎత్వము కానిచో-కొంచియ+ము=కొంచియము ఇట్లే కొండియ + ము = కొండెము, కొండియము బహుళమనుటచే - సందియము, కాతియ మున్నగు శబ్దములం దెత్వము లేదు సందియ - ఇది క్లీబసమము గాన, తత్సమ 39 చే - సందియ + ము ఈ 23 చే - ఎత్వము లేదు గాన సందియము-అగును కాతియ – తత్సమ 39 చే - కాతియ+ము ఎత్వము లేదు ఇది స్త్రీ సమము గనుక తత్సమ 57 చే-ములోపించి, కాతియ - అను రూపమేర్పడును ఇయ అనుదానిలో, ఇకారము లోపించునని కొందఱు వక్కాణించిరి అట్లు వక్కాణించిన వారథర్వణాచార్యులు, నహోబలపండితులు అది ప్రయోగములలో మృగ్యము మృగ్యము = వెదకఁదగినది అనఁగాఁ గనఁ బడలేదన్నమాట ముత్తియ శబ్దమునందు మాత్రము "ఇత్వ" లోపము కనబఁడును ముత్యము - ముత్తియ 2 చే ఇది క్లీబసమము, గనుక, తత్సమ 39 చే - ముత్తియ + ము = ముత్త్+ఇయ+ము "ముత్తియ శబ్దంబునంద మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి" అను వాక్యముచే - ఇత్వము లోపించిన ముత్త్ + య + ము = ముత్యము వేఱొక హల్లుతోఁ గూడుకొనునపుడ ద్విత్వమునందలి యొక హల్లు నిర్దేశానుసారముగ లోపించును ఇట "త్త్య" అన

దానిలో - తకారమొకటి లోపించి, ముత్యము-అగును ముత్తెము - ముత్తియ ప్రాతిపదికము తత్సమ 39 చే - ముత్తియ+ము - అని మువర్ణకము పరమయినది ఈ 23 చే - ఇయ, అనుదానికి మాఱుగా ఎత్వ మాదేశమై ముత్త్+ఎ+ము=ముత్తెము - అగును ఎత్వముకానిచో, ముత్తియ+ము= ముత్తియము

విశే - (1) ముత్త్యము=ముత్యము - అనుచో, ఒక తకారము ప్రకీర్ణక, 8 చే లోపించునను వ్యాఖ్యలు సరికావు హల్మధ్యగంబున కన్యతర సవర్ణంబునకు హల్లునకు లుక్కగు" శబ్దల (11) నామాంత మనఁగా, నామమధ్యమును గావచ్చునని కొందఱు సెలవిచ్చుట సరికాదు బహుళగ్రహణముచే, నామ మధ్యమున ఎత్వము, చెల్లియలు = చెల్లెలు చెలియలు - అనుచో స్రవవృత్తి (111) కొంచెము - లోనగువాని ప్రక్రియ ననుసరించి, కన్నియ + ము = కన్నె + ము కన్నె - అని ప్రక్రియ గ్రాహ్యము

పదసార్థక్యము - ఇయకు మాఱుగా - అనుటచే, ఇయ అనుదాని కంతటికి, ఎత్వ మాదేశమగును మాఱుగా, అననిచో, ఎత్వ మేకవర్ణము గనుక 'ఇయ' లోని తుది అకారమున కాదేశము కావలసివచ్చును అలోంత్యస్య-పాణి (చూ సంధి 43)

## సర్వనామ ప్రకరణము

### అన్ని ప్రభృతులు సర్వనామంబులు. 24

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు, ఆ, ఈ, ఏ, ని, నా, మన, తా, సంఖ్యావాచకంబులు అన్ని ప్రభృతులు

వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద వీనిలో డుమంతంబుల కెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమా బహువచనంబునకుంబోలె నెఱుంగునది

విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయ వఱకును, గొండొకచోఁ దృతీయ యందొక రూపంబువఱకును, రూపభేదంబులు వక్కాణించెద శేషం బూహించునది

అన్ని మొదలగు శబ్దంబు లాఱును ద్విప్రభృతి సంఖ్యావాచ

కంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు అమహదర్థంబు లేక వచనాంతంబులగు

ఇందు, నీ మొదలగు నాలుగు శబ్దంబులు సర్వార్థంబులందుల్యరూపంబులయి యుండు,

'మ' అనునది మహదర్థమనుటకు 'అ' అనునది యమహదర్థమనుటకు, 'ప్ర' మొదలయినవి ప్రథమాది విభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది

| | | మ | అ |
|---|---|---|---|
| | ప్ర | అందఱు | |
| సర్వతావదర్థకము | | అందొఱు | అన్ని |
| ఇయదర్థకము | ప్ర | ఇందఱు | ఇన్ని |
| కియద్వావదర్థకము | ప్ర | ఎందఱు | ఎన్ని |
| కతిపయార్థకము | ప్ర | కొందఱు | కొన్ని |
| బహ్వర్థకము | ప్ర | పెక్కండ్రు | పెక్కు, దీనికి |
| | | పెక్కురు | బహువచనముం |
| | | | గలదు పెక్కులు |

ఈశబ్దంబు లౌపవిభక్తికంబులగుటంజేసి - అన్నిటి, అన్నింటి, ఇన్నిటి, ఇన్నింటి ఎన్నిటి, ఎన్నింటి, కొన్నిటి, కొన్నింటి, పెక్కిటి, పెక్కింటి యను రూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడమహత్త్వంబునం దగు నని తెలియునది

| | | మ | అ |
|---|---|---|---|
| బహ్వర్థకము· | ప్ర. | పలుగురు | అమహత్త్వం |
| | | పలుగుండ్రు | బున దీనికి |
| | | | వ్యస్తప్రయో |
| | | | గంబు లేదు |
| తదర్థకము | ప్ర | వాఁడు | అది, అద్ది, |
| | | | ఆయది, |
| | | | అయ్యది. |

| | | | |
|---|---|---|---|
| | | మ | అ. |
| | ప్ర. | వారు, | అవి, అవ్వి, |
| | | వారలు, | ఆయవి, |
| | | వాండ్రు | అయ్యవి. |
| | ద్వి | వానిని | దానిని, ఆదానిని, |
| | | | అద్దానిని |
| | | వారిని, | వానిని |
| | | వారలను, | |
| | | వాండ్రను | |
| ఇదమర్థకము | ప్ర | వీఁడు, | ఇది, ఇద్ది. |
| | | | ఈయది. |
| | | | ఇయ్యది |
| | | వీరు, వీరలు, | ఇవి, ఇవ్వి |
| | | వీండ్రు | ఈయవి, |
| | | | ఇయ్యవి. |
| | ద్వి. | వీనిని | దీనిని. |
| | | | ఈదానిని, |
| | | | ఇద్దానిని |
| | | వీరిని, వీరలను, | వీనిని |
| | | వీండ్రను | |
| యత్కిమర్థకము | ప్ర. | ఏఁడు, ఏవాఁడు | ఎది, ఏది, |
| | | ఎవ్వాఁడు, | ఎద్ది, ఏయది, |
| | | ఎవ్వఁడు, ఎవఁడు | ఎయ్యది |
| | | ఏరు, ఏవారు, | ఎవి, ఏవి, ఎవ్వి, |
| | | ఏవారలు, | ఏయవి. |

| | మ | అ |
|---|---|---|
| ప్ర | ఏవాండ్రు, | ఎయ్యవి. |
| | ఎవ్వారు, | |
| | ఎవ్వారలు, | |
| | ఎవ్వాండ్రు, | |
| | ఎవ్వరు, | |
| | ఎవ్వండ్రు, | |
| | ఎవరు, ఎవండ్రు | |
| ద్వి | ఏనిని, ఏవానిని, | దేనిని. |
| | ఎవ్వానిని, | ఏదానిని, |
| | ఎవ్వనిని, ఎవనిని, | ఎద్దానిని, |
| | ఏరిని, ఏవారిని, | వేనిని, |
| | ఏవారలను, | ఏవానిని |
| | ఏవాండ్రను, | ఎవ్వానిని. |
| | ఏవ్వారిని, | |
| | ఎవ్వారలను, | |
| | ఎవ్వాండ్రను | |
| | ఎవ్వరిని, | |
| | ఎవ్వండ్రను | |
| | ఎవరిని, ఎవ్వండ్రను. | |

మహతి వాచ్యంబగునే నేకత్వంబున యత్కిమర్థక శబ్దంబు ఎవ్వరిత, ఎవ్వర్త, ఎవ్వత, ఎవరిత, ఎవర్త ఎవత, ఎవ్వరితి, ఎవ్వర్తి, ఎవ్వతి, ఎవరితి, ఎవర్తి, ఎవతి, ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవ్వతె; ఎవరితె, ఎవర్తె, ఎవతె, ఎవ్వర్తుక ఎవ్వతుక, ఎవర్తుక. ఎవతుక— అని యిరువది రెండు రూపంబులు వడయు

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజ వివక్షించునపుడు అతఁడు, ఆతఁడు, ఇతఁడు, ఈతఁడు, ఎతఁడు, ఏతఁడు — అను రూపంబులు వడయు, మహతీవాచకంబులు ఆమె, ఆపె, ఆకె; ఈమె, ఈపె, ఈకె, ఏమె, ఏపె, ఏకె — అను రూపంబులు వడయు

| | | | |
|---|---|---|---|
| యుష్మదర్థకము | ప్ర | నీవు, ఈవు, | మీరు, మీరలు ఈరు, ఈరలు. |
| | ద్వి | నిన్ను‌ను | మిమ్ము‌ను |
| | తృ. | నీచేతను | మీచేతను |
| అస్మదర్థకము | ప్ర | నేను, ఏను. | మేము, నేము. ఏము. |
| | ద్వి | నన్ను‌ను | మమ్ము‌ను |
| | తృ | నాచేతను | మాచేతను |
| ఉభయార్థకము (నిత్య బహువచనాంతము) | ప్ర | | మనము |
| | ద్వి | | మనలను |
| | తృ. | | మనచేతను, మనలచేతను. |
| ఆత్మార్థకము | ప్ర. | తాను | తాము, తారు, తమరు. |
| | ద్వి | తన్ను‌ను | తమ్ము‌ను |
| | తృ | తనచేతను | తమచేతను |

## ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెద

### ఏకార్థక శబ్దము

| మ | | అ |
|---|---|---|
| | | ప్రథమైక వచనాంతములు |
| ప్ర. ఒకఁడు | ఒకరు, ఒకండ్రు, | ఒకటి |
| ఒకొఁడు | ఒకొరు, ఒకొండ్రు, | ఒకొటి |
| ఒక్కఁడు | ఒక్కరు, ఒక్కండ్రు, | ఒక్కటి |
| ఒక్కొఁడు. | ఒక్కొరు, ఒక్కొండ్రు, | ఒక్కొటి |
| ఒకరుఁడు | ఒకరులు, ఒకళులు, | ఎక్కటి |
| | ఒకళ్లు | ఒకఁడు |
| ఒకొరుఁడు | ఒకొరులు, ఒకొళులు, | ఒకొఁడు |
| | ఒకొళ్లు | ఒక్కఁడు |
| ఒక్కరుఁడు. | ఒక్కరులు, ఒక్కళులు, | ఒక్కొఁడు |
| | ఒక్కళ్లు. | ఒండు |
| ఒక్కొరుఁడు | ఒక్కొరులు | ఈ శబ్దంబునకు |
| | ఒక్కొళులు, | సంఖ్యావాచ |
| | ఒక్కొళ్లు | కంబునకు |
| ఒకరువుఁడు | ఒకరువులు | బహువచనంబు |
| ఒకొరువుఁడు | ఒకొరువులు | లేదు. |
| ఒక్కరువుఁడు | ఒక్కరువులు | |
| ఒక్కొరువుఁడు | ఒక్కొరువులు | |
| ఒరుఁడు: | ఒరులు | |
| ఒరవుఁడు | ఒరువులు | |
| ఒండు | ఒండులు, ఒండ్లు, | |
| ఒడ్డు | ఒడ్డులు, ఒడ్లు | |

ద్వితీయాది విభక్తి రూపంబు లూహించుకొనునది.

దీనికి మహతి వాచ్యంబగునపు డేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది

మహత్యర్థకము

ఒకరిత, ఒకర్త, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒకౌరిత, ఒకౌర్త, ఒకౌర్తు, ఒకౌర్తుక, ఒకౌత, ఒకౌతుక, ఒక్కరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక, ఒక్కొరిత, ఒక్కొర్త, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొత, ఒక్కొతుక, ఒకరితి, ఒకర్తి, ఒకతి, ఒకౌరితి, ఒకౌర్తి, ఒకౌతి, ఒక్కరితి, ఒక్కర్తి, ఒక్కతి, ఒక్కొరితి, ఒక్కొర్తి, ఒక్కొతి, ఒకరితె, ఒకర్తె, ఒకతె, ఒకౌరితె, ఒకౌర్తె, ఒకౌతె, ఒక్కరితె, ఒక్కర్తె ఒక్కతె, ఒక్కొరితె, ఒక్కొర్తె. ఒక్కొతె, ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద

| మ | అ | మ. | అ. |
|---|---|---|---|
| ప్ర | | ప్ర. | |
| ఇద్దఱు<br>ఇరుగురు } | రెండు | తొమ్మండ్రు | తొమ్మిది |
| మూగురు<br>ముగ్గురు<br>ముగురు } | మూడు | పదుగురు<br>పదురు }<br>పదుగుండ్రు<br>పదుండ్రు } | పది |
| నలుగురు | నాలుగు | పదునొకరు | పదునొకటి |
| అయిదుగురు | అయిదు | ఇచ్చట నేకశబ్దార్థక రూపంబు | |
| ఏగురు | ఏను | లెల్లనర్థాను రూపంబుగం గూర్చు | |
| ఆఱుగురు | ఆఱు | కొనునది. | |
| ఏడుగురు | ఏడు | పదునొకొరు పదునొకటి | |
| ఎనమండ్రు | ఎనిమిది | ఇత్యాదులు. | |

| మ. | అ | మ | అ |
|---|---|---|---|
| | ప్ర | | ప్ర |
| పన్నిద్దఱు<br>పన్నిరుగురు } | ఇరువదియొకరు ఇరువది యొకటి<br>పండ్రెండు ఇత్యాదులూహ్యంబులు | | |
| పదుమూగురు<br>పదుముగ్గురు<br>పదుమూగురు } | పదమూఁడు | ముప్పండ్రు<br>నలువండ్రు<br>ఏఁబండ్రు | ముప్పది<br>నలువది<br>ఏఁబది |
| పదునలుగురు | పదునాలుగు | అఱువండ్రు | అఱువది |
| పదునయిదుగురు | పదునయిదు | డెబ్బండ్రు | డెబ్బది |
| పదునేగురు | పదునేను | ఎనుబండ్రు | ఎనుబది |
| పదునాఱుగురు | పదునాఱు | తొంబండ్రు | తొంబది |
| పదునేడుగురు | పదునేడు | నూఱుగురు | నూఱు |
| పదునెనమండ్రు | పదునెనిమిది | వేగురు | వేయి |
| పందొమ్మండ్రు | పందొమ్మిది | పదివేగురు | పదివేలు |
| ఇరువండ్రు | ఇరువది | | |

రెండు మొదలగునవి యౌపవిభక్తిక శబ్దంబు లగుటం జేసి ద్వితీయాది విభక్తులు పరంబులగునపుడు టింటులగునని యెఱుంగునది, రెండిటిని, రెండింటిని, రెంటిని, మూఁడిటిని, మూఁడింటిని మూఁటిని — ఇత్యాదులు

ఏక శబ్దమునకు, ఒంటి, ఒకానొకఁడు, ఒకానొకటి, ఒకానొకరిత, ఒరిమ, ఒండొకరు, ఓరట్ట— అను రూపంబులును, ద్విశబ్దార్థంబునకు ఇనుమడి, ఈరాఱు— అను రూపంబులు నర్థవిశేషంబులం జూపట్టెడు.

వ్యా అన్ని మొదలగునవి సర్వనామములు, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని పెక్కు, వలు, ఆ, ఈ, ఏ, నీ, నా, మన, తా, సంఖ్యావాచకములు - అన్ని ప్రభృతులు ఇవి సర్వనామములన్నమాట సర్వనామము = సర్వమునకు నామము అనఁగాఁ బ్రత్యేకించి యొక వస్తువును గూర్చి కాక ప్రసంగవశమ్మున నేవస్తువునుగూర్చి యయినను బ్రయుక్తము కాఁదగిన శబ్దము సర్వనామమన్నఁ బడును ఉదా॥ నీవు ఇది యెదుట నున్న యేవస్తువును గూర్చి యయిన వాడ వచ్చును కాని సర్వనామము

సర్వనామ ప్రక్రియ - 1) వీనికిఁ బ్రథమాంత రూపము లుదాహరింపఁ బడును ప్రథమాంతములలోఁ గలిగిన యాగమాదేశాదులు ద్వితీయాదులలో నగు ననుకొనవలెను ఉదా॥ సర్వతావదర్థకము-అందఱు అందొఱు-ప్రథమాంతములు అన్ని + లు = అంద + ఱ్ + ఉ = అందఱు, అంద + ఱ్ + ఉ = అందొఱు - అని ప్రథమలో మార్పులుకలిగినట్లు కనఁబడును ఇట్టి మార్పులే ద్వితీయాదులలోఁ గలుగును ఉదా॥ అన్ని - ప్రాతిపదికము తత్సమ 2చే- అన్ని + ను తత్సమ 31చె - అన్ని + లను = అంద+ఱ్+అ+ను= అందఱను అందొ + ఱ్ + అ + ను = అందొఱను ఇత్యాది (2) "వీనిలో డుమంతంబుల కెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది " ని+ఆగమము= న్యాగమము నిగాగమ మన్నమాట పూర్వోక్తంబు = పూర్వము చెప్పఁబడినది అనఁగా, తత్సమ 24చే విధించినది ఉదా॥ వానిని ఆ - ప్రాతిపదికము తత్సమ 2చే- ఆ+ను ప్రథమాంతములలో వకార మాగమమయిన రూపములు నిర్దేశింపఁబడినవి వాఁడు మొ॥ కాన ద్వితీయాదులలో వకారమాగమమగు ననుకొనవలెను ఆ+ను=వ్+ఆ+ను=వా+ను తత్సమ 24చే నిగాగమము వాని+ను తత్సమ 26చే-వానిని ఇట్లే తక్కిన డుమంతముల విషయమున నిగాగమ మగును (3) "బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమా బహువచనంబునకుం బోలెనెఱుంగునది" అనఁగాఁ బ్రథమా బహువచనమున బహువచన లకారమునకు రేఫ మాదేశమయినచో, ద్వితీయాదులలో నట్లే గ్రహింపవలెను. ఆరేఫమునకు ముందు ప్రథమాబహువచనమునఁ గలుగు నాగమములు-అనఁగా, పూర్ణబిందు పూర్వక దకారాదులు ద్వితీయాది బహువచనములందు సైతమగును ఉదా॥ బహ్వర్థకము - ప్రథమాబహువచనములు పెక్కండ్రు, పెక్కురు - అని నిర్దేశింపఁబడినవి పెక్కు + లు = పెక్కు+ండ్+ర్+ఉ=పెక్కండ్రు - అని యయినట్లు కనఁబడును కనుక నీయాగమాదేశములే ద్వితీయాది బహువచనములం దగును పెక్కు - ప్రాతి

పదికము తత్సమ 2చే పెక్కు+ను తత్సమ 31చే - పెక్కు + లను = పెక్క+ండ్+ర్+అను=పెక్కండ్రను ఇట్లే, పెక్కండ్రచేత - ఇత్యాదులు పెక్కు+లు=పెక్కు+ర్+ఉ=పెక్కురు — అయినట్లు కన్పట్టును గనుక నీరేఫాదేశము ద్వితీయాది బహువచనములం దగునని గ్రహింపవలెను పెక్కు- తత్సమ 2 చే - పెక్కు + ను తత్సమ 31చే పెక్కు+లను=పెక్కు+ర్+అను=పెక్కురను ఇట్లే పెక్కురచేత-ఇత్యాదులు (4) "విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయ వఱకును గొండొకచోఁ దృతీయయందొక్క రూపంబు వఱకును రూప భేదంబులు వక్కాణించెద శేషంబూహించునది" దీనికి వివరణము - ప్రథమ ననుసరించి ద్వితీయాదులున్నచోఁ బ్రథమయొక్క చే చూపఁబడును ద్వితీయాదులలో విశేషాకారమున్నచో ద్వితీయవఱకుఁ జూపఁబడును దానిని బట్టి తృతీయాదుల రూపము లూహించుకొనవలెను ఉదా॥ తదర్థకము - వాఁడు - ప్ర వానిని ద్వి వానిని అను ద్వితీయను బట్టి వానిచేత- ఇత్యాదిగా ద్వితీయాదుల రూపముల నూహించుకొనవలెను ప్రథమాద్వితీయల కంటె విశేషాకారమున్నచోఁ దృతీయలో నొకరూపము వఱకుఁ జూపఁబడును, తక్కిన రూపముల నూహించుకొనవలెను ఉదా॥ యుష్మదర్థకము - నీవు ఈవు-ప్ర నిన్నును-ద్వి నీచేతను-తృ నీచేతను-అను తృతీయను బట్టి తక్కిన రూపముల నూహించుకొనవలెను నీతోడను, నీకొఱకును, నీకును-ఇత్యాది (ఈకును కానేరదు)

అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పెక్కు, పలు - అను నాఱును రెండు మొదలగు సంఖ్యా వాచకములును మహత్త్వమున బహువచనాంతము లగును అందఱు, అందొఱు, ఇందఱు ఎందఱు, కొందఱు, పెక్కురు పెక్కండ్రు, పలుగురు, పలుగుండ్రు, ఇద్దఱు- మొ॥ ఇవి యమహత్త్వమున నేకవచనాంతము లగును అన్ని, ఇన్ని, ఎన్ని కొన్ని, పెక్కు - "దీనికి బహువచనముం గలదు పెక్కులు" పెక్కులు - అను బహువచనము కలదనుటచే, పెక్కు శబ్దము నిత్యైక వచనాంతము కాదు మఱి యేక వచనాంతములలోఁ జేర్పనేల? యన్నచో — పెక్కు — అను నేక వచనాంతము, అన్ని మొదలగువాని వలె బహుత్వ బోధకమని తెలియుటకు నేక వచనాంతములలోఁ బఠింపబడినది పలు - అమహత్త్వమున విడిగానుండదు రెండు మూఁడు మొదలగునవి సంఖ్యా వాచకములు ఇవియు నేక వచనాంతములనియే చెప్పఁబడెను అనఁగా నేక వచనాంతములయ్యు బహుత్వ బోధకములని గ్రహింపవలెను అంతేకాని యివి నిత్యైక వచనాంతములని తాత్పర్యము కాదు ఉదా॥ తొమ్మిది + లు=తొమ్మి

దులు - తత్సమ 47 సమూహ వాచకము లేక వచనాంతములయ్యు, బహుత్వ బోధకములగును అట్లే అన్ని మొదలగునవి యేకవచనాంతములయ్యు, బహుత్వ బోధకములగునని గ్రహింపవలెను ఇవి యౌపవిభక్తికములు కావున ద్వితీయా ద్యేకవచనములు పరములగునపుడు టి ంటి వర్ణము లగును ఉదా॥ అన్ని-తత్సమ 2 చే - అన్ని + ను అచ్ఛిక 31 చే - అన్ని+టి+ను తత్సమ 26 చే - అన్ని + టి + ని అచ్ఛిక 32చే - అన్నింటిని, అన్నిటిని ఇట్లే ఇన్నింటిని, ఇన్నిటిని, కొన్నింటిని, కొన్నిటిని, పెక్కింటిని, పెక్కిటిని, రెండింటిని, రెండిటిని రెంటిని, మూఁడింటిని, మూఁడిటిని, మూఁటిని, మొ॥

నీ, నా, మన, తా, శబ్దములు నాలుగును మహత్త్వమున, నమహత్త్వ మున నేక రూపమున నుండును ఉదా॥ నీవు రాముఁడవు, నీవు సీతవు, నీవు వృక్షమవు - ఇత్యాది

సర్వతావదర్థకము - సర్వ శబ్దము యొక్కయు, తావత్ - శబ్దము యొక్కయు నర్థము గలది అన్ని సర్వతావదర్థకము సంస్కృతమున సర్వ శబ్దము వాడుచోటను 'తావత్' అను శబ్దము వాడుచోటను దెనుఁగున నొక్క 'అన్ని' శబ్దమే వాడఁబడును కాన సర్వతావదర్థక మనఁబడును అందఱు, అందొఱు - మహద్రూపములు అన్ని - అమహద్రూపము అందఱు జనులు (సర్వేజనాః) అన్ని పుస్తకములు (సర్వాణి పుస్తకాని) ఇట అందఱు, అన్ని - సర్వార్థకములు ఎందఱు భటులు గలరో యందఱు వీరులు (యావంతోభటా స్తావంతో వీరాః) ఎన్ని కావ్యములు గలవో యన్నియుఁ జదువఁదగినవి (యావంతి కావ్యాని తావంతి పఠనీయాని) ఇట, అందఱు, అన్ని - తావదర్థ కములు

ఇయదర్థకము - ఇయత్ - అను శబ్దము యొక్క యర్థము గలది ఇన్ని - ఇయదర్థకము ఇందఱు - మహద్రూపము ఇన్ని - అమహద్రూపము

కియద్యావదర్థకము - కియత్, యావత్ - అను శబ్దముల యొక్క యర్థము గలది ఎన్ని - కియద్యావదర్థకము ఎందఱు - మహద్రూపము ఎన్ని - అమహద్రూపము, వీరెందఱు ఇవి యెన్ని (కియంత ఏతే కియంత ఏతాని) వీనిలోని ఎందఱు, ఎన్ని - శబ్దములు కియదర్థకములు ఎందఱు భటులు గలరో యందఱు వీరులు, ఎన్ని కావ్యములు కలవో - యన్నియుఁ జదువఁదగినవి వీనిలోని, యెందఱు, ఎన్ని శబ్దములు యావదర్థకములు సంస్కృతమున, కియత్, యావత్ - అను శబ్దములు వాడుచోట్లఁ దెనుఁగున నొక్క ఎన్ని శబ్దమే వాడఁబడును గనుక నిది కియద్యావదర్థకము

కతిపయార్థకము - కతిపయ శబ్దము యొక్క యర్థము గలది కొన్ని-కతిపయార్థకము కొందఱు - మహద్రూపము కొన్ని - అమహద్రూపము

బహ్వర్థకము - బహు శబ్దముయొక్క యర్థము గలది పెక్కు, పలు-బహ్వర్థకములు వీని రూపములు పట్టికలోఁ జూడనగును

తదర్థకము తత్ - అను శబ్దము యొక్క యర్థము గలది ఆ-తదర్థకము ప్రక్రియ ఆ-ప్రాతిపదికము తత్సమ 22 చే - ఆ + డుఙ్ తత్సమ 19 చే - ఆఁడు - అగుచుండఁగా, వాఁడు - అని నిర్దేశింపఁబడెను అనఁగా వకారము పూర్వాగమమగు నన్నమాట ఆ + డుఙ్ = వ్ + ఆ+డుఙ్= వా + డుఙ్ తత్సమ 19 చే - వాఁడు "దీర్ఘము మీఁద సాధ్యపూర్ణములేదు" (సంజ్ఞా 15) కాన నిందు సున్న రాదు ఇట్లు ప్రక్రియ యుద్దిష్టమగుటచేతనే యిది సంజ్ఞా 15 లో నుదాహరింపబడెను ఇట్లే తక్కిన రూపముల ప్రక్రియ వారిని - ఆ - ప్రాతిపదికము తత్సమ 2 చే - ఆ+ను ఈ 24 లోని యుదాహరణములచే - వారి + ను- తత్సమ 26 చే - వారిని వారికిని - ఆ-ప్రాతిపదికము తత్సమ 6 చే - ఆ + కు తత్సమ 8 చే - ఆ + కు + ను ఈ 24 సూత్రోదాహరణములను బట్టి - వారి + కు + ను తత్సమ 26 చే - వారికిని

ఇదమర్థకము - ఇదమ్ - అను శబ్దము యొక్క యర్థముగలది 'ఈ' అనునది యిదమర్థకము వీఁడు - మహత్త్వమునఁ బ్రథమైక వచనము. ప్రక్రియ - ఈ - ప్రాతిపదికము ఇది 2 చేఁ బుంలింగ తుల్యమగును గనుక తత్సమ 22 చే - ఈ + డుఙ్ వకారము పూర్వాగమమయి - వ్ + ఈ+ డుఙ్ = వీ + డుఙ్ - అని నిల్చును తత్సమ 19చే - వీఁడు సంజ్ఞా 15చే- సాధ్య పూర్ణము లేదు

యత్కిమర్థకము - యత్ - అను శబ్దము యొక్కయు, కిమ్ - అను శబ్దము యొక్కయు నర్థము గలది ఏ - యత్కిమర్థకము దీని రూపములు పట్టికలోఁ జూడనగును ఈ పని యెవఁడు చేయునో వాఁడు బుద్ధిమంతుఁడు. (య ఇదం కార్యం కరోతి స బుద్ధిమాన్) ఇట, ఎవఁడు అనునది యదర్థకము ఈ పని యెవఁడు చేయుచున్నాఁడు? (క ఇదం కార్యం కరోతి) ఇందలి ఎవఁడు - అనునది కిమర్థకము సంస్కృతమున యత్ కిమ్ - అను శబ్దములు వాడుచోట్లఁ దెలుఁగున నొక్క 'ఏ' శబ్దమే వాడఁబడును కనుక నిది యత్కిమర్థకమయినది

యుష్మదర్థకము - యుష్మత్ - అను శబ్దము యొక్క యర్థముగలది

నీ - యుష్మదర్థకము ప్రక్రియ - నీ - ప్రాతిపదికము వు - ప్రత్యయము చేరి నీ + వు నకారము లోపించిన ఈ + వు = ఈవు తత్సమ 26 చేఁ బ్రాప్తించు ఇత్వమును 27 నిషేధించును నిన్నును నీ - ప్రాతిపదికము తత్సమ 2 చే - నీ + ను 'న్ను' అనునది ద్వితీయావిభక్తి ప్రత్యయమునకు ముందాగమమగును నీ-న్ను + ను దీర్ఘమునకు హ్రస్వము కలిగి, నిన్నును-అగును ఏది దేని కాగమమగునో యది దాని కవయవమగునను యదాగమ పరిభాషచే ద్వితీయావిభక్తి ప్రత్యయమునకు ముందాగమమైన 'న్ను' అనుదానికి విభక్తిత్వము సిద్ధించును కావున 'న్ను' లోని ఉకారము ద్వితీయోకారమగును కాన, నిన్నున్ + అడిగె = నిన్నడిగె, నిన్ను నడిగె - అని వైకల్పిక సంధి జరుగును చూ సంధి 2 నీ చేతను - తృతీయ దీనిని బట్టి తక్కిన రూపములలో నీ - ప్రాతిపదిక మగుననియు దీనిపై విభక్తులను జేర్చి ప్రక్రియ చెప్పవలెననియుఁ దెలిసికొనవలయును నీ + తోడను = నీతోడను నీ + కొఱకును = నీకొఱకును మొ॥ నీకు - నీ - ప్రాతిపదికము తత్సమ 6 చే - నీ + కు తత్సమ 26 చే - ఉత్వమున కిత్వము ప్రాప్తించుచుండఁగా, తత్సమ 27 చే - ఇత్వము నిషేధింపఁబడెను కాన, నీకు - అను రూపమే యేర్పడును చూ తత్సమ 27, ప్రథమలో నీవు, ఈవు - అని రెండు రూపములున్నను, నీ చేత - అను దాని ననుసరించియే యితర విభక్తులుండును కాన నీకు - అను దానికిఁ బర్యాయముగాఁ గల 'ఈకు' అను శబ్దమును గూడ సూరి తత్సమ 27 లో నుద్దేశించెననుట సత్యదూరము (నీకు = ఈకుము కౌ ఆచ్ఛిక 18) మిమ్మును - అనునది ద్వితీయా బహువచనము నీ ప్రాతిపదికము తత్సమ 2 చే - నీ + ను నీ - లోని నకారము మకారమయి మీ + ను = మీ - మ్ము + ను = మిమ్మును 'మ్ము' ద్వితీయ కాగమ మగుటచే విభక్తిత్వము నందెను కాన దీనిలోనిది ప్రత్యయోకారమగును మిమ్మున్ + అడిగె = మిమ్మడిగె, మిమ్ము నడిగె (సంధి 2) మీ చేతను - అను తృతీయను బట్టి మీ శబ్దముపై విభక్తులు చేర్చి రూపములను సాధించుకొనవలెను మీ తోడను, మీ కొఱకును మొ॥ తత్సమ 6 చే - మీ + కు, తత్సమ 16 చే ఉత్వమున కిత్వము ప్రాప్తించు చుండఁగా, తత్సమ 27 చే - ఇత్వము నిషేధింపఁబడెను కాన, మీకు - అను రూపమే యేర్పడును చూ - తత్సమ 27

అస్మదర్థకము అస్మద్ - అను శబ్దముయొక్క యర్థముగలది న్రా-అస్మదర్థకము విశేషాకారము లుండుటచేఁ దృతీయ యందొక్క రూపమువఱకు నుదాహరణములీయఁబడెను ప్రక్రియ - నా ప్రాతిపదికము ను - ప్రత్యయము

చేరి, నా + ను-అగును నా - లోని 'ఆ' కు, ఏ — ఆదేశమయి, నేను — అని సిద్ధించును నకారము లోపించినచో, ఏను-అగును నన్నును - నా - ప్రాతిపదికము తత్సమ 2 చే - నా + ను న్ను - అనునది 'ను' వర్ణకమునకు ముందాగమమగును నా - న్నును దీర్ఘము హ్రస్వమై, నన్నును-అను రూపమేర్పడును మమ్మును - నా-ప్రాతిపదికము తత్సమ 2 చే - నా+ను నా-లోని నకారమునకు మకారమగును మా+ను విభక్తిముందు 'మ్ము' ఆగమమగును మా-మ్మును దీర్ఘము హ్రస్వమయి, మమ్మును - అనురూపమేర్పడును న్ను-మ్ములు ద్వితీయ కాగమము లగుటచే నివి విభక్తిత్వము నందును కావుననే సంధి 2 చే- వైకల్పికసంధి ప్రాప్తించును, నన్నున్+అడిగె=నన్నడిగె నన్నునడిగె మమ్మున్+అడిగె=మమ్మడిగె మమ్మునడిగె నా-మా శబ్దములపై తృతీయాది విభక్తులు చేరును నాతోడ మాతోడ - మొ॥

ఉభయార్థకము - తన్నును, నెదుటివానిని గలిపి చెప్పునది యుభయార్థకము మన - ఉభయార్థకము మనచేత, మనలచేత — అని తృతీయలో రెండు రూపములు నిర్దేశింపఁబడెను కాన నితర విభక్తులలో - మనతోడ, మనలతోడ, ఇత్యాదిగా రెండేసి రూపము లేర్పడును

ఆత్మార్థకము - ఆత్మన్-అను శబ్దముయొక్క యర్థము గలది 'తా' ఆత్మార్థకము ప్రక్రియ — తా+ను = తాను, తాను+ము=తాము ను - ములు ప్రథమా ప్రత్యయములు తా + రు = తారు తమరు 'రు' ప్రత్యయము తన్నును - తా-ప్రాతిపదికము తత్సమ 2 చే- తా + ను = తా - న్ను+ను, తన్నును తమ్మును - తా-ప్రాతిపదికము తత్సమ 2 చే - తా + ను = తా - మ్ము + ను = తమ్మును న్ను - మ్ములు ద్వితీయ కాగమము లయ్యెను కాన సంధి 2 చే - వైకల్పిక సంధి జరుగును తన్నున్ + అడిగె = తన్నడిగె, తన్నునడిగె, తమ్మున్ + అడిగె = తమ్మడిగె, తమ్మునడిగె

ద్విప్రభృతి సంఖ్యావాచకములు - వీనికిఁ బ్రథమాంతము లుదాహరింపఁబడినవి తక్కినవి యూహించుకొనవలెను ఉదా॥ ఇద్దఱు రెండు + లు (ల్ + ఉ) = ఇద్ద+ఱ్+ఉ = ఇద్దఱు తత్సమ 2 చే - రెండు + ను తత్సమ 31 చే - రెండు + లను = ఇద్ద + ఱ్ + అ + ను ఇద్దఱను ఇత్యాది 'ఒక' శబ్దమున కర్థ విశేషములలోఁ గనఁబడు రూపములు - ఒంటి = ఒంటరితనము, ఒకానొకఁడు = నిర్దేశింపఁబడనివాడు ఒకానొకటి = నిర్దేశింపఁబడనిది ఒకానొకరిత = నిర్దేశింపఁబడని స్త్రీ ఒరిమ = ఐకమత్యము, మైత్రి ఒండొరులు = అన్యోన్యము, ఓరట్ట = ఈ శబ్దమెక్కడిదో తెలియదు, అన్వేషణీయము రెండు శబ్దమునకు - ఇమ్మడి = రెట్టి ఈరాఱు = పండ్రెండు

పొరపరిశీలన - కొందఱు పట్టికలలో ఏ (=ఏకవచనము) బ (=బహు వచనము) అను చిహ్నములను ప్రక్షిప్తము చేసినారు సంఖ్యావాచకములయొద్ద సూరి లిఖించిన ప్ర-అను చిహ్నమును దొలగించినారు ఈ పద్ధతి సరికాదు

## సంఖ్యకుం బూరణార్థమునం దవగాగమంబగు. 25

రెండవవాఁడు, రెండవది, మూఁడవవాఁడు మూఁడవది.

వ్యా పూరణార్థమున సంఖ్యకు 'అవ' గాగమమగును అవక్-అని కకార ముతో నిర్దేశించుటచే సంఖ్యకుఁ జివర 'అవ' వచ్చును రెండు+అవ=రెండవ మూఁడు + అవ = మూడవ సంధి 11 చే - అపదాదిస్వర సంధి జరిగెను సమాస 9 చే వాఁడు - అది, శబ్దములను ప్రయుక్తములగును రెండవ+అది సంధి 45 చే- రెండవది మూఁడవ + అది = మూఁడవది పూరణార్థము= దేనిచేత సంఖ్య పూరింపఁబడునో యది పూరణార్థము (పూర్య తేనే నేతి పూరణః) ఉదా॥ రామలక్ష్మణులలో లక్ష్మణుఁడు రెండవ వాఁడు ఇట రెండు సంఖ్యను బూరించువాఁడు లక్ష్మణుఁడు గనుక, లక్ష్మణుని జెప్పు రెండు సంఖ్యకు - అవగాగమమయ్యెను

విశే - (1) ఒకటి శబ్దమున కవగాగమము శాస్త్ర సమ్మతముకాదు (11) రెండు+అవ ఇట, ఉత్వసంధిని గొందఱు చెప్పుట పొరపాటు (111) సంఖ్య కున్ - అనుటచే రెండులోనగు సంఖ్యా వాచకములకే, అవగాగమమగును వీని మహన్మహతీ వాచకములగు ఇద్దఱు లోనగువానికిఁగాదు (1V) రెండవవాఁడు- మున్నగునవి కర్మధారయాభాసములు మూఁడవ కన్ను లోనగునవి కర్మ ధారయములు

## సర్వనామ క్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు. 26

వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు, వీరు మువ్వురు శ్రీ భూ నీళలు

వ్యా సర్వనామముల యొక్కయుఁ, గ్రియాపదముల యొక్కయు బహు వచనము, మహద్వాచకమునకు వలె మహతీవాచకమున కగును అనఁగా మహ ద్వాచకమునకు బహుత్వమున నగు సర్వనామములు, క్రియాపదములు, మహతీ వాచకమునకును బహుత్వమున నగునని తాత్పర్యము ఉదా॥ వారిద్దఱు రుక్మిణీ సత్యభామలు వారు, ఇద్దఱు - అనునవి మహద్బహువచనములు ఇవి మహత్తు లకువలెె మహతీవాచకములగు రుక్మిణీ సత్యభామలకయ్యెను అవి, రెండు -అన్ను

నమహత్సర్వ నామములిటఁగావు మహతి = స్త్రీవాచకము వీరు ముప్వురు శ్రీ భూ నీళలు, వీరు, ముప్వురు - అనునవి మహద్రూపములు శ్రీ భూ నీళలు- మహతీ వాచకములు ఇవి మహత్తులకు వలె మహతీవాచకముల కయ్యెను ఇవి, మూఁడు - అను నమహత్సర్వనామము లిటఁగావు

విశ - క్రియాపదముల కుదాహరణముల నూహించు కొనవలయును. రుక్మిణీ సత్యభామలు వచ్చుచున్నారు ఇట వచ్చుచున్నారు - మహద్బహువచన క్రియ రుక్మిణీ సత్యభామలు - మహతీవాచకములు వచ్చుచున్నవి - అను నమహద్బహువచన క్రియ కాక, వచ్చుచున్నారు - అను మహద్బహువచన క్రియయే యయినది

పదసార్థక్యము - బహువచనంబు — అనుటచే నేకవచనము మహత్తున కుంబోలె మహతికిఁ గాదు ఉదా॥ అది కాంత, అమె కాంత వాఁడు పురుషుఁడు, ఇట వాఁడు - అను మహద్వాచక సర్వనామము మహతికిఁ గాలేదు సీత వచ్చుచున్నది, రాముఁడు వచ్చుచున్నాడు ఇట వచ్చుచున్నాఁడు - అను మహద్వాచక క్రియ మహతికిఁ గాలేదు

## అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. 27

పలుగురు, పలువురు, ఇరుగురు, ఇరువురు, వేగురు, వేవురు, తొగ, తొవ, పగలు, పవలు

వ్యా పదముయొక్క మొదటి వర్ణముకానిదియు, వేఱొక హల్లుతోఁ గూడుకొననిదియు, నగు గకారమునకు వకారము విభాషనగును ఉదా॥ పలుగురు ఇట గకారము పదాద్యము కాదు, సంయుక్తము కాదు కాన గకారమునకు వకారమాదేశమయినచో ఈ పలువురు - అగును కానిచో, పలుగురు— అని యుండును ఇట్లే తక్కినవి

పదసార్థక్యము - (1) అపదాద్యంబయి - అనుటచేఁ బదాద్యమయిన గకారము వకారముకాదు ఉదా॥ గాము, గీము మొ॥ (11) అసంయుక్తంబయిన- అనుటచే సంయుక్తములయిన గకారములు వకారములు కావు ఉదా॥ అగ్గి, ముగ్గు — మొ॥ (111) మొగము, తగవు - మున్నగుచోట్ల గాకు వకారము లేదని విభాషకు వ్యవస్థ కల్పించు కొననగును (1v) గకారమునకు వకారమగుట ప్రాయోవాదము చూ సంజ్ఞా 20.

## ఔ ప వి భ క్తి క ప్ర క ర ణ ము

**ఇ టి తి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌప విభ క్తికంబులు. 28**

విభ క్తి నిమి త్తకంబులయి యాదేశాగ మాత్మకంబు లయిన ఇ టి తి — అను వర్ణంబు లౌపవిభ క్తికంబు లనంబడు.

వ్యా చెప్పఁబోవు ఇ టి తి వర్ణము లౌపవిభ క్తికములు విభ క్తినిమి త్తము గాఁ గలిగి యాదేశాత్మకములు, నాగమాత్మకములు నయిన, ఇ టి తి వర్ణము లౌపవిభ క్తికములనఁబడును ఉపవిభ క్తికి సంబంధించినది యౌపవిభ క్తికము ఉప = సమీపము విభ క్తికి సమీపమున నగునది యుపవిభ క్తి అనఁగా విభక్తులు పరమయినప్పు డగునది యుపవిభ క్తి యన్నమాట చూ 29 సూ ఔపవిభ క్తి కములు చేరు శబ్దములను గూడ నౌపవిభ క్తికములనియే యందురు (16 సూ ) "యత్రైతే తత్రతత్సంజ్ఞానామ్నామన్యస్య చాన్యథా" (వికృ )

**ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు. 29**

కాలు కాలిని, కాలిచే, నాగలి నాగటిని, నాగటిచే, నేయి నేతిని, నేతిచే

ద్వితీయైక వచనంబు పరంబగునపు డౌపవిభ క్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి అయ్యది లక్ష్యలక్షణ విరుద్ధంబగుటం జేసి యనాదరణీయంబు

వ్యా ఇ - టి - తి అను నౌపవిభ క్తికములు ద్వితీయాద్యేక వచనములు పరములగునప్పుడు, కొన్ని ప్రాతిపదికములకుఁ దఱచుగా నగను ఇ -కాలు కాలిని కాలు - ప్రాతిపద్ధికము తత్సమ 2 చే - కాలు + ను అచ్ఛిక 30చే- కాల్ + ఇ + ను = కాలి + ను తత్సమ 26 చే - కాలిని కాలు - ప్రాతి పదికము తత్సమ 3 చే - కాలు + చేత తత్సమ 10 చే - కాలు + చే అచ్ఛిక 30 చే - కాల్ + ఇ + చే = కాలిచే టి - నాగలి ప్రాతిపదికము తత్సమ 2 చే - నాగలి + ను అచ్ఛిక 31 చే - నాగటి + ను తత్సమ 26 చే - నాగటిని నాగలి + చేత = నాగటి చేతి - నేయి + ను 35 చే- నేతి + ను తత్సమ 26 చే - నేతిని నేయి + చేత = నేతిచే

కొందఱు ద్వితీయైక వచనము పరమగునప్పు డౌపవిభ క్తికములు రావని వక్కాణించిరి అనఁగా కాలు + ను, నాగలి + ను, నేయి + ను - మొద

లగుచోట్ల నౌప విభక్తికములు రావని చెప్పిరన్నమాట కాని యీ యభిప్రాయము ప్రయోగ విరుద్ధము, శాస్త్ర విరుద్ధము నగుటచే నాదరింపఁ దగినదికాదు

పదసార్థక్యము - (1) కొన్నింటికి - అనుటచే ననౌప విభక్తికములు కొన్ని యుండునని తెలియుచున్నది ఉదా॥ తెల్లు + ను = తెల్లును మొ॥ (11) ప్రాయికంబుగ - అనుటచే నరుదుగా నౌపవిభక్తికములు రాకపోవచ్చును. ఉదా॥ ఇల్లాలు ఇల్లు - ఔప విభక్తికము ఇంటిని, ఇంటి యొక్క ఇత్యాదులలో నౌపవిభక్తికము తఱుచుగనగును ఇల్లు యొక్క + అలు = ఇల్లు + అలు ఇల్లాలు - అనుచో నౌపవిభక్తికము రాలేదు వచ్చినచో - ఇంటియొక్క +అలు = ఇంటియాలు - కావలసివచ్చును

## ఊరు మొదలగువాని కిత్వంబగు. 30

ఊరు - ఊరిని, కాలు - కాలిని, మ్రాను - మానిని,
నోరు - నోరిని, చోటు - చోటిని

వ్యా ద్వితీయాద్యేక వచనములు పరమగుచో ఊరు - మొదలగు శబ్దముల తుది యచ్చున కిత్వమగును ఊరిని - ఊరు - ప్రాతిపదికము తత్సమ 2 చే - ఊరు + ను ఈ 30 చే - ఊర్ + ఇ + ను = ఊరి + ను తత్సమ 26 చే - ఊరిని ఇట్లే, కాలు + ను = కాలిని, మ్రాను + ను = మ్రానిని, నోరు + ను = నోరిని చోటు + ను = చోటిని

విశే - అనేక వర్ణములు గల స్థాని కేకవర్ణము నాదేశముగ విధించినచో నది స్థానిలోని తుది వర్ణమునకే యాదేశమగును (అలోంత్యస్య - పాణి) ఇట ఊరు - స్థాని దీనికి ఇత్వమాదేశముగ విధింపఁబడెను ఇత్వమేక వర్ణము గాన నిది, ఊరు - శబ్దమునందలి తుది ఉత్వమున కాదేశమగును ఊర్ + ఉ + ను = ఊర్ + ఇ + ను = ఊరి + ను - అగున్ను పిమ్మట, ఊరిని - అని యేర్పడును నోరు + ను = నోటిని చూ 31 సూ॥

## టివర్ణంబు గొన్నింటి యంతాక్షరంబున కాదేశంబును, గొన్నింటి కంతాగమంబును, గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు. 31

ఆదేశము త్రాడు - త్రాటిని, కాడు - కాటిని, నోళ్ళు - న్గోటిని, ఏళు - ఏటిని

ఆగమము అన్ని - అన్నిటిని, ఎనిమిది - ఎనిమిదిటిని, వేయి - వేయిటిని

ఉభయము ఏమి ఏటిని, ఏమిటిని, పగలు - పగటిని, పగలిటిని; మొదలు - మొదటిని, మొదలిటిని, రెండు - రెంటిని, రెండిటిని, మూఁడు - మూఁటిని, మూఁడిటిని, నూఱు - నూటిని, నూఱిటిని.

వ్యా టివర్ణము కొన్నింటి తుది యక్షరమునకుఁ దఱచుగ నాదేశమగును, గొన్నింటికిఁ జివరఁ దఱచుగా నాగమమగును గొన్నింటికిఁ దఱచుగా నాదేశము, నాగమము పర్యాయముగ నగును (1) ఆదేశము - త్రాటిని — త్రాడు - ప్రాతిపదికము తత్సమ 2 చే- త్రాడు+ను ఈ 31 చే- తుది యక్షరమునకు 'టి' వర్ణమాదేశమయి, త్రాటి+ను- అగును తత్సమ 26 చే త్రాటిని ఇట్లే కాడు+ను=కాటిని, నోరు+ను=నోటిని, ఏఱు + ను = ఏటిని-అనువాని ప్రక్రియ గ్రాహ్యము (2) ఆగమము - అన్నిటిని - అన్ని — ప్రాతిపదికము తత్సమ 2 చే - అన్ని + ను ఈ 31 చే - టివర్ణమాగమమయి - అన్ని+టి+ను= అన్నిటి+ను - అగును 32చే- టివర్ణమునకు ముందు నిండుసున్న రానిచో తత్సమ 26చే - అన్నిటిని - అగును ఇట్లే ఎనిమిది + ను = ఎనిమిదిటిని, వేయి+ను=వేయిటిని (3) ఉభయము - అనఁగా నాదేశము నాగమము, నను రెండును, బర్యాయముగ నగుట ఏటిని, ఏమిటిని - ఏమి-ప్రాతిపదికము తత్సమ 2చే- ఏమి+ను తుది యక్షరమునకు 'టి' వర్ణమాదేశమయినచో ఏటి+ను తత్సమ 26చే - ఏటిని ఏమి + ను ఏమి శబ్దమునకుఁ జివర టివర్ణమాగమమయినచో - ఏమిటి + ను తత్స 26చే- ఏమిటిని పగటిని, పగలిటిని - పగలు — ప్రాతిపదికము తత్సమ 2చే- పగలు+ను ఆదేశపక్షమున పగటి+ను తత్సమ 26 చే- పగటిని ఆగమపక్షమున, పగలు+ను=పగలు+టి+ను 36చే- పగలిటి+ను తత్సమ 26చే-పగలిటిని ఇట్లే మొదలు + ను = మొదటిని, మొదలిటిని రెండు + ను = రెంటిని, రెండిటిని మూఁడు+ను=మూఁటిని, మూఁడిటిని, నూఱు + ను = నూటిని, నూఱిటిని

పదసార్థక్యము - (1) ప్రాయికంబుగ ననుటచే - టివర్ణమరుదుగాఁ గొన్నిచోట్లఁ గాకపోవచ్చును ఉదా॥ నోరు + ను అనుచో టివర్ణ మాదేశము కాకపోవచ్చును అప్పుడు 30 చే ఇత్వముకలిగి, నోరిని - అనియు నగును

(11) ఒక శబ్దమునకే రెండౌపవిభక్తికములు కావచ్చుననియు దీనిచేఁ దెలియుచున్నది

## హ్రస్వముమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగానగు. 32

అన్నింటిని, ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని, మూఁడింటిని

వ్యా హ్రస్వముమీఁది 'టి' వర్ణమునకు ముందు నిండు సున్న బహుళముగానగును అన్నింటిని - అన్ని - ప్రాతిపదికము తత్సమ 2చే- అన్ని+ను అచ్చిక 31 చే - అన్నిటి + ను తత్సమ 26చే - అన్నిటి+ని ఈ 32చే అన్నింటిని పూర్ణబిందువు రానిచో - అన్నిటిని ఇట్లే, ఎనిమిది + ను = ఎనిమిదిటి + ను ఎనిమిదింటిని, ఎనిమిదిటిని పగటిని - పగలు తత్సమ 2చే- పగలు+ను అచ్చిక 31చే- పగటి+ను ఈ 32 చే - పగటి+ను తత్సమ 26 చే - పగంటిని పూర్ణబిందువు రానిచో - పగటి+ను=పగటిని రెండింటిని, రెండిటిని - రెండు - తత్సమ 2చే - రెండు + ను అచ్చిక 31చే- రెండు+టి+ను 36 చే- రెండిటి + ను ఈ 32చే- 'టి' వర్ణమునకు ముందు నిండుసున్న వచ్చిన - రెండింటి+ను తత్సమ 26 చే - రెండింటిని నిండుసున్న రానిచో, రెండింటి + ను = రెండిటిని ఇట్లే మూఁడు + ను మూఁడు+టి+ను=మూఁడింటిని, మూఁడిటిని (36)

పదసార్థక్యము (1) హ్రస్వము మీఁది-అనుటచే దీర్ఘముమీఁది-టివర్ణమునకు ముంపు నిండుసున్న రాదు ఉదా॥ త్రాటిని, ఏటిని, మొ॥ హ్రస్వముమీఁది-అననిచో నిది ప్రత్యేక విధానస్థలముగా భాసించి దీర్ఘముపై నిండుసున్న కలుగు ప్రమాద మేర్పడవచ్చును (11) బహుళమనుటచే మొదటికి, మీఁదటికి, మున్నగు చోట్లఁ బూర్ణబిందువు రాదు

పారపరిశీలన - టివర్ణకంబునకు-అను ముద్రణములు సరికావు టివర్ణంబునకు-అనియే ప్రథమ ముద్రణము

## పదాద్యంబగు హ్రస్వంబు మీఁది టివర్ణంబునకుముందు పూర్ణబిందువగు. 33

కన్ను — కంటిని, మిన్ను — మింటిని; ఇల్లు - ఇంటిని; పళ్లు— ఫంటిని

వ్యా నడితొలి హ్రస్వము మీఁది టివర్ణమునకు ముందు పూర్ణబిందు వగును కంటిని - కన్ను ప్రాతిపదికము తత్సమ 2చే- కన్ను+ను 31చే- క+టి+ను ఈ 33చే - కంటి+ను తత్సమ 26చే - కంటిని ఇట్లే, మిన్ను + ను = మింటిని ఇల్లు+ను=ఇంటి+ను ఇంటిని వల్లు + ను= వంటి+ను వంటిని - అనువాని ప్రక్రియనరయునది

విశే - టివర్ణమునకు ముందు బిందువగునన్నచో ఖండబిందువు నిలుపుటకు వీలుండును అది సంధి 22 చే - పూర్ణబిందువుగ నెట్లును మాఱును కాని ప్రక్రియా సౌలభ్య దృష్టితోఁ బూర్ణబిందువగునని సూత్రింపఁబడెను

## అఱ్ఱు మొదఁగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబునగు. 34

అఱ్ఱు - అఱితిని అఱ్ఱు, కఱ్ఱు, కొఱ్ఱు గొఱ్ఱు, మిఱ్ఱు, వఱ్ఱు. ఇవి యఱ్ఱు మొదలయినవి

వ్యా అఱ్ఱు మొదలైన శబ్దములకుఁ జివర 'తి' వర్ణమాగమమగును. ఒక రేఫమునకు లోపమును నగును

అఱితిని - అఱ్ఱు - ప్రాతిపదికము తత్సమ 2 చే - అఱ్ఱు + ను ఈ 34 చే - అఱు + తి + ను 36 చే - అఱి + తి + ను తత్సమ 26 చే - అఱితిని ఇట్లే, కఱ్ఱు + ను = కఱితిని, కొఱ్ఱు + ను = కొఱితిని, గొఱ్ఱు+ ను = గొఱితిని, మిఱ్ఱు + ను మిఱితిని, వఱ్ఱు + ను = వఱితిని

## విభక్తి పరంబగునపుడు గోయి ప్రభృతుల తుద యక్షరంబు తివర్ణంబగు. 35

గోయి — గోతులు, గోతిని — గోతులను గోయి, చేయి, దాయి, నూయి, నేయి, వాయి, రోయి, ఇత్యాదులు

వా. విభక్తి పరమగునపుడు గోయి — మొదలగు వాని తుది యక్షరము తివర్ణమగును గోతులు గోయి - ప్రాతిపదికము తత్సమ 12 చే - గోయి+ లు ఈ 35 చే - గోతి+లు తత్సమ 45 చే - గోతులు గోతిని - గోయి - తత్సమ 2 చే - గోయి+ను ఈ 35 చే - గోతి+ను తత్సమ 26 చే - గోతిని గోతులను - గోయి - తత్సమ 2 చే - గోయి+ను తత్సమ 31 చే - గోయి+లను ఈ 35 చే - గోతి+లను తత్సమ 45 చే - గోతులను ఇట్లే, చేయి=చేతులు చేతిని, చేతులను - ఇత్యాది

పదసార్థక్యము - ఔపవిభక్తికములు ద్వితీయాద్యేకవచనము పరమగు నపుడే యగును (29 సూ॥) కాని యిట విభక్తిపరంబగునపుడు అనుటచే నితర విభక్తులు వరమగునపుడును నగునని గ్రహింపవలెను గోయి+లు=గోతి+లు· గోతులు గోయి+లను=గోతి+లను గోతులను మొ॥

## టితివర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు. 36

రెండిటికి, మూఁడిటికి, నాలుగిటికి, పగలిటికి, మొదలిటికి, పెక్కిటికి కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు నెత్తుటికి.

వ్యా ఆగమములగు, టితివర్ణములు పరమగుచో, ఉత్వమున కిత్వమగును రెండిటికి - రెండు - తత్సమ 6 చే - రెండు+కు అచ్ఛిక 31 చే - రెండు + టి + కు ఈ 36 చే - టి - వరమగుచో ఉత్వమునకు, ఇత్వము కాఁగా, రెండి+టి+కు=రెండిటి+కు 32 చే - 'టి' ముందు నిండుసున్న రానిచో తత్సమ 26 చే - రెండిటికి ఇట్లే తక్కినవాని ప్రక్రియ యూహ్యము ఉత్వమున కిత్వము కొన్నిచోట్లఁ గనఁబడదు ఉదా॥ నెత్తుటికి - నెత్తురు - తత్సమ 6 చే - నెత్తురు+కు అచ్ఛిక 31 చే - నెత్తు + టి + కు ఈ 36 చే - ఉత్వమున కిత్వము ప్రాప్తించుచుండఁగా "కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు" అని ఇత్వము నిషేధింపఁబడెను కావున - నెత్తుటి+కు తత్సమ 26 చే, నెత్తుటికి - అని యగును తివర్ణము వరమగుచో ఉత్వమున కిత్వమగుట 34 సూత్రముననే ప్రదర్శింపఁబడుటచే నిట నుదాహరణము చూపబడలేదు ఉదా॥ అటితిని చూ - 34 ఇట్లే అఱుతన్, వఱుతన్ - చూ 38 సూ॥

విశే - లక్ష్యనిర్దేశమునుబట్టి యాగమములగు టి తి, వర్ణములు పరమగు నపుడే, ఉత్వమున కిత్వమగును ఆదేశములు వరమగుచోఁ గాదు నూఱు+కును 31 చే - నూ+టి+కును ఇట, ఉత్వమున కిత్వము కాదు నూటికిని (ఉత్వమునుచోఁ దపరకరణము లేదు)

## టివర్ణంబు పరంబగునపుడు క్రిందు, మీఁదు, ముందు, పువర్ణంబుల కత్వంబగు. 37

క్రిందు—క్రిందటిని మీఁదు—మీఁదటిని, ముందు—ముందటిని, మాపు—మాపటిని, అప్పుడు—అప్పటిని

వ్యా టివర్ణము పరమగునపుడు క్రిందు, మీఁదు, ముందు శబ్దముల తుది యచ్చునకు, శబ్దాంత్య పువర్ణముల తుది యచ్చునకు, అత్వమగును క్రిందటిని,,

క్రిందు - ప్రాతిపదికము తత్సమ 2 చే - క్రిందు+ను ఆచ్ఛిక 31 చే - క్రిందు+టి+ను ఈ 37 చే, ఉత్వమున కత్వమై క్రింద+టి+ను అగును తత్సమ 26 చే - క్రిందటిని ఇట్లే, మీఁదు+ను=మీఁదటిని, ముందు+ను= ముందటిని పువర్ణమునకు మాపటిని - మాపు - తత్సమ 2 చే మాపు+ను ఆచ్ఛిక 31 చే - మాపు+టి+ను ఈ 37 చే - మాపటి+ను తత్సమ 26 చే - మాపటిని ఇట్లే, అప్పుడు+ను=అప్ప+టి+ను అప్పటిని - అని ప్రక్రియ గ్రహింపవలెను

విశే - అనేక వర్ణములుగల స్థాని కేకవర్ణ మాదేశముగ విధింపఁబడినచో నది స్థానిలోని తుది వర్ణమునకే యాదేశమగును (అలోంత్యస్య - పాణి) కాన క్రిందు, మీఁదు, ముందు పువర్ణముల తుది ఉత్వమునకే అత్వ మాదేశమగును

## ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు. 38

గోరను గీఱెను, ఊరనున్నాఁడు, గొడ్డట నఱికెను, ఇంట లేఁడు, వఱుతఁగలిసె, కఱుతదూఁటె పక్షంబునందు, గోరిచేత నూరియం దిత్యాదులు

### ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము

వ్యా ఔపవిభక్తిక శబ్దముల తృతీయా సప్తమీ విభక్తులకు బహుళముగ, అత్వమాదేశమగును గోరను - గోరు - ప్రాతిపదికము తత్సమ 3 చే - గోరు+చేత ఆచ్ఛిక 30 చే - గోరి+చేత ఈ 38 చే - తృతీయకు (చేత) అత్వ మాదేశమయినచో - గోరి+అ ఆదేశము స్థానివంటిది గనుక (స్థానివదాదేశః పాణి) నుగాగనుము తత్సమ 8 చే - నగును గోరి+అ+ను సంధి 11 చే - గోరను - అనియగును అత్వాదేశము కానిపక్షమున- గోరి + చేత = గోరిచేత—అని యుండును ఊరను - ఊరు - ప్రాతిపదికము తత్సమ 7చే- ఊరు+అందు ఆచ్ఛిక 30 చే- ఊరి + అందు ఈ 38 చే — ఊరి + అ ఆదేశము స్థానివంటిది కనుక, నుగాగమము తత్సమ 8చే నగును ఊరి+అను సంధి 11చే - ఊరను అత్వ మాదేశము కానిచో - ఊరి + అందు సంధి 11 చే - సంధి యథాసంభవముగ నగును గనుక నిట సంధిలేదు సంధి 3చే- ఊరి- య్ + అందు = ఊరియందు - అగును గొడ్డటను - గొడ్డలి - ప్రాతిపదికము - తత్సమ 3 చే గొడ్డలి + చేత ఆచ్ఛిక 31చే- గొడ్డటి+చేత

ఈ 38చే గొఱ్ఱటి + అ ఆదేశము స్థానివంటిది కనుక తత్సమ 8 చే - నుగాగమము గొఱ్ఱటి + అ + ను = గొఱ్ఱటి + అను సంధి 11 చే- గొఱ్ఱటను గొఱ్ఱటను + నటికెను సంధి 18 చే- గొఱ్ఱట నటికెను ఇంటను - ఇల్లు - ప్రాతిపదికము తత్సమ 7 చే - ఇల్లు + అందు అచ్ఛిక 31చే- ఇ + టి + అందు, 33చే- ఇంటి + అందు ఈ 38చే - ఇంటి + అ ఆదేశము స్థానివంటిది కనుక తత్సమ 8చే- నుగాగమము ఇంటి+అను సంధి 11చే- ఇంటను ఇంటను + లేఁడు సంధి 18 చే- ఇంటలేఁడు వఱుతను - వఱ్ఱు - ప్రాతిపదికము తత్సమ 7చే - వఱ్ఱు+అందు అచ్ఛిక 34చే - వఱు+తి + అందు = వఱుతి + అందు 36 చె- ఉత్వమున కిత్వము ప్రాప్తించు చుండఁగా "కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు" అను వృత్తి వాక్యముచే నిట వఱు_లోని ఉత్వమున కిత్వములేదు ఈ 38 చే- వఱుతి+అ ఆదేశము స్థానివంటిది కనుక, నుగాగమము తత్సమ 8 చే నగును వఱుతి+ అను సంధి 11చే- వఱుతను పక్షమున - వఱుతి+అంద 36 చే - వఱితి+ అందు సంధి 11చే - వఱితియందు కఱుతను - కఱ్ఱు - ప్రాతిపదికము తత్సమ 3 చే- కఱ్ఱు + చేత అచ్ఛిక 34 చే- కఱు + తి + చేత 36చే- ఉత్వమున కిత్వము ప్రాప్తించుచుండఁగా "కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు" అను వృత్తి వాక్యమిత్వమును నిషేధించును ఈ 38 చే- కఱుతి+ అ ఆదేశము స్థానివంటిది కనుక నుగాగమము, తత్సమ 8 చే నగును కఱుతి + అను సంధి 11 చే కఱుతను పక్షమున - కఱుతి + చేత 36చే- కఱితిచేత

విశే - (1) గొఱ్ఱటను, ఇంటను, వఱుతను, కఱుతను - అను వానిని బట్టి యౌపవిభక్తికములు చేసినపిమ్మటనే అత్వాదేశమని తెలియుచున్నది కాన, గోరు + చేత = గోరు + అ అని కొందఱు ప్రక్రియ చెప్పుట సరికాదు గోరి + అ - అని చెప్పవలెను (11) అపదాదిస్వరము పరమగుచో - సంధి 11 సూత్రము చేతనే సంధి జరిగె ననవలెను కాన ఉత్త్వ సంధిని, అత్త్వసంధిని, ఇత్త్వసంధిని దెచ్చి పెట్టరాదు (111) కఱుతదూఁటె, వఱుతఁగలిసె-అని, తొలుతఁ దృతీయకు, సప్తమికిఁ దరువాత, నుదాహరణములుండుట క్రమము కాని వఱుఁగలిసె-అన్న ముగింపులో నమంగళ స్ఫూర్తి కలదు కావున, కఱుత దూఁటె - చివరఁ జేర్పఁబడియుండును (మంగళమధ్యాని)

పదసార్థక్యము - (1) అత్వంబాదేశంబు - అని ఆదేశశబ్దమును వాడుటచే, అత్వము తృతీయాసప్తమీ ప్రత్యయముల కంతటికి నాదేశమగునని

సూచన గౌరి + చేత = గౌరి + అ అత్వ మేకవర్ణము గనుకఁ దృతీయా సప్తమీ ప్రత్యయముల తుది యచ్చున కాదేశము కావలసియుండును ఏలయన ననేకవర్ణములుగల స్థాని కేకవర్ణము నాదేశముగ విధించినచో నది స్థానిలోని తుదివర్ణమునకే యగును (అలోంత్యస్య-పాణి) కాన ఆదేశంబు - అనుటచే సర్వాదేశమయ్యెను (11) బహుళమనుటచే ఊరు మున్నగు వానికిఁ దృతీయార్థము లేదని చెప్పఁదగును ఊరను = ఊరియందు-అని మాత్రమే యర్థము

ఇది ఘంటాపథము

# కారక పరిచ్ఛేదము



## ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు. 1

ప్రాతిపదికార్థమునందు రాముఁడు, రావణుఁడు, నియతోపస్థితికము ప్రాతిపదికార్థము సంబోధనంబునందు ఓ రాముఁడ, ఓ రావణుఁడ ఉక్తార్థమందు రాముఁడు రావణుని సంహరించెను ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచకమగు రామ శబ్దమునకుఁ బ్రథమయయ్యె. రామునిచే రావణుఁడు సంహరింపఁ బడియె ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యె నని యెఱుంగునది

వ్యా ఈ పరిచ్ఛేదమున విభక్త్యర్థములు వివరింపఁబడును విభక్తి= ప్రకృత్యర్థమును విభజించునది (విభజ్యతే ప్రకృత్యర్థః అనయా)

ప్రాతిపదికార్థమునందును, సంబోధనార్థమునందును, ఉక్తార్థమునందును, ప్రథమా విభక్తియగును (1) ప్రాతిపదికార్థమునందు- నియతోపస్థితికము ప్రాతిపదికార్థము (నియతోపస్థితికః ప్రాతిపదకార్థః (సి కౌ) నియత=నియతమయిన, ఉపస్థితికము = స్ఫూర్తికలది ప్రాతిపదికము నుచ్చరింపఁగానే, నియతముగా స్ఫురించు నర్థము ప్రాతిపదికార్థము ఉదా॥ రామ-ప్రాతిపదికము ఈ ప్రాతిపదికము నుచ్చరింపఁగానే, యే యర్థము నియతముగా స్ఫురించునో యదే రామ - అను యొక్క యర్థము ఇట్లే 'రావణ' అను ప్రాతిపదికము నుచ్చరింపఁగానే యే యర్థము నియతముగా స్ఫురించునో యదే, రావణ - అను ప్రాతిపదికముయొక్క యర్థము రాముఁడు, రావణుఁడు - అనువానిలో ప్రథమావిభక్తి ప్రాతిపదికార్థమున నయినది (2) సంబోధనంబునందు సంబోధనము = తత్సమ 32 ఓ రాముఁడ, ఓ రావణుఁడ ఇటఁ బ్రథమా

విభక్తి సంబోధనార్థమున నైనది (3) ఉక్తమనఁగా జెప్పఁబడినది అఖ్యాతముచేఁ జెప్పఁబడినది యని తాత్పర్యము అఖ్యాతము = క్రియావిభక్తి "డుజ్ - రు, వు - రు, ను - ము" - అనునవి క్రియావిభక్తులు క్రియా 8 ఉదా॥ (1) రాముఁడు రావణుని సంహరించెను ఇందు సంహరించెను - క్రియ (సంహరించు+ఎను) ఎను - అనునది యిటఁ గ్రియాప్రత్యయము ఇది డుజ్ - అను క్రియా ప్రత్యయమున కాదేశముగ నయినది (క్రియా 16) ఈ క్రియా ప్రత్యయము కర్తను జెప్పుచున్నది ఏలయన నిది కర్త్రర్థకవాక్యము (క్రియా 48) కర్త ఈ వాక్యమున, రాముఁడు గనుక, రామశబ్దమునకుఁ బ్రథమమయినది అనఁగా నీ వాక్యమునఁ బ్రథమావిభక్తి ఉక్తార్థమున నైనదన్నమాట (ii) రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె ఇది కర్మార్థక వాక్యము కనుక నిరదలి క్రియావిభక్తి కర్మను జెప్పుచున్నది (క్రియా 48) సంహరింపఁబడియె-అనుచో ద్రుత మవసానమున లోపించినదని గుర్తింపవలెను (సంధి 20) ఈ వాక్యమున కర్మ - రావణుఁడు కావున రావణశబ్దమున కుక్తార్థమునఁ బ్రథమయయినది

విశే - (1) "నామార్థమాహ - ఏకంద్వికంత్రికంచాథ, చతుష్కంపంచకం తథా, నామార్థ ఇతిసర్వేమీ, పక్షాః శాస్త్రనిరూపితాః వై భూ సా (1) ప్రాతిపదికార్థము జాతియన్నది మొదటి పక్షము రామత్వము, రావణత్వము, ననునవి యీ పక్షమునఁ బ్రాతిపదికార్థములగును (2) ప్రాతిపదికార్థము జాతివ్యక్తులని రెండవ పక్షము రామత్వ రావణత్వములు (జాతి) రామరావణ వ్యక్తులు (వ్యక్తి) నీ పక్షమునఁ బ్రాతిపతికార్థములగును (3) జాతివ్యక్తి లింగములు ప్రాతిపదికార్థములని మూడవ పక్షము రామత్వరావణత్వములు (జాతి) రామరావణ వ్యక్తులు (వ్యక్తి) పుంలింగములు (లింగము) నీపక్షమునఁ బ్రాతిపదికార్థములు (4) జాతి వ్యక్తి లింగ సంఖ్యలు ప్రాతిపదికార్థములని నాల్గవపక్షము రామత్వ రావణత్వములు (జాతి) రామ రావణ వ్యక్తులు (వ్యక్తి) పుంలింగములు (లింగము) ఏకవచనములు (సంఖ్య) నీ మతమునఁ బ్రాతిపదికార్థములు (5) జాతి వ్యక్తి లింగ సంఖ్యా కారకములు ప్రాతిపదికార్థములన్నది యైదవ పక్షము ఈ పక్షమున రామత్వ రావణత్వములు (జాతి) రామరావణ వ్యక్తులు (వ్యక్తి) పుంలింగములు (లింగము) ఏకవచనములు (సంఖ్య) కర్మాది కారక షట్కము (కారకము) ప్రాతిపదికార్థములగును అగ్నియందుండు దహనశక్తి ద్యోతకమగుట కెండుకట్టె సాధనమయినట్లే ప్రాతిపదికార్థముల్లు ద్యో[illegible] మగుటకుఁ బ్రత్యయములు సాధనములు [illegible] లింగములు ప్రాతిపది కార్థములనియు, సంఖ్యా కారకములు [illegible]ర్థములనియు మతాంతరము

(ii) విభక్త్యర్థ విషయమున నాలుగు పక్షములు గలవు (1) వాచకత్వపక్షము - సంఖ్యా కారకములు విభక్త్యర్థములకు వాచకములని మొదటి పక్షము అనియత లింగములగు తటాదుల విషయమున (తటః - తటీ - తటమ్) లింగము గూడ విభక్త్యర్థము (2) ద్యోతకత్వపక్షము - ప్రాతిపదికములందున్న సంఖ్యా కారకములకు విభక్తులు ద్యోతకములనుట రెండవ పక్షము (3) సముదాయమే సంఖ్యాది విశిష్టార్థమును బోధించునని మూఁడవ పక్షము (4) సముదాయమే సంఖ్యాది విశిష్టార్థమునకు సలక్షణమని నాల్గవ పక్షము (వాక్య ప వాక్య 164, 165) (iii) కారకము=క్రియాజనక కారకము (కరోతీతి కారకమ్ మ భా) క్రియా నిష్పత్తి విషయమున ద్రవ్యములందుండు శక్తి కారకమన్నమాట (క్రియాణాభినిష్పత్తౌ సామర్థ్యం సాధనం విదుః - వాక్య ప సాధనము = కారకము) వ్యాపారభేదవివక్షచేఁ గారకభేదము లేర్పడును కారకములాఱు (షట్ శక్తిర్నాతి వర్తతే - వాక్యప) చూ - 2, 3, 4, 5, 8, 9, 7, 13, 17 సూ (iv) కౌమారము యౌవనము మున్నగు నవస్థాభేదములనుబట్టి వ్యక్తియందు జాతి వాచ్యమగును "సంజ్ఞా శబ్దానామ వ్యుత్పత్తి ప్రకృత్య వినాశాత్పిండస్య కౌమారయౌవనాద్యవస్థాభేదేఽపి స ఏవాయ మిత్య భిన్న ప్రత్యయ నిమిత్తా దిత్థత్వాదికా జాతి ర్వాచ్యా" (మ భా ప్ర)

## కర్మంబున ద్వితీయ యగు. 2

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమునాఁబడు దేవదత్తుఁడు వంటకమును వండెను, ఇట వండెనను మాటకు వంటచేసెనని యర్థము వంట ఫలము చేయుట వ్యాపారము వంటయనఁగాఁ బాకము. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెనని యెఱుంగునది

వ్యా కర్మార్థమున ద్వితీయా విభక్తియగును కర్మము = ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు (ఫలాశ్రయః కర్మ - వై భూ సా) ధాతువు యొక్క యర్థమయిన ఫలమున కాశ్రయమయినది కర్మమని యర్థము ధాతువున కర్థములు రెండు (1) ఫలము (2) వ్యాపారము (ఫలవ్యాపారయోర్ధాతు రాశ్రయేతు తిజస్మృతాః - వై భూ సా) ఫలాశ్రయము కర్మము ఉదా॥ దేవదత్తుఁడు వంటకమును వండెను వండెను = వంటచేసెను ఇట ధాత్వర్థములు - (1) వంట ఇది ఫలము, (2) చేయుట ఇది వ్యాపారము వంట యనఁగాఁ బాకము పాకము=పచనము, మెత్తన వండుటవలన సిద్ధించు

ఫలము పదార్థము పాకమగుట ఈ వాక్యమునఁ బాకమయిన వస్తువేది? వంటకము కనుక వంటకము పాకమున కాశ్రయ మయినది పాకమున కాశ్రయమగుటచే వంటకము కర్మమయినది ఈ సూత్రముచేఁ గర్మార్థమున ద్వితీయ మయినది ఫలాశ్రయమై క్రియ కుపకరించుటచే నిట, వంటకము - కర్మకారక మనఁబడును

## చేత వర్ణకంబు కర్తకగు. 3

ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు దేవదత్తునిచేత వంటకము వండఁబడియె వండఁబడియె ననఁగా వంటచేయఁ బడియె నని యర్థము చేయుట కాశ్రయుండగుటం జేసి దేవదత్తుండు కర్తయయ్యె

వ్యా కర్తను బోధించు శబ్దమునకు 'చేత' ప్రత్యయమగును వర్ణకము= ప్రత్యయము కర్త = ధాత్వర్థ వ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు (ధాత్వర్థ వ్యాపారాశ్రయః కర్తా వై భూ సా) ధాతువుయొక్క యర్థమయిన వ్యాపారమున కాశ్రయమయినది కర్తయని తాత్పర్యము ధాతువున కర్థములు రెండు (1) ఫలము (2) వ్యాపారము, ఫలాశ్రయము కర్మము (2 సూ॥) వ్యాపారాశ్రయము కర్త దేవదత్తునిచేత వంటకము వండఁబడియె వండఁబడియె నఁనగా వంటచేయఁబడెనని యర్థము ఇట ధాత్వర్థములు- (1) వంట ఇది ఫలము (2) చేయుట ఇది వ్యాపారము వండుట యను వ్యాపారమును నెఱవేర్చిన వాఁడెవఁడు? దేవదత్తుఁడు కనుక వండుట యను వ్యాపారమున కాశ్రయుఁడగు దేవదత్తుఁడు కర్తయయ్యెను ఈ సూత్రముచేఁ గర్తను బోధించు దేవదత్త శబ్దమునకు 'చేత' ప్రత్యయమయినది ఇట, వ్యాపారాశ్రయుఁడై క్రియా నిష్పత్తి కుపకరించు చుండుటచే, దేవదత్తుఁడు కర్తృ కారకమనఁబడును రాముఁడు రావణుని సంహరించెను (1 సూ) అను నదియుఁ గర్తృకారకమున కుదాహరణమగును ఈ 3 వ సూత్రమునందలి కర్త ననభిహిత కర్తయని యందురు క్రియా 124

## చేత వర్ణకంబు హేతు కరణంబులకు గ్రహ్యాది యోగజంబగు పంచమికిని బహుళంబుగానగు. 4

ఫలసాధన యోగ్యంబగు పదార్థంబు హేతువు క్రియాసిద్ధిం బ్రకృష్టోప కారకంబు కరణంబు హేతువునకు ధనముచేత సౌఖ్యంబు

గలుగు విద్యచేత యశంబుగలుగు పక్షంబున వలన వర్ణకంబగు కరణంబునకు ఖడ్గంబుచేతఖండించె కోలచేతఁ గూలనేసె పక్షంబునం దోడ వర్ణకంబగు గ్రహ్యాది యోగంబునందు జరాసంధుఁడు రాజుల చేతఁ గప్పంబు గొనియె. మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె ఈ యర్థంబు నీచేత నెఱింగితి ఈ వృత్తాంతంబు వానిచేత వింటి పక్షంబున, వలన వర్ణకంబగు ఇత్యాదికంబు లెఱుంగునది

వ్యా॥ చేత ప్రత్యయము, హేతువునకు, కరణమునకు, 'కొను' మొదలగు వాని సంబంధమున నగు పంచమీ విభక్తికి, బహుళముగా నగును (1) హేతువునకు హేతువు=ఫలసాధన యోగ్యంబగు పదార్థంబు హేతువు (ఫలసాధన యోగ్యః పదార్థాహి లౌకికో హేతుర్ద్రవ్యాదివిషయః-హేలా) అనఁగా ఫలమును సాధించుటకు యోగ్యమయిన వస్తువు హేతువనియర్థము ధనముచేత సౌఖ్యంబు గలుగు ఇట సౌఖ్యము ఫలము ఫలమగు సౌఖ్యమును సాధించుటకు యోగ్యమయిన పదార్థమిట ధనముగనుక, ధనము - హేతువగును ఈ సూత్రముచే హేతువగు ధనశబ్దమునకు 'చేత' ప్రత్యయమయి ధనముచేత-అని సిద్ధించినది చేతవర్ణకముకానిచో 9చే - వలన వర్ణకమగును ధనమువలన సౌఖ్యంబుగలుగు విద్యచేత యశంబు గలుగు ఇట యశము ఫలము విద్య - హేతువు కావున నీ సూత్రముచే, "చేత" ప్రత్యయము కలిగి, విద్యచేత- అని యయినది చేత వర్ణకము కానిచో, 9 చే - వలన వర్ణక మగును విద్యవలన యశంబు గలుగు (2) కరణంబునకు కరణము = క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు (క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కరణ సంజ్ఞం స్యాత్-సి కౌ) క్రియా=వ్యాపారము యొక్క (పనియొక్క) సిద్ధిన్ = నెఱవేఱుటయు, ప్రకృష్ట = అతిశయముతోఁ గూడిన, ఉపకారకంబు=ఉపకార కర్త అనఁగాఁ గ్రియ నెఱవేఱుటయందితర కారకముల కంటె నతిశయముగ నుపకరించునది కరణమని యర్థము క్రియ నెఱవేఱుటకుపకరించు కారకములలో నేక్రియ జరిగిన యనంతరము క్రియ నెఱవేఱినట్లు వివక్షితమగునో యది, కరణమని తాత్పర్యము (క్రియాయాం పరినిష్పత్తిర్య ద్వ్యాపారానంతరం వివక్షితేయదాయత్ర కరణంతత్ తదా స్మృతమ్ - వాక్యప) ఉదా॥ ఖడ్గంబుచేత ఖండించె ఇట ఖండించుట యను క్రియ ఖడ్గవ్యాపారానంతరమే జరిగినట్లు వివక్షితమగుటచే, ఖడ్గము ప్రకృష్టోపకారకము కాన నిది కరణమనఁబడును ఇటఁ బ్రకృష్టోపకారకముగ ఖండన క్రియా నిష్పత్తి కుపకరించుటచే, ఖడ్గము - కరణకారకమనఁబడును ఇట్లే,

కోలచేతఁ గూలనేసె - అనుచోఁ గోలప్రకృష్టోపకారకముగ వివక్షితమగుటచేఁ గరణమగును వానికి 4 చే – చేత వర్ణకము, కానిచో, 5 చే - "తోడ" వర్ణకమగును ఖడ్గంబుతోడ ఖండించె, కోలతోడఁ గూలనేసె (3) గ్రహ్యాదియోగజంబగు పంచమికి - గ్రహి + ఆది+గ్రహి = గ్రహించుట ఆది=మొదలగువానియొక్క, యోగజంబు=సంబంధమునన్నైనది గ్రహ్యాదులు = కొను, విను, ఎఱుఁగు - అనునవి కొను, విను, ఎఱుఁగు ననువానితో నన్వయముగల పంచమీ విభక్తికి చేతవర్ణకము బహుళముగ నాదేశమగునని యర్థము కొను మున్నగు వానితోఁ నన్వయ మున్నప్పుడు, వలన - అను పంచమీ విభక్తి 9 చే - అగును ఆ వలన వర్ణకమునకు చేతవర్ణకము బహుళముగ నాదేశమగునని తాత్పర్యము ఉదా॥ జరాసంధుఁడు రాజులవలనఁ గప్పంబు గొనియె - అని 9 చే - వలన వర్ణకమగును ఈ 4 చే - వలనకు 'చేత' వర్ణకము బహుళముగ నాదేశమగును జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబుగొనియె - అని యేర్పడును చేత వర్ణకమాదేశము కానిచో - జరాసంధుఁడు రాజులవలనఁ గప్పంబు గొనియె- అని యుండును ఇట్లె తక్కిన వాక్యములలో గ్రహింపవలెను

విశే - (I) గ్రహ్యాదియోగమున చేతవర్ణకమగుట సంస్కృతమునకు విలక్షణము సంస్కృతమునఁ బంచమియే యగును (II) ఇక్ శ్తి పౌధాతునిర్దేశే (పాణి) అను వార్తికముచే, గ్రహ్-ధాతువు, ఇగంతముగ నిర్దిష్టము ఇట్లే, 'పచి' మొ (6 సూ) (III) హేతువు ద్రవ్యాది జనకము ద్రవ్యాది విషయో హేతుః, కారకం నియతక్రియమ్-ధనేనకులమ్, విద్యయాయశః (వాక్యప సాధన 25)

## కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడ వర్ణకంబగు. 5

కరణంబునందు కోలతోడఁ గూలనేసె సహార్థంబునందు రాజు సేనలతోడ వచ్చె సేనాసహితుండయి వచ్చెనని యర్థము. తుల్యార్థయోగంబునందు చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు తృతీయ కనుటం జేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు

వ్యా కరణార్థమున, సహార్థమున, తుల్యార్థయోగమునఁ దృతీయకుఁ దోడ ప్రత్యయమగును కరణార్థము - కరణము = క్రియాసిద్ధిం ప్రకృష్టోపకారకంబు కరణంబు (చూ 4 సూ) ఉదా॥ కోలతోడఁ గూలనేసె ఇట కోల - కరణము 4 చే, కరణమునకు 'చేత' ప్రత్యయము బహుళముగ నగును కోలచేతఁగూల

నేసె చేత ప్రత్యయము కాని పక్షమున, సీ 5 చే - తోడ వర్ణకమగును కోల తోడఁ గూలనేసె సహార్థము - సహ - అను శబ్దముయొక్క యర్థమున, 'తోడ' ప్రత్యయమగును సహ = సహితము రాజు సేనలతోడ వచ్చె = సేనా సహితుండయి వచ్చెనని యర్థము సేనలఁ గూడుకొని వచ్చెనని తాత్పర్యము ఇట సహార్థమున 'తోడ' ప్రత్యయమయినది తుల్యార్థయోగము - తుల్యశబ్దము యొక్క యర్థముతో సంబంధము - అనగా అన్వయము తుల్య శబ్దమనక తుల్యార్థమనుటచేఁ దుల్యమను నర్థమునిచ్చు నేశబ్దముతో నన్వయమున్నను 'తోడ' వర్ణకమగును చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు ఇట తుల్యశబ్దముతో నన్వయముండుటచే చైత్ర శబ్దమునకు 'తోడ' వర్ణకమయినది "తృతీయకనుటం జేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు" దీని తాత్పర్యమిది సూత్రమునఁ దృతీయకుం దోడవర్ణకంబగు నని కలదు తృతీయకున్-అనుటచేఁ దృతీయా విభక్తి వివక్షించినచోఁ దోడ వర్ణకమగును తృతీయ వివక్షింపనిచోఁ దుల్యార్థయోగమున 'కు' షష్ఠియగును అనఁగాఁ చైత్రునకు మైత్రుండు తుల్యుండు - అని తుల్యార్థయోగమున షష్ఠియు నగును కాఁగాఁ గరణ సహార్థములందు తోడ వర్ణకము, తుల్యార్థయోగమున, తోడ-కు వర్ణకములు నగునని యీ సూత్రమునకు సారాంశము

## వచ్యర్థాముఖ్య కర్మంబునకుఁ దోడ కువర్ణకంబులు ప్రాయికంబుగా నగు. 6

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె మైత్రుండు చైత్రున కిట్లనియె ప్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయయు నగు

వ్యా వచ్యర్థముయొక్క యముఖ్య కర్మమునకు తోడ ప్రత్యయము, కు ప్రత్యయము, తఱచుగా నగును వచి+అర్థ=వచ్యర్థ వచించు, వలుకు, అను, చెప్పు మున్నగునవి వచ్యర్థకములు వచ్యర్థకధాతు ప్రయోగమున నముఖ్య కర్మమునకు, తోడ - కువర్ణకములు తఱచుగ నగును ఉదా॥ మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె ఇట, అను వచ్యర్థక ధాతువు ఇట్లు (= ఈ ప్రకార మైన వాక్యమును)-ముఖ్య-కర్మము చైత్రశబ్ద మముఖ్య కర్మము కావున, నముఖ్య కర్మమగు చైత్ర శబ్దమునకుఁ దోడ వర్ణకమయినది మైత్రుండు చైత్రున కిట్లనియె ఇట, చైత్రశబ్దమునకు, కువర్ణక మయినది ఇ ట్లముఖ్య కర్మమునకు, తోడ, కువర్ణకములు ప్రాయికముగా (=తఱచుగా) నగును ప్రాయికముగా ననుటచే నరుదుగా ద్వితీయయు నగును మైత్రుండు చైత్రు నిట్లనియె-అని యరుదుగ నుండునన్నమాట

విశే - (1) కర్మము రెండు విధములు (1) ముఖ్యకర్మము (2) అముఖ్య కర్మము దీనిని గౌణకర్మమనియు నందురు అపాదానాది రూపమున వివక్షింపఁ బడక, కర్మ రూపమున వివక్షింపఁబడినది యముఖ్యకర్మమగను (అపాదానాది విశేషైరవివక్షితం కారకం కర్మ సంజ్ఞం స్యాత్-సి కౌ ) మైత్రుఁడు చైత్రుని తోడ నిట్లనియె, చైత్రున కిట్లనియె ఇట చైత్రునికొఱకు-అని సంప్రదానముగ (8 సూ వృత్తి) వివక్షింపక, చైత్రశబ్దము కర్మముగ వివక్షింపఁబడినది కావున నిది యముఖ్య కర్మము ఈ 6చే, నముఖ్య కర్మమునకు తోడ-కువర్ణకములు ప్రాయికముగ నగును దుహ్, యాచ్, పచ్, బ్రూ - మున్నగు పదునాఱు ధాతువులు ద్వికర్మకములు (11) అముఖ్యకర్మమునకు సంస్కృతమున ద్వితీయయే పాణినీయమున, విధింపఁబడినది ద్వితీయ తెనుగునఁ నరుదు (111) - తోడ కువర్ణకము లగుట పాణినీయమునకు విలక్షణము

## ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడ వర్ణకంబగు. 7

నియమ పూర్వక విద్యా స్వీకారం బుపయోగంబనంబడు రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి సాందీపని వలన నని యర్థము

వ్యా నియమపూర్వక విద్యాస్వీకారమున,నుపాధ్యాయుని బోధించు శబ్దమునకుఁ దోడ ప్రత్యయమగును ఉపయోగము=నియమపూర్వక విద్యా స్వీకారము (అఖ్యాతోపయోగే-నియమ పూర్వక విద్యాస్వీకారే వక్తా ప్రాక్ సంజ్ఞః స్యాత్ సి కౌ ) ఉపాధ్యాయుఁ డుచ్చరించిన దానిని శిష్యుఁడుచ్చరించుచు విద్యను గ్రహించుట యుపయోగము రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి వేదము స్వరప్రధానము గావున నిది నియమ పూర్వక విద్యాస్వీకారమున కుదాహరణమగును రామకృష్ణులు సాందీపని యుచ్చరించిన దాని నుచ్చరించుచు వేదములను జదివిరని తాత్పర్యము ఈ వాక్యమున నాఖ్యాతను బోధించునది సాందీపని శబ్దము అఖ్యాత = వక్త, ఉపాధ్యాయుడు కావున నాఖ్యాతను దెలుపు సాందీపని శబ్దమునకు, తోడ ప్రత్యయమయినది సాందీపనితోడ అనఁగా "సాందీపని వలన నని యర్థము ఇదియు నపాదాన కారకమగును ఆఖ్యాత యగు సాందీపని కపాదానసంజ్ఞ శబ్దముల యువక్రమణమున కాఖ్యాత యవధి (9 సూ )

విశే (1) సాందీపనివలన-అని యర్థము చెప్పుటచే నరుదుగా నాఖ్యాతకు 'వలన' వర్ణకము కావచ్చునని గ్రహింపఁదగును (11) అఖ్యాతకు

సంస్కృతమునఁ బంచమియే యగును 'శోద' వర్ణకమగుట సంస్కృతలక్షణ మునకు భిన్నము

పాఠపరిశీలన - సాందీపుని-ప్రథమ ముద్రణ పాఠము దీనిని సాందీపని- అని సరిచేయుట (భా ర) గ్రాహ్యము ఏలయన నిది ముద్రణ స్ఖాలిత్యము కావచ్చును ఖేద సందర్గ సాందీప సూనుప్రదా (పారిజా 3.38) అను ప్రయోగము ప్రామాదికము

## సంప్రదానంబునకుం జతుర్థి యగు. 8

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు జనకుండు రాముని కొఱకుఁ గన్య నిచ్చెను

కొన్నియెడల నుద్దేశ్య మాత్రంబున కగు పురుషార్థంబు కొఱకు యత్నింపవలయు

చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి జనకుండు రామునకుం గన్యనిచ్చెను పురుషార్థంబు నకు యత్నింప వలయు

వ్యా॥ సంప్రదానమునకుఁ జతుర్థీ విభక్తి యగును సంప్రదానము—త్యాగో ద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు (దానస్య కర్మణా యమభిప్రైతి స సంప్ర దానమ్-సి.కౌ) త్యాగము నెవరికిఁ జేయనుద్దేశింతుమో యావ్యక్తి సంప్రదాన మనఁ బడును ఉదా జనకుండు రామునికొఱకుఁ గన్యనిచ్చెను ఈ వాక్యమున జనకుఁడు కన్యాదానము చేయుట కుద్దేశించినవ్యక్తి - అనఁగాఁ ద్యాగోద్దేశ్యము రాముఁడు కనుక రాముఁడు సంప్రదానము ఈ సూత్రముచే రామ శబ్దము నకుఁ చతుర్థి యయినది, కొన్నిచోట్లఁ ద్యాగోద్దేశ్యమునకుఁ గాక యుద్దేశ్య మాత్రమున కే చతుర్థి యగును అనఁగా దేనినుద్దేశింతుమో దానికే చతుర్థియగును త్యాగప్రసక్తి లేదన్నమాట ఉదా॥ పురుషార్థంబు కొఱకు యత్నింపవలయు పురుషార్థమనునది త్యాగోద్దేశ్యముకాదు ఇది యుద్దేశించిన వస్తువు మాత్రమే యగును అయినను 'కొఱకు' ప్రత్యయ మయినది చతుర్థికి బదులుగా షష్ఠియే తఱుచుగాఁ బ్రయోగములలోఁ గనబడును జనకుండు రామునకుం గన్యనిచ్చెను పురుషార్థంబునకు యత్నింపవలయు ఇట్లు సంప్రదానమునకు "కు" షష్ఠియే తఱుచుగా నగును త్యాగోద్దేశ్యుఁడగు రాముఁడు కన్యాదాన స్వీకారమున కను మతించుట రూపమున దానక్రియకుపకరించుటచే సంప్రదానకారకము.

విశే - (1) సంస్కృతమున సంప్రదానమునకుఁ జతుర్థి యగునని పాణినీయము షష్ఠియగుట యందులకు విలక్షణము (11) సంప్రదానమ్ = స్వస్వత్వ త్యాగ పూర్వక త్యాగోద్దేశ్యత్వమ్ — వై భూ

పారవరిశీలన - యత్నింపవలయు - అని ప్రథమ ముద్రణము కావున వలయును అను ముద్రణములు సరికావు

**అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరామాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకంబగు. 9**

అపాయము = విశ్లేషము భయము = వెఱపు జుగుప్స=ఏవ పరాజయము = దయ్యుట ప్రమాదము = పరాకు గ్రహణము = కొనుట ఎఱుంగుట, వినుట — ఇత్యాది భవనము = పుట్టుట త్రాణము = కాచుట విరామము = విరమించుట అంతర్థి=మఱుఁగుట వారణము = వారించుట

| | |
|---|---|
| అపాయంబునకు | మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె |
| భయంబునకు | చోరునివలన భయపడియె |
| జుగుప్సకు | పాపంబువలన నేవగించె |
| పరాజయమునకు | అధ్యయనమువలన డస్సె |
| ప్రమాదంబునకు | పాడివలనం బరాకువడియె |
| గ్రహణంబునకు | మైత్రునివలన ధనంబు గొనియె |
| భవనంబునకు | మనువువలనం బ్రజలు పుట్టిరి |
| త్రాణంబునకు | చోరునివలనం గాచె. |
| విరామంబునకు | భోగంబుల వలన విరమించె |
| అంతర్ధికి | కృష్ణుండు తల్లివలన దాఁగె |
| వారణంబునకు | శోకంబువలన వారించె |

ఈ పంచమికి షష్ఠియుం గొండొక యెడల నగు చోరునకు వెఱచె. పాపంబున కేవగించె అధ్యయనంబునకు డస్సె పాడికిం

బరాకు పడియె మనువునకు నిక్ష్వాకుండు పుట్టె ఇత్యాదు లూహిం చునది.

వ్యా॥ అపాయము, భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము, భవనము, త్రాణము, విరామము, అంతర్ధి వారణము ననునవి దేనినుండి కలుగునో దానికి వలన ప్రత్యయమగును దీని నపాదానకారక మందురు అపాయమునకు - అపాయమనఁగా విశ్లేషము, ఎడబాటు మైత్రుండు రాజ్యంబు వలన భ్రష్టుండయ్యె ఈ వాక్యమున మైత్రున కపాయము (విశ్లేషము ఎడఁబాటు) రాజ్యము నుండి కలిగినది గనుక రాజ్య శబ్దమునకు వలన ప్రత్యయమయినది ఇట, రాజ్యశబ్ద మపాదానమగును అపాదానము = అవధి విభాగాశ్రయము దేనినుండి విశ్లేషము జరుగునో యది (అపాయో విశ్లేషః తస్మిన్ సాధ్యే ధ్రువమవధి భూతం కారక మపాదానం స్యాత్ - సి కౌ) కావున రాజ్య శబ్దమునకు వలన వర్ణక మయినదన్న మాట భయమునకు - చోరుని వలన భయపడియె భయము చోరుని నుండి కలిగినది గనుకఁ జోర శబ్దమునకు వలన ప్రత్యయమయినది జుగుప్సకు - పాపంబువలన నేవగించె ఏవగించినది పాపమునుండి కనుక పాప శబ్దమునకు వలన ప్రత్యయమయినది పరాజయమునకు - పరాజయము = దయ్యుట అనఁగా బడలుట - అన్న మాట అధ్యయనము వలన దస్సె దయ్యుట యధ్యయనము నుండి కలిగినది కనుక, అధ్యయన శబ్దమునకు 'వలన' వర్ణకము ప్రమాదమునకు - ప్రమాదము = పరాకు పాడివలనం బరాకువడియె పరాకుపడినది (ప్రమాద పడినది) పాడినుండి కనుక, 'పాడి' శబ్దమునకు 'వలన' ప్రత్యయము గ్రహణమునకు - గ్రహణము = కొనుట ఎఱుంగుట, వినుట - ఇత్యాదులు మైత్రుని వలన ధనంబు గొనియె ధనము గ్రహించుట మైత్రుని నుండి జరిగినది కనుక మైత్ర శబ్దమునకు 'వలన' వర్ణకము భవనంబునకు - భవనము = పుట్టుట మనువు వలనం బ్రజలు పుట్టిరి ప్రజలు పుట్టుట మనువు నుండి కలిగినది కనుక మను శబ్దమునకు వలన ప్రత్యయ మయినది త్రాణము నకు త్రాణము = కాచుట, రక్షించుట చోరునివలనం గాచె కాచుట చోరుని నుండి కలిగినది కనుక చోర శబ్దమునకు వలన ప్రత్యయమయినది విరామమునకు - విరామము = విరమించుట భోగంబుల వలన విరమించె విరమించుట భోగముల నుండి కనుక భోగ శబ్దమునకు వలన ప్రత్యయ మయినది అంతర్ధికి - మఱుఁగుట (=దాఁగుట) కృష్ణుండు తల్లివలన దాఁగె కృష్ణుఁడు దాఁగుట తల్లినుండి కనుక తల్లి శబ్దమునకు వలన ప్రత్యయమయినది

వారణంబునకు - వారణము = వారించుట శోకంబువలన వారించె వారించుట శోకమునుండి కనుక శోక శబ్దమునకు వలన ప్రత్యయమయినది ఇవియు నపాదానకారకమున కుదాహరణము లగును వలన ప్రత్యయమునకు 'కు' షష్ఠియుఁ గొన్నిచోట్ల నగును భయమునకు - చోరునకు వెఱచె చోరునివలన-అను పంచమికి షష్ఠియయినది పరాజయమునకు - అధ్యయనంబునకు డస్సె - అధ్యయనము వలన నను పంచమికి షష్ఠి యయినది ప్రమాదమునకు—పాడికిం బఱాకుపడియె పాడివలన నను పంచమికి షష్ఠియయినది భవనమునకు - మనువునకు నిక్ష్వాకుండు పుట్టె మనువువలన నను పంచమికి షష్ఠియైనది ఇత్యాదు లూహింపవలెను విశ్లేషాదుల కవధిగా నుండి క్రియా నిష్పత్తి కుపకరించుచుండుటచే నిట రాజ్యాదు లపాదాన కారకములు

విశే - (1) ఈ కుషష్ఠి సంస్కృతమునకు విలక్షణము (11) "అపాయే యదుదాసీనం చలంవాయది వాచలమ్ ధ్రువమేవాతదావేశాత్ తదపాదాన ముచ్యతే' - వాక్యప చలమునకు – ధావతోశ్వాత్ పతతి (సి కౌ) అచలము నకు – వృక్షాత్ పర్ణంపతతి (వై భూ సా) (111) భయాదులను షేఱుగాఁ బేర్కొనుట ప్రపంచార్థము 7, 13 సూత్రములు గూడ నిట్టివే అపాయ శబ్దముచేతనే యివియన్నియు గతార్థము లగును (మ భా) (1v) అపాయ దులకు నిర్దిష్టార్థము లున్నప్పుడే వలన వర్ణకము అపాయము = విశ్లేషము, చలనము వినాశనము, విశేషార్థముననే వలన ఇట్లే తక్కినవి

## ఉండిపదంబొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తంబగు. 10

హిమగిరి వలన నుండి గంగవొడమె నాకంబువలన నుండి నారదుండు వచ్చె

వ్యా ఉండి - అను పదము 'వలన' ప్రత్యయమునకుఁ గొన్నిచోట్ల ననుప్రయుక్తమగును అనుప్రయుక్తము = అనుసరించి ప్రయోగింపఁబడినది హిమగిరి వలన నుండి గంగవొడమె వలనన్ అను ప్రత్యయము ననుసరించి ప్రయోగింపఁ బడుటచే నిట 'ఉండి' - అనుప్రయుక్త మనఁబడును గంగ పొడమినది (భవనము-పుట్టుట) హిమగిరి నుండి గనుక హిమగిరి శబ్దమునకు వలన వర్ణకము 9 చే - నగును, హిమగిరి వలన గంగవొడమె ఈ 10 చే నిట ఉండి – అనుప్రయుక్తమయిన, హిమగిరివలనన్+ఉండి= హిమగిరివలన నుండి, ఇను నాకంబు వలననుండి నారదుండు వచ్చె నారదున కపాయము

(విశ్లేషము, ఎడ(బాటు) నాకమునుండి కలిగినది గనుక నాక శబ్దమునకు 9 చే- వలన వర్ణకమగును నాకంబువలన నారదుండువచ్చె ఈ 10 చే - ఉండి - యనుప్రయుక్తమయిన, నాకంబువలన నుండి — అగును

## ఉండి శబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయా సప్తములు ప్రాయికంబుగ నగు. 11

వనమునుండి వచ్చె, వనమందుండి వచ్చె, ఊరినుండి వచ్చె, ఊరనుండివచ్చె, వనమునుంచి, ధనమునుంచి, యని యుంచి శబ్దాను ప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవి ప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది

వ్యా ఉండి శబ్దము పరమయినప్పుడు వలన ప్రత్యయమునకు, ద్వితీయా విభక్తి, సప్తమీ విభక్తి తఱచుగా నగును ద్వితీయ - (1) వనమునుండి - 9 చే- వనమువలనవచ్చె అను వాక్య మేర్పడును ఈవాక్యమున, నపాయము (విశ్లేషము, ఎడ(బాటు) వనమునుండి కలిగినది గనుక వనశబ్దమునకు వలన వర్ణకమయినది 10చే- ఉండి యనుప్రయుక్తమగును వనము వలన + ఉండి ఈ 1 చే- వలనకు, ద్వితీయ యాదేశమయిన, వనము + ను + ఉండి అచ్చుపరమగుచో ద్రుతస్వరము లోపించుట బాలవ్యాకరణమునఁ బరిపాటి కావున, వనమున్ + ఉండి = వనమునుండి-అనే యేర్పడును (11) ఊరి నుండి - 9చే- ఊరివలన వచ్చె - అని యగును 10చే- ఊరివలన+ఉండి ఈ 11చే- ఊరి+ను+ఉండి, తత్సమ 26చే- ఊరిని+ఉండి ద్రుతస్వరము లోపించి ఊరిన్ + ఉండి = ఊరినుండి అగును సప్తమికి - వనమందుండి - 9చే - వనమువలన వచ్చె 10 చే- వనమువలన+ఉండి ఈ 11చే- వనము+ అందు+ఉండి తత్సమ 8చే- వనము+అందును+ఉండి తత్సమ 30చే- నుగాగమము కలుగని పక్షమున, సంధి 11చే- వనమందును+ఉండి-అగును అచ్చు పరమగుటచే ద్రుతస్వరము లోపించును వనమందున్ + ఉండి సంధి 2చే- వనమందుండి, వనమందునుండి-అగును ఊరనుండి - 9చే - ఊరివలన- అగును 10చే ఊరివలన+ఉండి ఈ 11చే- ఊరి+అందు+ఉండి అచ్చిక 38చే - ఊరి+అ+ఉండి, తత్సమ 8చే - ఊరి+అను+ఉండి సంధి 11చే- ఊరను+ఉండి ద్రుతస్వరము లోపించి, ఊరన్+ఉండి=ఊరనుండి-అగును కొందఱు వనమునుంచి ధనమునుంచి-అని ఉంచి శబ్దము ననుప్రయుక్తముచేసి వాడుదురు కాని యది సత్కవి ప్రయోగసమ్మతము కాదు,

విశే - ఉండిపదంబు - అని 10వ సూత్రము ఉండిశబ్దము - అని యీ సూత్రము ఈ మార్పునకుఁ గారణమగపడదని కొందఱు సెలవిత్తురు కాని, పదమును శబ్దమని సూరి వ్యవహరించుచుండును (సంధి 12) ఉండి పదంబు- అనుటచే నిచటి శబ్దమనునది పదమునే తెలుపును కావున, వనమందున్+ఉండి- అనుచో నపదాది స్వరసంధి (సంధి 11) ప్రసక్తముకాదు సంధి 2చే - వనమం దుండి, వనమునందుండి - అనురూపములు సిద్ధించును

## కంటె వర్ణకం బన్యార్థాది యోగజంబగు పంచమికగు. 12

రామునింంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు. లోభంబు కంటె నితరంబు దోషంబులేదు ఇచట షష్ఠియు నగు రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు అన్యము, ఇతరము, పూర్వము, పరము, ఉత్తరము ఇత్యాదు లన్యాదులు

వ్యా అన్యార్థము మొదలగువానితోడి యన్వయమున నగు పంచమీ విభక్తికి కంటె ప్రత్యయమగును అన్యార్థ = అన్యశబ్దముయొక్క యర్థము, ఆది = మొదలగువానియొక్క, యోగజంబు = సంబంధమున నయినది-అని యర్థము అన్యార్థమనుటచే నన్యశబ్దము నిచ్చు శబ్ద మేదయినను గావచ్చును ఆది-అనుటచే అన్యార్థము కాక మఱికొన్నియుఁ గావచ్చును అన్యాదులు= అన్యము, ఇతరము, (ఇవి యన్యార్థకములు) పూర్వము, పరము, ఉత్తరము - మొదలగునవి (ఇవి-ఆదులలోనివి) రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు ఇట నన్యశబ్దముతో నన్వయ ముండుటచే 'కంటె' వర్ణకమయినది లోభంబుకంటె నితరంబు దోషంబులేదు ఇతరమను నది యన్యార్థకము కాన నితరశబ్దముతో నన్వయ ముండుటచే 'కంటె' వర్ణకమయినది ఇట కుషష్ఠియు నగును రాముని కన్యుండు ధానుష్కుండు లేఁడు

విశే - (1) కుషష్ఠి సంస్కృతమునకు విలక్షణము పంచమియే సంస్కృత మున నగును (11) పంచమికగు - అనుటచేఁ బంచమి వివక్షింపనిచోఁ, కుషష్ఠి యగును

## కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమి కగు. 13

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబె కలిగి యుండు నచటం బంచమి యగు ఆ పంచమికిం గంటె వర్ణకంబగు నని యర్థము జానపదులకంటె నాగరులు వివేకులు, మానహాని కంటె మరణము మేలు

వ్యా కేవల విభిన్నములయిన జాత్యాదులనుండి యొకదానిని వేఱుచేయు నపుడగు పంచమికిఁగంటె ప్రత్యయమగును ఎచ్చట, నిర్ధార్యమాణంబు = వేఱు చేయఁబడుచున్నది, జాత్యాదులచేన్ = జాతి మొదఁగువానిచె, భేదంబె కలిగి యుండున్=భేదమునే కలిగియుండునొ, అచట పంచమీ విభక్తి యగును ఆ పంచమికిఁగంటె వర్ణకమగును అనఁగా దేనినుండి వేఱుచేయుట జరుగునో దానికిని, వేఱుచేయఁబడుచున్న దానికిని, జాత్యాదులచే భేదమేయున్నప్పుడు, దేనినుండి వేఱుచేయుట జరుగునో దానికిఁగంటె వర్ణకమగునని తాత్పర్యము జానపదులకంటె నాగరులు వివేకులు ఇట జానపదజాతి వేఱు నాగరజాతి వేఱు ఈ రెండును భిన్నజాతులు కాన రెండింటికి జాతిచే, భేదమే కలదు ఇట వేఱు చేయఁబడుచున్న వారు నాగరులు వీరు జానపదుల నుండి వేఱుచేయఁబడు చున్నారు కాన జానపద శబ్దమునకు 'కంటె' వర్ణకమయినది మానహాని కంటె మరణము మేలు ఇట మరణము మానహాని నుండి వేఱుచెయఁబడుచున్నది కాన మానహాని శబ్దమునకు 'కంటె' వర్ణకమయినది ఇదియు నపాదాన కారకమగును

పాఠపరిశీలన - కొన్ని ప్రతులలో భేదంబు - అని కలదు అది సరి కాదు భేదంబె - అను ప్రథమ ముద్రణ పాఠమే పరిగ్రాహ్యము భేద ఏవ - అని మూలము (సి కౌ) నిర్ధారణ షష్ఠిలో నిర్ధార్యమాణము సముదాయముతో నేకదేశమయి యుండును కానఁ గేవల భేదముండదు (16 సూ) ఇటఁ గేవల భేదముండును గాన భేదంబె - అనఁబడెను

## పట్టి వర్ణకంబు హేతువులగు గుణ క్రియల కగు. 14

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నయితి ఇచట వలన వర్ణకంబు నగు జ్ఞానము వలన ముక్తుండగు

వా॥ హేతువగు గుణ వాచకమునకు, హేతువగు క్రియకు 'పట్టి' ప్రత్యయమగును హేతువు = ఫలసాధన యోగ్యంబగు పదార్థంబు హేతువు జ్ఞానముఁ బట్టి ముక్తుఁడగు ము క్తియను ఫలమును సాధించుటకు యోగ్య మయిన వస్తు విట జ్ఞానము గనుక, జ్ఞానము — హేతువు ఇది గుణవాచకము గుణము = వస్తు ధర్మము వేదాంత మతమున జ్ఞానాదులు గుణములగును ఈ వాక్యమున జ్ఞానము, హేతువయిన గుణముగాఁగలదు కాన నీ 14 చే-పట్టి వర్ణక మగును జ్ఞానము + పట్టి హేతువగు క్రియకు - నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నయితి ధన్యత యనుఫలమును సాధించుటకు యోగ్యమయిన వస్తువిట-వచ్చుట కాన, వచ్చుట — హేతువు ఇది క్రియ, అనఁగా ఫలానుకూల వ్యాపారము

(క్రియా 35) దీనికి నీ 14 చే. పట్టి వర్ణకమగును వచ్చుట + పట్టి జ్ఞానము వలన ముక్తుండగు - అని యిట వలన ప్రత్యయమును నగును జ్ఞానము+పట్టి, వచ్చుట + పట్టి - అనుచోట్ల నుగాగమము విధింపఁబడలేదు కాన, జ్ఞానముఁ బట్టి, వచ్చుటంబట్టి - అను లక్ష్యనిర్దేశమును బట్టి నుగాగమ మగును జ్ఞానమును+పట్టి=జ్ఞానముఁబట్టి వచ్చుటను + పట్టి = వచ్చుటంబట్టి

విశే - జ్ఞానముంబట్టి ముక్తుఁడగును (బాలస)

## శేషషష్ఠికి యొక్కయు నగు. 15

ఇచట శేషంబనఁగా సంబంధంబు రాముని యొక్క గుణములు నాయొక్క మిత్రుఁడు వానియొక్క తమ్ముఁడు

కు వర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునం దగు, నాకుఁ దమ్ముఁడు, మీకు నెచ్చెలి

వ్యా సంబంధషష్ఠికి యొక్క ప్రత్యయము సైతమగును శేషము=సంబంధము (కారక ప్రాతిపదికార్థ వ్యతిరిక్తః, స్వస్వామి భావాది సంబంధః శేషః-సి కౌ) రామునియొక్క గుణములు ఇట గుణగుణి భావసంబంధము నాయొక్క మిత్రుడుఁ - ఇట స్నేహరూప సంబంధము వానియొక్క తమ్ముఁడు - ఇట సోదర సంబంధము యొక్కయు - అనుటచే, కుషష్ఠియుఁ గొన్నియెడల సంబంధమున నగును నాకుం దమ్ముఁడు = నాయొక్క తమ్ముఁడు మీకు నెచ్చెలి = మీయొక్క నెచ్చెలి

వి - (I) విశిష్టధీ హేతుః సంబంధః సచానేక ప్రకారః స్వస్వామిత్వ జన్య జనకత్వావయవావయవిత్వ ప్రతియోగ్యనుయోగిత్వాధారాదేయత్వాదిః ముగ్ధ - శ్రీరామ ((II) నాకుందమ్ముడు మీకు నెచ్చెలి - భాగ 7.30 ఇట్టివి భారతముననుగలవు ఆది 6.45, సభా 2.65, ద్రోణ 3.18 (III) ఇచట-అనుటచేఁ గారక ప్రాతపదికార్థ వ్యతిరిక్తమనికాక సంబంధమని మాత్రమే యర్థము గ్రహింపవలెను

పాఠపరిశీలన - మిత్రుఁడు - ప్రథమ ముద్రణ పాఠము కొందఱు, మిత్త్రుఁడు అని ద్విత్వకారకముగ దిద్దుట సరికాదు, (తత్సమ 39)

## నిర్ధారణ షష్ఠికి లోపల వర్ణకంబగు. 16

జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేక దేశంబునకుం బృథక్కరణం బనంబడు నెద్దాని వలన నిర్ధారణంబగు

నచ్చోటి షష్ఠికి లోపల వర్ణకంబగు నని యర్థము మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు గోవుల లోపలఁ గపిల బహుక్షీర అధ్వగుల లోపలం బాఱువాఁడు, శీఘ్రగామి ఛాత్రుల లోపల మైత్రుండు సమర్థుండు ఇట సప్తమియుం గలదు మనుష్యుల యందు క్షత్రియుండు శూరుండు

ఇత్యాదు లెఱుంగునది

వ్యా జాత్యాదులచే నొక సముదాయమునుండి కొంత భాగము వేఱుచేయు నపుడగు షష్ఠికి లోపల ప్రత్యయమగును నిర్ధారణము = జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు అనఁగా నొక సముదాయమునుండి జాతి, గుణము, క్రియ, సంజ్ఞ యను వానిలో దేనిచేత నైన, నా సముదాయములోని యొక భాగమును వేఱు చేయుట నిర్ధారణమనఁబడును (జాతి గుణ క్రియా సంజ్ఞాభిః సముదాయా దేక దేశస్య పృథక్కరణం నిర్ధారణమ్ - సి కౌ) ఏ సముదాయమునుండి జాతి గుణ క్రియాసంజ్ఞలచే నా సముదాయమునందలి యొకభాగము వేఱుచేయఁ బడునో, యాసముదాయమును బోధించు శబ్దమునకు లోపల ప్రత్యయమగునని తాత్పర్యము ఏకదేశము = అంశము, భాగము (1) జాతికి - మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు ఇట, మనుష్యులు నిర్ధారణ వాచకము క్షత్రియుండు - ఆ మనుష్య సముదాయములో నేకదేశము ఏలయన క్షత్రియుఁడు కూడ మనుష్యులలోని వాఁడే క్షత్రియత్వము జాతి కనుక జాతిచే మనుష్యులనుండి క్షత్రియుని వేఱుచేయుట యిఁటగలదు కాన మనుష్య శబ్దమునకు లోపల వర్ణకమయినది మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు - అని సిద్ధించినది గుణమునకు - గోవుల లోపలఁ గపిల బహుక్షీర గోవుల నిర్ధారణ వాచకము కపిల - గోసముహములో నేకదేశము ఏలయనఁ గపిలగోవును గోవుల లోనిదే కపిలత్వము గుణము కావున గుణముచే, గోవులనుండి కపిలను వేఱు చేయుట ఈ వాక్యమునఁ గలదు కనుక గోశబ్దమునకు లోపల వర్ణకమయినది (111) క్రియకు - అధ్వగులలోపలం బాఱుఁవాడు శీఘ్రగామి అధ్వగులు-నిర్ధారణ వాచకము పాఱువాఁడు - అధ్వగ సముదాయములో నేకదేశము (అధ్వగులు = బాటసారులు) పాఱుట (= పరుగెత్తుట) క్రియ గనుకఁ గ్రియచే నధ్వగులనుండి పాఱువాఁడు (పరుగెత్తువాఁడు) వేఱుచేయఁబడుట యిటఁగలదు కాన నధ్వగ శబ్దమునకులోపల ప్రత్యయమయినది సంజ్ఞకు - ఛాత్రుల లోపల మైత్రుండు

సమర్థుండు ఛాత్రులు - నిర్ధారణ వాచకము మైత్రుండు ఛాత్రుల సముదాయములో నేకదేశము మైత్రశబ్దము సంజ్ఞ (= పేరు) కాన సంజ్ఞచే మైత్రుఁడు ఛాత్రులనుండి యిట వేఱుచేయఁబడెను కాన, ఛాత్రుల లోపల - అని ఛాత్ర శబ్దముపై లోపల వర్ణకమయినది ఇట సప్తమియుఁగలదు మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు ఇత్యాదులు

విశే - (1) లోపల వర్ణకము నిర్ధారణ షష్ఠికగును గాన నిది బహువచనము మీఁదనే చేరును మాలోపలన్ - అని సంజ్ఞా 12 సూత్రమున బహువచనము మీఁదనే యుదాహృతము తత్సమ 11 సూత్రమున నిది యేకవచనముగఁ పేర్కొనఁబడలేదు తత్సమ 12 సూత్రమున బహువచనముగఁ బేర్కొనఁ బడలేదు కాన నిది యుభయమనియే సూరియాశయము అయినను, నుభయము లలో దీని కుదాహరణము చూపలేదు ఈ 16 సూత్రమునం దయినను మనుష్య సముదాయము లోపల క్షత్రియుండు శూరుండు - వంటి వాక్యమును సూరి చూపలేదు పాణిని సూత్రములలో జాత్యేక వచనములపై నిర్ధారణ షష్ఠి కన్పట్టును అచోంత్యాదిటి, మిదచోంతాత్ వరః (పాణి) ద్వంద్వః "సామాసికస్యచ" (భ గీ) తారకావళిలో భవద్వంశకరుఁడు చంద్రుఁడునుబోలె (శృ శా 3 23) అను ప్రయోగమును గనఁబడును కాన లోపల వర్ణక ముభయము కావచ్చునను సూరి యాశయము సమంజసమే (11) సౌధంబులోపల నిత్యాదౌతు లోపల శబ్దః అంతరవ్యయ పర్యాయోదేశ్య శబ్దః" అహో (111) మనుష్యుల లోపల క్షత్రియుండు శూరుండు ఇట క్షత్రియుండును మనుష్యులలోనివాఁడే గనుకఁ గేవల భేదములేదు (13 సూ)

పాఠపరిశీలన - క్షత్రియుండు—అను ప్రథమ ముద్రణ పాఠమును గొందఱు క్షత్త్రియుండు - అని దిద్దుట సరికాదు క్షతాత్త్రాతీతి క్షత్రః (ఆది 2.117) - వ్యా సం స

## అధికరణంబున సప్తమి యగు. 17

అధికరణంబునా నాధారంబు ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు ఘటమందు జలమున్నది మోక్షమం దిచ్ఛ గలదు అన్నింటియం దీశ్వరుండు గలండు

వ్యా అధికరణ వాచకమునకు సప్తమీ విభక్తి యగును అధికరణ మనగాఁ నాధారము (ఆధారోధికరణమ్ - పాణి) ఆధారము మూఁడు విధములు- (1) ఔపశ్లేషికము (2) వైషయికము (3) అభివ్యాపకము (ఔపశ్లేషికో వైషయి

కోఽభి వ్యాపక శ్చేత్యాధార స్త్రిధా- సి కౌ (1) ఔప శ్లేషికము = ఉపశ్లేషముచే నయినది ఉపశ్లేషము = ఆధారాధేయముల యేకదేశ సంబంధము ఉపశ్లేష= ఉప ఈషత్ ఏక దేశేన శ్లేషః సంబంధః, ఆధారాధేయ యోరేక దేశ సంబంధే- శబ్దస్తో) ఇది సంయోగ రూపమున నుండును (ఉపశ్లేషః సంయోగాది సంబంధః- బాలమ) ఘటమందు జలమున్నది ఘటము - ఆధారము జలము - ఆధేయము ఘటము యొక్క యేకదేశమున జలము సంయోగ రూపమున నుండును కాన, ఘటము - ఔపశ్లేషికాధారము (2) వైషయికము = లక్ష్యభూతమగు విషయ మునకు (=పదార్థమునకు) నాధారమయినది వైషయికాధారము మోక్షమందిచ్ఛ గలదు ఇచ్ఛకు లక్ష్య భూతమగు విషయము మోక్షము గాన, మోక్షము - వైషయికాధారము (3) అభివ్యాపకము = సర్వావయములందు వ్యాపించి యుండు వస్తువున కాధారమయినది యభివ్యాపకాధారము అన్నింటియం దీశ్వరుండు గలండు సర్వావయవములందు వ్యాపించియుండు నీశ్వరున కాధార మగుటచే, అన్ని - అభివ్యాపకాధారము జలమునకు ఘటము, నిచ్ఛకు మోక్షము నీశ్వరునకు నన్నియు నాధారములై 'ఉండుట" అను క్రియానిష్పత్తి కుపకరించు చుండుటచే నివి యధికరణ కారకములు

విశే - "కర్త కర్మద్వారా తన్నిష్ఠ క్రియాయా ఆధారః కారకమధికరణ సంజ్ఞం స్యాత్ " (సి కౌ)

## ఉకారాంత జడంబునకు నవర్ణకంబగు. 18

ఘటంబున జలంబున్నది దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు

వ్యా ఉకారాంతమగు జడవాచకమున కధికరణమున "న" అను సప్తమీ ప్రత్యయమగును ఘటంబున జలంబున్నది ఘటంబు - ఉకారాంతజడము కావున నీ సూత్రముచే 'న' వర్ణకము కలిగి, ఘటంబున-అని యయినది దేవ దత్తునకు మోక్షమున నిచ్ఛగలదు మోక్షము-ఉకారాంత జడము కావున నీ సూత్రముచే నవర్ణకము వచ్చి మోక్షమున-అని యయినది జడము=అచేతనము వర్ణకము = ప్రత్యయము

విశే - (1) 17 చే - అధికరణమునకు సప్తమియగును అందువర్ణక మన్ని యధికరణములకు నగును నవర్ణకము - ఉకారాంత జడ మధికరణ మయినపుడు మాత్రమే యగును తక్కినవానికిఁ గాదు ఇది యధికరణ కారకమునఁ జేరును (7) (11) అధికరణంబున- అనునది 17 నుండి యను వృత్తమగును

## విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబులగు. 19

నందతనయుండు కృష్ణుండు నాకుదిక్కు
దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు
శుభవిధాయుల రామకృష్ణుల భజింతు
భువన వంద్యను రుక్మిణిఁ బొగడుచుందు

వ్యా విశేష్యమునకు వలె విశేషణమునకు లింగ విభక్తి వచనము లగును అనఁగా విశేష్యమున కగు లింగ విభక్తి వచనములు విశేషణమున కగునని యర్థము (1) నందతనయుండు కృష్ణుండు నాకుదిక్కు కృష్ణుండు-విశేష్యము ఇది పుంలింగము, ప్రథమావిభక్తి ఏకవచనాంతము నయి యున్నది కావున నివే లింగ విభక్తి వచనములు విశేషణమున కగును నందతనయుండు - విశేషణము ఇదికూడఁ బుంలింగము, ప్రథమావిభక్తి, యేకవచనాంతము నయి యున్నది (2) దేవకీపుత్రు హరిని నుతింతు నెపుడు హరిని - విశేష్యము దేవకీపుత్రున్ - విశేషణము విశేష్యమువలెనే విశేషణమును, బుంలింగము ద్వితీయావిభక్తి యేకవచనాంతము నయియున్నది (3) శుభవిధాయుల రామకృష్ణుల భజింతు రామకృష్ణులన్ - విశేష్యము శుభవిధాయులన్ - విశేషణము విశేష్యమువలెనే విశేషణమును పుంలింగము, ద్వితీయావిభక్తి, బహువచనాంతము నయి యున్నది (4) భువన వంద్యను రుక్మిణిఁ బొగడుచుందు, రుక్మిణిని - విశేష్యము భువనవంద్యను - విశేషణము విశేష్యము వలెనే విశేషణమును, స్త్రీలింగము ద్వితీయావిభక్తి యేకవచనాంతము నయియున్నది ''

విశే - ప్రస్తుతింతు ప్రథమ ముద్రణపాఠము సూరిగారు వృత్తగంధి గద్యముగ నుద్దేశించిరని కొందఱందురు కాని తొలిమూఁడు పద్యపాదములను బట్టి పద్యముగ భావించి ప్రస్తుతింతు - అని యెవరో సవరించిరి సూరిగారు చిత్తు ప్రతిలో, పొగడుచుందు - వంటిదేదో వ్రాసియుందురు ఏ ప్రూఫులు దిద్దు నప్పుడో యతివిషయము స్ఫురింపక ప్రస్తుతింతు-అని వారేమార్చియుందురు కనుక, పొగడుచుందు - అను సవరణముతోనే యిట మూలము చూపఁబడినది

## స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంత విశేషణంబులయు బహువచనంబున నేకవచనంబు బహుళంబుగా నగు. 20

మాటలు పెక్కేల, మాటలు పెక్కులేల కులిశధారల్ కుంఠితం బయ్యె, కులిశధారల్ కుంఠితంబు లయ్యె ఇష్టమగు పదార్థములు, ఇష్టములగు పదార్థములు.

వ్యా స్త్రీసమములగు విశేషణములయొక్కయు, మువర్ణకాంత విశేషణములయొక్కయు బహువచనమున నేకవచనము బహుళముగా నగును స్త్రీసమములగు విశేషణములకు - మాటలు పెక్కేల, పెక్కు - స్త్రీసమమగు విశేషణము స్త్రీసమము = ప్రథమైకవచనము లోపించిన యచ్చ తెనుఁగు శబ్దము దీని బహువచన రూపము - పెక్కులు 19చే- విశేష్యమున కగు లింగ విభక్తి వచనములు విశేషణమున కగును కావున 19 చే - మాటలు పెక్కులు- అని యేర్పడును మాటలు బహువచనము కాన పెక్కులు అని విశేషణమును బహువచనమే యయ్యెను పెక్కు స్త్రీసమమగు విశేషణము గనుక దీని బహు వచనమగు పెక్కులు-అనుదానికి 20చే- నేకవచనము బహుళముగానగును ఏకవచనమయినచో-మాటలు పెక్కు-అనియగును ఏకవచనము కానిచో, మాటలు పెక్కులు - అని యగును మువర్ణకాంత విశేషణములకు - కులిశ ధారల్ కుంఠితంబయ్యె 19చే కులిశధారల్ కుంఠితంబు లయ్యె-అని యగును కులిశధారల్ బహువచనము కాన, కుంఠితంబులు - అని విశేషణమును బహు వచనమే యయ్యెను కుంఠితము-అన్నది మువర్ణకాంత విశేషణము ఇది తత్సమ 42 చే - కుంఠితంబు - అగును బహువచన రూపము, కుంఠితములు తత్సమ 42 చే - ఇది, 'కుంఠితంబులు' అగును ఈ 20 చే - దీని బహువచనమున నేక వచన మయినచో - కులిశధారల్ కుంఠితంబయ్యె - అని యగును ఏకవచనము కానిచో, కులిశధారల్ కుంఠితంబు లయ్యె - అని యగును (11) ఇష్టమగు పదార్థములు 19 చే - ఇష్టములగు పదార్థములు - అని యగును పదార్థములు- అను విశేషణము, బహువచనాంతము కాన, ఇష్టములగు - అను విశేషణమును బహువచనాంతమయ్యెను ఇష్టము, అనునది - మువర్ణ కాంత విశేషణము దీని బహువచనము - ఇష్టములు ఈ 20 చే - దీని బహువచనమున నేకవచనము కలిగినచో, ఇష్టము + అగు పదార్థములు - అని యగును ఏకవచనము కానిచో, ఇష్టములు + అగు పదార్థములు - అని యగును

విశే - (i) కులిశధారల్ కుంఠితంబయ్యె ననుచో ధారా శబ్దము స్త్రీలింగము అయినను స్త్రీవాచకము కాదు గనుక, తత్సమ 86 చే. దీని విశేషణము క్లీబతుల్యము విభాషనగును కాన, కుంఠితంబు - అని క్లీబ తుల్యమయినది (ii) మాటలు పెక్కేల - సౌప్తిక 1.202 మాటలు పెక్కు- లేల - భీమ 2.18 శల్య 2.75 కులిశధారల్ గుంఠితంబయ్యె — ఆది 2.81 ధనవంతుని కిష్టమగు పదార్థములెల్లన్ - విక్రమా 2.174 (iii) ఉదాహరణ స్వారస్యమున, నీవిధి ప్రాణివాచకములకు వర్తింపదు

పాఠపరిశీలన - ఈ సూత్రమున, ముపర్ణకాంత - అన్నదే ప్రథమ ముద్రణము నుండి కన్పట్టు పాఠము ఇది ముద్రాపకులు చేర్చినదని కొందఱు సెలవిచ్చుట భ్రాంతిమూలకము

## ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియు నగు 21

మైత్రుండు గృహమును వెడలెను గృహము నుండి యని యర్థము వాఁడు వాహనమును దిగెను వాహనము నుండి యని యర్థము వారు సుఖమున్నారు సుఖముతోనని యర్థము ఇత్యాదు లెఱుంగునది

వ్యా ఒక విభక్తికి మఱియొక విభక్తియుఁ గొన్నిచోట్ల నాదేశమగును (i) మైత్రుండు గృహమును వెడలెను 9 చే - మైత్రుండు గృహము వలన వెడలెను - అని యగును మైత్రున కపాయము (విశ్లేషము, ఎడబాటు) గృహము నుండి కలిగినది గనుక గృహ శబ్దమునకు 9 చే - వలన వర్ణకమయ్యెను ఈ 21 చే - వలనకు ద్వితీయ యాదేశమయినది మైత్రుండు గృహమును వెడలెను - అని యైనది గృహమును=గృహము నుండి (గృహము వలన+ఉండి = గృహమును+ఉండి = గృహమున్+ఉండి. గృహము నుండి 10, 11 సూ) (ii) వాఁడు వాహనమును దిగెను 9 చే - వాఁడు వాహనము వలన దిగెను - అని యగును వాని కపాయము కలిగినది వాహనము నుండి కనుక వాహనము వలన-అనియయినది ఈ 21 చే-వలనకు ద్వితీయ యయినది వాహనమును దిగెను వాహనమును = వాహనమునుండి (వాహనము వలన - 9 వాహనము వలన నుండి - 10 వాహనము నుండి - 11) (iii) వారు సుఖమున్నారు 5 చే - వారు సుఖముతో నున్నారు - అని యగును ఇట తృతీయ సహార్థమున నైనది, ఈ 21 చే - తృతీయా విభక్తికిఁ బ్రథమావిభక్తి యయినది

వారు సుఖమున్నారు సుఖము - ప్రథమావిభక్తి సుఖము = సుఖముతో నని యర్థము ఇత్యాదు లెఱుంగునది

## జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు. 22

రాముఁడు వాలి నొక్క కోలం గూలనేసె కోలతో నని యర్థము లంకం గలకలంబు పుట్టె లంకయందని యర్థము

బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపు మాపె బాణములచే నని యర్థము మీనంబు జలంబుల నుండు జలంబులం దని యర్థము

వ్యా॥ జడవాచకము యొక్క తృతీయా విభక్తికి సప్తమీ విభక్తికి, ద్వితీయా విభక్తి బహుళముగా నగును జడము = అచేతనము తృతీయకు - రాముఁడు వాలి నొక్క కోలం గూలనేసె 4 చే - కోల శబ్దమునకు, చేత వర్ణక మగును రాముఁడు వాలి నొక్క కోల చేతఁ గూలనేసె 5 చే - తోడ వర్ణక మగును కోలతోడ తృతీయ కీ సూత్రముచే ద్వితీయ యయినచో, కోలను - అని యగును కోలను+కూలనేసె = కోలం గూలనేసె - ద్రుత కార్యము సప్తమికి - లంకం గలకలంబు పుట్టె 17 చే - లంకయందు - అని యగును ఈ సూత్రముచే సప్తమికి ద్వితీయ యాదేశమయి, లంకను - అని యగును లంకను+కలకలంబు=లంకం గలకలంబు - ద్రుతకార్యము బహుళమగుటచే - ఉకారాంతములగు జడవాచకముల తృతీయా సప్తముల కేకవచనమున ద్వితీయ రాదు ఇది యప్రవృత్తి యన్నమాట అప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపకపోవుట ఏకవచనమున, నప్రవృత్తి యనఁగా బహువచన మున ఉదంతజడముల తృతీయా సప్తములకు ద్వితీయ కావచ్చునని పర్యవ సానము కావుననే "బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు" అని వివరింపఁబడెను తృతీయకు - అర్జునుండు శత్రుసేనలను బాణంబుల రూపుమాపె బాణము - ఉదంత జడము 4 చే - బహుత్వమున, బాణంబులచే - అని యగును తృతీయకు ద్వితీయ వచ్చిన - బాణంబులచే = బాణంబులను - అని యగును కావున, బాణంబులను = బాణములచే నని యర్థము సప్తమికి - మీనంబు జలంబుల నుండు 17 చే - జలంబులయందు - అని యగును జలంబు ఉదంత జడము ఇది, జలంబులయందు - అని

బహువచనమునఁ గలదు కనుక ద్వితీయ వచ్చినచో, జలంబులను - అని యగును జలంబులన్+ఉండు= జలంబుల నుండు

## ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబగు. 23

రాముఁడొక్క బాణంబున వాలిం గూలనేసె బాణముచే నని యర్థము

వ్యా హ్రస్వమగు, ఉకార మంతమందుఁ గల జడవాచకము యొక్క తృతీయా విభక్తికి 'న' వర్ణకము బహుళముగా నగును వర్ణకము=ప్రత్యయము రాముఁడొక్క బాణంబున వాలిం గూలనేసె 4 చే - బాణంబుచే - అను రూప మేర్పడును బాణంబు - ఉదంత జడము కాన నీ 23 సూత్రముచేఁ దృతీయకు నవర్ణకము రాఁగా, బాణంబున - అని యగును బాణంబునను = బాణముచే - అని యర్థము

విశే - బహుళంబుగా - అనునది 22 నుండి యనువృత్తమగును

## జడంబు ద్వితీయకుం బహుళంబుగా నగు. 24

వాఁడు పూవులు దెచ్చె వాఁడు పూవులను దెచ్చె ఆకె సొమ్ములు దాల్చె ఆకె సొమ్ములను దాల్చె వాఁడిల్లు వెడలె వాఁడింటిని వెడలె బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమ రాదు

వ్యా జడవాచకము యొక్క ద్వితీయా విభక్తికిఁ బ్రథమా విభక్తి బహుళముగా నగును ఉదా॥ వాఁడు పూవులు దెచ్చె 2 చే - వాఁడు పూవులను దెచ్చె - అని ద్వితీయ యగును పూవు శబ్దము జడవాచకము గాన నీ సూత్రముచే - ద్వితీయకుఁ బ్రథమ యైనచో - వాఁడు పూవులు దెచ్చె - అగును ప్రథమ కానిచో - వాఁడు పూవులను దెచ్చె - అని యుండును ఆకె సొమ్ములను దాల్చె - అని 2 చే - ద్వితీయ ఈ 24 చే - ప్రథమ యైనచో, ఆకె సొమ్ములు దాల్చె కానిచో - సొమ్ములను దాల్చె అగును 9 చే - వాడింటివలన వెడలె - అగును 21 చే ఇంటి+ను - అగును తత్సమ 26 చే ఇంటిని - అని యేర్పడును ఈ 24 చేఁ బ్రథమ యైనచో వాఁడిల్లు వెడలె - అగును (ఇల్లు - ప్రథమ) ప్రథమ కానిచో - వాఁడింటిని వెడలె - అగును బహుళమనుటచేఁ దృతీయా సప్తములకు విధించిన ద్వితీయకుఁ బ్రథమ రాదు అనఁగా 22 చే - జడము తృతీయ సప్తములకు ద్వితీయ బహుళముగా నగును ఆ ద్వితీయ కి 24 చేఁ బ్రథమ రాదు అనఁగా నా ద్వితీయ యెడ నీ సూత్రమున క్వచిదప్రవృత్తి యన్నమాట అప్రవృత్తి=విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపక పోవుట రాముఁడు

వాలినొక్క- కోలం గూలనేసె ఇట కోలను - అను ద్వితీయ 22 చేఁ దృతీయ కాదేశముగా నయినది కాన నీ ద్వితీయకుఁ బ్రథమ కాదు అనఁగా - కోల కూలనేసె - అని కాదు లంకం గలకలంబు పుట్టె ఇట లంకను - అను చోటి ద్వితీయ 22 చే - సప్తమి కాదేశముగ నయినది కాన దీనికిఁ బ్రథమరాదు అనఁగా, లంక కలకలంబు పుట్టె - అని కాదు కాఁగా, 2 చే - నగు ద్వితీయ కును, 21 చే - వలన కాదేశమయిన ద్వితీయకును, బ్రథమ యీ 24 చే బహుళముగా నగును 22 చే - నగు ద్వితీయకుఁ బ్రథమ రాకపోవుట బహుళ ప్రయోజనము

## కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు. 25

వాఁడు నిన్న వచ్చె, వీఁడు నేఁడు వోయె మాపు నిలువుము, ఱేపు వొమ్ము, వారు క్రోశము నడచిరి, వీరామడ వోయిరి

వ్యా కాలవాచకములకు, నధ్వవాచకములకుఁ దఱచుగాఁ బ్రథమావిభక్తి యగును కాలవాచకములు = నిన్న, నేఁడు, మాపు, ఱేపు మొ॥ అధ్వవాచక ములు = ఒక ప్రదేశమునకు మఱియొక ప్రదేశమునకు మధ్యగల యధ్వ (మార్గ) పరిమాణమును దెల్పునవి యధ్వవాచకములనఁబడును క్రోశము, ఆమడ - మున్నగునవి యధ్వవాచకములు వాఁడు నిన్న వచ్చె నిన్న - కాల వాచకము కానఁ బ్రథమయయినది ఇట్లే, నేఁడు, మాపు, ఱేపు కాలవాచకములు కావున వీనికిఁ బ్రథమయయినది వారు క్రోశము నడచిరి వీరామడ వోయిరి క్రోశము, ఆమడ - అధ్వవాచకములు గాన వీనికిఁ బ్రథమ యయినది ప్రాయికముగ ననుటచే నరుదుగా సప్తమీ విభక్తి యగును

విశే - (1) నిన్న = నిన్నటిదినమందు నేఁడు = నేఁటిదినమందు మాపు = సాయంకాలమునందు ఱేపు = ప్రాతః కాలమునందు మరుసటిదినము నందు క్రోశము = క్రోశ దూరమార్గమందు - అని యర్థములు అరుదుగా ద్వితీయా సప్తములు నగును (11) సంస్కృతమున నిట ద్వితీయాసప్తములగుట పాణినీయమతము ప్రథమయగుట యందులకు విలక్షణము

## సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు. 26

అన్ని గుఱ్ఱములకు, అన్నింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱము లన్నిం టికి, గుఱ్ఱముల కన్నింటికి - సాహిణులు ముప్వురు

రెండు గుఱ్ఱములకు, రెండింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి, గుఱ్ఱములకు రెండింటికి - సాహిణులు నలుగురు

లక్ష గుఱ్ఱములకు, లక్షకు గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు, గుఱ్ఱములకు లక్షకు - రవుతులు లక్ష

ఇత్యాదు లెఱుంగునది

వ్యా సర్వనామము, దాని విశేష్యము, సంఖ్యావాచకము, దాని విశేష్యము ననువానిలో నేది ముందు ప్రయోగింపఁబడునో, దాని ద్వితీయాది విభక్తులకుఁ బ్రథమా విభక్తి బహుళముగా నగును సర్వనామములు = అన్ని ప్రభృతులు - అచ్చిక 24 సంఖ్యాభిధానము = సంఖ్యకుఁ బేరయినది సంఖ్యావాచకమన్న మాట సంఖ్యా వాచకములు సర్వనామములలోఁ జేరినను లక్ష, కోటి మున్నగు సంస్కృత సమ శబ్దములు సర్వనామములు కాకుండుటచే, సంఖ్యావాచకములు వేఱుగఁ జెప్పఁబడెను (1) సర్వనామము దాని విశేష్యము ననువానిలో, ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుఁ బ్రథమ బహుళముగ నగును ఉదా॥ (1) సర్వనామము ముందు వాడుటకు - అన్ని గుఱ్ఱములకు సాహిణులు ముప్వురు ఇట, అన్ని - అనునది సర్వనామము, విశేషణము గుఱ్ఱము - దాని విశేష్యము 19 చే - అన్నింటికి గుఱ్ఱములకు - అని యేర్పడును ఈ 26 చే- ముందు ప్రయోగింపఁబడిన సర్వనామపు షష్ఠికిఁ బ్రథమ కలిగినచో, అన్ని గుఱ్ఱములకు - అని యగును ప్రథమ కలుగనిచో- అన్నింటికి గుఱ్ఱములకు - అని యుండును (11) విశేష్యము ముందు వాడుటకు - గుఱ్ఱము లన్నింటికి సాహిణులు ముప్వురు ఇట, అన్ని -సర్వనామము, విశేషణము గుఱ్ఱములు - విశేష్యము 19 చే - గుఱ్ఱముల కన్నింటికి - అని యేర్పడును ఈ 26 చే - ముందు ప్రయోగింపఁబడిన గుఱ్ఱములకు - అను విశేష్యపు షష్ఠికిఁ బ్రథమ యైనచో - గుఱ్ఱము లన్నింటికి - అని యగును (2) సంఖ్యా వాచకము, దాని విశేషణము నను వానిలో ముందు ప్రయోగింపఁబడిన దాని ద్వితీయాదులకుఁ బ్రథమ బహుళముగా నగును (1) సంఖ్యా వాచకము ముందు వాడుటకు - రెండు గుఱ్ఱములకు సాహిణులు నలుగురు రెండు - సంఖ్యా వాచకము; విశేషణము గుఱ్ఱములు - దాని విశేష్యము 19 చే - రెండింటికి గుఱ్ఱములకు - అని యేర్పడును ఈ 26 చే - ముందు వాడిన రెండింటికి - అను సంఖ్యా వాచకపు షష్ఠికిఁ బ్రథమ కలిగినచో రెండు గుఱ్ఱములకు - అగును ప్రథమ

కలుగనిచో రెండింటికి గుఱ్ఱములకు - అగును (ii) విశేష్యము ముందు వాడుటకు - గుఱ్ఱములు రెండింటికి సాహిణులు నలుగురు 19 చే - గుఱ్ఱములకు రెండింటికి - అని యేర్పడును ఇట, గుఱ్ఱములు - విశేష్యము రెండు - సంఖ్యా వాచకము, విశేషణము ఈ రెండింటిలో గుఱ్ఱములకు - అను విశేష్యము ముందు వాడఁబడుటచే దీని షష్ఠికిఁ బ్రథమ కలిగినచో, గుఱ్ఱములు రెండింటికి - అగును ప్రథమ కలుగనిచో - గుఱ్ఱములకు రెండింటికి - అని యుండును ఇట్లే 19 చే - (i) లక్షకు గుఱ్ఱములకు - అగును ఈ 26 చే ముందు వాడిన లక్షకు - అనుదాని షష్ఠికిఁ బ్రథమయయినచో లక్ష గుఱ్ఱములకు - అగును ప్రథమ కానిచో - లక్షకు గుఱ్ఱములకు - అని యుండును (ii) గుఱ్ఱములకు లక్షకు - అని 19 చే నగును ఈ 26 చే - ముందు వాడిన గుఱ్ఱములకు - అను విశేష్యపు షష్ఠికిఁ బ్రథమ యయినచో గుఱ్ఱములు లక్షకు - అగును ప్రథమ కానిచో - గుఱ్ఱములకు లక్షకు - అని యుండును

విశే - (i) 19 చే - విశేష్యమునకగు లింగవిభక్తి వచనములు విశేషమున కగును ఇట విభక్తి వ్యత్యాసము సూత్రింపఁబడినది (ii) ద్వితీయాదులకు - అనుటచే ద్వితీయాదులలో నొకటగు షష్ఠికి లక్ష్యములు చూపఁబడినవి (iii) అట్టి వారితో బాలకులతో - ఇత్యాదుల యెడ నీ సూత్రముచేఁ బ్రథమ కాదు ఏలయన విశేష్య విభక్తి విశేషణములకు వివక్షించిననే తచ్ఛబ్ద మను ప్రయుక్తమగును ప్రథమ చేయనెంచినచోఁ దచ్ఛబ్దమే, సమాస 9 చేఁ గాదు ఇద్దఱితో మాతో - ఇత్యాదుల యెడ నీ సూత్రమునకుఁ బ్రాప్తిలేదు ఇద్దఱు - సంఖ్యావాచకమగు రెండు శబ్దపు మహన్మహతీరూపము ఇటఁ బ్రథమ నివారణ మునకుఁ గొందరు చేసిన కృత్రిమార్థములు సరికావు

## ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు. 27

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద సుగుణాభి రామునకు రామునకు జోహారు వొనర్చెద

వ్యా ముందు ప్రయోగింపఁబడు విశేషణముల షష్ఠి విభక్తికిఁ గొన్ని చోట్లఁ బ్రథమా విభక్తి విభాషనగును 19 చే - విశేషణమున కగు లింగవిభక్తి వచనములు విశేషణమున కగును కాన, సుగుణాభిరామునకు రామునకు - అని 19 చే - నేర్పడును ఇట, రామునకు - అని విశేష్యమునకు షష్ఠి యయినది కాన, సుగుణాభిరామునకు - అని విశేషణమునకును షష్ఠియయినది ఈ 27చే- విశేషణపు షష్ఠికిఁ బ్రథమ యయినచో సుగుణాభిరాముఁడు రామునకు - అని

యగును ప్రథమ కానిచో - సుగుణాభిరామునకు రామునకు - అని యుండును.

విశే - ముందు ప్రయోగింపంబడు - అనునది 26 నుండి యనువృత్తమగును ముందు ప్రయోగింపని విశేషణమునకుఁ బ్రథమ రాదు ఉదా॥ రామునకు సుగుణాభిరామునకు - అన్నచోఁ బ్రథమ రాదు

## భవత్యర్థ వ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమయగు. 28

అగు మొదలగునవి భవత్యర్థములు విద్యాశాలి యగు పురుషుని సకల జనులు సన్మానింతురు భూతదయాపరగు మహాత్ములకు శ్రేయంబు గలుగును అతిమానుష మత్యద్భుత మతి దుష్కరమయిన కేశవార్జున కృతిన్

వ్యా అగు మున్నగు వానిచే వ్యవహితములయిన విశేషణములకుఁ బ్రథమా విభక్తి యగును భవతి+అర్థ = భవత్యర్థ భవతి శబ్దముయొక్కయర్థము గలవి భవత్యర్థములు అగు అవు-ఔ, అయిన, ఐన - మున్నగునవి భవత్యర్థములు వ్యవహితము = వ్యవధానము గలది, ఎడము కలది 19 చే-విశేష్యమున కగు లింగ విభక్తి వచనములు విశేషణమున కగును కాన, విద్యాశాలిని- పురుషుని, అని 19 చే - నేర్పడును, ఇట, పురుషుని- అని విశేష్యము ద్వితీయలోఁ గలదు కాన విద్యాశాలిని - అని విశేషణమునకు ద్వితీయ 19 చే అయినది అగు మొదలగు వానిచే వ్యవధాన మేర్పడునప్పుడు విశేషణమునకుఁ బ్రథమ యీ 28 చే - నగును విద్యాశాలియగు పురుషుని సకల జనులు సన్మానింతురు ఇట అగు - అను భవత్యర్థముచే వ్యవధానము కలుగుటచే విద్యాశాలిని - అను ద్వితీయకుఁ బ్రథమ నిత్యముగ నయినది ఇట్లే భూత దయాపరకు మహాత్ములకు, అని 19 చే - నగును మహాత్ములకు - విశేష్యము ఇది షష్ఠిలోఁ గలదు కాన భూతదయాపరకు - అని విశేషమునకు షష్ఠి కలిగినది అగు - అను భవత్యర్థముచే వ్యవహిత మయినప్పుడీ 28 చే విశేషణమునకు నిత్యముగఁ బ్రథమ కాఁగా, భూతదయాపరగు మహాత్ములకు శ్రేయంబు గలుగును-అని యయ్యెను అతిమానుషమున్+అత్యద్భుతమున్+అతిదుష్కరమున్ - కేశవార్జున కృతిన్ - అని 19 చే నగును కేశవార్జున కృతిన్ - విశేష్యము, ద్వితీయాంతము కాన, అతిమానుషమున్, అత్యద్భుతమున్, అతిదుష్కరమున్ - అని విశేషణములకు ద్వితీయ యగును "అయిన" అను భవత్యర్థముచే వ్యవధానము కలుగఁగా-అతిమానుషము+అత్యద్భుతము+

అతిదుష్కరము + అయిన, కేశవార్జున కృతిన్ - అని యెల్ల ద్వితీయలకుఁ బ్రథమ నిత్యముగ నగును

విశే - అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మయిన కేశవార్జునకృతి గోపతిసూచి - అది 8.318- ఇటఁ బెక్కు విశేషణములకుఁ బ్రథమ కలుగు ననుట కనువుగా సూరి, కృతిన్ - అని ద్వితీయాంతముగఁ జూపెను ఇందుఁ బెక్కు విశేషణముల కొక అగు - ధాతువుచే వ్యవధానము కలిగెను (సత్+ మాన మాన = సమ్మానేచ - శబ్దస్తో సన్మానించు - పాండు 5.170, సన్మానము 2.185, మను 2.76)

పారవగిశీలన - కేశవార్జున కృతి - ప్రథమ ముద్రణము ఇట నకారము జాఱిపోయి యుండును, కృతిన్ - అనియే యుండఁ దగును

## భవత్యర్థకంబు సన్నిహిత విశేషణంబునకును, దానిముందు విశేషణంబుల కయి పదంబును బహుళంబుగా నను ప్రయుక్తంబగు 29

అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు

వ్యా సన్నిహిత విశేషణమునకు భవత్యర్థమునకు, దాని ముందఱి విశేషణములకు 'అయి' పదము బహుళముగ నను ప్రయుక్తమగును భవతి+ అర్థక = భవత్యర్థక భవతి శబ్దము యొక్క యర్థము గలది భవత్యర్థకము అగు, అవు, ఔ, అయిన, ఐన - అనునవి భవత్యర్థకములు సన్నిహిత విశేషణము = సమీప విశేషణము, విశేష్యమునకు ముందు వ్యవధానము లేకుండ నుండు విశేషణము అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు ఇట హరిని - విశేష్యము అప్రమేయుఁడు - సన్నిహిత విశేషణము కావున సన్నిహిత విశేషణమునకు భవత్యర్థకమను ప్రయుక్త మగును ఔ - అనునది భవత్యర్థకము కాన, అప్రమేయుఁడు+ఔ = అప్రమేయుఁడౌ - అయ్యెను ఈ సన్నిహిత విశేషణమునకు ముందఱి విశేషణము, అతులుఁడు - అనునది కాన, అతులుఁడు - అను దానికి 'అయి' పదమను ప్రయుక్త మగును అతులుఁడు + అయి = అతులుఁడయి ఈ విధముగా, అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు - అను వాక్యమేర్పడును

విశే - అతులుని, అప్రమేయుని - హరిని - అని 19 చే నగును ఈ 29 చే, భవత్యర్థ మనుప్రయుక్తమగుచో, 28 చే - ద్వితీయకు', బ్రథమ

యగును అతులుఁడు+అయి+అప్రమేయుఁడు+ఔ హరిని = అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని - అగును

**అయి పదానుప్రయోగంబు లేనిచోఁ దుది విశేషణంబునకేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపం బడు. 30**

ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు
ఆద్యుఁడు నమేయగుణుఁడునౌ హరిని గొలుతు
ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు

వ్యా 'అయి' పద మనుప్రయుక్తము కానిచోఁ దుది విశేషణము మీఁదఁ గాని, విశేషణము లన్నింటి మీఁదఁ గాని సముచ్చయార్థము విభాషగఁ బ్రయోగింపఁబడును 'ను' శబ్దము సముచ్చయార్థము ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు ఇట 29చే - ఆద్యుఁడయి - అని అయి పద మనుప్రయుక్తము కాలేదు గనుకఁ దుది విశేషణమునకు సముచ్చయార్థము ప్రయోగింపఁబడినది హరిని - విశేష్యము ఆద్యుఁడు - తొలి విశేషణము అప్రమేయుఁడు - తుది విశేషణము తుది విశేషణమునకు సముచ్చయార్థము వచ్చిన - ఆద్యుఁడు + అప్రమేయుడును+అగు = ఆద్యుఁడప్రమేయుఁడున్ + అగు = ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరిని గొలుతు - అని యయ్యెను ఆద్యుడు నమేయగుణుఁడు నౌ హరిని గొలుతు ఆద్యుఁడు - అమేయగుణుఁడు - ఔ హరిని గొలుతు - అని యుండఁగా 29 చే - అయి పద మనుప్రయుక్తము కాలేదు గనుక విశేషణము లన్నింటికి సముచ్చయార్థము వచ్చిన ఆద్యుఁడును+అమేయగుణుఁడును +ఔ హరిని గొలుతు - అగును ఆద్యుఁడున్+అమేయగుణుఁడున్+ఔ = ఆద్యుఁడు నమేయగుణుఁడునౌ హరిని గొలుతు - అను వాక్యమేర్పడును

సముచ్చయార్థము విభాషం బ్రయోగింపఁబడును గావున సముచ్చయార్థము ప్రయోగింపఁబడ నప్పుడు - ఆద్యుఁడు + అప్రమేయుండు + అగు - హరినిగొలుతు = ఆద్యుఁడప్రమేయుండగు హరినిగొలుతు - అని 28చే నగును

సముచ్చయము = బాహ్య వ్యాపారముచేఁగాని, బుద్ధి వ్యాపారముచేఁగాని భిన్న పదార్థములనొకచోఁ గూర్చుట "సమాహార స్సముచ్చయః" (అమ) ఆద్యుఁడును + అమేయ గుణుఁడును ఇట రెండు విశేషణములను "ను"

శబ్దములాకచో సమావేశపఱుచును ఆద్యుఁడు + అప్రమేయుఁడును ఇట 'ను' శబ్దముచే మొదటి విశేషణమా క్షిప్తమగును

## ధాతుజ విశేషణ వ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయి పదం బనుప్రయుక్తంబగు. 31

ఆద్యుడయి యప్రమేయుఁడై యఖిల సేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు ఇచట మఱియుం బ్రయోగ వైచిత్ర్యంబు గలదది బ్రయోగంబుల నెఱుంగునది

వ్యా విశేషణములకు విశేష్యమునకు, ధాతుజ విశేషణముచే వ్యవధాన మేర్పడినపుడు, విశేషణము లన్నింటికి 'అయి' పద మను ప్రయుక్తమగును అయి - అనుదాని రూపాంతరము, 'ఐ' అనునది కాన, అయి, ఐ - అనునవి యను ప్రయుక్తములగును - ధాతుజ విశేషణములు = ధాతువులనుండి కలిగిన విశేషములు ఎడి, ఎడు మున్నగు ప్రత్యయములు ధాతువులకుఁజేరఁగా నేర్పడు నవి ధాతుజ విశేషణములు ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిల సేవ్యుఁడై యెసంగెడు దేవుని నభినుతింతు ఇట దేవుని - విశేష్యము ఆద్యుఁడు, అప్రమేయుఁడు, అఖిల సేవ్యుఁడు - అనునవి విశేషణములు ఈ విశేషణములకు, దేవుని - అను విశేష్యమునకు మధ్య ఎసఁగెడు - అను ధాతుజ విశేషణము చేరుటచే వ్యవధాన మేర్పడినది (వ్యవధానము = ఎడము) కావున విశేషణము లన్నింటికి నీ 31 చే - అయి పదమను ప్రయుక్తమయ్యెను ఆద్యుఁడు+అయి= ఆద్యుఁడయి అప్రమేయుఁడు + ఐ = అప్రమేయుఁడై, అఖిల సేవ్యుఁడు+ ఐ = అఖిల సేవ్యుఁడై - అని యేర్పడెను ఈ సందర్భమున నింకను బ్రయోగ విశేషణములు కలవు వానిని బ్రయోగములను బట్టి తెలిసి కొనవలెను

విశే - (1) ధాతుజ విశేషణము లేదు ఎడి ప్రభృతి వర్ణకాంతంబు లేదును ధాతుజ విశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు చూ క్రియా 44 - 47 సూ (11) ప్రయోగ వైచిత్రికి - అరణ్య 4 - 125, ఆది 8 - 85, 261 ప

## భావార్థకాది యోగంబునంగర్తకుం బ్రథమ యగు. 32

రాముఁడు వచ్చుట, రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె, రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు, రాముఁడు పట్టిన ప్రతిన వారింపఁ దరంబు గాదు.

వ్యా భావార్థకము మొదలగు వానితో నన్వయ మున్నప్పుడు కర్తను బోధించు శబ్దమునకుఁ బ్రథమావిభక్తి యగును భావము = ధాత్వర్థము (చూ క్రియా 35) ధాత్వర్థమున, టవర్ణకమగును యోగము = సంబంధము, అన్వయము ఉదా॥ రాముఁడు వచ్చుట వచ్చుట - అనునది భావార్థకము కావున దీనికితోడి యన్వయమునఁ గర్తను బోధించు శబ్దమునకుఁ బ్రథమ యయి = రాముఁడు - అని యేర్పడెను అదులకు రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె రాఁగా - అను దానితో నన్వయ ముండుటచేఁ గర్తయగు రామ శబ్దమునకుఁ బ్రథమ యయ్యెను రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు అందినను - అను దానితో నన్వయ ముండుటచేఁ గర్తయగు రామ శబ్దమునకుఁ బ్రథమ కలిగెను రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబు గాదు పట్టిన - అను దానితో నన్వయ ముండుటచేఁ గర్త యగు రామ శబ్దమునకుఁ బ్రథమ యయ్యెను

విశే - (1) వచ్చుట - భావార్థకము క్రియా 35 రాఁగా - భావ లక్షణము క్రియా 40 అందినను - వృత్తమగు భావ లక్షణము క్రియా 41 పట్టిన - క్తవదర్థకము క్రియా 46 (11) క్రియా 36, 37 సూత్రములును దీనికి లక్ష్యములు

## ప్రథమాంతంబులగు యుష్మ దస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు-నంతాగమంబులు ప్రాయికంబుగ నగు. 33

వ్యా ప్రథమాంతములగు యుష్మద్విశేషణములకుఁ జివర నేకత్వమున, వు - వర్ణము, బహుత్వమున, రు వర్ణము ప్రాయికముగ నాగమములగును, ప్రథమాంతములగు నస్మ ద్విశేషణములకుఁ జివర నేకత్వమున, ను వర్ణము, బహుత్వమున ము వర్ణము నాగమములగును యుష్మద్విశేషణములు = నీ - శబ్దము యొక్క విశేషణములు అస్మద్విశేషణములు = నా శబ్దము యొక్క విశేషణములు

ఉదా॥ నీవు ధన్యుఁడు + వు, మీరు ధన్యులు + రు, నేను ధన్యుఁడు +ను, మేము ధన్యులు + ము చూ 34

ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు. 34

నీవు ధన్యుఁడవు - నేను ధన్యుఁడను - మీరు ధన్యులరు - మేము ధన్యులము॥

ఇకారంబు మీఁది కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు నను సూత్రముచేత, వునుల కిత్వంబగు నీవు సుకృతివి- నేను సుకృతిని - ఆర్తి హరుఁడవౌ నినుఁ గొల్తునంబుజాక్ష॥

గర్వి గర్విష్ఠుండగు నన్ను — మీరలు పెద్దలు — ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబులయ్యె॥

వ్యా వు - ను, రు ము - అను నాగమములు పరములగు నప్పు డుత్వమున కత్వమగును నీవు ధన్యుఁడు - అనుచో నీవు - యుష్మదర్థకము కనుక ధన్యుఁడు-అనునది ప్రథమాంతమగు యుష్మద్విశేషణమగును కావున 33 చే-ఏకత్వమున, వు వర్ణమంతాగమ మగుచో - నీవు ధన్యుఁడు + వు ఈ 34 చే - వువర్ణము పరమను నపుడుత్వమున కత్వము కలిగి-నీవు ధన్యుడ్ + అ + వు=నీవు ధన్యుఁడవు-అని యేర్పడును నేను ధన్యుఁడు - అనుచో, నేను - అస్మదర్థకము గావున ధన్యుఁడు - అస్మద్విశేషణమగును ఇది ప్రథమాంతము 33 చే- ఏకత్వమున నువర్ణ మంతాగమ మగుచో నేను ధన్యుఁడు + ను ఈ 34 చే - ఉత్వమునకు కత్వమయి నేను ధన్యుఁడను-అని సిద్ధించును మీరు ధన్యులు, అనుచో మీరు- యుష్మదర్థకము కాన, 33చే - బహుత్వమున రువర్ణ మంతాగమ మగుచో - మీరుధన్యులు + రు ఈ 34 చే - ఉత్వమునకత్వము కలిగి, మీరుధన్యులరు- అని యేర్పడును- మేము ధన్యులు - అనుచో, మేము - అస్మదర్థకము గనుక ధన్యులు - అనునది యస్మద్విశేషణమగును 33చే- బహుత్వమున మువర్ణ మంతాగమమగుచో — మేము ధన్యులు + ము ఈ 34 చే - ఉత్వమున కత్వము కలిగి మేము ధన్యులము- అని సిద్ధించును

నీవు సుకృతి - అనుచో నీవు - యుష్మదర్థకము కాన, సుకృతి-యుష్మ ద్విశేషమగును 33చే- వువర్ణమంతాగమమయిన, నీవు సుకృతి+వు-అగును తత్సమ 26చే - ఉత్వమునకిత్వము కలిగి, నీవు సుకృతివి - అను రూపము సిద్ధించును నేను + సుకృతి - అనుచో, నేను - అస్మదర్థకము గనుక, సుకృతి-అనునది యస్మద్విశేషణమగును 33చే- నువర్ణ మంతాగమమయిన, నేను సుకృతి + ను తత్సమ 26చే - నేను సుకృతి-అగును ఇకారముపై

నీయాగమములు ప్రాయికముగ నగుననుటకివి యుదాహరణములు ఇకారము మీఁద వలెనే ఉత్వముమీఁదను నివి ప్రాయికముగనే యగుననుటకు- ఉదా॥ ఆత్రిహరుఁడవౌ నినుఁగొల్తునంబుజాక్షి 33 చే - ఆత్రిహరుఁడు+వు. ఈ 34 చే - ఆత్రిహరుఁడవు

33 సూత్రమున, వునులు, రుములు ప్రాయికముగ విధింపఁబడెను కాన నివి యరుదుగా నాగమములు కాకపోవచ్చును ఉదా॥ గర్వగర్విష్ఠుండు+ అగునన్ను ఇట 'ను' అంతాగమమై గర్వగర్విష్ఠుండు+ను=గర్వగర్విష్ఠుండను- కాలేదు మీరలు పెద్దలు ఇట 'రు' అంతాగమమై, పెద్దలు+రు = పెద్దలరు- కాలేదు

విశే - (1) ఆత్రిహరుఁడవౌనిను - ప్రథమముద్రణము యథాస్థితముగ సమన్వయమార్గము గోచరింపక రెండు మతములు ప్రతిపాదింపఁబడెను (I) ఆత్రిహరుఁడవు+ఔనిను - అని గ్రహించి కొందఱిది కృత్రిమ ప్రథమోదాహరణ మందురు కాని యదిసరికాదు ఏలయన- (I) భిన్నప్రకరణమునఁ జూపిన యుదాహరణమును, ముగిసిపోయిన పూర్వ ప్రకరణమునందలి ధన్యుఁడవు-అనుదానితో ముడిపెట్టుట లక్ష్య ప్రదర్శన రీతికి విరుద్ధము (II) కృత్రిమ ప్రథమ గర్వగర్విష్ఠుండగునన్ను అనుదానితోనే గతార్థమగును (III) ఈ వృత్తి ప్రథమ ముద్రణమునఁ ద్విధా విభజింపఁబడి యుండుటచే దీనిని బైకిలాగుట సూరిహృదయముకాదు (2) కొందఱు, 'వౌ' అచ్చుతప్పనిచెప్పి, ఆత్రిహరుఁడు+అవు (అగు) అని విభజించి క్రిందికన్వయింతురు ఇదియు సరికాదు ఏలయన- (I) ఈ పక్షమునఁ బాఠమును దిద్దవలసివచ్చును (II) క్రిందికిలాగుట ప్రథమ ముద్రణలోని వర్గీకరణకు విరుద్ధము అహోబిల పండితుఁడు, ఉత్వముపై నివి నిత్యములని తలఁచి— "పాండు భూవరునకుఁ గోడలైతి నిత్యాది వచనంత్వనాకరమేవ" అని తిక్కన ప్రయోగమును నిరసించెను ఇకారముమీఁదను, ఉత్వము మీఁదను నివి ప్రాయికములని యహోబిల వచనమును సవరించుట కుద్దేశించి సూరి సుకృతివి, సుకృతిని, ఆత్రిహరుడవు-అని యుదాహరించెను (II) గర్వగర్విష్ఠుండగు నన్ను — నిర్వ 7-91 మీరలు పెద్దలు- కళా 1-57

**అది శబ్దంబునకు వునులు పరంబులగునపుడును సంబోధనంబునందును దాన యను నాదేశంబగు. 35**

నీవు చిన్నదానవు, నేను జిన్నదానను. ఓ చిన్నదాన!

వ్యా వు-నులు పరమగునపుడును సంబోధనమునందును- అది శబ్దము

నకు, దాన-అనునది యాదేశమగును సమాస 9 చే- చిన్న + అది కారక 33 చే- చిన్న + అది + వు ఈ 35 చే - అదికి దాన- ఆదేశమగును చిన్న + దాన + వు= చిన్నదానవు సమాస 9 చే- చిన్న + అది కారక 33చే- చిన్న + అది + ను ఈ 35 చే- చిన్న + దాన + ను = చిన్నదానను ఓచిన్నదాన సమాస 9చే-చిన్న + అది ఈ 35చే- చిన్న + దాన = చిన్నదాన తత్సమ 14చే - ఓచిన్నదాన!

## అన్య యుష్మ దస్మత్కార్యంబులందు త్తరోత్తరంబు బలీయంబు. 36

వారును మీరును ధన్యులరు మీరును మేమును ధన్యులము

వ్యా అన్య కార్యము, యుష్మత్కార్యము, నస్మత్కార్యము ననువానిలో నుత్తరోత్తరము బలీయము అనఁగా నన్య కార్యముకంటె యుష్మత్కార్యము, యుష్మత్కార్యముకంటె నస్మత్కార్యము, బలవత్తరములని తాత్పర్యము యుష్మత్కార్యము = నీ శబ్దమునకగు కార్యము అస్మత్కార్యము = నా శబ్ద మునకగు కార్యము అన్య కార్యము = నీ నా శబ్దములకంటె భిన్నములగు శబ్దములకగు కార్యము వారును మీరును ధన్యులరు ధన్యులరు - అనునది యుష్మదర్థక విశేషణము (మీరు ధన్యులరు-) వారు ధన్యులు - అనునది, యన్యకార్యము ఈ రెండిటిలో యుష్మత్కార్యమే బలీయమగుటచే, వారును మీరును ధన్యులరు - అని యేర్పడెను మీరును, మేమును ధన్యులము ధన్యులము - అనునది యష్మద్విశేషణము (మేము ధన్యులము) ధన్యులరు-అనునది యుష్మద్విశేషణము ఈ రెండింటిలో నస్మత్కార్యమే బలీయము కాన, మీరును మేమును ధన్యులము - అని సిద్ధించెను

విశే - అన్య కార్యముకంటె యుష్మత్కార్యమే బలీయమగుటచే, యుష్మత్కార్యముకంటె బలీయమగు నస్మత్కార్య మెట్లునుగై ముత్య న్యాయమున నన్య కార్యముకంటె బలీయమే యగును కావున నుదాహరణము చూపఁబడ లేదు వారును మేమును ధన్యులము - అని యగుననుట తెల్లము

పదసార్థక్యము - కార్యంబులందు - అను బహువచన స్వారస్యముచే విశేషణముల ప్రయోగముననే గాక క్రియా ప్రయోగమునందు నిట్లే గ్రహింపవలెను వారును మీరును వందితిరి మీరును మేమును వందితిమి వారును మేమును వందితిమి

ఏక వాక్యంబునం దొకానొక్కండు తక్క సర్వ పదంబులు క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపం జను. 37

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమం దెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపందగును ఏని ప్రభృతి శబ్దములు కొన్ని నియమ సాపేక్షంబులయి యుండు

గాలి చల్లగా వీచెను వీచెను జల్లగా గాలి చల్లగా గాలి వీచెను వీచెను గాలి చల్లగా గాలి వీచెను జల్లగా చల్లగా వీచెను గాలి

ఇది కారక పరిచ్ఛేదము

వ్యా ఏక వాక్యమున, నేవో కొలఁది పదములను దప్ప నెల్ల పదములను, గ్రమము నపేక్షింపక ప్రయోగింపవచ్చును అనఁగా నిది పూర్వపద, మిది పరపదమను నియమము లేకుండ వాక్యమునందలి పదముల నిచ్చ వచ్చినట్లు వాడవచ్చును ఏని - మొదలగు పదములు కొన్ని మాత్రమే నియమము నపేక్షించి యుండును గాలి చల్లగా వీచెను ఈ వాక్యము నందలి మూఁడు పదములను బూర్వమిది పరమిది యనక యిచ్చవచ్చినట్లు ప్రయోగింపవచ్చును వీచెను జల్లగా గాలి చల్లగా గాలి వీచెను వీచెను గాలి చల్లగా గాలి వీచెను జల్లగా చల్లగా వీచెను గాలి ఏని - మున్నగు వాని నిట్లు మార్పరాదు రాముఁ డేని కృష్ణుఁడేని రావలెను ఏని రాముఁడు-ఇత్యాదిగాఁ గ్రమమును మార్పరాదు

పద సార్థక్యము - ఏక వాక్యంబునందు - అనుటచే ననేక వాక్యముల యందలి పదములను వలచినట్లు మార్పరాదు ఏలయన ననేక వాక్యముల యందలి పదముల నిచ్చవచ్చినట్లు ప్రయోగించినచో నర్థము చెడును కావున నేక వాక్యమునందలి పదములనైనను నర్థస్ఫూర్తికి భంగము కలుగకుండునట్లు చూచుకొనుట కర్తవ్య మనఁదగును

ఇది ఘంటాపథము

# సమాస పరిచ్ఛేదము



## సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు. 1

పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము

వ్యా॥ సామర్థ్యము కలిగిన పదము లేక పదముగా నగుట సమాసము సమాసమునందుండు సామర్థ్యము నేకార్థీభావ సామర్థ్యమని యందురు ఏకార్థీభావ మనఁగా నేకార్థములు కానివి, యేకార్థమగుట యని యర్థము ఈ (ఏకార్థ+చ్వి+భావ) యభిప్రాయమునే "పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీ భావంబు సామర్థ్యంబు" అను వాక్యము బోధించుచున్నది (పృథగర్థానామే కార్థీభావః సామర్థ్యమ్ - మ భా ) పృథగ్భూతంబులగు నర్థంబులకున్ = వేఱువేఱుగా నున్న యర్థములకు, ఏకార్థీభావంబు = ఏకార్థమగుట, సామర్థ్యము అర్థము శబ్దమ్ము నాశ్రయించుకొని యుండును గాని విడిగా నుండదు కావున, నిది పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము" అనుటలోఁ బర్యవసించును (పృథగర్థానాం పదానా మేకార్థీ భావస్సమర్థ మిత్యుచ్యతే-మ భా సంగతార్థః సమర్థః సంసృష్టార్థః సమర్థ ఇతి ఏకీభూత ఇతిగమ్యతే - మ భా ప్ర) పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబులకున్=వేఱుగాఁ ప్రసిద్ధమయిన, యర్థములు గలిగిన పదములకు, ఏకార్థమునందు, వృత్తి=వర్తనము, సామర్థ్యము అనఁగా ప్రక్రియా దశయందు వేర్వేఱుగాఁ ప్రసిద్ధార్థములు కలిగియుండు పదములు సముదాయశక్తిచే నేకార్థమునందు వర్తించుట సామర్థ్యమని తాత్పర్యము ఉదా॥ రాజన్ + ఙస్" + 'పురుష + సు' అనునది యలౌకిక విగ్రహ వాక్యము ఙస్-షష్ఠీ ప్రత్యయము సు- ప్రథమా ప్రత్యయము ఇది ప్రక్రియావస్థ ఇట, 'రాజన్ + ఙస్' అనునది 'రాజునకు సంబంధించిన-

అను- నర్థమును వేరుగా నిచ్చు పదము పురుష+సు-అనునది పురుషుఁడను నర్థమును వేఱుగానిచ్చు పదము ఇవి సముదాయ శక్తిచే రాజ సంబంధి పురుషుఁ డను నేకార్థమును బోధించునవి యగుట సామర్థ్యము కాఁగా, రాజన్+ఙస్+ పురుష+సు-అనునవి సమర్థములగు పదములు ఇవి రాజపురుషః-అని యేక పదముగానగుట సమాసము

సమాసములందుండు నీ సామర్థ్యము నేకార్థీభావ సామర్థ్యమనియు, వృత్తి యనియునందురు వృత్తికాశ్రయములగుటచే సమాసాదులు వృత్తులనఁబడును

విశే - వృత్తి రెండు విధములు (1) జహత్స్వార్థ=దేనియందుఁబద ములు స్వార్థమును విడుచునో, యది జహత్స్వార్థ పూర్వపదము స్వార్థమును విడువఁగాఁ బూర్వోత్తర పదముల యర్థము నుత్తర పదము బోధించుట మూలమున సమర్థములగు పదములేకపదమగుట సమాసమని యీ పక్షమున సూత్రార్థము (2) అజహత్స్వార్థ=దేనియందుఁ బూర్వపదములు స్వార్థమును విడువవో, యది జహత్స్వార్థ, పూర్వోత్తర పదముల యర్థములు పాంసూదక న్యాయమున మిశ్రితములయి, యేకార్థ బోధకములగుట మూలమున, సమర్థము లగు పదము లేకపదముగా నగుట సమాసమని యీ పక్షమున సూత్రార్థము రాజన్+ఙస్+పురుష+సు-అనుచో రాజపదము స్వార్థమును విడువఁగా, రాజ పద సాన్నిధ్యమునఁ బురుష పదమే రాజపురుషుఁడను నర్థమును బోధించుట జహత్స్వార్థ - రాజ శబ్దార్థము పురుష శబ్దార్థము విడఁదీయరానట్లు మిశ్రితము లయి, రాజ సంబంధి పురుషుఁడను నర్థమును బోధించుట యజహత్స్వార్థ

## సమాస ప్రక్రియ

1 మొదట నలౌకిక విగ్రహమును గల్పింపవలెను

రాజన్ + ఙస్ + పురుష + సు

2 సుపోధాతు ప్రాతిపదికయోః (పాణి) అను సూత్రముచే, సుబ్వి భక్తులు లోపించును

రాజన్ + పురుష

"నలోపః - ప్రాతిపదికాంత్యస్య" (పాణి)

రాజపురుష - ప్రాతిపదికము

(కృత్తద్ధిత సమాసాశ్చ- అను సూత్రముచే నిది సమాస ప్రాతిపదికము)

3 దీనిపై సుబ్విభక్తులు చేరి సమస్త పదములేర్పడును

రాజపురుష + సు = రాజపురుషః

సూచన - అలౌకిక విగ్రహమున సముదాయశక్తి నారోపింపవలెను

తన్మూలమున, నేకార్థీభావ సామర్థ్యమును విధింపవలెను తన్మూలమున సమాస తద్విశేష సంజ్ఞలను విధింపవలెను కృత్తద్ధిత సమాసాశ్చ - అను సూత్రముచేఁ బ్రాతిపదిక సంజ్ఞ విధింపవలెను ఈ దశల యీ నలౌకిక విగ్రహమున నెట్టి పరిణామమును గలుగదు కాన నీదశలంతర్గతముగా నున్నవనుకొని ప్రక్రియలు చెప్పుట పరిపాటిఁ (వృత్తి వి)

వృత్తుల ప్రక్రియలు ఘంటాపథోపజ్ఞములు పూర్వ వ్యాఖ్యలశాస్త్రీయములు

## సాంస్కృతి కాచ్ఛిక మిశ్ర భేదంబుచే సమాసంబు త్రివిధంబు 2

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు కేవల సంస్కృత శబ్దంబుల సమాసంబు సిద్ధంబు నాఁబడు రాజాజ్ఞ, తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు. సంస్కృత సమంబుల సమాసంబు సాధ్యంబు నాఁబడు - రాజునాజ్ఞ, తటాకంబునుదకము లక్ష్మీవల్లభుఁడు తక్కిన తెనుఁగుల సమాసం బాచ్ఛికం బనంబడు తెలి యానతి, చెఱువునీరు సిరిచెలువుఁడు ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు రాజుముదల, చెఱువు నుదకము, సిరి వల్లభుఁడు.

వ్యా సాంస్కృతికమనియు, నాచ్ఛికమనియు, మిశ్రమనియు సమాసము మూఁడు విధములు (1) సాంస్కృతికము - ఇది రెండువిధములు (1) సిద్ధము = కేవల సంస్కృత శబ్దముల సమాసము సిద్ధమనఁబడును రాజ+ఆజ్ఞా - సవర్ణదీర్ఘ సంధి జరిగి, రాజాజ్ఞా అగును ఇట, రాజశబ్దము ఆజ్ఞాశబ్దము కేవల సంస్కృత శబ్దములు కనుక నిది సిద్ధము రాజాజ్ఞా - ప్రాతిపదికము తత్సమ 54 చే-రాజాజ్ఞ తత్సమ 39చే - రాజాజ్ఞ + ము తత్సమ 57 చే - రాజాజ్ఞ, యని సిద్ధించును తటాక+ఉదక=తటాకోదక (గుణసంధి) తటాక శబ్దము, ఉదక శబ్దము రెండును గేవల సంస్కృత శబ్దములగుటచే నిది సిద్ధము తత్సమ 39 చే - తటాకోదకము లక్ష్మీవల్లభ—ఇట లక్ష్మీ శబ్దమును, వల్లభ శబ్దమును గేవల సంస్కృత శబ్దములు కావున నిది సిద్ధము తత్సమ 21చే-లక్ష్మీవల్లభు తత్సమ 22 చే-లక్ష్మీవల్లభు + డుజ్ తత్సమ 19 చే - లక్ష్మీవల్లభుఁడు రాజాజ్ఞా, తటాకోదక, లక్ష్మీవల్లభ - అనునవి సిద్ధసమాస

ప్రాతిపదికము లన్నమాట రాజాజ్ఞ, తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు - అనునవి వీని సంస్కృత సమరూపములు (11) సాధ్యము = సంస్కృత సమముల సమాసము సాధ్యము ఉదా॥ రాజునాజ్ఞ ఇట, రాజు-సంస్కృత సమము ఆజ్ఞ - సంస్కృతసమము, కాన సాధ్యము తటాకంబు నుదకము తటాకంబు, ఉదకము-రెండును సంస్కృతసమములే యగుటచే నిది సాధ్యము లక్ష్మీవల్లభుఁడు లక్ష్మి, వల్లభుఁడు - అను రెండును సంస్కృత సమము లగుటచే నిది సాధ్యము

(2) అచ్ఛికము - తక్కిన తెనుఁగుల సమాస మాచ్ఛికము తక్కిన తెనుఁగులనఁగా సంస్కృతసమము కాక తక్కిన తెనుఁగులు అనఁగా నచ్చ తెనుఁగు పదముల సమాస మాచ్ఛికమని తాత్పర్యము తేనియానతి తేఁడు - ఆచ్ఛికము ఆనతి - ఆచ్ఛికము కావున నిది యాచ్ఛికము చెఱువు నీరు చెఱువు శబ్దము, నీరు శబ్దము రెండును నాచ్ఛికములే కావున నిది యాచ్ఛికము సిరి చెలుఁవుడు సిరి శబ్దము చెలువుఁడు శబ్దము రెండును నాచ్ఛికములగుటచే నిది యాచ్ఛికము

(3) మిశ్రము - ఉభయములు కూడినది మిశ్రము ఉభయములు= సంస్కృత సమము, నచ్చతెనుఁగు శబ్దము కాన సంస్కృతసమము నాచ్ఛికము ననువానితోఁ గూర్పఁబడిన సమాసము మిశ్రము రాజుముదల ఇట, రాజు సంస్కృత సమము ముదల - ఆచ్ఛికము కావున నిది మిశ్రసమాసము చెఱువు నుదకము చెఱువు – ఆచ్ఛికము ఉదకము – సంస్కృతసమము కాన నిది మిశ్రము సిరివల్లభుఁడు సిరి - ఆచ్ఛికము వల్లభుఁడు – సంస్కృతసమము కాన నిది మిశ్రము

ప్రక్రియ - రాజునాజ్ఞ "రాజుయొక్క" + "ఆజ్ఞ + ము" - అలౌకిక విగ్రహము 25 చే - రాజు + ఆజ్ఞ సంధి 34 చే - రాజును + ఆజ్ఞ = రాజున్+ఆజ్ఞ రాజునాజ్ఞ-ప్రాతిపదికమగును తత్సమ 39 చే, రాజునాజ్ఞ + ము తత్సమ 57 చే - రాజునాజ్ఞ తటాకంబు నుదకము "తటాకంబు + యొక్క" + "ఉదక + ము" 25 చే - విభక్తి లోపము తటాకంబు + ఉదక సంధి 34 చే - తటాకంబు+ను+ఉదక=తటాకంబున్+ఉదక తటాకంబునుదక తత్సమ 39 చే - తటాకంబునుదకము లక్ష్మీవల్లభుఁడు - "లక్ష్మి + యొక్క" + "వల్లభ+డుఙ్" 25 చే-లక్ష్మివల్లభ-ప్రాతిపదిక మగును తత్సమ 21 చే- లక్ష్మీవల్లభు తత్సమ 22చే- లక్ష్మీవల్లభు+డుఙ్ తత్సమ 19చే- లక్ష్మీవల్లభుఁడు తేనియానతి, "తేని+యొక్క"+"ఆనతి+

సు " 25 చే - తేని + ఆనతి సంధి 3 చే - తేని-య్+ఆనతి=తేనియానతి అనుక్త న్యాయమున సుప్రత్యయము చేరును తేనియానతి+సు తత్సమ 57చే- సులోపించి, తేనియానతి-సిద్ధించును చెఱువునీరు - "చెఱువు+యొక్క" + "నీరు+వు" 25 చే - చెఱువునీరు - ప్రాతిపదికమగును తత్సమ 48 చే- చెఱువునీరు + వు అచ్ఛిక 2 చే, నిది స్త్రీసమముగాన, తత్సమ 57 చే- విభక్తి లోపము జరిగి చెఱువునీరు - అనురూపమేర్పడు సిరిచెలువుఁడు - "సిరి+ యొక్క"+"చెలువ+డుణ్ 25 చే-సిరిచెలువ - ప్రాతిపదికమగును అచ్ఛిక 2 చే, నిది పుంలింగతుల్యమగును కావున తత్సమ 21 చే- సిరిచెలువు తత్సమ 22 చే- సిరిచెలువు+డుణ్ తత్సమ 19 చే - సిరిచెలువుఁడు రాజుముదల - "రాజు+యొక్క"+"ముదల+ము " 25చే- రాజుముదల-ప్రాతిపదికమగును తత్సమ 39 చే- రాజుముదల + ము అచ్ఛిక 2 చే- ముదల శబ్దము స్త్రీసమ మగుటచే, తత్సమ 57 చే - 'ము' లోపించి, రాజుముదల - అను రూప మేర్పడును చెఱువునుదకము - "చెఱువు+యొక్క"+"ఉదక+ము " 25చే- చెఱువు+ఉదక సంధి 34చే - చెఱువు+ను+ఉదక=చెఱువున్+ఉదక చెఱువునుదక తత్సమ 39 చే- చెఱువునుదకము 'సిరి+యొక్క"+"వల్లభ+ డుణ్ " 25చే- సిరివల్లభ - ప్రాతిపదికమగును తత్సమ 21చే- సిరివల్లభు 22చే- సిరివల్లభు+డుణ్ 19 చే - సిరివల్లభుఁడు

విగ్రహము రెండు విధములు - (1) లౌకిక విగ్రహము = వృత్త్యర్థావబోధకమగు వాక్యము లౌకిక విగ్రహము (వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః సి కౌ ) (11) అలౌకిక విగ్రహము=శాస్త్ర ప్రక్రియకుఁ గల్పితము

**తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు. 3**

తత్పురుష, బహువ్రీహి, ద్వంద్వంబులని సమాసంబులెల్లం ద్రివిధంబులయి యుండు అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానంబులయి యుండు, అందుఁ దత్పురుషంబు వ్యధికరణం బని, సమానాధికరణంబని ద్వివిధంబు ద్వితీయాదులకు మీఁది పదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు, నెలతాల్పు, నెల తక్కువ వాఁడు, దేవరమేలు, దొంగ భయము, రాముని బాణము, మాట నేర్పరి. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియె కర్మధారయంబు నాఁబడు సరసపు

వచనము, తెల్లగుఱ్ఱము, మంచి రాజు ఇది సంఖ్యా పూర్వంబు ద్విగువు నాఁబడు, ముజ్జగములు, ముల్లోకములు బహువ్రీహి, ముక్కంటి, చలివెలుగు ద్వంద్వము, తల్లి దండ్రులు, అన్న దమ్ములు ప్రాయికంబుగా ననుటచే సంస్కృత లక్షణంబుఁ దొడరని సమాసంబుం గలదని సూచింపబడియె దానం జేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదులయిన యుపమాన పూర్వపద కర్మధారయంబులు గ్రాహ్యంబులు ముఖపద్మము, చరణ కమలములు ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవు గాని, విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు, రాజపురుషుఁడు, నీలోత్పలము, పీతాంబరుఁడు, రామలక్ష్మణులు కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దముతోడ సమసింపదు దానం జేసి యనేకమాఱు లల్పదండి త్యాదులు దుష్టములని తెలియునది

వ్యా తత్పురుషము మొదలగు సమాసములకు లక్షణము, తఱచుగా సంస్కృతమునఁ జెప్పఁబడినట్లే యగును తెనుఁగున సమాసము లన్నియు మూఁడు విధములుగ నుండును (1) తత్పురుషము (2) బహువ్రీహి (3) ద్వంద్వము

తత్పురుషము - ఇది తఱచుగ నుత్తర పదార్థ ప్రధానమై యుండును ఉత్తర పదము = సమాసము నందలి తుది యవయవము ప్రాధాన్యము క్రియాన్వయమును బట్టి గ్రహింపవచ్చును రాముని బాణము వాలిం గూల్చెను ఇట రాముని బాణము - తత్పురుషము బాణము - అను నుత్తర పదమే క్రియతో నన్వయించుచున్నది కాన నిది ఉత్తర పదార్థ ప్రధానము తత్పురుషము రెండు విధములు (1) వ్యధికరణము, (11) సమానాధికరణము (1) వ్యధికరణము - ద్వితీయాదులకు మీఁదిఁ పదముతోడ సమాసము వ్యధికరణము ద్వితీయా తత్పురుషము - నెలతాల్పు = నెలనుదాల్చు తృతీయాతత్పురుషము - నెల తక్కువ వాఁడు = నెలచేతఁ దక్కువ వాఁడు చతుర్థీ తత్పురుషము - దేవర మేలు = దేవరకొఱకు మేలు పంచమీ తత్పురుషము - దొంగ భయము = దొంగవలని భయము షష్ఠీ తత్పురుషము - రాముని బాణము = రాముని యొక్క బాణము సప్తమీ తత్పురుషము - మాట నేర్పరి = మాటయందు నేర్పరి

విశే - వి + అధికరణ = వ్యధికరణము అధికరణమనఁగా నాధారము విభిన్నమగు నాధారము వాచ్యములగు పదములు దేనియందుండునో యది వ్యధికరణము తత్పురుషము వ్యధికరణము ఉదా॥ రాముని బాణము ఇట, రామత్వము రాముని యందును, బాణత్వము బాణము నందును, నుండును కావున నిది వ్యధికరణమగును

(11) సమానాధికరణము - విశేషణమునకు విశేష్యముతోనగు సమాసము సమానాధికరణము సరసపు వచనము ఇట సరసము - విశేషణము వచనము- విశేష్యము విశేషణమునకు విశేష్యముతోనయిన సమాసము కావున నిది సమానాధికరణము దీనినే కర్మధారయమని యందురు (తత్పురుషః సమానాధికరణః కర్మధారయః - పాణి) తెల్ల గుఱ్ఱము - ఇట, తెల్ల - విశేషణము, గుఱ్ఱము విశేష్యము కాన నిది కర్మధారయము మంచి రాజు మంచి - విశేషణము రాజు = విశేష్యము కాన నిది కర్మధారయము ఈ కర్మధారయ సమాసము సంఖ్యాపూర్వకమయినచో ద్విగువనఁబడును (సంఖ్యా పూర్వో ద్విగుశ్చ - సి కౌ) అనఁగా విశేషణము సంఖ్యా వాచకమయినచో ద్విగువగును (తత్పురుష విశేషః కర్మధారయః తద్విశేషోద్విగుః - సి కౌ) సంఖ్యాపూర్వములు సామాన్యముగా ద్విగువులనుట తెలుఁగు సంప్రదాయము ముజ్జగములు, ముల్లోకములు వీనిలో, మూఁడు - అను సంఖ్యా వాచకము పూర్వపదమగుటచే నివి ద్విగువులు

విశే - (1) సమాన + అధికరణ = సమానాధికరణము సమానమైన యాధారము వాచ్యములగు పదములు దేనియందుండునో యది సమానాధికరణమని మతాంతరము సరసపు వచనము - ఇట సరసత్వము వచనత్వము వచనము నందే యుండును గాన నిది సమానాధికరణము కర్మధారయ ద్విగువులు సమానాధికరణములు త్రిజగములు, త్రిలోకములు - కర్మధారయములే కాని ద్విగువులుకావు "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్ (2.1.50) సప్తర్షయః" (సి కౌ) తద్ధితార్థద్విగువు — షాణ్మాతురః ఉత్తర పద ద్విగువు - పంచగవధనః సమాహార ద్విగువు - త్రిలోకీ, త్రిభువనమ్ బహు వచనాంతములేవియు సిద్ధద్విగువులు కావని కొండగుర్తు పెట్టుకొనవచ్చును (ద్విగు రేక వచనమ్ — పాణి) (11) రెండు ద్రవ్యములకు బుద్ధి పరికల్పితమగు మూఁడవ ద్రవ్యమాధారమగుట సమానాధికరణమని వేఱొక మతము (వాక్య ప)

(2) బహువ్రీహి - ఇది తఱచుగ నన్యపదార్థ ప్రధానము అన్యపదార్థము = సమసించుచున్న ప్రథమాంతముల కంటె నన్యమయిన ద్వితీయాది

తాదులగు పదముల యొక్క యర్థము (అన్య పదార్థ శబ్దేన ప్రథమాంతాతిరిక్త ద్వితీయాద్యంతార్థ స్త్యైవ-బాలమ) ఈ యర్థములు వేనిని, వేనిచేత—ఇత్యాదులు ముక్కంటి = మూఁడు కన్నులు వేనికిఁ గలవో వాఁడు - శివుఁడు చలి వెలుగు = చలియైన వెలుఁగు వేనికిఁ గలదోవాఁడు - చంద్రుఁడు ఇవి షష్ఠ్యర్థ బహువ్రీహులు

ద్వంద్వము - ఉభయ పదార్థ ప్రధానము ద్వంద్వము తల్లిదండ్రులు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు వచ్చుచున్నారు తల్లిదండ్రులు - అనుచోఁ దల్లి శబ్దమునకుఁ దండ్రి శబ్దమునకుఁ బ్రాధాన్యముండుటచేతనే క్రియ 'వచ్చుచున్నారు' అని బహువచనాంతమయినది

సూత్రమున 'ప్రాయికంబుగ' అని కలదు ప్రాయికంబుగా అనఁగాఁ దఱచుగానని యర్థము కాన సంస్కృత లక్షణమును దొడరని సమాసమును దెనుఁగున నరుదుగా నుండవచ్చును కావుననే, చిగురుఁగేలు, జుంటిమోవి, మున్నగు నుపమాన పూర్వపద కర్మధారయములు తెనుఁగున గ్రాహ్యములు చిగురుఁగేలు=చిగురువంటి కేలు చిగురు — ఉపమానము కేలు - ఉపమేయము ఉపమానము పూర్వపదముగ నుండుటచే నిది యుపమాన పూర్వపద కర్మధారయమయినది జుంటిమోవి = జుంటివంటి మోవి జున్ను - ఉపమానము మోవి - ఉపమేయము కనుక నిదియు, నుపమాన పూర్వపద కర్మధారయమయినది సంస్కృతమున నిట్టి యుపమాన పూర్వపద కర్మధారయములు లక్షణ సమ్మతములు కావు అనఁగా నుపమానము పూర్వపదమయి, యుపమేయముత్తర పదముగ నుండు నుపమాన పూర్వపద కర్మధారయములు సమ్మతములు కావు కావున, చిగురుఁగేలు, జుంటిమోవి - అనునవి సంస్కృత లక్షణమును దొడరని సమాసములు అయినను 'ప్రాయికంబుగ' అని సూత్రించుటచే నివి గ్రాహ్యములని తాత్పర్యము జుంటివంటి+మోవి - 20 చే, 'వంటి' లోపము

ముఖపద్మము చరణకమలములు ఇట్టి యుపమానోత్తరపద కర్మధారయములు కలవుగాని విపరీతములు సిద్ధములు లేవు ముఖపద్మము = పద్మమువంటి ముఖము, ఇట ముఖ ముపమేయము పద్మముపమానము ఉపమాన ముత్తర పదముగా నుండుటచే నిది యుపమానోత్తర పద కర్మధారయము చరణకమలములు = కమలముల వంటి చరణములు చరణ ముపమేయము కమల ముపమానము ఉపమాన ముత్తర పదముగా నుండుటచే నిది యుపమానోత్తర పద కర్మధారయము ఉపమానోత్తర పదములగు సిద్ధ

సమాసము లుండును సిద్ధము = కేవల సంస్కృత శబ్దముల సమాసము విపరీతములు = దీనికి వ్యతిరేకములయినవి అనఁగా ఉపమానము పూర్వ పదమై యుపమేయ ముత్తర పదముగ నుండు సిద్ధసమాసములు లేవని సూరి యాశయము కాఁగా - పద్మమువంటి ముఖము = ముఖపద్మము - అగును గాని, పద్మముఖము కాదు కమలముల వంటి చరణములు = చరణ కమలము లగును గాని, కమల చరణములు - కావన్నమాట

సిద్ధ సమాసములన్నియుఁ దెనుఁగున గ్రాహ్యములగును రాజపురుష- సిద్ధము దీనిని ప్రాతిపదికముగ గ్రహించిన తత్సమ 21 చే - రాజపురుష - అగును తత్సమ 22 చే - రాజపురుష + డుజ్ తత్సమ 19 చే - రాజ పురుషుఁడు ఇది షష్ఠీ తత్పురుషము వ్యధికరణము నీల+ఉత్పల=నీలోత్పల సిద్ధము తత్సమ 39 చే - నీలోత్పలము ఇది కర్మధారయము సమానాధి కరణము పీత + అంబర = పీతాంబర - సిద్ధము తత్సమ 21 చే - పీతాంబరు తత్సమ 22 చే - పీతాంబరు+డుజ్ తత్సమ 19 చే-పీతాంబరుఁడు ఇది బహువ్రీహి రామలక్ష్మణ - సిద్ధము తత్సమ 21 చే - రామలక్ష్మణు తత్సమ 12చే - రామలక్ష్మణులు ఇది ద్వంద్వము కాఁగా, సిద్ధసమాసముల నెల్లఁ దత్సమ రూపమునఁ బ్రయోగింప వచ్చునని తాత్పర్యము

కేవల సంస్కృత శబ్దము వికృతి శబ్దము తోడ సమసింపదు అనగాఁ గేవల సంస్కృత శబ్దము పూర్వమందుండి యచ్చ తెనుఁగు శబ్దముతో సమసింపదు (వికృతి శబ్దము=అచ్చ తెనుఁగు శబ్దము) కావున, అనేకమాఱులు, అల్పదండు - మొదలయినవి దుష్టములు అనేక, అల్ప - అనునవి కేవల సంస్కృత శబ్దములు మాఱులు, దండు - అనునవి యచ్చ తెనుఁగు శబ్దములు కాన నీ సమాసములు దుష్టములు ఇట్టి సమాసములను వైరిపదము లని యందురు

విశే - (I) ఉపమానము సామాన్య ధర్మవాచకముతో సమసించినవి మాత్రమే సంస్కృతమున, నుపమాన పూర్వపద కర్మధారయము లగును "ఉపమానాని సామాన్య వచనైః ఘన ఇవశ్యామః ఘన శ్యామః" (సి కౌ ) (II) సమాసంబులెల్లన్ - అనుటచేఁ దెనుఁగున నవ్యయీభావ సమాసము లేదు

(III) కేవల సంస్కృతశబ్దము – అనుటచే సంస్కృతసమము వికృతి శబ్దముతో సమసింపవచ్చును అనేకము + మాఱులు = అనేకపుమాఱులు అల్పము + దండు = అల్పపుదండు (సంధి 32) ఇవి మిశ్ర సమాసములు గనుక సాధువులే యగును (2సూ॥) (IV) ప్రథమతో నిర్దేశించినది సమాసమునఁ

బూర్వావయవమగును (ఉపసర్జనం పూర్వమ్- పాణి) ఇటఁ గేవల సంస్కృత శబ్దము ప్రథమానిర్దిష్టమగుటచేఁ గేవల సంస్కృతశబ్దము పూర్వమందుండి యాచ్ఛికముతో సమసించిననే వైరిపదమగును (४) ఉత్తరాన్యోభయ పదార్థ ప్రాధాన్యము ప్రాయోవాదము "సూపప్రతి, ఉన్మత్తగంగమ్ - ఇత్యాద్యవ్యయీభావే, అతిమాలాదౌ తత్పురుషే ద్విత్రాః ఇత్యాది బహు వ్రీహౌదంతోష్ఠమ్ - ఇత్యాది ద్వంద్వే చా భావాత్ -" సి కౌ

## ఆ, ఈ, ఏ అను సర్వనామంబులు త్రికంబు నాఁబడు 4.

వ్యా సర్వనామములయిన ఆ, ఈ, ఏ శబ్దములు త్రికము-అనఁబడును ఇది సూరిగారు కల్పించిన సంజ్ఞ మూఁటిసమూహమను నర్థము స్ఫురించునట్లు కల్పింపఁబడినది ఉకా॥ ఆచందము, ఈచిందము, ఏబృందము వీనిలోని సర్వనామములయిన ఆ, ఈ, ఏలు త్రికము

విశే - ఆ ఈ, ఏ అను - ఇట యడాగమములేమి సౌత్రము (సి కౌ 167)

పదసార్థక్యము - సర్వనామంబులు-అనుటచే సర్వనామములు కాని ఆ, ఈ, ఏలు త్రిక మనిపించుకొనవు ఆవు, ఈవి, ఏనుఁగు, వీనిలోని ఆ-ఈ-ఏలకుఁ త్రిక సంజ్ఞ కలుగదు

## కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశేషణ పూర్వపదంబయి యుండు. 5

ఆచందము, ఈచిందము, ఏబృందము, వాఁడిమాట, పోఁడి పాట, బెడిదపుటడిదము, మడిసెడుదడములు, ఈ నియమముచే బల్లిదుఁడు మల్లుఁడు, కావలుఁడు రావణుఁడు, ఇత్యాదుల సమాసంబు లేదు

వ్యా కర్మధారయ సమాసమునఁ బూర్వ పదము త్రికము గాని, స్త్రీ సమము గాని, ముగంతము గాని, ధాతుజ విశేషణము గాని కావలెనని సూత్రమునకుఁ దాత్పర్యము త్రికము = ఆ ఈ ఏ లు సర్వనామంబులు త్రికంబు నాఁబడు ఆచందము, ఈ చిందము, ఏ బృందము ఇవి కర్మధారయములు వీని పూర్వ పదములు సర్వనామములగు ఆ, ఈ, ఏ లు కానఁ త్రికము పూర్వ పదమగుట కివి యుదాహరణములు "ఆ + ది" + "చంద + ము" అలౌకిక విగ్రహము 25 చే - ఆచంద తత్సమ 39 చే - ఆచందము ఇట్లే, ఈ చిందము, ఏ బృందము స్త్రీ సమము = ప్రథమైక వచనము లోపించిన యచ్చ తెనుఁగు శబ్దము వాఁడి మాట పోఁడి పాట - ఇవి కర్మధారయములు వీని

పూర్వ పదములగు వాఁడి, పోఁడి - అనునవి త్రిసమములు కాన నివి త్రిసమములు పూర్వ పదములగుట కుదాహరణములు ముగంతము = ముగాగమాంతమని యర్థము బెడిదపుటడిదము - "బెడిద + ము" + "అడిద + ము" బెడిదము - మువర్ణకాంతము 25 చే - బెడిదము + అడిద సంధి 32 చే - బెడిదపు + అడిద సంధి 28 చే - బెడిదపుట్ + అడిద = బెడిదపుటడిద తత్సమ 39 చే - బెడిదపుటడిదము ముగంతమని సూత్రించి మువర్ణకాంతమున కుదాహరణము చూపుటచే రెండును గ్రాహ్యములని తెలియవలెను ధాతుజ విశేషణము = ధాతువునకు, ఎడు - మున్నగు ప్రత్యయములు చేరఁగా నేర్పడిన విశేషణములు ధాతుజ విశేషణము లనఁబడును (చూ క్రియా 44 - 47) మడిసెడు దడములు, మడిసెడు - ధాతుజ విశేషణము ఇది పూర్వ పదముగ నుండుటచే, ధాతుజ విశేషణము పూర్వ పదముగ నుండు కర్మధారయమునకిది యుదాహరణము కర్మధారయమునఁ బూర్వ పదము త్రిక త్రిసమముగంత ధాతుజ విశేషణములలో నొకటి యయి యుండు నను నియమముచే బల్లిదుఁడు మల్లుడు, కావలుఁడు రావణుఁడు - అనుచో సమాసము లేదు ఇట బల్లిదుఁడు, కావలుఁడు - పుంలింగ తుల్యములు కాన సమాసము లేదు బల్లిదమల్లుఁడు కావల రావణుఁడు - అని కావన్న మాట

విశే - (1) ముగంత - అనికాక సూరి, మువర్ణకాంత - అని సూత్రించి యుండవలసినదనియు మువర్ణకాంతము తత్సమ 41 చే - ముగంతమును గ్రహించును గాని, ముగాగమము మువర్ణకమును గ్రహించుట కష్టమనియు సెలవిత్తురు కాని యిట విశేషము కలదు ఒక్క కర్మధారయమునఁ బూర్వ పదముగ నుండునప్పుడే ముగాగమములు నిల్పి యలౌకిక విగ్రహ వాక్యములు చూపవలెనని సూచించుటకు సూరి ముగంత - అని సూత్రించెను ముగంత - అనుటచేఁ బూర్వ పదముననే ముగాగమము చేయవలెను ఉత్తరపదమునఁ జేయ రాదు ఉదా॥ బెడిదపుటడిదములు ఇట, "బెడిద + ము + లు" + "అడిద + లు" - అని యలౌకిక విగ్రహమును జూపవలెను 25 చే - బెడిదము + అడిద = బెడిదపుటడిద (సంధి 32, 28) తత్సమ 12 చే - బెడిదపుటడిద + లు, 40 చే - బెడిదపుటడిదములు ఇట్లే, "రాముని + యొక్క" + "బాణ + లు" - ఇత్యాదులు (25) ముగంతము మువర్ణ కాంతమును గ్రహింపదు గాన బెడిదముటడిదము - అని యుదాహరించి పూర్వ పదము మువర్ణకమును గావచ్చునని సూరి స్పష్టపటిచెను, "మడిసెడు + ను" + "దడ + లు" 25 చే - మడిసెడుదడ తత్సమ 12 చే - మడిసెడుదడ + లు - 40 చే -

మడిసెడు దడములు (11) ధీరురాలు, గుణవంతురాలు - (సంధి 31) విధాన సామర్థ్యముచే సాధువులు ఏలయన నివి త్రిక త్రిసమ ముగంత ధాతుజ విశేషణముల లోనివి కావు (111) ధాతుజ విశేషణములు త్రి సమములన్నచో, రక్షించెడు - మున్నగు - సంస్కృత సమ రూపములు విరోధించును కాన, నీ దళము వ్యర్థము కాదు (1V) త్రి సమములకు రెండుదాహరణము లిచ్చుటచే త్రి సమ పూర్వక కర్మధారయములే హెచ్చుగా నుండుననరాదు లక్ష్యసంఖ్యకు ఆచ్ఛిక 2 లోనే పరిగణనము

## త్రిసమ ఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు. 6

ముక్కంటి, వేగంటి, చలి వెలుఁగు, వే వెలుఁగు, మోటబరి, ఇత్యాదులు వ్యవహార సిద్ధంబులు గ్రాహ్యంబులు

వ్యా బహువ్రీహి సమాసము త్రిసమములతోఁ గూర్పఁబడియే యరుదుగఁ గనఁబడును ముక్కంటి = మూడు కన్నులు వేనికిఁ గలవో వాఁడు ఇందు మూఁడు, కన్ను శబ్దములు రెండును త్రి సమములు వేగంటి = వేయి కన్నులు వేనికిఁ గలవో వాఁడు ఇట వేయి శబ్దము, కన్ను శబ్దము రెండును త్రి సమములే చలి వెలుఁగు ఇట, చలి శబ్దము, వెలుఁగు శబ్దము రెండును త్రి సమములే వే వెలుగు = వేయి వెలుఁగులు వేనికిఁ గలవో వాఁడు ఇట వేయి, వెలుఁగు శబ్దములు రెండును త్రిసమములే మోటబరి = మోట యొక్క బరువు గలది ( = బరువు మోసెడి యెద్దు ) మోట, బరి శబ్దములు రెండును త్రిసమములే ఇట్లు ప్రయోగసిద్ధములు గ్రహింపఁ దగినవి అనఁగా, ముక్కంటి - కలదు గదా యని 'పదికంటి' అని కల్పింప రాదన్నమాట

ప్రక్రియలు - ముక్కంటి చూ 22 వ్యాఖ్య వేగంటి "వేయి+లు" +కన్ను + లు" 22 చే - "వేయి + లు + క + ంటి + లు ' 'న్ను' అను దానికి "ంటి" ఆదేశమయిన దన్నమాట 25 చే - విభక్తి లోపము వేయి + కంటి 20 చే - వేయి + గంటి "బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుది యక్షరంబు లోపించు ఈ లోపంబు సమాసంబులందుం జూపట్టెడు" (ఆచ్ఛిక 21) అను దానిచే, 'యి' వర్ణ లోపము వేగంటి పదత్వ సిద్ధికై యనుక్త న్యాయమున సు - ప్రత్యయము చేరును, వేగంటి + సు ఇది, ఆచ్ఛిక 2 చే - త్రి సమమగును గనుక తత్సమ 57 చే - 'సు' లోపించి వేగంటి - సిద్ధించును చలి వెలుఁగు - "చలి + సు" + వెలుఁగు + వు"

25 చే - చలి + వెలుఁగు = చలి వెలుఁగు అనుక్త న్యాయమున (తత్సమ 44) - చలి వెలుఁగు + సు తత్సమ 57 చే - చలి వెలుఁగు మోటబరి మోట + యొక్క + "బరి + సు 25 చే- మోటబరి అనుక్త న్యాయమున -మోటబరి + సు తత్సమ 57 చే - మోటబరి వేవెలుఁగు - అచ్చిక 21

విశే - (1) మోట = ఎడ్లనుగట్టి త్రోలుచు నీరెత్తుడు యంత్ర విశేషము భార శబ్దభవము బరి దీనికి వ్యస్త ప్రయోగము మృగ్యము (11) ముక్కంటి లోనగునవి తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహులు.

## ఆచ్ఛిక శబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు. 7

అన్నదమ్ములు, తల్లిదండ్రులు, ఊరు వల్లెలు, ఆలుమగలు, మగఁడును బిడ్డలును, పల్లములను గశ్లైమును ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున నెఱుంగునది

వ్యా స్త్రీ సమము పూర్వపదమయి యుండి యేదేని యచ్చ తెనుఁగు శబ్దముతోఁ దఱచుగ ద్వంద్వ సమాసమగును ఉదా॥ అన్నదమ్ములు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు, ఆలుమగలు, అనువానితో అన్న తల్లి, ఊరు, ఆలు- అను పూర్వపదములు స్త్రీ సమములు తమ్ముఁడు, తండ్రి, పల్లె, మగఁడు - అనునవి యాచ్ఛికములు కాన ద్వంద్వ సమాసములయినవి ద్వంద్వమునఁ బూర్వ పదము స్త్రీ సమమే కావలెనను నియమముచే, మగఁడు + బిడ్డలు, పల్లము + కశ్మైము - అనుచోట్ల ద్వంద్వము కాదు ఏల యన, మగఁడు, పల్లము - అను పూర్వ పదములు స్త్రీ సమములు కావు మగఁడు - పుంలింగ తుల్యము పల్లము - క్లీబసమము (మగబిడ్డలు = మగఁడును బిడ్డలును, పల్లకశ్లైములు - కావన్నమాట )

ప్రక్రియలు - అన్నదమ్ములు,- "అన్న + సు" + "తమ్మ + డుఞ్" 25 చే - విభక్తి లోపించి, అన్న + తమ్మ - అని నిల్చును సంధి 15 చే - అన్నదమ్మ ఆచ్ఛిక 2 చే - తమ్మ శబ్దము పుంలింగ తుల్యమగుటచే, తత్సమ 21 చే - అన్నదమ్ము - అగును తత్సమ 12 చే - అన్నదమ్ము + లు = అన్నదమ్ములు - అని సిద్ధించును తల్లి దండ్రులు :- "తల్లి + సు" +" "తండ్రి + సు" 25 చే - తల్లి + తండ్రి సంధి 15 చే - తల్లిదండ్రి తత్సమ 12 చే - తల్లిదండ్రి + లు 45 చే - తల్లిదండ్రులు ఊరువల్లెలు - "ఊరు + వు" + "పల్లియ + ము " 25 చే - ఊరు + పల్లియ అచ్ఛిక

23 చే - ఊరు + పల్లె సంధి 15 చే - ఊరు వల్లె తత్సమ 12 చే - ఊరు వల్లెలు ఆలుమగలు - "ఆలు + వు" + మగ + డుఙ్ " 25 చే - ఆలు+ మగ తత్సమ 12 చే - ఆలుమగలు

విశే - (1) సమాసమునఁ బ్రథమా నిర్దిష్టము పూర్వ పదమగునని పాణినీయము 'ప్రథమా నిర్దిష్టం సమాస ఉపసర్జనమ్ ఉపసర్జనం పూర్వమ్ " ఇట స్త్రీ సమంబు - అన్నది ప్రథమా విభక్తితో నిర్దేశింపఁబడుటచే ద్వంద్వమున స్త్రీ సమము పూర్వ పదమగును

## సర్వ శబ్దంబులు సంబంధంబునందుం దచ్ఛబ్దంబుతోడ సమసించు. 8

నావాఁడు, నాయది, ఇంటివాఁడు, ఇంటిది, రామునివాఁడు, రామునిది

వ్యా సంబంధమున నెల్ల శబ్దములు పూర్వ పదములై యుండి తచ్ఛబ్ద ముతో సమాసము నందును సంబంధము = కారక 15 తచ్ఛబ్దము = 'ఆ' శబ్దము వాఁడు, వారు - మహద్రూపములు అది అవి - అమహద్రూపములు నా వాఁడు - 'నా+యొక్క + "వా + డుఙ్ " 25 చే - నావా - ప్రాతిపదిక మగును పుంలింగ తుల్యముగాన, తత్సమ 22 చే - నావా + డుఙ్ - తత్సమ 19 చే - నా వాఁడు నా యది - నా యొక్క + అది 25 చే - నా+అది సంధి 3 చే - నా - య్ + అది = నాయది ఇంటివాఁడు - ఇంటి+యొక్క +వా + డుఙ్ 25 చే - ఇంటివా తత్సమ 22 చే - ఇంటివా + డుఙ్ తత్సమ 19 చే - ఇంటివాఁడు ఇంటిది - ఇంటి + యొక్క + అది 25 చే-ఇంటి + అది సంధి 45 చే - ఇంటిది రాముని వాఁడు - రాముని + యొక్క + వా + డుఙ్ 25 చే-రాముని + వా తత్సమ 22 చే-రామునివా +డుఙ్ తత్సమ 19 చే - రామునివాఁడు రామునిది రాముని + యొక్క + అది 25 చే - రాముని + అది సంధి 45 చే - రామునిది

విశే - "నా + యొక్క" + ఆ + డుఙ్ నా + యొక్క + ఆ + ది - ఇత్యాదు లలౌకిక విగ్రహములు

## ధాతుజ విశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు. 9

వచ్చినవాఁడు, వచ్చినది, రానివాఁడు, రానియది

వ్యా విశేష్యముల కగు విభక్తులను ధాతుజ విశేషణములకుఁ జేర్పనెంచి

నప్పుడు, తచ్ఛబ్ద మను=ప్రయుక్తమగును ధాతుజ విశేషణములు = ధాతువునకు, ఎడి మున్నగు ప్రత్యయములు చేర్పఁగా నేర్పడు విశేషణములు ధాతుజ విశేషణములు (క్రియా 44 - 47) విభక్తి వివక్షించుట యనఁగా విశేష్యమున కగు విభక్తులు ధాతుజ విశేషణమునకుఁ జేర్పనెంచుట తచ్ఛబ్దము = అ - అనునది దీని మహద్రూపములు = వాఁడు, వారు అమహద్రూపములు=అది అవి అను ప్రయుక్తము = అనుసరించి ప్రయోగింపఁబడినది వచ్చినవాఁడు - వచ్చిన - ధాతుజ విశేషణము దీనికి విశేష్యమున కగు ప్రథమా విభక్తి చేర్పనెంచినచో, ఈ 9 చే - వాఁడు - అను తచ్ఛబ్ద మను ప్రయుక్తమగును వచ్చిన వాఁడు - వచ్చినది - వచ్చిన - ధాతుజ విశేషణము విభక్తి వివక్షించినచో ఈ 9 చే, అది - అను తచ్ఛబ్ద మను ప్రయుక్త మగును వచ్చిన + అది సంధి 45 చే - వచ్చినది రానివాఁడు - రాని - ధాతుజ విశేషణము విభక్తి వివక్షించినచో - రానివాఁడు రానియది - రాని - ధాతుజ విశేషణము విభక్తి వివక్షించినచో - రాని + అది సంధి 45 చే - అత్తు లోపింపనిచో, సంధి 3చే-యడాగమము రానియది

విశే - (1) కారక 19 చే - విశేష్యమున కగు విభక్తులు విశేషణమున కగును అట్లు ధాతుజ విశేషణమునకు విశేష్యమునకు వలె విభక్తులు చేర్పనెంచినచో నీ 9చే - తచ్ఛబ్ద మను ప్రయుక్తమగు నన్నమాట ఉదా॥ వచ్చిన రాముఁడు = వచ్చిన వాఁడు రాముడు వచ్చిన రాముని = వచ్చిన వానిని రాముని - ఇత్యాదులు వచ్చిన సీత = వచ్చినది సీత వచ్చిన సీతను=వచ్చిన దానిని సీతను - మొ॥ (11) ధాతుజ విశేషణంబులకు - అను బహువచన స్వారస్యముచే నితర విశేషణములకును గొండొకచోఁ దచ్ఛబ్ద మను ప్రయుక్తమగును చిన్న + అది - కారక 35 రెండవవాఁడు, రెండవది (అచ్చిక 25)

## ఎల్ల యెడల ధాతుజ విశేషణంబుల కట్టి యనుపదంబు విభాష ననుప్రయుక్తంబగు. 10

వచ్చినట్టి రాముఁడు, వచ్చిన రాముఁడు, వచ్చునట్టి వాఁడు, వచ్చువాఁడు

వ్యా ధాతుజ విశేషణముల కెల్లచోట్ల 'అట్టి' అను పదము విభాషగ ననుసరించి ప్రయోగింపఁబడును ధాతుజ విశేషణములు = చూ 9 సూ వచ్చిన రాముఁడు - వచ్చిన - ధాతుజ విశేషణము 5 చే - ఇది రాముఁడు - అను పదముతో గర్మధారయమయినది ఈ 10 చే- వచ్చిన + అట్టి + రాముఁడు

= వచ్చినట్టి రాముడు, (సంధి 4) అట్టి - అనుప్రయుక్తము కానిచో - వచ్చిన రాముఁడు వచ్చువాఁడు - ఇట వచ్చు - ధాతుజ విశేషణము ఇది ఎడి, ఎ డులు చేరి లోపించిన ధాతుజ విశేషణ రూపము (క్రియా 45 సూ) దీనికి 9 చే - విభక్తి వివక్షించుచో, వాఁడు - అనునది యను ప్రయుక్తమయి, వచ్చు + వాఁడు - అయ్యెను ఈ 10 చే - అట్టి అను ప్రయుక్త మయినచో - వచ్చు + అట్టి + వాఁడు - సంధి 33 చే - వచ్చును + అట్టి + వాఁడు = వచ్చున్ + అట్టి + వాఁడు వచ్చునట్టి వాఁడు - అని యేర్పడును అట్టి - అను ప్రయుక్తము కానిచో - వచ్చువాఁడు - అని యుండును

విశే - "వచ్చిన + సు "రామ + డుఙ్" అలౌకిక విగ్రహము 25 చే - వచ్చిన రామ - ప్రాతిపదికము తత్సమ 21 చే - వచ్చిన రాము 22చే- వచ్చిన రాము + డుఙ్ 18 చే - వచ్చిన రాముఁడు ఇత్యాది

పదసార్థక్యము - ఎల్లయెడల - అనుటచేఁ గర్మధారయమునను, గర్మధారయాభాసమునను అట్టి - అను ప్రయుక్తము విభాషనగును వచ్చినట్టి రాముఁడు - సమాసము వచ్చునట్టివాఁడు - కర్మధారయా భాసము

## యుష్మదస్మ దాత్మార్థకంబుల కుత్తర పదంబు పరంబగు నపుడు దుగాగమంబు విభాషనగు. 11

సీదు కరుణ, నీ కరుణ, నాదునేరిమి, నానేరిమి, తనదురూపు, తన రూపు

వ్యా యుష్మదర్థకమునకు, నస్మదర్థకమునకు, నాత్మార్థకమునకు నుత్తర పదము పరమగునపుడు దుగాగమము విభాషనగును ఉత్తరపదము= సమాసమునందలి తుది యవయవము (ఉత్తరపదశబ్దోహి సమాసస్యచరమావయవే రూఢః సి కౌ) యుష్మదర్థకమునకు నీయొక్క + కరుణ 25 చే- నీ+కరుణ ఈ 11 చే-యుష్మదర్థకమునకుఁజివర 'దు' వర్ణమాగమ మయినచో నీదుకరుణ-అగును ఆగమము కానిచో నీకరుణ- అని యుండును అస్మదర్థకమునకు - నా+యొక్క+నేరిమి 25 చే-నా+నేరిమి ఈ 11చే-దుగాగమ మయినచో, నాదు + నేరిమి = నానేరిమి దుగాగమము కానిచో - నానేరిమి ఆత్మార్థకమునకు - తనయొక్క + రూపు 25 చే-తన+రూపు ఈ 11చే- దుగాగమము వచ్చినచో -తనదు + రూపు=తనదురూపు రానిచో తన రూపు తా - అనునది యాత్మార్థకము షష్ఠిలో - తనయొక్క - అని యగును

విశే - (1) ఈ దుగాగమము బహువచనమునందును గానవచ్చును- మీదు, మాదు, తమదు - అనునవి యరుదుగ [illegible] ప్రయోగములందుండవచ్చును

(ii) నీకరుణ, నీదు కరుణ-అనువానివానిపై తత్సమ 39 చే-మువర్ణకముచేరి, తత్సమ 57చే లోపించును నానేరిమి, నాదు నేరిమి - వీనిపై సు-చేరి, లోపించును తనరూపు, తనదురూపు-వీనిపైఁ దత్సమ 48 చే - వు - చేరి, 57 చే - లోపించును (iii) నీ + యొక్క + కరుణ + ము, "నా+ యొక్క" + "నేరిమి + సు", "తన + యొక్క" + "రూపు + వు" అలౌకిక విగ్రహములు

## గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు. 12

నల్లని గుఱ్ఱము, నల్ల గుఱ్ఱము, నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, విన్న, తిన్న, అల్ల ఇత్యాదులు నల్లాదులు

వ్యా గుణవాచకములగు నల్ల - మొదలగు వానికిఁ గర్మధారయ సమాసమున నిగాగమము బహుళముగ నగును నిక్+ఆగమ=నిగాగమము కకారముతో నిర్దేశించుటచే నిశర్థము నల్లాదులకుఁ జివర నాగమమగును కర్మధారయము = విశేషణమునకు విశేష్యముతో సమాసము 3 సూ నల్ల శబ్దము గుణవచనము గుణవచనము = గుణమును బోధించు శబ్దము గుణము= వస్తుధర్మము ద్రవ్యమాత్రాశ్రితే వస్తుధర్మే-శబ్దస్తో "నల్ల+ము+గుఱ్ఱ+ము" 25 చే- నల్ల + గుఱ్ఱ నల్ల-గుణవచనముగాన దీనికి 12 చే - నివర్ణ మాగమమయినచో నల్లని + గుఱ్ఱ తత్సమ 39 చే - నల్లని గుఱ్ఱము నిగాగమము కానిచో - నల్లగుఱ్ఱము నల్లాదులలో తద్ధిత 6 సూత్రమున మఱి కొన్ని శబ్దములు చేర్పఁబడి యున్నవి

## ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు 13

వ్యా రెండుసార్లు పలుకఁబడిన హల్లు పరమయినచో నచ్చతెనుఁగునకు సంబంధించిన దీర్ఘమునకు హ్రస్వమగును ద్విస్+ఉక్త=ద్విరుక్తము రెండు సార్లు పలుక్కఁబడినది ఉదా॥ (i) ఆ + కన్య 14 చే-ఆ+క్కన్య ఈ 13 చే దీర్ఘమునకు హ్రస్వము కలిగి అక్కన్య-అగును (ii) ఇది త్రికకార్యము కదనే కాక యితర స్థలములందును వర్తించును గనుకఁ ద్రిక కార్యమున ముందు చేర్చఁబడినది ఉదా॥ ముజ్జగములు, (17) ఉయ్యేల (ప్రకీర్ణక 6) ఇత్యాదులు

పదసార్థక్యము - (1) అచ్చికంబగు - అనుటచే సంస్కృత సమ దీర్ఘము నకు హ్రస్వము గాదు ఉదా॥ వాక్కు, స్వరాట్టు-ఇత్యాది (11) ద్విరుక్తంబగు- అనుటచే సంయుక్తము పరమగుచో హ్రస్వమురాదు ఉదా॥ ఆబ్రహ్మ, ఏర్చు ఓర్చు-ఇత్యాది

## త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. 14

అక్కన్య, ఆకన్య, ఇక్కాలము, ఈకాలము, ఎల్లోకము, ఏలోకము, అయ్యశ్వము, ఆయశ్వము బాహుళకముచే నూష్మ రేఫంబులకు ద్విత్వంబుగలుగదు ఆరూపము, ఈశబ్దము, ఏషండము, ఆసుకృతి, ఆహయము

వ్యా త్రికముమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వము బహుళముగా నగును త్రికము=అ ఈ ఏ అను సర్వనామంబులు త్రికంబు నాఁబడు 4 సూ అసంయుక్త హల్లు = సంయుక్తము గాని హల్లు అనఁగా వేఱొక హల్లు యొక్క కూడిక లేని హల్లు = ఏకహల్లు "అ + ది" + "కన్య + ము" 25 చే - అ + కన్య ఇట కకారము వేఱొక హల్లుయొక్క కూడిక లేనిది గనుక నసంయుక్త హల్లు ఈ 14చే- ద్విత్వము కలుగఁగా - అ+క్కన్య - అగును 13 చే-అక్కన్య తత్సమ 39చే - అక్కన్య+ము తత్సమ 57చే- అక్కన్య ద్విత్వము కానిచో, ఆకన్య-అనియగును ఇక్కాలము - ఈ+ది+ కాల+ము 25చే- ఈ + కాల 14చే - ఈ + క్కాల 13 చే - ఇక్కాల తత్సమ 39చే- ఇక్కాలము ద్విత్వము కానిచో, ఈ కాలము ఇట్లే, ఎల్లోకము, ఏలోకము అయ్యశ్వము - అ+ది+అశ్వ+ము 25చే- అ+అశ్వ సంధి 3 చే-అ-య్+అశ్వ=అ+యశ్వ ఈ 14చే-అ+య్యశ్వ 13చే-అయ్యశ్వ తత్సమ 39 చే - అయ్యశ్వము ద్విత్వముకలుగనిచో ఆయశ్వము బహుళ మనుటచే నూష్మములకు రేఫమునకు ద్విత్వము కలుగదు ఇది బహుళప్రయో జనములలో నప్రవృత్తి యగును అప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపక పోవుట ఊష్మములు = శ ష స హ లు ఊష్మము = వాయువు ఊష్మ ప్రధానములగు వర్ణములు గాన శ ష స హ ల నూష్మము లందురు (ఉష్మావాయుః తత్ ప్రధానావర్ణాః, ఊష్మాణః - తైత్తి వైదికా ) ఆరూపము, ఈశబ్దము, ఏషండము, ఆ సుకృతి, ఆహాయము ఇట ద్విత్వము రాలేదు

విశే - (1) రేఫము - అని సామాన్యముగ ననుటచే శకట రేఫమునకును ద్విత్వము రాదు అ + ఱేఁడు = అఱేఁడు (11) అ+అశ్వ సంధి 3చే- అ- య్ + అశ్వ = అ + యశ్వ-అని యేర్పడును 'యట్' అనుటచే యడాగమ యకారము పరస్వరమునకు ముందు చేరును దేనికేది యాగమమగునో దాని కది యవయవమగునని పరిభాష (యదాగమ పరిభాష) కావున, అ+యశ్వ - అని యకారము పరస్వరమున కవయవమై నిల్చును కావున నీ త్రికసంధి వర్తించును యకారమును బూర్వస్వరమున కాగమముగ విధించినచో - అయ్+అశ్వ - కావలసివచ్చును అప్పుడు యదాగమ పరిభాషచే - అయ్ - అన్నదే త్రికము కావలసి వచ్చును త్రికమునకు అ కారము పరమగును గాని హల్లుకాదు కనుక నీ 14 సూత్రము వర్తించు నవకాశమే యుండదు కావున సూరి యడాగమమును విధించెను తక్కిన టిత్వస్థలములును సప్రయోజనములే (క్రియా తత్సమ 31, 50)

పదసార్థక్యము - అసంయుక్త హల్లునకనుటచే సంయుక్త హల్లున కీ సూత్రముచే ద్విత్వము కలుగదు అ+వ్యాధుఁడు = అవ్యాధుఁడు

## కృత హ్రస్వంబగు త్రికంబు మీఁది చోటు శబ్దంబు నోత్వంబున కత్వ హ్రస్వంబులు విభాషనగు 15

అచ్చోటు, అచ్చటు, అచ్చొటు, ఇచ్చోటు, ఇచ్చటు, ఇచ్చొటు, ఎచ్చోటు, ఎచ్చటు, ఎచ్చొటు వీని ద్విత్వంబునకు వక్ష్యమాణ విధిచేఁ బాక్షికంబుగ లోపంబగు, అచటు, అచొటు, ఇచటు, ఇచొటు, ఎచటు, ఎచొటు ముచ్చోటులు, ముచ్చటలు, ముచ్చొటులు - అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి

వా చేయఁబడిన హ్రస్వము గల త్రికము మీఁది చోటు శబ్దముయొక్క ఓత్వమునకు, అత్వము హ్రస్వము విభాషగ నగును త్రికము = అ, ఈ, ఏ - అను సర్వనామములు వీని మీఁది హల్లునకు 14 చే ద్విత్వము కలిగినప్పుడు 13 చే - వీనికి హ్రస్వము కలుగును అప్పుడివి కృత హ్రస్వము లనిపించు కొనును "ఆ+ది+చోటు+వు" 25 చే - ఆ+చోటు 14 చే - ఆ+చ్చోటు 13 చే - 'ఆ' అను త్రికమునకు హ్రస్వము వచ్చి అ+చ్చోటు - అగును ఇట 'అ' అనునది 'ఆ' అను త్రికము, హ్రస్వము చేయఁగా నైనది కనుకఁ గృత హ్రస్వమగు త్రికము దీని మీఁది చోటు శబ్దము యొక్క ఓత్వమునకు, అత్వ మ్మాదేశమయినచో - అ+చ్చ్+అ టు = అచ్చటు - అగును ఓత్వమునకు,

హ్రస్వమయినచో - అచ్చోటు - అ+చ్చ్+ఒ+టు = అచ్చొటు - అగును విభాష గనుక, అచ్చోటు - అనియు నుండును తత్సమ 48 చే - అచ్చోటు+వు 57 చే - అచ్చోటు ఇట్లే ఈ+చోటు = ఇచ్చటు ఇచ్చొటు, ఇచ్చోటు ఏ+చోటు = ఎచ్చటు, ఎచ్చొటు, ఎచ్చోటు వీని ద్విత్వమునకు వచింపఁబోవు సూత్రముచే ననఁగాఁ త్రికీర్ణక 8 చే - ఒక పక్షమున లోపమగును లోపమయినచో - అచటు - ఇత్యాదిరూపము లేర్పడును వీనికెల్లఁ దత్సమ 48 చే - వువర్ణకము చేరును అచ్చొటు+వు ఇది త్రిసమము గాన, తత్సమ 57 చే - వు లోపించి, అచ్చొటు - అగును ఇట్లే తక్కిన వాని ప్రక్రియ ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చొటులు - అను రూపములు ప్రయోగములలోఁ గనఁబడును "మూఁడు+-లు+చోటు+లు" సమాస 25 చే - మూఁడు+చోటు 17 చే - మూ+చ్చోటు 13 చే - ము+చ్చోటు తత్సమ 12 చే - ముచ్చోటు+లు= ముచ్చోటులు "ముచ్చోటులు, ముచ్చటలు, ముచ్చొటులు - అను రూపంబులు, ప్రయోగంబులం గానంబడియెడి ' అను వాక్యముచే నిట, చోటు శబ్దము యొక్క ఓత్వమునకు, అత్వ హ్రస్వములు విభాషనగును ముచ్చోటులు=ము+చ్చ్+అ+టు+లు = ముచ్చటులు ము+చ్చ్+ఒ+టు+లు = ముచ్చొటులు పక్షమున, ముచ్చోటులు

పదసార్థక్యము - కృతహ్రస్వంబగు - అనుటచే - కృత హ్రస్వము కాని త్రికము మీఁది చోటు శబ్దము యొక్క ఓత్వమున కత్వ హ్రస్వములు కలుగవు, ఆ+చోటు = ఆచోటు మొ॥

## ఉత్తర పదంబగు చోటు శబ్దము టాక్షరమునకు లోపంబు విభాషనగు. 16

చోటు శబ్దం బౌప విభక్తికంబు గావున దాని యంతి మాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించునని యర్థము అచ్చోనున్నాఁడు, అచ్చోట నున్నాడు, ఒకచో నుండె, ఒకచోటనుండె

వ్యా ఉత్తరపదమగు చోటు శబ్దము యొక్క "ట" అనునక్షరమునకు లోపము విభాషనగును ఉత్తరపదము = సమాసమునందలి తుది యవయవము (11 సూ ) చోటుశబ్దమౌప విభక్తికము కనుక దీని సప్తమికి, అత్వమాదేశమగును ఆచోటు+అందు అచ్చిక 30 చే - ఆచోటి+అందు అచ్చిక 38 చే - ఆచోటి+అ సంధి 11 చే ఆచోట సమాస 14 చే - అ+చ్చోట 13 చే ,

అ+చ్చోటు ఈ 16 చే - 'ట' అను నక్షరము లోపించిన అచ్చో - అగును తత్సమ 8 చే - అచ్చో+ను అచ్చోను+ఉన్నాఁడు అచ్చుపరమగునపుడు ద్రుత స్వరము లోపించుట బాలవ్యాకరణ సంప్రదాయము కాన, అచ్చోన్+ ఉన్నాడు = అచ్చోనున్నాడు - అగును 'ట' - లోపింపనిచో - అ+చ్చోటు, తత్సమ 8 చే - అచ్చోటను అచ్చోటను+ఉన్నాఁడు=అచ్చోటన్+ఉన్నాఁడు· అచ్చోటనున్నాఁడు ఇట్లే ఒకచోట ఈ 16 చే - ఒకచో, తత్సమ 8 చే - ఒకచోను ఒకచోను+ఉండె = ఒకచోన్+ఉండె ఒకచోనుండె 'ట' - లోపింపనిచో ఒక+చోట తత్సమ 8 చే - ఒకచోటను ఒకచోటను+ఉండె= ఒకచోటన్+ఉండె, ఒకచోటనుండె

విశే అచ్చోటు- త్రికమునను ఒకచోట - ఇతరమునకు నుదాహృతము

పదసార్థక్యము - చోటు శబ్దమనుటచే - అచ్చొట అచ్చట, అనుచో టాక్షర లోపము లేదు

పాఠ పరిశీలన - 'చోట' శబ్దము - అని ప్రథమ ముద్రణము 'చోటు' అనియే యుండఁదగును

## సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు శబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబునగు. 17

మూఁడు జగములు, ముజ్జగములు, మూఁడు లోకములు, ముల్లోకములు

వ్యా సమానాధికరణమగు, నుత్తరపదము పరమగు నప్పుడు, మూఁడు, శబ్దము యొక్క డుజ్వర్ణమునకు లోపమును, మీది హల్లునకు ద్విత్వమును, నగును సమానాధికరణము చూ 3 సూ ఉత్తరపదము = సమాసమునందలి తుది యవయవము డుజ్వర్ణము = బిందుపూర్వక డువర్ణము "మూఁడు + లు+ "జగ+లు" సమాస 25 చే - మూఁడు+జగ ఈ 17 చే - బిందు పూర్వక డువర్ణము లోపించి మీఁది హల్లునకు ద్విత్వము కలిగినచో మూ+జ్జగ 13 చే - ముజ్జగ తత్సమ 12 చే ముజ్జగ+లు తత్సమ 40 చే - ముజ్జగ+ ము+లు = ముజ్జగములు మూఁడు+లు+లోక+లు సమాస 25 చే - మూఁడు+లోక ఈ 17 చే - మూ+ల్లోక, 13 చే - ముల్లోక తత్సమ 12 చే - ముల్లోక+లు తత్సమ 40 చే ముల్లోకములు

విశే - లోప ద్విత్వము లేక యోగ నిర్దిష్టములు (తత్సమ 53)

పదసార్థక్యము - ఉత్తరపదంబు - అనుటచే సమాసము వివక్షించినచో - డుజ్వర్ణమునకు లోపము మీఁది హల్లునకు ద్విత్వము నగును సమాసము వివక్షింపనిచో - మూఁడు జగములు, మూఁడు లోకములు - అని యుండును (కాఁగా - మూఁడు జగములు - వ్యస్తరూపము ముజ్జగములు - సమాసము మూఁడు లోకములు - వ్యస్తము ముల్లోకములు - సమాసము

పాఠపరిశీలన - డుజ్వర్ణంబునకు - అని ప్రథమ ముద్రణ పాఠము వ్యాఖ్యాతలు డువర్ణంబునకని దిద్ది, యిదే సూరి పాఠమని సెలవిచ్చిరి మూఁడు+జగములు = మూఁ+జ్జగములు ద్విత్వమునకు ముందు బిందు వుండుట సంప్రదాయము కాదు కాన ముజ్జగములు - అగు ననిరి డుజ్వర్ణ మన్నదే సూరి పాఠము బాల వ్యాకరణ ప్రథమ ముద్రణముననే కాక, సూత్రాంధ్ర వ్యాకరణమునకు డుజ్ - అనియే పాఠము 'మూఁడోర్డుజో లోపః (సర్వనామాని) మూఁడోర్డుజో నిత్యమ్" (సమాసః) అని రెండు చోట్లఁగలగు (సూత్రాం) మూఁడు లోనిది డుజ్వర్ణకము కాదే! యని తికమక పడరాదు డుజ్వర్ణము - అని పాఠము డుజ్వర్ణకము - అని కాదు చూ తత్సమ 19

## ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁ గాదు. 18

ముచ్చిచ్చు, ముక్కారు, ముప్పాతిక, ముత్త్రోవ, మువ్విధములు

వ్యా ద్విగు సమాసమునకుఁ దలచుగా నేకవచన మగును మిశ్రమునకుఁ గాదు అనఁగా నాచ్ఛిక ద్విగువున కేక వచనము తలచుగా నగును, మిశ్ర ద్విగువున కేక వచనము కాదు మిశ్రము = ఉభయములను గూడినది అనఁగా సంస్కృతసమము నాచ్ఛికము సమసించినది మిశ్రము, అచ్ఛిక ద్విగువునకు ముచ్చిచ్చు - "మూఁడు+లు+చిచ్చు+లు" 25 చే - మూడు+చిచ్చు 17చే మూ+చ్చిచ్చు, 13 చే - ముచ్చిచ్చు, ఈ 18 చే - ఏకవచన మగును గాన, తత్సమ 48 చే - ముచ్చిచ్చు+వు తత్సమ 57 చే - ముచ్చిచ్చు ఇట్లే "మూఁడు+లు"+"కారు+లు" = ముక్కారు "మూఁడు+లు"+పాతిక+లు" = ముప్పాతిక 'మూఁడు+లు"+"త్రోవ+లు" = ముత్త్రోవ అనువాని ప్రక్రియ గ్రాహ్యము మిశ్ర ద్విగువునకు, ముమ్విధములు "మూఁడు+లు" +"విధ+లు" 25 చే - మూడు+విధ 17 చే - మూ+వ్విధ 13 చే ముమ్విధ తత్సమ 12 చే - ముమ్విధ+లు తత్సమ 40 చే - ముమ్విధ+ము+

లు = ముప్పిధములు మూడు అచ్చికము విధములు సంస్కృతసమము కాన నిది మిశ్రద్విగువు, దీని కేకవచనము రాదు

విశే - (1) ముచ్చిచ్చు = మూఁడు చిచ్చుల సమాహారము సమాహార ద్విగువు, ముప్పిధములు - ద్విగు మాత్రము ప్రాయికంబుగ ననుటచే నలుగడలు - మొ॥ గ్రాహ్యములు (11) 17చే - సమాస వివక్షయందు లోప ద్విత్వములు నిత్యముగ నగును గాన, మూఁడు చిచ్చువంటి రూపములు గలుగవు

## కొండొకచో సమాసంబులందు నామ్యాది కనుమ్యాదుల మువర్ణంబులు పఙ్పు వర్ణంబులగు 19

నాఁపచేను, పాఁపఱేఁడు, కనుపపులు, జనపనార నాము, పాము, ప్రేము, వేము, అమ్ము, ఎమ్ము-ఇవి నామ్యాదులు కనుము, ఇనుము, ఉడుము, ఎనుము, జనుము, మినుము - ఇత్యాదులు కనుమ్యాదులు

వ్యా సమాసములలో, నాము మొదలగువాని ముపర్ణము 'పఙ్' వర్ణమును, కనుము మొదలగువాని ముపర్ణము పవర్ణమును, గొన్ని యెడల నగును నాఁపచేను - "నాము + యొక్క + "చేను + వు" 25 చే - నాము + చేను ఈ 19 చే - నా + పఙ్ + చేను తత్సమ 19 చే - నాఁపచేను తత్సమ 48 చే - నాపచేను + వు 57 చే - నాఁపచేను సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు పాఁప ఱేఁడు "పాము + యొక్క" + "ఱే+డుఙ్", 25 చే - పాము + ఱే ఈ 19 చే - పా + పఙ్ + ఱే = పాఁపఱే-ప్రాతిపదికమగును అచ్చిక 2 చే, నిది పుంలింగతుల్యము గాన తత్సమ 22 చే - పాఁపఱే + డుఙ్ తత్సమ 19 చే - పాపఱేఁడు కనుపపులు "కనుము + యొక్క" + "పులు + వు" 25 కనుము + పులు 19 చే - కనుపపులు తత్సమ 48 చే - కనుపపులు + వు ఇది స్త్రీ సమము గాన, తత్సమ 57 చే- 'వు' లోపము కనుపపులు జనుపనార - "జనుము + యొక్క" + "నార+ము" 25 చే - జనుము + నార ఈ 19 చే - జనుపనార తత్సమ 39 చే - జనుపనార + ము 57 చే - జనుపనార

విశే - తక్కిన నామ్యాదులకు (1) ప్రేము + సజ్జ = ప్రేఁపసజ్జ వేము + చెట్టు = వేఁపచెట్టు, అమ్ము + పొది = అ + పఙ్ + పొది తత్సమ 19 చే - అంపపొది సంధి 22 చే - ఖండబిందువు రాదు ఇట్లే ఎమ్ము + ముక్క = ఎ + పఙ్ + ముక్క , ఎంప ముక్క తక్కిన

కనుమ్వాదులకు - ఇనుము + కత్తి = ఇనుప కత్తి ఉడుము + కుక్క = ఉడుప కుక్క ఎనుము + తేలు = ఎనుపతేలు మినుము + వప్పు = మినుపపప్పు (ii) ఇవి నామ్వాదులు - అనుటచే నామ్వాదులలో వేఱు శబ్దములు చేర్ప నవకాశము లేదు ఇత్యాదులు కనుమ్వాదులు - అనుటచే, కనుమ్వాదుల వంటి యాకారము గల శబ్దములు ప్రయోగములలోఁ గన్పట్టినచో వాని నీగణమునఁ జేర్పవచ్చును ఒకటి పరితగణము రెండవది యాకృతిగణము

పాఠ పరిశీలన - "ప పఙ్వర్ణంబులగు" అని ప్రథమ ముద్రణమునఁ గలదు కాని, లక్ష్యముల క్రమమును బట్టి, పఙ్పవర్ణంబులు - అని యుండవలెను

## నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. 20

నిక్కల, కవ్వడి, పువ్విలుకాఁడు ఇత్యాదులు

వ్యా నిక్కల - మొదలగునవి ప్రయోగానుసారముగ గ్రాహ్యములు నిక్కల - "నిక్క + ము" + "కల + ము" 25 చే - నిక్క + కల ఈ 20 చే - నిక్ + కల = నిక్కల తత్సమ 39 చే - నిక్కల + ము తత్సమ 57 చె - నిక్కల కవ్వడి - 'కవ + అందు" + "వడి + సు" = కవ్ + వడి కవ్వడి అనుక్త న్యాయమున కవ్వడి + సు తత్సమ 57 చే- 'సు' లోపము కవ్వడి, పువ్విలుకాఁడు "పువు + వు" + "విలు + వు", ఈ 20 చే - పువ్విలు తద్ధిత 11 చే - పువ్విలు కా — ప్రాతిపదిక మగును తత్సమ 22 చే - పువ్విలుకా + డుఙ్ 19 చే - పువ్విలు కా డు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు

విశే - (i) 'నిక్కలాది యగుటంజేసి కవశబ్దాంతంబగు నత్వంబునకు లోపంబగు" అని సూరిగారు తమ శబ్ద శాసనమునఁ జెప్పియున్నారు కనుక, కవ + వడి = కవ్ + వడి కవ్వడి - అనియే వారి యాశయము (ii) కవ్వడి = కవయందు వడి వేనికిఁ గలదో వాఁడు - అర్జునుఁడు ఇది వ్యధికరణ బహువ్రీహి (iii) పువు + విలు ఇట కా ప్రత్యయము చేర్చు పక్షముననే, పువ్విలు - అని నిల్చును

## ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయి యను శబ్దంబులు విభాషనగు. 21

వక్ష్యమాణ విధిచేత నయి యను దాని కైకారా దేశంబునగు. ఆయుయి కాలము, ఆయాయి కాలము, అయ్యయి కాలము అయ్యాయి

కాలము, అయై కాలము, అయ్యై కాలము, అయాకాలము, అయక్కాలము, అయ్యాకాలము, అయ్యక్కాలము

వ్యా. తదర్థము, నామ్రేడితము, నగు 'అ' కారమునకు అయి, అయి, అను శబ్దములు విభాష నగును అ - అనునది తద్ అను సంస్కృత శబ్దము యొక్క యర్థము గలది గనుక, తదర్థము ఆమ్రేడితము = ద్విరుక్తము యొక్క పర రూపము (1) అయయి కాలము - అ + అ ఇట రెండవసారి యుచ్చరింపఁబడిన 'అ' అనునది యామ్రేడితము దీనికి అయి - ఆదేశమయిన -అ + అయి - అగును సంధి 3 చే - అ - య్ + అయి = అయయి అయయి + కాల + ము సమాస 25 చే - అయయికాల తత్సమ 39 చే- అయయి కాలము (2) అయాయి కాలము - అ + అ ఆమ్రేడితమగు 'అ' కు, ఆయి - ఆదేశమయిన - అ + ఆయి సంధి 3 చే - అ - య్+ఆయి= అయాయి + కాల + ము - 25 చే - అయాయి కాల తత్సమ 39 చే - అయాయి కాలము (3) అయ్యయి కాలము - అ + యయి + కాల - అని పై నేర్పడినది 14 చే - అ + య్యయి + కాల - 13 చే - అయ్యయి కాల తత్సమ 39 చే - అయ్యయి కాలము (4) అయ్యాయి కాలము - అ + యాయి + కాల అని పైని సిద్ధించినది 14 చే - అ + య్యాయి + కాల 13 చే - అయ్యాయి కాల తత్సమ 39 చే - అయ్యాయి కాలము (5) అయై కాలము - అ + అ ఈ 21 చే - అ + అయి వక్ష్యమాణ విధిచేత ననఁగా క్రియా 103 చే - అయి అనుదానికి 'ఐ' ఆదేశమయిన - అ + ఐ సంధి 3 చే - అ - య్+ఐ = అయై అయై + కాల + ము 25 చే - అయైకాల తత్సమ 39 చే - అయైకాలము (6) అయ్యైకాలము - అ + యై + కాల, అని పై నేర్పడినది 14 చే - అ + య్యై + కాల 13 చే - అయ్యైకాల - తత్సమ 39 చే - అయ్యైకాలము (7) అయా కాలము - అ + అ ఈ 21 చే అయి, ఆయి, అనునవి యాదేశములు కానిచో - సంధి 3 చే - యడాగమము కలుగును అ - య్ + అ = అయా అయా + కాల + ము 25 చే - అయాకాల తత్సమ 39 చే - అయాకాలము (8) అయక్కాలము - అ+అ సంధి 3 చే - అయా అయా + కాల + ము 25 చే - అయాకాల, త్రికము నామ్రేడితము, నగు రెండవ 'అ' మీఁది, యసంయుక్త హల్లునకు, 14 చే - ద్విత్వము కలిగినచో, అ+యా + క్కాల 13 చే - అయక్కాల తత్సమ 39 చే - అయక్కాలము (9) అయ్యాకాలము అ + యా + కాల - అని పైని సాధింపఁబడినది త్రికమగు మొదటి 'అ' మీఁది యసంయుక్త హల్లునకు

14 చే - ద్విత్వము కలిగిన, అ + య్యా్కాల 13 చే - అయ్యాకాల తత్సమ 39 చే - అయ్యా కాలము (10) అయ్య క్కాలము - అ + యక్కాల - పైని సాధింపఁబడినది త్రికమగు మొదటి 'అ' మీఁది యసంయుక్త హల్లునకు 14చే- ద్విత్వమయిన అ + య్యక్కాల 3 చే - అయ్యక్కాల తత్సమ, 39 చే - అయ్యక్కాలము

విశే - "అ + ది" + "అ + ది" 25 చే - అ + అ - ఇత్యాదిగ నలౌకిక విగ్రహము లూహ్యములు

## బహువ్రీహిని సమాసాంత కార్యంబులుం గానంబడియెడి.22

ముక్కంటి, కదలిరాచూలి, నలువ, గట్టువిలుతుఁడు

వ్యా బహువ్రీహి సమాసమున, సమాసాంత కార్యములు సైతము కనఁబడును సమాసము యొక్క తుది యవయవమున కగు, నాదేశాదులను సమాసాంత కార్యములని యందురు ఇట సమాస శబ్దమున కలౌకిక విగ్రహవాక్యమని యర్థము అంత శబ్దమునకుఁ జరమావయవమని యర్థము సమాసాంతాః -అత్ర సమాస పదమ్ అలౌకిక విగ్రహ వాక్యపరమేవ అంతశబ్దశ్చర మావయవ వాచీ (బాలమ) ముక్కంటి - "మూఁడు + లు" + "కన్ను + లు' - అలౌకిక విగ్రహము ఈ 22 చే - 'న్ను' అను దానికి "ంటి" ఆదేశమగును "మూఁడు + లు" + "కంటి + లు" 25 చే - మూఁడు + కంటి 17 చే- మూ + క్కంటి 13 చే - ముక్కంటి - ప్రాతిపదికము అనుక్త న్యాయము చే - ముక్కంటి + సు తత్సమ 57 చే - ముక్కంటి కదలి రాచూలి - "కదలిరాచ + వలన" + "చూలు + వు" - అలౌకిక విగ్రహము ఈ 22 చే - ఉత్వమునకు, ఇత్వము, "కదలిరాచ + వలన" + "చూలి+వు" 25 చే - కదలిరాచ + చూలి 20 చే - 'చ' లోపము కదలి రాచూలి-ప్రాతిపదికము అనుక్త న్యాయముచే - కదలిరాచూలి + సు తత్సమ 57 చే - కదలిరాచూలి నలువ - "నాలుగు + లు" + "వాయి + లు" - అలౌకిక విగ్రహము ఈ 22 చే - 'వాయి' శబ్దమునకు 'వ' ఆదేశము "నాలుగు+లు" +"వ + లు" 25 చే - నాలుగు + వ 20 చే - నలు + వ = నలువ - ప్రాతిపదికము అనుక్త న్యాయముచె - నలువ+సు తత్సమ 57 చే - నలువ గట్టు విలుతుఁడు - "గట్టు + వు" + "విలు + వు" - అలౌకిక విగ్రహము ఈ 22 చే - తవర్ణకము సమాసాంతమగును "గట్టు + వు" + "విలు+వు" తత్సమ 25 చే - గట్టు విలుత - ప్రాతిపదికము అచ్ఛిక 2 చే - ఇది పుంలింగ తుల్యమగును గావున, తత్సమ 21 చే - గట్టువిలుతు తత్సమ 22 చే - గట్టు విలుతు + డుజ్ తత్సమ 19 చే - గట్టువిలుతుఁడు - సిద్ధించును

విశే - (1) అలౌకిక విగ్రహమునందే సమాస సంజ్ఞా సమకాలమున సమాసాంతములు ప్రవర్తించుట శాస్త్రీయ పద్ధతి (11) ప్రత్యయములు సమాసాంతములగుచో నామవిభక్తులకుఁ బరముగనే యగును 'సమాసాంత ప్రత్యయాశ్చాలౌకిక విగ్రహవాక్యే సుపః పరస్తాదేవ భవంతి" బాలమ (111) కదలి రాచూలి = కదలి రాచవలని చూలు దేనికిఁ గలదోయది - లక్ష్మి రాచ (ఉ హ 5-189) చూలు = నూతి, జననము ఇతి వ్యధికరణ బహువ్రీహి (1V) ముక్కంటి రూపసాధనమున నౌపవిభక్తిక సూత్రముల ప్రసక్తితేరాదు కదలిరాజు + చూలు - అను విభజనమును సరికాదు పూర్వ వ్యాఖ్యలు చెప్పిన సమాసాది వృత్తుల ప్రక్రియలన్నియు నశాస్త్రీయములగుటచే నగ్రాహ్యములు

## బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడి యగు. 23

అలరుబోఁడి, ననబోఁడి, పూబోఁడి, విరిబోఁడి

వ్యా బహువ్రీహి సమాసమున స్త్రీవాచ్యమగుచో, నుపమానముమీఁది మేనునకు బోఁడి శబ్దమాదేశమగును అలరుబోఁడి=అలరువంటిమేను దేనికిఁ గలదో యది-స్త్రీ "అలరు+వు"+"మేను+వు", "నన + ము" + "మేను + వు', "పూవు+వు"+"మేను+వు", "విరి+సు"+"మేను+వు" - అలౌకిక విగ్రహములు ఈ 23చే - "అలరు + వు" + "బోఁడి+వు" - ఇత్యాది 25చే - అలరుబోఁడి-ఇత్యాది పూవు+బోఁడి-అనుచో సంధి 36 చే - పూబోఁడి అను క్త న్యాయముచే - అలరుబోఁడి + సు - ఇత్యాది తత్సమ 57చే- "అలరుబోఁడి"- ఇత్యాదులు సిద్ధించును

విశే - (1) మేనునకు బోఁడి-సమాసాంతకార్యము (11) అలరు+ బోఁడి - అనుచో, సంధి 25చే - అలరును+బోఁడి సంధి 19చే-అలరుంబోఁడి ఇట్లే పూవుంబోఁడి మొ (111) సుమాంగి లతాంగి - అను సమాసములకు సరిపెట్టవలెనను నభిప్రాయముతో మేనునకుబోఁడి విధింపఁబడెను

పాఠపరిశీలన - 'మేనునకుబోఁడి' అని ప్రథమ ముద్రణపాఠము "మేనునకుఁబోఁడి" అని వ్యాఖ్యాతలు దిద్ది యెవరో సూరిపాఠమును దిద్ది వేసిరనుట సత్యదూరము ప్రథమ ముద్రణమున 'పూఁబోఁడి' అని యొకచోట మాత్రము ఖండబిందువు తప్పు పడినది (చూ- వ్యా సం స)

## ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు. 24

మాత్రపితలు, మాతాపితలు ఇత్యాదులు.

వ్యా ద్వంద్వసమాసమున ఋకారమునకు "ర" వర్ణము విభాషనగును మాత్రపితలు - మాతృ+పితృ మాతృ = మాత్+ఋ సంస్కృత వ్యాకరణముచే ఋకారమునకు "ఆ" అను నాదేశము వచ్చుచుండఁగా దానినాపి, ఋకారమునకు "ర" అను నక్షరమాదేశమయిన-మాత్+ర+పితృ=మాత్ర పితృ - ప్రాతిపదికమగును తత్సమ 52చే-మాత్రపిత తత్సమ 12-మాత్ర పితలు ఋకారమునకు రవర్ణమాదేశము కానిచో - మాతృ + పితృ - అనుచో సంస్కృత వ్యాకరణముచే ఋకారమునకు 'ఆ' యనునది యాదేశమగును (ఆనఙ్ ఋతో ద్వంద్వే - పాణి) మాత్ + ఆ + పితృ = మాతాపితృ - ఇది సిద్ధసమాసము (3 సూ) తత్సమ 52 చే - మాతాపిత తత్సమ 12 చే - మాతాపిత + లు = మాతాపితలు

విశే - ఈ సూత్రముల వ్యాఖ్యానుసారి ఉర్ద్వంద్వేరః (అం చిం) అనుచో, ద్వంద్వే + అరః, సరియైన పదచ్ఛేదము అనఙః స్యాదృతే ద్వంద్వే, రఙ్ (వికృ) సాధుపారమ ద్వంద్వే + అరఙ్ - అని భేదము రేఫ - అప పారము ఈ పక్షమున - మాతర్ పితృ - కావలసి వచ్చును "మాతరపితరావుదీచామ్" (పాణి) మాతర పితృ వందనంబు (ఉహ 4.17)

## సమాసవిభక్తికి లోపంబగు లఙ్ఞునకుఁ గాదు. 25

రామునిబాణములు, సరసపువచనములు, వేవెలుఁగు, గుణముల ప్రోక

వ్యా సమాస విభక్తికి లోపమగును, లడాగమ 'ల' వర్ణమునకు లోపము కాదు రాముని బాణములు - "రాముని+యొక్క"+"బాణ+లు" - అలౌకిక విగ్రహము ఈ 25 చే - విభక్తులు లోపించి, రాముని + బాణ=రామునిబాణ- అను ప్రాతిపదిక మేర్పడును తత్సమ 12చే-రామునిబాణ+లు తత్సమ 40 చే - రామునిబాణ+ము+లు=రాముని బాణములు, సరసపువచనములు - "సరసము+లు"+"వచన+లు" ఈ 25చే- సరసము+వచన తత్సమ 41చే-ముదర్ధకమునకు విధించు కార్యములు ముగాగమమున కగును గావున సంధి 32 చే-ఈ ముగాగమమునకు, పుంపులగును సరసపు+వచన=సరసపు వచన-ప్రాతిపదికమౌ తత్సమ 12చే-సరసపు వచన+లు తత్సమ 40చే-సరసపు

వచన+ము+లు=సరసపు వచనములు వేవెలుఁగు - దీని ప్రక్రియకు, చూ అచ్చిక 21 లట్టునకు "గుణము+లయొక్క"+'ప్రోక+ము" తత్సమ 31 చే-లడాగమము ద్వితీయాది విభక్తులకు విధింపఁబడినది కనుక యదాగమ న్యాయమున లడాగమమునకు విభక్తిత్వము కలిగెను కావున 'లయొక్క" అను నదెల్లవిభక్తి యనిపించుకొనును కాఁగా, సమాస విభక్తికి లోపంబగు ననుదానిచే-లయొక్క, యనునది లోపింపవలసియుండఁగా, లట్టునకుఁ గాదు – అని నిషేధింపఁబడెను కాన "గుణముల యొక్క ప్రోక-' అనుచో యొక్క లోపించును, లట్టు లోపింపదు కనుక, గుణముల ప్రోక - ప్రాతిపదికమగును తత్సమ 39 చే - గుణముల ప్రోక+ము 57 చే- గుణముల ప్రోక

విశే - (1) ముగాగమ నిగాగమములు ప్రకృతికయవయవములగుటచే లోపింపవు (11) కొందఱుత్తర పదవిభక్తులే యీ 25 చే - లోపింపవను కొనుట యపరిజ్ఞాన మూలకము (111) సమాసశబ్దము వృత్తి సామాన్యమునకుప లక్షణము, (1V) సూత్రముపైఁగల యాక్షేపణలు పేక్ష్యములు పూర్వ వ్యాఖ్య లకు వృత్తుల ప్రక్రియలవగతము కాలేదు

**కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడంబోలె వాని తోడ సమసించు. 26**

రాముఁడు రక్షించిన భృత్యుఁడు, రాముఁడు వాలి నేసిన బాణము, రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు, రాముఁడు వెడలిన వనంబు రాముఁడు వసించిన పర్ణగృహము, రాముఁడు వసించిన చోటు

ఇది సమాస పరిచ్ఛేదము

వ్యా కర్మము మొదలగువానికిఁ బ్రాధాన్యము వివక్షించినప్పుడు ధాతుజ విశేషణములు (చూ క్రియా 44 - 47) కర్తతో సమసించునట్లు కర్మాదులతో సమసించును ధాతుజ విశేషణములు కర్తతో సమసించుట సహజము భృత్యుని రక్షించిన రాముఁడు ఇట రక్షించిన - అను ధాతుజ విశేషణము కర్తతో సమసించినది రక్షించినవాఁడు రాముఁడు గనుకఁ గర్తతో నన్వయముండుట సహజము ఇట్లే కర్మాదులకుఁ బ్రాధాన్యమును వివక్షించినప్పుడు ధాతుజ విశేషణము కర్తతో సమసించినట్లు కర్మాదులతో సమసించునని తాత్పర్యము కర్మతో సమసించుటకు - రాముఁడు రక్షించిన భృత్యుఁడు ఇట, రక్షించిన, ధాతుజ విశేషణము భృత్యుఁడు - కర్మము ధాతుజ విశేషణమగు రక్షించిన-

అనునది కర్తతో సమసించునట్లు ప్రాధాన్య వివక్షయందు గర్మముతో సమసించినది కరణముతో సమసించుటకు - రాముఁడు వాలి నేసిన బాణము ఇట, ఏసిన - ధాతుజ విశేషణము బాణము - కరణము బాణముచేతఁ (తోడ) వాలి నేసిన రాముఁడు - అని కర్త యగు రామునితో సమసించునట్లు - ధాతుజ విశేషణమగు, ఏసిన-అనునది, ప్రాధాన్య వివక్షయందుఁ గరణమగు బాణముతో నిట సమసించినది సంప్రదానముతో సమసించుటకు - రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు ఇట ఇచ్చిన — ధాతుజ విశేషణము విప్రుఁడు - సంప్రదానము ధాతుజ విశేషణమగు, ఇచ్చిన - అనునది - విప్రుని కొఱకు గోవు నిచ్చిన రాముఁడు - అని కర్తతో సమసించునట్లే - ప్రాధాన్య వివక్షయందు, సంప్రదానమగు, విప్రునితో నిట సమసించినది అపాదానముతో సమసించుటకు -రాముఁడు వెడలిన వనంబు ఇట, వెడలిన - ధాతుజ విశేషణము వనంబు—అపాదానము వనము వలన వెడలిన రాముఁడు — అని "వెడలిన , అను ధాతుజ విశేషణము కర్తతో సమసించునట్లే, ప్రాధాన్య వివక్షయం దపాదానమగు వనంబు — అను దానితో నిట సమసించినది అధికరణముతో సమసించుటకు - రాముఁడు వసించిన పర్ణ గృహము వసించిన — ధాతుజ విశేషణము పర్ణగృహ మధికరణము పర్ణగృహమునందు వసించిన రాముఁడు - అని, వసించిన - అను ధాతుజ విశేషణము కర్తతో సమసించినట్లే ప్రాధాన్య వివక్షయం దధికరణమగు పర్ణ గృహముతో సమసించినది రాముఁడు వసించినచోటు వసించిన —ధాతుజ విశేషణము చోటు - అధికరణము చోటున వసించిన రాముఁడు-అని వసించిన —అను ధాతుజ విశేషణము కర్తతో సమసించునట్లు, ప్రాధాన్య వివక్షయం దధికరణమగు చోటు శబ్దముతో సమసించినది

కర్మాదులకు — కర్మము - కారక 2 కరణము- కారక 3, 4 సంప్రదానము - కారక 8 అపాదానము-కారక 9 అధికరణము - కారకము 17, 18

విశే - రాముఁడు రక్షించిన భృత్యుఁడు = రాముఁ డేభృత్యుని రక్షించెనో యా భృత్యుఁడు రాముఁడు వాలి నేసిన బాణము = రాముఁడే బాణముచేత (తోడ) వాలి నేసెనో యా బాణము రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు = రాముఁ డేవిప్రుని కొఱకు గోవు నిచ్చెనో యా విప్రుఁడు రాముఁడు వెడలిన వనంబు = రాముఁ డేవనము వలన (వనము వలన నుండి, వనము నుండి ) వెడలెనో యా వనము రాముఁడు వసించిన పర్ణగృహము = రాముఁ డేపర్ణ గృహమునందు వసించెనో యా పర్ణగృహము రాముఁడు వసించిన చోటు =

రాముఁ డేచోటున వసించెనో యాచోటు - అని యర్థములు ఇవి కర్మధారయా భాసములు వీనిని సమస్తములనుట యౌపచారికము

పద సార్థక్యము - కర్మాదులకు - అనుటచే నన్యములతో ధాతుజ విశేషణములు సమసింపవు ఉదా॥ రాముఁడు సీతతో నడవి కరిగె ఇట, రాముఁ డడవికరిగిన సీత - అని కాదు సీతతోడ - సహార్థకము (కారక 5) ఇది కర్మాది కారకములతోనిది కాదు

ఇది ఘంటాపథము

# తద్ధిత పరిచ్ఛేదము



## తనవర్ణకంబు త్వార్థంబునందగు. 1

త్వార్థంబనఁగా భావంబు ప్రకృతి జన్య బోధంబునందుఁ ప్రకారంబు భావంబు రామునితనము, రాము తనము, మనుమని తనము, సీత తనము, గొప్పతనము, కొఱతనము, నల్లఁదనము, పుల్లఁదనము

వ్యా తన – అను ప్రత్యయము 'త్వ' అను సంస్కృత ప్రత్యయము యొక్క యర్థమున నగును వర్ణకంబు = ప్రత్యయము త్వార్థము = భావము ప్రకృతి జన్మ = ప్రాతిపదికము వలనఁ గలిగిన బోధంబునందును = అర్థజ్ఞానమునందు, ప్రకారంబు = విశేషణము, భావంబు = భావము (ప్రకృతి జన్య బోధే ప్రకారోభావః సి కౌ) ప్రాతిపదికము వలనఁ గలిగిన యర్థ జ్ఞానములో విశేషణముగాఁ దోఁచునది భావమని తాత్పర్యము ఉదా॥ రామ – ప్రకృతి రాముఁడు - అను వ్యక్తి ప్రకృతి జన్య బోధము దీనియందు విశేషణముగాఁ దోఁచునది, రామత్వమను ధర్మము కావున రామత్వము – ప్రకారము, ఇదే భావము భావార్థమున, సంస్కృతములో, త్వ ప్రత్యయమగును త్వ ప్రత్యయమగుచోటఁ దెనుఁగున 'తన' ప్రత్యయమగును కాన రాముని తనము అనుచో-తనము త్వార్థమనఁబడెను రాముఁడనఁగా రామత్వ విశిష్టుఁడని యర్థము రాముని తనము - రామునియొక్క + భావము ఈ 1 చే - భావార్థమున, తన ప్రత్యయమువచ్చి - రాముని+యొక్క+తన - అగును సమాస 25 సూత్రము నందలి సమాస శబ్దము వృత్తి కుపలక్షణమగుటచే, యొక్క విభక్తి లోపించి, రామునితన- అను తద్ధితాంతమగు ప్రాతిపదిక మేర్పడును (తత్సమ21) తత్సమ 39చే-రామునితనము రాముతనము-రాముయొక్క+భావము ఈ 1చే-రాము+యొక్క+తన సమాస 25చే-రాము+తన తత్సమ 39చే రాముతనము తత్సమ

23 చే - రామునియొక్క, రాము యొక్క అను రెండు రూపములు నుండును మనుమనితనము - మనుమని యొక్క+భావము ఈ 1చే-మనుమనియొక్క+ తన సమాస 25 చే- మనుమని తన తత్సమ 39 చే- మనుమని తనము తత్సమ 24చే- మనుమనియొక్క అని నిగాగమము నిత్యముగ నగును సీత తనము - సీతయొక్క + భావము ఈ 1 చే- సీత+యొక్క+తన సమాస 25చే- సీత+తన తత్సమ 39 చే- సీతతనము గొప్పతనము - గొప్పవాని యొక్క + భావము ఈ 1 చే- గొప్పవాని+యొక్క+తన సమాస 25చే- గొప్పవాని + తన సమాస 20 సూత్రము తద్ధిత వృత్తి కుపలక్షణము కానఁ దచ్ఛబ్దము లోపించి గొప్ప + తన - అగును తత్సమ 39చే - గొప్పతనము గొప్ప+తన=గొప్పతనము గొప్ప=గొప్పది కొఱతనము - కొఱదాని యొక్క +భావము ఈ 1చే- కొఱదాని + యొక్క + తన సమాస 25చే- కొఱ దాని + తన సమాస 20 చే- కొఱ + తన తత్సమ 39 చే- కొఱతనము నల్లఁదనము - నల్లదానియొక్క + భావము ఈ 1చే- నల్లదాని+యొక్క+ తన సమాస 25 చే- నల్లదాని + తన సమాస 20 చే- నల్ల + తన సంధి 35 చే- నల్లను + తన 16 చే- నల్లను + దన 17 చే- నల్లఁదన తత్సమ 39 చే - నల్లదనము ఇట్లే పుల్లదాని యొక్క భావము = పుల్లఁదనము

సుబంతములకు భావార్థాదులందుఁ జేరు ప్రత్యయములు తద్ధితములు

తద్ధిత ప్రక్రియ

1 ప్రాతిపదికము కంటె సుప్ప్రత్యయము చేర్చి యలౌకిక విగ్రహమును గల్పింపవలెను (సుబంతాత్తద్ధితోత్పత్తి - మ భా)

దశరథ + ఙస్ (షష్ఠీవిభక్తి)

2 పై ప్రకృతిభాగమున భాపి ప్రత్యయాంతర్భావమునందు నేకార్థీ భావ సామర్థ్యమును విధింపవలెను అప్పుడు ప్రకృతి భాగము సమర్థమగును (సమర్థాత్తద్ధితోత్పత్తిః - మ భా,) - వృత్తి వి

3 లౌకిక విగ్రహమును జూపి తద్ధిత ప్రత్యయమును బ్రవర్తింపఁజేయ వలెను (విగ్రహపూర్వకా తద్ధితోత్పత్తిః - మ భా) దశరథస్యాపత్యం దాశరథిః అత ఇఞ్ (పాణి)

దశరథ + ఙస్ + ఇఞ్

4 సుబ్మిధాతు ప్రాతిపదికయోః (పాణి)

దశరథ + ఇఞ్ = దాశరథి - ప్రాతిపదికము

5 సుబ్విభక్తి చేరి తద్ధిత పదములేర్పడును దాశరథి + సు = దాశరథిః

## ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. 2

స్పష్టము

వ్యా ఈ తద్ధిత పరిచ్ఛేదమున, విశేషవిధి, సామాన్య విధికి విభాషను బాధకమగును ఉత్సర్గము = సామాన్యవిధి తన వర్ధకంబు త్వార్థంబు నందగు - అనునది సామాన్యవిధి చిన్నాదులకు ఱిక వర్ధకంబగు (3) మొదలయినవి విశేష విధులు బహువిషయకము సామాన్యవిధి అల్పవిషయకము విశేషవిధి ఇట విశేష విధులు సామాన్య విధికి విభాషగ బాధకములగును బాధకము = ప్రతిబంధకము ఉదా॥ చిన్న-ఇట, తనవర్ధకంబు త్వార్థంబునందగు - అను సామాన్య విధిచేతన వర్ధక మగుచుండగా, చిన్నాదులకు ఱిక వర్ధకంబగు అను విశేషవిధి (3) తన వర్ధకమును బాధించి ప్రవర్తించును అప్పుడు చిన్నఱికము - అని యేర్పడును విభాష ననుటచే - పక్షమున, చిన్నతనము - అని యేర్పడును

విశే - (1) "బహవోవిషయాయస్య ససామాన్యవిధిర్భవేత్, స్వల్పస్వాద్విషయాయస్య స విశేషవిధిర్మతః" - ముగ్ధ - దుర్గా ఈ సూత్రము "వాసరూపోఽస్త్రియామ్"(పాణి) అను సూత్రమును దలఁపించుచున్నది ఉత్సృజ్యతే అపవాదేన బాధ్యతే ఇత్యుత్సర్గః

పదసార్థక్యము - ఇటన్ - అనుటచే, నితరత్ర విశేషవిధి సామాన్య విధిని నిత్యముగ బాధించును "తథాసామాన్య కార్యేభ్యో విశేషక విధిర్బలీ" (దుర్గా) కాన, ఇటన్ - అనుట సార్థకము

## చిన్నాదులకు ఱిక వర్ధకంబగు. 3

చిన్నఱికము, కన్నెఱికము చిన్న, కన్నె, చుట్టము, దొంగ, పేద, మిండ, లంజె. ఇత్యాదులు చిన్నాదులు

వ్యా చిన్న-మొదలగు వానికి ఱిక ప్రత్యయ మగును చిన్నఱికము - చిన్నయొక్క + భావము 1 చే - తన ప్రత్యయ మగుచుండఁగా, నీ 3 సూత్రము దానిని విభాషగ బాధించును "చిన్న + యొక్క" + ఱిక - అగును సమాస 25 చే - చిన్న + ఱిక తత్సమ 39 చే-చిన్నఱికము-అగును కన్నెఱికము - కన్నెయొక్క + భావము, ఈ 3 చే. 'కన్నె + యొక్క + ఱిక సమాస 25 చే,

కన్నెఱిక తత్సమ 39 చే-కన్నెఱికము ఱిక-రానిచో, కన్నెతనము, చుట్టఱికము - చుట్టము యొక్క + భావము ఈ 3చే- "చుట్టము+యొక్క+ ఱిక సమాస 25 చే - చుట్టము+ఱిక సమాస 20 చే - చుట్ట+ఱిక తత్సమ 39 చే–చుట్టఱికము ఱిక-రానిపక్షమున, 1చే-చుట్టము+యొక్క+తన సమాస 25 చే - చుట్టము + తన తత్సమ 41 చే - మువర్ణకమునకగు కార్యములు ముగాగమమునకగును గాన సంధి 32చే- చుట్టపు+తన 35చే- చుట్టపును+ తన ద్రుతకార్యము - చుట్టపుందన, చుట్టపుఁదన, చుట్టపున్దన (సంధి 16, 17) తత్సమ 39చే - చుట్టపుందనము, చుట్టపుఁదనము, చుట్టపున్దనము దొంగ ఱికము - దొంగయొక్క + భావము "దొంగ+యొక్క"+ఱిక సమాస 25చే - దొంగ + ఱిక తత్సమ 39 చే - దొంగఱికము ఱిక రానిచో - "దొంగ + యొక్క' + తన = దొంగతనము - అగును, పేద యొక్క+ భావము పేదయొక్క + ఱిక = పేదఱికము పేదయొక్క+తన = పేద తనము మిండఱికము - మిండనియొక్క + భావము "మిండ+యొక్క"+ ఱిక సమాస 25 చే మిండ+ఱిక=మిండఱిక తత్సమ 39చే-మిండఱికము ఇట్లే, "మిండ+యొక్క" + తన = మిండతనము లంజెయొక్క+భావము "లంజె+యొక్క"+ఱిక 25చే- లంజె+ఱిక తత్సమ 39 చే -లంజెఱికము లంజెయొక్క + తన = లంజెతనము ఇత్యాదులు చిన్నాదులు

విశే - (1) చిన్న = చిన్నవాఁడు, పేద = పేదవాఁడు - అనునర్థ ములు గలవు కాన చిన్న పేదలతోఁ బ్రక్రియ గ్రాహ్యము చిన్నవాని, పేద వాని - అని నిల్పినచో సమాస 20చే - తచ్ఛబ్దలోపము (11) చుట్టపుఁదనము - అను రూపాంతరము ననుసరించి ముగాగమము నలౌకిక విగ్రహమునఁ జేయ వలెను, నిగాగమమును జేయనక్కఱలేదు మిండఱికము, మిండతనము

## ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగు నపుడగు. 4

### తొత్తఱికము, వెద్దఱికము, వెజ్జఱికము

వ్యా ఱిక ప్రత్యయము పరమగుచో ఉత్వమున కత్వ మాదేశమగును తొత్తఱికము - తొత్తుయొక్క + భావము 3 చే- "తొత్తు+యొక్క" + ఱిక సమాస 25 చే- తొత్తు+ఱిక ఈ 4 చే - తొత్తఱిక తత్సమ 39 చే- తొత్తఱికము ఇట్లే, "వెద్దు + యొక్క" + ఱిక=వెద్దఱికము "వెజ్జు + యొక్క" + ఱిక = వెజ్జఱికము ఇవి చిన్నాదుల లోనివగుట స్పష్టము.

## పేర్వాదుల కిమి వర్ణకంబగు. 5

పేరిమి, కడిమి, పేరు, కడు, ప్రముచ్చు, మేలు, చెలి, వాఁడి వాఁడి, వేఁడి ఇత్యాదులు పేర్వాదులు

వ్యా పేరు - మొదలగు వానికి 'ఇమి' ప్రత్యయ మగును పేరిమి - పేరుయొక్క + భావము ఈ 5 చే- "పేరు + యొక్క" + ఇమి సమాస 25 చే- పేరు+ఇమి సంధి 11చే - పేరిమి అనుక్తన్యాయముచే - పేరిమి+సు తత్సమ 57చే - పేరిమి ఇట్లే తక్కినవి

విశే - పేరు, కడులకు, తనరాదని 2 లోని విభాషకు వ్యవస్థ చేయ నగును

## నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు. 6

నల్లన, తెల్లన, నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, చప్ప విన్న, తిన్న, అల్ల, ఒయ్య, తిమ్మ, చక్క, వ్రేఁక - ఇత్యాదులు నల్లాదులు

వ్యా గుణవాచకములగు నల్ల-మున్నగు వానికి 'న' ప్రత్యయమగును నల్లదానియొక్క + భావము నల్లదాని+యొక్క+న సమాస 25చే - నల్ల దాని+న సమాస 20 చే - నల్ల+న=నల్లన తత్సమ 39చే - నల్లన+ము తత్సమ 57చే-నల్లన ఇట్లే తక్కినవి

## ఇక వర్ణకం బగ్గలాదులకగు. 7

అగ్గలిక, ఒమ్మిక అగ్గలము, ఒమ్మ

వ్యా అగ్గలము మున్నగు వానికి, ఇక ప్రత్యయమగును అగ్గలిక -అగ్గ లము యొక్క + భావము ఈ 7 చే - "అగ్గలము+యొక్క' +ఇక సమాస 25 చే- అగ్గలము+ఇక సమాస 20చే- అగ్గల + ఇక సంధి 11చె-అగ్గలిక తత్సమ 39 చే - అగ్గలిక + ము తత్సమ 57 చే - అగ్గలిక "ఒమ్మ + యొక్క" + ఇక = ఒమ్మిక

## మగఁటిమ్యాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు. 8

మగఁటిమి, మగతనము, పేదఱిమి, ఒజ్జనము, కోటరము, కోడంట్రము, కోడంట్రికము, కోడఱికము, కోమలికము, చెలికారము, తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు ఱికాదులు ధాన్ని పక్షమందుఁ ధన

ప్రత్యయం బన్నింటి కగు చిన్నతనము, ముచ్చుఁదనము, నల్లఁదనము, అగ్గలంపుఁదనము, ఒజ్జతనము

వ్యా మగఁటిమి - మొదలగునవి ప్రయోగాను సారముగ గ్రహింపఁదగినవి మగఁటిమి - "మగ+యొక్క"+ఇమి సమాస 25 చే - మగ+ఇమి ఈ 8 చే - మగ + ఁట్ + ఇమి = మగఁటిమి మగటిమి+ సు తత్సమ 57 చే - మగఁటిమి సంజ్ఞా 14 చే - మగంటిమి మగఁటిమి మగతనము - "మగ + యొక్క" + తన సమాస 25 చే - మగ + తన = మగతన తత్సమ 39 చే - మగతనము పేదఱిమి = పేద + యొక్క + ఇమి = సమాస 25 చే - పేద + ఇమి ఈ 8 చే - పేదఱ్ + ఇమి = పేదఱిమి పేదఱిమి + సు, తత్సమ 57 చే - పేదఱిమి ఒజ్జనము - ఒజ్జ + యొక్క +న సమాస 25 చే - ఒజ్జ + న తత్సమ 39 చే - ఒజ్జనము కోటరము - "కోడలి+యొక్క"+ర సమాస 25 చే - కోడలి+ర ఈ 8 చే - కోట+ర= కోటర తత్సమ 39 చే - కోటరము కోడంట్రము - "కోడలి+యొక్క"+ర సమాస 25 చే - కోడలి+ర ఈ 8 చే - కోడంట్+ర=కోడంట్ర తత్సమ 39 చే - కోడంట్రము కోడంట్రికము కోడలి+యొక్క' + ఱిక సమాస 25 చే - కోడలి+ఱిక ఈ 8 చే - కోడంట్+ఱిక=కోడంట్రిక, తత్సమ 39 చే - కోడంట్రికము కోడఱికము - "కోడలి+యొక్క"+ఱిక సమాస 25 చే - కోడలి+ఱిక ఈ 8 చే - కోడ+ఱిక=కోడఱిక తత్సమ 39 చే - కోడఱికము కోమలికము - "కోమలి+యొక్క"+ఇక సమాస 25 చే - కోమలి + ఇక సంధి 11 చే - కోమలిక తత్సమ 39 చే - కోమలికము చెలికారము, "చెలి+యొక్క"+కార సమాస 25 చే - చెలికార తత్సమ 39 చే - చెలికారము తెలుపు - తెల్లదాని యొక్క+భావము='తెల్లదాని యొక్క"+పు సమాస 25 చే - తెల్లదాని+పు 20 చే - తెల్ల+పు ఈ 8 చే - తెలు+పు = తెలుపు తత్సమ 48 చే - తెలుపు+వు తత్సమ 57 చే - తెలుపు ఇట్లే, ఎఱ్ఱదాని+యొక్క+పు=ఎఱుపు పచ్చదాని + యొక్క + పు = పసుపు నల్లదాని + యొక్క+పు=పసుపు నల్లదాని+యొక్క+పు=నలుపు ఱికాదులు రానిచో (3-7) 1 చే - 'తన' వర్ణక మన్నింటి కగును చిన్నతనము - "చిన్న+యొక్క" + తన = చిన్నతనము 3 సూ ముచ్చుఁదనము - "ముచ్చు + యొక్క"+తన సమాస 25 చే - ముచ్చు+తన సంధి 35 చే - ముచ్చును+తన సంధి 16 చే - ముచ్చును+దన 17 చే - ముచ్చుఁదన తత్సమ 39 చే- ముచ్చుఁదనము నల్లఁదనము - "నల్లదాని+యొక్క"+తన సమాస 25 చే -

నల్లదాని + తన 20 చే. నల్ల + తన సంధి 35 చే. నల్లను + తన, 16చే. నల్లను + దన 17 చే. నల్లఁదన తత్సమ 39 చే. నల్లఁదనము అగ్గలంపుఁదనము - "అగ్గలము + యొక్క" + తన సమాస 25 చే - అగ్గలము+తన తత్సమ 41 చే - ముపర్ణకమునకు విధించు కార్యము ముగాగ మమున కగును కావున సంధి 32చే. అగ్గలంపు + తన 35 చే. అగ్గలంపును +తన 16చే. అగ్గలంపును + దన 17చే. అగ్గలంపుఁదన తత్సమ 39చే. అగ్గలంపుఁదనము ఒజ్జతనము - ఒజ్జ + యొక్క + తన సమాస 25చే. ఒజ్జ + తన తత్సమ 39 చే. ఒజ్జతనము

విశే. మగఁటిమి = మగనియొక్క భావము మగఁడు = శూరుఁడు పేదయొక్క + భావము-ఇత్యాదిగా లౌకిక విగ్రహములు చూవవలెను

## అరమరాదులకు స్వార్థంబునందిక వర్ణకంబగు. 9

అరమరిక, ఆమిక

అరమర, ఆము, అల్లిబిల్లి, గండి, నడవడి, నాడు, నివ్వాళి, పొత్తి, మాన, మెలి, వాలు ఇత్యాదు లరమరాదులు

వ్యా అరమర - మొదలగువానికి స్వార్థమున 'ఇక' ప్రత్యయ మగును స్వార్థము = తనయొక్క యర్థము అనఁగాఁ బ్రకృత్యము (స్వార్థః ప్రకృత్యర్థానతిరేకః - ముగ్ధ శ్రీరామ) అరమరిక = అరమర - అనియే యర్థము అరమర + ఇక - సంధి 11 చే - అరమరిక తత్సమ 39 చే - అరమరిక+ ము 57 చే - అరమరిక ఇట్లే తక్కినవి

విశే - అరమర శబ్దముతోఁ గూడిన 'ఇక' ప్రత్యయ మరమర శబ్దార్థము ననువదించుచున్నది "తత్రైవ స్వార్థికాః కేచిత్ సం ఘాతాంతర వృత్తయః, అనర్థకేన సంసృష్టాః, ప్రకృత్యర్థాను వాదినః - వాక్యప

## ఉక వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు. 10

చిఱుతుక, నాతుక

చిఱుత, నాతి, నెలఁత, మెలఁత, పడఁతి, మదఁతి, పొలఁతి, వెలఁది, నిప్పు, ఎమ్ము, ఇత్యాదులు చిఱుతాదులు

వ్యా చిఱుత మొదలగు శబ్దములను స్వార్థమున, ఉక ప్రత్యయమగును స్వార్థము = ప్రకృతియొక్క యర్థమని తాత్పర్యము చిఱుతుక :-చిఱుత +

ఉక సంధి 11 చే - చిఱుతుక తత్సమ 39 చే - చిఱుతుక + ము తత్సమ 57 చే - చిఱుతుక = చిఱుత ఇట్లే తక్కినవి

## కాక త్తియ వర్ణకంబులు పుం స్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు 11

కా ప్రత్యయాంతంబునకు మగాది గణ గణనంబునం జేసి డుజ్ఞగు ఆటకాఁడు ఆటక త్తియ, ఆట అడపము, ఎమ్మె, ఓయారము, కటారి, కొల్ల, చెలిమి, చేరువ, చొరవ, జట్టి, జాజర, జూదము, తిండి, తేర, దొద్ద, నీటు, నేస్తము, బేరము, వగ, విలు, వెచ్చము, సొగసు. ఇత్యాదు లాటాదులు

వ్యా ఆట - మొదలగువానికిఁ బుంస్త్వమున 'కా' ప్రత్యయము, స్త్రీత్వమున 'కత్తియ' ప్రత్యయము, మతుబర్థమున నగును మతుబర్థము = మతుప్ - ప్రత్యయముయొక్క యర్థము "అది వీనికిఁగలదు, అది వీనియందుఁ గలదు" - అను నర్థమున, మతుప్ - ప్రత్యయమగును (తదస్యాస్త్యస్మిన్నితి మతుప్ - పాణి) ఆటకాఁడు - ఈ 11 చే - "ఆట + ము" + కా సమాస 25 లోని సమాస శబ్దము వృత్తి సామాన్యమున కుపలక్షణమగుటచే విభక్తి లోపము ఆటకా - ప్రాతిపదికము తత్సమ 22 చే - ఆటకా + డుఙ్ తత్సమ 19 చే - ఆటకాఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు ఇట్లే, అడపకాఁడు - లోనగునవి "ఎమ్మె + సు" + కా = ఎమ్మెకా ఎమ్మె కాఁడు ఇట్లు కటారికాఁడు - లోనగునవి "నీటు + వు" + కా = నీటుకా నీటుకాఁడు ఇట్లు విలుకాఁడు, సొగసుకాఁడు ఆటకత్తియ - "ఆట + ము" +కత్తియ సమాస 25 చే - ఆట కత్తియ - ప్రాతిపదికము తత్సమ 39 చే- ఆటకత్తియ + ము తత్సమ 57 చే-ఆటకత్తియ (అచ్చిక 23 చే - ఆటకత్తె యగును ) ఇట్లే, అడప కత్తియ - మున్నగునవి

విశే - కా ప్రత్యయము మగాదులలోనిదిగాన నిగాగమము నిత్యము ఉదా॥ ఆటకానిని ఆటకానిచేత - అచ్చిక 4

## కాకత్తియల, కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి. 12

అందగాఁడు, అందగత్తియ, కొండెగాఁడు, కొండెగత్తియ; బేరగాఁడు, బేరగత్తియ ఇత్యాదులు.

వ్యా కా, కత్తియ యను ప్రత్యయముల కకారమునకుఁ గొన్నిచోట్ల గకారము కనఁబడును అందగాఁడు - అందము వీనికిఁగలదు 11 చే - అంద + ము + కా సమాస 25 చే - అందకా ఈ 12 చే - అందగా తత్సమ 22 చే - అందగా + డుఙ్ తత్సమ 19 చే - అందగాఁడు = సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు అండగత్తియ - అందము దీనికిఁ గలదు 11 చే - "అంద + ము" + కత్తియ సమాస 25 చే - అంద + కత్తియ ఈ 12 చే - అందగత్తియ తత్సమ 39 చే - అందగత్తియ + ము, 57 చే - అందగత్తియ ఇట్లే తక్కినవి

## కాకత్తియలు కొండొక వానికి స్వార్థంబునం జూపట్టెడు. 13

చెలికాఁడు, చెలికత్తియ, హెగ్గడికాఁడు, హెగ్గడికత్తియ

వ్యా కా - ప్రత్యయము పుంస్త్వమునందును, కత్తియ ప్రత్యయము స్త్రీత్వమునందును స్వార్థమున నగునని తాత్పర్యము స్వార్థము = ప్రకృతి యొక్క యర్థము (సూ 9) చెలికాఁడు - చెలికా - ప్రాతిపదికము తత్సమ 22 చే - చెలికా + డుఙ్ తత్సమ 19 చే - చెలికాఁడు సంజ్ఞా 15 చే-సాధ్య పూర్ణము లేదు ఇట, చెలికాఁడు = చెలి - అనియే యర్థము చెలికత్తియ - చెలి + కత్తియ = చెలికత్తియ తత్సమ 39 చే చెలికత్తియ+ము తత్సమ 57 చే - చెలికత్తియ ఇట్లే హెగ్గడికాఁడు, హెగ్గడికత్తియ

## కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. 14

ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు, కొమ్ముకాఁడు, సరికాఁడు ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు

వ్యా 'కా' ప్రత్యయము తిర్యక్కులకును గనఁబడును ఇబ్బందిగాఁడు - ఇబ్బందికా - ప్రాతిపదికము ఆచ్ఛిక 4 చే - కా ప్రత్యయము మగాదులలోనిది మహత్తులగు మగాదులకు - అనుటచేఁ దిర్యక్కులకు మహత్త్వ మారోపింపఁ బడినదని గ్రహింపవలెను ఆచ్ఛిక 2 చే - పుంలింగతుల్యత కలుగును కావున తత్సమ 22 చే - డుఙ్గగును ఇబ్బందికా + డుఙ్ తద్ధిత 12 చే-ఇబ్బందిగా + డుఙ్ తత్సమ 19 చే - ఇబ్బందిగాఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు ఇట్లే, ఒంటికా + డుఙ్ = ఒంటిగాఁడు కొమ్ముకా + డుఙ్=కొమ్ము కాఁడు పరికా + డుఙ్ = పరికాఁడు

విశే - డుఙ్ఙు కలుగుటకు 'కా' ప్రత్యయమును గయిరాదులందును జేర్పవలెనని కొందఱు నెలవిచ్చుట సరికాదు ఇట్టి యభిప్రాయమే యున్నచో

"ఆఁగు ప్రకృతులు భయగణంబులు" (క్రియా 76) అన్నట్లే సూరి యిచ్చటను ననియుండెను కయిరాదు లశ్వవాచకములు, అది యొక గణము ఇది వేఱే గణము "ఇత్యాదులు మృగ విశేష వాచకంబులు" అని సూరి సూచన 'శా' ప్రత్యయము మగాదులలోనిది గావున మహదారోపమే యుద్దిష్టము

## అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబు నందగు. 15

ఈ పత్యయాంతంబు మగాది గణంబు అటమటీఁడు, కమ్మతీఁడు

అటమటము, కమ్మతము, కన్నడము, కొండెము, బాననము, బూటకము, మందడి, మన్నెము, సుంకము ఉక్కివంబునకు వలోపంబునగు ఉక్కిఁడు ఇత్యాదులు

వ్యా అటమటము - మొదలగువానికి మతుబర్థమున ఈ ప్రత్యయము, పుంస్త్వము నందగును మతుబర్థము = చూ 11 అటమటీఁడు - అటమటము వీనికిఁ గలదు ఈ 15 చే - "అటమటము' + ఈ సమాస 25 చే - అటమట + ఈ - అగును సంధి 11 చే - అటమటీ - ప్రాతిపదికమగును అచ్చిక 2చే నిది పుంలింగతుల్యము గాన, తత్సమ 22 చే - అటమటీ + డుఙ్ - అగును తత్సమ 19 చే - అటమటీఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు ఇట్లే, కమ్మతీఁడు, కన్నడీఁడు, కొండీఁడు, బాననీఁడు, బూటకీఁడు, మందడీఁడు, మన్నీఁడు, సుంకీఁడు, నను రూపము లేర్పడును ఉక్కివమునకు వలోపము నైతమగును "ఉక్కివ + ము" + ఈ సమాస 25 చే - ఉక్కివ + ఈ "ఉక్కివంబునకు వ లోపంబు నగు" అను వాక్యముచే, 'వ' లోపించి ఉక్కి + ఈ - అగును సంధి 11 చే - ఉక్కి అగును తత్సమ 22 చే - ఉక్కి + డుఙ్ తత్సమ 19 చే ఉక్కిఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు

విశే - "ఈ - ప్రత్యయాంతంబు మగాది గణంబు" అనుటచే దీనికి నిగాగమము తత్సమ 24 చే - నిత్యముగ నగును అచ్చిక 4 విశే

## ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు. 16

మొక్కలీఁడు, కల్లరీఁడు

వ్యా ఈ - ప్రత్యయము కొన్నిటికి స్వార్థమున నగును స్వార్థము = ప్రకృతి యొక్క యర్థమని తాత్పర్యము (9 సూ) మొక్కలి + ఈ సంధి

11 చే- మొక్కలీ తత్సమ 22 చే - మొక్కలీ + డుఙ్ తత్సమ 19 చే మొక్కలీఁడు = మొక్కలి - అని యర్థము ఇట్లే కల్లరీఁడు = కల్లరి ఇట్లు, ఈ ప్రత్యయము ప్రకృత్యర్థముననువదించుచున్నది

## అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు. 17

జాలరి, ఒఱపరి జాల, ఒఱపు, కల్ల, చదువు, జూదము, టక్కు, తగవు, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేఁట, సిగ్గు, సుంకము — ఇత్యాదులు

వ్యా అరి ప్రత్యయము, మతుబర్థమున, జాల-మొదలగువానికగును జాలరి - "జాల+ము"+అరి-అలౌకిక విగ్రహము సమాస 25చే- జాల+అరి సంధి 11చే జాలరి అనుక్తన్యాయముచే- జాలరి+సు తత్సమ 57చే- జాలరి ఇట్లే కల్లరి, జూదరి మొ ఒఱవరి - "ఒఱపు+వు"+అరి సమాస 25చే- ఒఱపు+అరి సంధి 11చే- ఒఱపరి ఒఱపరి+సు తత్సమ 57చే- ఒఱవరి ఇట్లే చదువరి-లో నగునవి జాలము వీనికి గలదు-ఇత్యాదిగా లౌకిక విగ్రహములు చూపి ప్రత్యయములు విధింపవలెను

## ఇ వర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు. 18

ఓయారి, అక్కసి ఓయారము, అక్కసము. కడలు, చాగము, జోగము, మతకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము, బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణము, వెక్కసము, ఇత్యాదులు

వ్యా ఓయారము-మొదలగు వానికి మతుబర్థమున 'ఇ' ప్రత్యయమగును- ఓయారి - ఓయారము వీనికిఁ (దీనికిఁ) గలదు "ఓయార+ము"+ఇ సమాస 25చే- ఓయార+ఇ సంధి 11చే- ఓయారి అనుక్తన్యాయముచే-ఓయారి+సు తత్సమ 57చే- ఓయారి, ఇత్యాది కడలి - కడలు (కెరటములు) దీనియందుఁ గలవు "కడలు+వు+ఇ సమాస 25చే- కడలు+ఇ సంధి 11చే- కడలి అనుక్తన్యాయమున-కడలు+సు తత్సమ 57చే- కడలి

## త వర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యంబగు నపుడు మతుబర్థంబునందగు. 19

కొఱవత, చాకిత. కొఱవ, చాకి, బోయ, వానె, వ్రే, సాలె, ఇత్యాదులు, కులవాచకంబులు.

వ్యా కులవాచకమునకు స్త్రీ వాచ్యమగుచో, మతుబర్థమున "త" ప్రత్యయ మగును కొౙవత - కొఱవ దీనికిఁ గలదు "కొఱవ + ము' + త సమాస 25చే- కొఱవ + త = కొఱవత తత్సమ 39చే- కొఱవత+ము తత్సమ 57చే- కొఱవత ఇట్లుబోయత చాకిత - చాకి + సు + త = చాకి+త చాకిత ఇట్లే తక్కినవి

## తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు. 20

చెంచెత, మాలెత

వ్యా త- ప్రత్యయము పరమగునపుడు కొన్నియెడల, ఎత్వము కనఁబడును చెంచు + వు + త, మాల + ము + త సమాస 25చే- చెంచు + త మాల + త ఈ 20చే- చెంచెత మాలెత తత్సమ 39చే- చెంచెత + ము, మాలెత + ము తత్సమ 57చే- చెంచెత, మాలెత

## యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు. 21

స్పష్టము

వ్యా యువతి, గుబ్బెత యనియు, విటి, మిండత యనియు, రజస్వల ముట్టుత యనియు ననఁబడుదురు గుబ్బెత = యువతి మిండత = విటి- ముట్టుత = రజస్వల గుబ్బ, మిండ, ముట్టులకు మతుబర్థమున, తవర్ణకము, గుబ్బాదులకెత్వము నగునన్నమాట తత్సమ 39చే- గుబ్బెత + ము తత్సమ 57చే- గొబ్బెత ఇట్లే తక్కినవి

## వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగునపుడు మత్వర్థంబునం దాఁడి వర్ణకంబగు. 22

వగలాఁడి. వగ, చిన్నె, కులుకు, వన్నె, దొమ్మి, ఎమ్మె, ఇత్యాదులు వగాదులు

వ్యా బహువచ నాంతములగు, వగ - మొదలగు వానికి స్త్రీవాచ్యమగునపుడు, మతుబర్థమున 'ఆఁడి' ప్రత్యయ మగును వగలాఁడి - వగలు దీనికిఁ గలవు "వగ + లు" + ఆఁడీ" "బహువచనాంతఁబులకు" అను విధాన సామర్థ్యము చే, సమాస 25చే- లువర్ణకము లోపింపదు సంధి 11చే- వగలాఁడి

అనుక్త న్యాయముచే - వగలాఁడి + సు తత్సమ 57చే- వగలాడి ఇట్లే చిన్నెలాఁడి - లోనగునవి

వదసార్థక్యము - బహువచనాంతంబులకు - అనుటచే నేకవచనాంత్ములకు ఆఁడి వర్ణకము కాదు కనుకనే వగలు - మున్నగు బహువచనాంతములకే అఁడి వర్ణకమగును వగ - అను నేకవచనాంతమునకుఁ గాదు

## వగాదులకు బహువచనాంతంబులకు బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు. 23

ఆ ప్రత్యయాంతంబు మగాదిగణంబు వగలాఁడు, చిన్నెలాఁడు

వ్యా బహువచనాంతములగు, వగ - మొదలగు వానికిఁ బుంస్త్వమున, మతుబర్థమగు 'ఆ' ప్రత్యయమగును వగలాఁడు - వగలు వీనికిఁ గలవు "వగ + లు" + ఆ సంధి 11చే- వగలా, తత్సమ 22చే- వగలా+డుఙ్ తత్సమ 19చే- వగలాఁడు సంజ్ఞా 15చే- సాధ్యపూర్ణములేదు ఇట్లే, చిన్నెలు+ ఆ = చిన్నెలా + డుఙ్ చిన్నెలాఁడు ఆ ప్రత్యయము మగాదిగణము (అచ్చిక 4) లోనిది

విశే - ఆ- ప్రత్యయము మగాదులలోని దనుటచే దీనికి నిగాగమము నిత్యము చూ అచ్చిక 4 విశే

## ముక్కులోనగు వానికిం దదభావ ద్యోతకంబయి మతుబర్థంబునం దిఁడి వర్ణకంబగు. 24

ముక్కిఁడి ముక్కు లేనివాఁడని యర్థము ముక్కు, వాలు, వెరవు, సిగ్గు, ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది

వ్యా ముక్కు మొదలగు శబ్దములకు, ఆ ముక్కు మొదలగు వాని యొక్క లేకపోవుటను సూచించునదై మతుబర్థమున ఇఁడి-ప్రత్యయమగును ముక్కు లేకపోవుట వీనికిఁ గలదు ముక్కు+వు+ఇఁడి సమాస 25చే- ముక్కు+ఇఁడి సంధి 11చే- ముక్కిఁడి అనుక్తన్యాయమున-ముక్కిడి+సు తత్సమ 57 చే - ముక్కిడి ఇట్లే వాలిఁడి, వెరవిఁడి, సిగ్గిడి

## మానార్థంబున కేకత్వంబునం దెఁడు వర్ణకంబగు. 25

తూమెఁడు, ముంతెఁడు, ఎత్తెఁడు, వీసెఁడు, జేనెఁడు, మూఁరెడు, కుండెఁడు, గంపెఁడు.

వ్యా మానార్థమున నేకవచనమున, ఎఁడు ప్రత్యయమగును మానార్థము = కొలతను దెలుపునది తూము – ఇది మానార్థక శబ్దము ఇది యేకవచనము ఈ 25 చే. "తూము + వు" + ఎడు సమాస 25 చే. తూము + ఎఁడు సంధి 11 చే - తూమెఁడు తత్సమ 48చే. తూమెఁడు + వు తత్సమ 57 చే. తూమెఁడు ఇట్లే, ముంత, ఎత్తు, వీసె, జేన, మూర, కుండ, గంప శబ్దములకు, ఎఁడు - ప్రత్యయము చేరి రూపసిద్ధి యగును తూము పరిమాణము దీనికిఁ గలదు - ఇత్యాదిగా లౌకిక విగ్రహములు చూపి, ఎఁడు ప్రత్యయమును విధింపవలెను

పద సార్థక్యము - ఏకత్వంబున – అనుటచేత బహుత్వమున మానార్థమునకు, ఎఁడు రాదు ఉదా॥ నాలుగు గంపల పెసలు - ఇట, ఎఁడు - రాదు

## ఎఁడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు. 26

కమికెఁడు, కొడిదెఁడు, దోసెఁడు, పిడికెఁడు, పుడిసెఁడు, సందెఁడు

వ్యా ఎఁడు ప్రత్యయము పరమగునప్పుడు, లివర్ణము లోపించును 25 చే - "కమికిలి + సు" + ఎఁడు ఈ 26 చే - కమికి + ఎఁడు సంధి 11 చే - కమికెఁడు తత్సమ 48 చే - కమికెఁడు + వు తత్సమ 57 చే - కమికెఁడు ఇట్లే, కొడిదిలి, దోసిలి, పిడికిలి, పుడిసిలి, సందిలి - అను వాని నుండి రూపములను సాధించుకొనవలెను కమికిలి పరిమాణము దీనికిఁ గలదు ఇత్యాదిగా లౌకిక విగ్రహములు చూపి, ఎఁడు వర్ణకము విధింపవలెను

## దఘ్నార్థంబున బంటి కొలఁది లగు. 27

మోఁకాలిబంటి, మోఁకాలికొలఁది బొమ్మబంటి, బొమ్మకొలఁది.

వ్యా దఘ్నచ్ - అను సంస్కృత ప్రత్యయము యొక్క యర్థమున, బంటి, కొలఁది యను ప్రత్యయము లగును దఘ్నచ్ - అనునది ప్రమాణార్థమున నగును (ప్రమాణేద్వయ సజ్ దఘ్నఞ్ మాత్రచః (పాణి) = ప్రథమశ్చ ద్వితీయశ్చ, ఊర్ధ్వమానేమతో మమ - మ భా ) "మోఁకాలు + వు"+బంటి సమాస 25 చే - మోఁకాలు + బంటి సమాస 20 చే - మోఁకాలి+బంటి= మోఁకాలిబంటి అనుక్త న్యాయమున (తత్సమ 44) మోఁకాలి బంటి + సు. తత్సమ 57 చే - మోఁకాలి బంటి ఇట్లే మోఁకాలి కొలఁది మొ॥

విశే.- (1) కొలఁది - అను ప్రత్యయము కల్పాది సంస్కృత ప్రత్యయములవలెఁ బదమను నట్లు భాసిల్లు చున్నది (11) దఘ్నార్థాదులు ప్రథమాంత ములపైఁ జేరును ప్రథమాంతాత్ద్వయసచ్, దఘ్నఞ్ మాత్రచ్ (బాలమ)

## అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్ర యోగంబుల నెఱుంగునది. 28

మంటమారి, తిండిపోతు తాచ్ఛీల్యంబున మారి, పోతు వర్ణకంబులు అడప = తాంబూల కరండవాహి మతుబర్థంబునంద ప్రత్యయంబు పెండ్లము=ఊఢ పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు ఇత్యాదు లూహ్యంబులు

ఇది తద్ధిత పరిచ్ఛేదము

వ్యా అర్థ విశేషములకు సంబంధించిన, తక్కిన ప్రత్యయములనుగూడ మహాకవి ప్రయోగములచేఁ దెలిసికొనవలెను మహత్ = గొప్పవారి యొక్క, ప్రయోగంబుల నని యర్థము మహాకవి ప్రయోగములచేత నని తాత్పర్యము "మంట + ము" + మారి, "తిండి + సు" + పోతు సమాస 25 చే-మంట మారి, తిండిపోతు, మంటమారి + సు, తత్సమ 48 చే - తిండిపోతు + వు తత్సమ 57 చే - మంటమారి, తిండిపోతు మంటమారి = మంట (మండుట) వీనికి శీలము తిండిపోతు = తిండి (తినుట) వీనికి శీలము అని లౌకిక విగ్రహ ములు చూపవలెను ఇవి తాచ్ఛీల్యమునన్నైనవి తచ్ఛీలము = ఆ వస్తువుయొక్క స్వభావము తచ్ఛీలము యొక్క భావము, తాచ్ఛీల్యము అడప - అడపము వీనికిఁ గలదు "అడప + ము" + అ సమాస 25 చే - అడప + అ సంధి 11 చే - అడప = తాంబూల కరండవాహి ఇట, మతు బర్థమున 'అ' ప్రత్యయము పెండ్లము - పెండ్లి వీనికిఁ గలదు "పెండ్లి + సు" + అము సమాస 25 చే - పెండ్లము+అమ సంధి 11 చే - పెండ్లము తత్సమ 48 చే. పెండ్లమ + వు 57 చే - పెండ్లము = ఊఢ ఇట, అము - మతుబర్థమున నైనది, ఇత్యాదు లూహింపఁదగును

విశే - (1) అడప - మతుబర్థములలో సంసర్గమున కుదాహరణము "భూమనిందా ప్రశంసాసు, నిత్యయోగేతిశాయినే, సంసర్గేస్తి వివక్షాయాం, భవంతిమతు బాదయః" (శ్లో వా ) ప్రశంసకుః-గుబ్బెత నిందకు -అటమటీఁడు నిత్యయోగమునకు - కడలి - భూమమునకు - తిండికాఁడు ఇత్యాది (11) తిండి పోతు - తిండి శబ్దము తిండి తినుట కుపలక్షణము "శీలమ్- (4-4-61) అపూప

భక్షణం శీలమస్య ఆపూపికః" (సి కౌ) "అపూవ శబ్దస్తద్భక్షణే లాక్షణిక ఇతి భావః" (బాలమ)

## వృత్తి సమన్వయము

జహత్స్వార్థా వృత్తిపక్షమున, దాశరథిః - అనుచో ప్రకృతి భాగము స్వార్థమును విడచును ప్రత్యయమే (ఇ ఞ్) దశరథాపత్యమను నర్థమును బోధించును అజహత్స్వార్థా వృత్తి పక్షమునఁ బ్రకృతి ప్రత్యయార్థములు పాంసూదక న్యాయమున మిళితములయి దశరథాపత్యమను నర్థమును బోధించును (వృత్తి వి)

ఇది ఘంటాపథము

# క్రియా పరిచ్ఛేదము



## ధాతువునకు. 1

ఇది యధికారసూత్రంబు ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగునని యెఱుంగునది

వ్యా ధాతువునకు - అనునది యధికారసూత్రము పరసూత్రములతో నన్వయించు సూత్రవిశేష మధికార సూత్రమనఁబడును ("అధిక్రియతే ఉపరితన సూత్రజాల శేషత్వేన పర్యత ఇత్యధికారః సి కౌ ) ధాతువునకు – అను నీసూత్రము దీని తరువాతఁగల క్రియా కృదంత పరిచ్ఛేద సూత్రములలో నను వృత్తమగును ప్రతిసూత్రమున ధాతువునకు-అనవలసిన క్లేశము తప్పుట యీసూత్ర ప్రయోజనము ఉదా॥ వర్తమానంబున లట్టగు (2) = వర్తమానం బున ధాతువునకు లట్టగు-ఇత్యాది

విశే - "అధికారోనామ త్రిప్రకారః కశ్చిదేక దేశస్థః సర్వశాస్త్ర మభి జ్వలయతి యథా ప్రదీపః సుప్రజ్వలితః సర్వం వేశ్మాభిజ్వలయతి అపరోధి కారో, యథా అయసావబద్ధం కోష్ఠమనుకృష్యతే తద్వదనుకృష్యతే చకారేణ అపరోధికారః ప్రతియోగం తస్మిన్నిర్దేశార్థ ఇతియోగే యోగే ఉపతిష్ఠతే " (మ భా )

## వర్తమానంబున లట్టగు. 2

వర్తమాన క్రియా వృత్తియగు ధాతువునకు లడ్వర్ణకంబగు. వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు , అప్పటికి ముగియ కుండునది

వ్యా వర్తమానమున దాతువునకు లట్-అను ప్రత్యయమగును వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకున్ = ప్రారంభింపబడి యప్పటికి ముగియకున్న

వ్యాపారమునందు వర్తించుట గలదియగు ధాతువునకు, లట్ - వర్ణకంబు = లట్ - అను ప్రత్యయ మగునని యర్థము వర్తమానమనఁగా ప్రారబ్ధ = ఆరంభింపఁబడినదై, అపరిసమాప్తంబు = పరిసమాప్తము కానిది (ప్రారబ్ధావరి సమాప్తత్వంవర్తమానత్వమ్- ల మ) ఆ వటుకుఁ బ్రారంభింపఁబడి వాక్య ప్రయోగ కాలమునకు ముగియనిదనియర్థము అప్పటికి ముగియకుండునది యని తాత్పర్యము వండుచున్నాఁడు — అనుచో వంట ప్రారంభింపఁబడినది కాని యింకను ముగియలేదు కావున నిది వర్తమాన కాలము ధాతువు = క్రియా వాచకము "క్రియావచనోధాతుః" (మ భా)

## భూతంబున లిట్టగు. 3

భూత క్రియా వృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు, భూతంబునా విద్యమాన ధ్వంస ప్రతియోగి ముందుండి యప్పటికి లేకుండునది

వ్యా భూతమున, ధాతువునకు లిట్-ప్రత్యయమగును భూత క్రియా వృత్తియగు ధాతువునకున్=ముందుండి యప్పటికి లేకుండు వ్యాపారమునందు వర్తించుట గలదియగు ధాతువునకు లిట్ ప్రత్యయమగును భూతమనఁగా విద్యమాన ధ్వంస ప్రతియోగి, విద్యమాన = ఒప్పుచున్న — అనఁగా నప్పటి కున్న, ధ్వంస = నాశమునకు, ప్రతియోగి = విరోధి ముందుండి యప్పటికి లేకుండునది అని సారాంశము ఉదా॥ వండెను వండుట యనువ్యాపారము ముందుండెను (ముందు = పూర్వకాలము) వాక్యప్రయోగ కాలమునకు ముగిసెను కనుక నప్పటికిలేదు కావున వండెను-అనునది భూతకాలము

విశే - (1) ధ్వంస మనఁగా నుత్పన్న మయిన వస్తువు నశించుటచే నయిన యభావము-దీనిని బ్రధ్వంసాభావమనియందురు (ఉత్పత్తేరనంతరం కార్యస్య తర్క-) చైత్రుఁడు నిన్న వండెను ఇట వండుటయన్న వ్యాపారమిప్పుడు లేదు. ఇప్పుడేమున్నదనఁగా, నాయుత్పన్నమయినవంట, ముగిసిపోవుటచే (నశించుటచే) నయిన యభావమిపుడున్నది ఇదే ప్రధ్వంసాభావము దీనికి విరోధి ముగియక ముందుండిన వంట ఈ ముగియక ముందుండిన వంటను దెలుపును గావున వండెను-భూతకాలము (11) క్రియ=కారకముల ప్రవృత్తి విశేషము క్రియ (కారకాణాం ప్రవృత్తి విశేషః క్రియా - మ భా) ఇది ఫలానుమేయము - దేవదత్తుఁడు వంటకమును వండెను దేవదత్తుఁడు - కర్తృ కారకము వంటకము - కర్మకారకము పాకమను ఫలముచేఁ గ్రియ యనుమేయము

## భావిని లృట్టుగు. 4

భావిక్రియా వృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు భావినా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి అప్పటికిఁ బుట్టకుండునది

వ్యా భావిని ధాతువునకు లృట్ ప్రత్యయ మగును భావిక్రియా వృత్తి యగు ధాతువునకున్ అప్పటికిఁ బుట్టకుండు వ్యాపారమునందు వర్తించుట గలదియగు ధాతువునకు, లృట్ - ప్రత్యయ మగును భావియినఁగా - విద్య మాన = ఒప్పుచున్న = అప్పటికున్న, ప్రాక్ + అభావ = వస్తువుయొక్క యుత్పత్తికి ముందున్న లేకపోవుటకు, ప్రతియోగి = విరోధి అప్పటికిఁ బుట్టకుండునది - అని సారాంశము ఉదా॥ వండఁగలడు - అనుచో వండుట యను వ్యాపారమింకను బుట్టలేదు పుట్టనున్నది కావున నిది భావియయినది

విశే - విద్యమాన ప్రాగభావ ప్రతియోగి - అను దానికి వివరణము - వస్తువు యొక్క యుత్పత్తికి ముందున్న లేకపోవుట ప్రాగభావము (ఉత్పత్తేః పూర్వం కార్యస్య - తర్క) వస్తువు యొక్క యుత్పత్తికి ముందేముండును? అనఁగా నావస్తువు యొక్క లేకపోవుట యుండును అదే ప్రాగభావము లేక పోవుటకు విరోధి - ఉండుట కనుక వస్తువు యొక్క యుత్పత్తికి ముందున్న యావస్తువు యొక్క లేకపోవుటకు (=ప్రాగభావమునకు) విరోధి - యుత్పత్తి కానున్న వస్తువు అదే భావి ఉదా॥ వండఁగలఁడు - అనుచో వంట యింకను జరుగలేదు జరుగనున్నది ఇప్పుడేమున్నది? అనఁగా నా జరుగనున్న వంట యొక్క లేకపోవుట యిప్పుడున్నది దీనినే ప్రాగభావమందురు దీనికి విరోధి జరుగనున్న వంట కనుక జరుగనున్న వంటను దెలుపు వండఁగలఁడు అనునది భావికాలమయినది అభావము ననుయోగియనియు, వస్తు స్థితిని ప్రతి యోగి యనియు నందురు

## తద్ధర్మాదులందు లాట్టుగు. 5

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు తచ్ఛీల సంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు

వ్యా తద్ధర్మాదులందు ధాతువునకు లాట్ - ప్రత్యయమగును తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకున్ = తద్ధర్మాది వ్యాపారములందు వర్తించుట గలదియగు ధాతువునకు, లాట్ ప్రత్యయమగును, తచ్ఛీలాదు లాదిపదముచే గ్రాహ్యములు-తద్ధర్మాదులు - తద్ధర్మము తచ్ఛీలము, సంభావన, సంప్రశ్నము,

సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు మొదలగునవి వీనిని గూర్చి - చూ 22 వ్యాఖ్య

విశే - ఇది సూరిగారు కల్పించిన క్రొత్తలకారము

**ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు. 6**

**ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు**

వ్యా ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి యను వానియందు ధాతువునకు లూట్ ప్రత్యయమగును దీని వివరణమునకు - చూ 26, 27 సూత్రములు

విశే - ఇది క్రొత్తగా సూరిగారు కల్పించిన లకారము

**వ్యతిరేకంబున లజీ యగు. 7**

**వ్యతిరేక విశిష్ట క్రియా వృత్తియగు ధాతువునకు లజీవర్ణకంబగు.**

వ్యా వ్యతిరేకమున ధాతువునకు లజీ ప్రత్యయమగును వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకున్ = వ్యతిరేకముతోఁ గూడుకొనిన వ్యాపారమునందు వర్తించుట గలదియగు, ధాతువునకు, లజీ ప్రత్యయమగును

విశే - లజీ - అనునది సూరిగారు కల్పించిన క్రొత్తలకారము

**లకారంబునకు డుఋవురున ముణ్ణగు. 8**

**లడాది లకారంబులం దాక్కొక్కటి డుజాదులాదేశంబులగు ఇందు ణకారంబు ప్రత్యాహారార్థంబు**

వ్యా లట్, లిట్, లృట్, లాట్, లూట్, లజీ - అను నాఱు లకారములతో, నొక్కొక్కదానికి, డుజ్ - రు, వు-రు, ను - ము - అను ప్రత్యయములాదేశము లగునని యర్థము సూత్రమున ముణ్ణగు - అను చోటఁగల ణకారము (ముణ్) ప్రత్యాహారము నిమిత్తము చేర్పఁబడినది సూత్రములోని యేవర్ణమునైన, ఇద్వర్ణముతో జోడించి వర్ణములను బ్రత్యాహరించుట (=సంగ్రహించుట) ప్రత్యాహారమనఁబడును కానఁ దుది యిద్వర్ణమగు, ణకారముతోఁ గూడిన మొదటి వర్ణము తనకును, ణకారమునకు మధ్యలోఁగల వర్ణములకును సంజ్ఞయగును (ఆదిరంత్యేన సహేతా అంత్యేనేతా సహిత ఆదిర్మధ్యగానాం స్వస్యచ సంజ్ఞా స్యాత్ - సి కౌ) ఇట్లేర్పడిన సంజ్ఞలు మూఁడు గలవు

(1) డుఞ్ = డుజ్ - రు - వు - రు - ను, ము, అను ప్రత్యయములు (26 సూ మొ॥) (2) రుఞ్ = రు - వు-రు-ను-ము ప్రత్యయములు (22 మొ॥) (3) వుఞ్ = వు, రు ను, ము - ప్రత్యయములు (18 మొ॥) డుజ్- రు, వు-రు, ను-ము, ము - అనునవి క్రియావిభక్తి ప్రత్యయములు

## అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబు లనంబడు. 9

డుజ్ - రు . ప్రథమము వు - రు మధ్యమము. ను-ము ఉత్తమము.

వ్యా డుజ్ - రు - వు - రు - ను - ము - అను క్రియా ప్రత్యయములలో మొదటి రెండు ప్రథమ పురుషము, తరువాతి రెండు మధ్యమ పురుషము, ఆ తరువాతి రెండు నుత్తమ పురుషము అనఁగా, డుజ్-రు=ప్రథమ పురుషము వు-రు- = మధ్యమ పురుషము నుఁ ము = ఉత్తమ పురుషము

## వానిలో రుములు బహువచనంబులు; పెఱలేక వచనంబులు. 10

వ్యా డుజ్ - రు, వు-రు, ను-ము - అను క్రియా ప్రత్యయములలో, రు-ములు బహువచనములు తక్కినవి యేకవచనములు రు - అని సాధారణ ముగ ననుటచేఁ బ్రథమ రువర్ణకము, మధ్యమ రువర్ణకము రెండును గ్రాహ్యము లగును కాన రు - రు-ము - అను మూఁడును బహువచనములు డుజ్ - వు - ను - మూఁడు నేక వచనములు

విశే - రు - ము లు బహువచనంబులు - అని సూత్రించుట సూరి సంక్షేప దృష్టికిఁ దార్కాణము

## నామ యుష్మ దస్మదర్థంబులందుం బ్రథమ మధ్యమోత్తమంబులగు. 11

వ్యా యుష్మ దస్మదర్థకముల కంటె వేఱయిన నామార్థమునఁ బ్రథమ పురుషమును, యుష్మదర్థమున మధ్యమ పురుషము, నస్మదర్థమున నుత్తమ పురుషమునగును కాఁగా, మధ్యమ పురుషము = ఏక్రియా ప్రత్యయములచే యుష్మదర్థకము కర్తగాఁగాని, (నీవు రక్షించుచున్నావు, మీరు రక్షించు చున్నారు) కర్మముగాఁగాని, (రక్షింపఁబడుచున్నావు, రక్షింపఁబడుచున్నారు) వాచ్యమగునో యా క్రియా ప్రత్యయములు (వు, రు - 9 సూ॥ ము, డుఞ్ ,

29 సూ) మధ్యమ పురుషము ఉత్తమ పురుషము = ఏ క్రియా ప్రత్యయములచే నస్మదర్థకము కర్తగాఁ గాని, (నేను రక్షించుచున్నాను, మేము రక్షించుచున్నాము) కర్మముగాఁగాని (రక్షింపఁ బడుచున్నాను, రక్షింపఁబడుచున్నాము) వాచ్యమగునో యాక్రియా ప్రత్యయము లుత్తమపురుషము (ను, ము - 9 సూ) ప్రథమ పురుషము = ఏ క్రియా ప్రత్యయములచే యుష్మదర్థకము, నస్మదర్థకము కాక వేఱయిన నామార్థము కర్తగాఁ గాని (వాఁడు రక్షించుచున్నాఁడు, వారు రక్షించుచున్నారు) కర్మముగాఁగాని (రక్షింపఁ బడుచున్నాఁడు, రక్షింపఁ బడుచున్నారు) వాచ్యమగునో యా క్రియా ప్రత్యయములు (డుఙ్, రు- 9 సూ, దు, వు, ది, వి - 12, ఎను, ను - 16) ప్రథమ పురుషము కర్త కర్మముల కుపాధిగా గమ్యమగు జీవచైతన్యము పురుషమనఁబడును (వాక్యవ) పాణిని దీనిని వాడలేదు

## అమహదర్థంబునందు డుఙ్రులకు దువులగు, నున్నాను బంధంబు మీఁద దివియగు 12

వ్యా అమహదర్థమున, డుఙ్ వర్ణకమునకు దువర్ణకమును, రు వర్ణకమునకు, వువర్ణకమును నగును ఉన్న - అనుబంధము మీఁద డుఙ్వర్ణకమునకు ది వర్ణకమును, రు వర్ణకమునకు 'వి వర్ణకమును' నగును డుఙ్రులకు దువులగుటకు - వండఁగల + డుఙ్ = వండఁగలదు వండఁగల + రు = వండఁగలవు (12 సూ) ఉన్నాను బంధము మీఁద ది వి - అగుటకు - వండుచు+ఉన్న+డుఙ్ = వండుచు+ఉన్న+ది వండుచున్నది వండుచు+ఉన్న+రు = వండుచు+ఉన్న+వి = వండుచున్నవి (15 సూ)

విశె - రువర్ణకములు రెండు గలవు (9) కాని, డుఙ్రు - అని డుఙ్ శబ్దముతోఁ గూర్పఁబడుటచేఁ బ్రథమపురుష రువర్ణకమునే యిట గ్రహింపవలెను సాహచర్యము కలదియు, సాహచర్యము లేనిదియుఁ దటస్థించినప్పుడు సాహచర్యము కలదానినే గ్రహింపవలయునని పరిభాష (సహచరితా సహచరితయోః సహచరితస్యైవగ్రహణమ్ - పరిభా) కనుక డుఙ్ వర్ణకముతో సాహచర్యము గలది ప్రథమ రువర్ణకముగనుక (9 సూ) ప్రథమ రువర్ణకమునే యిట గ్రహింపవలెను కావున, వారువండఁగలరు-అనుదాని కమహత్వమున-అవి వండఁగలవు-అని యగును ఇట, వండఁగల+రు = వండఁగలవు - అయినది మీరువండఁగలరు దీని కమహత్త్వమున ఓ పక్షులారా! మీరువండఁగలవు - అని కాదు ఏలయన నీ సూత్రమున గ్రహింప నుద్దేశింపఁబడిన 'రు' వర్ణకము ప్రథమ రువర్ణకమే గాని మధ్యమ రువర్ణకము కాదు

## ఉదంతంబునకు లట్టుపరంబగునపు డున్నానుబంధంబగు. 13

ఉదంతంబయిన ధాతువునకు లట్టుపరంబగునపుడు, ఉన్న- అను శబ్దం బనుప్రయుక్తంబగు

వ్యా ఉదంతమగు ధాతువునకు లట్ - ప్రత్యయము పరమగునపుడు, ఉన్న-అను శబ్ద మనుబంధమగును ఉదాహరణమునకు : చూ 15 సూ

పదసార్థక్యము - ఉదంతంబునకు — అనుటచే - కలుగు + డుజ్ = కల+డుజ్ - అనుచో, కలుగున కాదేశమయిన, కల - ధాతువునకు ఉన్నానుబంధము కాదు (104 సూ)

## ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు. 14

వ్యా ఉన్నశబ్దము పరమగునప్పు డుదంతమగు ధాతువునకు 'చు' ప్రత్యయమగును ఉదాహరణములకు చూ 15, 46 సూ

విశే - ఉదంతంబునకు - అనునది పూర్వసూత్రము నుండి యను వృత్తమగును కూర్చుండు + ఉన్న 56చే - కూర్చ్ + ఉన్న = కూర్చున్న ఇట్టి చువర్ణకము ప్రసక్తము కాదు ఉదంత ధాతువునకే చువర్ణకము

పదసార్థక్యము - 13 సూత్రమున ఉన్నానుబంధమగునని విధింపఁబడెను ఈ సూత్రమున, ఉన్నానుబంధము పరంబగునప్పుడు-అనక ఉన్న శబ్దంబు-అనఁబడెను ఉన్నశబ్దంబు అనుటచే, 46చేనగు, ఉన్నవర్ణకము పరమయినప్పుడును, నీసూత్రముచే-చువర్ణకమగును కాఁగా ఉన్నానుబంధము (13 సూ ) పరమయినప్పుడును ఉన్నవర్ణకము పరమగునప్పుడును, (46) చువర్ణకమగును గనుక, ఉన్నశబ్దంబు-అని సూత్రింపఁబడెను చువర్ణకంబు, అని దీనిని వర్ణకముగ నిర్దేశించుటచే, 55చే- అను చున్నాఁడు అన్చున్నాఁడు అంచున్నాఁడు - మొదలగు రూపములు సిద్ధించుచున్నవి చూ 55

## ద్వితీయ తరంబగు డుజ్ఞు పరంబగునపు డున్నానుబంధంబునకు దీర్ఘంబగు. 15

ప్రథమము - వాఁడువండుచున్నాఁడు, వారువండుచున్నారు, అది వండుచున్నది, అవివండుచున్నవి

మధ్యమము - నీవు వండుచున్నావు మీరు వండుచున్నారు.

ఉత్తమము - నేను వండుచున్నాను, మేము వండుచున్నాము

వ్యా ది, వి ప్రత్యయములు కాక, తక్కిన డుజ్ - రు, వు రు, ను - ము అను ప్రత్యయములు పరములగునపుడు, ఉన్న - అను ననుబంధమునకు దీర్ఘమగును

ప్రథమ పురుషము - వండుచున్నాఁడు వండు-ధాతువు 2 చే వండు+లట్, 8 చే - వండు+డుజ్ లట్టున కాదేశమగుటచే, డుజ్ - అనునదియు లట్టు వంటిదే యగును (స్థానివదాదేశః - పాణి) 13 చే - వండు+ఉన్న+డుజ్ 14 చే - వండుచు+ఉన్న+డుజ్ ఈ 15 చే - వండుచు + ఉన్నా+డుజ్ సంధి 11 చే - వండుచున్నా+డుజ్ తత్సమ 19చే - వండుచున్నాఁడు సంజ్ఞా 15చే - సాధ్యపూర్ణము లేదు వండుచున్నారు - వండు-ధాతువు 2 చే - వండు+లట్ 8 చే - వండు + రు 13 చే - వండు + ఉన్న + రు 14 చే - వండుచు + ఉన్న + రు ఈ 15 చే - వండుచు + ఉన్నా + రు సంధి 11 చే-వండుచున్నారు అమహద్రూపములు - వండుచున్నది వండుచున్నవి - వండు - ధాతువు 2 చే - వండు + లట్, 8 చే - వండు + డుజ్, వండు +రు 13 చే - వండు + ఉన్న + డుజ్, వండు + ఉన్న + రు 14చే-వండుచు + ఉన్న + డుజ్, వండుచు + ఉన్న + రు 12 చే - వండుచు +ఉన్న + ది, వండుచు + ఉన్న + వి సంధి 11 చే - వండుచున్నది, వండుచున్నవి మధ్యమోత్తమ పురుషములకు, వండు ధాతువు 2 చే - వండు +లట్ 8 చే- వండు + వు, వండురు, (మధ్యమ) వండు + ను, వండు+ము (ఉత్తమ) 13 చే - వండు + ఉన్న + వు, వండు + ఉన్న + రు, వండు + ఉన్న + ను, వండు + ఉన్న + ము 14 చే - వండుచు+ఉన్న + వు, వండుచు + ఉన్న + రు, వండుచు + ఉన్న + ను, వండుచు + ఉన్న + ము ఈ 15 చే - వండుచు + ఉన్నా + వు, వండుచు + ఉన్నా + రు, వండుచు + ఉన్నా + ను, వండుచు +ఉన్నా +ము సంధి 11 చే - వండుచున్నావు, వండుచున్నారు, (మధ్యమ) వండుచున్నాను, వండుచున్నాము (ఉత్తమ)

విశే - (1) తిర్యక్కులు పాత్రలగునపుడు, అది వండుచున్నది అవి వండుచున్నవి - అని వండు ధాతు ప్రయోగమున కవకాశముండును (11) ఉన్న - లోని తుది వర్ణమునకే దీర్ఘము "అలోంత్యస్య" (పాణి)

పద సార్థక్యము - దివీతరంబగు - అనుటచే, ది - వి వర్ణకములు పరమగుచో, ఉన్నకు దీర్ఘమురాదు వండుచు + ఉన్న + ది = వండుచున్నది వండుచు + ఉన్న + వి = వండుచున్నవి 12 చే - డుజ్ వర్ణకమునకు,

ది - అనునది, రువర్ణకమునకు, 'వి' - అనునది యాదేశములగును ఆదేశము స్థానివంటిదగును గావున దివి వర్ణకములు దు ౹రుల వంటివే యగును కాన, దిపీతరంబగు - అనఁబడెను

## లిడ్లాట్టుల డుఙ్జున కెను నువర్ణంబులగు. 16

లిడా దేశంబగు డుఙ్జునకు, ఎను - అనునదియు, లాడాదేశం బగు డుఙ్జునకు, ను - అనునదియు నాదేశంబులగు

వ్యా లిట్టున కాదేశమగు డుఙ్జునకు ఎను - అనునది, లాట్టున కాదేశమగు డుఙ్జునకు, ను - అనునది యాదేశములగును వండు + లిట్టు 8 చే - వండు + డుఙ్ ఈ 16 చే - వండు + ఎను = వండెను - (18) వండు + లాట్టు= వండు + డుఙ్ ఈ 16 చే - వండును (22)

విశే - ఇగాగమమునకుఁ (17 సూ) బూర్వమే ఎను వర్ణకమును విధించుటచే వండెను - అనుచో, ఇగాగమ ప్రసక్తి లేదు చూ 18 విశే

## భూతంబునం దిగాగమంబగు. 17

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు

వ్యా భూతకాలమున ధాతువునకు, ఇగాగమమగును భూతార్థ = భూతార్థమునందు, వృత్తి = వర్తించునది, అగు, ధాతువునకుఁ జివర 'ఇ' అనునది యాగమమగునని యర్థము వండు + రు = వండు + ఇ + రు వండిరి - మొ॥ చూ 18 సూ॥

## లిట్టు వుఙ్జు పరంబగునపుడు తివర్ణకంబగు. 18

ఇకారంబుమీఁది కు, ను, వు, క్రియావిభక్తుల, యను సూత్రముచే రుఙ్జున కిత్వంబు ప్ర వండెను, వండిరి మ వండితివి, వండితిరి ఉ వండితిని వండితిమి

వ్యా లిట్టున కాదేశమయిన వు - రు, ను - ము - అను ప్రత్యయములు పరమగునప్పుడు ధాతువునకు 'తి' వర్ణకమగును లిట్టు భూతమున ధాతువున కగును (3 సూ) వుఙ్జు = వు - రు - ను - ము ప్రత్యయములు రుఙ్జు = రు వు రు ను ము - ప్రత్యయములు (8 సూ॥) ప్రథమ పురుషము - వండెను వండు - ధాతువు 3 చే - వండు + లిట్టు 8 చే - వండు + డుఙ్ 16 చే- వండు + ఎను సంధి 11 చే - వండెను వండిరి వండు - ధాతువు, 3 చే- వండు + లిట్టు 8 చే - వండు + రు, 17 చే - వండు + ఇ + రు,

సంధి 11 చే - వండి + రు తత్సమ 26 చే - వండిరి వండు + లిట్టు 8 చే - వు - రు లు, ను - ము లు చేరి - వండు + వు, వండు + ను, (మధ్యమ) వండు+ను, వండు+ము (ఉత్తమ) అగును ఈ 18 చే - వండు+తి + వు, వండు+తి + రు, వండు + తి + ను, వండు + తి + ము 17 చే - వండు+ఇ + తి + వు, వండు + ఇ + తి + రు, వండు + ఇ+తి+ను, వండు+ఇ+తి+ము సంధి 11 చే - వండితి+వు, వండితి+రు, వండితి + ను, వండితి + ము తత్సమ 26 చే - వండితివి వండితిరి, (మధ్యమ) వండితిని, వండితిమి (ఉత్తమ) అను రూపము లేర్పడును

విశే - 54 వ సూత్రమున ఎ కార పరకత్వమునకుఁ చేయు + ఎను - అని యుదాహృతము కాన, వండెను - అను దాని ప్రక్రియలో 17 చే - ఇగాగమము కాదని సూచితము (శ - ర శ) ఇంతేకాక 85 వ, సూత్రమున, ఎకార పరకత్వమునకు, నిగుడు+ఎను-అని యుదాహృతము కాన, వండెను-అను దాని ప్రక్రియలో, నిగాగమ ప్రసక్తి లేదనుట తెల్లము

## కలఙ్యనుబంధంబు లృట్టు పరంబగునపుడగు. 19

లృట్టుపరంబగునపుడు ధాతువునకు, కలజీ - అనునది యను ప్రయుక్తంబగు

వ్యా లృట్టు పరమయినప్పుడు ధాతువునకు, కలజీ అనునది యనుబంధమగును బావిని ధాతువునకు లృట్ ప్రత్యయ మగును (4 సూ) ఉదా - చూ- 21 సూ

## జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు 20

జీత్తు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు

వ్యా జీ - అనునది, యిద్వర్ణముగాఁ గల శబ్దము పరమయినప్పుడు, ధాతువు యొక్క ఉత్వమునకు, అత్వమాదేశమగును జీ + ఇత్ = జీత్ దీని తత్సమ రూపము - జీత్తు ఇత్ = చూ తత్సమ 19 ధాతువు యొక్క ఉత్వమునకు అత్వమాదేశమగునను వ్యాకరణ కార్యము సూచించుటకు, "జీ" అనునది చేర్పఁబడును ఉదా॥ చూ 21 సూ మొ॥ ధాతువు తుదనుత్వము లేనిచో నెట్లును "జీ" లోపించును 95 సూ

## కలజీ పడుజులు పరంబులగునపుడు నుగాగమంబగు 21

ద్రుతకార్యంబు

ప్ర, వండఁగలఁడు, వండఁగలరు, వండఁగలదు. వండఁగలవు

మ వండఁగలవు వండఁగలరు

ఉ వండఁగలను, వండఁగలము.

వ్యా కలఁజీ వడుఁజీ, అనునవి పరమగునప్పుడు ధాతువునకు, నుగాగమ మగును ప్రథమపురుషము వండఁగలడు - వండు - ధాతువు 4 చే - వండు+ లృట్టు 8 చే - వండు+డుఙ్ 19 చే - వండు + కలఁజీ+డుఙ్ 20 చే - వండ +కల+డుఙ్ - ఈ 21 చే - వండ+ను+కల+డుఙ్ తత్సమ 19చే- వండ+ను+కల+ఁడు ఇట, వండను - అనునది పదము కాదు కాన ద్రుత ప్రకృతికమనిపించుకొనదు కనుక, సంధి 16 చే - ద్రుతకార్యము కలుగదు, కాన "ద్రుతకార్యంబు" అని ప్రత్యేకించి యిటఁ జెప్పుటచే ద్రుతకార్యము చేయ వలెను వండను+కల+ఁడు, సంధి 16 చే - వండను+గల+ఁడు సంధి 17 చే - వండఁగలఁడు వండఁగలరు - వండు-ధాతువు 4 చే - వండు+ లృట్టు 8 చే - వండు+రు 19 చే - వండు+కలఁజీ+రు 20 చే - వండ+ కల+రు 21 చే - వండను+కల+రు "ద్రుతకార్యంబు" అనుటచే సంధి 16 చే - వండను+గల+రు సంధి 17 చే - వండఁగలరు అనుహాదర్థమున - వండఁగలవు, వండఁగలవు వండు - ధాతువు 4చే- వండు+లృట్టు 8చే- వండు+డుఙ్, వండు+రు 19చే- వండు+కలఁజీ+డుఙ్, వండు+కలఁజీ+ రు 20చే-వండ+కల+డుఙ్, వండ+కల+రు ఈ 21చే- వండను+కల+ డుఙ్, వండను + కల + రు 12చే- వండను + కల + దు, వండను+ కల+వు "ద్రుతకార్యము" అనుటచే సంధి 16చే- వండను + గల + దు వండను + గల + వు సంధి 17చే- వండఁగలదు, వండఁగలవు - మధ్య మోత్తమ పురుషములు - 4చే- వండు+లృట్టు 8చే- వు- రు, ను-ము, అనునవి యగును వండు + వు, వండు + రు, వండు+ను, వండు + ము 19చే- వండు + కలఁజీ + వు, వండు + కలఁజీ + రు, వండు + కలఁజీ + ను, వండు+కలఁజీ+ము 20చే- వండ+కల+వు, వండ+కల+రు, వండ+ కల+ను, వండ+కల+ము 21చే- వండను+కల+వు, వండను+కల+ రు, వండను+కల+ను, వండను+కల+ము ద్రుతకార్యంబు వండఁగలవు వండఁగలరు, (మధ్యమ) వండఁగలను, వండఁగలము (ఉత్తమ) వడుఁజీ - వరమగునప్పటి నుగాగమమునకు - చూ, 49 సూ॥

**లాట్టు రుఙ్ఞు పరంబగునపుడు దుగాగమంబగు. 22**

ప్ర వండును, వండుదురు

మ వండుదువు, వండుదురు

ఉ వండుదును, వండుదుము

లాదర్థంబులయం దోలి నుదాహరణంబులు వక్కాణించెద.

| | |
|---|---|
| తద్ధర్మంబు | కులాలుఁడు కుండలువానును |
| తచ్ఛీలంబు | జ్వలన జ్వాలంబు లుప్పరంబెగయును |
| సంభావన | ఇప్పుడు వాఁడింట నుండును |
| సంప్రశ్నము | ఉందునా? పోదునా? |
| సాతత్యము | సర్వంబునం దీశ్వరుఁ డుండును, సర్వం బీశ్వరుని యందుండును |
| వర్తమానంబు | మేన నిప్పుడుం బులకలు వొడమెడును వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబులగు |
| భావి | వాఁడు రేపు వచ్చును |
| ఆశీస్సు | శుభంబగును |

వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును.

వ్యా లాట్టున కాదేశమగు రు-వు-రు-ను- ము అను క్రియా ప్రత్యయములు పరమగునపుడు ధాతువునకు దుగాగమ మగును లాట్టు-తద్ధర్మాదులందు ధాతువునకగును (5సూ) రుఙ్ము=రు-వు-రు-ను-ము- అనునవి (8సూ) ప్రథమపురుషము - వండును వండు - ధాతువు 5చే - వండు + లాట్టు 8చే - వండు+డుజ్ 16చే- వండు+ను=వండును వండుదురు - వండు - ధాతువు 5చే- వండు+లాట్టు, 8చే- వండు+రు ఈ 22చే- వండు + దు + రు = వండుదురు మధ్యమోత్తమపురుషములు - వండు-ధాతువు 5చే- వండు+లాట్టు 8చే- వండు+వు, వండు+రు, (మధ్యమ) వండు+ను, వండు+ము (ఉత్తమ) ఈ 22 చే - వండుదువు, వండుదురు, వండుదును, వండుదుము లాట్టుయొక్క యర్థములందు వరుసగా నుదాహరణములు చూపఁబడును లాట్టుయొక్క యర్థములు, తద్ధర్మాదులు (5 సూ) తద్ధర్మము - తద్ధర్మమనఁగా-ఆ వస్తువు యొక్క ధర్మమని తాత్పర్యము ధర్మమనఁగా వృత్తి, జీవనోపాయము (ధర్మ=జీవే=జీవనోపాయే-శబ్దస్తో) కులాలుఁడు కుండలువానును కుండలు

వానుట కులాలుని ధర్మము 5చే. తద్ధర్మార్థమున, లాట్టు వాను+లాట్టు, 8చే. వాను+డుఙ్ 16చే. వాను+ను=వానును

తచ్ఛీలము - తచ్ఛీలమనఁగా- ఆ వస్తువుయొక్క నియతమయిన స్వభావ మని యర్థము. (నియత తత్ స్వభావే-శబ్దస్తో) జ్వలన జ్వాలంబు లువ్వరం బెగయును మింటికెగయుట యగ్నిజ్వాలల స్వభావము 5 చే. తచ్ఛీలమున, లాట్టు ఎగయు+లాట్టు 8 చే. ఎగయు + డుఙ్, 16చే. ఎగయు+ను= ఎగయును

సంభావన - సంభావన = క్రియయందు యోగ్యుఁడను నిశ్చయము (సంభావనం క్రియాసు యోగ్యతాధ్యవసాయః -(ముగ్ధ) ఇప్పుడు వాఁడింట నుండును=ఇప్పుడు వాఁడింట నుండఁదగినవాఁడనుట నిశ్చయమన్న మాట సంభావనార్థమున లాట్టు ఉండు + లాట్టు 8చే. ఉండు + డుఙ్ 16చే. ఉండు+ను=ఉండును

సంప్రశ్నము ఉపస్థితములయిన క్రియలలో, నేది యిష్టసాధనమో నిర్ణ యింపఁగోరి యడుగు ప్రశ్నము సంప్రశ్న మనఁబడును ఉందునా? పోదునా? ఉండుట, పోవుట యనునవి యుపస్థితములయిన క్రియలు వీనిలో నేది యిష్ట సాధనమో నిర్ణయింపనడుగుట, యిటఁగలదు కావున నిది సంప్రశ్నమున కుదా హరణమయినది ఉండుదును = ఉందును (58) పోవుదును=పోదును (98)

సాతత్యము - సతతమునుండునది సాతత్యము సర్వంబునందీశ్వరుం డుండును సర్వంబీశ్వరునియందుండును ఈశ్వరుఁడు సర్వమునందుండుట, సర్వము నీశ్వరునియందుండుట సతతము నుండునట్టిది 5 చే. సాతత్యమున లాట్టు ఉండు+లాట్టు 8 చే. ఉండు+డుఙ్ 16 చే. ఉండు+ను=ఉండును

వర్తమానము - మేన నిప్పుడుంబులకలు వొడమెడును 5చే. వర్తమాన మున లాట్టు పొడము+లాట్టు 8చే పొడము+డుఙ్ 16 చే. పొడము+ను చెప్పఁబోవు 23 చే. వర్తమానమున ఎడు, ఎడి, అనునవి ధాతువున కాగమము లగును కనుక 23 చే. పొడము+ఎడు+ను సంధి 11చే. పొడమెడును

విశే - మేనం బులక లిప్పుడుం బొడమెడ (మను 1.72)

భావి - వాఁడు తేవువచ్చును 5చే. భావ్యర్థమున లాట్టు వచ్చు+లాట్టు 8 చే. డుఙ్ 16 చే. వచ్చు+ను=వచ్చును

ఆశీస్సు ఆశీస్సు=దీవన శుభంబగును=శుభమగుఁగాక 5చే. ఆశీర్వచ

నమున లాట్టు అగు+లాట్టు 8చే- అగు+డుజ్ 16చే - అగు+ను=అగును (5వ, సూత్రమున నాశీరాదులనుటచె నిటళాపము గ్రాహ్యము దు ఖంబగును= దుఃఖమగుఁ గాక! అను, చెప్పు, పలుకు- మొదల గు వి వచ్యర్థములు వీనికి భూతకాలమున లాట్టు కొన్నిచోట్లఁ గనఁబడును అను + లాట్టు 8 చే- అను + డుజ్ 16చే- అను + ను = అనును అనఁగా, అనెనని యర్థము

విశే - సంప్రశ్నమును గొందఱు సామాన్య ప్రశ్నగా భావించుట సరి కాదు ఇది సమాధాన నిరపేక్షము, కింక ర్తవ్యతా నిర్ణయము తేలని సందర్భము లందు తనలోఁదాను వేసికొనెడి ప్రశ్నయే సంప్రశ్నము - ఇత్యాదిగాఁ గొందఱు సెలవిచ్చుటయు సరికాదు (I) 'సం ప్రశ్నః - సంప్రధారణమ్ తచ్చ ఉపస్థిత క్రియ యోర్మధ్యే ఏకతర క్రియాధర్మి కేష్టసాధనత్వ నిర్ణయేచ్ఛా యథా - కింభో వేద మధీయాయ ఉతతర్కమ్ ఇత్యాదౌ లిఙర్థః అత్రసోద్దేశ్యకత్వ సంబంధేన సంబోధ్య విశిష్టా మన్నిష్ఠాచ వేదాధ్యయన తర్కాధ్యయనాన్యతర భావనా, ఇష్టసాధనత్వ ప్రకారః నిర్ణయేచ్ఛా విషయః ఇతిబోధః" వై- భూ సా ద ఇందలి వేదము చదువుదునా? తర్కమా? అనుదానికి, ఉందునా? పోదునా? యనునది సరిపడుచున్నది "సంప్రశ్నః- సంప్రధారణం, విచారః తద్వాక ర్తవ్యమిదం వేత్యాదిరూపః (ల శ శే) దీనిని బట్టియు రెండు క్రియలు తటస్థింపవలెనని తెలియుచున్నది (లం న) (II) "కింనుఖలు భోవ్యాకరణ మధీయాయ? (నేను వ్యాకరణము చదువుదునా)? కాశిక ఇది జిజ్ఞాసాత్మక ప్రశ్న కానగును- "సంప్రశ్నః జిజ్ఞాసా యథా - కింభో వేదమధీయాయ?" (ముగ్ధ-దుర్గా) అనునది యిందుల కుపస్కారకము (III) "ఇదం కార్యం నవేతి విచార్య నిర్ధారణమ్ కింభో వ్యాకరణం భవానధీయాత" (నీవు వ్యాకరణము చదువుదువా!) బాలమ విచారణా పూర్వకమై నిర్ణయాకాంక్షతోఁ జేయు ప్రశ్నము సం ప్రశ్నమని యీ పక్షమునఁ జెప్పఁ దగును (లం న) కాఁగా నేక క్రియ యుపస్థితమయినపుడును సంప్రశ్నమున కవకాశము గలదు ఏక క్రియ విషయమునఁ జదువుదునా? యనుచోటఁ జదువ వలదా? యన్న ప్రశ్న గమ్య మగును కాన వేఱు వేఱు క్రియలే యుపస్థితములు కానక్కఱలేదు (IV) సంప్రశ్నమునకు లాట్టు - వాచకము అ-ద్యోతకము (V) ఇత స్తపస్వి కావ్యమ్ ఇతో గురుజనాజ్ఞా - కిమత్ర ప్రతిధాతవ్యమ్ (అభిజ్ఞా) ఇది వక్రోక్తి కోటరంబుదగఁజేయుదునో - వరవుడమోపి చేయుదునా (ఉద్యో 3-112) ఇది యుపాలంభోక్తి ఇవి సంప్రశ్నములనుట భ్రాంతికత

**లాట్టు రుఙ్ణు పరంబగునపు డెదగాగమంబును, ప్రథమ నువర్ణకంబు పరంబగునపు డెడు గెడి గాగమంబులున బహుళంబుగా నగు 23**

ప్ర వండెడును, వండెడిని, వండెదరు

మ వండెదవు, వండెదరు

ఉ వండెదను, వండెదము

వ్యా లాట్టున కాదేశమగు, రు, వు, రు, ను, ము ప్రత్యయములు పర మగునపుడు ధాతువునకు, ఎదగాగమమును, ప్రథమ ను వర్ణకము పరమగు నప్పుడు, ఎడు గాగమము, ఎడిగాగమము, బహుళముగా నగును రుఙ్ణు = రు, వు, రు, ను - ములు (8) లాట్టు = తద్ధర్మాదులందు లాట్టగు (5) ప్రథమ పురుషము - వండెడును, వండెడివి - వండు - ధాతువు 5 చే - వండు + లాట్టు 8 చే - వండు + డుఙ్ 16 చే - వండు + ను ఇది డుఙ్ - అను ప్రథమ పురుషమున కాదేశమయినది గనుక, ప్రథమ ను వర్ణకమయినది ఈ 23 చే - ధాతువునకుఁ జివర, ఎ డు ఆగమమయినచో - వండు + ఎడు + ను సంధి 11 చే - వండెడు + ను = వండెడును ఎడి-అనునది ధాతువునకుఁ జివర నాగమ మయినచో - వండు + ఎడి + ను, సంధి 11 చే - వండెడి +ను తత్సమ 26 చే - వండెడిని వండెదరు - వండు - ధాతువు 5 చే - వండు + లాట్టు 8 చే - వండు + రు ఇది లాట్టున కాదేశమయిన రుఙ్ణు కనుక, ఈ 23 చే - ధాతువునకుఁ జివర, ఎద - అనునది యాగమమయిన - వండు + ఎద + రు సంధి 11 చే - వండెదరు మధ్యమోత్తమ పురుష ములు - వండు ధాతువు 5 చే - వండు + లాట్టు 8 చే - వండు + వు, వండు + రు, (మధ్యమ) వండు + ను, వండు + ము (ఉత్తమ) ఈ 23 చే - వండు + ఎద + వు, వండు + ఎద + రు, వండు + ఎద+ను, వండు + ఎద + ము సంధి 11 చే - వండెదవు, వండెదరు, వండెదను, వండెదము

పద సార్థక్యము -ప్రథమ ను వర్ణకంబు - అనుటచే నుత్తమ నువర్ణకము పరమగుచో ఎడిగెడుగా గమములు కావు వండును ఇట్లు ఎదగాగమమే యగును వండు + ఎద + ను = వండెదను

**లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. 24**

వండితి, వండితివి, వండుదు, వండుదువు, వండెదు, వండెదవు

వ్యా లిట్టు యొక్క వకారమునకు, లాట్టు యొక్క వకారమునకు లోపము విభాషనగును భూతంబున లిట్టగు తద్ధర్మాదులందు లాట్టగు కావున భూతతద్ధర్మాద్యర్థక ప్రత్యయములలోని వకారమునకు లోపము విభాషనగునని తాత్పర్యము వండితి, వండితివి - వండు - ధాతువు 4 చే - వండు+లిట్టు 8 చే - వండు+వు, 18 చే - వండు+తి+వు 17 చే - వండు+ఇ+తి+వు సంధి 11 చే - వండితి + వు తత్సమ 26 చే - వండితివి ఈ 24 చే - లిట్టు యొక్క వకారమునకు లోపము కలిగిన, వండితి + ఇ, (వ్ + ఇ వకారము పోగా, ఇ - మిగులును) సంధి 11 చె - వండితి వకారము లోపింపనిచో, వండితివి, యని యుండును వండుదు, వండుదువు - వండు ధాతువు 5 చే - వండు + లాట్టు 8 చే - వండు + వు 22 చే - వండు + దు+వు = వండుదువు ఈ 24 చే-లాట్టు యొక్క వకారమునకు లోపము కలిగిన-వండుదు + ఉ సంధి 11 చే-వండుదు వకారము లోపింపనిచో- వండుదువు వండెదు వండెదవు - వండు - ధాతువు, 5 చే - వండు + లాట్టు 8 చే - వండు + వు 23 చే - వండు + ఎద + వు సంధి 11 చే - వండెద+వు = వండెదవు ఈ 24 చే - లాట్టు వకారము లోపించిన - వండెద + ఉ సంధి 11 చే - వండెదు వకారము లోపింపనిచో - వండెదవు

విశే - వకారంబునకు - అని కార ప్రత్యయముతో నిర్దేశించుటచే (వర్ణాత్కారః - పాణి) "వ్" అనునదే లోపించును లేనిచో — వండెదవు-అనునది వండెదు — అగుట కవకాశము లేదు

పార పరిశీలన - వండెదవు, వండెదు-అనుక్రమము ప్రథమ ముద్రణము నందుఁగలదు కాని తక్కిన రెండు చోట్లవలె లోపము వచ్చిన రూపము మొదటిదిగా నిర్దేశింపఁబడియుండుట సముచితము కాన వండెదు, వండెదవు - అను ముద్రణములు గ్రాహ్యము లననగును

## తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిడ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు. 25

చిలుకలు పలికెను, చిలుకలు పలుకును, చిలుకలుపలికెడును మేఘములు గర్జిల్లెను, మేఘములు గర్జిల్లును, మేఘములు గర్జిల్లెడును.

వ్యా తిర్యక్కులు, జడములు, వాచ్యములగునప్పుడు లిట్టు యొక్కయు, లాట్టు యొక్కయుఁ బ్రథమపురుష బహువచనమున కేకవచనమగును తిర్యక్కులు = పశుపక్ష్యాదులు జడములు = అచేతనములు తిర్యక్కులకు

చిలుకలు పలికెను - పలుకు = ధాతువు 4 చే - పలుకు + లిట్టు, 8 చే - పలుకు + రు ఈ 25 చే - చిలుకలు తిర్యక్కులు గనుక, లిట్టు యొక్క ప్రథమ బహువచనమగు, రు వర్ణకమునకు, నేకవచనమగును పలుకు+డుఙ్ 16 చే - పలుకు + ఎను సంధి 11 చే - పలుకెను 85 చే - పలికెను చిలుకలు పలుకును, చిలుకలు పలికెడును - పలుకు - ధాతువు 5 చే- పలుకు + లాట్టు 8 చే - పలుకు + రు చిలుకలు తిర్యక్కులు గనుక, లాట్టు యొక్క ప్రథమ బహువచనమగు రు వర్ణకమునకు నీ 25 చే - ఏకవచన మగును పలుకు+డుఙ్ 16 చే - పలుకు+ను 23 చే - పలుకు+ఎడు+ను - సంధి 11చే - పలుకెడును 85చే - పలికెడును ఎడు రానిచో - పలుకు+ను=పలుకును జడములకు మేఘములు గర్జిల్లెను - గర్జ్ - ధాతువు 63 చే - గర్జ్+ఇంచు=గర్జించు 71 చే - గర్జిల్ల్+ఉ=గర్జిల్లు 4 చే - గర్జిల్లు+లిట్టు 8 చే - గర్జిల్లు+రు మేఘములు జడములు గనుక, లిట్టుయొక్క ప్రథమ బహువచనమగు రువర్ణకమునకు ఈ 25 చే - నేకవచనమగును గర్జిల్లు+డుఙ్ 16 చే - గర్జిల్లు+ఎను సంధి 11 చే - గర్జిల్లెను మేఘములు గర్జిల్లును, మేఘములు గర్జిల్లెడును - 63 చే - గర్జ్+ఇంచు=గర్జించు 71 చే - గర్జిల్ల్+ఉ=గర్జిల్లు 5 చే - గర్జిల్లు+లాట్టు 8 చే - గర్జిల్లు+రు మేఘములు జడములు గనుక లాట్టుయొక్క ప్రథమ బహువచనమగు, రువర్ణకమున కేకవచనమగు డుఙ్వర్ణకమగును గర్జిల్లు+డుఙ్ 16 చే - గర్జిల్లు+ను 23 చే - ఎడుగాగమ మయినచో - గర్జిల్లు+ఎడు+ను సంధి 11 చే - గర్జిల్లెడును ఎడుగాగమము 23 చే - రానియెడల, గర్జిల్లు+ను=గర్జిల్లును

పారపరిశీలన - చిలుకలుపలికెను పలుకును, పలికెడును - అని ప్రథమ ముద్రణము పలికెను, పలుకును, పలికెను అని కొన్ని ముద్రణములు

**లూట్టు డుఙ్ఙున కెడు తవర్ణంబులు ద్రుతాంతంబులగు. 26**

| | |
|---|---|
| ఆశీస్సు | మీకుమేలుగలిగెడును, మీకుమేలుగలుగుతను. |
| శాపంబు | నీకు రాక్షసత్వంబు గలిగెడును, నీకు రాక్షసత్వంబు గలుగుతను |
| సంప్రార్థనంబు | హరి నను( గృప(గాంచెడును హరి నను( గృప గాంచుతను |

వ్యా లూట్టుయొక్క డుమ్ఙుపురుసుము ప్రత్యయములకు ద్రుతాంతము లగు, ఎడు, త, వర్ణకము లాదేశమగును ద్రుతాంతములనుటచే - ఎడును,

తను - అనునవి యాదేశములగును ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు;
దుఙ్ఞు=దుఙ్ - రు, వు, రు, ను, ము - అను క్రియాప్రత్యయములు (8) ఆశీస్సు-
ఆశీస్సనఁగా దీవన మీకు మేలుకలిగెడును కలుగు - ధాతువు 6 చే - ఆశీస్సు
నందు - లూట్టు కలుగు+లూట్టు 8 చే - కలుగు + దుఙ్ఞు ఈ 26 చే -
ఎడును, తను ఆదేశములగును - కలుగు+ఎడును సంధి 11 చె - కలుగెడును
85 చే - కలిగెడును కలుగు + తను = కలుగుతను శాపము = అమోఘ
వచస్కులగు మునులు మున్నగువారి తిట్టు శాపమనఁబడును నీకు రాక్షసత్వంబు
గలిగెడును నీకు రాక్షసత్వంబు గలుగుతను కలుగు - ధాతువు 5 చే -
శాపార్థమున, లూట్టు కలుగు+లూట్టు 8 చే - కలుగు+దుఙ్ఞు ఈ 26 చే -
కలుగు+ఎడును సంధి 11 చే - కలుగెడును 85 చే - కలిగెడును కలుగు+
తను = కలుగుతను సంప్రార్థనము సంప్రార్థనమనఁగా వేఁడుట, హరి
ననుఁగృపఁగాంచెడును హరి ననుఁగృపఁగాంచుతను 5 చే - సంప్రార్థనమున
లూట్టు, కాంచు+లూట్టు 8 చే - కాంచు+దుఙ్ఞు ఈ 26చే - కాంచు+ఎడును
సంధి 11 చే - కాంచెడును కాంచు+తను = కాంచుతను హరితన్ను రక్షింప
వలెనను వేఁడికోలు దీనిలోఁగలదు

విశే - (1) సంస్కృతమర్యాద ననుసరించు దుఙ్ఞు - అని సూత్రింపఁ
బడెను ఉత్తమ మధ్యమములలోఁ బ్రయోగములు మృగ్యములగుటచేఁ బ్రథమకే
లక్ష్యములు చూపఁబడెను (11) ఆశీస్సు="వాత్సల్యాత్ యత్రమాన్యేన కనిష్ఠ
స్యాభిధీయతే, ఇష్టావధారకం వాక్యమాశీః సాపరికీర్తితా' (శబ్దక) (111) శాపః=
అనిష్టం భూయాదిత్యేవమ్ ఆక్రోశే - శబ్దక అభిశాపః = బ్రాహ్మణ గురు
వృద్ధసిద్ధానాం అనిష్టాభిశంసనమ్ - విజయరక్షితః" శబ్దక

## విధియందు లూట్టునకు మాఱుగా, నది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు. 27

మైత్రుండు నానిర్దిష్ట కార్యంబు చేయునది వానికి నీవు
బాసటయయి యుండునది

వ్యా విధియందు, లూట్టునకు మాఱుగాఁ దచ్ఛబ్దమగు 'అది' అను
నదియు, దానిముందున్న ధాతువునకు నుగాగమును నగును లూట్టు ఆశీశ్శాప
సంప్రార్థనవిధులందు లూట్టగు (6సూ) ఇటవిధి గ్రహింపఁబడినది విధి =
ప్రేరణము - భృతులు మొదలగు నికృష్టులను (=హీనులను, తనకంటెఁ
దక్కువవారిని) గార్యమునందుఁ బ్రవర్తింపఁ జేయుట ఆజ్ఞయన్నమాట
(విధిః = ప్రేరణమ్ భృత్యాదేర్నికృష్టస్య ప్రవర్తనమ్ సికౌ) చేయునదిఓ

చేయు-ధాతువు 6చే- చేయు + లూట్టు 8చే - చేయు+డుఙ్లు ఈ 27చే - చేయు + ను + అది = చేయున్ + అది చేయునది ఉండునది - 6చే- ఉండు+లూట్టు, 8చే- ఉండు+వు ఈ 27చే - ఉండును+అది=ఉండున్+ అది ఉండునది

విశే - పక్షమున, ఉండు+వు 29 చే - ఉండుము

## ఎడుతల ద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు. 28

నీకు మేలుగలిగెడుమనియెను, నీకు మేలుగలుగుత మనియెను.

వ్యా ఎడు-త వర్ణకముల ద్రుతమున కచ్చుపరమగునపుడు మకార మాదేశమగును నీకు మేలుగలిగెడు మనియెను కలుగు-ధాతువు 6చే- కలుగు+ లూట్టు- 8చే- కలుగు + డుఙ్ 26చే - కలుగు + ఎడును సంధి 11చే - కలుగెడును 85చే- కలిగెడును కలుగు+తను=కలుగుతను కలిగెడున్+ అనియెను ఈ 28చే - కలిగెడుమ్+అనియెను=కలిగెడు మనియెను కలుగు తన్+అనియెను ఈ 28చే- కలుగుతమ్+అనియెను=కలుగుత మనియెను

విశే - తవర్ణకముతోడి సాహచర్యమున, ఎడు-అనునది 27 చే నయిన యాశీరర్థక ప్రత్యయమే యని గ్రహింపవలెను ఇది 23 చే నగు, తద్ధర్మా ద్యర్థకమయిన, ఎడు వర్ణకము కాదు "సహచరితా సహచరితయోః సహచరిత స్యైవ గ్రహణమ్" అని పరిభాష

## లూణ్మధ్యమ పురులకు ముడుఙ్లు లగు. 29

ఆశీస్సు దీర్ఘాయువ వగుము, దీర్ఘాయుల రగుఁడు
శాపంబు రాక్షసుఁడ వగుము, రాక్షసుల రగుఁడు
సంప్రార్థనంబు నన్ను రక్షింపుము, నన్ను రక్షింపుఁడు
విధి నా చెప్పినపని చేయుము, నా చెప్పిన పనిచేయుఁడు

వ్యా లూట్టుయొక్క మధ్యమ పురుష వు వర్ణకమునకు, మువర్ణకమును, రువర్ణకమునకు, డుఙ్ వర్ణకమును నగును ఆశీశ్శాపసంప్రార్థన విధులందు లూట్టగు (6సూ) ఆశీస్సు - దీర్ఘాయువవగుము అగుము అగు-ధాతువు- 6చే- ఆశీస్సునందులూట్టు అగు+లూట్టు 8చే- అగు+వు ఈ 29చే- [illegible] అగుము దీర్ఘాయులరగుఁడు అగుఁడు 6చే- అగు+లూట్టు 8చే- [illegible] ఈ 29చే- అగు+డుఙ్ తత్సమ 19చే- [illegible] శాపము - రాక్షసుఁడవగుము

రాక్షసులరగుఁడు శాపార్థమున 6 చే. లూట్టు తక్కిన ప్రక్రియ పైవిధముగనే గ్రాహ్యము సంప్రార్థనము - నన్ను రక్షింపుము, రక్షింపుము - 63చే. రక్ష్+ ఇంచు=రక్షించు 6చే. సంప్రార్థనమున లూట్టు రక్షించు+లూట్టు 8చే. రక్షించు+వు ఈ 29చే. రక్షించు+ము 88చే. రక్షింపుము నన్ను రక్షింపుఁడు రక్షింపుఁడు - 63చే. రక్ష్+ఇంచు=రక్షించు 6చే. రక్షించు+లూట్టు 8చే. రక్షించు+రు ఈ 29చే. రక్షించు+డుఙ్ 88చే. రక్షింపు+డుఙ్, తత్సమ 19చే. రక్షింపుఁడు, విధి - నాచెప్పిన పని చేయుము నాచెప్పినపని చేయుఁడు చేయు-ధాతువు 6చే. విధియందు లూట్టు చేయు+లూట్టు 8చే. చేయు+వు, చేయు+రు ఈ 29చే. చేయు + ము=చేయుము చేయు + డుఙ్, తత్సమ 19చే. చేయుఁడు

విశే - విధియందు విధానసామర్థ్యమున నీ 29చే నగు ముడుఙ్లులనాఁపి 27-చే ఆదిశబ్దము ముందు నుగాగమముసగును చేయునది ఈ 29చే. చేయుము, చేయుఁడు-అనునవియు నగును

పారపరిశీలనము దీర్ఘాయు వగుము-అని ప్రథమ ముద్రణము తక్కిన రూపములను బట్టి దీర్ఘాయువ వగుము-అని యుండఁదగును ముద్రణమున 'వ' జాటిపోయి యుండును

## ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. 30

మనము వందుదము

జీత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు ననుసూత్రముచే లజీ పరంబగునపు డుత్వంబు

ప్ర వందఁడు, వందరు, వందదు, వందవు
మ వందవు, వందరు
ఉ వందను, వందము.

వ్యా యుష్మదర్థకము, నస్మదర్థకము నను రెండును, గర్తలుగా నున్నప్పుడు దుగాగమమున కత్వమగును ఉభయప్రార్థనము=తానును, నెదుటి వాఁడును గలిసి యొక పని చేయఁగోరుట ఇట్టిచోట్ల, యుష్మదర్థకము, నస్మదర్థకము రెండును గర్తలగుట జరుగును మనము వందుదము వందు-ధాతువు 6 చే. సంప్రార్థనమునందు లూట్టు వందు + లూట్టు 8చే. వందు+ ము లూట్టునకు దుగాగమము విధింపఁబడి యుండలేదు కాని యీ 30 సూత్రమున అత్వమును విధించిన సామర్థ్యముచే దుగాగమము, ఉత్వమున

కత్వము రెండునునగును కాన నీ 30-చే- వండు+దు+ము=వండు+ద్+అ+ము, వండుదము-అగును మనము = నీవును నేనును - లేదా మీరును మేమును, వండుద మని యర్థము లజికి — నిట నుదాహరణములు చూపఁబడెను ప్రథమపురుషము - వండఁడు - 7చే-వండు+లజి 8చే- వండు+డుజ్ 20చే- వండ + డుజ్ తత్సమ 19చే- వండఁడు వండరు - 7చే- వండు+లజి 8చే- వండు+రు 20చే-వండరు అనుహదర్థమున - వండదు, వండవు - వండు ధాతువు 7చే- వండు+లజి 8చే- వండు+డుజ్, వండు+రు 12 చే- వండు+దు వండు + వు 20చే- వండదు, వండవు మధ్యమోత్తమ పురుషములు - వండు-ధాతువు 7చే-వండు+లజి 8చే- వండు+వు, వండు+రు, (మధ్యమ) వండు+ను, వండు+ము (ఉత్తమ) 20చే-వండవు, వండరు, వండను, వండము

విశే - (1) దుగాగమంబున కత్వంబగుననుటచే, 22చే- నగు, దుగాగమమునకు సిద్ధించు వ్యాకరణకార్యములు దీనికిని సిద్ధించును (1) పోవుదము 98చే- పోదము-అగును (2) ఆకర్ణించుదము, 90చే- ఆకర్ణింపుదము-అగును (3) ఆకర్ణించుదము- 108చే- ఆకర్ణింతము - అగును (II) ఇట 22చే- దుగాగమ మయ్యెనను వ్యాఖ్యలు సరికావు ఆశీరాదులనుచోఁగల (5 సూ) యాది శబ్దముచే సంప్రార్థనమును దద్ధర్మాదులలోఁజేర్చి యిట 22చే- దుగాగమమగు ననరాదు ఆశీరాదులనుచో శాపము మాత్రమే గ్రహింపఁబడును, సంప్రార్థనము కాదు (చూ సంధి 12 వృత్తి) (III) కారక 36చే- అస్మత్కార్యము బలీయముగాన, వండుదము - అగును (IV) దు-లోని ఉత్వమునకే అత్వము అలోంత్యస్య (పాణి)

## మధ్యమ ముడుజ్జులు ముజ్జు నాఁబడు. 31

వ్యా మధ్యమపురుష ముడుజ్ వర్ణకములు, ముజ్జు - అనఁబడును ఈ ముడుజ్జులు 29చే - లూణ్యాధ్యమ వు రు ల కాదేశములయిననవని గ్రహింపవలెను డుజ్ - లోని జకారము తత్సమ 19 చే - ముందు బిందువగుటకుఁ జేర్పఁబడినది

విశే - ముడుజ్ = ముజ్ - అనుచోఁ ప్రత్యాహారము కాకున్నను ప్రత్యాహారచ్ఛాయ గోచరించును సంధి 49 శ్లో ముజ్జు-అను సంజ్ఞ వాడలేదు ప్రసంగవశమున నాయాపరిచ్ఛేదములలో విధించు ప్రత్యేకసంజ్ఞల నప్పటి నుండియే సూరివాడును చూ తత్సమ 20 సూ (II) మధ్యమముడుజ్జులు-అనుటచే, ప్రథమ డుజ్ వర్ణకము (డుజ్-రు-ప్రథమ-9) ఉత్తమ మువర్ణకము (ను-ము)

ఉత్తమ 9) గ్రహింపఁబడవు కాన, మేము వందము, వాఁడు వందఁడు-అను చోట్ల 32చే- కుజి ప్రసక్తముకాదు

## వ్యతిరేకంబున ముజ్ఞు పరంబగునపుడు కుజి యగు 32

**నీవు వందకుము, మీరు వందకుఁడు**

వ్యా వ్యతిరేకార్థమున, మధ్యమ ముదుజ్ఞులు పరమగునపుడు ధాతువునకు, కుజి-అగును ముజ్ఞు=మధ్యమ ముడుజ్ఞులు - 31 సూ వందకుము వందు-ధాతువు 6చే- వందు+లూట్టు 8చే- వందు+వు 29చే- వందు+ము ఈ 32చే- వందు+కుజి+ము 20చే వంద+కు+ము=వందకుము వందఁడు 6చే - వందు+లూట్టు 8చే - వందు+రు 29 చే - వందు+డుజ్ ఈ 32చే- వందు+కజి+డుజ్ 20చే- వంద+కు+డుజ్ తత్సమ 19చే- వందకుఁడు

విశే - వందుము, వందుఁడు - లూట్టు రూపములు పీని వ్యతిరేకరూపములు వందకుము, వందకుఁడు - అనునవి ఇవి 'లజి' రూపములను వ్యాఖ్యానములు సరికావు

## సంప్రార్థనంబుల ముజ్ఞున కదాదులు విభాష నను ప్రయుక్తంబులగు. 33

**వందుమ వందుమా, వందుమి, వందుమీ, వందుఁడ; వందుఁడా; వందుఁడి అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య ఇత్యాదు లదాదులు**

వ్యా సంప్రార్థనములందు మధ్యమ ముదుజ్ఞులకు, అదాదులు విభాషగ ననుప్రయుక్తము లగును వందుమ - వందు - ధాతువు 6 చే - వందు+లూట్టు 8 చే - వందు + వు 29 చే - వందు+ము ఈ 33 చే - వందుము +అ సంధి 11 చే-వందుమ వందుఁడ - 6 చే - వందు + లూట్టు 8 చే - వందు + రు 29 చే - వందు + డుజ్ తత్సమ 19 చే - వందుఁడు + అ సంధి 11 చే - వందుఁడ ఇట్లే తక్కినవి అదాదులను గూర్చి - చూ 34 వ్యాఖ్య

పద సార్థక్యము సంప్రార్థ నంబులన్ - అను బహువచన స్వారస్యముచే వ్యతిరేక ప్రార్థనాదులందును 'అదాదు' లగును వందకుమ, వందకుమా, వినకువె (34) మొ॥

పాఠ పరిశీలన సంప్రార్థనంబుల అని ప్రథమ ముద్రణ పాఠము సంప్రార్థనంబున - అను ముద్రణములు సరికావు

## ఎదాదు లనుప్రయుక్తంబులగు నపుడు ముజ్జునకు వుజి, రుజి, యగు. 34

వినవె, వినవే, వినరె, వినరే, వినకువె, వినకువే, వినకురె, వినకురే

వ్యా ఎదాదు లను ప్రయుక్తమయి నప్పుడు, మధ్యమ ముపర్ణకమునకు, వుజి - అనునదియు, మధ్యమ డుజ్వర్ణమునకు రుజి - అనునదియు, నాదేశము లగును 33 సూత్రమున - అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ, అయ్య, ఇత్యాదు లదాదులని చెప్పఁబడెను కనుక, ఎదాదు లనఁగా - ఎ, ఏ, ఒ, ఓ, అమ్మ అయ్య, యనునవి వినవె - విను - ధాతువు 6 చే - విను + లూట్టు 8 చే - విను + వు 29 చే - విను + ము 33 చే - విను + ము + ఎ ఈ 34 చే - విను + వుజి + ఎ 20 చే - విన + వు + ఎ సంధి 11 చే - వినవె ఇట్లే - వినుము + ఏ = వినవు + ఏ వినవే వినరె - 6 చే - విను + లూట్టు 8 చే - విను + రు 29 చే - విను + డుజ్ 33 చే - విను + డుజ్ + ఎ ఈ 34 చే - విను + రుజి + ఎ 20 చే - విన + రు + ఎ సంధి 11 చే - వినరె ఇట్లే - వినరే వినకువె - విను - ధాతువు 6 చే - విను + లూట్టు 8 చే - విను + వు 29 చే - విను + ము - 32 చే - విను + కుజి + ము 33 చే - విను + కుజి + ము + ఎ ఈ 34 చే - విను + కుజి + వుజి + ఎ 20 చే - వినకు + వు + ఎ సంధి 11 చే - వినకువె కుజిలోని ఉకారము ధాతూకారము కాదు కనుక వుజి-అను దానిచే - కు వర్ణముయొక్క ఉత్వమున కత్వము కాదు ఇట్లే వినకు+వు+ఏ= వినకువే - సాధించుకొ౯న నగును వినకురె - విను - ధాతువు 6 చే - విను + లూట్టు 8 చే - విను + రు 29 చే - విను + డుజ్ 32 చే - విను +కుజి +డుజ్ 33 చే - విను + కుజి + డుజ్ + ఎ ఈ 34 చే - విను + + కుజి + రుజి + ఎ 20 చే - వినకు + రు + ఎ సంధి 11 చే - వినకురె ఇట్లే వినకు + రు + ఏ = వినకురే - సాధింపనగును

విశే - (i) అమ్మ, అయ్య, శబ్దములు యథా ప్రయోగముగ నుభయ గణములలోఁ జేరును వినుమయ్య, వినవయ్య (ii) వుజి, రుజి క్రమముగా నగును (సంధి 13) (iii) నిలువంగ నీకురే (కాళహ 3 - 26) వినరం జూడకు రమ్మ (శృ శా 3 - 194)

పార పరిశీలన - వినవమ్మ, వినరమ్మ, వినరమ్మ, వినవయ్య, వినరయ్య.

అను రూపముల నీ సూత్రమునఁ గొందఱు ప్రక్షిప్తము చేసిరి ఇవి సాధువులే కాని సూరి వీని నుదాహరింపలేదు

## ట వర్ణకంబు భావంబు నందగు. 35

భావంబనఁగా ధాత్వర్థంబు,
వండుట, పండుట, వినుట, కనుట

వ్యా భావార్థమున, ధాతువునకు, ట ప్రత్యయమగును భావము=ధాత్వర్థము ఫలానుకూలమగు వ్యాపారము ధాత్వర్థమనఁబడును (ఫలానుకూలో వ్యాపారోధాత్వర్థః - బాలమ) ఇదే భావము వండుట వండు - ధాతువు వంట-ఫలము చేయుట - వ్యాపారము (కారక 2) వంటయను ఫలమును సాధించుట కనుకూలమగు వ్యాపారము (ధాత్వర్థము) ఈ భావార్థమున ట వర్ణకమయినది

విశే - భావము రెండు విధములు (1) సిద్ధరూపము = స్వతస్సిద్ధముగ జరుగు వ్యాపారము ఉదా॥ పండుట, పలించుట స్వతస్సిద్ధముగ జరుగును గనుక నిది సిద్ధరూప భావము (2) సాధ్యరూపము = సాధింపఁదగిన వ్యాపారము ఉదా॥ వండుట వంట యనునది యెవరో యొకరు సాధింపఁదగిన వ్యాపారము కాన సాధ్య రూపము "భావ = సాధ్యరూపే సిద్ధరూపేవా క్రియారూపే ధాతోరర్థే" శబ్దస్తో

## కజీ వర్ణకంబు పురార్థ యోగంబున విభాషను భావంబునందగు 36

వండక మునుపు, వండుటకు మునుపు చేయక మునుపు;
చేయుటకు మునుపు, మునుపు, ముందు, మున్ను, తొల్లి

వ్యా పురార్థముల యొక్క సంబంధమున, కజీ వర్ణకము విభాషను భావమునందగును పురా + అర్థ = పురార్థ పురా శబ్దము యొక్క యర్థము గలవి పురార్థములు మునుపు, ముందు, మున్ను, తొల్లి-పురార్థములు యోగము =సంబంధము అన్వయమన్న మాట భావము = ధాత్వర్థము (35) మునుపు-మొదలగు శబ్దములతో నన్వయ మున్నప్పుడు కజీ వర్ణకము విభాషగ, భావార్థమున ధాతువున కగు నని తాత్పర్యము వండక మునుపు వండు + మునుపు, ఈ 36 చే - వండు + కజీ + మునుపు = 20 చే - వండక మునుపు - కజీ-రానిచో - వండుటకు మునుపు-అని యుండును (కారక 12) చేయక మునుపు ఈ 36 చే - చేయు + కజీ + మునుపు 20 చే - చేయకమునుపు కజీ - రానిచో చేయుటకు మునుపు

## వ్యతిరేక భావంబున మిజి యగు. 37

వ్యతిరేక విశిష్ట క్రియాభిధాయి ధాతువునకు మిజి యగు. వండమి, పండమి

వ్యా వ్యతిరేక భావార్థమునందు ధాతువునకు మిజి - అగును వ్యతిరేక విశిష్ట = వ్యతిరేకముతోఁ గూడుకొనిన, క్రియా = వ్యాపారమును, అభిధాయి= బోధించునది, అగు ధాతువునకు మిజి - అగును భావము=ధాత్వర్థము (35) వండమి వండు - ధాతువు ఈ 37చే- వ్యతిరేక భావార్థమున మిజి వండు+ మిజి 20చే- వండమి, ఇట్లే పండు + మిజి = పండమి వండుట, పండుట- భావార్థకములు (35) వండమి, పండమి - వ్యతిరేక భావార్థములు

## సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకంబగు. 38

ఏకాశ్రయంబులగు క్రియల లోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచి యగు ధాతువున కివర్ణకంబగు ఇదియె క్త్వార్థంబు నాఁబడు పండి, వండి, విని, కని సమాన కర్తృకంబులనక సమానాశ్రయంబులనుటంజేసి చైత్రుని చేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె

వ్యా సమానాశ్రయములగు క్రియలలోఁ బూర్వకాలమున జరిగిన క్రియను దెలుపు ధాతువునకు ఇవర్ణక మగును సమానాశ్రయములు=ఏకాశ్రయములు ఏకవ్యక్తి నాశ్రయించినవని తాత్పర్యము వండి చైత్రుఁడు వండి గ్రామాంతర మేగెను ఇట వండుట, యేగుట-అని రెండు క్రియలుగలవు వండినవాఁడును, నేగినవాఁడును జైత్రుఁడే కనుక నివి సమానాశ్రయములగు క్రియలు ఈరెండు క్రియలలో వండుట యనుక్రియ గ్రామాంతర మేగుటయను క్రియకు ముందు జరిగినది కనుక వండు ధాతువునకు ఇవర్ణకమయి వండు+ఇ అగును సంధి 11చే - వండి - అని యేర్పడును ఈ, ఇవర్ణకమునే క్త్వార్థమని యందురు క్త్వార్థము = (క్త్వ+అర్థ) క్త్వ - అను సంస్కృత ప్రత్యయముయొక్క యర్థమున, ధాతువునకుఁజేరు ఇ ప్రత్యయము గనుక దీనిని క్త్వార్థమందురు ఇట్లే తక్కినవి సంస్కృతమున సమానకర్తృకములయందు క్త్వ ప్రత్యయము విధింపఁబడినది ("సమానకర్తృకయోః పూర్వకాలే"_పాణి) ఇట సమానకర్తృకములనక సమానాశ్రయములని సూత్రింపఁబడినది సమానాశ్రయములననుటచే- చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసెను ఇత్యాదులు సిద్ధించును ఈ వాక్యమున కొట్టుట, మడియుట అని రెండు క్రియలు గలవు కొట్టినవాఁడు

చైత్రుడు గనుక, కొట్టుటకుఁ గర్త చైత్రుఁడు మడిసినవాఁడు మైత్రుఁడు గనుక మడియుటకుఁ గర్త మైత్రుఁడు కావున నివి యేకకర్తృకములు కావు సమాన కర్తృకములందు-అని సూత్రించినచో, నిట్టి వాక్యములు సిద్ధింపవు సమానాశ్రయంబుల ననుటచే నిట్టివి సిద్ధించును ఎట్లనఁగా కొట్టఁబడిన వాఁడుని మడిసినవాఁడును మైత్రుఁడే కనుక, కొట్టఁబడుట మడియుట యనునవి యేకాశ్రయములయినవి ఈరెంటిలో కొట్టఁబడుట, మడియుటకు ముందుజరిగినది గావున కొట్టఁబడు - అనుదానికి ఇవర్ణకమయినది కొట్టఁబడు + ఇ సంధి 11 కొట్టఁబడి-అయినది

## కజి వ్యతిరేక క్త్వార్థంబునందగు. 39

వండక, పండక, కొట్టక, తిట్టక

వ్యా వ్యతిరేకక్త్వార్థమున ధాతువునకు కజి- అగును వండు-ధాతువు ఈ 39చే- వ్యతిరేకక్త్వార్థమున- కజి వండు + కజి 20చే- వండక ఇట్లే తక్కినవి వండి-క్త్వార్థకము దీనికి వ్యతిరేకము-వండక కనుక నిది వ్యతిరేక క్త్వార్థకము ఇట్లే తక్కినవి క్త్వార్థము=38 సూ

## తుమర్థ భావలక్షణంబులందు నుజి యగు. 40

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణ భూతంబగు క్రియ. తుమర్థమునందును, భావలక్షణము నందును ధాతువునకు నుజి వర్ణకంబగు

తుమర్థంబు — చైత్రుండు వండను బోయెను పాకక్రియార్థముపోయెననియర్థము

భావలక్షణము — చైత్రుండు వండ నతిథి వచ్చెను ఇట వంట లక్షణము వచ్చుట లక్ష్యము

వ్యా తుమర్థమునందును, భావలక్షణమునందును ధాతువునకు నుజి ప్రత్యయమగును తుమర్థము = ఏ క్రియ నిమిత్తము వేఱొక క్రియ జరుగునో యాక్రియ తుమర్థము చైత్రుండు వండను బోయెను పాకక్రియార్థము పోయెనని యర్థము ఇట వండుట, పోవుట- అని రెండు క్రియలు గలవు వండుట- అను క్రియ నిమిత్తము, పోవుట-అను వేఱొక క్రియ జరిగెను కావున వండుట- తుమర్థక్రియ (తుమున్ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్—పాణి) తుమర్థమ్మున వండు ధాతువునకు నుజి అయినది వండు+నుజి 20చే- వండను ఇట

నుజీ అనునది తుమ్-ప్రత్యయము యొక్క యర్థమున నయినది గనుక తుమర్థ మనఁబడును భావ లక్షణము = అన్యక్రియకు లక్షణభూతమగు క్రియ అనఁగా, నేక్రియచే, వేఱొక క్రియ లక్షితమగునో యాక్రియ (యస్యక్రియయా క్రియాంతరంలక్ష్యతే-సి కౌ) చైత్రుండు వంద నతిథి వచ్చెను ఇట, వంట= లక్షణము వచ్చుట = లక్ష్యము వండుట - అనునది, వచ్చుట యను క్రియ యెప్పుడు జరిగెనో సూచించుచున్నది కనుక వండుట యనునది భావలక్షణము భావలక్షణమున, ధాతువునకు నుజీ యగును (వండు+నుజీ 20 చే- వండను)

## చేదర్థంబునందు, వృత్తంబగు భావలక్షణంబునందు, నవర్ణకంబు ద్రుతాంతంబగు. 41

వానలు గురిసినం బంటలు పండును వాఁడు రమ్మనినఁ బోయితిని

వ్యా చేదర్థమునందును, వృత్తమగు భావలక్షణమునందును ధాతువునకు, ద్రుతాంతమగు నవర్ణకము - (నను) అగును చేదర్థము=చేత్-అను సంస్కృత శబ్దముయొక్క యర్థము (చేత్-యద్యర్థేపక్షాంతరే-శబ్దస్తో) ఏని, ఎడల - మొదలగునవి చేదర్థములు భావలక్షణము = అన్యక్రియకు లక్షణ భూతమగు క్రియ (40) వృత్తము=కడచినది, (వృత్తం అతీతే-అమ) చేదర్థమునందు వానలుగురిసినం బంటలు పండును కురియు ధాతువు చేదర్థమున ధాతువునకు ద్రుతాంతమగు నవర్ణకము వచ్చి కురియు+నను-అగును 17చే- కురియు+ ఇ+నను, 54చే- కురిసు+ఇ+నను సంధి 11 చే - కురిసినను కురిసినను= కురిసినచో-అని యర్థము వృత్తమగు భావలక్షణము వాఁడురమ్మనినఁ బోయితిని రమ్మనుట — లక్షణము పోవుట లక్ష్యము పోవుట - అను నన్య క్రియకు లక్షణభూత మగుటచే రమ్మనుట - భావలక్షణ మయినది పోవుటకు ముందు రమ్మనుట జరిగెను గనుక నిది వృత్తంబగు భావలక్షణము ఈ 41చే- ద్రుతాంతమగు నవర్ణకమగును అను - ధాతువు ఈ 41 చే - అను + నను 17 చే - అను+ఇ+నను సంధి 11 చే - అనినను

విశే - నవర్ణకంబు ద్రుతాంతంబు - అనుటచే-51 చే- పడినను=పడ్డను- అని సాధించుట సులభమయ్యెను 57 చే - ఉండిన + ను = ఉన్న + ను ఉన్నను - అని ప్రక్రియ చెప్పుటకు వీలయ్యెను 51, 57 సూత్రములు చూడ నగును

## ఆనంతర్యంబున డువర్ణకంబు, ద్రుతాంతంబగు. 42

జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె

వ్యా ఆనంతర్యమున ధాతువునకు ద్రుతాంతంబగు తువర్ణకమగును, (డును) ఆనంతర్యము=అనంతరముయొక్క భావము అనంతరము=(నఙ్ + అంతర) అంతరములేనిది అంతరము = ఎడము, వ్యవధానము వ్యవధానము లేనప్పుడు - అనఁగా నల్పవ్యవధానమున నని తాత్పర్యము జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె తోఁతెంచుడున్ = తోఁతెంచిన యనంతరమున- అని యర్థము జాబిలి తోఁతెంచిన యనంతరము కువలయములు (కలువలు) వికసించునని కవిసమయము గనుక నిది యానంతర్యమని భావము సంజ్ఞా 12 సూత్రమున-కొట్టుడున్ - అని యుదాహరింపఁబడినది కొట్టుడున్=కొట్టిన యనంతరమున=కొట్టిన యత్యల్పకాలమున - అని గ్రహింపవలెను

విశే- సూచీ శతపత్ర న్యాయమున వ్యవధానము భాసిల్లని చోట్ల నానంతర్యార్థకమగును

## చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు. 43

చూచుచుం బోవుచున్నాఁడు, చూచుచుం బోయెను, చూచుచుం బోవఁగలడు

వ్యా ధాతువునకు, ద్రుతాంతమగు చువర్ణకము (చును) క్రియాన్వయమున శత్రర్థమునందగును శత్రర్థము=వర్తమానార్థము చూచుచుం బోవుచున్నాఁడు చూచు - ధాతువు ఈ 43చే- చూచు+చును=చూచుచును ఇట, చూచుచును - అనునది, పోవుచున్నాఁడు - అను క్రియతో నన్వయించుచున్నది పోవుచున్న కాలమునందే చూచుట యనునదియు జరుగును కనుకఁబోవుచున్న కాలమునకు, చూచుచున్ - అనునది వర్తమానమే యగును ఇట్లే చూచుచుంబోయెను - అనుచో, పోయెను - అన్నది భూతకాలమయినను పోవుచున్న కాలమునకు, చూచుట యన్నది వర్తమానమే యగు ననుకొనవలెను చూచుచుంబోవఁగలఁడు పోఁబోవు కాలమునకు చూచుచున్ - అన్నది వర్తమానమే యగుననుకొనవలెను

## తృవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియ లగు. 44

ప్రహరించెడి వాఁడు, ప్రహరించెడు వాఁడు ప్రహర్తయని యర్థము

వ్యా తృవర్థకముయొక్క యర్థమున, ధాతువునకు ఎడి-ఎడు-అను ప్రత్యయము లగును సంస్కృతమున తృచ్ అను ప్రత్యయము కర్త్రర్థమున విధింపబడియున్నది (ణ్వుల్ తృచౌ కర్తర్థే-సి కౌ) కావున, తృవర్థకార్థము= కర్త్రర్థము కర్త్రర్థమున దాతువునకు ఎడి, ఎడులగును వన్నియలు=వర్థకములు, ప్రత్యయములని భావము ప్రహరించెడివాఁడు ప్ర+హృ+ఇంచు 64చే-ప్రహరించు-ధాతువు ఈ 44చే- కర్త్రర్థమున, ఎడివర్థకము ప్రహరించు+ఎడి సంధి 11చే-ప్రహరించెడి ప్రహరించెడువాడు - ప్రహరించు + ఎడు = ప్రహరించెడు సమాస 9 చే - తచ్ఛబ్దము ప్రహరించెడివాఁడు, ప్రహరించెడువాడు ప్రహర్తయనియర్థము ప్రహర్తయనునది సంస్కృతమున, తృవర్థకాంతము వీనిని దద్ధర్మార్థ విశేషణములందురు (సంధి 33, 45 సూ) ఇవి యాధాతువు యొక్క యర్థము ధర్మముగాఁగల కర్తను దెలుపును కనుకఁ దద్ధర్మార్థ విశేషణములగును ప్రహరించెడివాఁడు = ప్రహరించుటయను వ్యాపారమున కాశ్రయుఁడన్నమాట

## వానికి లోపంబు బహుళంబుగా నగు. 45

ప్రహరించు వాఁడు, ప్రహర్త యని యర్థము

వ్యా ఎడి, ఎడు ప్రత్యయములకు లోపము బహుళముగ నగును వానికిన్- 44 సూత్రమున తృవర్థ కార్థమునందు ధాతువున కగు, ఎడి ఎడుల కని తాత్పర్యము ప్రహరించు+ఎడి, ప్రహరించు+ఎడు-అని 44చే అగును. ఈ 45చే- ఎడి-ఎడులు లోపించి ప్రహరించు-అని యేర్పడును (ప్రత్యయలోపే ప్రత్యయ లక్షణమ్-పాణి) సమాస 9 చే - ప్రహరించువాఁడు=ప్రహర్త ఎడి యెడులు లోపింపనిచో - ప్రహరించెడి వాఁడు, ప్రహరించెడు వాఁడు-అను రూపములుండును ఇదియుఁ దద్ధర్మార్థ విశేషణమగును చూ 44

## ఉన్న కలజి నవర్ణకంబులు భవద్భావి శతృక్త వదర్థంబులందగు. 46

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు కలజి వర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునందగు నవర్ణకంబు క్తవదర్థంబు నందగు ఇవి సత్వాభిధానంబునందగునని యెఱుంగునది సుబంత వాచ్యంబు సత్వంబు నాఁబడు వండుచున్నవాఁడు, వండఁగలవాఁడు, వండినవాఁడు

వ్యా ఉన్న వర్ణకము, "భవత్" శత్రర్థముననుు, 'కలజీ' వర్ణకము, భావి శత్రర్థముననుు, నవర్ణకము, క్తవదర్థముననుు, నగును భవత్ = వర్తమాన కాలము, క్తవదర్థము = క్తవత్ - ప్రత్యయము యొక్క యర్థము క్తవత్ ప్రత్యయము భూతార్థమున నగును (క్త క్తవతూనిష్ఠా భూతార్థవృత్తేర్ధాతోర్నిష్ఠాస్యాత్ - సి కౌ) కనుక, భూతార్థమున, నవర్ణకమగును ఈ మూఁడు ప్రత్యయములు సత్వాభిధానమున నగును సత్వము = సుబంతవాచ్యమని యిట నర్థము సుప్ + అంత=సుబంత సుప్పులనఁగా నామవిభక్తి ప్రత్యయములు. నామవిభక్తు లంతమందుఁగల శబ్దములు సుబంతములు సుబంతములచే సత్వము (ద్రవ్యము) బోధింపఁబడునప్పుడు - ఉన్న కలజీ న వర్ణకములగును వండుచున్నవాఁడు చైత్రుఁడు ఇట ఉన్న వర్ణకము సుబంత వాచ్యమగు చైత్రుఁడను ద్రవ్యమును బోధించును ఇట్లే కలజీ న వర్ణకములు చైత్రుని బోధించును ఉన్న వర్ణకమునకు వండుచున్నవాఁడు వండు ధాతువు ఈ 46 చే - వర్తమానార్థక శత్రర్థమున ఉన్న వండు + ఉన్న 14 చే - వండుచు+ఉన్న సంధి 11 చే - వండుచున్న సమాస 9 చే - వండుచున్న వాఁడు కలజీవర్ణకమునకు వండఁగలవాఁడు - వండు - ధాతువు ఈ 46 చే - భావిశత్రర్థమున- వండు + కలజీ 20 చే - వండ + కల 21 చే - వండను + కల సంధి 16 చే - వండును + గల సంధి 17 చే - వండఁగల సమాస 9 చే-వండగలవాఁడు నవర్ణకమునకు వండు - ధాతువు ఈ 46 చే - క్తవదర్థకమున, వండు + న 17 చే - వండు + ఇ + న సంధి 11 చే - వండిన సమాస 9 చే - వండినవాఁడు

విశే - (I) పచ్ + లట్ = పచ్ + శతృ పచత్ = వండుచున్న పచ్ + ల్ఋట్ = పచ్ + శతృ పచిష్యత్ = వండఁగల, పచ్+క్తవత్= పక్వవత్ = వండిన (II) ద్రవ్యము తిజంత వాచ్యమును నగును (వాక్యపభూయో 3)

పాఠ పరిశీలన - సత్వ - అను ప్రథమ ముద్రణ పాఠములను గొందఱు సత్త్వ - అనిద్విత కారకములుగ సవరించుట సరికాదు "సత్వ - వృ ఏకత కారః" శబ్దస్తో

## వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజియగు. 47.

వండని వాఁడు

ఎడి ప్రభృతి వర్ణ కాంతంబు లేడును ధాతుజ విశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు

వ్యా వ్యతిరేక తృవర్ణకార్థమున ధాతువునకు నిజీ - ప్రత్యయమగును తృవర్ణకార్థము = కర్త్రర్థము (44) వండనివాఁడు - వండు - ధాతువు ఈ 47 చే - వ్యతిరేక=తృవర్ణకార్థమున ధాతువునకు నిజీ వండు+నిజీ 29 చే - వండని సమాస 9 చే - వండనివాఁడు వండెడు, (వండు) వాఁడు - అను తృవర్ణ కార్థమున కిది వ్యతిరేకము ఎడి - మొదలగు ప్రత్యయము లంతమందుఁ గల శబ్దము లేడును ధాతుజ విశేషణములనఁబడును ఎడి ప్రభృతి వర్ణకాంతములు (1) ఎడి వర్ణకాంతము = వండెడి (2) ఎడు = వర్ణకాంతము = వండెను (44) (3) ఎడి, ఎడులు లోపించిన = వండు (45) (4) ఉన్న వర్ణకాంతము =వండుచున్న, (5) కలజీ వర్ణకాంతము = వండగల (6) సవర్ణకాంతము= వండిన (46) (7) నిజీవర్ణకాంతము = వండని (47) ఈ యేడును ధాతువుల నుండి పుట్టిన విశేషణములు గనుక ధాతుజ విశేషణము లనఁబడును

## లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికింగర్తయందు నగు. 48

సకర్మకంబునాఁ గర్మా కాంక్షోత్థాపకంబు అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు

వ్యా లకారాదులు సకర్మక ధాతువునకుఁ గర్త్రర్థంబునందును గర్మార్థము నందును నగును అకర్మక ధాతువునకుఁ గర్త్రర్థమందగును లకారాదులు=లట్టు, లిట్టు, ల్యుట్టు, లాట్టు, లూట్టు, లజీ, అను లకారములు మొదలయినవి లాఁతి= ఇతరము, సకర్మకేతరము అనఁగా నకర్మకము సకర్మకము = కర్మాకాంక్షో త్థాపకంబు కర్మయొక్క యాకాంక్షను బుట్టించునది ఆకాంక్ష = అన్వయము కొఱకు కొక పదము వేఱొక పదమును గోరుట అకర్మకము = కర్మాకాంక్షాను త్థాపకంబు కర్మ యొక్క యాకాంక్షను బుట్టింపనిది (యద్ధాతూ ద్వారణే కర్మాకాంక్షానియతా స సకర్మకః - యత్రనాస్తి సోకర్మకః - వై భూ) లకారాదులు సకర్మక ధాతువునకుఁ గర్త్రర్థమునందును గర్మార్థమునందును నగును ఉదా॥ వండు - ఇది సకర్మక ధాతువు ఏలన నిది కర్మాకాంక్షను బుట్టించును దేవదత్తుఁడు వంటకమును వండెను వండెను - అను క్రియ, వంటకమును - అను కర్మపదము నాకాంక్షించు చున్నది దీనిని వండెనను నాకాంక్ష రాఁగా వంటకమను కర్మయా యాకాంక్షను బూరించును కనుక వండు - సకర్మకము దీనికిఁ గర్త్రర్థమున లిట్టు, 3 చే - అయినచో వండెను- అను కర్త్రర్థక రూపమేర్పడును (18) కర్మార్థమున లిట్టు 3 చే, అయినచో

వండఁబడెను - అగును (49) అకర్మకమునకు లకారాదులు కర్త్రర్థకమున నే యగును ఏలయన నకర్మక ధాతువు కర్మమును గోరదు గనుకఁ గర్మార్థక రూపములు గలుగవు దేవదత్తుఁడు వచ్చెను వచ్చు - అకర్మ ధాతువు ఏల యన నిది కర్మ యొక్క యాకాంక్ష కలిగించుట లేదు కర్త్రర్థమున 8 చే - లిట్టు రాఁగా వచ్చెను - అని యేర్పడును (18)

విశే - (1) లకారాదులు - అని యాది శబ్దమును వాడుటచే భావార్థకాదుల కిట్టే గ్రాహ్యము సకర్మకమునకు - కర్త్రర్థమున కొట్టుట కర్మార్థమున కొట్టఁబడుట అకర్మకమునకు - కర్త్రర్థమున వచ్చుట (49) (11) ఫల వ్యాపారయోరేక నిష్ఠతాయామ కర్మకః, ధాతుస్త యోర్ధర్మిభేదే సకర్మక ఉదాహృతః (వై భూ సా 1 - 13)

## పడుఙ్యనుబంధంబు కర్మంబునందగు. 49

కొట్టఁబడుచున్నాఁడు, కొట్టఁబడుచున్నది, కొట్టఁబడుట కొట్టబడనివాఁడు

వ్యా కర్మార్థమున ధాతువునకు పడుఙి - అను ననుబంధ మగును కొట్టఁబడుచున్నాఁడు - కొట్టు — ధాతువు 2 చే - కొట్టు + లట్టు 8 చే — కొట్టు + డుఙ్ ఈ 49 చే - కొట్టు + పడుఙి + డుఙ్ 20 చే - కొట్ట + పడు + డుఙ్ 21 చే - కొట్టను + పడు + డుఙ్ సంధి 16 చే - కొట్టను + బడు + డుఙ్ సంధి 17 చే - కొట్టఁబడు + డుఙ్ క్రియా 13 చే - కొట్టఁబడు + ఉన్న + డుఙ్ 14 చే - కొట్టఁబడుచు + ఉన్న + డుఙ్ 15 చే - కొట్టఁబడుచు + ఉన్న + డుఙ్ 15 చే - కొట్టబడుచు + ఉన్నా + డుఙ్ సంధి 11 చే - కొట్టఁబడుచున్నా + డుఙ్ తత్సమ 19చే- కొట్టఁబడుచున్నాఁడు కొట్టబడుచున్నది - కొట్టు - ధాతువు 2 చే - కొట్టు + లట్టు 8 చే - కొట్టు + డుఙ్ ఈ 49 చే - కొట్టు + పడుఙి + డుఙ్ 20 చే - కొట్ట + పడు + డుఙ్ 21 చే - కొట్టను + పడు + డుఙ్ సంధి 16 చే - కొట్టను + బడు + డుఙ్ సంధి 17 చే - కొట్టఁబడు + డుఙ్ క్రియా 13 చే - కొట్టబడు + ఉన్న + డుఙ్ 14 చే - కొట్టఁబడుచు + ఉన్న + డుఙ్ 12 చే - కొట్టఁబడుచు + ఉన్న + ది సంధి 11 చే- కొట్టఁబడుచున్న + ది కొట్టబడుచున్నది కొట్టఁబడుట - కొట్టు - ధాతువు 35 చే - కొట్టు + ట ఈ 49 చే - కొట్టు + పడుఙి + ట, 20 చే - కొట్ట +పడు + ట 21 చే - కొట్టను + పడు + ట సంధి 16 చే - కొట్టను +బడు + ట సంధి 17 చే - కొట్టఁబడు + ట = కొట్టఁబడుట కొట్టఁ

బడనివాఁడు - కొట్టు - ధాతువు 47 చే - కొట్టు + నిజి ఈ 49 చే - కొట్టు +పడు + నిజి 20 చే - కొట్ట + పడు + నిజి 20 చే - కొట్ట + పడ +ని 21 చే - కొట్టను + పడ + ని, సంధి 16 చే - కొట్టను + పడ+ ని సంధి 17 చే - కొట్టఁబడ + ని = కొట్టఁబడని సమాస 9 చే - కొట్ట బడనివాఁడు

విశే - పడు- అనునది ధాతువున కనుబంధమయినను నిదియు ధాతువే కనుక నే, కొట్టఁబడు + ఎను = కొట్టఁబడియెను- అగును (50)

## గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించు గ్వ్రక్రంబుల కియుడాగమంబు విభాషనగు. 50

ఏక స్వర ధాతు ద్విస్వర ధాతువుల మీఁది యించుగ్వ్రక్రంబుల కియుడాగమంబు విభాషనగు గురుమంతంబగు ధాతువునకును, యాంతంబగు ధాతువునకును మీఁది యించుగ్వ్రక్రంబుల కియుడాగమంబు రాదు భుజ్ – ఇయ్ + ఇంచు భుజియించు పక్షంబున భుజించు గుణ – ఇయ్ + ఇంచు గుణియించు, గుణించు ఇంచు గ్వ్యవధానంబునం జేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది యాచ్, అర్థ-ఇత్యాదులు గురుమంతంబులు, వ్యయ - ఇది యాంతము యాచించు, అర్థించు, వ్యయించు, జి + ఇంచు – అనుచో నిత్యంబగుటం జేసి యయుగామంబు రాఁగా, యాంతంబగు టంజేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు నగు – ఇయ్ + ఇంచు నగియించు, నగించు, నగు – ఇయ్ + ఎను నగియెను, నగెను పడు – ఇయ్ + ఎను పడియెను, పడెను ఇత్యాదు లెఱుంగునది

వ్యా గురువులేనివి, యకారాంతములు కానివి, యగు నొక యచ్చుగాని రెండచ్చులుగాని కలిగిన ధాతువుల మీఁది యించుగ్వ్రక్రములకు ముందు 'ఇయ్' అనునది విభాషగ నాగమ మగును ఇయుట్ + ఆగమ = ఇయుడాగమ 'ట్' అనుదానితో నిర్దేశించుటచే, ఇంచుగ్వ్రక్రములకు ముందు, ఇయ్ - ఆగమ మగును 'ఇయు' లోని ఉత్వముచ్చారణార్థము చేర్చఁబడినది ఇయ్ - అనునదే

చేరవలసిన యాగమము ఉదా॥ భుజియించు - భుజ్ - ధాతువు ఇది గురు విరహితము ఏలయన, హల్లుతోఁ గూడిన వర్ణము సంస్కృత లక్షణము ననుసరించి గురువుకాదు, (లఘు సవ్యంజనం హ్రస్వమ్-ఋ ప్రా) లఘువేయగును భుజ్-సంస్కృత ధాతువు కనుక సంస్కృతము ననుసరించి యిది గురువులేనిది గానే భావింపవలెను ఇది యాంతముకాదు భుజ్ - దీనిలో, జకార మంతమునఁ గలదు గాని యకారములేదు ఇది యేక స్వర ధాతువు ఏలయన దీనిలో నొకటే యచ్చుగలదు (భ్ + ఉ + జ్ = భుజ్) దీనికి 63 చే- ఇంచుగాగమ మగును భుజ్+ఇంచు ఈ 50 చే- ఇంచుక్కు పరమగుటచే, ఇంచుక్కు నకు ముందు ఇయ్ - అనునది యాగమ మగును భుజ్ - ఇయ్ + ఇంచు = భుజ్ + ఇయించు భుజి యించు ఇయుడాగమము రానిచో - భుజ్ + ఇంచు = భుజించు గుణియించు - గుణ- ఇది గురువిహితము అయాంతము (=యకారాంతము కాదు) ద్విస్వరధాతువు ఏలయన దీనిలో రెండు స్వరములే యున్నవి (గ్ + ఉ, ణ్ + అ) 63 చే- గుణ + ఇంచు ఈ 50 చే- ఇంచుక్కునకు ముందు 'ఇయ్' అగమమగును గుణ - ఇయ్ + ఇంచు = గుణ + ఇయించు సంధి 11 చే- గుణియించు ఇయుడాగమము రానిచో - గుణ + ఇంచు సంధి 11 చే- గుణించు

సంస్కృత ధాతువుల కన్నింటికి, 63 చే- ఇంచుగాగమమగును కనుక సంస్కృత ధాతువులకు, ఇంచుక్కు పరమగుటయే తటస్థించునుగాని వక్రమ పరమగుట తటస్థింపదు ఉదా॥ భుజ్ 63 చే- భుజ్ + ఇంచు మొ॥ కావున సంస్కృత ధాతువులకు, ఇంచుక్కు పరమగునపుడే, ఇయుడాగమమగుటకు వీలుండును అచ్చిక ధాతువుల కన్ననో ఇంచుక్కు పరమగుటకు, వక్రము (ఎ) పరమగుటకు నవకాశ ముండును నగియించు - నగు - అచ్చిక ధాతువు 70 చే- నగు+ఇంచు ఈ 50 చే- నగు - ఇయ్+ఇంచు = నగు+ఇయించు సంధి 11చే నగియించు ఇయుడాగమమురానిచో, నగు+ఇంచు సంధి 11చే నగించు నగియెను నగు-ధాతువు 3 చే - నగు+లిట్టు 8 చే- నగు+డుఙ్ 16 చే- నగు + ఎను ఇట వక్రము పరమయినది ఈ 50 చే- నగు - ఇయ్+ ఎను = నగు + ఇయెను సంధి 11చే- నగియెను ఇయుడాగమము రానిచో - నగు + ఎను, సంధి 11 చే- నగెను ఇట్లే పడు+ఎను=పడియెను, పడెను

గురుమంతమగు ధాతువునకు, యకారాంత మగు ధాతువునకు, ఇయుడాగమమురాదు గురుమంతము=గురువుగలది యాచ్, అర్థ-ఇత్యాదులు గురుమంతములు (సంయోగేగురు, దీర్ఘంచ-పాణి) కనుక వీని యించుక్కులకు,

ఇయుడాగమమురాదు ఇవి సంస్కృత, ధాతువులుగనుక 63చే- ఇంచుగాగమ మగును కావున ఇంచుక్కులోని ఇకారమే కాని వక్రమము వరమగుట జరుగదు యాచ్-ధాతువు 63 చే- యాచ్ + ఇంచు = యాచించు అర్థ + ఇంచు సంధి 11చే- అర్థించు యాచించు + ఎను, ఇత్యాదులలో సంస్కృత ధాతువులకు వక్రమము వరము కాలేదు యాచ్-అనుదానికిని వక్రమమునకును, ఇంచుగాగమముచే వ్యవధానము కలుగుచున్నది వ్యయ-ఇది యకారాంత ధాతువు కావున దీని యించుక్కునకు ఇయుడాగమమురాదు వ్యయ+ఇంచు- సంధి 11చే- వ్యయించు

జయించు - జి-ధాతువు 63చే- జి+ఇంచు 64చే- జి+అయ్+ఇంచు సంధి 11 చే- జయ్+ఇంచు, యకారాంతములకు, ఈ 50చే- ఇయుడాగమము రాదు గనుక, జయ్+ఇంచు=జయించు-అగును జి + ఇంచు, అనుచో-ఈ 50చే- ఇయుడాగమము వచ్చుట కవకాశముగలదు ఏలయన జి-అనునది గురు విరహితము, అయాంతము, ఏకస్వరము నగు ధాతువు 64చే- జి + ఇంచు- అనుచో అయుగాగమ మగుటకును నవకాశము గలదు ఏలయన, జి+ఇంచు= అనుచో ఇకారమున కించుక్కు పరముగ నున్నది గనుక, అయ్-అనునది ఆగమము కావచ్చును ఈరెంటిలో నేది కలుగవలెను? అనఁగా, నేది ప్రబల మయినదో యదే కలుగవలెను ఈరెంటిలో అయుగాగమము నిత్యవిధి కనుక, అయుగాగమమే కలుగునని గ్రహింపవలెను నిత్యము = కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు (కృతాకృత ప్రసంగి నిత్యం తద్విపరీత మనిత్యమ్—పరిభా) రెండవసూత్రము ప్రవర్తించినప్పుడు, ప్రవర్తింపనప్పుడు, నే సూత్రమునకుఁ బ్రసక్తియుండునో యది నిత్యమని తాత్పర్యము ఇయుడాగమము (50) నిత్యముకాదు, అయుగాగమము నిత్యము (64) కాననిట, అయుగాగమే యగును

ఇయుడాగమము నిత్యముకాదు ఎట్లనఁగా - జి+ఇంచు 64 సూత్రముచే, అయుగాగమము కలుగనిచో ఇయుడాగమము కలుగవచ్చును కాని, అయుగాగమము కలిగినచో, ఇయుడాగమమునకుఁ బ్రసక్తిలేదు జి + ఇంచు - 64చే- జి+అయ్+ఇంచు సంధి 11చే- జయ్+ఇంచు-అగును అయుగాగమమయినప్పుడిది యాంతముగ మాఱును ఇయుడాగమము యాంతములకు రాదు కనుక, జయ్+ఇంచు-అనుచో, ఇయుడాగమమునకుఁ బ్రాప్తిలేదు కావున ఇయుడాగమము నిత్యముకాదు అయుగాగమమునిత్యము ఎట్లనగా జి+ఇంచు 50చే- ఇయుడాగమము కలుగనప్పుడు, అయుగాగమము కలుగవచ్చును ఇంతేకాక, ఇయుడాగమము కలిగినప్పుడును, అయుగాగమమునకుఁ బ్రాప్తికలదు జి+

ఇంచు ఈ 50చే- ఇంచుక్కునకుముందు, ఇయ్-ఆగమమగును ఏదిదేనికాగమ మగునో యది దానికవయవమగునని పరిభాష (యదాగమపరిభాష-తత్సమ 31) కావున ఇంచుక్కునకాగమమగుటచే, ఇయ్-అనునది ఇంచుక్కున కవయవ మగును అనఁగా జి-ఇయ్+ఇంచు=జి+ఇయించు - అగును 'ఇయించు' అను మొత్తమునకే యించుక్కు - అను సంజ్ఞ ప్రాప్తించును కావున 64చే- జి+ ఇయించు-అన్నప్పుడును, అయుగాగమము ప్రసక్తమగును కాఁగా, ఇయుడా గమము ప్రవర్తింపనప్పుడును, అయుడాగమము ప్రవర్తించినప్పుడు, అయుగాగ మమునకుఁ బ్రాప్తికలదు కావున అయుగాగమము నిత్యము రెండు సమాన బలములుగల సూత్రములు తటస్థించినచో, వానిలో నిత్యమయినది బలీయమని పరిభాష కావున, అయుగాగమము కలిగి, జి+ఇంచు=జి+అయ్+ఇంచు సంధి 11చే- జయ్+ఇంచు=జయించు-అగును

విశే (i) ఎ ఏ ఒ ఓలు వక్రములు ఇట ఎకారమే పరమగును (ii) ఙజ్ = 1½ మాత్ర, రెండు మాత్రలులేవు గాన గురువుకాదు మాత్రా కాలము 1/5 సెకెండు కాలము (వై పా 144 పు)

పాఠపరిశీలన - అర్థించు-అని కొన్ని ముద్రణములలోఁ గలదు ఇది ముద్రణ స్ఖాలిత్యముకానోపును అర్థించు-అనియే ప్రథమ ముద్రణము

## పడ్వాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు. 51

పడ్డ, పడిన, పడ్డను, పడినను పడు, ఇడు, చెడు, తగు, అను, కను, కొను, తిను, మను, విను, చను ఇవి పడ్వాదులు

వా పడు-మొదలగువాని, నవర్ణకమునకు, అత్వము, దుది హల్లునకు ద్విత్వమును విభాషనగును పడ్డ - పడు-ధాతువు 46చే- క్తవదర్థమున, నవర్ణకము పడు+న 17చే- పడు+ఇ+న సంధి 11చే- పడి+న ఈ 51చే నవర్ణకమునకు అత్వమును, తుదిహల్లునకు ద్విత్వమును గలిగినచో, పడ్ డ్+ ఇ+అ=పడ్డి+అ సంధి 11చే- పడ్డ ఈకార్యము కలుగనిచో పడిన-అని యుండును పడ్డను - పడు-ధాతువు 41చే- చేదాద్యర్థమున ద్రుతాంతమగు నవర్ణకము పడు+నను 17చే- పడు+ఇ+నను సంధి 11చే- పడి+నను ఈ 51చే- పడ్ డ్+ఇ+అను=పడ్డి+అను సంధి 11చే పడ్డను ఈ కార్యము కలుగనిచో పడి+నను=పడినను ఇట్లే - ఇడ్డ, ఇడిన, ఇడ్డను, ఇడినను- ఇత్యాదులు.

విశే॥- పడి+న-ఇత్యాదులలో నవర్ణకమున కంతటికి, అత్వమాదేశ మగును నవర్ణకములోని తుది అత్తునకుఁ గాదు ఏలయన, అత్వమున కత్వ మాదేశించుట వ్యర్థము కాన, "అలోంత్యస్య" (పాణి)-అను పరిభాష వర్తింపదు

## క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొను ధాతు వను ప్రయుక్తంబగు. 52

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు వండఁకొను చున్నాఁడు

వ్యా॥ క్రియయొక్క ఫలము కర్తకుఁ జెందునప్పుడు ధాతువునకు, 'కొను' ధాతు వను ప్రయుక్తమగును దీనినే యాత్మనేపదార్థమని యందురు (ఆత్మనే పదం స్యాత్ కర్తృగామిని క్రియాఫలే-సి కౌ) వండుకొనుచున్నాఁడు వండుటకు ఫలము భోజనము చేయుట ఇది కర్తకే చెందుచుండుటచే నిట, కొను ధాతు వను ప్రయుక్తమయినది వండుకొనుచున్నాఁడు = తాను భుజించు నిమిత్తము వంటచేయుచున్నాఁడని యర్థము-

## కొను ధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు. 53

వండికొనియె, వండుకొనియె

బహుళంబనుటచే యాంతంబునకు నిత్యంబు చేసికొనియె

వ్యా॥ ఆత్మనే పదార్థమగుకొనుధాతువు పరమగునప్పుడు ధాతువునకు ఇగాగమము బహుళముగా నగును వండికొనియె - వండు- ధాతువు 52చే- వండు+కొను 3చే- వండు + కొను + లిట్టు 8చే- వండు + కొను + డుజ్ 16చే- వండు + కొను + ఎను ఈ 53చే- వండు+ఇ+కొను+ఎను సంధి 11చే- వండి+కొను+ఎను క్రియా 50చే- వండి + కొను - ఇయ్+ ఎను = వండి + కొను + ఇయెను సంధి 11చే - వండికొనియెను- సంధి 20చే- వండికొనియె ఇగాగమము రానిచో - వండు + కొను + ఎను 50చే- వండు + కొను - ఇయ్ + ఎను = వండు + కొను + ఇయెను సంధి 11 చే- వండుకొనియెను సంధి 20చే- వండుకొనియె బహుళమనుటచే యకా రాంతములకు ఇగాగమము నిత్యముగా నగును అనఁగాఁ బ్రవృత్తియన్నమాట చేసికొనియె - చేయు ధాతువు 52 చే- చేయు + కొను 3చే- చేయు + కొను + లిట్టు 8చే- చేయు + కొను + డుజ్ 16 చే- చేయు + కొను +

ఎను ఈ 53చే- నిత్యముగ ఇగాగమము, చేయు + ఇ + కొను + ఎను 54 చే- చేసు + ఇ + కొను + ఎను సంధి 11చే - చేసి + కొను + ఎను క్రియా 50చే చేసి + కొను - ఇయ్ + ఎను = చేసి + కొను + ఇయెను సంధి 11 చే - చేసికొనియెను సంధి 20 చే - చేసికొనియె

విశే - కొను ధాతువనుటచే - దీనిని ద్విస్వర-ధాతువుగ గ్రహింపవలెనని సూచన వండు + కొను + ఎను - అనుచో 'వండుకొను' అన్నదెల్ల ధాతువనుకొనరాదు వండు + కొను - అని, కొను-విడి దాతువుగనే భావింపవలెను అప్పుడే యిది ద్విస్వరధాతువయి, 50 చే - ఇ యుడాగమము కలిగి వండుకొనియెను - వంటి రూపము తేర్పడును వండుకొండు - అనుచో సంధి 22చే - ఖండబిందువు కలుగకపోవుటకు, కొను - ప్రత్యేక ధాతువగుటచేతనే యని తెలియవలెను

## ఇకార వక్త్రంబులు క్త్వంబులందలివి పరంబగుచో యాకు సకారంబగు. 54

చేయు చేసిరి, చేసి, చేసికొను చేసెను, చేసెడిని ఇత్యాదు లెఱుంగునది

వ్యా పూర్వ సూత్రములలో వచింపఁబడిన, ఇకారము, ఎకారము పరమగు నప్పుడు, యకారమునకు, సకారమగును ఉక్త్వంబులు = వచింపఁబడినవి ఈ సూత్రమునకుఁ బూర్వసూత్రములలో వచింపఁబడినవి చేసిరి - చేయు-ధాతువు 3చే- చేయు+లిట్టు 8చే- చేయు+రు 17చే- చేయు + ఇ + రు 17చే- వచ్చిన ఇకారము, ఉక్తములందలి, ఇకారము ఏలయన నిది యీ 54 సూత్రమునకుఁ బూర్వము వచింపఁబడినది కాన యకారమునకు సకారము చేస్ + ఉ + ఇ + రు = చేసు + ఇ + రు సంధి 11చే- చేసి + రు తత్సమ 26చే- చేసిరి, చేసి - చేయు ధాతువు 38చే- చేయు + ఇ ఇది యీ 54 సూత్రమునకుఁ బూర్వము వచింపఁబడినది కనుక నుక్తంబులందలి దయ్యెను కాన యాకుసకారము చేస్ + ఉ + ఇ = చేసు + ఇ సంధి 11చే- చేసి యగును చేసికొను - చేయు-ధాతువు 52చే- చేయు+కొను 53చే- చేయు+ఇ+కొను ఈ ఇకారము 54 సూత్రమునకుఁ బూర్వమునందలిది గాన నుక్తంబులయందలి దయ్యెను ఈ 53చే - చేస్+ఉ+ఇ+కొను=చేసు+ఇ+కొను- సంధి 11చే- చేసికొను చేసెను - చేయు ధాతువు 3 చే- చేయు + లిట్టు 8చే- చేయు + డుజ్ 16చే- చేయు+ఎను ఇందలి వక్త్రము (=ఎకారము) పూర్వ స్సూత్రముల యందలిది కనుక నుక్షంబులందలి దయ్యెను కావున నీ 54చే-

యాకుసకారము - చేస్ + ఉ + ఎను = చేసు + ఎను సంధి 11చే. చేసెను చేసెడిని - చేయు-ధాతువు 5 చే. చేయు + లాట్టు 8చే. చేయు+ డుఙ్ఞు 16చె. చేయు + ను 23చే. చేయు + ఎడి + ను ఇందలి ఎకారము (వక్రము) పూర్వ సూత్రములయందలిది గాన నుక్తంబులయందలి దయ్యెను. కావున నీ 54 చే. చేస్ + ఉ + ఎడి + ను = చేసు + ఎడి + ను సంధి 11చే. చేసెడి + ను తత్సమ 26చే. చేసెడిని ఇత్యాదులు

విశే - యాకు సకారమగుట జాతి పరముగా గ్రహింపవలెను కావున యకార ద్విత్వమునకు సకార ద్విత్వమగును దయ్య + ఇ = దస్స + ఇ దస్సి (11) అగు+ఇ=అయ్+ఇ, అయి అగు+ఎను=అయెను ఇట్టిచోట్ల యకారమునకు సకారములేదు ఏలయన గకారమునకు యకారము నాదేశించుట వ్యర్థమగును 99, 100 సూ

పదసార్థక్యము - ఉక్తంబులందలివి- అనుటచే, నీ 54 వ సూత్రమునకుఁ బూర్వము వచించిన ఇకార వక్రములు పరములగునప్పుడే యాకు సకారమగును పర సూత్రములలో వచింపఁబడు ఇకార వక్రములు పరమగుచో యాకు సకారము రాదు ఉదా॥ చేయు+ఇంచు ఇట, ఇంచుగాగమము 70చే. నయినది ఈ 54 వ సూత్రమునకు 70 సూత్రము పరసూత్రమగుటచే నిట యాకు సకారమురాదు చేయు+ఇంచు=చేయించు ఇట్లే, అరయు + ఇక = అరయిక-కృదంత 12, చేయు+ఇ=చేయి-కృదంత 22

## చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వ లోపంబేని, నుస్థానంబున బిందువేని విభాషనగు. 55

అన్చున్నాఁడు, అంచున్నాఁడు, అనుచున్నాఁడు, అన్చును, అంచును, అనుచును అను, కను, కొను, తిను, మను విను ఇవి యన్వాదులు

వ్యా 'చు' ప్రత్యయము పరమగుచో, అను- మొదలగువానికి, ఉత్వ లోపముగాని, ను అనుదాని స్థానమునఁ బూర్ణబిందువుగాని విభాషనగును అన్చున్నాఁడు, అంచున్నాఁడు - అను-ధాతువు 2చే. అను+లట్టు 8చే. అను+డుఙ్ 13 చే. అను+ఉన్న+డుఙ్ 14చే. అను+చు+ఉన్న+డుఙ్ 15చే. అను + చు+ఉన్నా+డుఙ్ ఈ 55చే అను-లో ఉత్వము లోపించినచో, అన్+ చు+ఉన్నా+డుఙ్=అన్చు+ఉన్నా+డుఙ్ - సంధి 11చే. అన్చున్నా+డుఙ్

తత్సమ 19చే- అన్చున్నాఁడు సంజ్ఞా 15చే- సాధ్యపూర్ణము లేదు అను+చు+ఉన్నా+డుఙ్ - అని యుండఁగా నీ 55చే- నుస్థానమునఁ బూర్ణబిందు వయినచో- అం+చు+ఉన్నా+డుఙ్ సంధి 11చే- అంచున్నా+డుఙ్ తత్సమ 19చే- అంచున్నాఁడు సంజ్ఞా 15చే- సాధ్యపూర్ణము లేదు ఉత్వలోపము, ను స్థానమున బిందువు, ననునవి కలుగనిచో - అను+చు+ఉన్నా+డుఙ్ సంధి 11చే-అనుచున్నా+డుఙ్ తత్సమ 19చే- అనుచున్నాఁడు సంజ్ఞా 15చె- సాధ్యపూర్ణము లేదు ఇవి సమాపకక్రియలు 14చె- అయిన, చుగాగమము పరమగునప్పటి రూపములకివి యుదాహరణములు అన్చును, అంచును - అను-ధాతువు 43చే- శత్రర్థమున ద్రుతాంతమగు చువర్ణకము అను+చును ఈ 55చే- ఉత్వలోపము కలిగిన అన్ + చును = అన్చును, నుస్థానమున బిందువు కలిగిన అం+చును=అంచును ఈ రెండును గలుగనిచో- అనుచును తక్కిన, కను, తిను, మను, విను - అనువాని కిట్టి రూపము లేర్పడుట గుర్తింపనగును. అన్చును - మొదలగునవి 43 చే - నగు శత్రర్థక చువర్ణకము పరమగునప్పటి యుదాహరణములు

విశే - (1) అను + చును ఇట ఖండము నిల్పినను సంధి 22 చేఁ బూర్ణమగును కానఁ బూర్ణము నిలుపుట సులభము (11) ను స్థానంబున-అనుటచే బిందువు సర్వాదేశమయినది లేనిచోఁ దుది వర్ణమునకుఁ గావలసివచ్చును అలోంత్యస్య - పాణి

## ఉన్న శబ్దంబు పరంబగునపుడు డుండు ధాతువునకు లోపంబగు. 56

ప్ర ఉన్నాఁడు, ఉన్నారు, ఉన్నది, ఉన్నవి
మ ఉన్నావు, ఉన్నారు
ఉ ఉన్నాను, ఉన్నాము
ఉన్నవాఁడు

వ్యా ఉన్న శబ్దము పరమగుచో, ఉండు ధాతువునకు లోపమగును ప్రథమ పురుషము ఉన్నాఁడు - ఉండు - ధాతువు 2 చే - ఉండు + లట్టు 8 - ఉండు + డుఙ్ 13 చే - ఉండు + ఉన్న + డుఙ్ ఈ 56 చే - ఉండు ధాతువు లోపించి ఉన్న + డుఙ్ 15 చే - ఉన్నా + డుఙ్ తత్సమ 19 చే - ఉన్నాఁడు, సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు ఉన్నాడు - ఉండు - ధాతువు 2 చే - ఉండు + లట్టు 8 చే - ఉండు + రు, 13 చే -

ఉండు + ఉన్న + రు ఈ 56 చే - ఉన్న + రు 15 చే - ఉన్నా + రు=ఉన్నారు అమహదర్థమున ఉన్నది, ఉన్నవి - ఉండు - ధాతువు 2 చే - ఉండు + లట్టు 8 చే - ఉండు + డుజ్, ఉండు + రు 13 చే - ఉండు + ఉన్న + డుజ్, ఉండు + ఉన్న + రు ఈ 56 చే - + డుజ్, ఉన్న + రు 12 చే - ఉన్న + ది = ఉన్నది, ఉన్న + వి = ఉన్నవి మధ్యమోత్తమ పురుషములు - ఉండు - ధాతువు 2 చే - ఉండు + లట్టు 8 చే - ఉండు + వు, ఉండు + రు (మధ్యమ) ఉండు + ను, ఉండు+ ము (ఉత్తమ) 13 చే - ఉండు + ఉన్న + వు, ఉండు + ఉన్న + రు, ఉండు + ఉన్న + ను, ఉండు +ఉన్న + ము ఈ 56 చే - ఉన్న+వు ఉన్న + రు, ఉన్న + ను, ఉన్న + ము 15 చే - ఉన్నావు, ఉన్నారు, ఉన్నాను, ఉన్నాము ఇవి 13 చే - ఉన్నాను బంధము పరమగునప్పటి యుదాహరణములు ఉన్నవాఁడు - ఉండు - ధాతువు 46 చే - ఉండు + ఉన్న ఈ 56 చే - ఉండు ధాతువు లోపించి ఉన్న - సమాస 9 చే - ఉన్న + వాఁడు = ఉన్నవాఁడు ఇది 46 చే - ఉన్న వర్ణకము పరమగుప్పటి యుదాహరణము

విశే - (1) ఉండు + ఉన్న + డుజ్, ఉండు + ఉన్న - 14 చే - ఉండు ధాతువునకు, చు వర్ణకము కావలెను గాని యీ 56 చే - నిమిత్తమగు ఉండు ధాతువునకు వినాశము (లోపము) కలుగఁబోవుచున్నది కాన, చు వర్ణకము కాదు (చూ 112) 72 సూత్రమున 63 చే - నగు ఇంచుక్కునకు లోపము చెప్పుట యీ ప్రక్రియనే బలపఱచును కొందఱు ఉండుచు + ఉన్న +డుజ్, ఉండుచు + ఉన్న - అని చువర్ణకము చేసి యదాగమ పరిభాషచే, ఉండుచు - అను మొత్తమే ఉండు ధాతువగుననియు, ఉండుచు అన్నదెల్ల లోపించుననియుఁ జెప్పుదురు కాని లోపింపవలసిన చు వర్ణకమును దెచ్చిపెట్టు క్లేశ మనావశ్యకము (11) ఉన్నాను బంధమే ప్రకృత్యర్థమును బోధించును

పద సార్థక్యము - ఉన్న శబ్దంబు - అనుటచే 13 చే నగు, ఉన్నాను బంధమును, 46 చే - నగు ఉన్న వర్ణకమును గ్రహింపఁబడును

## చేదాద్యర్థ నాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాషనగు. 57

ఉన్నను, ఉండినను

వ్యా చేదాద్యర్థకమగు, న వర్ణకమంతమందుఁ గలిగిన ఉండు ధాతువునకు, ఉన్న - అను నాదేశము విభాషనగును, ఉండిన అనునది చేదాద్యర్థ

నాంతమగు ఉండు ధాతు రూపము ఎట్లనఁగా, ఉండు - ధాతువు 41 చే - ఉండు + న + ను 17 చే - ఉండు + ఇ + న + ను సంధి 11 చే- ఉండిన + ను ఈ 57 చే- ఉండిన - అనుదానికి ఉన్న - ఆదేశమయిన, ఉండిన + ను = ఉన్న + ను ఉన్నను - అగను ఉన్నా దేశముకానిచో, ఉండినను అనియు నుండును చేదాద్వర్థకము చూ 41 సూ

విశే - 41 సూత్రమున, నవర్ణకంబు ద్రుతాంతంబగు-అని సూత్రింపఁబడెను అనఁగా ద్రుతము విడిగా విధింపఁబడెను కావున, ఉండిన+ను-అనుచో ఈ 57 చే - ఉండిన - అను దానికే ఉన్నా దేశమగును ద్రుతము మిగిలియే యుండును, కావున ఉన్నను - అను రూపము సిద్ధించును (11) చేదాద్వర్థక - అనుచో అది శబ్దముచే వృత్తమగు భావ లక్షణము (41 సూ) గ్రాహ్యము

## తిదుటలు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున సున్నయు నుండు డులోపంబును విభాషనగు. 58

అందురు, అంట, ఉందురు, ఉంట పక్షంబున అనుదురు. అనుట, ఉండుదురు ఉండుట - ఇత్యాది

వ్యా తి - దు ట, అనునవి పరమగునప్పుడు, "అను" మొదలగువాని, "ను" స్థానమునఁ బూర్ణబిందువును, ఉండు ధాతువున "డు" వర్ణలోపమును విభాషనగును అందురు అను ధాతువు 5 చే - అను + లాట్టు 8 చే- అను +రు 22 చే - అను + దు + రు ఈ 58 చే - దు - పరమగునపుడు, నుస్థానమున నిండు సున్న రాఁగా, అం + దు + రు అందురు నుస్థానమున సున్న రానిచో అనుదురు సున్న అనుటచే నరసున్నఁ జేర్చినను సంధి 22 చే - నది నిండు సున్నగా మాఱును కాని ప్రక్రియా గౌరవమగును కాన నిండు సున్ననే చేర్చుట గ్రాహ్యము అంట - అను - ధాతువు 35 చే - అను + ట ఈ 58 చే - 'ట' పరమగుచో నిండు సున్న కలిగిన యెడల అంట, అగును కలుగని యెడల - అనుట ఉందురు - ఉండు - ధాతువు 5 చే - ఉండు+ లాట్టు 8 చే - ఉండు+రు 22 చే - ఉండు+దు+రు ఈ 58 చే - ఉండు - ధాతువున 'డు' లోపము ఉం+దు+రు =ఉందురు డు లోపింపనిచో ఉండు+ దు+రు = ఉండుదురు ఉంట - ఉండు - ధాతువు 35 చే - ఉండు+ట - ఈ 58 చే - టవర్ణకము పరమగుచో - డు లోపము ఉంట డు-లోపింపనిచో, ఉండు+ట-ఉండుట తివర్ణకము పరమగునప్పటి యుదాహరణ మిటఁజూపఁబడలేదు, చూ-59 అన్వాదులు=అను, కను, కొను, తిను, మను, విను (55)

## ఇట బిందువు మీఁది తదలకు నిత్య వైకల్పికంబులయి ట డ లగు. 59

అంటివి, అనితివి అండురు, అందురు ఉంటివి, ఉండితివి, ఉండురు, ఉందురు

వ్యా అన్వాదుల "ను" స్థానమున బిందువును, ఉండు దులోపమును నయిన యీ ప్రకరణమునందు బిందువు మీఁది తకారమునకు నిత్యముగ టకార మగును, బిందువు మీఁది దకారమునకు వైకల్పికముగ డకారమగును అంటివి - అను-ధాతువు 3చే- అను+లిట్టు 8చే- అను+వు 18చే- అను+తి+వు తివర్ణ కము వరమగుటచే 58చే- అను-లోఁ నుస్థానమున బిందుసున్న యయినచో అం+తి+వు ఈ 59చే- తకారమునకు నిత్యముగ 'ట' కారమగును అం+ ట్+ఇ+వు=అంటి+వు తత్సమ 26చే- అంటివి 58చే- ను స్థానమున బిందువు కానిచో అను+తి+వు 17చే అను+ఇ+తి+వు-అగును సంధి 11చే- అనితి+వు-తత్సమ 26చె- అనితివి అండురు - అను ధాతువు 5చే- అను+లాట్టు 8చె- అను+రు 22చె అను+దు+రు 58చే- అం+దు+రు, ఈ 59చే- దకారమునకు వైకల్పికముగ డకారమగును డకారమయినచో అం+డ్+ఉ+రు=అండురు డకారముకానిచో - అం+దు+రు = అందురు ఉంటివి - ఉండు-ధాతువు 3చే - ఉండు + లిట్టు 8చే- ఉండు + వు 18చే- ఉండు+తి+వు 58చే- తివర్ణకము పరమగుచో, ఉండు, 'డు' లోపమయినచో ఉం + తి + వు ఈ 59 చే నిత్యముగ, టకారము ఉం+ట్+ఇ+వు= ఉంటి+వు తత్సమ 26చే- ఉంటివి 58చే- 'డు' లోపము కానిచో- ఉండు+ తి+వు 17చే- ఉండు+ఇ+తి+వు సంధి 11చే- ఉండితి+వు తత్సమ 26చే- ఉండితివి ఉండురు - ఉండు-ధాతువు 5చే - ఉండు + లాట్టు 8చే- ఉండు+రు 22చే- ఉండు+దు+రు 58చే ఉం + దు + రు ఈ 59చే- దకారమునకు డకారము కలిగినచో, ఉం+డ్+ఉ+రు=ఉండురు డకారము కలుగనిచో - ఉం + దు + రు = ఉందురు

పదసార్థక్యము - ఇట - అనుటచే - అన్వాదులకు, ఉండు శబ్దమునకు, సంబంధించియే యీ కార్యమగును అలందితిరి, అలందుదురు - మున్నగుచోట్ల ట డ ల ప్రసక్తి లేకుండుటకు, "ఇట" అనునది యావశ్యకము

## ముజ్ఞు పరంబగునపుడు కో శబ్దంబు కొనునకు బహుళంబుగా నగు 60

బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది

వ్యా మధ్యమ ముడుజ్ఞులు పరమగునపుడు కోశబ్దము కొను ధాతువునకు బహుళముగ నగును కొను + ము = కో+ము, కొను + డుఙ్ = కో+ డుఙ్ - అని యీ సూత్రముచేత నగును చూ 61 బహుళమనుటచె దీని కొకానొకచోట నతిచారము అతిచారము = అతిక్రమించి ప్రవర్తించుట, ముజ్ఞు పరమగునపుడే కాక యితర ప్రత్యయములు పరమగునపుడును, కొనునకు కో కనఁబడునని తాత్పర్యము ఉదా॥ పేర్కొనని=పేర్కోని కైకొనక=కైకోక కట్టుకొనఁదగునె = కట్టుకోదగునె - మొ॥ ఇట్లు జీత్తులు పరమగుచో, కొనునకు, 'కో' కన్పట్టును ముజ్ఞు = మధ్యమ ముడుజ్ఞులు (31)

## ముజ్ఞు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, ముపర్ణకంబునకు మూముడియు నగు. 61

కొమ్ము, కొనుము, కొండు, కొనుఁడు

వా మధ్యమ ముడుజ్ఞులు పరమగునప్పుడు దీర్ఘమునకు హ్రస్వమును, 'ము' ప్రత్యయమునకు మూముడియు నగును మూముడి = మకారము క్రింద వ్రాయు మకార చిహ్నము ఇట లేఖన చిహ్న మాగమముగ విధింపఁబడినది (తత్సమ 42, ప్రకీర్ణకము 7) ముజ్ఞు=మధ్యమ ముడుజ్ఞులు (31) కొమ్ము - కొను-ధాతువు 6చే- కొను+లూట్టు 8చె- కొను + వు 29చే- కొను+ము 60చే- కో+ము ఈ 61చే-దీర్ఘమునకు హ్రస్వము ముపర్ణకమునకు మూముడియు నగును కో+ము=కొ+మ్ము కొమ్ము 29చే - కొనునకు కో-ఆదేశము కానిచో, కొను+ము=కొనుము-అగును కొండు - కొను-ధాతువు 6చే- కొను+లూట్టు 8చే- కొను+రు 29చే- కొను+డుఙ్ 60చే- కో+డుఙ్ ఈ 61చే- దీర్ఘము నకు హ్రస్వము కొ+డుఙ్ తత్సమ 19చె - కొండు సంధి 22చే- అర సున్న రాదు

విశే - కొమ్ము - ఉద్యో 3-97, నిర్వ 10-62

## రువర్ణకంబు పరంబగునపుడు సున్న మీఁది త ద డ ల యుత్వంబునకు లోపంబు విభాష నగు. 62

పోషింత్రు, పోషింతురు, కొంద్రు, కొందురు, కొండ్రు, కొండురు

వ్యా 'రు' ప్రత్యయము పరమగునప్పుడు, పూర్ణబిందువు మీఁది త ద డల ఉత్వమునకు లోపము విభాష నగును సున్న మీఁది తకారమునకు పోషింతు+రు ఈ 62చే- పోషింత్ + రు = పోషింత్రు ఉత్వము లోపింపనిచో - పోషింతురు సున్న మీఁది దకారమునకు కొందు + రు ఈ 62చే- కొంద్+రు = కొంద్రు ఉత్వలోపము కానిచో - కొందు + రు = కొందురు సున్న మీఁది డకారమునకు కొండు+రు ఈ 62చే- కొండ్+రు=కొండ్రు ఉత్వము లోపింపనిచో కొండు+రు=కొండురు వీని ప్రక్రియ పోషింత్రు - పుష్ - ధాతువు 63 చే- పుష్ + ఇంచు 66చే- పోష్ + ఇంచు = పోషించు 5చే - పోషించు + లాట్టు 8చె- పోషించు+రు 22 - పోషించు+దు+రు 108చే- పోషింతు+రు ఈ 62 చె - పోషింత్ + రు = పోషింత్రు ఉత్వలోపము రానిచో-పోషింతురు కొంద్రు, కొండ్రు - కొను ధాతువు 5చే- కొను+లాట్టు 8చే- కొను+రు 22చే కొను+దు+రు 58చె- కొం+దు+రు ఈ 62చే- కొంద్+రు=కొంద్రు ఉత్వలోపము రానిచో- కొందురు దీని దకారము 59చే, డకారమయినచో - కొం+డు+రు ఈ 62చె- కొండ్+రు - కొండ్రు ఉత్వ లోపము రానిపక్షమున - కొండురు

విశే - కొండ్రు - ఈ 62చే- కొంద్+రు 59చే- కొండ్+రు=కొండ్రు- అని సాధించుకొన నగుననియు సూరి యీసూత్రమున డకారమును జేర్చుట వ్యర్థమనియుఁ గొందఱు సెలవిత్తురు కాని, కొందురు-అనుదానిలో ఉత్వము లోపించి కొంద్రు-అయినట్లె, కొండురు-అనుదానిలో ఉత్వము లోపించి, కొండ్రు- అగుట సహజమని సూరి యభిప్రాయము

పదసార్థక్యము - (1) సున్నమీఁది- అనుటచే, సున్న మీఁద లేని తదల ఉత్వమునకు లోపము లేదు ఉదా॥ పిలుతురు, చేయుదురు మొ॥ ఇట, తదల ముందు పూర్ణబిందువు లేదు గనుక, ఉత్వలోపములేదు (11) రువర్ణకంబు పరంబగునపుడు-అనుటచే వ్యవధాన మేర్పడి నప్పుడుత్వ లోపము లేదు ఉదా॥ పొందుదురు ఇట సున్నమీఁది దకారమునకు, రువర్ణకము పరము కాలేదు. 'దు' వర్ణముచే వ్యవధాన మేర్పడినది కనుకఁ ఉత్వము లోపింపదు

## సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు. 63

సంస్కృత ధాతువుల కంగలాదుల కించుగాగమంబగు పచించు, వచించు, త్యజించు, భజించు, అంగలించు, అంగల, అడక, ఆరగ, అవుల, ఉంక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలక, తులక, వంక, పరిక, పలవ, అప్ప, ఒప్ప, అల - ఇత్యాదు లంగలాదులు

వ్యా సంస్కృత ధాతువులకు, అంగల-మొదలగు నాచ్ఛిక ధాతువులకు, ఇంచుగాగమ మగును సంస్కృతధాతువులకు పచ్ - సంస్కృత ధాతువు ఈ 63చే- పచ్+ఇంచు=పచించు ఇట్లె వచ్+ఇంచు=వచించు, త్యజ్ + ఇంచు= త్యజించు, భజ్ + ఇంచు = భజించు అంగలాదులకు అంగల + ఇంచు సంధి 11- అంగలించు ఇట్లే, అడకించు మొ॥ అప్ప అప్పించు, అప్పగించు ఒప్ప ఒప్పించు, ఒప్పగించు (79 సూ )

## ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపు డయుగవు గరుక్కులగు. 64

జి. జయించు, నీ నయించు, ద్రు ద్రవించు, లూ లవించు. ధృ - ధరించు, తౄ తరించు

వ్యా ఇకారాంత సంస్కృతధాతువునకు, ఇంచుగాగమము పరమగునపుడు అయ్-అనునదియు, ఉకారాంతమునకు, అవ్-అనునదియు, ఋకారాంతమునకు అర్-అనునదియుఁ జివర నాగమము లగును ఇకారమునకు జయించు జి-ధాతువు, 63చే- జి + ఇంచు ఈ 64చే- జి + అయ్ + ఇంచు సంధి 11చే- జయ్ + ఇంచు = జయించు (చూ 50 వ్యా) ఇట్లే, నీ + ఇంచు = నయ్+ ఇంచు నయించు ఉకారమునకు ద్రవించు - ద్రు-ధాతువు 63చే- ద్రు+ఇంచు ఈ 64చే- ద్రు+అవ్+ఇంచు సంధి 11చే- ద్రవ్+ఇంచు ద్రవించు ఇట్లే లూ+ఇంచు=లవ్+ఇంచు లవించు ఋకారమునకు - ధరించు - 63చే- ధృ + ఇంచు ఈ 64చే- ధృ+అర్+ఇంచు సంధి 11చే- ధర్+ఇంచు ధరించు ఇట్లే తౄ + ఇంచు = తర్ + ఇంచు = తరించు

విశే - (1) అయుగవుగరుక్కులు = అయుక్ + అవుక్ + అరుక్ కకారముతో నిర్దేశించుటచే, నీయాగమములు నిర్దిష్టమునకుఁ జివరఁ జేరును అయు, అవు, అరు-అను వానిలోని ఉకార ముచ్చారణ కొఱకుఁ జేర్పఁబడినది.

కనుక అయ్, అవ్, అర్ - అనునవి చివర నాగమములయ్యెను (11) జయించు+ ఇంచు – అనుచో అవుగాగమము నివారించుటకు సంస్కృత ధాతువులకని వ్యాఖ్యానింపక స్వార్థేంచుక్కు పరమగునపుడే యగునని వ్యాఖ్యానించుట యావశ్యకమని కొందఱు సెలవిచ్చిరి కాని యది భ్రాంతి మూలకము ఇఉఋలకు- అనువోటి ఋకారమును బట్టియు నుదాహరణములను బట్టియు నీసూత్రము సంస్కృత ధాతువులయెడలనే వర్తించుననుట స్పష్టము జయించు-అనునది సంస్కృతధాతువు కాదు, సంస్కృత సమ ధాతువు (జి-సంస్కృతధాతువు) కాన అవుగాగమమునకుఁ బ్రసక్తియే లేదు (111) అయుగవుక్కులు వరుసగా నగును (సంధి 13)

## నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు. 65

నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు

నిర్జించు, నుతించు, స్తుతించు

ఈ జ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమంబగునని యెఱుంగునది శయనించు, పయనించు

వ్యా నిర్జికి, నామధాతువులకు, అయుగాగమము కలుగదు నిర్జి=నిర్ - పూర్వకమగు 'జి' ధాతువు నిర్+జి = నిర్జి నామధాతువు = నామమైయుండి, ఇంచుక్కు చేరి ధాతువుగా మాఱినది శయన - నామము = ప్రాతిపదికము శయన + ఇంచు = శయనించు-నామధాతువు ఇట్లే, పయన + ఇంచు = పయనించు – నామధాతువు నిర్జించు - నిర్+జి 63చే - నిర్+జి+ఇంచు 64చే- అయుగాగమము కలుగుచుండగా నీ 65చే - నిర్ పూర్వకమగు జి- ధాతువున కయుగాగమము నిషేధింపఁబడెను కాన అయుగాగమము లేదు సంధి 11చే- నిర్ + జి + ఇంచు = నిర్ + జించు నిర్జించు - అగును నామ ధాతువులకు నుతించు - నుతి - నామము 63 చే- ఇంచుగాగమ మయినప్పుడే 64చే - అయుగాగమము ప్రసక్తమగును నామములకు ఇంచుగాగమమే విధింపఁ బడలేదు కాని యీ 65 సూత్రమున, అయుగాగమమును నిషేధించుటచే నామములకు ధాతుత్వ వివక్షయందు 63చే - ఇంచుగాగమ మగునని గ్రహింప వలెను కాఁగా అయుగాగమ నిషేధముచే 63చే - ఇంచుక్కు కలిగి నుతి+ ఇంచు - అగును 64 చే - అయుగాగమము ప్రాప్తించుచుండఁగా నీ 65 దానిని నిషేధించును కనుక సంధి 11చే - నుతించు - అగును ఇట్లే స్తుతి+ఇంచు= స్తుతించు

జ్ఞాపకము=అనుమానము వలనఁదెలియనయినది, సార్వత్రికము కానిది, జ్ఞాపకమనఁబడును ఈ జ్ఞాపకఁబుచేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయందించు గాగమంబగునని యెఱుంగునది దీనికి వివరణము నామములకు ఇంచుగాగమము విధింపఁబడి యుండలేదు ఇంచు గాగమము లేనిదే 64 చే అయుగాగమము నకుఁ ప్రాప్తిలేదు ప్రాప్తిలేనిదే నామంబుల కయుగామంబులేదను నిషేధమునకుఁ దావులేదు కాన, నామంబుల కయుగాగమంబు లేదు - అనుటచే- నామములకు ధాతుత్వము వివక్షించినచో 63 చే - ఇంచుగాగమ మగునను విషయమనుమాన గమ్యమగును ఉదా॥ శయన - నామము దీనికి ధాతుత్వ వివక్ష యందు 63చే- ఇంచుగాగమము శయన+ఇంచు సంధి 11చే- శయనించు ఇట్లే వయన+ఇంచు=వయనించు

విశే - (1) జ్ఞాపక పద్ధతిలో నాలుగంశము లిమిడి యుండును. (1) వైయర్థ్యము=వ్యర్థత్వము ఇట నామంబులకు - అనునది వ్యర్థమయినది. ఏలయన నామములకు, ఇంచుక్కు విధింపఁబడలేదు గనుక, అయుగాగమము ప్రసక్తమే కాదు ప్రాప్తిలేని దానికి నిషేధ మనావశ్యకము కనుక, నామంబులకు - వ్యర్థము (2) అన్యార్థకల్పనము = వేఱొక యర్థమును గల్పించుట. నామములకు, అయుగాగమము లేదనుటచే ధాతుత్వ వివక్షయందు, నామముల కించుగాగమము కావచ్చునన్నది యన్యార్థకల్పనము (3) స్వాంశమునఁ జారితార్థ్యము = వ్యర్థమనఁబడిన పదము సూత్రమున వ్యర్థముకాక, విధింపఁబడ్డిన యంశమునందుఁ జరితార్థమగుట నుతి+ఇంచు, స్తుతి+ఇంచు - అను చోట్ల 64 చే - అయుగాగము ప్రాప్తించుచుండుటచే, అయుగాగమమును నిషేధించుటకు నామంబులకు - అన్నది యావశ్యకమగుచున్నది కావున నిది వ్యర్థముకాక అయుగాగమ నిషేధవిషయమునఁ (=స్వాంశమునఁ) జరితార్థమగుచున్నది ఇది స్వాంశమునఁ జారితార్థ్యము (4) అన్యత్రఫలము=వేఱుదాహరణములయం దుపయోగపడుట శయన - వయన, ఇవి నామములు వీనికి 64 చే- అయుగామము ప్రాప్తిలేదు అయినను, నామముల కయుగాగమము నిషేధింపఁబడుటచే ధాతుత్వ వివక్షయందు నామములకు ఇంచుగాగమ మగునను విషయమనుమానగమ్యమగుచున్నది కాన వీని కించుగాగమ మగును శయన+ఇంచు=శయనించు వయన+ఇంచు=వయనించు ఇట్లు - "అయు"గాగమ ప్రాప్తిలేని చోట్లను, ఇంచుగాగమ మగుట అన్యత్రఫలము (వెం సూ) (11) జ్ఞాపక పద్ధతిచే, నామముల కించుగాగమము సర్వత్ర కాదు ప్రయోగానుసారముగ గ్రాహ్యము (జ్ఞాపకసిద్ధం న సర్వత్ర = అనుమానాద్బోధన మసార్వత్రికత్వార్థ మిత్యర్థ పరిభా)

పదసార్థక్యము - నిర్జి - అనుటచే నిర్ - పూర్వకమయినప్పుడే - అయుగాగమము రాదు జి+ఇంచు=జయించు అనుచో అయుగాగమమగును

## సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు. 66

అ, ఏ, ఓ ఈ మూఁడును గుణంబులు నాఁబడు ఋస్థానికంబగు గుణంబు రపరంబయియుండు సంస్కృత ధాతూపధలకు ఇ, ఉ, ఋ - అను వానికి సొరిదిని, ఏ, ఓ అర్ - అనునవి యించుక్కు పరంబగునపు డగునని యెఱుంగునది

ఛిద్ ఛేదించు, భిద్ భేదించు, ఘుష్ ఘోషించు, పుష్ - పోషించు, వృష్ వర్షించు, హృష్ హర్షించు

వ్యా లఘువుపధగాఁ గలిగిన సంస్కృత ధాతువున కించుగాగమము పరమగునప్పుడు గుణమగును అ-ఏ-ఓలు గుణములు ఋకారమున కాదేశమగు గుణము=అకారము ఇదిరపరంబయి యుండును రేఫము పరమైనదై యుండునని యర్థము అ+ర్=అర్ - అన్నమాట (అదేఙ్ గుణః ఉరణ్ రపరః-పాణి) సంస్కృత ధాతువుల యొక్క ఉపధలగు, ఇ ఉ-ఋ-లకు, వరుసగా ఏ-ఓ-అర్, అనునవి యగును ఇకారమునకు ఏకారము, ఉకారమునకు ఓకారము, ఋకారమునకు, 'అర్' అనునది, యాదేశములగునని తాత్పర్యము ఉపధ=తుదివర్ణమునకు ముందు వర్ణము ఉదా॥ ఛిద్=ఛ్+ఇ+ద్ ఇట తుదివర్ణము దకారము (ద్) ముందువర్ణము - ఇకారము కనుక 'ఇ' అనునది యిట, ఉపధ ఇది లఘువు గనుక లఘూపధ (చూ 50) ఇట్లే తక్కినవి ఇకారమునకు ఛేదించు - ఛిద్ - సంస్కృత ధాతువు 63 చే - ఛిద్+ఇంచు ఈ 66 చే - లఘూపధయగు ఇకారమునకు ఏ కారము (గుణము) ఆదేశమయి ఛ్ + ఏ + ద్ + ఇంచు = ఛేద్+ఇంచు ఛేదించు - అగును ఇట్లే, భిద్+ఇంచు=భేద్+ఇంచు భేదించు ఉకారమునకు ఘోషించు - ఘుష్ - సంస్కృత ధాతువు 63 చే - ఘుష్+ఇంచు ఈ 66 చే - ఘ్+ఓ+ష్+ఇంచు=ఘోష్+ఇంచు ఘోషించు ఇట్లే, పుష్+ఇంచు=పోష్+ఇంచు పోషించు - అగును ఋకారమునకు - వర్షించు - వృష్ - సంస్కృత ధాతువు 63 చే - వృష్+ఇంచు ఈ 66 చే - వ్+అర్+ష్+ఇంచు=వర్ష్+ఇంచు వర్షించు ఇట్లే, హృష్+ఇంచు=హర్ష్+ఇంచు హర్షించు

విశే - (1) గుణవృద్ధి శబ్దాభ్యాం యత్రగుణ వృద్ధీ విధీయేతే తత్ర

'ఇకః' ఇతి షష్ఠ్యంతం పద ముపతిష్ఠతే (సి.కౌ 3½) (11) చిద్+ఇంచు - మున్నగుచోట్ల దకారాదులలో వ్యవధాన మున్నను గుణమగును (సంధి 12 విశే ౪)

పదసార్థక్యము - లఘూపధంబున కనుటచే గురూ పధమునకు గుణము కాదు ఊహ్+ఇంచు=ఊహించు

## స్పృశికి గుణంబు విభాషనగు. 67

### స్పర్శించు, స్పృశించు

వ్యా స్పృశ్ - ధాతువునకు, ఇంచుగాగమము పరమగునపుడు దాని లఘూపధకు గుణము విభాషనగును గుణము=ఏ ఓ అర్ అనునవి - గుణములు ఇకారమునకు - ఏ, ఉకారమునకు - ఓ, ఋకారమునకు - అర్ - ఆదేశములగును, స్పృశ్ - లోని ఋకారమునకు - అర్ విభాషనగును స్పర్శించు, స్పృశించు - స్పృశ్ - ధాతువు 63 చే - స్పృశ్+ఇంచు 66 చే - స్పృశ్-లోని లఘూపధ యగు ఋకారమునకు అర్ - నిత్యముగ నాదేశమగుచున్నది కాన నీ సూత్ర మున, అర్ అనునది విభాషగ నాదేశమగునని విధింపబఁడెను గుణమాదేశమయి నచో - స్పృశ్+ఇంచు=స్ప్+అర్+శ్+ఇంచు=స్పర్శ్+ఇంచు=స్పర్శించు- అగును గుణము రానిచో - స్పృశ్+ఇంచు=స్పృశించు - అగును ఇంచుకు పరంబగునపుడు - అన్నది 66 నుండి యను వృత్తమగును

విశే - ఇది ప్రాప్తవిభాష ఏలయన 66 చే - నిత్యముగ ప్రాప్తించు గుణమిట విభాషగ విధింపఁబడినది

## లిఖ, ఖుజ, రుచ, కృశంబులగు గుణంబు లేదు 68

### లిఖించు, ఖుజించు, రుచించు, కృశించు కుచ ధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబుగాదు

వ్యా లిఖ్, ఖుజ్, రుచ్, కృశ్ - అను ధాతువుల లఘూపధలకు గుణము లేదు గుణము = ఏ ఓ అర్ - అనునవి గుణములు (66) లిఖించు - లిఖ్ ధాతువు 63 చే - లిఖ్+ఇంచు ల్+ఇ+ఖ్=లిఖ్ ఇట ఖకారము కుదివర్ణము ఇకారము లఘువయిన ఉపధ కనుక 66 చే - ఈ ఇకారమునకు ఏకార మాదేశ మగుచుండఁగా నీ 68 చే - గుణము నిషేధింపఁబడెను కాన, లిఖ్+ఇంచు= లిఖించు - అగును ఇట్లే ఖుజించు ఖుజ్ - ధాతువు 63 చె - ఖుజ్+ఇంచు, 66 చే - ఖుజ్-లోని ఉకారమునకు ఓకార మాదేశమగుచుండఁగా నీ 68 చే - నిషేధము విధింపఁబడెను కనుక గుణము రాదు ఖుజ్+ఇంచు=ఖుజించు

ఇట్లే, రుచ్+ఇంచు=రుచించు కృశించు - కృశ్ - ధాతువు 63 చే - కృశ్+ ఇంచు 66 చే - ఋకారమునకు అర్ - ఆదేశమగుచుండఁగా సీ 68 గుణమును నిషేధించును గనుక గుణము రాదు కృశ్+ఇంచు=కృశించు - అగును

కుచ - ధాతువునకు గుణములేదని యహోబలపండితుఁ డుదాహరించెను కాని యది గ్రహింపఁదగినది కాదు సంకుచించు - కాదు, సంకోచించు - అనియే యగును సం+కుచ్ 63 చే - సం+కుచ్+ఇంచు 66 చే - సం+కోచ్+ ఇంచు=సంకోచించు వెనుదీయు - అని యర్థము లిఖ, భుజ, రుచ, కుచ-అను వాని తుది అత్వముచ్చారణమునకుఁ జేర్పఁబడినది

విశే - ఒకండు వక్కాణించె - అనుటచే సూరి సంకుచింపుచున్నాఁడు - అను నహోబలపండిత వచనమునే విమర్శించెననుట స్పష్టము వెనుదీయు - అను నర్థమున సంకోచించు - అనియే యగునని సూరి యాశయము "సుందరత్వము నకుఁ జోటిచ్చి తాసంకుచించెననఁగడుఁ గృశించెనదుము' (కవిక 1 76) అను ప్రయోగమును సూరి నిరసించె నని కొందఱు సెలవిచ్చుట సరికాదు అయన దీనిని స్పృశింపలేదు (చూ-ము కౌ క్రియా 15)

## సృజికి నిర్మితిని గుణంబు లేదు. 69

చతుర్ముఖుండు ప్రజలను సృజించె అతండు విషయంబుల విసర్జించె

వ్యా సృజ్ - ధాతువునకు నిర్మించుట - అను నర్థమున గుణములేదు సృజించు - సృజ్ - ధాతువు 63 చే - సృజ్ + ఇంచు 66 చే - ఇద్దలి ఋకారమునకు అర్ - ఆదేశము ప్రాప్తించుచుండగా సీ 69 చే - నిర్మించుట యను నర్థమున గుణము నిషేధింపఁబడినది కనుక గుణమురాదు సృజ్+ ఇంచు=సృజించు నిర్మించు - అని యర్థము నిర్మితిని - అనుటచే నిర్మించుట యని కాక వేఱర్థముల యందు సృజ్ - ధాతువునకు గుణము కలదు విసర్జించు వి+సృజ్ 63 చే - వి+ సృజ్ + ఇంచు 66 చే - వి+స్+అర్+జ్+ ఇంచు=విసర్జ్+ఇంచు విసర్జించు ఇట 'వి' పూర్వక సృజ్ ధాతువునకు విడుచు - అని యర్థముగాన సీ 69 చే - గుణము నిషిద్ధము కాలేదు కాన 66 చే - గుణము కలిగి విసర్జించు - అయ్యెను సృజించెను సృజించు - 3 చే - సృజించు+లిట్టు 8 చే - సృజించు+డుజ్ 16 చే - సృజించు+ఎను సంధి 11 చే - సృజించెను సంధి 20 చే - సృజించె ఇట్లే, విసర్జించు - అను దాని నుండి విసర్జించె - అను రూపమేర్పడును

విశే - విసర్జనార్థమునకు ధాతువు (సృజ్) - వాచకము ఉపసర్గము - ద్యోతకము

## సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు. 70

**పంపించు, వచింపించు, అవులింపించు, వండించు, పండించు.**

వ్యా ఎల్ల ధాతువులకుఁ బ్రేరణమున, ఇంచుగాగమ మగును ప్రేరణము= విధి చూ.27 సూ చైత్రుడు మైత్రునిచేత వంటకమును వండించెను (122) వండుట యను వ్యాపారము జరుపునట్లు చైత్రుఁడు మైత్రుని నియోగించెనని యర్థము పచింపించు - పచ్-ధాతువు 63 చే - పచ్+ఇంచు=వచించు ఈ 70 చే - వచించు+ఇంచు - అయ్యేను 87 చే - చకారమునకు, పకారము పచింపు+ఇంచు సంధి 11 చే - పచింపించు ఇట్లే, వచించు+ఇంచు=వచింపించు అవులింపించు - 63 చే - అవుల+ఇంచు సంధి 11 చే - అవులించు ఈ 70 చే - అవులించు+ఇంచు 87 చే - అవులిం+పు+ఇంచు సంధి 11చే - అవులింపించు వండించు - వండు - ధాతువు ఈ 70 చే వండు + ఇంచు సంధి 11 చే - వండించు ఇట్లే, పండు+ఇంచు=పండించు

విశే - సర్వంబునకున్=అన్నివిధములయిన ధాతువులకు - అని యర్థము ఇవి నాలుగు విధములు (1) సంస్కృత ధాతువుల కించుక్కు చేరఁగా నేర్పడునవి పచించు, వచించు (2) అంగలాదుల కించుక్కు చేరఁగా నేర్పడునవి అవులించు, (63) (3) సహజములగు అచ్ఛిక ధాతువులు వండు, పండు (4) నామ ధాతువుల కిట నుదాహరణములు చూపఁబడలేదు నుతించు, స్తుతించు

## రంజాదుల యించు కచ్ఛకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్త లకారంబగు. 71.

**రంజిల్లు కంపిల్లు, భాసిల్లు, వర్ధిల్లు, విలసిల్లు, రాజిల్లు ఈ యాదేశ యోగంబున భిదాదు లకర్మకంబులగు భేదిల్లు సంధిల్లు**

వ్యా రంజ్ - మున్నగు ధాతువుల పూర్ణబిందువుతోఁ గూడిన యించుగాగమ చకారమునకు, (=ంచ్-అనుదానికి) అప్రేరణమున, ద్విరుక్తలకారమగును అప్రేరణము = ధాత్వర్థమగు వ్యాపారము స్వయముగనే (తనంతటనే) జరిగినట్లు వివక్షించుట భేదిల్లు=స్వయముగానే బ్రద్దలగు అనఁగా శ్రమలేకుండ సులువుగా బ్రద్దలగు-అని యర్థము రంజిల్లు = స్వయముగానే యనురాగము నొందుఁఇత్యాది ద్విరుక్షలకారము రెండుసార్లు పలుకఁబడిన లకారము=ల్ల్ ।

రంజిల్లు - రంజ్ - ధాతువు 63చే. రంజ్ + ఇంచు ఈ 71చే. బిందు పూర్వక చకారమునకు (ంచ్) ద్విరుక్త లకార మాదేశము కాఁగా - రంజ్+ఇ+ల్ల్+ఉ=రంజిల్లు- అగును ఇట్లే, కంప్+ఇంచు=కంప్+ఇ+ల్ల్+ఉ కంపిల్లు భాస్+ఇంచు=భాస్+ఇ+ల్ల్+ఉ భాసిల్లు వి + లస్ + ఇంచు = + వి + లస్ + ఇల్ల్ + ఉ, విలసిల్లు రాజ్ + ఇంచు = రాజ్ + ఇ + ల్ల్ + ఉ =రాజిల్లు వర్ధిల్లు - వృధ్ - ధాతువు 63చే. వృధ్ + ఇంచు 66చే. వ్ + అర్ + ధ్ + ఇంచు = వరధ్ + ఇంచు ఈ 71చే. వర్ధ్ + ఇ + ల్ల్ + ఉ = వర్ధిల్లు ఈ ద్విరుక్త లకారాదేశ సంబంధమున భిద్ - మొదలగు ధాతువు లకర్మకము లగును భేదిల్లు - భిద్ - ధాతువు ఇది సకర్మకము 66చే. భిద్+ఇంచు 64చే. భ్+ఏ+ద్+ఇంచు= భేద్ + ఇంచు ఈ 71చే - భేద్+ఇ+ల్ల్+ఉ= భేదిల్లు-ఇప్పుడిదియకర్మక ధాతువయ్యెను సంధిల్లు - సం + ధా 63చే. సం+ధా+ఇంచు ఈ 71చే. సం+ధా+ఇ+ల్ల్+ఉ=సంధా+ఇ+ల్లు సంధి 11చే. సంధిల్లు

విశే - (1) కపి - ధాతువు కంప్ - అని నిల్చును చూ 121 (11) అప్రేరణంబున - అనుటచేఁ ప్రేరణేంచుక్కునకీవిధికాదు 72 సూ (111) కర్మాదులకుఁ గర్తృత్వ వివక్షయందు సకర్మక ధాతువులు గూడ నకర్మకములగును దీనిని గర్మ కర్తృత్వమందురు కర్మణస్తు కర్తృత్వ వివక్షాయాం ప్రాక్ సకర్మకా అపి ప్రాయేణాకర్మకాః భిద్యతే కాష్ఠమ్" (సి కౌ)= "కురారాది దృఢాఘాతం పురుషశ్రమం వినా ద్విధా భవతీత్యర్థః" (బాలమ) అకర్మకము లకర్మకములుగనే యుండును రంజిల్లు, కంపిల్లు

పారవరిశీలన భేదిల్లు, కంపిల్లు, సంధిల్లు- ప్రథమముద్రణము కాని 'కపి' ధాతు వకర్మకమే యగుటచేనిది ముద్రణవ్యత్యాసము కానోపును

## ఇంచుక్కు పరంబగు నపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు. 72

లాదేశంబున కపవాదంబు, రంజించు, భేదించు, సంధించు

వ్యా ప్రేరణార్థమున నైన, ఇంచుగాగమము పరమయినప్పుడు, రంజ్- మొదలగు ధాతువులకు స్వార్థమందయిన ఇంచుగాగమము లోపించునని యర్థము రంజించు - రంజ్ - ధాతువు 63చే. స్వార్థమున ఇంచుగాగమము రంజ్ + ఇంచు 70చే. ప్రేరణమున ఇంచుగాగమము రంజ్ + ఇంచు + ఇంచు ఇట ప్రేరణమున నయిన, ఇంచుక్కు పరమగుటచే స్వార్థమున నయిన

ఇంచుక్కునకు లోపమగును రంజ్ + ఇంచు + ఇంచు = రంజ్ + ఇంచు రంజించు లాదేశంబున కపవాదంబు అనఁగా 71చే. నగు ద్విరుక్తలకారమున కిది బాధకమగును (అపవాదః = బాధకః - శబ్దక) ఎట్లనఁగా - రంజ్ + ఇంచు + ఇంచు - అనుచో 63చే స్వార్థమున నయిన ఇంచుగాగమము నందలి బిందుపూర్వక చకారమునకు (ంచ్) 71చే. ద్విరుక్త లకార మాదేశము కావలసి యుండఁగా దాని కపవాదముగా నిట 63చె. నయిన ఇంచుగాగమమునకు లోపము విధింపబడినది రంజ్ + ఇంచు + ఇంచు = రంజ్ + ఇంచు ఇది 70చే ప్రేరణమున నయిన ఇంచుక్కు కనుక 71చే. దీనిని ద్విరుక్త లకారము ప్రసక్తముకాదు కావున, రంజించు - అనియే రూపసిద్ధియగును భేదించు - 63చే. భిద్ + ఇంచు 66చే. భేద్ + ఇంచు 70చే. + భేద్ + ఇంచు + ఇంచు ఈ 72చే. 63చే. నయిన స్వార్థేంచుక్కు లోపించి, ప్రేరణేంచుక్కుతో భేద్ + ఇంచు = భేదించు అగును సంధించు - సం + ధా 63చే. సం + ధా + ఇంచు 70చే. సంధా + ఇంచు + ఇంచు ఈ 72చే. సం + ధా + ఇంచు (ఇది ప్రేరణేంచుక్కు) సంధి 11చే. సంధించు రంజించు = రంజిల్లునట్లు చేయు భేదించు - భేదిల్లునట్లుచేయు సంధించు = సంధిల్లునట్లు చేయు

విశే - రంజాదులలో (71 సూ) మూఁడింటికే లక్ష్యము లిచ్చుటచే నీవిధి ప్రయోగాను సారముగ గ్రాహ్యమగును

**చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడ రాంతంబు నకుం బ్రేరణంబున బహుళంబుగా నగు. 73**

పూను పూనుచు, పూనించు తేలు తేలుచు, తేలించు. మగుడు మగుడుచు, మగిడించు కుదురు కుదురుచు, కుదిరించు విను వినుచు వక్ష్యమాణంబు పుగాగమంబు వినిపించు. బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు అను అనిపించు, తిను తినిపించు, కను కనిపించు దీనియత్వంబునకు దీర్ఘంబునగు కానిపించు

వ్యా ఆచ్ఛికము నసంయుక్త నలడ రాంతము నయిన ధాతువునకుఁ బ్రేరణమున, చుగాగమము బహుళముగా నగును అసంయుక్త నలడ రాంతము= వేఱొక హల్లుయొక్క కూడిక లేని నలడర లంతమందుఁగలది పూనుచు, పూనించు - పూను - ధాతువు ఇది యాచ్ఛికము 'ను' అంతమందు గలధి.

ఇది యసంయుక్తము కాన నీ 73 చేఁ బ్రేరణమున, చుగాగమము కలిగిన; పూను + చు = పూనుచు-అగును చుగాగమము కాని పక్షమున 70చే-ప్రేరణ మున నించుగాగమము పూను+ఇంచు సంధి 11చే- పూనించు తేలు లకా రాంతము తేలు + చు = తేలుచు, తేలు + ఇంచు = తేలించు - ఇట్లే సాధించుకొనవలెను మగుడుచు - మగిడించు మగుడు-ధాతువు ఇది డకారాం తము ఈ 73 చే మగుడు + చు = మగుడుచు చు - రానిచో 70చే- మగుడు + ఇంచు సంధి 11చే- మగడించు 85చే- మగిడించు కుదురుచు, కుదిరించు - కుదురు-రేఫాంతధాతువు కుదురు+చు=కుదురుచు కుదురు+ ఇంచు=కుదిరించు-అని ప్రక్రియ యూహ్యము వినుచు, వినిపించు - విను- ధాతువు. ఈ 73చే- విను+చు=వినుచు చు-రానిచో, 70చే- విను + ఇంచు 78చే- వినుపు+ఇంచు సంధి 11చే- వినుపించు 85చే- వినిపించు బహుళ మనుటచేఁ గొన్నింటికి చుగాగమములేదు అనఁగా, చుగాగమమునకుఁ గొన్నింట నప్రవృత్తి యన్నమాట అప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము ప్రవర్తింపక పోవుట అనిపించు - అను-ధాతువు దీనికి చుగాగమము లేదు 70చే- అను+ఇంచు 78చే- అనుపు+ఇంచు సంధి 11చే- అనుపించు క్రియా 85చే- అనిపించు ఇట్లే, తిను+ఇంచు=తినుపు+ఇంచు తినిపించు కను+ ఇంచు=కనుపు+ఇంచు కనిపించు దీని అత్వమునకు దీర్ఘము నైతమగును కానిపించు

## అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు. 74

మాను మానుపు, మానుచు, మను మనుపు, మనుచు బాహుళకంబున దీని కించుక్కు లేదు

వ్యా మాను మొదలగు వానికిఁ బ్రేరణమున బహుళముగ, పుగాగమము నైత మగునని తాత్పర్యము పుగాగమంబును - అనుటచే 73చే- చుగాగమమే కాక ఈ 74చే- పుగాగమము నగునని యర్థము అట్లు=73చే- నాంతములకుఁ బ్రేరణమున, చుగాగమ మగునట్లుగానని భావము మానుపు, మానుచు - మాను- ధాతువు 73చే- మాను+చు=మానుచు ఈ 74చే- పుగాగమము మాను+ పు=మానుపు మానిపించు, మానించు, అను రూపములకు - చూ 8 సూత్రము మనుపు, మనుచు - మను-ధాతువు 73చే- మను + చు = మనుచు ఈ 74చే మను+పు=మనుపు 73 సూత్రమునందలి బహుళపదమీ 74 సూత్రమున

ననువర్తించును గనుక, బహుళమనుటచే మనుధాతువున కించుక్కు లేదు ఇది యప్రవృత్తి యన్నమాట

## చుక్పువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వంబగు. 75

వ్యా ప్రేరణార్థకములగు, చుగాగమ పుగాగమములు పరములగునపుడు, ఇత్వమున కుత్వమగును ఉదా॥ బిగియు+చు 76చే- బిగి+చు ఈ 75చే- బిగు+చు=బిగుచు కలియు+పు 76చే- కలి+పు ఈ 75చే- కలు+పు= కలుపు (76)

## అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదుల కగు నగుచో వాని కడవ్రాలు లోపించు. 76

అడఁగు అడఁచు, అడఁగించు మాయు మాపు, మాయించు, అడఁగు, కరఁగు, కలఁగు, నలఁగు, బిగియు ఇత్యాదు లడంగ్వాదులు మాయు, ఉడుగు, కదచు, కుడుచు, ఇత్యాదులు మాయ్వాదులు, అఁగు ప్రభృతు లుభయగణంబులు బాహుళకంబు నం జేసి కొన్నింటి కించుక్చుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటి కందు యథా సంభవముగా రెండును, గొన్నింటి కొక్కటియు నగు నని యెఱుంగునది అఁగు-అఁచు, అఁపు అఁగించు, రేఁగు రేఁచు, రేఁపు, రేఁగించు, పాయు పాచు, పాపు విఱుగు విఱుచు, చూఁచు చూపు, నేరుచు నేరఁపు, మేయు మేపు, లేచు లేపు, కలియు కలుపు తడియు తడుపు తెలియు తెలుపు-ఇత్యాదు లెఱుంగునది

వ్యా అడఁగు- మొదలగువానికి, చుగాగమమును, మాయు - మొదలగు వానికి పుగాగమును ప్రేరణమున బహుళముగ నగును అగుచో వాని తుది యక్షరము లోపించును 73 సూత్రమునుండి బహుళ పదమిట ననువర్తించును అడంగ్వాదులకు - అడఁగు ధాతువు ఈ 76చే- అడఁగు+చు - అయి, తుది యక్షరము లోపించి, అడఁచు-అని సిద్ధించును చుగాగమము రానిచో 7చే- అడఁగు + ఇంచు సంధి 11చే- అడఁగించు ఇట్లే- కరఁగు+చు=కరఁచు, కరఁగు+ఇంచు=కరఁగించు, కలఁగు+చు=కలఁచు, కలఁగు+ఇంచు=కలఁ

గించు నలఁగు + చు = నలఁచు, నలఁగు + ఇంచు = నలఁగించు బిగుచు, బిగియించు - బిగియు-ధాతువు ఈ 76చే- బిగియు+చు=బిగి+చు 75చే- బిగుచు చుక్కురానిచో, 70చే- బిగియు + ఇంచు సంధి 11చే- బిగియించు ఇత్యాదులు మాయ్వాదులు మాపు, మాయించు - మాయు-ధాతువు ఈ 76చే- మాయు + పు = మాపు పుగాగమము రానిచో - 70చే-మాయు + ఇంచు సంధి 11చే- మాయించు, ఉడుపు, ఉడిగించు - ఉడుగు-ధాతువు ఈ 76చే- ఉడుగు+పు=ఉడుపు పుగాగమము రానిచో 70చే- ఉడుగు + ఇంచు సంధి 11చే- ఉడుగించు 85చే- ఉడిగించు కడపు, కడపించు - కడచు-ధాతువు ఈ 76చే- కడచు+పు=కడపు పుగాగమము రానిచో, 70చే- కడచు + ఇంచు 87చే- కడపు + ఇంచు సంధి 11చే- కడపించు కుడుపు కుడిపించు - కుడుచు - ధాతువు ఈ 76చే- కుడుచు+పు=కుడుపు పుగాగమము రానిచో - 70చే- కుడుచు+ఇంచు 87చే- కుడుపు + ఇంచు సంధి 11చే- కుడుపించు 85చే-కుడిపించు

అఁగు-మొదలగునవి యుభయ గణములు అనగా, అడంగ్వాది గణము నను మాయ్వాది గణముననుఁ జేరును కనుక, చుక్పుగాగమములు రెండును నగును బహుళమనుటచేఁగొన్నింటికి (73 సూత్రమునుండి యనువర్తించినది) ఇంచుక్, చుక్, పుగాగమములు మూఁడును గొన్నిటికి, మూఁడింటిలో రెండును, గొన్నింటి కీమూడింటిలో నొకటియుఁ బ్రయోగానుసారముగ నగును ఇంచుక్చు క్పుగాగమములు మూఁడింటికి అఁగు-ధాతువు ఈ 76చే- అఁగు+చు=అఁచు, అఁగు+పు=అఁపు చుక్పుగాగమములు రానిచో, 70చే- అగు+ఇంచు సంధి 11చే- అఁగించు ఇట్లే, రేఁగు+చు=రేఁచు రేఁగు+పు=రేఁపు రేఁగు+ఇంచు= రేఁగించు రెండు కిలుగుటకు పాయు - ధాతువు ఈ 76చే- పాయు + చు = పాచు, పాయు + పు = పాపు ఒక్కచుగాగమమునకు - విఱుగు + చు = విఱుచు ఒక్క పుగాగమమునకు - చూచు + పు = చూపు ఇత్యాదులు కలియు + పు = కలి + పు 75చే- కల్ + ఉ + పు = కలుపు ఇట్లే, తడియు + పు = తడుపు, తెలియు + పు = తెలుపు

పారపరిశీలన - (1) బిగియు - అనునది ప్రథమ ముద్రణముననే పొరపాటున మాయ్వాదులలోఁ జేరినది ఇది యడంగ్వాదుల లోనిది (11) కడచుఁ - అని కొన్ని ముద్రణములలో నరసున్న కనఁబడును కడచు - అను నిర్బిందు కమే యిట నుండఁదగినది,

**ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబులగునపు డాగమాదేశ లోపంబులు పెక్కు తెఱంగులం గానంబడియెడి. 77**

అగు కావించు, వచ్చు రావించు, రప్పించు, విన్నపము విన్నవించు, మోఁకాలు మోఁకరించు, కేక కేకరించు, పలవ పలవరించు, పలవించు; అల అలకించు, అలించు, ప్రక్క ప్రక్కలించు, నొచ్చు నొంచు, నొప్పించు, ఉండు ఉనుచు, ఉంచు, డిగు డించు, డిగించు, పెరుఁగు పెనుచు, పెంచు, తునుఁగు త్రుంచు, మునుఁగు ముంచు, మునుచు; మొగుడు మొగుడుచు, మొగుచు, మోడుచు, మొగిడించు; చొచ్చు చొనుపు, చొప్పించు, చినుఁగు చించు, చింపు, త్రెగు త్రెంచు, త్రెంపు, తిరుగు త్రిప్పు చచ్చు .. చంపు, నిలుచు నిలువరించు, నిలుపు కొను కొలుపు పోవు పుచ్చు, పనుచు, పంచు, పనుపు, పంపు అనుచు, అంచు అనుపు, అంపు అనుప్రయుక్తంబగు పోవునకుంబుచ్చు మాత్రంబగు. మోసపోవు మోసపుచ్చు॥ ఇత్యాదు లెఱుంగునది

వా ఇంచుగాగమము, చుగాగమము, పుగాగమము ననునవి పరములగు నపుడాగమాదేశలోపములు పెక్కువిధములుగఁ గనఁబడును అగు-ధాతువు 70 చే - అగు + ఇంచు ఈ 77 చే - కావ్ + ఇచు = కావించు 70 చే - వచ్చు+ఇంచు ఈ 77 చే - రావ్ + ఇంచు = రావించు, రప్ప్+ఇంచు= రప్పించు విన్నప - అనునామమునకు 65 చే - ధాతుత్వము వివక్షించిన, 63 చే - విన్నప + ఇంచు ఈ 77 చే - విన్నవ్ + ఇంచు = విన్నవించు 65 చే - మోఁకాలు అను నామమునకు ధాతుత్వము వివక్షించిన, 63 చే - మోఁకాలు + ఇంచు ఈ 77 చే - మోఁకర్ + ఇంచు = మోఁకరించు కేక అను నామము నకు 65 చే - ధాతుత్వము వివక్షించిన 63 చే - కేక + ఇంచు ఈ 77 చే - కేకర్ + ఇంచు = కేకరించు పలవ - అను నామమునకు 65 చే - ధాతుత్వము వివక్షించిన, 63 చే - పలవ + ఇంచు ఈ 77 చే - పలవర్ + ఇంచు = పలవరించు రేఫాగమము కానిచో, పలవ + ఇంచు సంధి 11 చే - పలవించు, అల-అను నామమునకు 65 చే - ధాతుత్వము వివక్షింపఁగా, 63 చే - అల + ఇంచు ఈ 77 చే - అలక్ + ఇంచు = అలకించు కకారాగమము

కానిచో - అల + ఇంచు సంధి 11 చే - అలించు వ్రక్క - అను నామమునకు 65 చే - ధాతుత్వము వివక్షింపఁగా, 63 చే - వ్రక్క + ఇంచు ఈ 77 చే - వ్రక్కల్ + ఇంచు = వ్రక్కలించు నొచ్చు - ధాతువు 76 చే - నొచ్చు + చు = నొ + చు ఈ 77 చే - నొ + ం + చు = నొంచు 70 చే - నొచ్చు + ఇంచు ఈ 77 చే - నొప్ప్ + ఇంచు = నొప్పించు ఉండు-ధాతువు 73 చే - ఉండు + చు ఈ 77 చే - ఉ + ను + చు = ఉనుచు, ఉం + చు = ఉంచు డిగు-ధాతువు 76 చే - డిగు + చు = డి + చు ఈ 77 చే - డిం + చు = డించు, 70 చే - డిగు + ఇంచు సంధి 11 చే - డిగించు పెరుఁగు 76 చే - పెరుఁగు + చు = పెరుఁ + చు ఈ 77 చే - పెను + చు = పెనుఁచు, పెం + చు = పెంచు తునుఁగు - ధాతువు 76 చే - తునుఁగు + చు = తునుఁ + చు ఈ 77 చే - త్రుం + చు = త్రుంచు మునుఁగు - ధాతువు 76 చే - మునుఁగు + చు = మునుఁ + చు ఈ 77 చే - ముంచు, అరసున్న లోపించి మును + చు = మునుచు మొగుడు- ధాతువు 73 చే - మొగుడు + చు = మొగుడుచు మొగుడు + చు = మొగుచు మొగుడు + చు = మోడు + చు = మోడుచు 70 చే - మొగుడు + ఇంచు సంధి 11 చే - మొగుడించు క్రియా 85 చే - మొగిడించు చొచు - ధాతువు 76 చే - చొచ్చు + పు = చొ + పు ఈ 77 చే - చొ + ను + పు = చొనుపు 70 చే - చొచ్చు + ఇంచు 87 చే - చొప్పు + ఇంచు సంధి 11 చే - చొప్పించు చినుఁగు - ధాతువు 76 చే - చినుఁగు + చు = చినుఁ + చు ఈ 77 చే - చిం + చు = చించు, 76 చే - చినుఁగు + పు = చినుఁ + పు ఈ 77 చే - చిం + పు = చింపు త్రెగు - ధాతువు 76 చే - త్రె + చు ఈ 77 చే - త్రె + ం + చు = త్రెంచు, 76 చే - త్రెగు + పు = త్రె + పు ఈ 77 చే - త్రెం + పు = త్రెంపు తిరుగు - ధాతువు 76 చే - తిరుగు + పు = తిరు + పు ఈ 77 చే - త్రిప్ + పు = త్రిప్పు చచ్చు - ధాతువు 76 చే - చచ్చు + పు = చ + పు ఈ 77 చే - చం + పు = చంపు నిలుచు-ధాతువు 70 చే - నిలుచు + ఇంచు ఈ 77 చే - నిలు + వర్ + ఇంచు = నిలువరించు 76 చే - నిలుచు + పు = నిలుపు కొను- ధాతువు 76 చే - కొను + పు = కొ + పు ఈ 77 చే - కొలుపు పోవు- ధాతువు 76 చే - పోవు + చు = పో + చు ఈ 77 చే - పుచ్ + చు = పుచ్చు, పను + చు = పనుచు, ప + చు = పంచు, 76 చే - పోవు + పు = పో + పు ఈ 77 చే - పను + పు = పనుపు, ప + ం + పు = పంపు, 76 చే - పోవు + చు = పో + చు ఈ 77 చే - అను + చు =

అనుచు, అం + చు = అంచు 76 చే. పోవు + పు = పో + పు ఈ 77 చే. అను + పు = అనుపు అం + పు = అంపు అను ప్రయుక్తమగు. పోవు ధాతువునకు పుచ్చు అను రూపము మాత్రమే యగును తక్కిన వనుచు, పంచు, పనుపు పంపు, అనుచు, అంచు, అనుపు అంపు - అను రూపములు కావు అను ప్రయుక్తము = అను బంధము మోసపోవు, 76 చే - మోసపోవు + చు = మోసపో + చు, ఇట పుచ్చు మాత్రమే యగును మోస + పుచ్+చు మోసపుచ్చు ఇత్యాదులు

పార పరిశీలన - పెరుఁగు-అను దానిలోఁ బ్రథమ ద్వితీయ ముద్రణము లందర్థ బిందువు లేదు కొన్ని ముద్రణములలోఁ జేర్పఁబడుటసరియే

## అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు 78

అనిపించు అను, కను, తిను, విను మానిపించు, మానించు

వ్యా అను మొదలగు ధాతువుల కించు గాగమము పరమగుచో, పుగాగమము నిత్యముగ నగును మాను ధాతువునకు ఇంచుగాగమము పరమగుచో, పుగాగమము విభాషనగును అన్వాదులకు అను - ధాతువు 70 చే - అను +ఇంచు ఈ 78 చే - అనుప్ + ఇంచు = అనుపించు 85 చే - అనిపించు ఇట్లే, కను కనిపించు తిను తినిపించు విను వినిపించు - అను వానిని సాధింపవనగును మానునకు 70 చే - మాను + ఇంచు ఈ 78 చే - పుగాగమము కలిగిన, మానుప్ + ఇంచు=మానుపించు 85 చే - మానిపించు పుగాగమము కానిచో, మాను + ఇంచు సంధి 11 చే - మానించు

విశే - 55 లోఁ జేర్కొనఁబడిన అన్వాదులలో, కొను, మను - అనునవి విడువఁబడెను

## అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాఁగమంబగు నప్పాదులకు విభాషనగు. 79

అడ్డము అడ్డగించు

అడ్డము, ఓర, చిత్తము, పంతము, పెల్ల, బోర, మట్టము, మేళము ఇత్యాదు లడ్డాదులు

అప్ప అప్పగించు అప్పించు

అప్ప, ఒప్ప, పల్లము, కోపము ఇవి యప్పాదులు

వ్యా అర్ద - మొదలగు వాని కించుగాగమము పరమగునపుడు, గుగాగమము నిత్యముగనగును, అప్ప మొదలగు వాని కించుగాగమము పరమగునపుడు గుగాగమము విభాషనగును అర్ధాదులకు అర్ధ - అను నామమునకు 65 చే. ధాతుత్వ వివక్ష చేయఁగా, 63 చే - అర్ద - ఇంచు - ఈ 79 చే- గుగాగమము గుక్ + అగమ కకారము నిర్దిష్టమునకుఁ జివరఁ జేరునని తెలుపును గు - లోని ఉకార ముచ్చారణమునకుఁ జేర్పఁబడినది కావున 'గ్' అన్నదే యాగమ మగును అర్ద + ఇంచు = అర్దగ్ + ఇంచు అర్దగించు ఇట్లే, ఓర + ఇంచు=ఓరగ్ + ఇంచు ఓరగించు మొ॥ ఇత్యాదు లర్ధాదులు అప్పాదులకు - అప్ప 58 చే - ధాతుత్వ వివక్ష చేయఁగా 63 చే - ఇంచుక్కు అప్ప + ఇంచు ఈ 79 చే - గుగాగమము, అప్పగ్ + ఇంచు = అప్పగించు గుగాగమము కలుగనిచో అప్ప + ఇంచు సంధి 11 చే - అప్పించు ఇట్లే, ఒప్పగించు, ఒప్పించు మొ॥ ఇవి అప్పాదులు-

విశే - (1) చిత్త, మేళ, కోప - అనునవి సంస్కృత నామములు (11) అర్ధాదు లాకృతిగణము ఆకృతిగణము = చూ సంధి 5 వ్యాఖ్య అప్పాదులు పఠితగణము పఠితగణము=ఈ గణము నందలి శబ్దము లివేయని పఠింపఁబడిన గణము పఠితగణము (111) మేళగించు = 77చే - మేళవించు మేళ - సంస్కృత నామ ధాతువగుటచే అచ్చిక 27 చే-గకారమునకు వకారము కాదు

## ఆడోడు కూడుల డకారంబునకుం జుక్కు పరంబగు నపుడు రేఫంబగు. 80

ఆడు ఆరుచు, ఆడించు, ఓడు ఓరుచు, ఓడించు, కూడు కూరుచు, కూడించు

వ్యా అడు, ఓడు, కూడు - అను వాని డకారమునకు, చుగాగమము పరమగునపుడు రేఫ మగును ఆడు - ధాతువు 73 చే - ఆడు + చు ఈ 80 చే - ఆర్ + ఉ + చు = అరుచు, 70 చే - ఆడు + ఇంచు సంధి 11 చే - ఆడించు చుక్కు పరమయిన రేఫాదేశము ఇట్లే, ఓడు + చు = ఓరుచు ఓడు + ఇంచు = ఓడించు కూడు + చు = కూరుచు కూడు + ఇంచు = కూడించు

విశే - ఆడు + చు - ఇత్యాదులలో డకారమునకు (డ్) చుక్కునకు మధ్య ఉకారము గలదు కనుక డకారమునకు, చుక్కు పరము కాలేదు కాని దేనితో వ్యవధాన మపరిహార్యమో దానితో వ్యవధాన మున్నను గార్యము

ప్రవర్తించును "యేననా వ్యవధానం తేన వ్యవహితేపి" (పరిభా) ఇట ఉకార ముతో వ్యవధానము తప్పనిసరి కనుక రేఫాదేశమునకు బాధ లేదు "నహి స్వాంగం స్వవ్యవధాయకమ్" అను న్యాయమును గలదు (అహో)

## చెడునకుం జు కప్పుగాగమంబులును డాకలఘు రేఫంబునగు 81

చెఱుచు, చెఱుపు

వ్యా చెడు - ధాతువునకుఁ బ్రేరణమున చుగాగమ పుగాగమములును, డకారమున కలఘు రేఫమును నగును చెడు + చు = చెఱ్ + ఉ + చు= చెఱుచు - చెడు + పు = చెఱ్ + ఉ + పు = చెఱుపు

విశే - ప్రేరణంబున - అనునది 73 నుండి మండూక ప్లుతిగా నను వృత్తమగును

## పడునకుం జుక్కును డా కలఘు రేఫంబునగు 82

పఱుచు

వ్యా పడు ధాతువునకుఁ బ్రేరణమున చుగాగమమును, డకారమున కలఘు రేఫము నగును పడు + చు = పఱ్ + ఉ + చు = పఱుచు

విశే - 73 నుండి, ప్రేరణంబున - అను వృత్తమగును

## శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషనగు నగుచో డాకు లఘురేఫంబగు 83

వెలువడు వెలువరించు వెలువఱుచు, చొప్పడు చొప్పరించు, చొప్పఱుచు

వ్యా శబ్దపల్లవమగు పడు ధాతువునకుఁ బ్రేరణమున నించుగాగమము విభాషనగును అగుచో డకారమునకు లఘు రేఫమగును శబ్దపల్లవము = చూ 118 వెలువడు - శబ్దపల్లవము దీనియందలి పడు ధాతువున కీకార్యము విధింపఁబడినది వెలువడు + ఇంచు = వెలువర్ + ఉ + ఇంచు, వెలువరు + ఇంచు సంధి 11 చే - వెలువరించు ఇంచుక్కు రానిచో 82 చే - వెలువడు + చు = వెలువఱ్ + ఉ + చు = వెలువఱుచు ఇట్లే, చొప్పడు + ఇంచు= చొప్పరు + ఇంచు చొప్పరించు చొప్పడు + చు = చొప్పఱ్ + ఉ + చు= చొప్పఱుచు, వెలి + పడు = వెలువడు చొప్పు + పడు = చొప్పడు

(118) శబ్దపల్లవంబగు వడు - అనగా శబ్దపల్లవమున నవయవమగు వడు ధాతువు

విశే - (i) ప్రేరణంబున - 73 నుండి యను వృత్తము (ii) ఇది ప్రాప్తవిభాష 70 చే - నిత్యముగాఁ బ్రాప్తించు నించుక్కునిది విభాషగ విధించును

## ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేదు. 84

ఇటనుటం జేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు మీఁదం బ్రేరణార్థేంచుగాగమంబగునని యెఱుంగునది

నొచ్చు నొంచు, నొంపించు, చచ్చు చంపు, చంపించు

వ్యా ప్రేరణముననైన యించుగాగమముపై, మరలఁ బ్రేరణార్థమున ఇంచుగాగమము లేదు అనఁగా బ్రేరణేంచుక్కుపై మరలఁ బ్రేరణేంచుక్కు లేదని తాత్పర్యము ఇట్లు చెప్పుటచేఁ బ్రేరణార్థమున నయిన, యితరాగమముల మీఁద, ననఁగా చుక్పుగాగమముల మీఁద, ప్రేరణేంచుక్కు రావచ్చును నొచ్చు-ధాతువు 76 చే - నొచ్చు + చు = నొ + చు 77 చే - నొం + చు = నొంచు ఇట చుగాగమము ప్రేరణమున నయినది దీనిపై మరలఁ బ్రేరణమున ఇంచుక్కు చేరవచ్చును నొంచు + ఇంచు 87 చే - నొంప్ + ఉ + ఇంచు సంధి 11 చే - నొంపించు చచ్చు - ధాతువు 76 చే - చచ్చు + పు = చ + పు 77 చే - చంపు ఈ ప్రేరణార్థమున నయిన పుగాగమముపై మరలఁ బ్రేరణమున ఇంచుక్కు చేరినచో, చంపు + ఇంచు - అగును సంధి 11 చే - చంపించు

వద సార్థక్యము - ప్రేరణంబునందు - అనుటచే స్వార్థేంచుక్కువయి ప్రేరణేంచుక్కు చేరవచ్చును, పచ్-ధాతువు 63 చే - స్వార్థమున ఇంచుక్కు పచ్ + ఇంచు = పచించు దీనిపై 70 చే-ప్రేరణేంచుక్కు చేరి - పచించు + ఇంచు = పచింపించు - అగును (87) ఇంచుక్కు మీఁద ననుటచే చుక్పు గాగమములపైఁ జేరునని పైని వివరింపఁబడెను వండించు ఇది ప్రేరణేంచుక్కు (70) కనుక దీనిపై మరలఁ ఇంచుక్కు రాదు (వండింపించు - కాదనుట)

పాఠపరిశీలన - ఇటనుటంజేసి- ప్రథమముద్రణ పాఠము ఇట్లనుటంఁ జేసి- అను ముద్రణములు సరికావు చూ ప్రకీర్ణక 9

## ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు. 85

నిగుడు నిగిడి, నిగిడె, మగుడు మగిడి, మగిడె, ఉడుగు ఉడిగి, ఉడిగె, మునుఁగు మునిఁగి, మునిగె

వ్యా ధాతువునకు ఇత్వముగాని ఎత్వముగాని కూడుచో ధాతువుయొక్క అనాద్యమయిన ఉత్వమున కిత్వమగునని తాత్పర్యము కూడుచోన్ = ముందటి వర్ణముతోఁ గలియునప్పుడు - అని యర్థము అనాద్యము = ఆద్యముకానిది - మొదటిది కానిది నిగిడి - నిగుడు- ధాతువు 38 చే - నిగుడు + ఇ సంధి 11 చే - నిగుడి ఈ 85 చే నిగిడి నిగిడె - 3 చే - నిగుడు + లిట్టు 8 చే - నిగుడు + డుజ్ 16 చే - నిగుడు+ఎను సంధి 11 చే - నిగుడెను. ఈ 85 చే - నిగిడెను సంధి 20 చే - నిగిడె ఇట్లే తక్కినవి

పదసార్థక్యము - అనాద్యంబయిన- అనుటచే, ధాతువునందలి మొదటి ఉత్వమున కిత్వముకాదు ఉడుగు + ఇ = ఉడిగి మునుఁగు+ఇ=మునిఁగి. వీనిలో మొదటి ఉకారములకు ఇకారముకాదు

## ముజ్జీత్తులు ముత్తు నాఁబడు 86

వ్యా ముజ్ + జీత్ = ముజ్జీత్తులు ముజ్ = మధ్యమ ముడుజ్జులు - 31 సూ మధ్యమ ముడుజ్జులు, జీత్తులు కలిసి ముత్తు-అనఁబడును ముజ్ + జీత్ = ముత్ ఇందుఁ బ్రత్యాహారచ్ఛాయగోచరించును జీత్తులు - లజీ (7) కలజీ (19, 12) పడుజీ (21) కుజీ (32) వుజీ, రుజీ (34) కజీ (36, 39,) మిజీ (37) నుజీ (40 122) నిజీ (47)

## ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబున కగు. 87

పచించు పచింపించు, వచించు వచింపించు, పిలుచు పిలిపించు, వలచు వలపించు, పత్వంబు హెచ్చునకుం గలుగదు, మెచ్చునకు విభాషనగు, హెచ్చించు, మెప్పించు, మెచ్చించు

వ్యా ప్రేరణమున నయిన యించుగాగమము పరమగునపుడు చకారమునకు, పకారమగును పచింపించు - పచ్ - ధాతువు 63 చే - పచ్+ఇంచు= పచించు 70 చే - పచించు + ఇంచు ఈ 87 చే - పచింప్ + ఉ + ఇంచు= పచింపు + ఇంచు సంధి 11 చే - పచింపించు ఇట్లే, వచించు + ఇంచు =

వచింపించు పిలిపించు - పిలుచు - ధాతువు 70 చే - పిలుచు + ఇంచు ఈ 87 చే - పిలుప్ + ఉ + ఇంచు = పిలుపు + ఇంచు సంధి 11 చే - పిలుపించు క్రియా 85 చే - పిలిపించు వలపించు - వలచు-ధాతువు 70 చే - వలచు + ఇంచు 87 చే - వలప్ + ఉ + ఇంచు = వలపు + ఇంచు సంధి 11 చే - వలపించు హెచ్చు ధాతువుయొక్క చకారమునకు వకారము కలుగదు హెచ్చు - ధాతువు 70 చే - హెచ్చు + ఇంచు సంధి 11 చే - హెచ్చించు మెచ్చు ధాతువుయొక్క చకారమునకు, వకారము వికాషనగును మెచ్చు - ధాతువు 70 చే - మెచ్చు + ఇంచు చకారము వకారమయినచో మెప్ప్ + ఉ + ఇంచు = మెప్పు + ఇంచు సంధి 11 చే - మెప్పించు వకారము కానిచో — మెచ్చు + ఇంచు సంధి 11 చే - మెచ్చించు వకారంబు చకారంబునకగు - అనుచో వకారజాతి చకారజాతి కగునని యర్థము కనుక మెచ్చు + ఇంచు = అనుచో చకారద్వయమునకు, వకారద్వయ మాదేశ మయ్యెను

విశే - మెప్పించు - పొందు 4-259, నిరం 2-40 వరాహ 11-54

## ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగు నపుడు పవఁగు. 88

ఆగమంబు పచింపఁడు పచింపుము అడఁపడు, అడఁపుము
అన్యము పిలువఁడు పిలువుము

వ్యా ద్విరుక్తము కాని యాగమ చకారమునకు, ముత్తుపరమగుచో, వకారమును, ద్విరుక్తముకాని యన్యచకారమునకు ముత్తుపరమగుచో, వకారమును నగును ముత్తు = ముఙ్జిత్తులు ముఙ్ = మధ్యమ ముడుఙ్లులు (31సూ) జిత్తులు = లఙి మొదలగునవి (86సూ ) ఆగమచకారమునకు-పచింవఁడు- పచ్-ధాతువు 63 చే - పచ్ + ఇంచు = పచించు 7 చే - పచించు+లఙి 8 చే - పచించు + డుఙ్ ఈ 88 చే - పచింప్ + ఉ + డుఙ్ = పచింపు + డుఙ్ 20 చే - పచింప్ + అ + డుఙ్ = పచింప+డుఙ్ తత్సమ 19 చే - పచింపఁడు పచింపుము - 63 చే - పచ్ + ఇంచు = పచించు 6 చే - పచించు + లూట్టు 8 చే - పచించు + వు 29 చే - పచించు + ము ఈ 88 చే - పచింప్+ఉ+ము=పచింపుము ఇవియించుగాగమచకారమున కుదాహరణములు అడఁపఁడు - అడఁగు - ధాతువు 76 చే - అడఁగు + చు = అడఁచు 7 చే - అడఁచు + లఙి 8 చే - అడఁచు + డుఙ్ ఈ 88 చే - అడఁపు + డుఙ్ 20 చే - అడఁప + డుఙ్ తత్సమ 19 చే - అడఁపఁడు

అడఁపుము - అడఁగు - ధాతువు 76 చే - అడఁగు + చు = అడఁచు 6 చే - అడఁచు + లూట్టు 8 చే - అడఁచు + వు 29 చే - అడఁచు+ము ఈ 88 చే - అడపు+ము=అడఁపుము ఇవి చుగాగమచకారమున కుదాహరణములు అన్యచకారముకు - అనఁగా ధాతుసిద్ధమగుచకారమునకు - పిలువఁడు - పిలుచు - ధాతువు 7 చే - పిలుచు + లజీ 8 చే - పిలుచు + డుఙ్ ఈ 88 చే - పిలుప్ + ఉ + డుఙ్ = పిలుపు + డుఙ్ 20 చే - పిలువ + డుఙ్ తత్సమ 19 చే - పిలువఁడు పిలువుము - పిలుచు ధాతువు 6 చే - పిలుచు+లూట్టు 8 చే - పిలుచు+వు 29 చే - పిలుచు + ము ఈ 88 చే - పిలువు + ము = పిలువుము

## ఖండబిందువు మీఁది సిద్ధ చకారంబునకు ముత్తు పరంబగు నపుడు పకారంబు ప్రాయికంబుగ నగు 89

తలఁపక, త్రేఁపక, తోఁపక ఏఁచునకు వైభాషికంబు ఏఁపక, ఏఁచక నోఁచునకుం గలుగదు నోఁచక

వ్యా అరసున్న మీఁది సిద్ధ చకారమునకు ముత్తు పరమగునపుడు పకారము తఱచుగ నగును సిద్ధచకారము = శబ్దముయొక్క పుట్టుకతోనే సిద్ధించిన చకారము ముత్తు = మధ్యమముదుజ్జులు, జీత్తులు 86 సూ తలఁపక - తలఁచు-ధాతువు 39 చే - తలఁచు + కజీ ఈ 89 చే - ఖండబిందువు మీఁది సిద్ధ చకారమునకు, పకార మాదేశమయి తలఁప్+ఉ+కజీ=తలఁపు+కజీ 20 చే - తలఁపక ఇట్లే త్రేఁచు+కజీ=త్రేఁపక తోఁచు + కజీ = తోఁపక ఏఁచు-ధాతువుయొక్క చకారమునకు, పకారము వైకల్పికముగననగును ఏఁచు+ కజీ (39) ఈ 89 చే - ఏఁపు + కజీ 20 చే - ఏఁపక పకారము రానిచో, ఏఁచు + కజీ 20 చే - ఏఁచక నోఁచు ధాతువు చకారమునకు, పకారము కాదు 39 చే - నోఁచు + కజీ 20 చే - నోఁచక

విశే - (1) తలఁపక=తలంపక-సంజ్ఞా 14 (11) ఖండబిందువు మీఁద, పకారము ప్రాయికమనుటచే బూర్ణబిందువు మీఁద, పకారమరుదుగా నగును ఇంచు + లజీ = ఇంపవు (ఆముక్త 6-32)

## ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు 90

ఆకర్ణింపుదురు, దంపుదురు, చింపుదురు పత్వంబురాని పక్షంబున వక్ష్యమాణ తాదేశంబు, ఆకర్ణింతురు, దంతురు, చింతురు,

వ్యా నిండు సున్నమీఁది యాగము చకారమునకు దుగాగమము పరమగు నప్పుడు, వకారము విభాషనగును ఆకర్షింపుదురు, ఆకర్షింతురు - 63 చే - అ+కర్ష్+ఇంచు=ఆకర్షించు 5 చే - ఆకర్షించు+లాట్టు 8 చే - ఆకర్షించు+రు 22 చే - ఆకర్షించు + దు + రు ఈ 90 చే - చకారమునకు వకారము ఆకర్షింప్ + ఉ + దు + రు = ఆకర్షింపుదురు వకారము రానిచో 108 చే - ఆకర్షింత్ + ఉ + రు ఆకర్షింతురు దంపుదురు - దంగు-ధాతువు 76 చే - దంగు+చు=దంచు 5 చే - దంచు+లాట్టు 8 చే - దంచు + రు 22 చే - దంచు+దు+రు ఈ 90 చే - దంప్+ఉ+దు+రు=దంపుదురు పకారము కానిచో, 108 చే - దంత్ + ఉ + రు = దంతురు చింపుదురు - చినుఁగు-ధాతువు 77 చే - చినుఁగు + చు = చించు-అగును 5 చే - చించు+లాట్టు 8 చే - చించు + రు 22 చే - చించు + దు + రు ఈ 90 చే - చింప్+ఉ+దు+రు=చింపుదురు, వత్వమురానిచో 108 చే - చింత్+ఉ+రు=చింతురు

విశే - (1) దంగు + చు = దంచు, దంపు (76) అగును చినుఁగు+చు=చించు, చింపు (77) అగును దంపు, చింపులనుండి దంపుదురు సాధింప నగునని కొందఱు సెలవిత్తురు కాని సర్వత్ర చకారమునుండి వత్వమును సాధించుటయే యుక్తమని సూరి యాశయము (11) ఆకర్షింపుదురు - భాగ 8 స్కం 21 ప

## అగు, వచ్చు, చొచ్చు, చూచులకు, ముత్తు పరంబగునపుడు కా, రా, చొరు, చూడు లగు. 91

అగు కాఁడు, వచ్చు రాఁడు, రమ్ము చొచ్చు చొరఁడు, చొరుము చూచు చూడఁడు, చూడుము

వ్యా ముత్తు పరమగునపుడు అగునకు- కా, వచ్చునకు-రా, చొచ్చునకు-చొరు, చూచునకు చూడు - అనునవి యాదేశములగును ముత్తు=మధ్యమ ముడుఙ్లులు, జీత్తులు కాఁడు - అగు - ధాతువు 7 చే - అగు+లజీ 8 చే - అగు+డుజ్ ఈ 91 చే - కా+డుజ్ తత్సమ 19 చే - కాఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు రాఁడు - వచ్చు - ధాతువు 7 చే - వచ్చు+లజీ 8 చే - వచ్చు + డుజ్ ఈ 91 చే - రా + డుజ్ తత్సమ 19 చే - రాఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణములేదు రమ్ము - వచ్చు - ధాతువు 6 చే - వచ్చు+లూట్టు 8 చే - వచ్చు + వు 29 చే - వచ్చు+ము ఈ 91 చే - రా+ము

61 చే - రమ్ము చొరఁడు చొచ్చు-ధాతువు 7 చే - చొచ్చు+లఙ్ 8 చే - చొచ్చు + డుఙ్ ఈ 91 చే - చొరు + డుఙ్ 20 చె చొర + డుఙ్ తత్సమ 19 చే - చొరఁడు చొరుము - చొచ్చు ధాతువు 6 చే - చొచ్చు+ లూట్టు 8 చే - చొచ్చు+వు 29 చె - చొచ్చు + ము ఈ 91 చే - చొరు+ ము=చొరుము చూడఁడు చూచు-ధాతువు 7 చే - చూచు+లఙ్ 8 చే - చూచు+డుఙ్ ఈ 91 చే - చూడు+డుఙ్ 20 చే - చూడ+డుఙ్ తత్సమ 19 చే - చూడఁడు చూడుము చూచు ధాతువు 6 చే - చూచు + లూట్టు 8 చే - చూచు+వు 29 చే - చూచు + ము ఈ 91 చే - చూడు + ము = చూడుము

విశే - (1) కారాచొరు చూడు౹ు సర్వాదేశములగును అనేకాల్ శిత్ సర్వస్య-పాణి (11) ఇవి క్రమముగానగను (సంధి 13 వి ౯ 111)

పారవరిశీలన - కమ్ము - అనురూపము ప్రథమ ముద్రణముననిటఁ జూపఁబడలేదు దీని ప్రక్రియ 96 సూత్రముననఁగాని పరిపూర్ణముకాదు కొందఱు కమ్ము-అనుదాని నిటఁ బ్రక్షిప్తము చేయుట సరికాదు

## ఇచ్చునకు సర్వంబున కీయగు 92

ఇచ్చు ఈఁడు, ఇమ్ము, ఈయ యను నాదేశంబు నొకా నొకచోఁ గానంబడియెడి, బలిమినీయని భూమివలయపతుల

వ్యా ముత్తు పరమగునపుడు, ఇచ్చుధాతువున కంతటికి 'ఈ' అనునది యాదేశమగును 91 సూత్రమునుండి ముత్తుపరంబగునపుడు - అనునది యను వృత్తమగును ఈఁడు - ఇచ్చు - ధాతువు 7 చే - ఇచ్చు + లఙ్ 8 చే - ఇచ్చు + డుఙ్ ఈ 92 చే - ఈ + డుఙ్ తత్సమ 19 చే - ఈఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు ఇమ్ము - ఇచ్చు — ధాతువు 6 చే - ఇచ్చు+ లూట్టు 8 చే - ఇచ్చు + వు 29 చే - ఇచ్చు + ము ఈ 92 చే - ఈ+ ము 61 చే - ఇమ్ము ఒకానొకచో ఇచ్చునకు ఈయ-అనునదియు నాదేశమగును బలిమినీయని భూమి వలయపతుల (అది 1.7) ఇచ్చు - ధాతువు 47 చే - ఇచ్చు + నిఙ్ ఈ 92 సూత్రమున "ఈయ యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి" అనుచే, ఇచ్చునకు ఈయ- అదేశమయి ఈయ+ని=ఈయని- అగును

విశే - ప్రాచీనభాషలో, ఈయ - మిక్కిలి యరుదు కనుక నిది సూత్రింపఁబడలేదు

పదసార్థక్యము - అనేక వర్ణములుగల స్థాని కేకవర్ణ మాదేశమగుచో, స్థానిలోని తుది వర్ణమునకే యది యాదేశమగును (అలోంత్యస్య-పాణి) ఈ-అనునది యేకవర్ణముగనుక, ఇచ్చు-లోని తుది ఉత్వమున కాదేశము కావలసి యుండును కనుక "సర్వంబునకు" అను దళ ముపయోగింపఁబడినది సర్వంబునకున్-అనుటచే ఇచ్చు ధాతువున కంతటికి 'ఈ' అనునది యాదేశమయినది

## తే తేరులు తెచ్చునకగు. 93

తెచ్చు తేఁడు, తేరఁడు, తెమ్ము, తేరుము

వ్యా ముత్తుపరమగునపుడు, తెచ్చు ధాతువునకు, తే - తేరు, అనునవి యాదేశము లగును ముత్తుపరంబగునపుడు - అనునది 91 సూత్రము నుండి యనువృత్తమగును తేఁడు - తేరఁడు తెచ్చు - ధాతువు 7 చే - తెచ్చు+ లఁట్ 8 చే - తెచ్చు + డుఙ్ ఈ 93 చే - తెచ్చునకు, 'తే' ఆదేశమయినచో -తే + డుఙ్ తత్సమ 19 చే - తేఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము తేదు తేరు - ఆదేశమయినచో - తేరు + డుఙ్ 20 చే - తేర + డుఙ్ తత్సమ 19 చే - తేరఁడు తెమ్ము, తేరుము - 6 చే - తెచ్చు + లూట్టు 8 చే - తెచ్చు + వు 29 చే - తెచ్చు + ము ఈ 93 చే, తే - ఆదేశమయిన - తే + ము 61 చే - తెమ్ము - అగును తేరు - ఆదేశమయినచో, తేరు + ము = తేరుము - అగును

విశే - తేతేరులు సర్వాదేశములగును "అనే కాల్ శిత్ సర్వస్య" పాణి

## చావు నోవులు చచ్చునొచ్చుల కగు. 94

చచ్చు చావఁడు, చావుము నొచ్చు నోవఁడు, నోవుము, వక్ష్యమాణంబు ద్విత్వంబు నొవ్వఁడు

వ్యా ముత్తుపరమగుచో, చచ్చు ధాతువునకు-చావు, నొచ్చు ధాతువునకు-నోవు - ఆదేశములగును ముత్తుపరంబగునపుడు - అనునది 91 సూత్రము నుండి యనువృత్తమగును చావడు - చచ్చు - ధాతువు 7 చే - చచ్చు + లఁట్ 8 చే - చచ్చు + డుఙ్ ఈ 94 చే - చావు + డుఙ్ 20 చే-చావ+ డుఙ్ తత్సమ 19 చే - చావఁడు చావుము - చచ్చు - ధాతువు 6 చే-చచ్చు +లూట్టు 8 చే - చచ్చు + వు 29 చే - చచ్చు + ము ఈ 94 చే చావు +ము = చావుము నోవఁడు - నొచ్చు ధాతువు 7 చే - నొచ్చు + లఁట్ 8 చే - నొచ్చు + డుఙ్ ఈ 94 చే - నోవు + డుఙ్ 20 చే - నోవ+ డుఙ్ ప్రకీర్ణక 6 చే ద్విత్వము రానిచో తత్సమ 19 చే నోవఁడు నోవుము

నొచ్చు - ధాతువు 6 చే నొచ్చు + లూట్టు 8 చే - నొచ్చు + వు 29చే నొచ్చు + ము ఈ 94 చే - నోవు + ము=నోవుము నొవ్వఁడు -నొచ్చు ధాతువు, 7 చే - నొచ్చు + లఁజీ 8 చే - నొచ్చు + డుఙ్ ఈ 94 చే నోవు + డుఙ్ 20 చే - నోవ + డుఙ్ తత్సమ 19 చే - నోవఁడు ప్రకీర్ణక 6 చే - నో + వ్వ + ఁడు సమాస 13 చే - నొవ్వఁడు ప్రకీర్ణక 6 చే - ద్విత్వము రానిచో నోవఁడు

## జిత్తుపరంబగునపుడు వాని పువర్ణంబు విభాషను లోపించు. 95

చాక, చావక, చాకుము, చావకుము

నోక, నోవక, నోకుము, నోవకుము

వ్యా జిత్తు పరమయినప్పుడు, చావు, నోవుల వువర్ణము, విభాషను లోపించును చాక, చావక - చచ్చు - ధాతువు 39 చే - చచ్చు+కజీ 94 చే- చావు + కజీ ఈ 95 చే - వువర్ణము లోపించినచో - చా + కజీ = చాక వు - లోపింపనిచో - చావు + కజీ 20 చే - చావక చాకుము, చావకుము - చచ్చు - ధాతువు 6 చే - చచ్చు + లూట్టు 8 చే - చచ్చు + వు 29 చే- చచ్చు + ము 32 చే - చచ్చు + కుజీ + ము 94 చే - చావు + కుజీ+ ము ఈ 95 చే - వువర్ణము లోపించినచో – చా + కుజీ+ము = చాకుము వు - లోపింపనిచో, చావు+ కుజీ+ము 20 చే - చావకుము - నోక, నోవక నొచ్చు - ధాతువు, 39 చే – నొచ్చు + కజీ 94 చే - నోవు + కజీ ఈ 95 చే - వువర్ణకము లోపించిన – నో + కజీ = నోక, వు - లోపింపనిచో, నోవు + కజీ 20 చే - నోవక నోకుము, నోవకుము - నొచ్చు ధాతువు 6 చే - నొచ్చు + లూట్టు 8 చే - నొచ్చు + వు 29 చే - నొచ్చు+ము 32 చే - నొచ్చు + కుజీ+ము 94 చే - నోవు + కుజీ+ము ఈ 95 చే - వు వర్ణకము లోపించిన - నో+కుజీ + ము=నోకుము, వు - లోపింపనిచో, నోవు + కుజీ + ము 20 చే - నోవకుము

విశే - (1) చావఁడు, నోవఁడు - అను రూపములు 94 లో సాధింపఁ బడనవి వానిలో, వు - లోపము రాదు (11) కజీ - కుజీ - నుజీ పరమగు నపుడే వు లోప ప్రసక్తి

## అగున కనుకనులకు ముజ్జీత్తులు పరంబగునపుడు కా, నా, కానలు విభాషనగు 96

అపదాద్య సూత్రముచే గాకు వకారంబు వక్ష్యమాణం బౌత్వంబు కమ్మ, అగుము, అవుము, ఔము, కండు, అగుఁడు, అవుఁడు, ఔఁడు, నాఁడు, అనఁడు, కానఁడు, కనఁడు

వ్యా అగునకు ముజ్జుపరమగునపుడు అను కనులకు జీత్తు పరమగు నపుడు కా, నా, కానలు విభాషనగును అనఁగా, అగునకు ముజ్జుపరమగునపుడు-కా, అనునకు జీత్తుపరమగునపుడు నా, కనునకు జీత్తుపరమగునపుడు, కాన-అనున వియాదేశములగునని తాత్పర్యము కమ్మ అగుము -అగు ధాతువు 6చే-అగు + లూట్టు 8 చే - అగు+వు 29 చే - అగు + ము ఈ 96 చే- 'కా' ఆదేశ మయినచో కా + ము 61 చే - కమ్మ 'కా' - ఆదేశముకానిచో, అగు + ము=అగుము అచ్ఛిక 27 చే - గకారమునకు వకారము అవుము క్రియా 103 చే - అవు - అను దానికంతటికి 'ఔ' ఆదేశమయిన - ఔ + ము = ఔము కండు అగుఁడు - అగు - ధాతువు 6 చే - అగు + లూట్టు- 8 చె - అగు + రు 29 చే - అగు + డుఙ్ ఈ 96 చే - అగునకు 'కా' ఆదేశమయిన, కా + డుఙ్ 61 చే - క + డుఙ్ తత్సమ 19 చే - కండు సంధి 22 చే - ఖండ బిందువు లేదు 'కా' - ఆదేశము కానిచో, అగు+డుఙ్ తత్సమ 19 చే - అగుఁడు అచ్ఛిక 27 చే - అవుడు క్రియా 103 చే - ఔఁడు, నాఁడు, అనఁడు - అను - ధాతువు 7 చే - అను + లజి 8 చే - అను + డుఙ్ ఈ 96 చే - అనునకు 'నా' - ఆదేశమయిన, నా + డుఙ్ తత్సమ 19 చే - నాఁడు సంజ్ఞా 15 చే - సాధ్య పూర్ణము లేదు నా-ఆదేశము కానిచో, అను + డుఙ్ 20 చే - అన + డుఙ్ తత్సమ 19 చే - అనఁడు కానఁడు, కనడు - కను - ధాతువు 7 చే - కను + లజి 8 చే - కను + డుఙ్ ఈ 96 చే - కాన - ఆదేశమయినచో, కాన+డుఙ్ తత్సమ 19 చే - కానఁడు కాన - ఆదేశము కానిచో, కను + డుఙ్ 20 చే - కన + డుఙ్ తత్సమ 19 చే - కనఁడు

విశే (1) ఔ + ము, ఔ + ఁడు - అనుచో 61 చే- ఔకారమునకు హ్రస్వము వచ్చుటకుఁ బ్రసక్తి లేదు- ఏలయన ఐ ఔ లకు హ్రస్వ రూపములు లేవు "ఏచామ్ హ్రస్వాభావాత్" ని కా (11) కానా కానలు వరుసగానగును. (సంధి 13 విశే 111)

## నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుంబరంబులగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగా నగు. 97

నేచెను, నేరిచెను, నేచును, నేరుచును, నేరఁడు, నేరువఁడు.

వ్యా నేరుచు - ధాతువునకు, లిడ్లాట్టులు పరమగునప్పుడు - రు వర్ణమునకును, ముత్తు పరమగునపుడు - చు వర్ణమునకును, లోపము బహుళముగా నగును లిట్టు = భూతంబున లిట్టగు లాట్టు = తద్ధర్మాదులందు లాట్టగు, ముత్తు = ముజ్జిత్తులు ముజ్జు = మధ్యమ ముడుజ్జులు లిడ్లాట్టులకు - నేచెను, నేరిచెను - నేరుచు - ధాతువు 3 చే - నేరుచు + లిట్టు 8 చే - నేరుచు + డుజ్ 16 చే - నేరుచు + ఎను ఈ 97 చే - రు, లోపించిన – నేచు + ఎను సంధి 11 చే - నేచెను. రు లోపింపనిచో - నేరుచు + ఎను సంధి 11 చే - నేరుచెను క్రియా 85 చే - నేరిచెను నేరుచును, నేచును - నేరుచు - ధాతువు 5 చే - నేరుచు + లాట్టు 8 చే - నేరుచు+డుజ్ 16 చే - నేరుచు+ను ఈ 97 చే - రు వర్ణము లోపించిన - నేచు + ను=నేచును రు లోపింపనిచో - నేరుచు+ను = నేరుచును ముత్తునకు - నేరఁడు, నేరువఁడు నేరుచు - ధాతువు 7 చే - నేరుచు + లజి 8 చే - నేరుచు +డుజ్ ఈ 97 చే - చు వర్ణము లోపించిన, నేరు + డుజ్ 20 చే - నేర+డుజ్ తత్సమ 19 చే - నేరఁడు. చు - లోపింపనిచో - నేరుచు + డుజ్ 88 చే - నేరువ్+ఉ+డుజ్=నేరువు+డుజ్ 20 చే నేరువ+డుజ్ తత్సమ 19 చే - నేరువడు

## పోవునకు దుజ్ముత్తులు ముజ్జుం బరంబులగునపుడు వులోపంబుం బొదపదలును విభాషనగు. 98

పోదురు, పోవుదురు పోఁడు, పోవడు పోవుము పొదము, పదము, పొమ్ము

వ్యా పోవు ధాతువునకు, దుజ్ముత్తులు పరమగుచో - వు లోపమును, ముజ్జు పరమగుచో పొద, పదలును విభాషనగును దుక్ + ముత్=దుజ్ముత్ దుక్ = దుగాగమము, ముత్తు = ముజ్జిత్తులు ముజ్జు = మధ్యమ ముడుజ్జులు పోవు ధాతువునకు దుగాగమమును, ముజ్జిత్తులును, బరమగుచో 'వు' వర్ణ లోపమును, మధ్యమ ముడుజ్జుల పరమగుచో "పొద - పద"లును, విభాషనగును- అని తాత్పర్యము దుజ్ముత్తులకు - పోదురు, పోవుదురు - పోవు - ధాతువు 5 చే - పోవు + లాట్టు 8 చే - పోవు + రు, 22 చే - పోవు + దు+రు.

ఇట దుగాగమము పరమయినది కనుక ఈ 98 చే - వు లోపించిన పో + ద్ధు + రు = పోదురు - అగును వు - లోపింపనిచో పోవు + దు + రు = పోవుదురు పోఁడు, పోవఁడు - పోవు ధాతువు 7 చే - పోవు + లజి 8 చే- పోవు + డుజ్, ఇట, జిత్తు పరమగుచున్నది కనుక నీ 98 చే - వు లోపించినచో పో + డుజ్ తత్సమ 19 చే - పోఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు వు - లోపింపనిచో పోవు + డుజ్ 20 చే - పోవ+డుజ్. తత్సమ 19 చే - పోవఁడు ముజ్జునకు పోవుము - పోవు ధాతువు 6 చే - పోవు + లూట్టు 8 చే - పోవు + వు 29 చే - పోవు + ము = పోవుము పొదము, పదము - పోవు + ము - అని యుండఁగా నీ 98 చే - పోవునకు పొద పద లాదేశములయిన, పొద + ము = పొదము, పద + ము = పదము. పొమ్ము - పోవు + ము, అని యుండఁగా, ముజ్జు కూడ ముత్తులోనిదే కనుక నీ 98 చే - 'వు' లోపించినచో, పో + ము 61 చే - పొమ్ము

## అగు పోవుల కడ వ్రాల కిద్వక్రంబులు పరంబులగు నపుడు యకారంబగు 99

వక్ష్యమాణంబైత్వంబు అయి—ఐ, అయిరి—ఐరి పోయి, పోయిరి, పోయెను, పోయెడు

వ్యా అగు, పోవు - అను వాని తుది యక్షరములకు ఇత్వమును, వక్రమును ( = ఎ ) బరములగునప్పుడు, యకారమగును వ్రాలు=అక్షరములు అయి, ఐ - అగు ధాతువు 38 చే - అగు + ఇ ఈ 99 చే - తుది 'గు' అను నక్షరమునకు యకారమాదేశమయి అయ్ + ఇ = అయి - అగును 103 చే- అయి - అను దాని కంతటికి ఐ - ఆదేశమయిన ఐ అను రూపము సిద్ధించును లేనిచో అయి, అని యుండును అయిరి, ఐరి - అగు ధాతువు 3 చే - అగు + లిట్టు 8 చే - అగు + రు 17 చే - అగు + ఇ + రు ఈ 99 చే - 'గు' అను నక్షరమునకు యకార మాదేశమై, అయ్ + ఇ + రు = అయి + రు తత్సమ 26 చే - అయిరి క్రియా 103 చే - 'ఐ' ఆదేశమయినచో ఐ + రి = ఐరి కానిచో అయిరి వక్రము పరమయినప్పటి యుదాహరణమునకు—చూ 100 సూ పోయి - పోవు ధాతువు 38 చే - పోవు + ఇ ఈ 99 చే - 'వు' అను నక్షరమునకు యకార మాదేశమయి పోయ్ + ఇ = పోయి - అగును పోయిరి - పోవు - ధాతువు 3 చే - పోవు + లిట్టు 8 చే - పోవు + రు 17 చే - పోవు + ఇ + రు ఈ 99 చే - 'వు' అను నక్షరమునకు యకార

మాదేశమగును పోయ్ + ఇ + రు = పోయి + రు తత్సమ 26 చే - పోయిరి - అగును పోయెను - పోవు - ధాతువు, 3 చే - పోవు + లిట్టు 8చే- పోవు + డుజ్ 6 చే - పోవు + ఎను ఇట వక్రము పరమయినది గనుక, ఈ 99 చే - పోయ్ + ఎను = పోయెను - అగును పోయెడు పోవు-ధాతువు 5 చే - పోవు + లాట్టు 8 చే - పోవు + డుజ్ 16 చే - పోవు + ను 23 చే - పోవు + ఎడు + ను ఈ 99 చే - పోయ్ + ఎడు + ను = పోయెడును సంధి 20 చే - పోయెడు ఇట పోయెడును - అని కాక పోయెడు- అని చూపుటచే - 44 చే - నగు ఎడు వర్ణకము పరమగునపుడును నీ కార్య మగును పోవు - ధాతువు 44 చే పోవు + ఎడు ఈ 99 చే - పోయ్ + ఎడు = పోయెడు

విశే - (I) ఎ ఏ ఒ ఓ లు వక్రములు ఐనను ఎకారము మాత్రమే యిటఁబరమగును తక్కినవి ప్రసక్తములు కావు (II) అగు అచ్చిక 27 చే- అవు అగును ఆదేశము స్థానివంటిది కనుక, అవు + ఇ = అయ్ + ఇ అయి యనియే యగును (III) అగు పోవుల తుది గు-వు వర్ణములకు యకార మగును గకార వకారములకుఁగాదు వ్రాయి - అనుచో నక్షరమునే గ్రహింప వలెను తలఁగు + లజి = తలఁగు + డుజ్ 101 చే - తలఁ + డుజ్ = తలఁడు - అగును గు - లోపమననిచో నిటఁ జిక్కు కలుగును

పాఠ పరిశీలన - పోయెడు - అను ప్రథమ ముద్రణ పాఠమే యుక్తము పోయెడును - అను ముద్రణములు సరికావు పోయెడు - అన్నంత వఱకుఁ జూపుటచే 44 చే - పోవు + ఎడు - అని కాఁగా నీ సూత్రము వర్తించుట కవకాశ మేర్పడును

## అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు 100

వక్ష్యమాణంబు ద్విత్వంబు, ఆయెను, అయ్యేను ఆయెడు, అయ్యేడు

వ్యా అగు ధాతువునకు ఎత్వము కూడుచో నచ్చునకు దీర్ఘ మగును కూడు చోన్ = ముందటి వర్ణముతోఁ గలియు నప్పుడని యర్థము చూ ప్రకీర్ణక 9 ఆయెను అయ్యేను - అగు ధాతువు 3 చే - అగు + లిట్టు 8 చే - అగు + డుజ్ 16 చే - అగు + ఎను 99 చే - అయ్ + ఎను = అయెను ఏకదేశ వికృతమగుటచే అయ్ — అనునది, అగు ధాతువు వంటిదే యగును (ఏకదేశ వికృత మనన్యవత్ పరిభా) కనుక ఈ 100 చే- అయ్ - లోని అకారమునకు

దీర్ఘము కలిగి, ఆయెను - అగును ప్రకీర్ణక 6 చే - ఆయెను. = అ + య్యేను, సమాస 13 చే - అయ్యేను ద్విత్వము కానిచో ఆయెను ఆయెడు, అయ్యేడు - అగు - ధాతువు 5 చే - అగు + లాట్టు 8 చే - అగు + డుజ్ 16 చే - అగు + ను - 23 చే - అగు + ఎడు + ను 99 చే - అయ్ + ఎడు + ను = అయెడుమ ఈ 100 చే - ఆయెడును సంధి 20 చే- ఆయెడు, ప్రకీకర్ణక 6 చే - అ + య్యేడు సమాస 13 చే - అయ్యేడు ద్విత్వము కానిచో, ఆయెడు

విశే - దీర్ఘంబగు - అని విధించినప్పుడు, అచ్చునకు - అనుషష్ఠ్యంత ముపస్థిత మగును "అచశ్చ (1-2-28) హ్రస్వదీర్ఘప్లుతశబ్దైర్య త్రాజ్విధీయతే తత్ర 'అచః' ఇతి షష్ఠ్యంతంపద ముపతిష్ఠతే" —సి కౌ

పార పరిశీలన - ఆయెడు, అయ్యేడు - అని ప్రథమ ముద్రణము ఆయెడును, ఆయ్యేడును - అని కొన్నింటఁ గనబడును ప్రథమ ముద్రణమే గ్రాహ్యము ఆయెడు - అయ్యేడు అని చూపుటచే 44 చే నగు ఎడు వర్ణకము పరమగునప్పుడు గూడ నీ సూత్రము వర్తించును

## పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ వ్రాయి బహుళంబుగ లోపించు. 101

పిలఁడు, పిలువఁడు, పిలుము, పిలువుము లేచునకు ముజ్జు పరంబగునపుడు చ లోపంబగు లెమ్ము లెండు పిలుచు నిలుచు తలఁగు - ఇత్యాదులు

వ్యా పిలుచు - మొదలగు ధాతువులకు ముత్తు పరమయినప్పుడు తుది యక్షరము బహుళముగ లోపించును వ్రాయి=అక్షరము, పిలఁడు, పిలువఁడు - పిలుచు - ధాతువు, 7 చే - పిలుచు + లజీ 8 చే - పిలుచు + డుజ్ ఈ 101 చే - తుది యక్షరము లోపించినచో, పిలు + డుజ్ 20 చే - పిల + డుజ్ తత్సమ 19 చే - పిలఁడు పిలుచు + డుజ్ - అనుచో చ వర్ణము లోపింపనిచో, 88 చే - పిలువు + డుజ్ 20 చే-పిలువ + డుజ్ తత్సమ 19 చే - పిలువఁడు పిలుము- పిలువుము - పిలుచు - ధాతువు 6 చే - పిలుచు + లూట్టు, 8 చే - పిలుచు + వు 29 చే - పిలుచు + ము ఈ 101 చే- చ వర్ణము లోపించిన, పిలు + ము = పిలుము చ - లోపింపనిచో, పిలుచు +ము 88 చే - పిలువు + ము = పిలువుము ఇట్లే, నిలఁచు, తలఁగు -

ధాతువుల నుండి రూపసిద్ధి నరయనగును ధాతువునకు ముజ్జు పరమయినప్పుడు చు వర్ణమునకు లోపమగును ముజ్జు = మధ్యమ ముదుజ్జులు లెమ్ము - లేచు ధాతువు 6 చే లేచు + లూట్టు 8 చె - లేచు + వు 29 చే - లేచు + ము "లేచునకు ముజ్జు పరంబగునపుడు, చు లోపంబగు" లే + ము 61 చే లెమ్ము లెండు - లేచు ధాతువు 6 చే - లేచు + లూట్టు 8 చే - లేచు + రు 29 చే - లేచు + డుజ్ "లేచునకు ముజ్జు పరంబగునపుడు చు లోపంబగు" లే + డుజ్ 61 చే - లె + డుజ్ తత్సమ 19 చే - లెండు సంధి 22చే- ఖండ బిందువు కాదు

పాఠ పరిశీలన - తలఁగు - ప్రథమ ముద్రణ పాఠము తలఁచు - అన్య ముద్రణములు సరికావు

## లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి. 102

కావుతను, కాతను, అగుట, కావుఁ, అగుడును, కావుడును, కానను, కావునను అనుడును, అనవుడును, నావుడును - ఇత్యాదు లెఱుంగునది

వ్యా ముత్తు కాక యితరములు పరమగునపుడు సైతము కాదేశాదులు కనఁబడును కావుతను, కాతను - అగు ధాతువు 26 చే - అగు + తను ఈ 102 చే - కాదేశమును వు వర్ణాగమమును నయినచో - కా + వు + తను = కావుతను కాదేశ మొక్కటే యయినచో - కా + తను = కాతను అగుట, కావుట - అగు ధాతువు 35 చే - అగు + ట = అగుట ఈ 102 చే - కాదేశమును, వు వర్ణాగమమును నైనచో కా + వు + ట = కావుట అగుడును, కావుడును - అగు - ధాతువు 47 చే - అగు + డును = అగుడును కా - ఆదేశము వు వర్ణాగమము నయినచో, కా + వు + డును = కావుడును, కానను కావునను - అగు - ధాతువు - 41 చే - అగు + నను, ఈ 102 చే - కా - ఆదేశమయినచో, కా + నను = కానను కా - ఆదేశము, వువర్ణాగమము నయినచో, కా + వు + నను = కావునను అనుడును, అనవుడును, నావుడును - అను ధాతువు 42 చే - అను + డును = అనుడును అను - అనుదానికి అన ఆదేశమయి వు వర్ణమాగమమైన, అన + వు + డును = అనవుడును - అగును అను + డును - అనుచో, అనునకు నా - ఆదేశమును వు వర్ణాగమమును నైనచో, నా + వు + డును = నావుడును - అగును

## అచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు. 103

అయిదు—ఐదు, అయిరేని— ఐరేని — అవుడు—ఔడు,
గవుసెన గౌసెన

వ్యా అచ్చ తెనుఁగు శబ్దములయందు, అయి- అవులకు వక్రతమములు బహుళముగ నాదేశములగును వక్రతమములు = ఐ ఔ లు అయికి - ఐ, అవు - అను దానికి, ఔ - ఆదేశములగునని తాత్పర్యము అయిదు = ఐదు అయిరేని = ఐరేని, అవుడు = ఔడు, గవుసెన = గౌసెన - అని బహుళముగనగును ఐ ఔ లు కానిచో - అయిదు, అయిరేని, అవుడు, గవుసెన - అనియు నుండును క్రియల కుదాహరణములు,-అయిరి = ఐరి (99) అవుము= ఔము (96) మొ॥ క్రియలకు వెనుక నుదాహరించి యుండుటచే నిట నామములకే యుదాహరణములు చూపఁబడెను అయిరేని = ఐచ్చెన వని చేసిన పెండ్లి కుండలు

విశే - అనేక వర్ణములు గల స్థానికేక వర్ణము నాదేశముగ విధించినచో నది స్థానియందల తుది వర్ణమునకే యాదేశమగును "(అలోంత్యస్య" పాణి) కాని ఐ ఔ లు సంధ్యక్షరములు గనుక సర్వాదేశము లయ్యెనని కొందఱు సెలవిత్తురు సంధ్యక్షరము లయినను ఐ ఔ లేకవర్ణములే యగుటచే నిది తృప్తికరము కాదు నిర్దేశమును బట్టి సర్వాదేశములుగ గ్రహింపనగును

పద సార్థక్యము - (1) అచ్ఛికంబులందు - అనుటచే సంస్కృత సమములలో నీ విధి వర్తింపదు దయిత-ఇట 'ఐ' ఆదేశము కాదు జయించు ఇట, ఐ - కాదు కవి + లు = కవులు ఇట ఔ - కాదు (11) బహుళమనుటచే అలయించు - అనుచో, ఐ - కాదు తగు = తవు - అనుచో - కాదు

## కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగు నపుడు కల యగు. 104

ప్ర కలఁడు, కలరు కలదు, కలవు.
మ కలవు, కలరు
ఉ కలను, కలము

వ్యా కలుగు ధాతువునకు అస్త్యర్థమున లట్టు పరమయినప్పుడు 'కల' అనునది యగును అస్తి + అర్థ = అస్త్యర్థము ఉన్నాఁడు, ఉన్నది అను

నర్థములలో, కలుగు ధాతువునకు కలాదేశము ప్రథమ పురుషము కలఁడు కలుగు - ధాతువు 2 చే - కలుగు + లట్టు 8 చే - కలుగు + డుఙ్ ఈ 104 చే - కల + డుఙ్ తత్సమ 19 చే - కలఁడు కలరు - కలుగు = ధాతువు 2 చే - కలుగు + లట్టు 8 చే - కలుగు + రు ఈ 104 చే - కల + రు = కలరు అమహదర్థమునందు - కలదు - కలవు - 2 చే - కలుగు + లట్టు 8 చే - కలుగు + డుఙ్, కలుగు + రు ఈ 104 చే - కల + డుఙ్ కల + రు 12 చే - కల + దు = కలదు కల + వు = కలవు మధ్యమోత్తమ పురుషములు - కలుగు - ధాతువు 2 చే - కలుగు + లట్టు 8 చే - కలుగు + వు కలుగు + రు, (మధ్యమ) కలుగు + ను, కలుగు + ము (ఉత్తమ) ఈ 104 చే - కల + వు = కలవు కల + రు = కలరు కల + ను = కలను, కల + ము = కలము పొందు అను నర్థమున కల — కాదు

## త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు. 105

ఎడి ఎడు లకు లోపంబిట నిత్యంబు కలవాఁడు - కలుగు వాఁడు.

వ్యా తృవర్థకార్థమున, కలుగు ధాతువునకు 'కల' అను నాదేశము విభాషనగును తృ + అర్థ = త్రర్థ తృ - అనునది కర్త్రర్థమునఁ జేరు ప్రత్యయము (44 సూ ) కలవాఁడు - కలుగు - ధాతువు 44 చే - కలుగు + ఎడి, కలుగు + ఎడు - సమాస 9 చే - కలుగు + ఎడి + వాఁడు కలుగు + ఎడు + వాఁడు ఈ 105 చే - కల + ఎడి + వాఁడు, కల + ఎడు + వాఁడు "వానికి లోపంబు బహుళంబుగా నగు" (45) అను బహుళ శబ్దముచే "ఎడి యెడులకు లోపంబిట నిత్యంబు" అని చెప్పఁబడెను కనుక ఎడి-ఎడులు నిత్యముగ లోపించి కలవాఁడు - అని యేర్పడును కలాదేశము కాని పక్షమున, కలుగు + ఎడి + వాఁడు 45 చే - ఎడి - ఎడులు లోపింపఁగా - కలుగు వాఁడు - అగును

విశే - కలిగెడివాఁడు, కలిగెడువాఁడు వంటివి యుండనగును ఎడి ఎడులకు కలాదేశ పక్షముననే లోపము నిత్యమనఁదగును

## అస్త్యర్థంబునకు లఙ్, మి, క, ని, వడి, వర్ణకంబులు పరంబులగునపుడు లేయగు. 106

ప్ర లేఁడు, లేరు, లేదు, లేవు

మ లేవు, లేరు

ఉ లేను, లేము

లేమి లేక, లేని, లేవడి

వ్యా ఆస్త్యర్థమగు కలుగు ధాతువునకు, లజీ, మి, క, ని, వడి - లను ప్రత్యయములు పరములగునప్పుడు 'లే' అనునది యాదేశమగును ప్రథమ పురుషము లేఁడు కలుగు-ధాతువు 7 చే - కలుగు + లజీ 8 చే కలుగు +డుజ్ ఈ 106 చే - లే + డుజ్ తత్సమ 19 చే - లేఁడు సంజ్ఞా 15చే- సాధ్యపూర్ణము లేదు లేరు - కలుగు - ధాతువు 17 చే - కలుగు + లజీ 8 చే - కలుగు + రు ఈ 106 చే - లే + రు = లేరు అమహదర్థమునందు లేదు, లేవు - కలుగు ధాతువు 7 చే - కలుగు + లజీ 8 చే - కలుగు + డుజ్, కలుగు + రు 106 చే - లే, డుజ్+లే+రు 12 చే - లే +దు= లేదు లే + వు = లేవు మధ్యమోత్తమ పురుషములు - కలుగు - ధాతువు 7 చే - కలుగు + లజీ 8 చే - కలుగు + వు కలుగు + రు, (మధ్యమ) కలుగు + ను కలుగు + ము (ఉత్తమ) 106 చే - లే + వు = లేవు; లే + రు = లేరు లే + ను = లేను, లే + ము = లేము' లేమి కలుగు- ధాతువు 3 చే - కలుగు + మిజీ ఈ 106 చే - లే + మిజీ = లేమి లేక - కలుగు - ధాతువు 39 చె - కలుగు + కజీ ఈ 106 చే - లే + కజీ = లేక లేని 47 చే - కలుగు + నిజీ ఈ 106 చే - లే + నిజీ = లేని, లేవడి - కృదంత 22 చే - కలుగు + వడి ఈ 106 చే - లే + వడి = లేవడి

## వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు. 107

ప్ర ఒల్లడు, ఒల్లరు, ఒల్లదు, ఒల్లవు

మ ఒల్లవు, ఒల్లరు

ఉ ఒల్లను, ఒల్లము

ఒల్లమి ఒల్లక, ఒల్లని పక్షంబున, వలవఁడిత్యాది 'ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి

వ్యా వలచు - ధాతువునకు వ్యతిరేకమున 'ఒల్ల' అనునది విభాషనగును ప్రథమ పురుషము -ఒల్లఁడు - వలచు ధాతువు 7 చే - వలచు + లజీ 8 చే- వలచు + డుజ్ ఈ 107 చే - ఒల్ల + డుజ్ తత్సమ 19 చే - ఒల్లఁడు ఒల్లరు - వలచు - ధాతువు 7 చే - వలచు + లజీ 8 చే - వలచు + రు ఈ 107 చే - ఒల్ల + రు = ఒల్లరు అమహదర్థమునందు ఒల్లరు, ఒల్లవు

వలచు - ధాతువు 7 చే - వలచు + లట్ 8 చే - వలచు + డుజ్, వలచు + రు ఈ 107 చే - ఒల్ల + డుజ్, ఒల్ల + రు 12 చే - ఒల్ల + దు = ఒల్లదు, ఒల్ల + వు = ఒల్లవు మధ్యమోత్తమ పురుషములు 7 చే - వలచు + లట్ 8 చే - వలచు + వు, వలచు + రు (మధ్యమ) వలచు + ను, వలచు + ము (ఉత్తమ) ఈ 107 చే - ఒల్ల + వు = ఒల్లవు, ఒల్ల + రు=ఒల్లరు, ఒల్ల + ను = ఒల్లను, ఒల్ల + ము = ఒల్లము ఒల్లమి - వలచు 37 చే - వలచు + మిజ్, ఈ 107 చే - ఒల్ల + మిజ్ = ఒల్లమి ఒల్లక - 39 చే - వలచు + కజ్ ఈ 107 చే - ఒల్ల + కజ్ = ఒల్లక ఒల్లని - 47 చే - వలచు + నిజ్ ఈ 107 చే - ఒల్ల + నిజ్ = ఒల్లని వలచునకు ఒల్ల విభాషనగును గనుక ఒల్ల కానప్పుడు వలవఁడు మొదలగు రూపములగును వలవఁడు - వలచు ధాతువు 7 చే - వలచు + లట్ 8 చే - వలచు+డుజ్ ఈ 107 చే - ఒల్ల - ఆదేశము కానిచో, 88 చే - వలవు + డుజ్ 20 చే - వలవ + డుజ్ తత్సమ 19 చే - వలవఁడు - ఇత్యాదులు ఒల్లమి అను దానికి ఒల్లఁబాటు-అనియుఁ బ్రయోగములందుఁ గనఁబడును చూ సంధి 27.

## చువర్ణంబుతోడ దుగ్గకారంబు తకారంబగు. 108

నిలుతురు, పిలుతురు, అడఁతురు, కడతురు, చింతురు, పెంతురు, పచింతురు, వచింతురు చేతురు కోతు రిత్యాదు లసాధువులని యెఱుఁగునది

వ్యా చు వర్ణముతోఁ గూడ, దుగాగమ దకారము తకారమగును నిలుతురు - నిలుచు - ధాతువు 5 చే - నిలుచు+లాట్టు 8 చే - నిలుచు+రు 22 చే - నిలుచు + దు + రు = నిలుచుద్ + ఉ + రు చుద్ అను దానికి, ఈ 108 చే - తకార మాదేశమయి, నిలుత్+ఉ + రు=నిలుతురు - అగును ఇట్లే, పిలుచుదురు = పిలుతురు అడఁతురు - అడఁగు - ధాతువు 76 చే-అడఁగు + చు = అడఁచు 5 చే - అడఁచు + లాట్టు 8 చే - అడఁచు +దు + రు ఈ 108 చే - చుద్ అను దానికి తకారము అడఁత్+ఉ+రు= అడఁతురు కడతురు - కడచు - ధాతువు 5 చే - కడచు + లాట్టు 8 చే - కడచు + రు 22 చే - కడచు + దు + రు ఈ 108 చే - కడత్ + ఉ +రు = కడతురు చింతురు - చినుఁగు - ధాతువు 76 చే - చినుఁగు+చు= చినుఁ + చు 77 చే - చించు 5 చే - చించు + లాట్టు 8 చే - చించు + రు 22 చే - చించు + దు + రు 90 చే పకారము కానిచో, ఈ 108 చే - చింత్ + ఉ + రు = చింతురు పెంతురు - పెరుఁగు - ధాతువు 76 చే -

పెరుఁ + చు 77 చే - పెంచు 5 చే - పెంచు + లాట్టు 8 చే- పెం+ంచు రు 22 చే - పెంచు + దు + రు 90 చే - వకారము కానిచో, ఈ 108చే- పెంత్ + ఉ + రు = పెంతురు పచింతురు - పచ్ - ధాతువు 63 చే - పచ్ + ఇంచు = పచించు 5 చే - పచించు + లాట్టు 8 చే - పచించు+ రు 22 చే - పచించు + దు + రు 90 చే వకారము కానిచో, ఈ 108 చే- పచింత్ + ఉ + రు=పచింతురు ఇట్లే పచించుదురు = పచింతురు - చేతురు కోతురు - ఇత్యాదు లసాధువులు చెయుదురు, కోయుదురు - సాధువులు సూత్రమున, చు వర్ణముతోడ దుగ్ధకారమునకే తకారము విధింపఁబడెను చేయుదురు, కోయుదురు - అనునవి యు వర్ణముతోడి దుగ్ధకారములు కాన వీనికి, తకార మీ సూత్రముచేఁ బ్రాప్తింపదు

విశే - (1) 90 చే- చింపుదురు, పెంపుదురు, పచింపుదురు, వచింపుదురు- అను రూపము లేర్పడును వచ్చుదురు = వచ్+చుద్+ఉ+రు ఈ 108 చే- వచ్ + త్ + ఉ + రు చతల సంయోగము విజాతీయము గాన నిర్దేశాను సారముగ, చకారము తకారమగును వత్ + త్ + ఉ + రు = వత్తురు

## పడుజి కొను లొకానొకచో స్వార్థంబునం దను ప్రయుక్తంబు లగు. 109

చొచ్చు చొరఁబడు, నిలుచు నిలువఁబడు కూడు కూడఁబడు, పండు పండుకొను

వ్యా పడుజి, కొను - ధాతువులు కొన్నియెడల స్వార్థమునం దను ప్రయుక్తములగును చొరఁబడు - చొచ్చు - ధాతువు ఈ 109 చే - చొచ్చు+ పడుజి 91 చే-చొరు + పడుజి 20 చే - చొర + పడు 21 చే- చొరను+ పడు సంధి 16 చే - చొరను + బడు సంధి 17 చే - చొరఁబడు = చొచ్చు — అని యర్థము నిలువఁబడు - నిలుచు - ధాతువు ఈ 109 చే- నిలుచు + పడుజి 88 చే - నిలువు + పడుజి 20 చే - నిలువ + పడు 21 చే - నిలువను + పడు సంధి 16 చే - నిలువను + బడు సంధి 17చే- నిలువఁబడు = నిలుచు - అని యర్థము కూడఁబడు - కూడు - ధాతువు ఈ 109 చే - కూడు + పడుజి 20 చే - కూడ + పడు 21 చే - కూడను+ పడు సంధి 16 చే - కూడను + బడు సంధి 17 చే - కూడఁబడు=కూడు- అని యర్థము పండుకొను - పండు - ధాతువు ఈ 109 చే - పండు + కొను = పండుకొను పండు - అని యర్థము పండు = శయనించు స్వార్థ

మనఁగా నిట ధాతువుయొక్క యర్థమని తాత్పర్యము పడుజీ, కొనులు ధాతువు యొక్క యర్థమునే యనువదించుచున్నవి చొరఁబడు = చొచ్చు - ఇత్యాది

విశే - పండుకొను - అనుచో, కొను - స్వార్థ ధాతువు గాన, 53 చే. ఇత్వము కాదు

## తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు; నగుచో నుత్వంబు పయిని దాని తకారంబు దకారంబగు. 110

అగుదెంచు, నెగయుదెంచు, పోవుదెంచు, అగు, నెగయు, పోవు, చొచ్చు, పుచ్చు, తోఁచు, నడచు, పఱచు, మొలచు, వీచు - ఇత్యాదులు

వ్యా అగు- మొదలగు ధాతువులకు, తెంచు ధాతువను ప్రయుక్తమగును అగుచో ఉత్వము మీఁది తెంచు ధాతువు యొక్క తకారము, దకారమగును అగుదెంచు - అగు ధాతువు ఈ 110 చే - అగు + దెంచు = అగుదెంచు ఇట్లే నెగయు + తెంచు = నెగయుదెంచు, పోవు + తెంచు = పోవుదెంచు అగు, నెగయు, పోవులు, 'ఉదంత' ములు కనుక తెంచు = ధాతు తకారము దకారమయ్యెను

## అఖ్యాగతి నరుగ్వాదుల కయ్యాది యను ప్రయుక్తంబగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు. 111

అరుదెంచు, అరుగుదెంచు, ఏతెంచు, ఏగుదెంచు, చనుదెంచు

వ్యా వచ్చుట యను నర్థమునందు, అరుగు - మొదలగువానికి తెంచు- ధాతు వనుప్రయుక్తమగును అగుచో గువర్ణము విభాషగ లోపించును అరుదెంచు అరుగుదెంచు -అరుగు-ధాతువు ఈ 111 చే - అరుగు+తెంచు గులోపించినచో అరు+తెంచు 110 చే - ఉత్వముపయిని తెంచు ధాతు తకారమునకు దకారము అరుదెంచు గు- లోపింపనిచో, అరుగు+తెంచు 110 చే - ఉత్వముమీఁది తకార మునకు దకారము- అరుగుదెంచు, ఏతెంచు, ఏగుదెంచు - ఏగు-ధాతువు ఈ 111 చే - ఏగు+తెంచు గు- లోపించిన ఏ+తెంచు=ఏతెంచు గులోపింపనిచో- ఏగు+తెంచు 110 చే - తకారమునకు, దకారము ఏగుదెంచు చనుదెంచు - చను-ధాతువు ఈ 111 చె - చను + తెంచు 110 చే - తకారమునకు దకారము చనుదెంచు అరుదెంచు, అరుగుదెంచు, ఏతెంచు, ఏగుదెంచు, చను దెంచు - అనువానికి వచ్చుట యని యర్థము

## అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు. 112

చొచ్చు చొత్తెంచు, పుచ్చు పుత్తెంచు, తోఁచు
తోఁచెంచు

వ్యా అనుప్రయుక్తమగు తెంచు-ధాతువు (110) పరమగుచో, చువర్ణము లోపించును చొత్తెంచు - చొచ్చు - ధాతువు "తెంచుధాతు వగ్వాదుల కను ప్రయుక్తంబగు, నగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు (110) చొచ్చు + తెంచు ఇట తకారము దకారము కావలసియున్నను, ఈ 112 చే - చువర్ణము లోపించును గనుక దకారముకాదు చొచ్చు + తెంచు ఈ 112 చే- చొచ్ + తెంచు- అగును (చొచ్ + చు = చొచ్చు) ఒక హల్లునకు, విజాతీయ మగు హల్లుతో సంయోగమేర్పడునప్పుడాహల్లు పరహల్లుగా మాఱునని నిర్దేశాను సారముగ గ్రహింపఁ దగును కాన, చకారము పర హల్లుగా మాఱి చొత్+ తెంచు=చొత్తెంచు-అయ్యెను పుచ్చు+తెంచు ఈ 112 చే - పుచ్+తెంచు= పుత్+తెంచు, పుత్తెంచు తోఁచు+తెంచు ఈ 112 చే - తోఁతెంచు ఇట్లే తక్కినవి (కృదంత 11, 17 సూ )

విశే (I) చొచ్చు + తెంచు = చొ + తెంచు-అగుననియు, గురుత్వ మును నిలుపుటకు, తకారమునకు ద్విత్వ మాదేశమయ్యెననియుఁ గొందఱు సెల విత్తురు కాని గురుత్వమును నిల్పవలసిన నిర్బంధము గాని గురుత్వమును నిల్పుటకు ద్విత్వమే కావలెనను నిర్బంధముగాని లేదు కావున నీ ప్రక్రియ సమర్థనీయముగాదు (II) చొచ్చు + తెంచు, తోఁచు + తెంచు 110 చే - ఉత్వముమీఁది తకారమునకు దకారము కావలెనుగాని, యీ 112 చే - చువర్ణ లోపమున నిమిత్తమగు ఉత్వమునకు వినాశము కలుగఁబోవుచున్నది కాన, తకారమునకు దకారము కాదు "అకృతవ్యూహాః పాణినీయాః (పాణి) నిమిత్తం వినాశోన్ముఖం దృష్ట్వా తత్ప్రయుక్తం కార్యంన కుర్వంతీత్యర్థః" (సి కౌ ) ఈ సమన్వయము శాస్త్రానుగుణముగా నున్నది-ప్రౌ సూ

## అద్దానికి ముత్తుపరంబగునపుడు తే తేరులగు. 113

అగుదేఁడు, అగు దేరఁడు, అగుదెమ్ము, అగుదేరము

వ్యా అనుప్రయుక్తమగు తెంచుధాతువునకు (110) ముత్తుపరమగునపుడు, తే - తేరులగును అగుదేఁడు అగు ధాతువు "తెంచుధాతు వగ్వాదుల కను ప్రయుక్తంబగు (110) అగు+తెంచు 7 చే - అగు+తెంచు+లజీ 8 చే - అగు+తెంచు+డుజ్ ఈ 113 చే - తే-ఆదేశమయ్యెన, అగు+తే+డుజ్

110 చే - అగు+దే+డుణ్ తత్సమ 19 చే - అగుదేఁడు సంజ్ఞా 15 చే - సాధ్యపూర్ణము లేదు అగుదేరఁడు - అగు+తెంచు+డుణ్-అని యుండఁగా, ఈ 113 చే - తేరు, ఆదేశమయిన అగు+తేరు+డుణ్ 110 చే - అగు+దేరు+డుణ్ 20 చే - అగు+దేర+డుణ్ తత్సమ 19 చే - అగుదేరఁడు అగు+తే+డుణ్, అగు+తేరు+డుణ్ - అనుచోట్ల, తే - తేరులు తెంచున కాదేశములయినవి ఆదేశము స్థానివంటిది కనుక 110 చే - తే తేరుల తకారము నకు దకారమగును (స్థానివదాదేశః - పాణినీయము) అగుదెమ్ము - అగు ధాతువు "తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు" (110) అగు+తెంచు 6 చే - అగు+తెంచు+లూట్టు 8 చే - అగు+తెంచు+వు 29 చే - అగు+తెంచు+ము ఈ 113 చే - తే-ఆదేశమైన అగు+తే+ము 110 చే - అగు+దే+ము 61 చే - అగుదెమ్ము అగుదేరుము అగు + తెంచు + ము - అని యుండఁగా, నీ 113 చే - తేరు - ఆదేశమయిన అగు+తేరు+ము 110 చే - అగు+దేరు+ము=అగుదేరుము-అగును

## భూతంబున లజికి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తంబగు 114.

వాఁడు రాఁడయ్యెను, వారు రారయిరి, అది రాదయ్యెను, అవి రావయ్యెను, నీవు రావయితివి, మీరురారయితిరి, నేను రానయితిని, మేము రామయితిమి

వ్యా భూతకాలమున, లజికి, లిడంతమగు అగు ధాతు వనుప్రయుక్త మగును లజి రూపములు - ప్రథమ - రాఁడు, రారు, అమహదర్థమున, రాదు, రావు మధ్యమ రాదు, రావు ఉత్తమ - రాను, రాము, లిడంతమగు, అగు ధాతు రూపములు ప్ర అయ్యెను, అయిరి అమహదర్థము -అయ్యెను (ఏ, బ) మధ్యమ అయితివి అయితిరి ఉ అయితిని, అయితిమి ఈ 114 చే - భూతమున, లజిరూపములకు, లిడంతమగు అగు ధాతురూపము లనుప్రయుక్త మగును ప్ర వాఁడు రాఁడయ్యెను రాఁడు - భూతమున నయిన లజి రూపము అయ్యెను - అనునది లిడంతమగు అగుధాతు రూపము ఈ సూత్రముచే - రాఁడు + అయ్యెను సంధి 1 చే - రాఁడయ్యెను - అని యేర్పడును ఇట్లే రారు + అయిరి = రారయిరి రాదు + అయ్యెను = రాదయ్యెను రావు + అయ్యెను = రావయ్యెను మధ్యమ - రావు+అయితివి=రావయితివి రారు + అయితిరి = రారయితిరి ఉత్తమ - రాను + అయితిని = రాన్+అయితిని,

రానయితిని రాము + అయితిమి = రామయితిమి లిడంతమగు అగు ధాతు రూపముల ప్రక్రియ - అయ్యేను దీని ప్రక్రియకు చూ 100 సూ అయిరి - చూ 99 సూ మధ్యమోత్తమపురుషములకు - అగు ధాతువు 3 చే - అగు + లిట్టు 8 చే అగు + వు, అగు + రు, (మధ్యమ) అగు + ను, అగు+ము (ఉత్తమ) 18 చే - అగు + తి + వు అగు + తి + రు, అగు+తి+ను, అగు+తి+ము 17 చే - అగు + ఇ + తి + వు అగు+ఇ+తి+రు, అగు + ఇ + తి + ను, అగు + ఇ+తి + ము 39 చే - అయ్+ఇ+తి + వు అయ్ + ఇ + తి + రు, అయ్+ఇ+తి+ను, అయ్+ఇ+తి+ము=అయితి+వు, అయితి+రు, అయితి+ను, అయితి+ము తత్సమ 20 చే - అయితివి, అయితిరి, అయితిని, అయితిమి లిట్ రూపముల ప్రక్రియ. ప్రథమ - రాఁడు - దీని ప్రక్రియకు, చూ 91 సూ రారు - వచ్చు - ధాతువు 7 చే - వచ్చు + లట్ 8 చే - వచ్చు + రు 91 చే - రా + రు = రారు అమహదర్థమున రాదు, రావు - వచ్చు - ధాతువు 7 చే - వచ్చు + లట్ 8 చే - వచ్చు + డుజ్ వచ్చు + రు, 91 చే - రా + డుజ్, రా + రు 12 చే - రా + దు = రాదు, రా + వు = రావు మధ్యమోత్తమ పురుషములు - వచ్చు-ధాతువు 7 చే - వచ్చు+లట్ 8 చే - వచ్చు+వు, వచ్చు+రు, వచ్చు+ను, వచ్చు+ము 91 చే - రా + వు = రావు, రా+రు=రారు; రా +ను=రాను, రా+ము=రాము

## నుబ్యంతంబగు నగు ధాతువు క్రియావిశేషణంబుల కను ప్రయుక్తంబగు: నుటికి విభాష నగు. 115

కాను — అనునది నుబ్యంతంబగు నగు ధాతువు రూపంబు

వ్యా నుట్ - అంతమందుఁగల అగు ధాతువు, క్రియావిశేషణములకు నిత్యముగను, నుబ్యంతమునకు విభాషగను నను ప్రయుక్తమగును నుట్ అంతమందుగలఁ గల అగు ధాతువు=కాను - అనునది కాను - అగు-ధాతువు 40 చే - అగు+నుట్, 91 చే - కా + నుట్ = కాను క్రియావిశేషణము = క్రియానిష్ఠమగు విశేషమును దెలుపునది క్రియా విశేషణము ఉదా॥ లెస్సగాఁ బలికెను ఇట లెస్స అనునది పలుకుట యందలి విశేషమును దెలుపును గనుకఁ గ్రియావిశేషణము క్రియావిశేషమునకు - లెస్సగాను నుటికి - చూడఁగాను, చూడను (116 సూ)

విశే - నుట్ = నుబ్యంతము - ప్రత్యయగ్రహణేతదంతస్యాపి గ్రహణమ్-పరిభా

## దానికి హ్రస్వంబు విభాష నగు. 116

లెస్సగాను, లెస్సగను, న్యాయ్యముగాను, న్యాయ్యముగను ఇట సరళంబు నిత్యంబు, చూడఁగాను, చూడఁగను, చూడను: ఇట స్వత్వంబు లేదు

వ్యా నుఙ్యంతంబగు అగు ధాతువునకు (115) హ్రస్వము విభాషనగును కాను - నుఙ్యంతంబగు అగు ధాతువురూపము దీనికి హ్రస్వము విభాషనగును లెస్స-క్రియావిశేషణము 115 చే - లెస్స+కాను ఈ 116 చే - హ్రస్వము కలిగినచో - లెస్స+కను సంధి 13 చే - గ స డ దవాదేశము బహుళముగ నగును "ఇట సరళంబు నిత్యంబు" అనుటచే బహుళమున కిటఁ బ్రవృత్తి చెప్పఁబడినది ప్రవృత్తి = విధించిన వ్యాకరణ కార్యము నిత్యముగఁ బ్రవర్తించుట కనుక, లెస్స + కను = లెస్సగను - అని యగును ఈ 115 చే - హ్రస్వము కానిచో - లెస్స+కాను సంధి 13 చే - గ స డ దవాదేశము బహుళము 'ఇట సరళంబు నిత్యంబు" అనుటచే, లెస్సగాను - అని యగును ఇట్లే, న్యాయ్యము - క్రియావిశేషణము 115 చే - న్యాయ్యము+కాను ఈ 116 చే - హ్రస్వము కలిగిన-న్యాయ్యము+కను "ఇట సరళంబు నిత్యంబు" అనుటచే సంధి 13 చే - నిత్యముగ గ స డ దవాదేశము కలిగి, న్యాయ్యము గను-అగును హ్రస్వముకానిచో న్యాయ్యము+కాను=న్యాయ్యముగాను-అగును న్యాయ్యముగాఁ బలికెను అనుచోఁ బలుకుటలోని న్యాయ్యతను జెప్పుచుండుటచే న్యాయ్యము అనునది క్రియావిశేషణము న్యాయ్యము=న్యాయముతో గూడినది (న్యాయా దనపేతంయత్, ఉచితే యుక్తి యుక్తేచ - శబ్దస్తో) నుఙికి - చూడను - నుఙ్యంతము ఎట్లనఁగా చూచు - ధాతువు 40 చే - చూచు+నుఙి 91 చే - చూడు + నుఙి 20 చే - చూడను నుఙికి, 'కాను' అనునది 115 చే - విభాష నను ప్రయుక్తమగును కాను - అనుప్రయుక్త మయినచో చూడను + కాను ఈ 116 చే - హ్రస్వము కలిగిన చూడను+కను సంధి 16 చే - చూడను+గను సంధి 17 చే - చూడఁగను ఈ 116 చే - హ్రస్వము కానిచో - చూడను+కాను సంధి 16 చే - చూడను+గాను సంధి 17 చే - చూడఁగాను "ఇట స్వత్వంబులేదు" అనగా-చూడను+గను, చూడను+గాను- అని యుండఁగా, సంధి 17 చే - బిందు సంశ్లేషములు విభాషనగును పక్షమున చూడనుగాను చూడనుగను అని స్వత్వమగును కాన "ఇట స్వత్వంబులేదు-అని వ్యవస్థ చేయఁబడెను కనుక స్వత్వ రూపముండదు బిందు సంశ్లేషములే

యుండును 115 చే - 'కాను' అనుప్రయుక్తము కాని పక్షమున్న చూడను- అని యుండును

## ఉన్న కల న వర్ణకంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు. 117

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు.

వండుచున్నవాఁడు వండుచున్నాఁడు వండుచున్నవారు వండుచున్నారు వండుచున్నవాఁడవు వండుచున్నాఁడవు వండు చున్నవారరు వండుచున్నారరు వండుచున్నవాఁడను వండు చున్నాఁడను వండుచున్నవారము వండుచున్నారము ఇట్లు వండఁగలవాఁడు, వండఁగలాఁడు, వండినవాఁడు, వండినాఁ డిత్యాదు లెఱుంగునది

వ్యా ఉన్న - కల - న, అను ప్రత్యయముల మీఁది తచ్ఛబ్ద వకార మునకు లోపము విభాషనగును ఈ ప్రత్యయములు 46 చే - విధింపఁబడినవి తచ్ఛబ్దము = ఆ శబ్దము వాఁడు, వారు - తచ్ఛబ్దము యొక్క మహద్రూప ములు వండుచున్నాఁడు, వండుచున్నారు - వండు - ధాతువు 46 చే - వండు + ఉన్న 14 చే - వండుచు + ఉన్న సంధి 11 చే - వండుచున్న, సమాస 9 చే - వండుచున్న + వాఁడు, వండుచున్న + వారు ఈ 117 చే- వాఁడు, వారు - అను వానిలోని వకారమునకు లోపము కలిగిన - వండుచున్న+ అఁడు, వండుచున్న + అరు సంధి 4 చే - నిట సంధి బహుళము "బాహుళకం బుచే నిట సంధి నిత్యంబు" (సంధి 4) వండు చున్నాఁడు, వండుచున్నారు వకారము లోపింపనిచో వండుచున్నవాఁడు, వండుచున్నవాఁడు వండుచున్న వాఁరు వండుచున్న + వాఁడు పైని సాధింపఁబడెను కారక 33 చే - వండుచున్న + వాఁడు + వు, వండుచున్న + వారు+రు, వండుచున్న+ వాఁడు + ను, వండుచున్న + వారు + ము కారక 34 చే - వండుచున్న వాఁడవు వండుచున్నవారరు, వండుచున్నవాఁడను, వండుచున్న వారము ఈ 117 చే- తచ్ఛబ్ద వకారము లోపించిన వండుచున్న+అఁడవు, వండుచున్న+ అరరు, వండుచున్న + అఁడను, వండుచున్న + అరము సంధి 4 చే- సంధి బహుళము "బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు" వండుచున్నాఁడవు, వండు చున్నారరు, వండుచున్నాఁడను వండుచున్నారము. తచ్ఛబ్ద వకారము లోపిం

వనిచో వందుచున్నవాఁడవు వందుచున్న వారరు, వందుచున్న వాఁడను, వందుచున్నవారము - అను రూపము లుండును వందఁగలాడు -వందుధాతువు 46 చే - వందు + కలఁటి 20 చే - వంద + కల 21 చే - వందను+కల సంధి 16 చే - వందను + గల సంధి 17 చే - వందగల సమాస 9 చే - వందఁగల + వాడు ఈ 117 చే-తచ్ఛబ్ద వకారము లోపించిన, వందఁగల+ ఆడు సంధి 4 చే - సంధి బహుళము "బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు" వందఁగలాడు వకారము లోపింపనిచో వందఁగలవాఁడు వందినాఁడు -వందు- ధాతువు 46 చే - వందు + న 17 చే - వందు + ఇ + న సంధి 11 చే- వందిన సమాస 9 చే - వందిన + వాఁడు ఈ 117 చే - వందిన+ అఁడు. సంధి 4 చే - సంధి బహుళము "బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు" వంది నాఁడు వకారము లోపింపని పక్షమున, వందినవాఁడు - ఇత్యాదులు

విశే - వందుచున్న + వాఁడు = వందుచున్న + అఁడు - అనుచో, అఁడు - అనునది పదమే యగును "ఏకదేశ వికృత మనన్యవత్" (పరిభా) వాఁడు శబ్దమున వకారము లోపింపఁగా నేర్పడిన - ఆడు శబ్దము వాఁడుశబ్దము కంటె నన్యము కాదు కాన అత్వ సంధియే చెప్పవలెను అపదాది స్వర సంధి ప్రసక్తము కాదు

## ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తంబులయి విలక్ష ణార్థాభిధాయకంబులగు నీయవి శబ్ద పల్లవంబులు నాఁబడు. 118

కూరుచుండు, నిలుచుండు, పరుండు పన్నుండు, అఁకొను, ఈకొను, ఈయకొను, ఇయ్యకొను, రక్కొను, త్రెక్కొను, మేకొను, మయికొను, మేలుకొను, మేలుకను, మేలుకాంచు, అలవడు, ఏఱుపడు, చొప్పడు వెలువడు, తలపోయు, వాసపోయు, అపోవు, కొంపోవు, కొనిపోవు, విజయంచేయు, కయిత్రాలు, తూ పొడుచు ఇత్యాదులు శబ్ద పల్లవంబులు

ధాతువులు మొదలగు వానికి, ధాతువు లను ప్రయుక్తములయి విలక్షణ మయిన యర్థమును బోధించు నీ శబ్దములు శబ్ద పల్లవము లనఁబడును పల్లవ మనఁగాఁ జిగురు రెండు దళము లేకీభవించి పల్లవముగా నంకురించునట్లు రెండు శబ్దములు కలిసి యొక శబ్దముగా నేర్పడుటచే శబ్ద పల్లవ మనిపించు

కొనును పల్లవము వంటి శబ్దము శబ్ద పల్లవమని తాత్పర్యము ధాత్వాదులకు - అనుటచేఁ బూర్వావయవము ధాతువే కావలెనను నియమములేదు వరావయవము మాత్రము ధాతువే కావలెను కాఁగాఁ బూర్వావయవములు ధాత్వాదులయి యుండి, తరువాతి యవయవములు ధాతువులై యుండి, విలక్షణమయిన యర్థ మును బోధించు శబ్దముల కూడిక శబ్ద పల్లవమని సారాంశము శబ్ద పల్లవము లలో నాగమాదేశాది కార్యము లగునని నిర్దేశానుసారము గ్రహింపవలెను కూరు చుండు - కూరుచు + ఉండు సంధి 11 చే - కూరుచుండు = అసీనుఁడగు కూరుచు = చేరుచు, ఉండు = వర్తించు నిలుచుండు - నిలుచు + ఉండు సంధి 11 చే - నిలుచుండు = నిలఁబడు నిలుచు = నిలఁబడు ఉండు = వర్తించు పరుండు - పడు + ఉండు = పరు + ఉండు సంధి 11 చే - పరుండు = శయనించు పన్నుండు - పడు + ఉండు = పన్ను + ఉండు సంధి 11 చే - పన్నుండు = శయనించు పడు = శయనించు, ఉండు = వర్తించు అఁకొను - అఁకలి + కొను = అఁకలిచెందు అఁకలి = క్షుధ, కొను = పొందు, ఈకొను ఈయ + కొను = అంగీకరించు ఈయకొను - ఈయ + కొను = అంగీకరించు ఇయ్యకొను ఇయ్య + కొను = అంగీ కరించు ఈయ, ఇయ్య - అవ్యయములు ఇవి యంగీకారమును దెలుపును కొను = ప్రాప్తించు రక్కొను -రేకు + కొను= రక్ + కొను, రక్కొను- వర్థిల్లు రేకు = దళము కొను = ప్రాప్తించు త్రెక్కొను - త్రెంచు+కొను= త్రెక్ + కొను = త్రెక్కొను = త్రెక్కొను = చెఱుచు త్రెంచు = త్రెగఁ జేయు (త్రెగు = తెగు ) కొను = ప్రాపించు మేకొను - మే + కొను = సమ్మతించు మయికొను - మయి + కొను = సమ్మతించు మే, మయి = పార్శ్వము కొను = ప్రాపించు మేలుకొను - మేలు + కొను = నిద్ర దెలియు మేలుకాంచు - మేలు + కాంచు = నిద్రఁ దెలియు మేలు=శుభము కొను, కను, కాంచు = ప్రాపించు అలవడు = అలవు + పడు = అభ్యస్త మగు, అబ్బు అలవు = పరిశ్రమము పడు = పొందు ఏఱువడు - ఏఱు + వడు = ఏఱువడు ఏఱు = ఎన్ను వడు = పొందు చొప్పడు = చొప్పు+ వడు = చొప్ + పడు చొప్పడు = సరిపడు చొప్పు = మార్గము పడు= పొందు వెలువడు - వెలి + పడు = వెలువడు వెల్లువడు = బయలుపడు వెలి = బయలు, పడు = పొందు తలపోయు - తలఁపు + పోయు = తల+ పోయు తలపోయు = యుక్తాయుక్త విచారణ చేయు తలఁపు = వివేచన పోయు = పుట్టు, వాసప్పోయు - వాసము + పోయు = వాసాల్లు పట్టుపు,

వాసము = ఇంటికి మీఁదఁ బఱపెడు వట్టె పోయు = తగుల్చు ఆపోవు: ఆదట + పోవు = తృప్తిపడు ఆదట = ఆసక్తి, ఆపేక్ష పోవు = పొందు కొంపోవు - కొను + పోవు = కొం + పోవు, కొంత పోవు కొను + ఇ + పోవు సంధి 11 చే - కొనిపోవు = తీసికొనిపోవు కొను = తీసికొను పోవు = అరుగు విజయంచేయు - విజయము + చేయు = విజయం చేయు,(పూజ్యోక్తి) వచ్చు విజయము = గెలుపు చేయు = ఒనర్చు కయిత్రావాలు - కయి + త్రావాలు = కయిత్రావాలు - కయిత్రావాలు = ఒఱగు కయి = చేయి త్రావాలు = ఒఱగు తూపొడుచు - తూ + పొడుచు = ఉమియు తూ = ఉమియుటయందగు ధ్వన్యనుకరణము పొడుచు = (తూ - శబ్దతోఁ జేరినప్పుడు) పొడుచు

విశే - (1) ప్రక్రియా నిరూపణాదులలోఁ బూర్వ వ్యాఖ్య లపమార్గమును బట్టిన స్థలములు గలవు అవి త్యాజ్యములు (11) విలక్షణార్థము రెండు విధములననగును (1) శబ్ద పల్లవముల యర్థము వాని యవయవములగు శబ్దములలో నొక దానిది కావచ్చును ఉదా - నిలుచుండు = నిలుచు వరుండు, వన్నుండు = వడు, శయనించు (2) శబ్ద పల్లవమున నవయవములగు శబ్దముల మేళనమునఁ గలుగు పరిణామమును గావచ్చును ఉదా॥ కూరుచుండు = కాళ్ళు మొదలగునవి కూడఁ దీసికొనియుండు అనగా నాసీనుఁడగు - అని యర్థము అఁకొను = అఁకలిచెందు అఁకలి + కొను - అను రెండిటి మేళనమునఁ గలిగిన యర్థమే యిటఁ గలదు

వద సార్థక్యము - ఈయవి - అనుటచే నీ సూత్రము నందలివే శబ్ద పల్లవములు 109 - 117 వఱకు సాధించినవి శబ్ద పల్లవములు కావని సూరి యభిప్రాయము

పాఠ పరిశీలన - వాసపోయు - ప్రథమ ముద్రణము వాపోయు - అను ముద్రణములు సరికావు ఏరుపడు - అని లఘురేపమే ప్రథమ ముద్రణమునఁ గలదు కాని యిది ముద్రణ స్ఖాలిత్యము కావచ్చును (వ్యా సం- స)

## చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. 119

ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్ వాఁడు తేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము

వ్యా చేదర్థముల సంబంధమున లృట్టునకు లిట్టగును చేదర్థములు=ఏని, ఆ - మొదలగునవి (41) లృట్టు = భావిని లృట్టగు లిట్టు = భూతంబున లిట్టగు ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్ వచ్చు - ధాతువు-

భావిని లృట్టగు (4) వచ్చు + లృట్టు 8 చే - వచ్చు + డుఙ్ 19 చే - వచ్చు + కలజి + డుఙ్ 91 చే - రా + కలజి + డుఙ్=రా+కల + డుఙ్ 21 చే - రాను + కల + డుఙ్ తత్సమ 19 చే - రాను+కలఁడు ద్రుత కార్యము రాఁగలఁడు ఇది లృట్టు రూపము రాఁగలఁడు + ఆ - అనుచో, చేదర్థయోగమున, నీ 19 చే - లిట్టు - ఆదేశమగును వచ్చునకు లిట్టు రూపము - వచ్చెను - అనునది (18) కనుక, రాఁగలఁడు + ఆ - అగుచో, రాఁగలఁడు - అను లృట్టునకు, వచ్చెను-అను లిట్టు - ఆదేశమగును వచ్చెను+ ఆ స్వరము పరమగుటచే ద్రుత స్వరము లోపించును వచ్చెన్ + ఆ=వచ్చెనా- అగును వచ్చెనా = రాఁగలఁడేని - అని యర్థము వాఁడు తేవు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము రాఁగలఁడు + ఏని - అని యుండఁగా, రాఁగలఁడు, అను లృట్టునకు, వచ్చెను - అను లిట్టు ఆదేశమగును వచ్చెను + ఏని = వచ్చెన్ + ఏని వచ్చెనేని = రాఁగలఁడేని

విశే - "ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్" రామా 2 – 75

పాఠ పరిశీలన - తేపు దొరఁకొనుము - ప్రథమ ముద్రణము రేపు దొర కొనుము - అని కొందఱు సవరించుట సరికాదు దొరఁకొనుము - అను సబిందుక రూపమే ప్రకరణోచితము

## ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగు. 120

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె.

వ్యా ఆత్మార్థ మాఖ్యాతముచేఁ జెప్పఁబడునప్పుడు, ధాతు విశేషణముల కాత్మార్థము యొక్క లింగవచనములగునని తాత్పర్యము రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె ఇట ఏతెంచె - క్రియ ఎను - క్రియా ప్రత్యయము ఏతెంచు + లిట్టు 8 చే - ఏతెంచు + డుఙ్ 16 చే - ఏతెంచెను క్రియా ప్రత్యయముచేత (ఆఖ్యాతము ) సీత, రాముఁడు - అను రెండు కర్త లభిహిత మగును బనను, తాను - అనునది రామునకు సంబంధించిన దగుటచే, ఏతెంచెను - అని క్రియ మహత్తు నేకవచనము నయ్యెను పుష్పకారూఢుండయి- అనునది విశేషణము తాను శబ్దము రామునకు సంబంధించినది గనుక, పుష్పకా

రాడుండు-అను విశేషణము పుంలింగము, నేకవచనము నయ్యెను ఆత్మార్థము = తా శబ్దము తాను - ఏకవచనము తాము - బహువచనము అభిహితము = ఆఖ్యాతముచేఁ జెప్పఁబడినది (కారక - 1) సంఖ్యాభిధాయి = సంఖ్యకుఁ బేరయినది వచనమన్నమాట (ఉచ్యతే సంఖ్యా అనేన)

## అగతికంబులగు భ్వాదుల కిందు యోగంబు లేదు. 121

భూ, సృ, కృ, రేకృ, లోకృ, లోచ, పచి, లప, ఇత్యాదులకు గతి విరహితంబులగు ధాతువుల కీ భాషం బ్రయోగంబు లేదు. ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి-ఉప, ఊరీప్రభృతులును, సాక్షాత్ప్రభృతులును, గతిసంజ్ఞాకంబులు ప్రాదులిరువది రెండు నుపసర్గంబులు నాఁబడు ప్రభవించు, ఆవిర్భవించు, ప్రసరించు, సంస్కరించు, భస్మీకరించు, సాక్షాత్కరించు, అతిరేకించు, ఆలోకించు, ఆలోచించు, ప్రపంచించు, ప్రలపించు — ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది

వ్యా భూ మొదలగు ధాతువులకు, గతి సంజ్ఞ గల ప్రాదులు మున్నగువానితోఁ గూడక తెలుఁగున ప్రయోగము లేదు అనఁగా ప్రాదులు మున్నగు వానితోఁ గూడు కొనియె భూ మొదలగునవి తెనుఁగునఁ బ్రయోగింపఁబడునని తాత్పర్యము గతి సంజ్ఞాకములు = గతి సంజ్ఞ గలవి ప్రాదులిరువది రెండును ఊరీ - మొదలగునవియు, సాక్షాత్ - మొదలగునవియు గతి సంజ్ఞాకములు (ప్రాదయః క్రియా యోగే ఉపసర్గ సంజ్ఞా గతి సంజ్ఞాశ్చస్యుః - పాణి) ప్ర + అది = ప్రాది ప్రభవించు ప్ర + భూ 63 చే - ప్ర + భూ + ఇంచు 64 చే - ప్ర + భవ్ + ఇంచు = ప్రభవించు (భవించు - అనరాదు) ఆవిర్భవించు - ఆవిస్ + భూ = ఆవిర్ + భూ 63 చే - ఆవిర్ + భూ + ఇంచు 64 చే - ఆవిర్ + భవ్ + ఇంచు = ఆవిర్భవించు ప్రసరించు - ప్ర + సృ - 63 చే - ప్ర + సృ + ఇంచు 64 చే-ప్ర + సర్ + ఇంచు = ప్రసరించు సంస్కరించు సమ్ + కృ = సం + స్ + కృ 63 చే - సంస్ + కృ + ఇంచు 64 చే- సంస్ + కర్ + ఇంచు = సంస్కరించు, భస్మీకరించు భస్మ + చ్వి + కృ = భస్మీ + కృ 63 చే - భస్మీ + కృ + ఇంచు 64 చే భస్మీ + కర్ + ఇంచు = భస్మీకరించు సాక్షాత్కరించు, సాక్షాత్ + కృ 63 చే - సాక్షాత్ + కృ + ఇంచు 64 చే -

సాక్షాత్ + కర్ + ఇంచు = సాక్షాత్కరించు అతిరేకించు అతి + రేక్, 63 చే - అతిరేక్ + ఇంచు = అతిరేకించు ఆలోకించు - ఆ + లోక్ 63చే- ఆ + లోక్ + ఇంచు = ఆలోకించు ఆలోకించు, ఆ + లోచ్ 63 చే ఆ + లోచ్ + ఇంచు = ఆలోచించు ప్రపంచించు - ప్ర+పచి=ప్రపంచ్ 63 చే - ప్రపంచ్ + ఇంచు = ప్రపంచించు ప్రలపించు - ప్ర + లప్ 63 చే - ప్ర + లప్ + ఇంచు = ప్రలపించు ఇత్యాదులు పెద్దల ప్రయోగ ముల వలనఁ దెలిసికొనవలెను

విశే - (1) ణ్యాదులలోఁ జేరనివి గతులతో నిమిత్తము లేకుండఁ బ్రయుక్తములగును 63, 64 సూ, (11) ఇదిత్తులగు ధాతువులకు నుమ్మగునని, పచి - ప్రపంచించు, అను నుదాహరణము సూచించును "ఇదితో నుమ్‌ధాతోః" (పాణి) ఇట్లే, కంపిల్లు 71 సూ- (111) ఉపసర్గములు వాచకములనియు, ద్యోతకములనియు, సహకారులనియు మతభేదములు (వాక్యవ)

## వలయ్యాది క్రియలకుం గర్తయగు భావంబునందు నుజీ యగు. 122

వలయ్యాది క్రియలకుం గర్తృభూత క్రియా వృత్తి యగు ధాతువునకు నుజీ వర్ణకంబగు వాఁడు చూడ వలయు, వారలు చూడఁగా వలయు, నీవు చూడవలయు, మీరు చూడవలయు, నేను జూడవలయు, మేము చూడవలయు, మనము చూడవలయు.

వలయును, వలదు, కూడును, కూడదు, చెల్లును, చెల్లదు; తగును, తగదు ఇత్యాదులు వలయ్యాదులు

సకర్మకంబునకు స్వరూప ప్రేరణార్థంబులు రెండును, గొను పద్వను బంధంబులం దొక్కొక్కటితోడ, రెంటితోడం గూడుచో నగునవి యాఱుంగూడ రూపంబు లెనిమి దయ్యె వాని సొరిది నుదాహరించెద;

(1) కర్త్రర్థకము మైత్రుఁడు వంటకమును వండెను

(11) ఆత్మనేపద కర్త్రర్థకము మైత్రుఁడు వంటకమును వండుకొనియెను

(111) కర్మార్థకము మైత్రునిచేత వంటకము వండఁబడియెను.

(iv) ఆత్మనేపద కర్మార్థకము మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను

(v) ప్రేరణకర్త్రర్థకము చైత్రుడు మైత్రునిచేత వంటకము వండించెను

(vi) ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను

(vii) ప్రేరణకర్మార్థకము చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండింపఁబడియెను

(viii) ప్రేరణాత్మనేపద కర్మార్థకము చైత్రునిచేత, మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను

వ్యా వలయు - మొదలగు క్రియలకుఁ గర్తృభూతమగు వ్యాపారమునందు వర్తించు ధాతువునకు భావార్థమున నుజీ - ప్రత్యయమగును చూడవలయు - ఇట వలయు అనుదానికిఁ గర్త - చూడన్ - అనునది కావున వలయు-అను క్రియకుఁ గర్తృభూతమగు వ్యాపారమునందు వర్తించు ధాతువు, "చూచు"-అనునది దీనికి 122 చే - భావార్థమున నుజీ యగును చూచు+నుజీ+వలయు 91 చే - చూడు + నుజీ + వలయు 20 చే - చూడను+వలయు 11 చే - కాను, అన్వయయుక్తము కానిచో - చూడను + వలయు సంధి 18 చే - చూడవలయు- అగును చూడను = చూచుట, వలయునని యర్థము చూడఁగావలయు - చూచు-ధాతువు చూచు+వలయు- ఈ 122 చే - చూచు + నుజీ + వలయు 91 చే - చూడు + నుజీ + వలయు 20 చే - చూడను + వలయు 115 చే - చూడను + కాను + వలయు 116 చే - హ్రస్వమును కలుగనిచో సంధి 16 చే - చూడను + గాను + వలయు సంధి 17 చే - చూడఁగాను + వలయు సంధి 18 చే - చూడఁగావలయు చూడఁగాను = చూచుట, వలయునని యర్థము వలయు అను దానికిఁ గర్త, చూడను- అనునది కావుననే, వాఁడు, వారు, నీవు, మీరలు, నేను, మేము- అనువానిచే వలయును- అనుదానికెట్టి మార్పును గలుగలేదు కారక 32 చేఁ గర్తలకుఁ బ్రథమలయ్యెను

సకర్మక ధాతువులకగు రూపముల నెల్లసూరి యీసూత్రమున, బ్రదర్శించెను సకర్మకంబునకు స్వరూప ప్రేరణార్థంబులు రెండును - అనుటచే సకర్మకమును రెండుగా విభజింపవచ్చును (1) స్వరూపము (2) ప్రేర

ణార్థము, కొను పద్వనుబంధంబులం దొక్కొక్కటితోడ, రెంటితోడం గూడుచో నగునవి యాఱుంగూడ రూపంబు లెనిమిదయ్యె అనఁగా స్వరూపముపై కొను - చేరినది, స్వరూపముపై, పడు- చేరినది, స్వరూపముపై, కొను - పడులు రెండును జేరినది, ప్రేరణార్థముపై- కొను చేరినది, ప్రేరణార్థముపై పడు చేరినది, ప్రేరణార్థముపై, కొను పడులు చేరినది - ఇవి యాఱు స్వరూప ప్రేరణములు రెంటితోఁ గలిపి మొత్త మెనిమిది

(I) కర్త్రర్థకము (స్వరూపము ) మైత్రుఁడు వంటకమును వండెను (16)

(II) ఆత్మనేపదకర్త్రర్థకము=స్వరూపముపయి, కొను-చేరినది మైత్రుఁడు వంటకమును వండుకొనియెను (52)

(III) కర్మార్థకము=స్వరూపముపయి, పడు చేరినది మైత్రునిచేత వంటకము వండఁబడియెను (49)

(IV) ఆత్మనే పదకర్మార్థకము=స్వరూపముపై కొను-పడులు రెండును చేరినది మైత్రునిచేత, వంటకము వండుకొనఁబడియెను (52 49)

(V) ప్రేరణ కర్త్రర్థకము చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను (70)

(VI) ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము=ప్రేరణార్థముపై కొను-చేరినది చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను (70, 52)

(VII) ప్రేరణకర్మార్థకము=ప్రేరణార్థకముపై, పడు-చేరినది చైత్రుని చేత, మైత్రునిచేత వంటకము వండింపఁ బడియెను (70, 49)

(VIII) ప్రేరణాత్మనేపద కర్మార్థకము = ప్రేరణార్థకము మీఁద, కొను పడులు రెండును జేరినది చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁ బడియెను (70, 52, 49)

పాఠపరిశీలన - 5 వ వాక్యమున వంటకమును అనియు, 6 వ వాక్యమున, వండించుకొనియెను, అనియుఁ బ్రథమ ముద్రణ పాఠములు కంటకము-అనియు, వండించుకొనెను-అనియుఁ గొన్నింట ముద్రించుట సరికాదు

## గతి, బుద్ధి, ప్రత్యవసానార్థ, శబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు 123

పొందు మొదలయినవి గత్యర్థకంబులు తెలియు మొదలైనవి బుద్ధ్యర్థకంబులు తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు విను,

చెప్పు, చదువు మొదలయినవి శబ్దకర్మంబులు అకర్మకంబులు ప్రసిద్ధంబులు మైత్రుండు గ్రామంబుం బొందెను చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి మైత్రుండు పుడమి నేలెను చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను

వ్యా గత్యర్థకములకు, బుద్ధ్యర్థకములకు, ప్రత్యవసానార్థకములకు, శబ్దకర్మములకు, నకర్మకములకు, నప్రేరణమునఁ గర్తయగునది ప్రేరణమునఁగర్మమగును గత్యర్థకములు=పొందు-మొదలగునవి (గతి=గమనే, ప్రాప్తౌచఁ శబ్దస్తో) బుద్ధ్యర్థకములు=తెలియు-మొదలగునవి ప్రత్యవసానార్థకములు=తిను మొదలగునవి ప్రత్యవసానము=భక్షణము శబ్దకర్మములు = శబ్దవాచకములు కర్మగాఁగలవి (శబ్దఃకర్మఏషాంతే శబ్దకర్మాణః - బాలమ) విను, చెప్పు, చదువు - మొదలగునవి అకర్మకములు = కర్మకాంక్షానుత్థాపకములు, (48) ఇవి ప్రసిద్ధములు ఉండు, లజ్జించు, నిలుచు, మేల్కాను, వర్ధిల్లు, క్షీణించు, భీతిల్లు, జీవించు, చచ్చు శయనించు, క్రీడించు, రుచించు, దీపించు మొదలగునవి యకర్మకములుగఁ బ్రసిద్ధములు

మైత్రుఁడు గ్రామంబుం బొందెను ఇది య ప్రేరణ వాక్యము ఇట మైత్రుఁడు కర్త ఉక్తార్థమునఁ గర్తకుఁ బ్రథమ (కారక1) చైత్రుఁడు మైత్రుని గ్రామంబుం బొందించెను ఇది ప్రేరణవాక్యము అప్రేరణమునఁ గర్తయయిన మైత్ర శబ్ద మీ ప్రేరణ వాక్యమునఁ గర్మమయినది ఇట, చైత్రుఁడు కర్త మైత్రుఁడు, గ్రామము - అను రెండును గర్మములు కావుననే వీనికి ద్వితీయ యయినది (కారక 2) గత్యర్థకాదులకు భిన్నమగు చోటులందు సైత మప్రేరణమునఁ గర్త యయినది ప్రేరణమునఁ గర్మమగుట కనఁబడును మైత్రుండు పుడమి నేలెను ఇది య ప్రేరణ వాక్యము ఇట, మైత్రుఁడు - కర్త ఉక్తార్థమునఁ గర్తకుఁ బ్రథమ - కారక 1 సూ చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను ఇది ప్రేరణ వాక్యము ఇట, మైత్రుఁడు - కర్మము కారక 2 చే-ద్వితీయ అప్రేరణమునఁ గర్తయయిన మైత్ర శబ్దమీ ప్రేరణ వాక్యమునఁ గర్మమయినది ప్రేరణము = 70 సూ అప్రేరణము = 71 సూ చూచునది

విశే - "సత్తాఽజ్ఞాసితి జాగరణం। వృద్ధిక్షయభయ జీవితమరణమ్, శయన క్రీడారుచి దీప్త్యర్థా నైతేకర్మణిధాతవ ఉక్తాః" ముగ్ధ - గిరిశ (వ్యా సం స) ఇత్యాదుల కర్మకములుగఁ బ్రసిద్ధములన్నమాట

పాఠ పరిశీలనము - అకర్మకంబులు - ప్రథమ ముద్రణము కావున, ఆకర్మంబులు - అను ముద్రణములు సరికావు

## అనభిహిత కర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు. 124

రాముఁడు మిథిలం గనియె రామునకుఁ మిథిల గనంబడియె. రామునిచే మిథిల గనంబడియెను మైత్రుండు తత్వంబుం దెలిసెను .. చైత్రుండు మైత్రునకుం దత్వంబు దెలిపెను

కన్వాది యోగంబునం బ్రయోజ్య కర్తకు షష్ఠి నిత్యంబుగా నగు విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను

అకర్మకంబున క్ప్రేరణంబునం దాత్మనేపద కర్మానుబంధం బులు లేమింజేసి రూప భేదంబు లయిదని యెఱుంగునది

(I) కర్త్రర్థకము మైత్రుండు మనియెను

(II) ప్రేరణ కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనిచెను

(III) ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనుచు కొనియె

(IV) ప్రేరణ కర్మార్థకము చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె

(V) ప్రేరణాత్మనేపద కర్మార్థకము చైత్రునిచేత మైత్రుఁడు మనుచుకొనఁబడియె

వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో నకర్మ కంబునకుం బంద్రెండు, నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది

ఇది క్రియా పరిచ్ఛేదము

వ్యా అనభిహిత కర్తకొకానొక చోట షష్ఠీ విభక్తి బహుళముగా నగును అనభిహిత కర్త = క్రియా ప్రత్యయముచే నభిహితము కాని కర్త (1) కారక 3 చే - చేత వర్ణకమును బొందు కర్త యనభిహిత కర్త యగును కర్మార్థక వాక్యము నందలి కర్త యనభిహిత కర్త యని గ్రహింపవలెను ఏల యనఁ

గర్మార్థక వాక్యమునఁ గ్రియా ప్రత్యయము (అఖ్యాతము) కర్మమును జెప్పును గాని కర్తను జెప్పదు (కారక-1) రాముఁడు మిథిలం గనియె ఇది కర్త్రర్థక వాక్యము కారక 1 చే - ఉక్తార్థమునఁ గర్తకుఁ బ్రథమయయినది కావున నిటఁ గ్రియా ప్రత్యయము (అఖ్యాతము) కర్తను జెప్పుచున్నది కాన నీ సూత్రముచే నిందలి కర్తకు, షష్ఠిగాదు రామునిచే మిథిల గనంబడియెను ఇది కర్మార్థక వాక్యము కనుక నిటఁ గ్రియా ప్రత్యయము కర్తను జెప్పదు కావున నీ వాక్యమున, రాముఁ డనభిహిత కర్త యనిపించుకొనును కారక 3 చే - ఈ యనభిహితకర్తకుఁ దృతీయ యయినది ఈ 124 చే - అనభిహిత కర్తకు షష్ఠి కలిగిన, రామునకు మిథిల గనంబడియె - అని యగును (11) ప్రేరణవాక్యము నందలి ప్రయోజ్య కర్తయు ననభిహిత కర్తయగును మైత్రుండు తత్వంబుం దెలిసెను ఇది యప్రేరణ వాక్యము ఇటఁ గ్రియా ప్రత్యయము కర్తను జెప్పుచున్నది కావున దీని - ప్రథమకు షష్ఠి ప్రసక్తము కాదు (కారక 1 ఉక్తార్థము) చైత్రుండు మైత్రునకుం దత్వంబు దెలిపెను ఇది ప్రేరణ వాక్యము 123 చే- అప్రేరణమునఁ గర్తయయినది ప్రేరణమునఁ గర్మమగును కావున నప్రేరణమునఁ గర్త యయిన మైత్ర శబ్దమీ ప్రేరణ వాక్యమునఁ గర్మమయినది ఈ 124 చే - మైత్ర శబ్దమునకు షష్ఠి కలిగి మైత్రునకు ననియయ్యెను మైత్ర శబ్దము కర్మ గనుక కారక 2 చే - ద్వితీయ యగును ఇట షష్ఠియు నగునని యుదాహరింపఁబడెను

కను - మున్నగు వాని యన్వయమునఁ బ్రయోజ్య కర్తకు షష్ఠి నిత్యముగానగును ప్రయోజ్య కర్త = వేఱొక కర్తచేఁ గార్యమునందు నియోగింపఁబడుకర్త అనఁగా, అనభిహిత కర్త లేదా అప్రేరణ కర్త (ప్రయోజక కర్త= ప్రేరణ కర్త) విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను ఈ వాక్యమున విశ్వామిత్రుఁడు ప్రయోజక కర్త రాముఁడు ప్రయోజ్య కర్త ఏలయన విశ్వామిత్రునిచే మిథిలను గాంచుట యను కార్యమునందు నియోగింపఁబడినవాఁడు, రాముఁడు కానిపించెను-అను దానితో నన్వయ ముండుటచేఁ బ్రయోజ్య కర్తను బోధించు రామ శబ్దమునకు షష్ఠి యయ్యెను కృష్ణుండర్జునునకు విశ్వరూపంబుం జూపెను ఇట కృష్ణుఁడు ప్రయోజక కర్త (తత్ ప్రయోజక హేతుశ్చ - పాణి) అర్జునుఁడు ప్రయోజ్య కర్త కావున నర్జున శబ్దమునకు, షష్ఠి యయెను కను - చూచు - మొదలగునవి కన్వాదులు

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపద కర్మాను బంధంబులు లేమిం జేసి రూప భేదంబు లయిదని యెఱుంగునది దీనికి వివరణము అకర్మక ధాతు

వునకు, నప్రేరణమున, కొను ధాతు వను ప్రయుక్తము కాదు గనుక నాత్మనే పద కర్త్రర్థక రూపముండదు అకర్మకమునకు, వడుధాతు వను బంధముగఁ జేరదు గనుక కర్మార్థకముండదు కొను - వడు లు రెండును ననుబంధములుగఁ జేరవు గావున, నాత్మనేవద కర్మార్థక ముండదు సకర్మకమునకు నెనిమిది రూపములు కలుగునని 122 సూత్రమున నుదాహరింపఁబడెను ఆ యెనిమి దింటిలో నీ మూఁడు రూపములు పోఁగా మిగిలిన యైదు రూపములే యగును అవేవనఁగా —

(I) కర్త్రర్థకము మైత్రుండు మనియెను

(II) ప్రేరణ కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనిచెను

(III) ప్రేరణాత్మనే = వద కర్త్రర్థకము = ప్రేరణ కర్త్రర్థకముపై 'కొను' ధాతువు చేరిన రూపము చైత్రుఁడు మైత్రుని మనుచుకొనియె

(IV) ప్రేరణ కర్మార్థకము = ప్రేరణము మీఁద, 'వడు' ధాతువు చేరిన రూపము చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె

(V) ప్రేరణాత్మనే వద కర్మార్థకము = ప్రేరణము మీఁద, కొను - వడులు రెండును జేరినది చైత్రునిచేత మైత్రుఁడు మనుచు కొనఁబడియె

వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో సకర్మకంబు నకుం బండ్రెండు నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది దీనికి వివరణము సకర్మమునకు నెనిమిది రూపములగునని 122 సూత్రమున నుదాహరింపఁబడెను వానిలో - 5, 6, 7, 8 రూపముల మీఁద మరలఁ బ్రేరణ మున నించుగాగమము కలిగినచో నాలుగు రూపము లేర్పడును ఎట్లనఁగా—

(I) పునఃప్రేరణ కర్త్రర్థకము - ప్రేరణ కర్త్రర్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్కు చేరఁగా నేర్పడు రూపము ఉదా॥ దేవదత్తుఁడు చైత్రుని చేత మైత్రుని తెలిపించెను

(II) పునః ప్రేరణాత్మనే వద కర్త్రర్థకము = ప్రేరణాత్మనే వద కర్త్రర్థక రూపముమీఁద మరలఁ బ్రేరణమున నించుక్కు చేరినది దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని తెలిపించుకొనియె

(III) పునః ప్రేరణ కర్మార్థకము = ప్రేరణ కర్మార్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్కు చేరిన రూపము దేవదత్తునిచేత, చైత్రునిచేత మైత్రుండు తెలిపింపఁబడియె

(IV) పునః ప్రేరణాత్మనేవద కర్మార్థకము = ప్రేరణాత్మనేవద కర్మార్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్కు చేరినది దేవదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రుండు తెలిపించుకొనఁబడియె,

ఈ నాలుగు రూపములును, 122 సూత్రమునొద్దఁ జూపఁబడిన యెనిమిది రూపములును గలిసి సకర్మకమునకుఁ బండ్రెండు రూపము లయ్యెను

అకర్మకమున కీ 124 సూత్రము నొద్దఁ జూపఁబడిన రూపములైదు వీనిలో, 2, 3, 4, 5 రూపములపై మరలఁ బ్రేరణమున నించుక్క చేరఁగా నాలుగు రూపములేర్పడును ఎట్లనఁగా—

(i) పునః ప్రేరణ కర్త్రర్థకము=ప్రేరణ కర్త్రర్థకముపై మరలఁ బ్రేరణమున నించుక్క చేరినది దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించెను

(ii) పునః ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము = ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్క చేరినది దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించుకొనియె

(iii) పునః ప్రేరణ కర్మార్థకము = ప్రేరణ కర్మార్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్క చేరిన రూపము దేవదత్తుచేతఁ జైత్రుని చేత మైత్రుండు మనిపింపఁబడియె

(iv) పునః ప్రేరణాత్మనేపద కర్మార్థకము = ప్రేరణాత్మనేపద కర్మార్థకము మీఁద మరలఁ బ్రేరణమున నించుక్క చేరిన రూపము దేవదత్తుని చేతఁ జైత్రునిచేత మైత్రుండు మనిపించుకొనఁబడియె

ఈ నాలుగును, ఈ 124 సూత్రమునొద్దఁ జూపిన యకర్మకరూపము లైదును గలిసి యకర్మకరూపములు తొమ్మిది యయ్యెను

విశే - (i) 84 చేఁ బ్రేరణమున, నించుక్క మీఁద నించుక్క లేదు. కనుక, సకర్మకముల విషయమున, (122) తెలియు ధాతువిట గ్రహింపఁబడెనుకొందఱు వందు - ధాతువును గ్రహించుట పొరపాటు (ii) సకర్మముల కగు రూపములు 122 సూత్రమునఁ జేర్పఁబడెను ఈ 124 సూత్రమున, నకర్మకములు చేర్పఁబడెను ఈ రూపములకును 122, 124 సూత్రములకు నెట్టి సంబంధము లేదు తడఁబాటు కలుగకుండుటకు, సకర్మకరూపము లొకచోటను, నకర్మక రూపము లొకచోటను వేర్వేఱుగాఁ బ్రదర్శింపఁబడి యుండును సకర్మకముల పట్టిక సూరి 124 సూత్రమున వ్రాయగాఁ నెవరో 122 సూత్రమునఁ జేర్చిరని కొందఱు సెలవిచ్చుట సరికాదు సకర్మకములు 122 సూత్రమునను, నకర్మకము లీ 124 సూత్రమునను ప్రథమ ముద్రణము నుండియుఁ గలవు ప్రథమ ముద్రణము సూరి పర్యవేక్షణలో జరిగెననుట మఱవరాదు

పొరపరిశీలన తత్వంబు - అని ప్రథమ ముద్రణమున రెండుచోట్లను గలదు తత్త్వంబు - అను సవరణములు కావు

ఇది ఘంటాపథము

# కృదంత పరిచ్ఛేదము



## కృత్తుల కర్థంబులు యథా వ్యవహారంబుగ గ్రాహ్యంబులు. 1

ధాతువునకు విహితంబగు దుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్మాద్యర్థం బులు మహాజన వ్యవహారానుసారిగా నెఱుంగునది. ఆఁక — బంధ నము, మొలక=నవోద్భిదము. ఏలిక =పాలకుడు కోరిక=వాంఛయు, వాంఛితంబును, మూక=సంఘము, ఆడిక=నింద, ఓడిక=స్రోతస్సు.

వ్యా కృత్తుల కర్థములు ప్రయోగానుసారము గ్రహింపఁదగునని సూత్రా ర్థము ధాతువునకు విధింపఁబడు, దుఙ్ - రు, వు-రు ను-ము, అను ప్రత్య యములు కాక, తక్కిన ప్రత్యయములు కృత్తులనఁబడును దుఙ్ = దు-రు, వు-రు, ను-ము - అనునవి (క్రియా 8) కాఁగా, ధాతువునకు దుఙ్భిన్న ప్రత్యయముచేరి యేర్పడునవి కృదంతములని తాత్పర్యము (కృదతిఙ్-పాణి) చెప్పఁబోవు కృత్తులకు భావార్థము, కర్త్రర్థము, కర్మార్థము, మొదలగునవి మహా కవి ప్రయోగముల ననుసరించి తెలిసికొనవలెను అనఁగా నేయే ప్రత్యయము లేయే యర్థములలో నగునో సూత్రమునఁ జెప్పఁబడదు ప్రత్యయములు మాత్రమే విధింపఁబడు నన్నమాట ఉదా॥ ఆఁక=ఆఁగుట అనఁగా బంధనము ఇట 'క' వర్ణకము భావార్థకము భావము=ధాత్వర్థము (క్రియా 35) మొలక= మొలచునది మొలచు యను వ్యాపారమునకుఁ గర్త కనుక నిట కవర్ణకము కర్త్రర్థమున నయినది మొలక యనఁగా నవోద్భిదము ఏలిక = ఏలువాఁడు అనఁగాఁ బాలకుడు ఇట, ఇకవర్ణకము కర్త్రర్థకము కోరిక = కోరుట అనఁగా వాంచ ఈ యర్థమున నిందలి, ఇక వర్ణకము భావార్థకము కోరిక = కోరఁ బడునది, అనఁగా వాంఛితము ఈ యర్థమున నిందలి ఇక ప్రత్యయము

కర్మార్థకము మూఁక=మూఁగునది అనఁగా సంఘము ఇటఁ కవర్ణకము కర్త్రర్థకము అడిక=అడుట అనఁగా నింద ఇట, ఇక-భావార్థకము ఓడిక=ఓడునది అనఁగా స్రోతస్సు ఓడు = ప్రవహించు ఇట, ఇక - వర్ణకము కర్త్రర్థకము ఇవి త్రిసమములు

విశే - (1) సర్వ ధాతువులకుఁ జేరఁదగిన కృత్ప్రత్యయములు క్రియా పరిచ్ఛేదమునఁ జెప్పఁబడెను కొన్ని ధాతువుల కగు కృత్ప్రత్యయము లీ పరిచ్ఛేదమునఁ జెప్పఁబడెను క్రియా పరిచ్ఛేదము నందలి కృత్తులకు చూ క్రియా 35, 37-44, 46, 47 సూత్రముల యందలి ప్రత్యయములు (11) కృత్తులు భావార్థము నందును షడ్విధకారకములందును ప్రవర్తించును (111) తిఙ్ప్రత్యయముల క్రియల సాధ్యావస్థను బోధించును (వచతి=వండుచున్నాఁడు) కృత్తులు క్రియల సిద్ధావస్థను బోధించును పాకము=వంట

## ఇటం గృత్కగతపవేములు పరంబులగు నపుడు క గ చ య వలకు లోపంబగు 2

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువు నంతంబులగు, క గ చ య వ లకు లోపంబగు మీఁది లక్ష్యంబులం జూడంబడు

వ్యా ఈ కృదంత పరిచ్ఛేదమున, కృత్ప్రత్యయములగు క, గ, తు, వ, వ, ఇమి ప్రత్యయములు పరమగు నప్పుడు ధాతువు తుదిని గల, క-గ-చ-య- వ లకు లోపమగును ఇవి యచ్చులతోఁగూడ లోపించునని గ్రహింపవలెను

పదసార్థక్యము - ఇటన్ - అనుటచే, క గ చ య వల లోప మీ కృదంత పరిచ్ఛేదముననే జరుగును అలుగు + క = అలు+క=అలుక క్రియాపరిచ్ఛేదమున నైనచో అలుగు + కఙి = అలుగక- అగును కావున "ఇట" - అను దళము సార్థకము

## కవర్ణకం బలుగ్వాదుల కగు. 3

అలుగు అలుక అఁగు అఁక ఎఱుఁగు ఎఱుక ఇట బిందు లోపంబు ఇట్లు గొన్నింట గ్రహించునది కడఁగు కడఁక, కలఁగు కలఁక, కాఁగు కాఁక, తునుఁగు తునుక నడచు నడక, నలఁగు నలఁక, పోవు, పోక మడఁగు మడఁక,

మలఁగు మలఁక, మునుఁగు మునుక, మూఁగు మూఁక, మొలచు మొలక, వచ్చునకు రా రాక, వంగు .. వంక: పీఁగు పీఁక, ఇక క, పులు పరంబులగునపుడు కనునకు దీర్ఘం బగు; కానుక, కినియ ముదియుల కుత్వంబు నగు. కినియు కినుక: ముదియు ముదుక ఇత్యాదు లలుగ్వాదులు

వ్యా. అలుగు-మొదలగు ధాతువులకు, "క" ప్రత్యయ మగును అలుగు-ధాతువు ఈ 3 చే - అలుగు+క 2 చే - గువర్ణలోపము అలుక-ప్రాతివదికము తత్సమ 39 చే - అలుక+ము తత్సమ 57 చే - అలుక ఎఱుఁగు + క 2 చే - ఎఱుఁ + క "ఇట బిందు లోపంబు" అనుటచే బిందులోపము ఎఱుక ఇట్లే తునుఁగు+క=తునుక వచ్చు + క "వచ్చునకురా " రా+క=రాక ఇక+క-పు-అను ప్రత్యయములు పరమగునపుడు, కనుధాతువునకు దీర్ఘమగును ఇక వర్ణకమునకు 12 సూ, పు-వర్ణకమునకు 11 సూ చూడవలెను క-వర్ణకమునకు కను + క = కాను + క కానుక - అగును అఁగు+క= అఁక ఇట్లే తక్కినవి- ఇవి స్త్రీసమములు కాన, తత్సమ 39 చే - మువర్ణకము చేరి, 57 చే - లోపించుచు కినియు, ముదియుల కుత్వమునగును కినియు+క 3 చే - కిని + క = కినుక ముదియు + క 3 చే - ముది+క=ముదుక కవర్ణకమునకు ముందున్న ఇత్వమునకే ఉత్వము

పారపరిశీలన - (1) ఇట్లు గొన్నింట- ప్రథమ ముద్రణము కావున, ఇట్లు కొన్నింట-అను ముద్రణములు సరికావు (11) మలఁగు-మలక, అని ప్రథమ ముద్రణము, మలఁక-అనియే యుండఁదగును

## ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు. 4

కలుగు కలిమి, ఓరుచు ఓరిమి, కూరుచు కూరిమి, నేరుచు నేరిమి, ప్రేలుచు ప్రేలిమి, బడియు బడిమి, బ్రదుకు బ్రదిమి, ఒడ్డు . ఒడ్డిమి, తాలు తాలిమి

వ్యా కలుగు - మొదలగు వానికి 'ఇమి' ప్రత్యయమగును కలుగు + ఇమి 2 చే - గు - లోపించి, కలు + ఇమి సంధి 11 చే-కలిమి కలిమి+ సు తత్సమ 57 చే - కలిమి ఇట్లే తక్కినవి ఒడ్డు + ఇమి, తాలు+ఇమి-అను చోట్ల ధాతువు చివర, క గ చ య వలలో నేదియు లేదు కనుక లోప ప్రసక్తి కలుగదు సంధి 11 చే - ఒడ్డిమి, తాలిమి - అగును.

పార పరిశీలన - తాలు - తాలిమి, అని ప్రథమ ముద్రణమున లకారమే కలదు వ్రేలుచు - వ్రేలిమి, అను ప్రథమ ముద్రణము గ్రాహ్యమననగును వ్రేలిమి గలుగంగ ముదముల, వ్రేలిమి గల (ముకుంద 3 – 296) - సూ॥ని

## తజ్వర్ణకంబు చేయ్యాదు కగు. 5

చేయు చే(త, అలయు అల(త, కూయు కూ(త; కోయు కో(త, గీయు గీ(త నేయు—నే(త పూయు పూ(త, పోయు పో(త, మూయు మూ(త, మేయు మే(త; మ్రోయు మ్రో(త, రోయు రో(త, లాయు లా(త, వ్రాయు • వ్రా(త. వ్రేయు వ్రే(త

వ్యా చేయు - మొదలగు ధాతువులకు తజ్ ప్రత్యయమగును చేయు+ తజ్ 2 చే - చే + తజ్ తత్సమ 19 చే - చే(త సంజ్ఞా 15 చే - సాధ్య పూర్ణము లేదు తత్సమ 39 చే- చే(త + ము 57 చే- చే(త ఇట్లే తక్కినవి

## కువ వర్ణకం బడంగ్వాదుల కగు. 6

అడ(గు అడ(కువ, ఎఱు(గు ఎఱుకువ, కల(గు కల(కువ, నల(గు నల(కువ, పెన(గు పెన(కువ, పొలయు పొల కువ, మఱచు మఱకువ, మెల(గు మెల(కువ, లో(గు .. లో(కువ, వేగు వేకువ

వ్యా అడ(గు - మొదలగు వానికి, కువ ప్రత్యయమగును అడ(గు + కువ 2 చే - గ - లోపము, అడ(కువ తత్సమ 39 చే - అడ(కువ + ము 57 చే - అడ(కువ ఇట్లే తక్కినవి ఎఱు(గు + కువ 2 చే - ఎఱు( + కువ 'ఇట' బిందు లోపము ఇట్లు గొన్నింట గ్రహించునది' (3) అను వివరణము ననుసరించి యిట ఖండబిందువు లోపించి ఎఱుకువ - అయ్యెను.

## టవర్ణక[illegible]ాద్యాదుల కగు నగుచో నంత లోపంబగు. 7

ఆడు ఆట, ఊరు ఊట, ఊఱడు ఊఱట, ఏ(కరు .. ఏ(కట, ఓడు ఓట, తివురు తివుట, తేరు తేట త్రిమ్మరు • త్రిమ్మట• పండు పంట, పాడు పాట మండు మంట; వండు వంట, వేసఱు వేసట అను ప్రయుక్తంబయిన ధాతు

శబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమంబగు కోలాటము, పోరాటము, మంద్రాటము - ఇత్యాదులు.

వ్యా అడు - మొదలగు ధాతువులకు ట వర్ణకమగును అగుచోఁ దుది యక్షరమునకు లోపమగును అడు + ట = అట తత్సమ 39 చే - అట+ము 57 చే - ఆట ఇట్లే తక్కినవి అనుప్రయుక్తమగు ఆట శబ్దము తఱచుగాఁ గ్లీబసమమగును కోల + ఆట సంధి 4 చే - కోలాట తత్సమ 39 చే - కోలాటము ఇట్లే పోరాడు + ట = పోరాటము, మంద్రాడు +ట= మంద్రాటము

విశే - ప్రాయికంబుగా - అనుటచే, కోలాట - అనియు నుండును

## టువర్ణకంబు పడ్వాదుల కగు నగుచో నవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబు నొందు. 8

పడు పాటు, చెడు చేటు, అడుచు ఆటు, కఱచు కాటు, పొడుచు పోటు, వయిచు వాటు ఏయు ఏటు, ఓడు ఓటు, వ్రేయు వ్రేటు

వ్యా పడు - మొదలగు ధాతువులకు 'టు' ప్రత్యయమగును అగుచో వాని తొలి యక్షరము మిగిలి దీర్ఘమునందును పడు + టు, అనుచో - డు వర్ణము లోపించి, శేషించిన మొదటి యక్షరమునకు దీర్ఘము పా + టు = పాటు, తత్సమ 48 చే - పాటు + వు 57 చే - పాటు ఇట్లే చెడు + టు= చే + టు చేటు, అడుచు + టు = ఆ + టు ఆటు మొ॥

పాఠ పరిశీలన - ప్రథమ ముద్రణమున, కఱుచు - అని కలదు కఱచు అనియే యుండవలెను

## పవర్ణకంబు తిరియ్వాదుల కగు. 9

తిరియు తిరిపము, కలియున కత్వంబునగు - కలపము, పొలయు పొలపము, మురియు మురిపము, [illegible]లయు సొలపము, వలియు వలిపము

వ్యా తిరియు - మొదలగు వానికి, వ వర్ణకమగును తిరియు + వ - 2 చే - తిరి + వ అచ్చిక 2 చే - క్లీబసమమగును గాన, తత్సమ 39 చే - తిరివ+ము=తిరిపము, కలియు-ధాతువునకు అత్వము సైతమగును కలియు+ వ 2 చే - కలి+వ "కలియునకత్వంబునగు" కల+వ - క్లీబసమమ్ము నగా

తత్సమ 39 చే - కలప + ము = కలపము పొలయు+వ=పొలవ+ము=
పొలవము ఇత్యాది

## తవర్ణకం బావులించు లోనగు వాని కగు. 10

అవులించు అవులింత, ఇగిలించు ఇగిలింత,
ఓకిలించు ఓకిలింత, కుళ్ళగించు కుళ్ళగింత,
కుసిలించు కుసిలింత, కొక్కరించు కొక్కరింత,
కొప్పరించు కొప్పరింత గిలిగించు గిలిగింత
ఇత్యాదు లెఱుంగునది

వ్యా అవులించు, మొదలగు ధాతువులకు, తప్రత్యయమగును అవు లించు+త 2 చే - చువర్ణ లోపము అవులింత తత్సమ 39 చే - అవులింత+ ము 57 చే - అవులింత ఇట్టి తక్కినవి (అవుల+ఇంచు=క్రియా 63)

## పువర్ణకంబు మాయ్వాదుల కగు 11

మాయు మాపు, మేయు మేపు, అడుచు అడుపు,
ఇంచు ఇంపు, ఏఁచు ఏఁపు, ఏచు ఏపు కను కానుపు
కాచు కాపు, చూచు చూపు, తలఁచు తలఁపు, తోఁచు
తోఁపు, త్రేఁచు త్రేఁపు, త్రోచు త్రోపు, పూఁచు పూఁపు,
పెనుచు పెనుపు, పొలుచు పొలుపు, ప్రోచు ప్రోపు,
మెచ్చు మెప్పు, మోచు మోపు, వలచు వలపు, వాచు వాపు
ఇత్యాదులు మాయ్వాదులు

వ్యా మాయు-మొదలగు ధాతువులకు పువర్ణకమగును మాయు+పు 2 చే - మా+పు=మాపు తత్సమ 48 చే - మాపు + వు 57 చే - మాపు. కను+పు "ఇక కపులు పరంబులగు నపుడు కనునకు దీర్ఘంబగు" (3) ఇట, పువర్ణము పరమగుటచే దీర్ఘము కాను + పు = కానుపు మెచ్చు + పు = మెచ్ + పు చకార పకార సంయోగము భాషా సహజము కాకుండుటచే నిర్దే శానుసారము చకారము పరహల్లగ మాఱును మెప్ + పు = మెప్పు (క్రియ 112) తత్సమ 48 చే - కానుపు+వు, మెప్పు + వు 57 చే - కానుపు, మెప్పు

పారవరిశీలన - ప్రథమ ముద్రణమున వాచు వాపు అనునవి నిర్బంధు కమ్ములుగనే కలవు

## ఇక వర్ణకం బంజ్వాదుల కగు. 12

అంజు...అంజిక, అమరు. అమరిక, అరయు అరయిక, అలయు అలయిక, ఆడు .ఆడిక, ఓడు ఓడిక, ఓపు ఓపిక, కను కానిక కూడు కూడిక, కోరు కోరిక, పొందు పొందిక, పోలు పోలిక, తూను తూఁగున కగు తూనిక ఇత్యాదు లంజ్వాదులు

వ్యా అంజు - మొదలగు ధాతువులకు, 'ఇక' ప్రత్యయ మగును అంజు+ఇక సంధి 11 చే - అంజిక తత్సమ 39 చే - అంజిక+ము 57 చే - అంజిక కను + ఇక "ఇక - క - పు లు పరంబులగు నపుడు కనునకు దీర్ఘంబగు" (3) కాను + ఇక సంధి 11 చే - కానిక తూఁగు + ఇక "తూను తూఁగునకగు" తూను + ఇక సంధి 11 చే - తూనిక అమరు + ఇక = అమరిక ఇట్లే తక్కినవి ఇవి స్త్రీ సమములు కాన, తత్సమ 39 చే - అమరిక + ము- ఇత్యాది 57 చే - అమరిక - ఇత్యాదులు సిద్ధించును

## అప్వాదులకు నజి యగు 13

అప్ప అప్పన, ఒజ్జ ఒజ్జన, ఒప్ప ఒప్పన, గట్ట. గట్టన, గడ గడన, దట్ట. దట్టన, దీవ దీవన, పాట . పాటన, మన్న. .మన్నన, వీచు వీవన

వ్యా అప్ప - మొదలగు వానికి నజి యగును అప్ప+నజి=అప్పన వీచు+నజి క్రియా 88 చే - వీవు + నజి క్రియా 20 చే - వీవన తత్సమ 39 చే - అప్పన + ము, వీవన + ము 57 చే - అప్పన, వీవన ఇట్లే తక్కినవి

విశే - ఇట విధాన సామర్థ్యముచే- అప్వాదులకు, క్రియా 63 చే - ఇంచు గాగమము కలుగదు

## బడి యేల్వాదుల కగు. 14

ఏలుబడి, కట్టుబడి, కనుబడి, కానుబడి, గిట్టుబడి, చెల్లుబడి, చేరుబడి, తగులుబడి, తీఱుబడి, పెట్టుబడి, పోబడి, మ్రొక్కుబడి, వచ్చుబడి, సాగుబడి

వ్యా ఏలు, మొదలగు వానికి 'బడి' వర్ణకమగును ఏలు+బడి=ఏలు బడి పోవు + బడి = పోబడి ఇట 2 చే - వు లోపమయ్యెను కట్టు+బడి=

కట్టుబడి అనుక్తన్యాయమున, ఏలుబడి + సు ఇత్యాది తత్సమ 57 చే - ఏలుబడి - ఇత్యాది

విశే - వచ్చుబడి - అనుచో రాబడి - అనియుఁ గన్పట్టును

## గడ చేర్వాదుల కగు 15

చేరుగడ, తిరుగడ, తీఱుగడ, తేఱుగడ, ౖతేగడ, మనుగడ, విడుగడ, పీడుగడ

వ్యా చేరు — మొదలగు వానికి గడ ౖపత్యయ మగును చేరు+గడ= చేరుగడ ఇత్యాదులు తిరుగు + గడ, అనుచో 2 చే - గు లోపము తిరుగడ ౖతేగడ - ౖతేయు + గడ 2 చే - యు, లోపము ౖతేగడ తత్సమ 39 చే - చేరుగడ + ము ఇత్యాది 57 చే - చేరుగడ, ఇత్యాది

పారపరిశీలన - ౖపథమ ముౖదణమున ౖతేగడ - అనియే కలదు కొందఱు తేగడ - అని సవరించిరి అది సరికాదు ౖతోము - ౖతోమకము (19) అనుచో ౖకాముడి యున్నట్లే, ౖతేగడ అనుచో సూరి మతమున, ౖకాముడి కలదనుట యుక్తము కొందఱు ౖతేఁచు + గడ = ౖతేగడ-అయ్యె నందురు కాని ౖతేయు=తేయు, అని యంగీకరింపఁదగును ౖతేఁచు = తేయు-అనుట నిర్మూలము

## ఇకి కోర్వాదుల కగు. 16

కోరికి, పూనికి, పోలికి, మనికి, వినికి చూడు చూచునకగు చూడికి

వ్యా కోరు-మున్నగు ధాతువులకు ఇకి ౖపత్యయమగును కోరు + ఇకి సంధి 11 చే - కోరికి చూచు + ఇకి "చూడు చూచునకగు' చూడు + ఇకి సంధి 11 చే - చూడికి పూను + ఇకి = పూనికి అనుక్తన్యాయమున, కోరికి+సు ఇత్యాది తత్సమ 57 చే - కోరికి ఇత్యాది

## వు వర్ణకంబు మన్వాదుల కగు. 17

మను . మనువు, కాచు కావు, కొలుచు కొలువు చచ్చు చావు, తడయు తడవు, నిలుచు నిలువు, నొచ్చు నోవు, పూచు పూవు, ౖపుచ్చు ౖపువ్వు

వ్యా మను-మొదలగు ధాతువులకు, వు ౖపత్యయమగును మను+వు= మనువు కాచు+వు 2 చే - కా+వు=కావు ఇట్లే తక్కినవి చచ్చు + వు,

నొచ్చు + వు క్రియా 94 లోవలె చచ్చునకు చావు నొచ్చునకు నోవు నాదేశము లగునని యూహింపవనగును, చావు + వు, నోవు + వు 2 చే - చావు నోవులలోని వువర్ణము లోపించి, చా + వు = చావు, నో + వు = నోవు-అని యేర్పడును ప్రువ్వు=ప్రుచ్చు+వు 2 చే - చు లోపించే, ప్రుచ్ + వు - అని నిల్చును చకారవకార సంయోగము భాషాసహజము కాకుండుటచే నిర్దేశాను సారము చకారము వకారమగును ప్రువ్ + వు = ప్రువ్వు తత్సమ 48 చే - మనువు+వు, ఇత్యాది తత్సమ 57 చే - మనువు, ఇత్యాది

విశే - ప్రుచ్చు + వు 2 చే - ప్రు+వు అగుననియు గురుత్వము నిలుపుటకు ద్విత్వమగుననియుఁ గొందఱు సెలవిత్తురు కానియది యంత తృప్తికరము కాదు చూ క్రియా 112

## అవర్ణకంబు గిఱ్ఱాదుల కగు. 18

గిఱ, ఊఁద, ఎండ, కాయ, చదియ, తునియ, పరియ, పాయ, పిడుచ, మీట, ముడియ, వదర, వ్రయ్య.

వ్యా గిఱు- మొదలగు ధాతువులకు, అ-వర్ణకమగును గిఱు+అ, సంధి 11 చే - గిఱ, తత్సమ 39 చే - గిఱ + ము 57 చే - గిఱ ఇట్లే తక్కినవి

## అక వర్ణకంబు మాఱ్ఱాదుల కగు. 19

మాఱు మాఱకము, అమ్ము .. అమ్మకము, అంపు .. అంపకము, పంచు పంపు పంపకము, వండు-డకారంబు టకారంబగు వంటకము, త్రోము త్రోమకము, అద్దు అద్దకము-

వ్యా మాఱు మొదలగు వానికి అక ప్రత్యయ మగును మాఱు+అక సంధి 11 చే - మాఱక అచ్చిక 2 చే నిది క్లీబసమ మగును కావున, తత్సమ 39 చే - మాఱక + ము=మాఱకము ఇట్లే, అమ్ము + అక = అమ్మక + ము అమ్మకము-ఇత్యాది వండు+అక డకారంబు టకారంబగు వంటు + అక సంధి 11 చే - వంటక క్లీబ సమముగాన, తత్సమ 39 చే - వంటకము వంచు పంపు, వంపకము- అనుటచే చకారము పకారమగునని సూచన

పారవరిశీలన - త్రోము-త్రోమకము అని ప్రథమ ముద్రణ పాఠము సూరి నిఘంటువున, త్రోముశబ్దము గలదని సూర్యరాయ నిఘంటువు కనుక తోము, తోమకము-అను సవరణములు సరికావు

## డువర్ణకం బాత్వాదుల కగు నగునపుడు పకారంబు చయల కగు 20

ఆఱు ఆఱుడు, అమ్ము అమ్ముడు, అల్లు అల్లుడు, ఎక్కు ఎక్కుడు, క్రుమ్ము క్రుమ్ముడు, చోపు చోపుడు, త్రొక్కు త్రొక్కుడు, త్రోచు త్రోపుడు, దంచు దంపుడు, దిగు దిగుడు, దోఁచు దోఁపుడు, పెంచు పెంపుడు, పేయు పేపుడు, ప్రాకు ప్రాఁకుడు, మాయు మాపుడు, రాచు రాపుడు - ఇత్యాదులు

వ్యా ఆఱు మొదలగు ధాతువులకు 'డు' ప్రత్యయ మగును అగుచో, చ-యలకు, పకార మాదేశ మగును ఆఱు+డు=ఆఱుడు ఇత్యాది త్రోచు+డు చకారమునకు, పకారము త్రోప్+ఉ+డు=త్రోపు+డు త్రోపుడు ఇట్లే, దంచు + డు = దంపుడు, దోఁచు + డు = దోఁపుడు, పెంచు + డు = పెంపుడు, పేయు + డు = పేపుడు, మాయు + డు = మాపుడు తత్సమ 48 చే - ఆఱుడు + వు ఇత్యాది 57 చే - ఆఱుడు, ఇత్యాది

పాఠపరిశీలన - ప్రేఁచు ప్రేఁపుడు- అని సూరి చూపఁగా ముద్రణమున ప్రేఁచు లోపించి యుండునని యొక యూహ కాని ప్రేఁచు ప్రేఁపుడు ప్రాఁకు ప్రాఁకుడు- అన్నచోఁ గ్రమము తప్పును ప్రేఁచు ధాతువునులేదు వ్రేఁచు -వ్రేఁపుడు-అని సూరివ్రాయఁగా వ్రేఁచు- ముద్రణమున లోపించి భ్రాంతిచే ప్రేఁపుడుగా భావింపబడి పెంపుడు రూపమునొద్ద నెవరిచేతనో చేర్పఁబడియుండునని కొందఱు సెలవిత్తురు కాని, 'పెంచు - పెంపుడు - ప్రేఁపుడు" అని ప్రథమ ముద్రణమున నుండుటచే నీయూహ సరికాదు వ్యవహారమున పేయు-ధాతువుగలదు పేయు = ప్రేలు పేయు- ప్రేపుఁడు-అన్నచోఁ గ్రమభంగము కలుగదు

## ఉవర్ణకం బడుక్వాదుల కగు. 21

అడుకు, అంటు, ఒప్పు, ఒఱగు, ఒసఁగు

వ్యా అడుకు - మొదలగు ధాతువులకు, ఉవర్ణకమగును అడుకు + ఉ సంధి 11 చే - అడుకు ఇట్లే- అంటు + ఉ = అంటు, ఒప్పు+ఉ=ఒప్పు ఒఱగు+ఉ=ఒఱగు ఒసఁగు+ఉ=ఒసఁగు తత్సమ 48 చే - అడుకు+వు ఇత్యాది 57 చే - అడుకు - ఇత్యాది

విశే - ఒఱుగు- ప్రథమ ముద్రణము ఇది ముద్రణ స్ఖాలిత్యము

## వడి ప్రభృతు లిట్లెఱుంగునది. 22

వడి కొలువడి, గెలువడి, నడవడి వ్యతిరేకంబున· లేవడి,
వి తనివి, తెలివి, విరివి
అవు తగవు, నగవు, ఉఱవు.
ఇ చేయి, వ్రాయి,
కలి కనుకలి, వినుకలి

ఇత్యాదులు మహాజన వ్యవహారంబుల నెఱుంగునది

ఇది కృదంత పరిచ్ఛేదము.

వ్యా వడి- మొదలగు ప్రత్యయముల నిట్లే తెలిసికొనవలెను వడి - కొలుచు+వడి 2 చే - కొలు + వడి = కొలువడి అను క్తన్యాయమున (తత్సమ 44) కొలువడి+సు తత్సమ 57 చే - కొలువడి ఇట్లే గెలుచు+ వడి=గెలువడి, నడచు+వడి=నడవడి కలుగు+వడి=లేవడి తనియు+వి 2 చే - యులోపము తనివి ఇట్లే, తెలియు+వి=తెలివి, విరియు+వి=విరివి అవు తగు+అవు సంధి 11 చే - తగవు తత్సమ 48 చే - తగవు + వు 57 చే - తగవు ఇట్లే నగు+అవు=నగవు, ఉఱు + అవు = ఉఱవు; ఇ. చేయు+ఇ, సంధి 11 చే - చేయి వ్రాయు+ఇ=వ్రాయి కలి కను+కలి= కనుకలి విను + కలి = వినుకలి అను క్తన్యాయమున, చేయి+సు-ఇత్యాది తత్సమ 57 చే - చేయి మొ॥ ఇత్యాదులు మహాకవి ప్రయోగములచే గ్రహింపవలెను

## కృదంత ప్రక్రియ

1 మొదట, ధాతువున, నేకార్థీభావ సామర్థ్యమును విధింపవలెను
పాల్-ధాతువు (పాల-రక్షణే)
2 ధాతువుకంటెఁ గృత్ప్రత్యయమును విధింపవలెను
పాల్+ణ్వుక్=పాల్+అక పాలక-ప్రాతిపదికము
3 పదత్వసిద్ధికై సుప్-ప్రత్యయము చేర్చి రూపసాధన చేయవలెను
పాలక+సు=పాలక

వృత్తి సమన్వయము - జహత్స్వార్థా వృత్తి వశమున, ధాతువు స్వార్థమును విడుచును ప్రత్యయమే, ధాతు ప్రత్యయముల యర్థమును (పాలకుఁడను నర్థమును) బోధించును అజహత్స్వార్థావృత్తి వశమున ధాతువు స్వార్థమును విడువదు ధాత్వర్థమును ప్రత్యయార్థమును ఖాంసూదక న్యాయమున (దుమ్మును సీరును గలిసి బురదగా నేర్పడురీతిని) విడఁదీయరానట్లు మిశితములయి పాలకుఁడను నర్థమును బోధించును (వృత్తి-వి)

ఇది ఘంటాపథము

# ప్రకీర్ణక పరిచ్ఛేదము



## పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు రల తుల్యంబులు. 1

అతఁడు ఋషి ఇట సంధి లేదు ఆఋషి ఇట యడాగమము లేదు వచ్చెఋషి, వచ్చెన్ఋషి, వచ్చెను ఋషి ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వత్వములు

వ్యా పదము మొదటి ఋకారము రేఫముతోను, పదము మొదటి ౠకారము లకారముతోను సమానములు రలలు స్థిరములు గనుక, పదాద్యములగు ఋౠలు స్థిరముల వంటివే యగును అతఁడు+ఋషి ఇట ఋకారము రేఫ తుల్యమగుటచే సంధి 1 చే - ఉత్వసంధి కాదు అతఁడుఋషి- అనియే యగును. ఆ+ఋషి ఋకారము రేఫతుల్యము కనుక సంధి 3 చే - యడాగమమురాదు వచ్చెను+ఋషి ఋకారము రేఫ తుల్యము గనుక సంధి 18 చే - స్థిరము పరమగు నప్పుడు ద్రుతమునకగు లోప సంశ్లేష స్వత్వము లిట నగును వచ్చె ఋషి- ద్రుతలోపము వచ్చెన్ఋషి - సంశ్లేషము = ద్రుతముమీఁది హల్లుతోఁ గూడుకొనుట ఋకారము రేఫతుల్యము గనుక రేఫమునకువలెనే యిట ఋకారమునకు హల్లుధర్మము సిద్ధించెను వచ్చెనుఋషి - స్వత్వము

విశే - (1) వచ్చెన్ఋషి - అనియే ప్రథమ ముద్రణము వద్రసుడి ఋకారమునకుఁ జిహ్నమగుటచే - రేఫతుల్యత సిద్ధించునప్పుడు వచ్చెన్రుషి-అని కాదు మఱి యిది సంశ్లేషమెట్లగును? అన్నచో ద్రుతము వ్యంజన నకార రూపమున హల్లునకు ముందున్నను సంశ్లేష మగునని గ్రహింపవలెను కాఁగా సంశ్లేషమనఁగా ద్రుతము మీఁది హల్లుతోఁ గూడుకొన్నట్లుచ్చరింపఁబడుట (గ్గ, న్గ లిపిభేదములు) ద్రుతము పరస్వరాంగమగుట యన్నమాటః "సంయోగాదిర్వా, (ఋ ప్రా) = సంయోగాది భూతోవర్ణః స్వరాంతరేవ ర్తమానః పూర్వస్యవాస్వరస్యాంగం భవతి, పరస్యవా" (పార్షద) లేనిచో, పాడెన్

గంధర్వుఁడు - ఇత్యాదులు బాలవ్యాకరణ సాధ్యములు కాకుండఁ బోవును ఈ ద్రుతమునకుఁ బేరు లేకుండుట యను నసమగ్రతయు ననివార్యమగును "అంచలకున్, బోనిడి" సూరిపీఠిక (11) రేఫతుల్యత ఋకారమునకే కాని ఋకార లిపికిఁ (వ్రటసుడికిఁ) గాదు కాన వచ్చెన్రుషి-అని వ్రాపవడికాదు

(11) ఌకారము - ఌకారము లకారతుల్యమని చెప్పనక్కఱలేదని కొందఱు సెలవిచ్చినారు కాని, ఌకారము వర్ణసమామ్నాయమున నుండుటచే దీనిని గూర్చి చెప్పవలసిన ప్రసక్తి యేర్పడుచుండును ఉదా॥ అనంతుఁడు ఌకార దీర్ఘమును గ్రహింపలేదు - అనుచో సంధి యగునా? కాదా? యను ప్రశ్న కలుగును కావున ఌకారము లకార తుల్యమని చెప్పక తీరదు కాని ఌకారమున కిట్టి ప్రయోగము లభింపకుండుటచే నుదాహరణములలోఁ జేర్పఁబడలేదు ప్రయోగావకాశమును దృష్టిలోనిడుకొని సూరియిట ఌకారమును జేర్చెను

పదసార్థక్యము - (1) పదాద్యంబులు - అనుటచేఁ బదాద్యములు కాని ఋఌ వర్ణములు రలతుల్యములు కావు కృష్ణుడు కృ-లోని ఋకారము పదాద్యముకాదు కాన రేఫతుల్యముకాదు కనుక, అ+కృష్ణుఁడు=అకృష్ణుఁడు-అగును (సమాస 14) (11) ప్రకృతి-ఇట ఋకారము రేఫతుల్యము కాదు గావునఁ బూర్వాక్షరము గురువు కాదు

## అచ్చిక పదంబులం దుత్తమంబులగు రులుడుల ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు. 2

| | | | |
|---|---|---|---|
| నల్లేరు | నల్లెరు, పల్లేరు | పల్లెరు, పెన్నేరు | పెన్నెరు |
| మానేరు | మానెరు, ఆడేలు | ఆడెలు, కుందేలు | కుందెలు |
| తోఁడేలు | తోఁడెలు, నాఁగేలు | నాఁగెలు, నేరేడు | నేరెడు |
| మారేడు | మారెడు, పూరేడు | పూరెడు, తంగేడు | తంగెడు |

వ్యా అచ్చతెనుఁగు పదములలో, ఉత్తమములగు, రు-లు-డు అను వర్ణముల ముందఱి, ఏత్వమునకు హ్రస్వము విభాషనగును ఉత్తమము=మూఁడింటి కంటెఁదక్కువకాని యక్షరములుగల శబ్దములతోగలఁ దుది యచ్చుత్తమము దాని ముందరి యచ్చుపోత్తమము (తత్సమ 46) నల్లేరు ఇది మూఁడక్షరముల శబ్దము దీనిలోఁ దుదియచ్చు - రు లోని ఉకారము ఇది ఉత్తమము, ల్లే-లోని ఏకారముపోత్తమము కాని యీ సూత్రమున, రు - ఉత్తమముగా వ్యవహరింపఁ బడెను ఇది యౌపచారిక వ్యవహారము నల్లేరు రు-ఉత్తమము దీని ముందఱి

ఏత్వమునకు హ్రస్వము కలిగిన నల్లెరు - అగును హ్రస్వము కలుగనిచో, నల్లేరు ఇట్లే, పల్లెరు, పల్లేరు ఇత్యాదులు

## ఊయేల పయ్యెద తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్య వక్ర యోగంబు లేదు. 3

### స్పష్టము

వ్యా ఊయేల, పయ్యెద, తాయెతు - అను మూఁడింటఁ దప్ప నామముల యందు, యకారమునకుఁ దాలవ్య వక్రముల కూడిక లేదు త్రిక్క = తప్ప తాలవ్య వక్రములు = ఎఏలు ఎఏఒఓలు వక్రములు వీనిలో, ఎఏలు తాలవ్యములు కాన, తాలవ్య వక్రములనగా, ఎఏలు-(ఎఏలు కంఠతాలవ్యములు ఒఓలు కంఠోష్ఠములు )

విశే - తాయెతు శబ్ద మథర్వణ వ్యాఖ్యానమునననుసరించి యిట గ్రహింప బడెను ఇది యన్యదేశ్యమన్న వాదమప్పటికి లేకుండుటచే, క్షతిలేదు

పదసార్థక్యము - నామంబులందు - అనుటచేఁ గ్రియలలోఁ దాలవ్య వక్రయోగ ముండవచ్చును పోయెను - మొ॥

## ఊయేల యూయాలల చాఁపుల నొండొంటికిం గుఱుచయొండె నగు. 4

ఉయేల - ఊయెల - ఊయేల, ఉయాల, ఊయల - ఊయాల. వక్ష్యమాణంబు యద్విత్వంబు ఉయ్యేల, ఉయ్యెల, ఉయ్యాల, ఉయ్యల

వ్యా ఊయేల - ఊయాల, అను వాని దీర్ఘములలో నొకొక్కదానికి హ్రస్వము వైకల్పికముగ నగును చాఁపు=దీర్ఘము, కుఱుచ = హ్రస్వము ఒండె = వికల్పము ఊయేల ఇట మొదటి 'ఊ' అనుదానికి హ్రస్వము కలిగిన, ఉయేల - అగును రెండవ దీర్ఘమునకు హ్రస్వము కలిగిన, ఊయెల- అగును హ్రస్వములు కలుగనిచో, ఊయేల - అని యుండును ఇట్లే, ఊయాల - అను దానిలో, మొదటి దీర్ఘమునకు హ్రస్వము కలిగిన ఉయాల, రెండవ దీర్ఘమునకు హ్రస్వము కలిగిన, ఊయల, హ్రస్వములు కలుగనిచో ఊయాల 6 చే - యకారమునకు ద్విత్వము కలిగిన, ఊయేల=ఊ + య్యేల సమాస 13 చే - ఉయ్యేల ఇట్లే ఊయెల = ఉయ్యెల, ఊయాల = ఉయ్యాల - ఊయల = ఉయ్యల

పదసార్థక్యము - ఒండొంటికిన్, అనుటచే - ఒక్కొక్క దానికిఁ బర్యాయముగ హ్రస్వము కలుగును రెండు దీర్ఘముల కొక్కసారిగ హ్రస్వము కలుగదు (ఊయెల = ఉయెల - కాదు ఊయాల = ఉయల - కాదు)

## పయ్యెద పయ్యద. 5

వ్యా పయ్యెద శబ్దము యత్వమధ్యమును గలదని యర్థము పయ్యెద, శబ్దమునకు, పయ్యద రూపాంతరము

## ఊయేలాదులందొలి యచ్చు మీఁది హల్లునకు ద్విర్వచనం బొండెడ నగు. 6

ఉయ్యేల, ఊయేల

ఊయేల, ఊయెల, ఊయాల, ఊయల, అయె, ఏలిదము, ఓయ, ఓయారము, కోపు, (ధనురగ్రము) జాజర, తీనియ, తీయము, తేప. (ప్లవము ) తేమ, తోయలి, దీవియ, నూవు, నోవి, నోవు, పూవు, పేయ, మోక, (అంకురము) మోటిక. మోవు, వీయము - ఇత్యాదులూయేలాదులు

వ్యా ఊయేల - మొదలగు వానిలోఁ దొలి యచ్చు మీఁది హల్లునకు ద్విత్వము వైకల్పికముగ నగును ద్విర్వచనము = ద్విత్వము ఒండెన్ = పక్షాంతరమును దెలుపును వికల్పముగ నన్నమాట ఊయేల ఈ 6 చే-ఊ+ య్యేల సమాస 13 చే - ఉయ్యేల ద్విత్వము కానిచో - ఊయేల ఇట్లే ఉయ్యెల, ఊయెల - ఇత్యాది కోపు (ధనురగ్రము) తేప (ప్లవము) మోక (అంకురము) అనుటచే నితరార్థములలో ద్విత్వమీ శబ్దములకుఁ గలుగదు ద్విత్వము కలిగిన - కోప్పు, సమాస 13 చే - కొప్పు = ధనురగ్రము ఇట్లే తెప్ప (ప్లవము) మొక్క (అంకురము)

విశే - అయె - అనునది అయెను అయెడి, అయెడు - అను వాని కువ లక్షణము

## అకారంబు క్రింది అకారంబునకుం దుది ను లు ల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు. 7

అలుు - అలు, గొల్లియ - గొలియ, కన్ను - కను, నన్ను - నను, పల్లు - పలు, విల్లు - విలు.

వ్యా అకారము క్రింద నుండు అకారమునకు, దుది, "న్ను - ల్లు", అను వాని క్రింది నలలకును లోపము బహుళముగా నగును నులుల క్రింది న ల లు= ను - క్రింది - న = న్ను లు - క్రింది ల = ల్లు అకారము క్రింది అకారమునకు అఱు ఇట అకారము క్రింది అకారము లోపించిన, అఱు - అగును గొఱ్ఱియ = గొఱియ - అగును పదాంత అకారమునకు అఱు = అఱు-అను నదియు, పదమధ్య అకారమునకు గొఱ్ఱియ = గొఱియ - అనునదియుఁ జూపఁ బడెను తుది ను లు ల క్రింది నలలకు కన్ను -క్రింది న - లోపించిన కను ఇట్లే, నన్ను = నను - పల్లు - క్రింది ల - లోపించిన పలు ఇట్లే, విల్లు= విలు తుది - అనుటచేఁ బదాంతమునందే న ల ల లోపము పద మధ్యమునఁ గాదు అన్నువ = అనువ కాదు వెల్లువ = వెలువ - కాదు

విశే - ఇట అకారము క్రింది అకారము, ను లు ల క్రింది న ల లు - అనుచో సూరి గుణిత క్రమము ననుసరించి లేఖన చిహ్నముల లోపము నుద్దేశించెను తత్సమ 42, క్రియా 61 సూత్రములలో లేఖన చిహ్నమగు మూముడి నాగమముగ విధించెను పర్ణములకు వాని లేఖన చిహ్నములకు నభే దోపచారము పూర్వ శబ్దమునకుఁ గల ముందటిది - అను నర్థము క్రిందు శబ్దమునకు లేదు క్రిందు = పూర్వకాలము, కడచిన కాలము - అని యర్థము కావున క్రిందు = పూర్వమున్న, ముందున్న-అని సూరి యుద్దేశించెనని కొందఱు సెలవిచ్చుట సరికాదు మొదటిది - అను నర్థమున సూరి ముందు శబ్దమును వాడును క్రిందు శబ్దమును గాదు అచ్చిక 6 - 8 కారక 29, క్రియా 27 సూ. కనుక, క్రిందు = మొదటిది - అనుట సూరి హృదయముగఁ గనఁబడదు

## అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు. 8

అకట, అక్కట

అక్కట, అట్టిక, అట్టుక, అట్టె, అయ్యారె, అయ్యో, అవ్వారి, ఇట్టిక, ఉప్పవడము, ఉమ్మి, ఎక్కసక్కియము, ఎకసెక్కియము, ఎక్కిరింత, ఎడ్డ, ఎన్నిక, ఎమ్ముక, కజ్జాయము, కట్టా, కట్టిక, కప్పురము, కమ్మటము, కమ్మతము, కువ్వాడము, కొట్టిక, కొమ్మ, కొయ్యగూర, గయ్యాళము, గిజ్జిగాఁడు, గుజ్జరాతి, చిట్టి, చిన్న, చిమ్మట, చెన్నఁటి, చెప్పము, చెప్పఁడు, చెమ్మట, చెల్లియలు, జవ్వాజి, జాబిల్లి, తమ్మటము, తమ్ములము, తల్లి, తుమ్మికి, తువ్వర, తెల్ల, దవ్వు, దివ్వియ, నవ్వు, నిద్దుర, నివ్వరి, నివ్వాళి, నెట్టిక, నెమ్మలి, పచ్చళించు, పిన్న, పుల్లియ్య, పువ్వు,

పెద్ద, పొట్టి, ప్రాకెన్న, ప్రెగ్గడ, బెగ్గడు, బొమ్మ, బొమ్మికము, బొమ్మిడికము, బొమ్మిడీకము, మజ్జ, మత్తాబు, మల్లారము, ముక్కు, ముద్దియ, మెట్టిక, మొక్కరము, మొగ్గరము, మొల్లాము, రద్ది, లొట్టిపిట్ట, వట్టి, వయ్యాళి, సన్నియ, సవ్వడి, సివ్వంగి, అట్టు, ఇట్టు, ఎట్టు, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, మమ్ము, మిమ్ము, తమ్ము, అమ్మ, అక్క, అవ్వ, అయ్య, అప్ప, అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు, అచ్చటు, ఇచ్చటు, ఎచ్చటు - ఇత్యాదు లక్కటాదులు.

వ్యా అక్కట - మొదలగు వాని ద్విత్వమునకు లోపము విభాషనగును జడ్డ = హల్లుతోఁ గూడిన హల్లు అక్కట - జడ్డకు లోపము కలిగిన అకట, లేనిచో అక్కట ఇట్లే తక్కినవి

విశే - (1) జడ్డలోఁ దుది హల్లునకే లోపము "సంయోగాంతస్యలోపః అలోంత్యస్య" (పాణి) (11) రంజాదులిందు జేరును (క్రియా 71)

పార పరిశీలన - అయ్యో, అయ్యారె - ప్రథమ ముద్రణ క్రమము అకారాది క్రమమును బట్టి అయ్యారె, అయ్యో - అని గ్రహింపనగును

## జడ్డక్కరంబుతోఁ బదాది స్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. 9

అట్టెత్తె, కన్నదరె, నన్నడిగె, పల్లొత్తె, విల్లందె.

వ్యా ద్విత్వాక్షరముతోఁ బదాది స్వరము కూడునప్పుడు ద్విత్వమునకు లోపము లేదు 7, 8 సూత్రములచే జడ్డకు లోపము ప్రాప్తించు చుండఁగా దాని నీ సూత్రము నిషేధించుచున్నది అట్టు + ఎత్తె 7 చే - జడ్డకు లోపము ప్రాప్తించుచున్నది కాని సంధి 1 చే - అట్టెత్తె - అని జడ్డక్కరముతోఁ బదాది స్వరము కూడుటచే జడ్డ లోపింపదు ఇట్లే, కన్ను + అదరె = కన్నదరె పల్లు + ఒత్తె = పల్లొత్తె విల్లు + అందె = విల్లందె - అనునవి నన్నున్ + అడిగె సంధి 2 చే - సంధి జరిగి నన్నడిగె - అని జడ్డక్కరముతోఁ బదాది స్వరము కూడుచో జడ్డ లోపింపదు ననడిగె - కాదన్నమాట

విశే - (1) జడ్డక్కరముతోఁ బదాది స్వరము కూడుట యనఁగా సంధి చికీర్షితమగుట యని కొందఱు సెలవిత్తురు కాని యది సరికాదు క్రియా 100 సూత్రమున, అయ్ + ఎను - అనుచో సంధి ప్రసక్తి లేదు కావునఁ గూడుట

యనఁగా ముందఱి వర్ణముతోఁ గలియుట యని గ్రహింపఁదగును (11) అట్టు, ఇట్టు, ఎట్టు - అను వాని జడ్డకుఁ బదాది స్వరము పరమగుచో, జడ్డకు లోపము ప్రయోగములందుఁ గనఁబడును ఇటనుటంజేసి - (క్రియా 84) అని సూరిగారే వాడిరి కావున వారికి జడ్డ లోపము సమ్మతమే యననగును ఇట్టు + అనుట= ఇట్టనుట, అను రీతిని సూరి లక్ష్యమును జూపకపోవుటయు దీనిని బలపఱచును

పద సార్థక్యము - పదాది స్వరంబు గూడుచో - అనుటచేఁ బదాది స్వరము కూడనిచో జడ్డకు లోపము లేదు నన్నున్ + అడిగె ఇటఁ బదాది స్వరము కూడి, నన్నడిగె - అగుచో జడ్డ లోపింపదు పదాది స్వరము జడ్డతోఁ గూడని పక్షమున 7 చే - జడ్డకు లోపము విభాషనగును నన్నున్ + అడిగె= నన్నునడిగె నను నడిగె, నన్నునడిగె

## హాదులయు, నీలుగు లోనగు వాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు 10

హడపము, అడపము, హరిదళము, అరిదళము, హాళఁది, అళఁది నీలుగు, ఈలుగు నీలుగు, నెగయు, పొందు, పొనరు

వూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచార మూలకంబు

-వ్యా హకారాదుల యొక్కయు, నీలుగు మొదలగు వాని యొక్కయు, తొలి హల్లునకు లోపము బహుళముగా నగును హాదులకు హడపము దీనిలోఁ దొలి హల్లగు హకారము లోపించిన అడపము లేనిచో, హడపము ఇట్లే హరిదళము = అరిదళము, హరిదళము, హాళఁది = అళఁది, హాళఁది - అని పాక్షికముగ హకారము లోపించును నీలుగుతోఁ దొలి హల్లగు నకారము లోపించిన ఈలుగు, లేనిచో నీలుగు ఇట్లే, తక్కినవి వూను పొదవు - అను వానిలోఁ దొలి హల్లు లోపించునని యప్పకవి చెప్పెను అది యాలోచించి చెప్పినది కాదని తాత్పర్యము అనఁగా, వూను = ఊను, పొదవు = ఒదువు - అని కాలేదన్నమాట

విశే - అప్పకవిచూపిన ప్రయోగములలో నీరూపములు భిన్నార్థకములుగఁ గనఁబడునుగాన, సూరి యప్పకవి వచన మవిచారమూలక మనెను (అప్పక 2 ఆ 75 - 86 సు)

పాఠ పరిశీలన - హాలఁది - అలఁది అని ప్రథమ ముద్రణముననే ళకారము తప్పు పడినది.

## ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. 11

ఆరాటము, అరటము

ఆరాటము, కక్కూఱితి, కేళాకూళి, కొమారుఁడు, కొమారిత, గంబూరము, పెండారము, బంగారము, బేహారము, వీటతాటము, సంతోసము

వ్యా ఆరాటము-మొదలగు వానిలోఁ బ్రథమేతర దీర్ఘమునకు హ్రస్వము విభాషనగును ప్రథమేతర మనుటచేఁ దొలి దీర్ఘమునకు హ్రస్వము రాదు ఆరాటము ప్రథమేతర దీర్ఘమునకు హ్రస్వము కలిగి, అరటము-అగును 'అ'-ప్రథమ దీర్ఘము గనుక హ్రస్వము కాదు ఇట్లే తక్కినవి కేళాకూళి=కేళకూళి, కేళాకుళి, కేళకుళి - అని యేర్పడును

## ఓయారాదులం దొలి దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. 12

ఓయారము, ఒయారము

ఓయారము, కేళాకూళి, కోలె, గుడారము, గోరువంక (పక్షి) జోహారు, నీలుగు, పేఁడ, బేహారము, (దీర్ఘమధ్యంబు) మాఱు, మూలుగు, మోఱకు, వీటతాటము, వీడియము - ఇత్యాదులు.

వ్యా ఓయారము - మొదలగు వానిలో మొదటి దీర్ఘమునకు హ్రస్వము విభాషనగును ఓయారము, దీని తొలిదీర్ఘమునకు హ్రస్వము కలిగిన ఒయారము, కలుగనిచో - ఓయారము ఇట్లే, కెళాకూళి, ఇత్యాది గోరువంక (పక్షి) నఖిశత మను నర్థమున గోరువంక - అనియే యుండును పక్షివిశేషమను నర్థముననే గొరువంక-అగును పేఁడ - ఈ 12 చే - పెఁడ, సంధి 22 చే - నుడి తొలి హ్రస్వము మీఁద ఖండబిందు వుండదు గనుక నిది పూర్ణబిందువుగ మాఱి, పెండ - అగును ఓయారము, కేళాకూళి, బేహారము, వీటతాటము - అనునవి 11 సూత్రమునను గలవు ఒయారము కెళాకూళి, బెహారము, విటతాటము-అనునవి యీ 12 చే - నగును 11 చే - నగు రూపము లా సూత్రమునఁ జూడ నగును బేహారము (దీర్ఘమధ్యంబు) అనుటచే 11 చే - నేర్పడు బేహరము అనుదాని నీ సూత్రమునఁ జేర్చి బెహరము అన్ని సాధింపరాదు

విశే - బేహారము (దీర్ఘమధ్యంబు) అన్నట్లు కేళాకూళి - అనుచోట వ్రాయలేదు కనుక 11 చే - నేర్పడు రూపములను ప్రయోగానుసారముగ నిందుఁ జేర్చుకొననగును కేళాకుళి = కెళాకుళి కేళకుళి = కెళకుళి- కావచ్చు నని ప్రయోగములను బట్టి చెప్పఁదగును కేళకూళి = కెళకూళి-కనఁబడదు ఇట్లే, 11 చే - నయిన పీటతటము - అనుదాని నుండి విటతటము కావచ్చును

పాఠపరిశీలన - దీర్ఘమధ్యంబు-అని ప్రథమ ముద్రణ పాఠము మధ్యమ్ము అని కొన్ని ప్రతులలో నుండుట పొరపాటు

## అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు. 13

అడఁగు, అణఁగు

అడఁగు, కడఁగు, చిల్లాడము, తడగము, నాడెము, పోఁడి, మిడుఁగు, వడఁకు, మిడుఁగుఱు ఇవి యడంగ్వాదులు

వ్యా అడంగ్వాదుల డకారమునకు ణకారము విభాషనగును అడఁగు డకారమునకు ణకారమయిన అణఁగు, కానిచో - అడఁగు, ఇట్లే, తక్కినవి

పాఠపరిశీలన - ఇవియడంగ్వాదులు - అని ప్రథమ ముద్రణ పాఠము శ్లిష్ట వ్యవహారమున మఱికొన్ని మాటలు వినఁబడునుగదా! యని ఇత్యాదులని కొందఱు సవరించుట ధర్మము కాదు

## దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు. 14

దక్కు, డక్కు

దక్కు, దగ్గఱు, దాఁగు, దాఁగు, దాకలి, దిగు, దిగ్గియ, దూయు, దెందము, దెప్పరము, దెప్పు, దొంగ, దొప్ప - ఇత్యాదులు

వ్యా దక్కు - మొదలగువాని దకారమునకు డకారము విభాషనగును. దక్కు - దకారమునకు డకారమయిన, డక్కు కానిచో - దక్కు, దెందము - ఇట, తొలిదకారమునకే డకారమగును - డెందము

పాఠపరిశీలన - దాకలి అని ప్రథమ ముద్రణమున నిర్బిందుకముగనే గలదు ఇదే గ్రాహ్యము

## ఏతాదులకు ముపర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. 15

ఏతము, ఏతామ

ఏతము, కళ్లము, గాఱమ్ము, గుద్దము, గోణము, గోతము,

జాజము, ఝుంజము, జోతము, తణగము, బొండ్లము, మండము లాతము, పీణము - ఇత్యాదులు.

వ్యా ఏత - మొదలగు వానికి మువర్ణకము పరమగునపుడు దీర్ఘము విభాషనగును ఏత - ప్రాతిపదికము అచ్చిక 2 చే - నిది క్లీబసమమగును కావున, తత్సమ 39 చే - ఏత+ము ఈ 15 చే - దీర్ఘము కలిగిన ఏతా+ము=ఏతాము కలుగనిచో - ఏత+ము=ఏతము ఇట్లే కళ్ళ+ము=కళ్ళాము, కళ్ళము-ఇత్యాది

విశే - ఏతము - సబిందుకమని కొందఱందురు

## పదాంతంబులయి యసంయుక్తంబులయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. 16

ఇందు నురుళ కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబు లకుఁ జూపట్టెడు. ప్రమానుపడె, ప్రమాన్పడె, మినువడె, మిన్వడె, వత్తురువారు, వత్తుర్వారు, కారుకొనియె, కార్కొనియె, రాములు, రాముల్, వనములు, వనముల్

వ్యా పదాంతములై, యసంయుక్తములైన ను-లు-రు అను వర్ణముల, ఉత్వమునకు లోపము బహుళముగా నగును ను - రు ల ఉత్వమునకుఁ దఱచుగ హల్లు పరమగునప్పుడు లోపము కనఁబడును ప్రమాను + పడె. ఉత్వము లోపించిన: ప్రమాన్+పడె=ప్రమాన్పడె ఉత్వము లోపింపనిచో — ప్రమానువడె మిను+వడె సంధి 13 చే - మిను+వడె, ఈ 16 చే - మిన్+వడె=మిన్వడె ఉత్వలోపము కానిచో-మినువడె వత్తురు + వారు = వత్తుర్ + వారు వత్తుర్వారు, వత్తురువారు కారు+కొనియె=కార్కొనియె, కారుకొనియె అవసానము పరమగుచో ను-రుల కుత్వలోప మరుదని తాత్పర్యము లు వర్ణమునకు. రాములు=రాముల్, రాములు వనములు=వనముల్ వనములు హల్లు పరమగు నప్పుడు సైతము, లు వర్ణమున ఉత్వము లోపింపవచ్చును

విశే - ప్రాయికంబుగ - అనుటచే నురుల కుత్వలోప మవసానమున నరుదుగఁ గావచ్చును చూ ప్రౌఢ — ఘంటా

పారవరిశీలన - ప్రమాన్పడె-అను రూప మొక్కటే ప్రథమ ముద్రణమునఁ గలదు ప్రమానుపడె - అనునది తప్పిపోయి యుండును ప్రమానుపడె-అను రూపము, ప్రయోగ దృష్టముచే, (హరి ఉ 4-83) ప్రమాను+పడు-అనుచో,

ఉత్వలోపము నిత్యమని కొందరు సెలవిచ్చుట సరికాదు మానుపడె-మ్రాన్పడెః అను ముద్రణములే గ్రాహ్యములు

## ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలదరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. 17

కినుక, కిన్క, కానుక, కాన్క, చిలుక, చిల్క, కాలువ, కాల్వ, అడుగు, అడ్గు, కడుపు, కడ్పు, పెరుగు, పెర్గు, కూరుకు, కూర్కు

వ్యా అచ్చతెనుఁగు శబ్దములలోఁ బదమధ్యములందుండు నలదరల ఉత్వమునకు లోపము బహుళముగా నగును కినుక=కిన్+క కిన్క ఇట్లే, కానుక=కాన్క, ఇత్యాది ఉత్వలోపము కానిచో కినుక - ఇత్యాది రూపము లుండును

## లాఁతి యచ్చునకు సహితమొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. 18

కలికి, కల్కి, ములికి, ముల్కి, బుడిపి, బుడ్పి, పొలఁతి, పొల్తి

వ్యా అచ్చికములందు ఉత్వ భిన్నమగు నలదరల యచ్చునకుఁ గూడఁ గొన్నిచోట్లఁ బదమధ్యమున లోపము కనఁబడును కలికి పదమధ్యమునఁగల ఇత్వము లోపించిన కల్+కి కల్కి లోపింపనిచో, కలికి ఇట్లే తక్కినవి.

## అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు. 19

అబ్బురము, అబ్రము

అబ్బురము, కప్పురము, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు, చప్పుడు, నెత్తురు ఇత్యాదులు.

వ్యా అబ్బురము-మున్నగువానిలో, ఉత్వమునకు లోపము విభాషనగును అబ్బురము=అబ్ బ్+రము వేఱొక హల్లుతోఁ గూడుకొనుచో ద్విత్వమునందలి యొక హల్లునకు లోపమగుట సహజము (అచ్చిక 23) కావున నొక బకారము లోపించి అబ్ + రము = అబ్రము అగును ఇట్లే - క ప్రము, అప్డు, ఇప్డు, ఎప్డు, చప్డు, నెత్రు - ఇత్యాదు లేర్పడును

విశే - హల్మధ్యగంబున కన్యతర సవర్ణంబునకు హల్లునకు లుక్కగు- అను సూరి వచనమిట స్మరింపఁదగును (శబ్దల 5 - 30)

## చుక్పరక రువర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు, నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు 20

అదురుచు, అద్రుచు, ఎదురుచు, ఎద్రుచు, పదురుచు, పద్రుచు.

వ్యా చుగాగమము పరముగా నున్న రు వర్ణమునకు ముందున్న దు వర్ణము యొక్క ఉత్వమునకు లోపము విభాషనగును అగుచో దాని పూర్వ స్వరము గురువు కాదు అదురుచు - అదురు - ధాతువు క్రియా 73 చే - అదురు + చు ఇట, చుగాగమము పరముగ నున్నది రు వర్ణమునకు ముందు దు వర్ణము గలదు కాన నీ దు వర్ణము యొక్క ఉత్వమునకు లోపము కలిగిన అద్ + రు + చు = అద్రుచు - అగును, ద్రు - సంయుక్తాక్షరము ఐనను బూర్వ స్వరము గురువు కాదు లఘువే యగును ఉత్వము లోపింపనిచో - అదురుచు ఇట్లే - తక్కినవి

విశే - అద్రుచు వంటి వానిని లఘు ద్విత్వములని యందురు (అప్పక 3 - 326) శిథిల ద్విత్వములని కన్నడమున, వ్యవహరింతురు

పాఠ పరిశీలన - రు వర్ణకంబునకు - అను ప్రథమ ముద్రణము పొరపాటు

## జూదాదుల దాకు జకారంబు విభాషనగు. 21

జూదము జూజము అవుదు, జవాది, జాడి, జాడు, విరవాది.

వ్యా జూదము - మొదలగు వాని దకారముకు జకారమే విభాషనగును జూదము దకారము జకారమయిన జూజము కానిచో - జూదము ఇట్లే తక్కినవి

## నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘంబులకు గిగీలగు. 22

కుంభకర్ణుఁడు, గింభ కర్ణుఁడు, రావణుఁడు, గీవణుఁడు

వ్యా నిందయం దామ్రేడితము యొక్క తొలి హ్రస్వాక్షరమునకు గివర్ణమును, దొలి దీర్ఘాక్షరమునకు, గీ వర్ణమును, నగును కుంభకర్ణుఁడు + కుంభకర్ణుఁడు ఇట రెండవసారి యుచ్చరించిన కుంభకర్ణుఁ డన్నునది యామ్రేడితము ఆమ్రేడితము ద్విరుక్తము యొక్క పరరూపము (సంధి 10), ఆమ్రేడితము యొక్క తొలి హ్రస్వాక్షరమగు 'కు' వర్ణమునకి సూత్రముచే 'గి' వర్ణమ్మయి, గింభకర్ణుఁడు - అగును రావణుఁడు + రావణుడు ఇట రెండవసారి యుచ్చ

రించిన రావణుఁడు - లోని రా - అను దానికి 'గి' వర్ణమై, రావణుఁడు గివణుఁడు - అని యేర్పడును

## పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళి ప్రాసంబులు నాఁబడు. 23

వ్యా పద్య పాదమున మొదటి యక్షరము వళి యనియు, రెండవ యక్షరము ప్రాసమనియు ననఁబడును

విశే - పాదాది వర్ణమును వళి యనుట ప్రాచీన సంప్రదాయము అద్యో వళిః (ఆం చిం ) ఇది కాలక్రమమున యతికిఁ బర్యాయపదముగ వాడఁబడినది.

## య వ ల లు లఘ్వలఘువులు మైత్రింబొరయు రేఫంబులు పొరయవు. 24

వ్యా లఘువులగు య వ ల లలఘువులగు య వ ల లతో యతి ప్రాస మైత్రుల నందును లఘురేఫము నలఘురేఫము యతి ప్రాసమైత్రుల నందవు య ర ల వ ల లఘుత్వా లఘుత్వమును గూర్చి చూ సంజ్ఞా 18

పొర పరిశీలన - మైత్రి - అని ప్రథమ ముద్రణము దీనిని మైత్రి అని కొందఱు సవరించుట పొరపాటు

## రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్య వ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు. 25

శ్లో॥ శ్రీ స్తనాశ్చిత కస్తూరీ పఙ్క సంకలితో రసే
పఙ్కజాక్షాయ నాథాయ వేంకటేశాయ మఙ్గళమ్.

ఇది ప్రకీర్ణక పరిచ్ఛేదము

బాలవ్యాకరణము సంపూర్ణము,

వ్యా లఘు రేఫములు, నలఘురేఫములు, తక్కిన విశేషములు, మహా కవి ప్రయోగానుసారముగఁ దెలిసికొనుట మేలు ఏయే శబ్దములలోని రేఫము లఘువో, యే యే శబ్దములలోని రేఫ మలఘువో ప్రయోగానుసారము తెలియ వలెనని తాత్పర్యము.

విశే - గ్రంథమును మంగళాంతముగ ముగించుటకు శ్రేయశ్శబ్దము సూత్రమున వాడఁబడినది మంగళ శ్లోకమును జేర్పఁబడినది

ఘంటాపథ వ్యాఖ్య సంపూర్ణము

– (०) –

క. మును మదువజ్ఞంబగుచుం
దనరిన వ్యాకృతిని సూత్ర తతి యొకకొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననఘుము బాలావబోధ మగుటకుంగిఁ దగన్

క తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందిన వారల్
తనరఁగ నీ వ్యాకరణం
బున మూలంబయిన కృతిని బోలఁగనఁ దగున్

– (०) –

అనుబంధము

# I. ముఖ్య పారిభాషిక పదసూచిక

– (౦) –

# పరిశిష్టము

## 1. లింగము -

గుణత్రయ (సత్త్వరజస్తమోగుణత్రయ) పరిణామ రూపములగు శబ్దముల ధర్మము లింగమనఁబడును గుణత్రయోపచయము (వృద్ధి) పుంలింగము. అపచయము (తగ్గుదల) స్త్రీలింగము గుణత్రయ స్థితి నపుంస లింగము అభివ్యంజన శక్తినిబట్టి యిది యేడు విధములు "ఉపాదాన వికల్పాశ్చ లింగానాం సప్తవర్ణితాః (వాక్యప) (I) పుం (II) స్త్రీ (III) న (IV) త్రిం (V) పుం న (VI) స్త్రీ పుం (VII) స్త్రీ న లింగము శాసనీయముకాదు. "లింగమశిష్యం లోకాశ్రయ త్వాల్లింగస్య" (మ భా)

## 2 వ్యపేక్షా సామర్థ్యము -

ఆకాంక్షా వశమునఁ బదములు పరస్పర మన్వయించుట వ్యపేక్షా సామర్థ్యము ఇది వాక్యములందే యుండును దేవదత్తుఁడు వండెను ఆకాంక్షా వశమున దేవదత్తుఁడను పదము, క్రియాపదముతో నన్వయించును

# II. చింతనీయాంశములు

(1) వర్ణ సమామ్నాయము - సంజ్ఞా 1-4, 18
(2) అచ్చ తెనుఁగు పదములను గుర్తించు మార్గములు - సంజ్ఞా 3, 9, 14.
(3) సంస్కృత సమములను గుర్తించు మార్గములు-సంజ్ఞా 4, 9, 10, 16, 17
(4) దంత్యతాలవ్యచజలు - సంజ్ఞా 8-10
(5) ద్రుతము - ద్రుత ప్రకృతికములు - సంజ్ఞా 11, 12
(6) కళలు - సంజ్ఞా 13
(7) బిందువు - సంజ్ఞా 14 - 16
(8) తెలుఁగు మాటలకు మొదట లేని వర్ణములు - సంజ్ఞా 17
(9) అంతస్థముల లఘుత్వాలఘుత్వములు - సంజ్ఞా 18
(10) పద భేదములు - సంజ్ఞా 19 - 23
(11) సంధి - సంధి పరిచ్ఛేదము - సంధి 1
(12) తెలుఁగు సంధులు - ఉత్వ - సంధి 1, 2, అత్వ - సంధి 4, ఇత్వ సంధి 5, 6, 7, ఆమ్రేడిత - సంధి 10, 41, అపదాది స్వర-సంధి 11
(13) ఆమ్రేడిత కార్యములు - సంధి 10, 40 - 42, 49, ప్రకీర్ణక 22
(14) గ స డ ద వాదేశము - సంధి 13 - 15
(15) ద్రుతమునకు హలవసానములు పరమగు నప్పటి కార్యములు - సంధి 16, 17, 18 19, 20
(16) నుగాగమములు - సంధి 26, 33-35, 37-39, తత్సమ 29, 30; కారక 14, క్రియా 12
(17) టుగాగమములు - సంధి 28, 29
(18) రుగాగమములు - సంధి 30, 31
(19) అనుకరణ కార్యములు - సంధి 50-54
(20) అజంత ప్రక్రియ

(i) అదంతములకు - తత్సమ 21, 22, 19 56, 59, 60, 61, 39, 40, 42, 58

(ii) ఇదంతములకు - తత్సమ 44,

(42) సంస్కృత ధాతువులు తత్సమ ధాతువులగు విధము - క్రియా 63-69, 50, 71, 121

(43) ప్రేరణార్థకములు - క్రియా 70, 71-82, 84, 87

(44) చకారము పవలగుట - క్రియా 89-90

(45) ముత్తువరమగునప్పటి రూపములు - క్రియా 88, 89, 91-98, 101, 113

(46) కృత్తులు - కృదంత 1 - 22

(47) ఆచ్ఛిక పదములందుఁ గలుగు మార్పులు - ప్రకీర్ణక 2, 4-8

(వీనిని వ్యాసములుగా నడుగవచ్చును)

— (౦) —

# III. పారిభాషిక పదములు - తెలివిడి

పారిభాషిక పదములు (శాస్త్రీయ సంజ్ఞలు) ప్రధానముగా రెండువిధములు. (1) కృత్రిమములు = లౌకికార్థమునకు భిన్నముగా నియమితార్థములలో వాడఁబడు శాస్త్రీయ సంజ్ఞలు (2) అకృత్రిమములు = లౌకికార్థములందే వాడఁబడు శాస్త్రీయ సంజ్ఞలు అనఁగా, లౌకిక శబ్దములే శాస్త్రీయ సంజ్ఞలుగా వాడఁబడు నన్నమాట ఉదా॥ సంబోధనము వైకల్పికము ఆమంత్రణ శబ్దము తెనుఁగున నకృత్రిమ సంజ్ఞ సంస్కృతమునఁ గృత్రిమ సంజ్ఞ "ఆమంత్రణం కామచారానుజ్ఞా" (సి కౌ) = "యథేచ్ఛం క్రియతామిత్యభ్యనుజ్ఞానమిత్యర్థః" (బాలమ)

సంబుద్ధి శబ్దము తెనుఁగునఁ గృత్రిమ సంజ్ఞ సంస్కృతమున నుభయము. నామమనఁగాఁ దత్సమ 21 వ, సూత్రమునఁ బ్రాతిపదికము సంధి 54 వ, సూత్రమున, సుబంతము - ఉభయత్ర విభాషలతో విభాషా శబ్దము కృత్రిమ సంజ్ఞ తక్కిన చోట్ల నన్నానో యాజ్ఞిక వ్యవహార సిద్ధము "మేధ్యః పశురన డ్వాన్ విభాషితః - (మ భా) ఇత్యాది యాజ్ఞిక ప్రయోగే విభాషా శబ్దః కేవల వికల్పే దృష్టః" (బాలమ) బా సంధి 48 వ సూత్ర ముభయత్ర విభాష యావున నట మాత్రమే, యిది కృత్రిమ సంజ్ఞ (నవేతి విభాషా - పాణి) తక్కిన చోట్ల వికల్పార్థకము

బా సంధి 48 వ సూత్ర ముభయత్ర విభాషగా నుద్దిష్టము కాదని సెలవిత్తురు కాని యది సరికాదు ఉభయత్ర విభాషగా నుద్దిష్టము కానిచో, సూత్ర నిర్మాణము బా సంధి 19 వ, సూత్రమువలె నుండి యుండెడిది అనఁగా, "వ్యతిరేక మధ్యమ ముపర్జకంబున కచ్చు పరంబగునపుడును లోపంబు విభాషనగు" అని సూత్రము నిర్మింపఁబడి యుండెడిదన్నమాట

ఉపోత్తమమనుచో నజ్ఝల్లుల మొత్తమును గ్రహింపవలెనని కొంద ఱందురు కాని యది గ్రాహ్యము కాదు అచ్చులనే గ్రహింపవలెను "అణిఞోర నార్షయోర్గురూ పోత్తమయోః ష్యఙ్ గోత్రే" (పాణి) = గురు ఉపోత్తమమ్ యయోరితి విగ్రహః కౌముదగన్ధశబ్దః తత్ర ధకారాదణో౽కార ఉత్తమః తత్సమీపవర్తి గురుః గకారాదకారః, సంయోగే గురు - ఇత్యుక్తేః" (బాలమ)

# IV. బాలవ్యాకరణ గణపాఠము - నివేశనీయ శబ్దములు

## సంధి పరిచ్ఛేదము

1 నలుగడాదులు (సంధి 25 వృత్తి) నుగాగమముకామి

ఇరుగడలు, కారుచిచ్చు, కుఱుబోద, క్రందు కయ్యము, చిఱుచేఁప, చెడుగఱ్ఱ, నడుచక్కి, నిడుకేలు, నీరుకావి, పలుతెఱఁగు, పలుగఱ, పలుగాకి, పొడుకాపు

2 పేదాదులు (సంధి 30) రుగాగమము

చనవు, జోగు, వింత వితాకు, పీయము, వెఱ్ఱ

3 ప్రాఁతాదులు (సంధి 36) నుగాగమము

పొన్ను + తమ్మి = పొందమ్మి, పొన్ను + పట్టు = పొంబట్టు హొన్ను + పట్టు = హొంబట్టు పొన్ను + బెళ్ళు = పొంబెళ్ళు

4. అన్యంబులు (సంధి 39) లోపనుగాగమ ద్విత్వములు :

దుమ్ము + పొడి = దుంబొడి, మ్రాఁగు + కన్ను = మ్రాఁగన్ను వేగు + పోక = వేఁబోక - వ్రేక + కడుపు = వ్రేఁగడుపు పువ్వు+పొడి పుప్పొడి పువ్వు + వాన = పువ్వాన పువ్వు + వార = పువ్వార

5 కడాదులు (సంధి 40) అదంత ద్విరుక్తటకారము

ఔరలు, పొరువు బిఱ్ఱు, మిఱ్ఱు,

6. అందదుకు ప్రభృతులు (సంధి 42) యథా ప్రయోగముగ గ్రాహ్యత

కలపు + కలపు=కలగలపు గుటుకున + గుటుకున = గుటుకున = గ్రుంగుటుకున (పొందు 4.48) తునుకలు + తునుకలు = తుందునుకలు. తెగ + తెగ = తెందెగ తెప్ప + తెప్ప = తెందెప్ప తేప + తేప =

తెందేప తేర + తేర = తెకతేర తొప్ప+తొవ్ప = తొటదొప్ప దుడుకు+ దుడుకు = దుందుడుకు పిచ్చ + పిచ్చ = పిలుపిచ్చ పీఁకు + పీఁకు = పిరుపీఁకు బిగియు + బిగియు = బిఱ్ఱ బిగియు మాయము + మాయము= మటుమాయము ముడుఁగు + ముడుఁగు = ముచ్చముడుఁగు ముణుఁగు + ముణుఁగు = ముచ్చ ముణుఁగు మొదుకన + మొదుకన = మొదు మొదుకన వట్లు + వట్లు = వటువట్లు వీఁగు + వీఁగు = విఱ్ఱవీఁగు వేలు+వేలు = వేనవేలు

## 7. పద్యాదులు

(i) పఱుచు - బెంగపఱుచు, వేగిరపఱుచు, సంకటపఱుచు, (ii)పాటు - అవమానపాటు, దుఃఖపాటు, బెంగపాటు, వేగిరపాటు, సంకటపాటు, (iii) పెట్టు - అవమానపెట్టు, అరటపెట్టు (పాండు 4 289) కన్నపెట్టు (పాండు 3. 105) దుఃఖపెట్టు, వేడెపెట్టు, సంకటపెట్టు

# తత్సమ పరిచ్ఛేదము

## 8. మిత్రాదులు (తత్సమ 18)

అపత్యులు (ఆది 7.65) అపత్యము (భాగ 1.150) అభరణుఁడు (ఆది 1.9) ఆభరణము (మను 1.51) అస్పదుఁడు (సభా 2.63) అస్పదము (పాండు 2 144) కారణుఁడు (భాగ 8.79) కారణము (పాండు 1.135) లలాముఁడు (సభా 1.98, దశ 8.2, భాగ 9.302) లలామము (రాఘవ 1.45) తల్లజుఁడు (వసు 1.121) ప్రకాండుఁడు (శృ నై 1.22) భూషణుఁడు (ఆది 1.3)

## 9 వృద్ధాదులు (తత్సమ 56) డుజ్ లోపము విభాషనగుట

దూర్తు (ద్వి హరిశ్చ) భ్రష్టు (భాగ 3.437, అముక్త 4.210) శిష్టు (భోజరా 4.153) (కాలి) దాసు (జై భా 1.6)

## 10 చరిత్రాదులు (తత్సమ 58) ము లోపము బహుళముగ నగుట

అంతస్థ (అం భూ 17) అంశ (కాళిందీ) ఊష్మచిహ్న, ధావన, పులకలు, ప్రయాగ, ప్రశ్న, ప్రాస (కావ్యాలం 8.24) ఫలక (భాగ 1.6.7.4) బిల్వ (పండితా) బీభత్స (కాశీ 6 41) బ్రహ్మ = తత్వము (పాండు 2.3) మద్య (కవిక) మాంజెష్ఠ (కాశీ 3.108, హరిశ 7.139) మూల (భీమ 5.157) ధ్రుద్రాక్ష (బసవ 136 పు) రేఫ (సర్వల) లలామ (పారిజా (1.134) లేఖ (కాశీ

6-93, ప్రభావ 3-134) విమర్శ (భోజరా) ఘ్రాణ (పాండు 4-17) సంసర్గ (అరణ్య 5-86, భోజరా) స్పర్శ (బసవ 201 పు)

11 కందరాదులు (తత్సమ 66) క్లీబతుల్యత బహుళముగ నగుట:

ఇషీకా - ఇషీకము (భా రా సు 318) ఇషీక (శాంతి 6-441, మార్గం 3-307, కాశీ 4-217) కరుణా - కరుణము (మను 2-71) కరుణ (ఆది 1-9, హర 1 30) ఘుటికా - ఘుటికము (నృసింహ 2-127) ఘుటిక (భీమ 2-135 137, హర 6-70) భిస్సటా - భిస్సటము (పాండు 4-172) భిస్సట (మధు) మక్షికా - (మధు) మక్షికము (పాండు 4-257) (మధు) మక్షిక (భాగ 4-723)

12 మతుబాదికము (తత్సమ 70) ద్వితీయైక వచనాంత తుల్యము నామమగుట

భుజ్ (పాలనము) భూ భుజుఁడు (సభా 1-128, విరాట 5-203, కాశీ 1-2, 4-99, శృ శా 1-89) మఘవత్ - మఘవంతుఁడు (శృ నై 3-28, వరాహ 3-40, ఉ రా 6-371, 8-38, విజయ 3-120) భిద్ - గోత్రభిదుండ (ఆది 7-275) విద్ - బ్రహ్మ విదుఁడు (సభా 1-221) ధర్మసంవిదుఁడు (సభా 2-129) సద్, సభాసదులు (సభా 2-31)

13 ఋత్విగాదులు (తత్సమ 73) ద్వితీయైక వచనాంత తుల్యము విభాషను నామమగుట

ముచ్ - కాంతిముచము (భా రా సు 153) అంబు ముక్కు రామా 4-69) వణిజ్ - వణిజుఁడు (ద్రోణ 3-173, శాంతి 2-391, కాశీ 5-63) వణిక్కు (శృ నై 6-115, విక్రమా 2-166) పరీక్షిత్ - పరీక్షితుఁడు (ఆది 2-165, 189, అశ్వ 3-166) పరీక్షిత్తు (హరి పూ 3-103) మరుత్ (గణ దేవతా వాచకము) - మరుతులు (ఆది 1-81) మరుత్తులు (వరాహ 3-59, ఉ రా 4-327) సుహృద్ - సుహృదుఁడు (ఆది 5-32, అరణ్య 1-249) సుహృత్తు (ప్రభావ 5-152, రామా 3-50) సమిధ్ - సమిధ (నిర్వ 5-112) సమిత్తు (వరాహ 12-24) అనుష్టుభ్ - అనుష్టుభము (పాండు 5-263) అనుష్టుప్పు (ఛందో 2-5, అప్పక 4-136) మధువిహ్ - మధువిహము (కాశీ 1-28) మధువిట్టు (విజయ 1-213)

తెలివిడి - మతుబాదులలోను (తత్సమ 70) ఋత్విగాదులలోను (తత్సమ 73) జేరని శబ్దములు ప్రథమైక వచనతుల్య ప్రాతిపదికములగును. (తత్సమ 67)

త్వచ్ - త్వక్కు (శాంతి 4.242) ఖాజ్ - ఆతపఖాక్కు (రామా 6.35) స్త్రీయాఖాక్కు (ఉ రా 7.179) భుజ్ (అభ్యవహార=ఆహార, వాచకము) క్రతుభుక్కు (శృ శా 3.231, ఉ రా 7.179) క్రవ్యభుక్కు (శృ శా 3.231) గంధవాహభుక్కు (కాశీ 2 167) పలభుక్కు, ఫలభుక్కు (రామా 8.54) విశ్వభుక్కు (అరణ్య 5.166) హుతభుక్కు (రామా 7.164) విరాజ్ - విరాట్టు, సమ్రాజ్ - సమ్రాట్టు (శాంతి 2.272) సమ్రాజు (హరి పూ 2.50) - అనునది సమ్రాజ శబ్ద తత్సమ రూపము మరుత్ (వాయువు) - మరుత్తు (కాశీ 7.210, వరాహ 9.114, జై భా 7.44, కళా 5.175) యోషిత్ - యోషిత్తు (అను 2.174, శాంతి 5.11, శివరా 5.5) సరిత్ - సరిత్తు (అను 2.457) ఉపనిషద్ - ఉపనిషత్తు (కాశీ 2.69, 151, క్రీడా 207 వ, హర 7=79) తనూనపాద్ - తనూనపాత్తు (కాశీ 3.206) దృషద్ - దృషత్తు (నిరం 4.61, వరాహ 12.32) పరిషద్ - పరిషత్తు (కాశీ 7.233, హర 5.12) శరద్ - శరత్తు (జై భా 6.11, ఆముక్త 4.146, శృ నై 6 40) క్షుధ్ - క్షుత్తు (పాండు 4.153, ఉ రా 8.72 క్షుధా = క్షుధ) మఘవన్ (మఘవా-ప్ర ఏ) - మఘవుఁడు (ఆది 8.46, సభా 2.240, అరణ్య 1.344) కకుభ్ - కకుప్పు (వరాహ 10.147) త్రిష్టుభ్ - త్రిష్టుప్పు (కాశీ 5.216, ఛందో 2.57, అప్పక 4.136) అదృశ్ - అదృక్కు దృశ్ - దృక్కు (శాంతి 4.242 దృశా = దృశ) సదృశ్ - సదృక్కు (ఉ రా 7.179 సదృశ = సదృశము) తృష్ - తృట్టు (పాండు 5.182 తృషా = తృష) ఉష్ణిహ్ - ఉష్ణిక్కు (ఛందో 2.5).

## అచ్చిక పరిచ్ఛేదము

14 బల్లిదాదులు (అచ్చిక 3) సంస్కృత తుల్యత
ప్రల్లద

15 తే ప్రభృతులు (అచ్చిక 8) బహువచనమునకు ముందు డుజ్ఞు
గిజిగా = గిజి గాఁడులు (మను 1 36) గిజిగాండ్లు (అం భా 2.98)

16. రేయి ప్రభృతులు (అచ్చిక 21) అంత్యాక్షర లోపము
దోయి, ప్రాయి

17. ఊరు మొదలగునవి (అచ్చిక 30) ఇత్వాదేశము
అక్కడన్, ఇక్కడన్, ఎక్కడన్, తెలియనియ, ట్టి విధి నిషేధంబు లెక్కడివి తలపోయన్ (కళా 4.138 ఎక్కడియొక్క + అవి) ఎదురు,

కలను, కేలు, గోరు, తేరు, నగరు, నడుము నీరు, పేరు, ప్రోలు, మీఁదు (మీఁ, దికిఁ దలయెత్తి యొక్క సుదతీమణి-కవిక 6-84) మేను, మొదలు, లోను, లోపల (లెక్కసేయక లోపలికిఁ గొనిపోయి - పండితా దీక్ష) వలను, ఆల్వాదులు-ఆలు (పాండు 3-97) కోడలు, చెల్లెలు, మఱఁదలు

## సమాస పరిచ్ఛేదము

18 నల్లాదులు (సమాస 12) నిగాగమము బహుళముగా నగుట

నున్న, (పాండు 5-313, వరాహ 3-92) మెత్త (విరాట 4-13, భాగ 6-373) సన్న (శృ నై 3-87, రామా 6-25)

## తద్ధిత పరిచ్ఛేదము

19 చిన్నాదులు (తద్ధిత 8) టిక వర్ణకము

ఎఱ్ఱ, మన్నె, మేన

20 నల్లాదులు (తద్ధిత 6) నవర్ణకము

చలుక, నున్న, వలుచ, మెత్త, వెలుక

21 చిఱుతాదులు (తద్ధిత 10) ఉక వర్ణకము

పొది, వెలి

22. ఆటాదులు (తద్ధిత 11) కాకత్రియ వర్ణకములు

(i) ఎడ, చేఁత, తరుపు, తాపి, నంటు, బంది, వన్నె, వేగిరము, వేడుక (డ్క) (ii) కా వర్ణకము :- అంటు, అరితి, కైలాటము, కోడె, గార, గుమ్మెత, తెక్కలి, దబ్బఱ, ననుపు, నేర్పు, పంతము, వందెము, వన్నిదము, పిలి, పురి, పోటు, ప్రల్లదము, మంగ్రాటము, మత్తి, మాయము, మేఁత, మోపు, రుంజ లంజె, వాయిదము, వింత, వేఁట, వేఁపి, వ్రాత, వ్రాయసము, సంగడి, సందడి, (iii) కత్రియ వర్ణకము - పొత్తు, బోనము, రట్టు, రాయిడి, వెల్లాటము, సోది, హాసు

తద్ధిత 12 కాకత్రియల కకారమునకు గకారము,

కన్నము, కొండెము, గాలము, జీతము, నాణెము, పోటి, మొన

23 స్వార్థమున 'కా' ప్రత్యయము (తద్ధిత 13)

టక్కరి, నట్టువ, మిండఁడు

24. తిర్యక్కులకు 'కా' ప్రత్యయము (తద్ధిత 14)

గాలి — గాలిగాఁడు = గాడిద గాలి దీనికిఁ గలదు గాలి = వడి — లక్షణార్థము బావురు - బావురుగాఁడు=బావురు స్వార్థమున 'కా' ప్రత్యయము

సన్నము - సన్నగాఁడు = చీమ సన్నము దీనికిఁ గలదు సన్నము = సన్న దనము — లక్షణార్థము

25 అటమటాదులు (తద్ధిత 15) 'ఈ' ప్రత్యయము

ఒడ్డె, కొండెగము, కోడిగము, తెక్కలి, దివ్వటి, దుండగము, బండగము, బొడ్డిగము, బోయి, మిండగము, వాట్లు, సందడి

26 స్వార్థమున 'ఈ' ప్రత్యయము (తద్ధిత 16)

ఎక్కటి, గారడి, దాఁవరి, దావరి, పోకిరి, మావటి, మాసటి, మోవరి వెండి, సాలె

27 జాలాదులు (తద్ధిత 17) 'అరి' వర్ణకము

అరువు, అటుకు, ఒడుపు, కాపు, కూరుపు, చనవు, చొప్పు తెగువ దోఁపు, నెయ్యము, నెరవు, పనుపు, ప్రోపు, బాగు, మేఁత, మోపు, రూపు లావు, వేగు

28 ఓయారాదులు (తద్ధిత 18) 'ఇ' వర్ణకము

కొటారము, చూఁడు, సల్ల (రక్తము)

29. వగాదులు (తద్ధిత 22) 'ఆఁడి' వర్ణకము

గచ్చులు, టెక్కులు, పోకలు, బొజుఁగులు, మాయలు, మిటుకులు రంపెలు, అంకులు, అంపులు, అవ్వలు, సొగసులు

30 వగాదులు (తద్ధిత 23) పుంస్త్వమున 'ఆ' వర్ణకము

ఈఁవరలు, టక్కులు, పోకలు, మాయలు, ముద్దులు

31 ముక్కులో నగునవి (తద్ధిత 24) 'ఇఁడి' వర్ణకము

ఉప్పు, వరువు, వెఱపు

## క్రియా పరిచ్ఛేదము

32 అంగలాదులు (క్రియా 63) ఇంచుగాగమము

అంగవ, గట్టు, గడ, చెంగల, దట్ట, దీవ, పాట, మన్న, వడ్డ (చూ 44)

33 రంజాదులు (క్రియా 71) ద్విరుక్త లకారము

ఆవహ్, ఉత్పాద్, వాస్, వి + స్తృ (విస్తర్), సంపాద్, ఉద్భాస్, ఘూర్ణ్, మూర్ఛ్, అనురాగ

34 మాయ్యాదులు (క్రియా 76) పుగాగమము
చాఁగు - చాఁపు

35 అడ్డాదులు (క్రియా 79) గుగాగమము
ఉజ్జ

36 వలయ్యాదులు (క్రియా 122) భావమున, నుజీ.
అగును, కాదు, చనును, చనదు, పోలును, పోలదు

## కృదంత పరిచ్ఛేదము

37. కలుగ్వాదులు (కృదంత 4) ఇమి వర్ణకము.
బలియు, ముదియు

38 చేయ్యాదులు (కృదంత 5) తజ్ వర్ణకము
మోయు

39 అడంగ్వాదులు (కృదంత 6) 'కువ' వర్ణకము
అఱుగు, అలయు, అలుకు, తెఱచు

40. తిరియ్యాదులు (కృదంత 9) ప వర్ణకము
కడచు

41. ఆవులించు లోనగునవి (కృదంత 10) త వర్ణకము
వలుకరించు, వ్రక్కలించు

42 మాయ్యాదులు (కృదంత 11) పు వర్ణకము
అనుచు, కూర్చు, చాఁగు, తావించు, తీర్చు, తుడుచు, త్రుంచు, ననుచు, నేరుచు, వనుచు, వలుకరించు, పిలుచు, విడుచు, వెఱచు,

43 అంజ్వాదులు (కృదంత 12) 'ఇక' వర్ణకము
అల్లు, అను, ఎన్ను, ఒడంబడు, కదలు, కలయు, చేరు, పూను, పొగడు, పొత్తు

44 అప్పాదులు (కృదంత 13) నజీ వర్ణకము
ఒడ్డు, వడ్డ (పరివేషణం వర్ధనంచ - వై ని వర్ధన = వడ్డన = వడ్డ—ధాతువు ఇది, అప్పవంటిది అర్పణ = అప్పన = అప్ప)

